# శ్రీ తిరుపతి వేంకటేశ్వర కృతులు

(షష్టిపూర్తి మహోత్సవ ముద్రణము.)

## సంపుటము 8

షష్టిపూర్తి మహోత్సవ సంఘము, బందరు,

౧౯౩౮.

# ఉపోద్ఘాతము

శ్లో. గీర్షు యేతు రతా స్తేవై । గీరతాః పరికీర్తితాః
తా నుద్దిశ్య కృతం కావ్యం । గీరతం పరిచక్షతే॥

ఇది ప్రప్రథమమునఁ దిరుపతిశాస్త్రిగారికిని రామకృష్ణకవులకును జరిగిన **2-3-4** పర్వములలోని యుత్తరప్రత్యుత్తరములను విమర్శించు నుద్దేశముతోఁ బ్రారంభింపఁ బడినది కాని నానాఁటికి రామకృష్ణు లేదో యసత్యమును ప్రకటించి దూషింప మొదలిడుటచే నంతతో విరమింప వలనుపడక పెరుఁగ వలసిన దయ్యెను. ఉత్తర ప్రత్యుత్తరములవలన సూత్రప్రాయముగా గతార్థమగు నంశము లీవిమర్శనమందు సవిస్తరముగా సప్రమాణముగా వ్యాఖ్యానము చేయఁ బడు చుండును. వలసినచోట నెల్ల నితరుల యుత్తరములు క్రిందిభాగమున నుదాహరింపఁబడుచుండును. రామకృష్ణుల వ్రాఁతలు కొన్ని యిందు స్థాలీపులాకన్యాయమున వలసినంతవఱకుఁ జేర్పఁబడినవి. అవి ముందుఁ జదివి తత్సారమును మనమునకుఁ దెచ్చుకొనిన పిమ్మటఁగాని యీ విమర్శనము సుబోధము కాదు. ఇది విస్తరించి యుండుటచే నొకటి మఱియొకచోటను మఱియొకటి యింకొకచోటను దెలిసికొనవలసియే యుండునుగాని యేపుటలో రామకృష్ణుల వ్రాఁతలలోని యేపంక్తు లుదాహరింపఁబడి యుండునో ఆపుటలోనే దానికి సంబంధించిన విమర్శన ముండు ననుటకు వలనుపడదు కావునఁ జదువరులు జాగరూకతతోఁ దిలకింపవలసియుండును. రామకృష్ణులు ప్రకటించిన ప్రతి విషయమును మాకంటె లోకమే ముందు విమర్శించి మాకు లిఖింప మొదలిడిన దనుటకుఁ గొన్ని ప్రమాణములను జూపుచున్నాఁడను.

ఉ. "కోకిల కాక" మంచుఁ దమగుట్టు బయల్పడఁజెప్పి, రందు వా
రీ కవిరాజశిష్యులనియే స్ఫురియించు గురుప్రదూషణం
బే కరణిం దలంకక రచించిరొ వారు కవీంద్రులై యనూ
యాకలనంబు పండితులకైనను నేమియుఁ దోఁపనీదుగా !"

ఇట్లు, అడివి సాంబశివకవి.

(తక్కిన మఱికొన్ని వీరిపద్యములు గురుదక్షిణలో చూడనగు.)

మదరాసు, 18—8—1910.

విద్వన్మణీ !

తమ యసమాన ప్రజ్ఞాధురీణత్వంబు నాకు చిరకాలశ్రుతంబు, కన్నుల పండువుగా మొన్న మొన్న బందరులో తమ దర్శనలాభమును గలిగినది. "హృదయవచశ్శరీరముల ... ... ... వదలక సాధుసద్గుణలవంబులు కొండలు చేసి మెచ్చుచుఁ ......... మాన్యులు కొందఱువోల్తు రద్ధరన్" అను భర్తృహరివాక్యము మీయందు బూర్తిగా వర్తించును. ప్రకృతమున శతావధానులను బిరుదు మీకే చెల్లినది. ఇక నీబిరుదు బొందువారు జనియింపబోరని నాయభిప్రాయము. ఏలూరులో నామిత్రులగు వల్లూరి రామారావుపంతులుగారి కుమారుఁడగు చలపతిరావుశర్మ చేతిలో "కవిత" యను పేరనున్న మాసపత్రిక సంచికలు రెండు, నాలుగుదినములక్రిందట జూచితిని. అప్పటనుండి భవదీయాకారములు మదీయ హృదయాగారమున కాపురముండి యిప్పుడీపద్యమును వ్రాయ బురికొల్పినవి గాన దీని నస్మదనేక నందనపూర్వకముగా తమ సన్నిధి కంపినాఁడను, గనుక స్వీకరించుడు.

చ. తిరుపతి వెంకటేశ్వరుల తియ్యనిపల్కులు గల్గునే కవీ
శ్వరులకు జన్మజన్మముల సంయమివృత్తిఁ దపంబొనర్చినన్,
సరి యగు రామకృష్ణులనినన్ జను లెవ్వరు నవ్వరే వసుం
ధరను దదీయనామముల దాల్చిన నాటకవేషధారులన్.

ఇట్లు, విధేయుఁడు, * (నిష్పక్షపాతి)

కవిత యను పత్రిక చూచినంతన మా యాకారము లేల స్ఫురణకు రావలెనో, వచ్చెఁబో, యిట్లేల వ్రాయఁబురికొల్పవలెనో చదువరులే విచారించు కొందురుగాక.

వీరి కవితాపత్రిక ప్రారంభించినది మొదలు మాకు సంబంధించిన దూషణమే దానికిఁ బ్రాణాధారముగా నున్నట్లు పై యుత్తరమువలన స్ఫుటమగుచున్నదిగదా! ఈ యంశమును బ్రాజ్ఞులైన పెద్దలేకాక చిన్నికుఱ్ఱలు గూడ గ్రహింపఁజొచ్చిరనుట కీయుత్తరము సాక్ష్యమిచ్చును.

యింజరంనుండి, 13-  1910.

"......... మీ మీఁద కాబోలు రామకృష్ణకవులు పిఠాపురంలో

---

* ఈ నిష్పక్షపాతిగారు తమ యభిజననామమును దెలుపఁ బ్రార్థింపఁబడుచున్నారు. (ఇట్లు కవితం గని వ్రాసినవా రెందఱో కలరని యెఱుంగునది)

అచ్చుపడే పేపర్లలో కాకి, కోకిల, అని పేర్లు పెట్టి కథవొకటి పూర్తిసేయు చున్నారు..."

చక్రవర్తుల సుబ్బారాయునివార్లు.

ఇది వచనాత్మకమగు కాకవ్యాసమునకు సంబంధించినది; విద్యావయోవృద్ధులగు సాంబశివకవిగారు వ్రాసినది పద్యాత్మకమగు కోకిలకాకమునకు సంబంధించినది; దీనిని విమర్శించిన భాగమునకే "గురుదక్షిణ" యని పేరు. అధిక ప్రసంగములను వారించుతలంపున విమర్శించిన యీ మొదటిభాగమునకు 'అధిక ప్రసంగదమనము' అని పేరు. 'అప్రస్తుతప్రశంస' అను నిరాధారవాక్యపూరితమగు వ్రాఁత వా రిదివఱకుఁ జదివియే యుందురు, దానిని విమర్శించిన భాగమునకు 'లోకాభిరామాయణ' మని పేరు. అం దనేక మహనీయుల యభిప్రాయము లుదాహరింపఁబడి యున్నవి. శిష్యుఁడు నాయొద్ద నెంతకాలము చదివినదియు నేమేమి చదివినదియు నందు సప్రమాణముగా నిరూపింపఁబడును. నన్ను వదలినపిమ్మట నతఁ డితరత్ర చదివినది సుమారు రెండుమాసములకన్న నధికకాలము లే దనుట కీ క్రిందియుత్తర ముదాహరింపఁ బడుచున్నది.

"..........నేను ప్లవంగనామ సం॥ పుష్య బహుళము మొదలు కీలక సం॥ వైశాఖ బహుళము వఱకు వింజరం పాఠశాలలలో ఉపాధ్యాయులుగా యున్నాను. ఆసమయమున ఓలేటి వెంకటరామయ్యగారు భ్వాది ప్రారంభించినారు. రెండు మాసములు సుమారు చదివినట్లు జ్ఞాపకమున్నది, భారద్వాజ ఘట్టము అయినది."

జయంతి భగీరథశాస్త్రి.

ఈశాస్త్రులవా రెట్టి సత్యసంధులో యెంత యోగ్యులో సర్వపండితులును నెఱిఁగినవిషయ మగుటచే నా ప్రశంస వదలి, చదివిన దింతమాత్రమే యైనను "ఆభాష్యాంత మధీతం" అనియు, "ఉభయశాస్త్రప్రవీణ" అనియు వ్రాసి లోకము కన్నులనుగప్పఁ బ్రయత్నించినట్లే మమ్ముంగూర్చి కూడ నసత్యములను బ్రకటింప సాహసించుచున్నారు గాన వీరి వ్రాఁతలను జక్కఁగా విమర్శించి కాని విశ్వసింపవలసి యుండదని చదువరులను హెచ్చరించుచున్నాఁడను. ఏదో వ్రాసికొందురు గాక యని మిన్నకున్నకొలఁది వీరి తుందుడుకు మితి మీఱు చున్నట్టు లీక్రిందివారి యుత్తరములవలనఁ దెలియఁగలదు.

28—1—12, పినపాడు.

"......... రామకృష్ణకవులు తమవిషయమై వారియొక్క కవితలో బహు దూకు వ్రాస్తూయున్నారు......"

T. Kotaiah.

"కవిత్వలో చమత్కు వ్రాతలు చూచితిని; రామేశ్వరీయ మను అప్రకాశ్య పుస్తకము చూచితిని,......"

వేలూరి యజ్ఞనారాయణ, చిరివాడ, తెలప్రోలు పోస్టు.

ఇట్టివి పెక్కులు, మేమిందు వ్రాయు ప్రతివిషయమునకు నిట్లే యాధారములు చూపఁదగినంత సామగ్రి మాయొద్దనుండినను ఇక్కడికే గ్రంథవిస్తారమైనదని యెంచి నూటికిఁ దొంబదు లుదాహరింపక మానితిమి. వీరి వ్రాఁతల యందలి సత్యాసత్యములు సామాన్యులు గుఱితింపకున్నను ప్రాజ్ఞు లెటులో విమర్శించి కనుఁగొనుచునే యున్నారనుట కీ క్రింది లేఖలు పనికివచ్చును.

".........కవితాసత్యసందేశము సత్యమునకు దూరమని (1) బ్ర॥ శ్రీ॥ చర్ల రామశాస్త్రిగారివలన వింటిని......"

ఏలూరు 7—11—11, మై. కృష్ణమూర్తి.

"......శృంగభంగమును జూచితి,...... గావున వీరికి దుర్వ్యాశము అను మాటయే అబద్ధమైనపుడు బాపుకొనుటకు వీరు అచటకు వెళ్ళినమాటయే అబద్ధము యీ క్రింది వచనమును జూడ కృష్ణకవి స్వగ్రామమవుటచే అభిమానముతో ఆగ్రామస్థులు వ్రాసినట్లు తోచుచున్నది, ......... అనేక సంస్థానములలో కీర్తిపహించిన వీరు శరణుఁజొచ్చిరి అనుట విరుద్ధముగా యున్నది. "వింటివె రామకృష్ణ" అను పద్యంకూడ సందేహమే...... తక్కిన పద్యములయందునను యిట్లే సందేహములుయున్నవి, మీకున్నూ తెలిసియేయున్నవి, నాసందేహములు పోవునటుల నిజము వ్రాయగోరెద" (2) నారయ్యప్పారావు

ఆ యీ యుత్తరములవలననేమి శృంగభంగవిమర్శనమువలననేమి గతార్థమని యెంచి వారిరువురలో నొకరి బావమఱఁదిపేరితోఁ బ్రకటించిన వెంకటరామకృష్ణుల 'సత్యసందేశము' నిం దుదాహరించి పిష్టపేషణ మొనర్పక అందుఁ జేర్పఁబడిన యొక సాక్షి ప్రకటించిన వ్యాస మిట నుదాహరించుచున్నాఁడను.

1911 సం॥ అక్టోబరు నెల 18 వ తేదీ దేశమాతనుండి—

చర్ల వేంకటాచలపతి శాస్త్రులవారికి,

తొలుదొల్త మీరు శృంగభంగ మను నొకదాని నసత్యంబులు నసందర్భ

(1) ఈ చర్ల రామశాస్త్రులవారు విద్యా వయోవృద్ధులు, కాఁశరపర్తి నివాసులు.
(2) వీరు శ్రీ శనివారపుపేట జమీందార్లు. ఈ యుత్తరము వేలూరి శివరామశాస్త్రిపేర వీరువ్రాసిరి. ఆయనవలన మాకుఁ జేరెను.

ములు నగు వాక్యంబు లైక్యపఱచి ప్రకటించుచు నందు నన్నొక సాక్షిగా వ్రాయించియున్నారు. అందలి సత్యాసత్యము లరయఁ గొందఱు నన్నయ్యై సందర్భము లడుగుచు "నది యల్లరిసభ యగునా, కాదా?" యని ప్రశ్నించుచు వచ్చిరి. అట్లడిగిన వారికెల్ల నది యల్లరిసభయే, కానియెడలఁ బండితులగు బ్రహ్మశ్రీ నారాయణశాస్త్రిలవారే యడుగఁదగినరీతి నడుగుట తటస్థించునుగాని యట్లుగాక యతిధార్ష్ట్యముతో నయ్యై బాలసామాజికులు మున్నగువా రనర్హ ముగ నడుగుట తటస్థించునా, యని చెప్పఁదగు సంగతులెల్లఁ జెప్పి వారి సందేహముఁ దప్పించుచు వచ్చితిని. వారెల్ల 'మీ కీ నిశ్చయము దేనికేనిఁ బత్రికకు వ్రాయింపుఁడు లేనిచో మీరును వారి వ్రాఁత కంగీకరించినట్లే కొంద ఱను కొందు' రని చెప్పినప్పటికిని సాక్షిగా నెన్నుకోఁబడ్డ నే నెవ్వరేని నడుగకుండఁ జెప్పు టొప్పదని యూరకొంటిని. అట్లూరకుండుటచే నీలందు మన యేవ్రాఁతకు నూరకొనునని కాఁబోలును మరల సత్యసందేశమని వ్రాయించుచు నందులో సీ॥ "నన్నుతాచారుండు చిన్నవేంకటశాస్త్రి తనలోని దోసనుకొనుట చాలు॥" అని యానాఁటి కృత్యమున నే నొనుకొనినట్లు వ్రాయించితిరి. ఇంకను నే నిట్లే యూరకొనిన ముందుముం దెటు లెట్టు లూహించి వ్రాయింతురో యను భయముచే నించుకంత దెలుపకొనఁ దగినది దెలుపుకొనుచున్నాఁడను.

మాయన్నగారగు బ్రహ్మశ్రీ వేంకటశాస్త్రుల వారెట్టి సదుద్దేశముతో నాయూరునకు వచ్చిరో యెట్టి సామర్థ్యము కలవారో యానాఁటిసభ యెట్టులున్నదో యవి యెల్ల నెఱుంగు నే నాకృత్యమున కొనసుకొనమి యట్టులుండ నా సంగతి కొంచె మాలకించినవారుసైత మట్టులనుకొనరని నా దృఢాభిప్రాయము. ఇదియెల్ల నిటుంచి యొకమాట వినుఁడు. ఆనాఁ డచటఁ గర్తృత్వములయి వినుచున్న బ్రహ్మశ్రీ ఆ॥ సుందరరామ శాస్త్రులవారును బ్ర॥ శ్రీ॥ వే॥ బ్రహ్మానందశాస్త్రులవారును ఆయింటి యజమానులేయగు బ్ర॥ శ్రీ॥ ఆ॥ వ్యాసలింగశాస్త్రులవారును నావచ్చు విద్యార్థులయు బాలసామాజికులయు సందడికి దందడించియే కదా యాస్థలమువిడిచి పోయిరి. ఆ యూరినా రగుటచే వారవ్వారి విశేషమెల్ల నెఱింగినవారు కాన నటు ముందే తప్పుకోనేర్చిరి. ఎఱుంగని వేంకటశాస్త్రులవా రెట్లు తప్పుకో నేర్తురు? ఎఱింగిన పిమ్మట వీరును నట్లే తప్పుకోవలసి వచ్చినది. ఇప్పుడింత గొడవయేల? ఇట్లు విద్యార్థులు మున్నగు వా రల్లరిచేఁతలు కల్లరివ్రాఁతలు బయలు వెడలించుటకంటె సత్స్వభావాంతరమునఁగదా వేంకటశాస్త్రులవారు "ఆతని చేతియూఁత నిన్నెదిరి జయింపరాదె యిటు లేటికి మాల

ముడుంగు పోఁడుముల్" అని పద్యముఁ జదివిరి. అట్టులే నారాయణశాస్త్రుల వారును సత్సభనే యెదిరిన నెంతబాగుగనుండునో యించుక యోజింపుఁడు. ఇంక నెన్నఁడు నిట్టి వ్రాఁతలు వ్రాయింపకుఁడు. మనమేది వ్రాయునప్పుడును నితరులంతగాఁ బరిశీలింతురా యని యుపేక్షింపఁదగదు. ఇతరు లట్లంతగాఁ బరిశీలించినఁ బరిశీలింపకున్న నీశ్వరుఁడు మాత్రము పరిశీలించునను నమ్మిక దగును. మీరు మొట్టమొదట వేంకటశాస్త్రివారిని దూఱుచు వ్రాయించితిరి. తరువాత శరణుగోరుచు వ్రాయించితిరి. మరల మొదటిదారిఁ జేరుచునే వ్రాయించితిరి. ఇట్టి వ్రాఁతలకెవ్వరైన హర్షింతురా! మానుఁడు మానుఁడు మానుఁడు. చిత్తగింపుఁడు.

మ. జగమెల్లన్ జయపెట్టె నెల్లనృపసంస్థానమ్ములన్ స్వప్రశ
స్తిఁ గనంజేసి శతావధానకవితాధీయుక్తిఁ బాండిత్యశ
క్తిఁ గడుం బేర్వడు వేంకటేశ్వరకవిన్ దిండ్రించి యజ్ఞుండటం
చగునే వ్రాయఁగ? దీని కెందపరునే నానందు రంచెంచిరే!

గీ. ఓడెనని వ్రాయునంతనే యోడినట్లు। వేంకటకవీంద్రు దలఁతురే విద్యవట్ల
నిట్టి మీ వ్రాఁతలకును మీ యట్టి చేఁత। లకును నోడినయట్లు తలంత్రుగాక.

చ. తలఁపకుఁడయ్య వేఁకటసుధీని నన్యునిపాటివానిఁగా
నలుపకుఁడయ్య తజ్జయము నల్పఁ బ్రియత్నము నిట్టి వ్రాఁతలో
బొలుపకుఁడయ్య లేనిదియుఁ బోనిదియున్ మఱివారివీరిపై
గొలుపకుఁడయ్య మాఱుపలుకుల్ పలుకన్ శరణన్న నాలుకన్.

ఇట్లు, చెళ్లపిళ్ళ చినవేంకటశాస్త్రి.

ఈ కబ్బము చదువువా రొకరహస్యము నెఱిఁగి మఱియుం జదువ వలయును. వీరు గూఢముగా మమ్ముఁదిట్టి ప్రకటించిన ప్రతిపక్షయమును దమంతటఁ దామే యిటీవల బయలు చేసికొనుచుందురు. గ్రంథవిస్తరభీతిచే నట్టి దొకటిమాత్ర ముదాహరించి తక్కినవి చూచుకొనుభారము చదువరులకే వదలుచున్నాఁడను.

తే. గీ. "........సుయోధనుండు
ధైర్యమును గోలుపోయి యెద్దాన డాఁగి
నాఁడో యది యెందు ద్వైపాయనహ్రదంబు
........................"

ఈ ద్వైపాయనహ్రదమనొద్దున నేదో చెట్టుమీఁదవసించు కాకమునొద్దఁ

కోకిల గానము చెప్పికొనినట్లును, అది చప్పని ముక్కలే చెప్పినట్లును పిదప నేమో యయినట్లును వ్రాసికొని యున్నారు. (కోకిల కాకము మాంచుఁడు.)

"చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు ద్వైపాయనహ్రదమునుండి బయలు వెడలి" (24 నవంబరు 1911 సం॥ కృష్ణలోని పరాస్త పాశుపతము చూడుఁడు.)

పేరుపెట్టి వ్రాసిన యీవ్రాఁత పైదాని గుట్టు బయటఁ బెట్టినదని కుట్టు లకుఁగూడ సుగమమే. వీరెన్నివిధముల నేని గష్టించి మా కపయశము గూర్ప వలయునని పడుపాటులకుఁ బరిమితిలేదు. ఇందుకై తమకుఁ బ్రసక్తిలేని యితర విషయములలో యథార్థమెఱిఁగియుఁ గలుగఁజేసికొనుచున్నారనుట కీ క్రింది యుత్తరమేకాక వారి పరాస్త పాశుపతములోని కొన్ని పంక్తులను పండిత బ్రువముపై వీరొసఁగిన యానందపూర్వకాభిప్రాయమును సాక్ష్యమీఁగలవు.

"......... ఓలేటి వెంకటరామయ్యా వింజగము వచ్చి ......... చెప్పి యింక యెక్కడి తిరుపతి వెంకటేశ్వరులు, పని అయిందని అన్నాడు. ఒక మీసము కొప్పరపు వారు తీసివేయిస్తారు, ఒకటి మేము తీసివేయిస్తాము. అన్నాడు, ........."

చక్రవర్తుల లింగమూర్తివ్రాలు. 6—9—11.

"ఆచా॥ ......... తిరుపతి వెంకటేశ్వరుల శతావధానముఁ జూడఁబోయి గుంటూరినుండి వచ్చుచున్నాఁడను. క॥ శతావధానుల కేమి బహుమతి చేసినారు? ఆచా॥ ప్రస్తుతము నూటపదియార్లు బహుమతిచేసినారు. వెనుకనుండి పతకములు పంపెదమని చెప్పినారు. ఏది యెట్లున్నను అవధా నముమాత్రము నిరాఘాటముగా జరిగినది. కవి॥ (నవ్వుచు) అవధానముమాట మిమ్మెవ్వరడిగినారు? అది యెట్లు జరిగినదో మాకిదివఱకే తెలిసినదిలెండి. మీ రా విషయమయి వేరే శ్రమపడనక్కఱలేదు. ....................."

(26 వ తేదీ జనవరి 1912 సం॥ కృష్ణాపత్రిక చూడుఁడు.)

"పండిత బ్రువలక్షణము, ......... 0—1—0, ఇది రామేశ్వర కవిగారిచే రచింపఁబడినది. ఈ గ్రంథము శృంగభంగమైన పండితుని గుఱించి వ్రాయఁబడియున్నది. దీనిం జదువుకొనిన ప్రతిపక్షి యిఁకమీఁద "బళ్యాం పుళ్యాం" చేయవలయుఁ గాని గత్యంతరములేదు. రసవంతమగు నీగ్రంథమునుండి రసవత్తరములగు కొన్నిపాదము లుదాహరించెదము. ....................."

(విరోధికృన్నామ సం॥ పుష్యమాఘమాసములు కవిత 8-9 సంచికలు చూడుఁడు)

ఈ రీతి యభిప్రాయ మిచ్చి మెచ్చిన పండితమ్మన్యలక్షణమును దర్శించి వా స్తవ్యులెట్లు నిరసించుచున్నారో పరికింపుఁడు.

నరసారావుపేట, 20—12—1911.

“......... ఇక్కడికి వచ్చునప్పుడు గుంటూరులో దిగినాను, అక్కడఁ బండితబ్రువలక్షణమను పుస్తకమును జూచినాను. * లుడు తప్ప మఱెవ్వఁడును అట్టి తప్పుడుకూతలు వ్రాయఁడు.........”

చావలి వెంకటకృష్ణయ్య.

ఈయన బి. యే. పఠించుచున్న విద్యార్థి. ఈయన నిట్టుంచి ఒక పెద్ద గవర్నమెంటు ఆఫీసరుగారు పండితబ్రువము గని యెట్లు వ్రాసిరో తిలకింపుఁడు.

గుంటూరు, 29—11—11.

“......... అను పిల్లనాఁడొకఁడు వ్రాయు వ్రాతల దౌర్జన్య మిట్టిదని చెప్పుటకు వీలులేకున్నది. ఆసంగతి లోకులే యోచింతురుగాక. తమవంటి పండితోత్తములు అటువంటి నీచపువ్రాతలకు జవాబివ్వఁబూనుట అనవసరమని నాకు తోఁచును. తమ యభిప్రాయముకూడ నటులనే యుండవచ్చును.........”

ఇట్లు విద్యాధికులగు తత్సమవాసులనేకులు నిరసించుచున్నట్టియు మాపై వృథాగాఁ గాలుద్రవ్వి పాఱిపోయిన వారి నుద్ధరించుటకై యెవరో మున్ముఁ గసిడీఁ దట్టి వ్రాసి యెవరి పేరనో ప్రకటించిన ‘ఆకాశరామన్న యర్జీ’ యనఁ దగునట్టియు వ్రాఁత, మాశిష్యులకుఁ గర్ణరసాయనమగుటయు, యూనివర్సిటీ వారిచే బి. యే. పరీక్షకుఁ బఠనీయముగా నియమింపఁబడిన మా పాండవాశ్వమేధము నింద్యమగుటయుఁ జదువరులు మనస్సున నిడికొని మఱవకుందురుగాక. వీరిప్పుడు మమ్ము వంచించుట కెట్టి వారి స్నేహమును జేయుచున్నారో స్పష్టపడినదిగదా! వీరికి సత్యాసత్యము లక్కఱలేదు; ప్రాజ్ఞుల సమ్మతి యక్కఱలేదు. ఎట్లో తిరుపతి వెంకటేశ్వరులను నిందించుటయే కావలసినది; అని తెల్పుట కింతకన్న విస్తరింప నక్కఱలేదని యుపేక్షింపబడియె. ఇట్టి పనులు తప్పని బోధించుటకును నీతిని గఱపుటకును నేర్పడిన మా గీరతమును వీరు వీక్షింపక పూర్వమే యిట్లు తిట్టుచున్నారు.

“ చ॥...... కుక్కమూతి పిందియయను గీరతమ్ముచటఁ.........

ఉ॥.........నన్నయభట్టు భారతమొనర్చె యశంబుగడింపఁ జూచి యా
గిన్నయభట్టు.........”

(జనవరి 26 వ తేది 1912 సం॥ కృష్ణ మాఁడుఁడు.)

"హితం మనోహారిచ దుర్లభం వచః" వారును వారిచే యనుసరించు పండితబుధవరులును మెచ్చుకృతులు వేలు. వారితోనేమి, ప్రత్యక్షముగా విన్న ప్రాజ్ఞు లిటు శ్లాఘించుచున్నారు.

"......ప్రతిపదనీతి సారంబగు గీరతంబును గర్ణరసాయనముగ సాన్వయముగఁ జదివి సభ్యుల కానందం బమందమ్ముగం గల్పించిరి."

కైవారం వెంకటలక్ష్మీనరసింహం

"మధుర గీరతు లీకథ సత్కరింతురంచు"

శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులు, గుంటూరు కాలేజీ సహోపాధ్యాయులు, బి. యే. యల్. టి, గారిచే రచింపఁబడిన సుమనోవతంసము చూడుఁడు.

సీ. "మీ గీరతామ్నాయ మేధావి శేషంబు
గని వ్యాసమూర్తులం చనఁగవచ్చు"

వారణాసి శ్రీనివాసరావు.

క. సారతర నీతి బోధా ధారం బయి విబుధ ధర్మ దర్పణ మగుమీ
గీరతము భారతము వలె ధారుణి వర్ధిల్లుననుట తథ్యము కాదే॥ ౧ ॥

క. గురుశిష్య సంప్రదాయము లరుదై నశియించు పాప మాసించెడు నీ
తరుణము సలుపఁదగు తదు ద్ధరణము మీగీరతంబె ధర్మాగమమై॥ ౨ ॥

రాయప్రోలు వెంకటేశ్వరశాస్త్రి.

"......... ప్రతిపద ధర్మ బోధకమగు మీగీరతము తజ్ఞు లందఱికన్న తెలుఁగుల మహోపకృతి గావించునని నా గట్టి నమ్మకము ...............

గూడ చిదంబరశర్మ.

"......... పెక్కునీతుల కాకరమై మాబోటి విద్యార్థులందఱు చదువుకొన నర్హమైనశయ్యగలదైన తమ గీరత మొక్కటి అచ్చైనవెంటనే, వీ. పీ. గా నాకు దయచేయుఁడు." ఇట్లు విధేయుఁడు, కోపల్లి నరసింహారావు.

గీ." చెళ్లపిళ్ల కులాంభోధి శీతకిరణ। వేంకటేశ్వర కవిచంద్ర వీ-పి-గానె
కరుణఁబంపుఁడి గీరత గ్రంథ మొకటి। భారతమురీతి ధర్మముల్ పలుకునంద్రు

కందాళం నరసింహాచార్యులు

"..........మయా సుహృత్సమ్మితత్వేన నీతిదాయకేతిహాస పురాణాదిప స్సీతిదాయక గీరతశ్రవణలాభః కర్తృపుర్యా మవధానార్థ మాగమన సమయే సమజని.

.........గీరతస్య చక్షురక్షురసంయోగజన్యానందః కదా వా భవిష్యతి."

ఏవం సుజనవిధేయః, ధూళిపాళ్ల సూర్యనారాయణశాస్త్రిణా మంతే-వాసీ, పప్పు సీతారామశాస్త్రి, జానపాడు గ్రామనివాసీ.

".........తాము గుంటూరునకు దయచేసినప్పుడు గీరతమునందు దాయాభాగములు చదువగా వినియుంటిని, మాబోట్లు తెలిసికొనఁదగిన పెక్కునీతులున్నట్లు గోచరించినవి.........

తంగిరాల సత్యనారాయణ.

"......... ఇంకను మీ గీరతఫలమ్ము లనేకములున్నవి, వాని వ్రాయఁ దొడఁగిన దానిపై వ్యాఖ్యాన మగునని యింతటితో విరమించుచు..."

చావలి వెంకటకృష్ణయ్య

ఉ. "శ్రీపరదేవతాపదకు శేశయబంభర! దివ్యకావ్య బం
ధాపరకాళిదాస! విబుధాదరపాత్ర! విధేయభూత పృ
థ్వీపతి! చెళ్లపిళ్లకుల వేంకటశాస్త్రి శతావధానిగా
రూ! పలుమారు గొల్తు మిము రుచ్యపుగీరత మంప వీ-పి-గాన్ ‖ ౧ ‖

ఉ. అచ్చున నుండఁగానె వెల నారయకే తను గ్రంథ మన్నచో
నెచ్చటి వారుగూడఁ దమకెన్నియొ లేఖలు వ్రాసి వీ- పి- గా
నిచ్చటిమాకుఁ గొన్ని ప్రతు లిప్పుడె తప్పక పంపుఁ డంచుఁ బె
న్మచ్చట మిమ్ము వేఁడెదరు మోద మొసంగు రసం బెసంగుటన్ ‖ ౨ ‖

క. ఈ కథను బట్టి చూడఁగ । నాకొక గీరతము దొరకునా లేదా ? యం
చీకరణి మరల వ్రాసితి । వే కరుణన్ బంపుఁడయ్య వేంకటసుకవీ! " ‖ 3 ‖

స్వయంపాకుల సీతారామమూర్తి.

గీ. "కుకవిగజరాజమృగరాజ! సుకవి సింహ । వేంకటేశశతవధాని వెనుకఁ దమరు
గర్తపురి కేగు దెంచిన కాలమందుఁ । జదివితిరి గీరతము నీతి చౌకళింప.

చ. వినిరిగదా! మహామహులు వీనులవిందుగ గీరతోక్తులన్
గనిరిగదా! భవన్మహిమఁ గ్రాలెడి తత్కథ లోనినీతి చే
కొనిరిగదా! ప్రశస్త గుణకోటి సముద్భవ మోదసైఖరుల్
ఘనకవనావనోదయవికస్వర గీరత మెచ్చు వచ్చెడిన్ ‖ ౨ ‖

తే. గీ. నీతిదాయక మయి మహానియతిఁ బొలయు
తత్కృతిని నచ్చువేయించి త్వరితముగను
మోదవారిధి నెల్లరనీఁదఁ జేయుఁ
డయ్య నాకొక్కప్రతిఁ బంపుఁడయ్య వీ. పి."

గుండెపూడి శంకరనారాయణ.

"......శ్రీ రాజుగారి పట్టాభిషేక మహోత్సవదినమందు (12-12-11) బాలురకు బహుమతులు యివ్వదలచినాము. గాన ఈ క్రింది పుస్తకములు ఆ తేదీ లోగా మాకు అందేలాగు వెంటనే, వీ- పి- గా పంపగోరెదను.

గిరితం, 1 వ భాగం - తిరుపతి వెంకటకవులది. గురుదక్షిణ - లోకాభిరామాయణం"

జే. విశ్వనాథం హెడ్ మాష్టరు. బోర్డుస్కూలు, దాచిపల్లి, పోష్టు, గుంటూరు.

ఇవి యన్నియు గుంటూరి సీమలో విన్న వారు వ్రాసిన యుత్తరములని యెఱుఁగఁదగు. మఱికొన్ని మూఁడవభాగంబునందు జూడందగు.

ఇట్టివి కొన్ని వందలు గలవు. మఱియు నీ గ్రంథము ప్రకటించుటకుఁ బ్రయోజనము గురుభక్తియుఁ గృతజ్ఞతయుఁ బ్రతి మనుజునికి నావశ్యకమని తెల్పుట యొకటియు వెంకటరామకృష్ణులు మాపై వేయు నిందలయందలి సత్యాసత్యములను సమీపస్థులు గుఱితించినను దూరస్థులు గుఱితింపక మాపైఁ బడు దురభిప్రాయమును మరల్పుట మఱియొకటియు నని తెలిసికొనఁదగు; ఈ క్రింది యుత్తరమును జూడుఁడు.

"...... యిచ్చట యిదివరకు తమ పేరు చాలా ప్రతీతిగా యుండెను) ఇప్పుడు రామకృష్ణకవులచే ...... శృంగభంగ ...... ఇంకా కొన్ని గ్రంథములు యిచ్చట విచ్చలవిడిగా యుంటచే మీసారము తెలియని కొందరు...... అనుమబోటి కొందరికిమాత్రం చాలా కష్టతరముగా నున్నది...... మీవిమర్శన ముండినయెడల సరే, లేనియెడల లిఖించి కొద్దికాలములో ...... లును, ...... లును నగు గ్రంథములు కొన్ని ...... పంపినచో ...... యీ నెల 19 వ తేదీ పాతకమూరులో జరుగు సభలో నుపన్యసింపగలను......"

దొనకొండ రైల్వేయిలాకా — ఇత్థం

చందలూరు పోష్టు — గాడిపల్లి రాఘవయ్య, విద్యార్థి.

ఇట్లు లనేకులు సత్యనిర్ధారణైకతత్పరులయి యాగ్రహమున కెదురు చూచుచున్నను గార్యాంతరాసక్తులమైన మేము వారి కోరికను దీర్పలేకయే పోవుచుంటిమి. వీరి తుందుడుకును వారింపఁదగు ప్రాజ్ఞులు వారింపకపోవుదురా యని ప్రతీక్షించితిమి గాని వారును సమ్మతించుటచేఁ గాఁబోలు, నానాఁటికి వారొనర్చెడి గోల బొమ్మరెవుడుకంచెవలె నలమదొడఁగుటచే నప్రయత్నసిద్ధముగా దొరకిన యాధారముల నుదాహరించుచు "సత్యం వద" యను నుపనిషద్వాక్యమున కుదాహరణముగా నీకబ్బము కూర్పఁబడినది. అలంకారములు కావ్య

పోషకములు గాన వానిని ప్రధానములుగాఁ జూపక సత్యాంశములను దిలకించుచున్నచోఁ జరిత్రమంతయు విస్పష్టముగాఁ దెలియఁగలదు; ఇది చదివి సత్యమును తెలిసికొననెంచు ప్రతి పరిశీలకుఁడును ఈ క్రింది యంశములను సదా జ్ఞప్తియందుంచుకొనఁదగు.

1. శిష్యుఁడు కృతఘ్నత కుపక్రమించిన తేది కీలక సం॥ ఫాల్గునము.
2. గురు వీ విషయమై శిష్యుని బ్రశ్నించిన తేది సౌమ్య సం॥ జ్యేష్ఠము.
3. అతఁ డట్లడుగఁబడి యెదుట నుత్తరమీలేక పిమ్మట నానారాజసందర్శనములోని మీసముల పద్యమునకుఁ దగులునట్లు వెక్కిరించి పద్యము చెప్పి ప్రత్యుత్తరమిచ్చిన ట్లభినయించిన తేదీ సౌమ్య సం॥ ఆశ్వయుజము.

తరిచి చూచిన వెం॥ రా॥ గ్రంథమాలలో వీని కాధారములు పూర్తిగాఁ గలవు. వలయువా రందుఁ జూడవచ్చును. పిమ్మట, ఈశ్వరవేరు లోనగు ప్రల్లదములు పడఁపడి తిరుపతిశాస్త్రిగారి రిజస్టరుత్తరము. పర్వనామము లన్నియు సార్థకములు. "వాసింగన్న" అను పదముగల పద్యముంగూర్చి వ్రాసినదానికి "వాసింగన్న పర్వ" మని పేరు. ఇట్లే తక్కినవియు నని యెఱుఁగఁ దగును. వ్రాసినకొలఁది వ్రాయవలసియే యుండును గాన నిఁక ముగింప నెంచుచున్నాఁడను. జాగరూకులై తిలకించువారికిఁ గబ్బములవలననే సర్వమును దేటతెల్లమగును. జాగరూకత యనఁగా నిట్టిది:- కాఁకరపర్తిలోని యల్లరిని "శృంగభంగ" మని శిష్యసహచరుఁడు మఱికొందఱు తనకు సంబంధించిన కూటమువాండ్రతోఁ గలిసి వ్రాసి తన భావముఁది పేరఁ బ్రకటించిన ట్లాసందర్భఘట్టము నందలి యుత్తరములవలననే తెలును. ఆయుత్తరములలోఁ జాలవఱకు వేములవారివియుఁ జర్లవారివియునై యున్నవి. ఆ యీ సందర్భములు జాగరూకతగా విమర్శించినఁ గాని తత్త్వము తేలదు.

ఈయుగమందే గాక వెనుకటి యుగములయందుఁగూడ సత్య మసత్యముచే చ్ఛాదింపఁబడుచుండుటయుఁ దానిని బండితులు తమ ప్రజ్ఞానేత్రముచే బయటికిఁ దీయుచుండుటయుఁ గలదని రామాయణాదులలోని కొన్ని భాగములవలనఁ దెలియుచున్నది. సత్యసంధులకు బంధుత్వాదికముకన్న సత్యమునందె యెక్కుడు ప్రీతియుండును. (ఈభారతము చూడుఁడు.)

"చ. నుతజలపూరితమ్ము లగు నూతులు నూటికన్న సూనృత
వ్రత ! యొక బావి మేలు మఱి బావులు నూటికన్న నొక్క స
త్క్రతు వది మేలు తత్క్రతుశతమ్ముకన్న సుతుండు మేలు త
త్సుతశతకమ్ముకన్న నొక సూనృతవాక్యము మేలు చూడఁగన్.

అట్టి సూనృతమును గప్పిపుచ్చు వారి వ్రాతలనుండియే బుద్ధిమంతులు సూనృతమును దీయఁగలుగుదురు. కావున ననృతాధారమునఁ బ్రవర్తించువారి వ్రాఁతలు తాత్కాలికముగాఁ గొంతవఱకుఁ బనిచేసినను నిజము నిలకడమీఁద దేలఁగలదు గాన ననృతాత్ముల వలని యపవాదలకుఁ బ్రాజ్ఞులు విశేషించి జంకవలసిన పనిలేదు.

శ్లో. "జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయం"

## చదువరులకొక హెచ్చరిక.

మా చుట్టుపట్టులవారికిఁ దెలిసినను మాఘస్నులకుఁ గాఁకరపత్రికి సంబంధించిన పర్వములయందలి పరస్పరసంబంధములు తెలియుట కడు దుర్ఘటము, కావున నీయంశములు వ్రాయఁబడుచున్నవి. అల్లరికిఁ గారకులగు ఆకుండి సీతారామయ్యగారు, రామకృష్ణకవికి పినమామగారును, శ్రీ వ్యాసమూర్తి శాస్త్రులవారికిఁ దమ్ములును, నని యెఱుఁగఁదగు. ఈయన నాఁడు కాఁకరపత్రిలోనున్నను, నిత్యము నివసించుగ్రామము ధవళేశ్వరము. వ్యాసమూర్తి శాస్త్రులు అనువారిద్దఱు. ఈ యిద్దఱిలో నొకరికి వ్యాపతింగశాస్త్రులు అను నామాంతరము గూడఁగలదు. ఆ యీ సభలలో నున్నట్లు వర్ణింపఁ బడినవారు వీరే, 68 వ పుటలోని యుత్తరమున నున్నవారును, వీరేయని యెఱుఁగఁదగు. మఱియు నాపుటలోనే "పు. గవరయ్య" అను వ్రాలుగల యుత్తరము వేఱొకటికలదు. ఆయన వినయార్థ మట్లు వ్రాలుచేసిరి. గ్రంథములో "గోకిపతిశాస్త్రి" అని వ్రాసినది వారనేయని యెఱుఁగఁదగు. చర్ల చలపతియను నతఁడు రామకృష్ణకవికి బావమఱఁది. తరిచిచూచినచోఁ నాయీ విషయములును రహస్యములును దేలునుగాని ప్రతిచదువరియును అంత తరుచుట తటస్థింపదు. శృంగభంగమును జదివికొని ప్రశ్నోత్తరరూపమున నున్న యుత్తరములు చదివికొని అందలి పేళ్లను, ఉత్తరములయందలి పేళ్లను, ఎవరెవరవో మనమునకుఁ బట్టించుకొని చప్పట్ల పర్వమును జదివికొన్నచోఁ జరిత్ర మున్న దున్నట్టుగాఁ దేలెడిని. ఉత్తరము లన్నియు జదువనియెడ 68 వ పుటలోని యుత్తరములవఱకేనిఁ జదివికొనిన సత్యస్వరూపము చాలభాగము తెలియఁగలదు. ఏమి పాపమో వీరు మొదటినుండియు ననత్యప్రకటనకు గడు సాహసించుచున్నారు. వారి గొప్పఁదనము నకుఁగాఁ బాటుపడు విషయము మా కవసరములేదు గానఁ బీఠికలో నొక విషయము సూచించి విరమించితిమి. ఉభయ శాస్త్ర ప్రవీణత్వము వీరికిఁ బదిమాసములలో వచ్చిన ట్లూహింపనయ్యెడిని. జయంతి భగీరథ శాస్త్రులవారివద్ద లిజంతము మొదలిడి రెండు మాసములు చదివి మానివేయునప్పటికి కీలక సం॥ వైశా

ఖము ప్రవేశించినది. ఆ సం॥ ఫాల్గునములోనే వీరు పిఠాపురమునఁ బ్రవేశించిరి. అదిమొదలు "ఉభయశాస్త్రప్రవీణ" అని వ్రాసికొన మొదలిడిరి. పదిమాసములలో సిద్ధాంతకౌముది అజంతము మొదలు యావత్తును బూర్తియగుటయే గాక ఇంకను మిగిలిన వ్యాఖ్యానములు భాష్యములోఁ గొంతభాగమును జదివి, తర్కముకూడఁ జదివినారు. ఇందులో నింక నొకచమత్కారము, రెండుమాసములు జయంతి భగీరథశాస్త్రులవారివద్దఁ బుస్తకముపట్టి వదలినతరువాత గురువెవరో తెలియదు. అతని నిప్పుడు క్రొత్తగా సృష్టింప వలసి యుండును– ఈయంశ మంత ముఖ్యముకాదు. "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" కానచ్చునుగాని సత్యనిర్ధారణకు మాకుఁ దోడ్పడు విషయముగానఁ జర్చించి వదలితిమి. చదువకయే ఉభయశాస్త్రప్రవీణులు వెంకటరామశాస్త్రులవారైరిగదా యని కాఁబోలు రామకృష్ణశాస్త్రులవారు సభకు రాకయే యింటను దాఁగియుండి విజయమును బ్రకటించికొనిరి. ఇంత యప్రౌఢపు వ్రాఁతలను విమర్శించుటయే తప్పుగాని లోకసామాన్యము కొఱకుఁ గష్టించుచుంటిమి. విస్తరము గురుదక్షిణలోనగు భాగములలోఁ జూడఁదగు. మీమీ బుద్ధిబలమునఁ గూడ విమర్శింపఁదగు. రాఁబోవు పర్వకథకు సూచకముగా సత్యసందేశమునుండి యొక పద్యముదాహరించుచున్నాఁడను. ఉ॥ "నీయపకీర్తి కజ్జలము నిల్పఁగనే మహనీయుఁడాడఁగ నేయెడ నుద్భవించినదో యీశ్వరవేదనుదివ్యసార్థకంబాయె, భవద్భద్రాంధ్య మడుగంటఁగ వెల్గెను గారవమ్ములో, జేయనకింక నీవెడఁగు సిగ్గిలకున్న దిదేమి పగ్గెయో" చూచితిరా! తన కై తన సన్నిహితు లొనర్చిన మహోకార్యమునకు నేను సిగ్గిలవలెనఁట! తన బావమఱఁది పేరఁ బత్రికాముఖమునఁ బ్రకటించిన తన శృంగభంగమును జూచి ప్రాజ్ఞులెంత గర్హించినను దాను సిగ్గిల వలసిలేదు గదా! తనబదులు, తన సన్నిహిత బంధువులబదులును గూడ నేనే సిగ్గిలుదుఁ గాక, విశేష మక్కఱలేదు గాని ఆనాఁటి కరతాళమహోహవకర్తలతో నొకసారి ప్రాజ్ఞ మహాజనులుండు సభకువచ్చి యీపద్యమునే చదివి వారని మెప్పించినచో నతని సారమొక యరనిమిషమునఁ దేలెడినిగాని యది యీజన్మమధ్యమునఁ దటస్థించునని తోఁచదు. కావుననే యా యీ పల్లదములనెల్ల మహావాక్యములుగాఁ గైకొని యీ మహాభాష్యము వ్రాసి సత్యనిర్ధారణమునకై పాటుపడవలసి వచ్చినదని ప్రాజ్ఞులు తలంతురుగాక. ఇప్పటికి వెలువడిన వీరి పల్లదములలో నూటి కొక్కటవంతున నెత్తి జూపితిని. నిన్న నేఁడు వచ్చు పల్లదములు మఱియును ఘోరముగా నున్నవి, "భాంచోద్ధలం కోరుపాక" మఁట, యేదో అఁట! యేదో అఁట! అవియన్నియుఁ జదువరులే విమర్శింతురు గాక! ఓం స్వస్తి.

ఓం

శ్రీమత్పరదేవతాయై నమః

# గీరతము

## అధికప్రసంగదమనము

అను ప్రథమభాగము



## 1

## వాసింగన్న పర్వము

శ్లో॥ శ్రీ స్సర్వత్ర విజృంభతాం విజయతాం సంఖ్యావతాం గౌరవం
భక్తిర్భాతు కృతజ్ఞతా భగవతీ ప్రత్యక్షతా మశ్నుతాం
చర్లబ్రహ్మసుధీంద్రదేశికకలా శిష్యప్రశిష్యాత్మనా
నానారాజసభాంతరేషు రమతాం గీ రేఫతాం గీరతే.

క. శ్రీతిరుపతి నామప్ర
ఖ్యాతమహాపర్వతమున నాప్తవిజయని
ర్మాతవయి యొప్పెదఁట ! కా
దా ! తండ్రీ వేంకటేశ ! తత్త్వవిదీశా. 2

శా. రాముం డెవ్వఁడు కృష్ణుఁ డెవ్వఁడను చర్చల్ త్వత్కళాలేశవి
శ్రామస్థానములే యటం చెఱుఁగుపై శాంతించు నో దేవ! సు
శ్రీమంతంబులు నీగిరుల్ గనిన నిన్ సేవించినన్ నీగుణ
గ్రామంబున్ వినుతించినం గలుగు వేడ్కల్ వేంకటేశప్రభూ. 3

శా. "వాసింగన్న కవీశ్వరుం" డయిన నెవ్వాఁడైన సాక్షాత్తుగా
వ్యాసుండైనను బ్రహ్మదేవుఁడయినన్ ఫాలాక్షుఁడైనన్ "దుర
భ్యాసుం" డంచు గురున్ వృథా దెగడి తా నవ్యాపదేశమ్ముగా
వ్యాసమ్ముల్ ప్రకటించు టొప్పగునె దేవా ! వేంకటేశప్రభూ. 4

శా. "వాసింగన్న కవీశ్వరుం" డఁట ! సభన్ "వర్ణింపఁబోఁ" డంట! సం
తోసంబే యటులూరకున్నయెడ నేదో సాకు గల్పించి పే
* ర్వాసిం జెందినదేశికుం డగడఁగా వచ్చుం గదా, వానిదౌ
మీసంపున్ మెలి నేటి కెత్తవలెసామీ, వేంకటేశప్రభూ ! 5

శా. "వాసిం గన్న కవీశ్వరుం" డయినఁ గానచ్చున్ గురుంగూర్చి "కా
కీ! సీ! హు"ష్షని "శృంగభంగ" మని 'హీహీ' యంచు 'హూ' యంచునన్
"మీసా" లంచును వెక్కిరించునటె ! యేమీ కాలమాహాత్మ్య ! మే
మీ సద్బుద్ధి ! కృతజ్ఞతాగరిమ మేమీ ! వేంకటేశప్రభూ ! 6

---

* శా. ప్రాసంబున్ యతియున్ విరుద్ధగతిశబ్దంబుల్ ప్రయోగించుచున్
మీసమ్ముల్ మెలిపెట్టి "మాకుపమ మేమే" యంచు నెంగున్
దురభ్యాసం బొప్పగ నుండువారు కవులై పద్యమ్ములం జెప్పినన్
వాసింగన్న కవీశ్వరుల్ సభలలో వర్ణింతురే వారలన్.

(వేంకట రామకృష్ణ గ్రంథమాల 66 వ పుట)

ఈ పద్యము వీరు మమ్మునుగూర్చి వెక్కిరించిన వెక్కిరింపులకెల్ల మూలవిరాట్టనఁదగునాందియు వటబీజప్రాయమును నని యెఱుఁగఁదగు. ఇందలి మొదటి చరణము మమ్మనుగూర్చి వెక్కిరించినదే యనునంశము వారు మాపాండవాశ్వమేధమును చాలు మూలములేక వెక్కిరించి ప్రకటించిన శతఘ్నియే వేనోళ్ల ఘోషించెడిని. ఇఁక రెండవ చరణములోని మీసముల వెక్కిరింపును మమ్ముఁగూర్చినదే యను నంశమును ఈక్రింది పద్యమును జదివి సులభముగాఁ దెలిసికొనవచ్చును.

ఉ. దోస ఘటం బెఱింగియును దుందుడుకొప్పఁగఁ బెంచినార మీ
మీసము రెండుభాషలకు మేమె కవీంద్రుల మంచుఁ దెల్పఁగా
రోసముగల్గినన్ గవివరుల్ మము గెల్వుఁడు గెల్చిరేని యీ
మీసము దీసి మీపదసమీపములం దలుంచి మ్రొక్కెమే.

(నానారాజ సందర్శనము 43 వ పుట)

ఈవిషయము కాఁకరపర్తి పర్వములో విస్తరించి చూడఁదగు. ఇఁక నాల్గవ చరణములోని యంశమో ! అయ్యది నేనుశిష్యునితో నంతకు 4 మాసములకుఁ బూర్వము నాగురుత్వ గోపనముంగూర్చి యడిగినదానికిచ్చిన ప్రత్యుత్తరము !

* ఆ. వె. సరగ "నిక్కినాము జాతి" యనుచును "గడ్డి
పోఁచవే" యటంచు నీచసరణి
బ్రువ్వఁ దిట్టి గురుని బూజించితే శిష్యు
లెవ్వరేని వేంకటేశ చెపుము! 7

♦ ఆ. వె. దురిత మనక "పిచ్చితో బ్రమ్గుచున్నాఁడు
గురుఁ" డటంచుఁ జాల గోలచేసి
యతనిబంధుగులకు నార్తి గల్పించి రే
శిష్యు లెఱుఁగఁ జెపుమ శ్రీగిరీశ! 8

* వెంకట రామకృష్ణుల వెక్కిరింపులు: (1) "ఇది నిక్కినాము జాతిలోనిది. (2) అరసున్న లేమి గడ్డిపోఁచలే! (3) వెంకయ్య వ్యాకరణజ్ఞానమే, (4) బాలవ్యాకరణమురామి నిట్టితప్పులు గల్గుచుండును, (5) విఱ్ఱవీఁగుట ..." విస్తరము శతఘ్నియందే చూడఁదగు, నిక్కినాము జాతి యన్నచో నెట్టి సదుద్దేశము పొడకట్టుచున్నదో సహృదయులు పరికింపవలయును. ఆయీసందర్భమెల్ల, మీసముల వెక్కిరింపుఁ బద్యములలోని ప్రథమచరణమునకు వ్యాఖ్యానమగునో కాదో విజ్ఞు లూహింపఁగలరు.

♦ ఒకరిటు వ్రాయుచున్నారు.

"………నిన్న వెంకటరామయ్య కాకినాడ కోర్టుకు వచ్చినాఁడట. అక్కడ వెంకటశాస్త్రిగారికి పిచ్చియెత్తినదనియు………నపభ్రంశములు ……మాయింట్లో నుండు ఆచార్యులుగారు పాప మాదుర్దాతో నన్నడిగినారు …పిఠాపురం గగ్గోలు అయి పోవుచున్నది………"

వేఱొక రిట్లు వ్రాయుచున్నారు.

"………పిఠాపురం గ్రామంలో, తమకు మతి పోయినటుల చాలామంది చెప్పుకుంటూవున్నారట. ఆసంగతి మాభావమరది యిచ్చటికి వచ్చి నన్ను అడిగినాడు……… యీమాట విన్నది మొదలు నాకు యేమీ తోచడం లేదు………కులాసాగా వున్నవయినం వ్రాయిస్తేగాని నామనస్సు స్థిమితపడదు………"

మఱియొక కవిగారిట్లు వ్రాయుచున్నారు.

"………తమకీర్తి జగద్విఖ్యాంతమైనది. ఒక మహారాజాధిరాజులకైన రానేరదు……తమ శిష్యవర్గములో జేరిన కీర్తికిని శ్రేయమునకును నిదానమని యెఱుంగక జిహ్వ బ్రువ్వగ దురుక్తుల నాడ నుంకించుచున్నారు……"

ఇంకను నిట్లు వ్రాసి నాక్షేమమును గనుఁగొనినవారు పెక్కుమంది గలరు. ఈ యుత్తరములన్నియు పిఠాపురము చుట్టుపట్టులనుండి వచ్చినవే యని తెలియుఁగవలయును.

శా. దేవీభాగవతమ్ము (1) బూతనుచు సందేహింపకే తిట్టె వే.
మీ విడ్డూరము ! మమ్ముఁ దిట్టుటకు. సామీ ! (2) నిన్నుఁ దిట్టెన్ వృథా;
"దేవుండై గురుండై" యటన్నగతి గాదే యీప్రసంగంబు జ్ఞా
నావిర్భావము గల్గఁ జేయుటకునై యత్నింపు మో దేవరా ! 9

మ. కలుగంజేసికొనందగున్ భవదుపేక్షన్ ధర్మముల్ వోవు నీ
తలఁ పిం దెక్కుదయేని మాతలపయిం దద్భారమున్ మోపు మో
కలికాలాధిప, వేంకటేశ్వర ! యెటో కబ్బమ్ము నిర్మించి ధ
ర్మలతన్ వాడక యుండఁ జేసెదము శర్మం బెల్లెడం గూర్చుచున్. 10

చ. స్తుతులు పరశ్శతమ్ములను నతుల్ వితతమ్ములు గొంటి వీవు నీ
కితరుల తిట్లు లెక్కయగునే ! మముబోంట్లను బోలె; నీ కుపే
క్ష తగునుగాక, మాకు నటుసాగునె? యాజ్ఞ యొసంగుమయ్య శి
ష్యతతులకెల్ల నియ్యది యనర్హ మటంచు పచింపఁగావలెన్. 11

---

(1) ఉ. చేతురు కోతురంచుఁ దమ చేతికి వచ్చినయట్టి రీతిగా
బూతులు వ్రాసి "భాగవతమున్ రచియించితి మంత్రిభాగత
ఖ్యాతి నెసంగు నిద్దని జగంబునఁ జాటినయంతమాత్ర వి
ద్యాతిశయంబుగల్గిన మహాశయు లౌనని సమ్మతింతురే.(శతఘ్ని 14వ పుట)

ఇంతవఱ కుదాహరించిన సూత్రప్రాయపు సంగతులవలన మమ్ము నిందించు పూనిక ముందును వీరు తదనంతరమును జనించినట్లు ప్రాజ్ఞులకుఁ దేటతెల్లము కాకపోదు. కానఁ దక్కిన వుదాహరింపక చూచుకొను భారము మీకే వదలితిమి.

(2) ఈతిట్లే తిరుపతి వెంకటేశ్వరార్థశతక మని కొన్నిటియందును తిరుపతి వెంకటేశ్వరశతక మని మఱికొన్నిటియందును కవితాపత్రికలపైఁ బ్రకటింపుచున్న పుస్తకమని యెఱుఁగఁదగు. దీనింగూర్చి 38 వ పుటలోని యుత్తరము చూడుఁడు. ఆశతకమింకను బ్రకటింపలేదు. ప్రత్యక్షముగా వినిన యొక మహాగౌరవసంపన్ను లిట్లు వ్రాసిరి. ......... "ఇదిగాక వెంకటేశ్వరశతకమని వకగ్రంథం వ్రాసినారు నాకు వినిపించినారు కొన్నిపద్యములు శ్లేషగా [illegible]న్నవి మిమ్ములను దూషణప్రధానముగా నున్నది. అది వింటున్నప్పుడు... .....వచ్చినది. వారు చెప్పినమాటలు అనేకము లున్నవి వ్రాసినచో ఆమాటల [illegible]ందువల్ల నేను వక్కడనే బాధపడుచున్నాను. మిమ్ములను కూడా [illegible] పెట్టినవాడను అవుతానని వ్రాయలేను........."

మ. కలనైనన్ గురునింద సల్పమియు నిష్కాపట్యమున్ సత్యవా
క్పాలనమ్మున్ బితృమాతృభక్తియుఁ గృతజ్ఞత్వంబు వేవేలు గు
ప్పలుగాఁ బోసిన లక్ష్యపెట్టమియు నేవంభూతముల్ నిత్యని
ర్మలముల్ మేల్గొనముల్ గలట్టి కవులన్ బ్రార్థింతుఁ బ్రాచీనులన్. 12

ఆ. వె. చక్రకేళిఫలము చప్పనైనను నగుఁ
గాక మావిఫలము కనరుఁదనము
నొక్కకడ్డ చూపి యుండిన నుండుఁగా
కెంను సత్కవిత్వ మెలమి నొసఁగు. 13

క. శుక్రుఁడు కవి యని చెప్పిన
శక్రుఁ డతఁడు కాఁడుఁ డని ప్రసంగించినచో
నక్రములుతప్ప యోగ్యులు
పక్రమణము సరిసరే! సెబా! సని నగరే. 14

సీ. శంకరాచార్యుండు షణ్మతస్థాపకుం డన నేదియో సోదె నడుగువారు
కృష్ణుఁడెంతేని యుత్కృష్టుం డటన్నఁ దక్రఘటమ్ములను గ్రోలఁగడగువారు
వ్యాసుఁడు నారాయణాంశం బటన్న విశ్వస్తాపురాణముల్ చదువువారు
కాళిదాసుఁడు మహాకవియన్న నూర్వశి యాటపాటలగాథ లడుగువారు

గీ. కల రిపుడెకాక పూర్వపుఁ గాలమందు
వారిఁ బ్రాజ్ఞులు మెచ్చరు వారు సభల
నిల్వఁ జాలరు మిన్నక నింద సేసి
సంతసించుట యవ్వారి సహజగుణము. 15

క. భారతము నాటకమ్ములు
గా రచియించితిమి మున్ను గైకొను మిదిగో!
గీరతము గీరతులకు న
నారత మానందమిడు ఘనారవముక్రియన్. 16

క. భారతము కృష్ణవిజయో
దారము గీరత మనంగఁ దద్వ్యతిరేక
స్ఫారకము వారకము దు
ర్వారస్ఫారావివేక భారమ్ములకున్. 17

క. మును ఘన కృష్ణద్వైపా
యను కతనన వెలసె భారతామ్నాయము నేఁ
డును నలకృష్ణద్వైపా
యను కతనన వెలసె గీరతామ్నాయమ్ము౯. 18

చ. గురువులకన్న మిన్నలగు కొండొకశిష్యులు నుండ్రుగాక వా
రెఱిఁగి యెఱింగి ప్రల్లదము లెక్కడ నొక్కడనాడినట్లు ము౯
గఱువలు భారతమ్మున నొకానొకలం గనిపెట్టఁ బోరు ధీ
వరు లిది గీరతమ్మునను వారక చూతురుగాక యెల్లెడ౯. 19

తే. గీ. చెనఁటి యీశ్వరవేర్కొంత చెప్పఁ జేసె
చాటుపద్యమ్ము లిఁకఁ గొంత సల్పఁ జేసె
వ్యాసకాకమ్ము మఱికొంత వఱలఁ జేసె
గీరతమ్మిది రెండవ భారతమ్ము. 20

క. కోకిలకాకమ్మునఁ గల
దూఁకుడును నసత్యములును దుండగములుఁ బై
నేకాకుధార గీరత
పాతకమునకుఁ గారకములు పర్వత నిలయా! 21

తే. గీ. ఎన్ని తిట్టులు తిట్టిన నెడఁద సైఁచి
శిష్యబాగునకై కృషి సేయుటొప్పు
సీ! వినఁడటంచు విసువును జెందఁదగదు
యత్నమొనరింప ఫలియించునండ్రు బుధులు. 22

క. ఒకశిష్యుని కొకదేశికుఁ
డకలంకము తత్త్వవిద్యయందుఁ బ్రవేశం
బు కలుగకుంటకుఁ జింతిలి
* యొకనాటక మతనికొఱకు నొగిరచియించె౯. 23

క. ఈగీరతమును నటులే
బాగున కేర్పడిన దంచుఁ బండితు లెఱుఁగం
గాఁగల రన్యులసమ్మతి
కై గా దిద్దానిరచన యచలాధిపతీ! 24

---

* ఇదియే ప్రబోధచంద్రోదయమని ప్రతీతి

క. ఓవిబుధ నేవ్య ! మాఖను
లో విషయము లెన్ని లేవు లోఁ దరసినచో
నేవిషయ మందుఁ దేలెడి ?
శ్రీవిభుచరితంబె యిందు శిష్యహితం బే. 25

మ. పితృదేవుల్ మఱి మాతృదేవులును నా విద్వాంసు లాచార్యులై
వతు లౌ పాఠ్జ్ఞులు వొల్చునత్సభల సంభావించి తన్మానసా
హ్లాతికై భారతభారతీవిమలవార్ధిస్ఫారధారాభిసం
భృతగంభీరవచఃప్రచోదితుఁడనై యిక్కావ్యముం గూర్చెదన్. 26

---

# 2

## ఈశ్వరవేరుపర్వము.

అయ్యలారా,

ప్రస్తుత కాలమునఁ బిఠాపురసంస్థానమునందుండి శతావధానులమని పేరు పెట్టుకొన్నవారిలో నొకరిపేర రిజిష్టరు లెటరు వ్రాసి నాకు త్రిప్పివేయుటంజేసి యది పత్రికాముఖమునం బ్రకటించితిని. పిదప వారు దానికి సమాధానమని చాటుగాఁ బ్రచురించినపద్యము లొక మిత్రునివలన నాకు లభించి మరలఁ బ్రత్యుత్తరము రిజిష్టరుచేసి పంపితిని.

అదియును వారు త్రిప్పివేసిరి. ఈవిషయమెల్ల సజ్జనులకుం దెలియుటకై పత్రికాముఖముగాఁ బ్రకటించుచున్నాను. ది॥ తి॥ శాస్త్రి.

మహారాజశ్రీ ఓలేటి వేంకటరామయ్యగారికి,

అయ్యా,

మీ రందందుఁ దిరుపతి వేంకటేశ్వరులకు వేంకటరామరామకృష్ణకవు లీశ్వరవేరులని తెలుచు వాగ్వ్యయముఁ గావించినట్లు వినుచున్నాము. మీవాదము మీరు స్థిరపఱచుకోఁదలఁచితిరేని దానికిం దగిన ప్రయత్నము మీరు కావించి మమ్ము సభకు రప్పింపుఁడు. లేదా, మేము కావించి మిమ్ము సభకు రప్పించెదము. రండు, ఈశ్వరవేరులో, జీలుగు బెండ్లో విద్వల్లోకమే నిర్ణయించెడిఁగాత !

ఉ. ఆశుకవిత్వమందున జయంబు వహింతురొ శబ్దశాస్త్రమం
దాశ వహింతురో మఱియు నద్భుతరీతి శతావధానమం

టాశతపద్యకల్పనల డంబు వహింతురో యీసభార్థమే
దేశము మీకు సమ్మతమొ తెల్పుఁడు నల్పుఁడు తత్ప్రయత్నమున్.

చ. ఒకయెడఁ గూపకూర్మగతినుండి ప్రగల్భము లాడువారు వే
లకు మఱి వేల్కువుల్ గల రిలాతల మించుకయైనఁ జూచి కీ
ర్తికో, యపకీర్తికో తగినరీతి సమార్జన సేయు టొప్పు నూ
రక తగ నుండు టొప్పెడి భరంబగు పూనిక లేక యుండినన్.

మ. గురువో, శిష్యుఁడో మీకుఁ దా నగుటచేఁ గోపంబు మావేంకటే
శ్వరుఁ డిప్పట్ల సహింపఁ డయ్యె నిఁక నెవ్వా రెట్టివారైన నె
వ్వరు శాంతంబు వహించి యున్నను వృథాప్రాగల్భ్యదుర్వ్యదుష్షీ
భరముల్ దిర్పతి సైఁచునే! కవులు నేఁ డా సందు రే సైఁచినన్!

* చ. కలి పరిపూర్తిఁ జెందె నెవి గన్పడు విష్ణుపురాణమందు గు
ర్తులు సకలంబు నయ్యవిరొ తోఁచెడు నెల్లెడ; శిష్యు లేడ! భూ
స్థలి గురు లేడ! యింక నన్నృతంబుఁ గృతఘ్నత రెండు మాత్రమే
బలముగ నూని యెల్లరును వర్తిలవచ్చు యథేష్టరీతిగన్.

కాకినాడ
15-6-10

చిత్తగించవలెను,
దివాకర్ల తిరుపతిశాస్త్రి,
శతావధాని.

---

# 3

## జీలుగుబెండు పర్వము.

(పైదానికి వారు చాటుగాఁ బ్రచురించిన పద్యములు)

ఉ. మాకవితావిశేషములు మానసవీథుల సంచరింప వీ
రే కవిభోగిభోగముల కీశ్వరవేరు లటంచుఁ గొందఱీ
లోకులు పల్కుచుండ్రు గుణలుబ్ధులు గావున మీరు సెప్పుచోఁ
గాకవి కాచపాత్రల మొగంబులు మూయఁగ జీల్గుబెండ్లమే.

చ. గురుఁ డని శిష్యుఁ డంచు నొక కొంత చమత్కృతిఁ జూపి వేంకటే
శ్వరుఁడు సహించెఁగాని యిఁక సైఁపఁడు తిర్పతి యంచుఁ బల్కు దీ

---

* శ్లో॥ వివాహే న కలౌ ధర్మో, న శిష్యగురుసంస్థితిః॥ (విష్ణు పురాణము)

పరయక వేంకటేశ్వరునియాదరణంబునఁ గాక తీరికన్
దిరుపతి మార్గ మిట్టి దని తెల్ప నెఱుంగ నెవండు గోరెడున్.

ఉ. అర్భకు లేమి సేయఁగల రంచుఁ దలంచితి నేమొ! యిట్లసం
దర్భములైన మాట లయథార్థములంచుఁ దలంప కింతయున్
నిర్భయవృత్తిఁ బల్కెదు మనీషులు నవ్వ నసహ్యకల్పనా
గర్భితవాక్యసంపదలు గల్గనె మాకును వెల్లడింపఁగన్.

చ. చరలకులాబ్ధిచంద్రుకడఁ జాలఁ బఠించితిఁ గాన సత్సభాం
తరముల నాతనిం బొగడఁ దప్పె! తలంపఁగ నంతమాత్ర నిం
కొరుఁడు గురుండు కాఁడె యటు లుండఁ గృతఘ్నతయంచుఁ బల్కఁగా
గురుధనమున్ హరించితివె కూళతనంబున నేను! తిర్పతీ.

చ. విడివడి మాటిమాటికిని విష్ణుపురాణకథాప్రసంగముల్
దడవెదు నన్ను దూఱుటకుఁ, దత్పరతన్ గురుఁ డాతఁ డంచు నే
నొడువకయున్న శిష్యుఁడని నూటికిఁ గోటికిఁ గూడ నీవు సె
ప్పెదునది చాలదే! వినిన పిన్నలు పెద్దలు సంతసింపఁగన్ ॥

శా. చూడంజాలక కూపకూర్మములటంచున్ మమ్ము నిందించె దే
వాడం గన్గొనినన్ * జరించుచును గర్వస్ఫూర్తి భాషించుచున్
వీడం బోవక వెంట వెంటఁ బడుచున్ వేయిండ్లపూజారి యౌ
వాఁడా మీకు ఘనుండు! చాలు నివి దుర్వాదంబు లింకేటికిన్.

---

## 4

## మేకుబిగింపు పర్వము.

క. 'లోకు లనుచున్న వా' రని
వాకొన మీ కేల గొంకు వాటిల్ల దయో!
లోకు లని మీరు వ్రాయుట
తేఁకువతో దాని సమ్మతించుట గాదే!

ఉ. పెండ్ల మనంగ నాదురు; కవిప్రకరంబునకెల్ల నూఱువే
లేండ్లకునైనఁ గాఁగలరె యీశ్వరవేరులు; రాల కుండు నే

* బఠింపుచును (పాఠాంతరం)

చుం డ్లటు లన్నచో; "శుభము కల్యాణము పెండ్లికొమారుఁడా" యనన్
"పెండ్లికి వచ్చు వెల్లరును పెండ్లములు" అన్న విధంబిదే కదా!

ఉ. ఏకడ కేగి చూచె! మఱి యే నరపాలుర మానసంబులన్
మీ కవితావధూటిక రమింపఁగఁ జేసె! రసజ్ఞులైన యే
లోకులు కూడియున్న సభలోన నిరర్గళమాధురీపరీ
పాకము రా నటించెను! ప్రపంచకమెల్లఁ బిఠాపురం బొకో!

ఉ. మీ కవితామహత్త్వమది మీ కులవృద్ధుఁడు మెచ్చుఁగాక, తా
నేకతమందు మిమ్ముఁ గని యీశ్వరవే ర్లనవచ్చుఁగాక, యా
హా కడు వింత, లోకు లెవ రాడిరి? నీ వనృతంబు లాడెదే!
కాకవి వేఁపపండ్లు తినుఁగా, కవి కాకవి యొడ్లు తిందురే!

క. విను, జీలుగుబెండ్లని మి
మ్మనలేదే మేము! విద్వదవతంసులపై
ననిచితి మా భారమ్మును
గనుఁగొనఁగాలేక వట్టి కార్లనియెదరే! 35

ఉ. కాకవి! కాచపాత్రిల మొగంబులు మూసెడు జీల్గుబెండ్లకుం
జేకుఱునే సభాస్థితియుఁ, జేకుఱుఁగా కది; తదర్శనంబులం
గైకొను వేళ నొక్కఁ కడగాఁ బడనైవరె! పట్టుపట్టినన్
మేకు బిగించి లాగి బలిమిం బలు ముక్కలు సేయకుందురే!

ఉ. తిరుపతిచేత వచ్చెనో యతి ప్రతిభామహిమంబు వేంకటే
శ్వరునకు; వేంకటేశ్వరునివల్లనె వచ్చెనో యా మహత్త్వముల్
తిరుపతి; తద్వివేకము నిరింపులునైత మెఱుంగ రింతకుం
దిరుపతి వేంకటేశ్వరుల తేఁకువ కాకవు లెంద నేర్తురే!

చ. తిరుపతిమార్గ మిట్టిదని తెల్పియెయుంటిని; చాలి యున్నచో
జరుపుఁడు తత్ప్రచారములు, చాలక యుండిన మూల నుండుఁ; డే
వ్వరుఁ గనకుండఁ జాటుగను బద్యము లంపెద రేమి లాభ? మే
నరసులు వెత్తు రిక్కటిలచారపుఁ జేఁతలు రచ్చకెక్కినన్.

ఉ. "అర్భకు లేమి సేయఁ గలరంచుఁ దలంచితి" వన్నమాట సం
దర్భము లేని దర్భక వదంబు వయస్సున మీకుఁ జెల్లునే?

యర్భకుఁ గన్నవార లెటు లర్భకు లౌదురు చెప్పు చెప్పఁ డిం
కర్భకు లెందునో ! కవిత యందునొ, యింకొక దానియందునో ?

చ. అనృతము గాని మే మనిన యట్టి ప్రసంగము గాదటంటిరే !
వినినమహాత్ము లేమయిరి? "వీనులు మూఁడినభంగి వారు కా"
దనిన నిజంబు నే ననృత మాడినవాఁడ; "నిజం" బటన్న నే
యనువున నీ కృతఘ్న బిరుదాంకము వాయునొ ? రామ ! చెప్పుమా.

చ. మఱచితివేమొ, యెంత మతిమాలిన మానిసివైతి వయ్యొ ! శం
కరుని గృహంబునన్ ఋణముగాఁ గొని కాఁకరపఱ్ఱవాసు లె
వ్వరొ భవదుత్తమర్ణులకుఁ బ్రాఁతఋణంబులు తీర్చుకొంటివే !
గురువగు వేంకటేశ్వరునకున్ మఱి తద్దన మీ వొసంగితే ?

చ. "గురుధనమున్ హరించితివి కూళ ! కృతఘ్నుఁడ" వంటినో గురుం
గురువుగఁ జెప్పుకొంటయును గూడదటంటినొ, లేదు లే దొక
త్కరమె యొసంగనీ తనకు గౌరవపాత్రుని వంద్యునిం గురుం
గురువుగఁ జెప్పుకోని చెడుకూళఁ గృతఘ్నునిఁగా గణించితిన్.

ఉ. వ్యాకరణంబుఁ జెప్పె నది యంటక పోయినఁ బోవుఁగాక నీ
కీకవినామ మయ్యనఘుఁడే కద పెట్టిన, దంతఁబోక తా
నేకడ కేగె నిన్నుఁ గొనియే చనె నచ్చటి కట్టివాని ను
శ్లోకు సభాస్థలి న్విడిచి చోరుగతి న్మొలఁగం బనేమొకో ?

సీ. ఇంజరం బొకసాక్షి యేనాము దా సాక్షి పల్లెపాలెంబు దా నెల్లసాక్షి
యిపుడు నీ వున్నట్టియీపిఠాపురి సాక్షి యేలూరు సాక్షి నీయిల్లుసాక్షి
వల్లూరునృపతి శ్రీభాష్యకారులు సాక్షి నూజివీడ్రామచంద్రుండు సాక్షి
మంజువాణీప్రెస్సు మానేజ రొకసాక్షి శంకరుం డాతనిసాని సాక్షి

తే. గీ. మధునపంతుల సూరయ బుధుఁడు సాక్షి
యయ్యనఘు నన్న సాక్షి సుబ్బయ్యగారు
సాక్షులున్నారు పద్యంబు చాల దింక
వేంకటేశ్వరుశిష్యుఁడవే నిజంబు.

గీ. వేంకటేశ్వరు పాదంబు వీడి పిదప
నెవని సేవించితివి చెప్పు మింత యేల ?
యేవిషయ మీవు సాధించినావొ పిదప,
వ్రాయు మా వేంకటేశ్వరు పదములాన ! 45

శా. చూడం జాలని దేది? భూపతుల మెచ్చుల్ చూడఁగా లేనొ! యే
జాడన్ ద్వ్యర్థచిత్రప్రబంధపరిభాషల్ చూడఁగా లేనొ! యే
వాడున్ లేని శతావధానకవితావల్లీనవాంకూరముల్
చూడం జాలనొ! నీకుఁ గల్గు సిరి హెచ్చుల్ చూడఁగాఁ జాలనో!

క. సభకుం బిలిపించిన మే
మభయంబున వత్తు మంటి మది గాదేని మా
సభకున్ రమ్మంటిమి యీ
యుభయంబున కీవొసంగు నుత్తర మేది?

గీ. కూపకూర్మ మబ్ధింజుఁ జేర్కొనుట తప్పొ,
కూపమందున్న కూర్మంబు కూయ దెందు;
నరయ కెంతయు "బక బక" మనెడు కతనఁ
గూపమండూకమంచుఁ జేర్కొనఁగవలయు.

ఉ. గాడిదకూఁతకుం బ్రతిగఁ గర్ణకఠోరము గాఁగ నుండి యే
వాడకుఁ బోయిన న్విసెడివారు లభింపనికైత మల్లువాఁ
డేడకుఁ బోవ నేమి యగు? నెక్కడి కేగిన రండటంచుఁ గొం
డాడుచు వీనులార వినునట్లు కవిత్వము చెప్పువారికిన్.

చ. గరువము మాటలందుఁ జెలఁగన్ జగమెల్లఁ జరింపఁ జాలు త్రి
మ్మరితన మేకవీంద్రులకు మైకొనఁజాలు! నిరర్గళామ్భతా
కరరసపుంజమంజులవికస్వర చారుకథాసుధాధురం
ధరబహుళప్రబంధకవితావనితా చతురోక్తి లేనినోన్. 50

గీ. శక్తి గల్గియు లోకంబు శాస్త్రచయముఁ
గావ్యములుఁ జూచి నేర్చినకౌశలంబు
లేనివాఁడెసుమీ కవికానివాఁడు;
కవికి దేశాటన మ్మొక్కకాని పనియె?

సీ. చదువఁగా లేదె! విశ్వము మెచ్చఁ బత్రికా పరముగాఁ బ్రకటింపఁబడిన లేఖ
వినిపింపలేదె! నిర్వ్యాజపాటుతో మిమ్ముఁ బోషించుచున్న మీ భూమిపతికి
సభలు చేయింపఁగాఁ జాలరే విద్యావిశారదులైన భూస్వామివరులు
మధ్యవర్తులు గారె! మహనీయులైన విద్వాంసులు సుకవితావత్సతములు

తే. గీ. ధీర మేమయ్యెనో నేటిబీటకాఁడ!
మాన మేమయ్యెనో, ప్రతిభాకవీంద్ర!

పౌరుషం బెచ్చటికిఁ బోయెఁ బాలకాయి !
కీర్తి యొందదుగంటెనో, కీర్తిముఖుఁడ !

సీ. వ్యాకరణంబునం దసమానమతిశాలు లైనచో తండు వాక్యార్థమునకు
నుభయ భాషాకవితోద్రేక బిరుదంబు కలదేని రండు తత్కాలవమునకు
శతవధాన ప్రవీణతగన్న పేర్వాసి యున్నచో రండు పేర్కొన్నపనికి
నితరవిద్యాభిమానేద్యత్వ మెందేని యమరిన రండు వ్యాహారమునకుఁ

గీ. దగిన పరిభుతులప్రోల మీదార్ధ్యమెల్ల
నీఱుగాఁ జేసి యేయూరు పేరు లేక
యుండఁగాఁ జేసి వరిపేలపిండిపగిది
నెఱపఁ దలఁచితి మిదియె మానిష్ఠ వినుఁడు.

ఉ. తాల్చితిఁ గంకణంబుఁ "గవితావిషయంబుల నెందు నేనియుఁన్
గెల్చెద" నంచు; గెల్తు మహనీయుల ముందర నొక్కచోటికిం
బిల్చెద రమ్మ; లేక పిలిపించిన వచ్చెద లెమ్మ; లేనిచోఁ
జెల్చిన వాసి వేంకటకవిప్రవరుల్ మదిఁ గొల్చుచుండుమా.

శా. మాకన్నన్ మహనీయులైన కవు లీక్ష్మామండలిన్ లేక పో
రీకాలంబున; యుష్మదీయ కవితాద్వీపంబు ముంపంగ వ
స్తోక శ్రీకమనీయదివ్య కవితాతుంగార్భటీఘోరగం
గాకల్లోలవతీపరివాహభర వేగపరిక్రియల్చాలవే ! 55

గీ. మిమ్ముఁబోషించు టేమి దోషమ్ము పతికిఁ?
దగని గర్వంబు మీకుండఁ దగదుగాక;
అంటుమామిడిగున్నపై నధివసించి
నంతనే కాకి కోకిలయగుట గలదె !

చ. "ఎఱుఁగక తూలనాడితి మహీనమతిప్రతిభాధురంధరుల్
తిరుపతి వేంకటేశ్వరుల దీటగువారమె" యంచు వేఁడ మీ
నరపతి యూరకుండె నని నామది నెంచెద; లేకయుండినన్
సరసుఁడు పీఠికానగరనాథుఁ డుదారుఁడు మిన్నకుండునే!

గీ. "ఎదిరి మీతోడ వాదింప నెంతురేని
రెండు మాసంబు లిటు లూరకుండువార
ఓడి" రనుకొనుచున్నవా రుర్వీజనులు;
ఎవ్వ రేమనుకొన్న నిం దేమి తప్పు.

గీ. లేడిపైఁ దూఁకు సింగంబుజాడ వచ్చి
పడుదుమన్నంత వేగిరపాటు గలదు
“గౌరవించునో లేదో భూకాంతుకడకుఁ
బిల్వ కేఁగఁగ రా” దంచు నిల్వవలసె.

గీ. దీనికే నుత్తరంబు రాదేని మమ్మె
కాదుచూ! గెల్చు టరయ, లోకత్రయైక
విజయసాధకమగు గొప్పవిద్య గల్గు
వా రటంచుఁ దలంచి యే నూరకుందు. 60

ఇట్లు,

కాకినాడ, 20-8-10.
దివాకర్ల తిరుపతిశాస్త్రి,
శతావధాని.

---

# 5

## శాంతింపు పర్వము.

శా. శాంతింపుండని రాయబార మవురా! శాంతింపకేమున్న వ
శ్రాంత * ప్రస్మృయ దస్మదీయ కవితాచండాసి ఖండీకృతా
హంతా దంతుర కాకవిప్రతివచఃప్రారంభరంభాకురు
ట్కాంతారమ్ములు సగ్గి మ్రగ్గి యసదై కప్పట్టు నిప్పట్టునన్.

శా. శాంతింపుండని రాయబార మవురా! శాంతింప కేమున్న దా
క్రాంతాశేషదిగంతమామకగవీప్రాగ్భారదూరీకృత
క్లాంతక్లాంతనిశాంతశాంతకుకవిక్రవ్యాదవర్యోదయ
ధ్వాంతంబుల్ ధరణీభృదంతికదరీద్వారంబుఁ దూఱంజనన్.

శా. శాంతింపుండని రాయబార మవురా! శాంతింప కేమున్న ద
శ్రాంతప్రస్ఫురదస్మదాశుకవితా ఝుంఝూమరుద్ధూతదు
శ్చింతాదంతురితాంతరంగకుకవిక్ష్మామాభ్రదభ్రచ్ఛటో
దంతంబుల్ చెవులారఁగా విని ప్రమోదంబందు నిప్పట్టునన్.

శా. శాంతింపుండని రాయబార మవురా! శాంతింప కేమున్న దా
శాంతక్రాంతమదాశుధారకవితాహంకారహుంకారవి

---

* నామధాతువుమీఁది రూపము

క్రాంతిక్లాంతదురాగ్రహాగ్రహణకాకవ్యగ్రణీగర్వదు
ర్వ్యాంతుల్ గొంత ప్రశాంతిఁ జెంది లఘుతావాప్తిన్ సుషుప్తిం గనన్.

శా. శాంతింపుండని రాయబార మవురా! శాంతింప కేమున్న దు
ర్ధ్వాంతస్వాంతవికారకాకపికవిత్వత్వగ్భిదాధూర్వహా
హంతాకాంతమదాశుధారకవితావ్యాహారనీహారవా
స్సంతానంబులు సత్సభాంతరపరిస్పందస్ఫూర్తి గావింపఁగన్. 65

## 6

## మండలింపు పర్వము.

శా. ప్రాదుర్భూత శతావధానకవితాప్రాగల్భ్యసౌరభ్యసా
రోదారాప్రతిమప్రబంధకవితాయోషావిభూషాయశః
కేదారాంతరతః కథంచి దుదయత్కుంపాకనూత్నాంకుర
చ్ఛేది చ్ఛాతగ్రినమత్కృతుల్ దిరుపతిన్ శ్రీవాఘుఁ డోమున్ గృపన్.

ఉ. మొగ్గిక్కిన మొక్క నేఁడు మఱపుం గను నోటియపజ్ఞఁ జేసి యా
టక్కరి యాత్మభక్తుని జడత్వ మడంచెడియిచ్చ నేదియో
చిక్కు ఘటించి మొగ్గిక్కుబడిఁ జేకొని పోగ్రిచు మృదుస్వభావుఁ డీ
దృక్కరుణుండు వేంకటగిరిప్రభుఁ డేలెడుఁ గాక తిర్పతిన్.

శా. తిరుపతిశాస్త్రి! నీ వనుమతించిన శిష్యసమీకపాక మ
ప్పురశుగురుండు భీష్ముపయిఁ బార్థునిపై నల కుంభసంభవుం
డరిగెడునట్లు కాక యల యార్యులు మిన్నక రజ్జు లాడు న
త్తరుపయి కేగుచందమయి దద్జుల కొండొకభంగిఁ దోఁచెడిన్.

శా. నాకున్ శిష్యులు నీకు శిష్యు లనియున్ నాకున్ మఱి న్నీకు దే
హాకారమ్ములపట్లఁ దక్కఁ గవితావ్యాహార మందెందు భే
దాకాంక్షల్ జగ మొప్పికోనిదను నీ యంశంబు గుర్తించియు
న్నీకుం "గా" రని శిష్యు నొక్కరుని మన్నింపం బనేమున్నదో.

ఉ. "గా" రని నీవు వ్రాసితివి గౌరవభావము చూపి, శిష్యుఁడో
"గా" రని వ్రాసినంతఁ దన గౌరవ మెక్కుడఁ బోవునో! యటం,
చూరక "తిర్పతీ" యనుచు నుల్లపు మెుల్లము నెల్లఁ జూపె వా
క్సారము లేక యొట్లొదవుఁ జక్కనిఫక్కి లిఖించు పద్ధతుల్. 70

మ. తనకున్ "శాస్త్రి" యటంచు వ్రాయుదని కాదా! "తిర్పతి" యంచు వ్రా
యుమ దా నీయెడ సాహసించెఁ; దన "కయ్యన్" వ్రాసితే నీవు నీ
కును దా "నయ్య" పదంబు చేర్పఁజనదొక్కో! రీతి యిట్లుండ నా
కును శిష్యుం డటె యీతఁ! డే మనుచు నీకున్ వ్రాసె నా పద్దెముల్

శా. నిన్నున్ "దిర్పతి" యంచుఁ బిల్చుటకు మన్నీఁ డెట్లు సైరించె వి
ద్వన్నంద్యుం, డెటు పల్కెనేమి యగు! విద్యాపాటవం బున్నచో
నౌన్నత్యమ్ము వహింపగాదె! కలుషవ్యాహారమా యున్నతిన్
దిన్నం జేసెడి దాఁడుపోఁడుములు విద్యావిశ్రుతిన్ దెచ్చునే!

ఉ. మగతన మున్న దేనిఁ దనమాటను నిల్పుకొనంగ నెంచుఁ గా
క; గడుసుపోక లెందులకుఁ! గాఱుమెయిన్ దెగఁదిట్టిపోసినన్
బొగ రనిపించుఁ గాని కవిపుంగవలక్షణ మౌనె! విద్యకుం
దగుప నృపాలుఁ డీ, కనుమతించెనె దేశికుఁ దిట్టిపోతకున్.

శా. జ్ఞానుల్ మున్నటి సత్కవీంద్రులు సభల్ సాధింపఁగాఁ బోర! "నీ
వా, నేనా!" యనినప్పు డిప్పగిది దుర్వ్యాహారముల్ పల్కరే!
గానం బే రెటు వచ్చు? హెచ్చు నసమర్థత్వంబు పైపెచ్చు: వి
ద్యానైపుణ్యము లేదుపో! పెళుచులేలా, నోటిసాం పేర్పడన్?

మ. "అన లే" దంచు వచించి తప్పుకొనువాఁ డల్లంతనే పోక "నే
రనియిప్పాండితిఁ జూపు టెందులకు? ధీరమ్మన్యతాదోషపుం
గనులా, నిన్నెదిరించువారు! ఘను లాకాంక్షింతురే విద్వద
న్యనితో వాద? "మధాత్తు" గాథ వినలేదో! నీవు మున్నెన్నఁడున్.

క. వ్రాసినయుత్తర మెందుకొ
ఆసంగతి విడిచి రజ్జులాటకు దిగి "నే
బా" ననిపించుకొనెద నను
నాస యతని కెంత మనమునం దున్నదియో! 76

క. సభ మాట విడిచి యూరక
రభసమ్మున నేదో సోది వ్రాసినఁ దనకున్
బ్రభ గల్గునె? యకటా, రా
సభమే లోకమ్ము! చర్చ సలుపకయున్నే?

క. "చాలును దుర్వాదం" బని
బాలుఁడు తుది వ్రాసికొనియెఁ "బకువేటుఁగని యూ

ప్రాలటుకంటెదిది" యని తన
లోలోనే దెలిసియును వ్రాసె లోకము కొఱకై. 78

క. గురుధనమఁట ! హరణంబఁట !
పలుపలు నిటు వ్రాసినంతఁ బావనుఁడై తా
గురుధన మెఱుఁగని లోకో
త్తరచరితుం డాయె నంట ! ధార్ష్ట్యం బవురా !

క. అప్పు గలదు పత్రము గల
దప్పునకుం దగిన భూము లం దున్నవి యీ
తప్పుడు ప్రసంగ మేమిటి
కిప్పగిదిన్ వ్రాసి యొక్క యితఁ డధికుఁడగున్ ! 80

క. గురుఁ డప్పిడు ద్రవ్యం బది
తిరిగియు నీ భూమివలనఁ దీఱె, నితనికిన్
గురుఁ డిచ్చిన ధనమునకున్
గులు తేమియు లేమి నీబుణుం డెట్టులగున్.

మ. గురునామమ్ముఁ దలంపకే సభ నొగిం గూర్చుండఁగాఁ బోవు శాం
కరినామం బొకపట్టునన్ స్మృతికి నెక్కన్ దక్కనం దక్కఁగా
కురుగ్రంథ మ్మొకఁ డిచ్చి యీ జగము దా నున్నంతకాలమ్ము స
త్పురుషుల్ మెచ్చుకొనం జరించితివి నీతో నీతఁడా పోలుటల్ !

ఉ. విద్దెను సాటి గామి పృథివీతల మెల్ల నెఱుంగు నిన్ గురుం
"డద్దిర" యంచు మెచ్చె, నితఁ డందులకుం గొఱ గాఁడ, పత్రముం
బద్దను నుండఁగా గురుధనంబు హరించుట నాఁగ నెట్టి ! దీ
నుద్దికతమ్మునం దనకు జోడుగ ని న్నొనరింప నెంచెనో ?

చ. గురుధన మున్న విద్యయు యగున్ ; దన కిచ్చినవిద్య సత్సభాం
తరములఁ జూపువేళ గురునామము డాఁచినవాఁడు పాపి ; త
స్కరుఁ డన వేఱు లేఁ డతఁడ కాఁ దగు ; దద్ధనహర్త వాఁడె ; త
త్పరిచితి పాపహేతు వగు వాని మొగమ్మును జూడ రుత్తముల్.

క. మరియాదగ వ్రాసిన నీ
తరతమభావంబు దెలియుఁ దన కెట్లగు ? బల్
దురుసుతనము జూపుచుఁ గడు
నతిశయితిఁ బద్దెమ్ము లంపు టది యేమిటికో ! 85

ఉ. పేపరులోన నీవు తగు పెద్దలు మెచ్చఁగ వ్రాసియుంటి; వా
రో! పరువంపుమాట లెవియో యొక కొన్నిటి నెత్తిమెట్టిగాఁ
బాపము వాక వ్రాసి యవి పద్దెము లంచును జాటుగా గురు
శ్రీపతివైన నీకడకుఁ జేర్చిరి లోకము మెచ్చఁ గోరుచున్.

ఉ. చాటునఁ దిట్టలేరని పరిసంగము గోరితి వొక్కొ! వారి వా
చాటతఁ జూప రాదె సభఁ! జాలునదే పదివేలు; నీవు న
చ్చోట నొకంట నుండి యది చూచెద వీశ్వరవేరో, జీల్గుబెం
డో! టకటొంకు లేమిటి కహో! పెదయుక్తులు గీర్తి నిచ్చునే!

చ. గురు వని చెప్పఁగా మఱపు గూరినఁ గూరెదుఁగాక యెందు కీ
యెఱిఁగి యెఱుంగ రానిపలు "కీశ్వరవే" రని గూడ దాని సం
బరముగఁదా వినంగఁ "బినబాబు! వచించిన" దన్నచో, మనో
హరముగ విన్నవాఁడు తన కానొకొ! యిప్పు డసత్య మాడఁగన్.

తే. గీ. వినియెఁ బో! తాను "నీశ్వరవే" రనంగ
"నంతవాఁడనెకాఁబోలు" నంచు నెంచె
నిప్పుడే మయ్యె నాచేవ! యెదిరి నన్ను
వేరు గారాదె! బెండుగా మాఱనేల?

చ. ఎలమి నినున్ జయించి పయి "నీశ్వరవే" రగునేని "యింత యు
జ్జ్వలమతి శిష్యుఁ డయ్యె" నని సంబర మందుదుఁగాదె; యేను నన్
దలఁపక యుండుఁ గాక గురుతాపద మాతని వ్రాఁతె చెప్పుఁ, ది
క్కులగురుముద్ర వీఁపుపయిఁ గ్రాలు భుజంబు భజింప జంకినన్. 90

మ. "మన మేగం బని లేదు పీఠపురి కస్మచ్ఛిష్యు లందున్నవా"
రనునానందము తప్ప శిష్యుఁడయి నా కర్పించు భాగ్యమ్ములే
దనృతం బాడుక తానఁ బోవునది లే దౌరా! జగంబెల్ల బో
రన నూరేగిన మద్గురుత్వ మది యేలా డాఁపఁగా నెంచెనో.

ఉ. డాఁచిన దాఁగువాఁడ నొకొ తక్కినదేశికులట్లు! కీరితిన్
మోచినవాఁడ; "విజ్ఞుఁ" డని "మూఢుఁ" డటంచును గూడ వానికిన్
దోఁచక పోయెఁ గాక; యెటు దోఁచెడు నీకలహమ్ము చూచి "యా
లోచన లేదు పాప" మని లోకులు నవ్వెడి యోగ ముండఁగన్.

ఉ. "చెప్పక పోవుఁ గాక యొకశిష్యుఁడు తన్ను గురుండటంచుఁ దా
నిప్పగిదిం బెనంగు టది యీతనికిం దగ" దంచు నన్నుఁద

“న్నిప్ప ఘకుండు శిష్యుఁడయి యిట్లు కృతఘ్నత చూపు టెంతయున్
ద ప్పిది తప్పు తి” ఘ్యనుచుఁ దజ్ఞులు వల్కుట తప్ప నేగతిన్ ?

ఉ. చాలఁ బఠించి పోసెనఁట ! చర్లకులాంబుధి చంద్రు సన్నిధిన్
నాలుగొ మూఁడొ మాసములు నాకడఁ బొత్తముపట్టె నంట ! యీ
బాలుఁడు రెండుశాస్త్రములు వచ్చినవాఁడఁట ! యెందు కీయస
త్యాలపనంబు లన్నజనుఁ డక్కట, యొక్కఁడు లేఁడె యప్పురిన్ !

*ఉ. చాలఁ బరిశ్రమం బొకట సల్పినవా రఁట శాస్త్రపద్ధతిన్;
బాలకవుల్, గురుం డెవరొ, వచ్చిన శాస్త్రము లేవొ ? యిర్వురుం
జాలఁ బరిశ్రమం బొకట సల్పిన దెక్కడనో ? యసత్యమే
చాల పరిశ్రమం బొకట సల్పి గ్రహించిన పెద్దవిద్దెయో !

‡ఉ. ‘మూలము ముట్టఁగాఁ గవనముం గని యారసి నార’లంట ! ప
ద్యాలటు లుండనీ వచన మంచు రచించిన గ్రంథపీఠికన్
నాలుగు పంక్తులే నొరులు నవ్వనిపంక్తులు లేవు; దీనికే
“మూలము ముట్టినా” మని ప్రమోదము చెందుదురయ్య ధీనిధుల్ !

ఉ. మూలము ముట్టఁగాఁ గవనమున్ గని యారసినార లేమి ! గ
ద్యాలయు నాత్మకూరు వనపర్తియుఁ గాదు పిఠాపురమ్ము భూ
పాలుఁడు చిన్నవాఁడు, తగుపండితు లప్పటి కందు లేరు వా
చాలత లిట్టి వెట్లు కొనసాఁగెడి వేఱొకచో సదస్సులన్.

చ. చరలకులాబ్ధిచంద్రుని ప్రసాదమునన్ గణియించు శక్తివి
స్ఫురణము చూపరాదె ! యలనూరియు నన్నునుబోలె నక్కటా
“గురుఁడ నెట్లైతినో” యనుచుఁ గొంకఁగ మూలముదుంగ నేల ! తు
ప్పు రగులఁ దిట్టు టంచుఁ దలపోసెనొ ! సత్కవితావినోదముల్.

చ. చరలకులాబ్ధిపద్యగతచంద్రుఁడు “ బ్రహ్మమనీషి ” యంచుఁ గొం
డఱు భ్రమ చెంది యీతని పృథా మనకున్ సహపాఠిగా గణిం
తురఁట ! యిసీ, గురుండ నను దోసముపై నిది యొక్కదోస మో
తిరుపతిశాస్త్రి ! యెవ్వరు విధిన్ దరియింపఁగ నేర్తు రక్కటా!

చ. చరలకులాబ్ధిచంద్రుకడఁ జాలఁ బఠించునుగాక పీఠికా
పురవిభునొద్దఁ జూపిన యపూర్వపు విద్దెకుఁ గారకుం డెవం ?

---

*ఉ. చాలఁ బరిశ్రమం బొకట సల్పినవారము శాస్త్రపద్ధతిన్ † మూలము ముట్టగాఁ గవనముం గని యారసి నారమింక — వేం॥రా॥ గ్రంథమాల 4 వపుట.

డెఱిఁగినవారికిం దెలియదే! యది మూసిన డాఁగనేర్చునే
గురుఁ డని నీవు వ్రాసినది 'కొంత చమత్కృతి' యంట, యక్కటా!

చ. 'గురుఁ డని శిష్యుఁ డంచు నొకకొంత చమత్కృతి చూపి'తంట! య
క్కఱమెయిఁ ద్రోవఖర్చు లిడి గారముమై వెనువెంటఁ ద్రిప్పి య
క్కరము లొసంగినట్టిగురుఁ గా దని నందుకు మెచ్చి మేఁకలో
లెఱిఁగినవాఁ డెవండు తన కిమ్మెయిఁ గప్పఁగలాఁడు పోడిమిన్?

చ. గురు వని శిష్యుఁ డంచు నొకకొంత చమత్కృతి చూపు టెట్టిదో
సరిగ లిఖింపఁగాఁ దగిన సాక్ష్యముగల్గినఁ జూపరాదె? త
త్తఱపడ నేల? పద్దెమునఁ దక్కిన యంశము లేల లేవు? మ
ద్గురుత దోలంచు సంగతులు గొండొక వ్రాయఁగరాదె యుండినన్.

ఉ. మూసిన డాఁగునే! "కడుఁ బ్రిబద్ధుఁ డితండు గురుండు పేర్మిమైఁ
జేసినమేల్ వృథాగ మఱచెన్, జెఱిచెన్ గురుశిష్య పద్ధతిన్
వాసికినై" యటంచు ననివాఁ డొకఁడుండునె! పక్షపాతపుం
దాసులు తక్క; నేమిటి కతథ్యవచస్కులతో వివాదముల్.

ఉ. నాలుగొ మూఁడొ మాసములు నాకడఁ బాత్రముఁ బట్టినాఁడఁ టా
శీలవదగ్రగణ్యుఁ; డిటు చెప్పగ నోరెటులొప్పె? నొప్పెఁబో,
భూలలనామనోహరుఁడు "పాచ్చెము మాని వచింపు" మన్నచోఁ
దేలకయున్నె? మోముకళ దీనియథార్థము దెల్పకుండునే!

ఉ. ఏపని యేనిఁ జేసి తల యెత్తుకొను న్నరుఁ డొక్కమాట తా
నీపని, నాఁ!—కృతఘ్నతకు నెవ్వఁడు పాల్పడు వానిమోముపైఁ
గాఁపురముండు వెల్వెల, యొకం డొనరింప మఱొక్కఁ డౌను వాఁ;
డీ పరమార్థమున్ దెలియు మేమిటి కింక బహుప్రసంగముల్.

ఉ. ఏపవాద మేల! విను మే వచియించెదఁ గూపమందు గో
దావరియూట కొంత దిగెఁ, దద్గతనీరము గూడి క్షారమై
పోవునొ, క్షీరమే యగునొ బుద్ధిమదగ్రణులే గ్రహింత్రు నా
కీవిధమైన శిష్యుఁ డొకఁ డిచ్చు యశం బది యెంత పాటిదో. 106

చ. చదివెను సూరపండితుని సన్నిధి, నాఁటయి దాను వ్రాయు స
ద్విదితుఁడు చర్లచంద్రుకడఁ దెల్విని గాంచె నొకించుకంత, నో
ర్మ్రమపుటయూం గవిత్వమును మీఁదటి గ్రంథములున్ వధానసం
వద తనపాటి శాస్త్రమును నెవం డిడె నొక్క ప్రమాణపూర్తిగా!

ఉ. కోఁడు పరాపరోక్తుల నెఱింగి విచారణ సేయఁడేని మా
కేదును కోఁడె, తన్ననుసరించిన శ్రీఫల మిచ్చుచుండు, నే
కేదును కోఁడె, యయ్యది భరించు ద్విజప్రకరమ్మునెల్లఁ, బూ
కేదును కోఁడె, యయ్యది చరించెడి సత్పథమంచుఁ బొందుగన్.

చ. తనకలరామకృష్ణకవి తద్దయు శిష్యుఁడు, తాను జాకు న
మ్మిన బలుశిష్యుఁ, డిర్వురను మీఱుట కేదియుపాయ! మట్టిచో
జనవరునొద్ద నాదగు ప్రశంసయె యెత్తమి కేమి హేతు? వుం
డిన నది పేపరందుఁ బ్రకటింపఁగ రాదె జగమ్ము మెచ్చఁగన్.

*ఉ. సూరయగారితోఁ బలికెఁ జూ! యితఁ "డీ విడినట్టివిద్దె బల్
నీరసమై యెటో చనియె నీవు గురుండవు కావు నా" కటం
చా రసవేది నాకు నిది యంతయుఁ జెప్పె, స్వబుద్ధిమూర్ఖ్యమా
ధీమనియందుఁ జొన్పు నువిధేయున కేపని సేయరా దికన్.

మ. మధునాపంతుల సూరయాభిధుని సమ్మానించె నీరీతి, నా
బుధమాన్యుండు వచించె తిచ్చవడి "పో! పో! యెంతవారేని యి
య్యాధమంపుం గలి నుండ వచ్చు" నని "తాతా! యూతనిఁ జెప్పఁబో
కు ధరన్ లేఁ డిటువంటిధీరుఁ"డని వాక్రిచ్చెన్ బరఁ బేగుచున్.

ఉ. సూరయగారనంగఁ గడుసూరియుఁ దండ్రికి మేనమామయున్
ధీరుఁ డుదారుఁ డీతనికి దేశికుఁ డన్నమాటీయుపట్లనే
నేరమి నట్లు చూపిన వినీతున కే నొక లెక్కయే! "మహా
శూరుఁ డితం"డటం చదియ చొప్పడఁ జెప్పెదుఁ దెక్కలేటికిన్. 112

ఉ. ఆసమెయిన్ వరమ్ముఁ గొని యాపయి దేవునినెత్తి మొత్తు భ
స్మాసురు లిప్పుడుం గల, రహంకృతిశాలుల నట్టిమూరవి
శ్వాసుల నొంచు శ్రీపతులు సజ్జనమాన్యులునుం గలారు "సే
బా"సని వారిమెచ్చు గుణవంతులునుం గలరయ్య, శ్రీపతీ!

---

*"...గారికి—మ. వెం. సుబ్బారావు.........లేక, గీరతమునఁగా2ని సూరయ్య తాతగారియొద్దఁ జదివినదంతయు మఱచి పోతినను కారణమున గురువులుగా వేసికొనలేదని వెనుక తమ యొద్ద నన్నమాట యెచ్చటనైనను తమరు వాయింపుఁడు........................"

వెం॥ సు॥ రా॥

ఈ వెంకటసుబ్బారావు మధునాపంతుల సూరయ్యగారి కుమారుఁడు.

చ. మొదటిగురుఁ డ్యజించె నొక మూలములేకయె నన్ను నీగతిన్
బడపటివానిఁ బోవిడిచె, మధ్యగురుం డిఁకఁ జర్లచంద్రుఁ డీ
కదనమునాఁటికిన్ మిగిలెఁ, గావున నాతని చేతియూఁత ని
స్నదిరి జయింపరాదె! యిటు లేటికి మూల మునుంగు పోఁడుముల్.

తే. గీ. ఉభయశాస్త్ర ప్రవీణులఁ టుభయులును మ
ఱేవి యా శాస్త్రములు? వాని యెఱుక యెట్టి?
దుభయ శాస్త్రము లన నసత్యోక్తులును గృ
తఘ్న తా వాదములు నేమొ తత్త్వమరయ!

* క. బావయఁట! యతఁడు శాబ్దిక
జీవుండఁట! యతని కితఁడు శిష్యుండఁట! యే
మీ! వీరల పాండిత్యపుఁ
జేవయుఁ గవనంపుఁ జేవఁ జెప్పఁగ నేలా! 116

శా. "పుల్లాసారులు గారు వచ్చి రరుగో! పుస్కాంబులన్ దేవ యా!
మల్లాసారులు! శీలమంతులము మేమా! పుస్కాముల్ దెచ్చుటా
యెల్లాసారులు గారు తెత్తు రకటా! యేమండి! కూర్చోండి! మీ
రల్లాగంటది దమ్మమా!" యనువిధంబౌ నీ ప్రసంగ మ్మహో!

† 3 సీ. బావకుశాబ్దికజీవత్వ మెటులబ్బుఁ? దనకెట్టులబ్బుఁ బ్రాథమిక పదవి?
అణుమాత్రముంగాని యవధానమున కెట్టు లత్యద్భుతపు బిరు దనుఘటించు?
తలమీఁదివార లెందఱో కవీశ్వరు లుండఁ గోరు నీతండు పెండేర మెట్లు?
పేరెడ! యూరెడ! పెంపెడ! సొంపెడ! ఘంటాశతంబెడ! కవనమెడ!

తే. గీ. ఏడ నీ! వేడ యాకవు! లేడ సూర్యుఁ!
డేడ ఖద్యోతములు! నీకు నింతమాత్రఁ
దెలియదేనియుఁ జూడుమా, దేశమాత
పత్రిక వచించు నివ్వారి పాటవంబు. 118

ఉ. ఆశుకవుల్ శతమ్ములను సహస్రము మున్నును నేఁడు నుండ వీ
రాశవహించు టెట్టి దకటా! కట! ప్రాథమికత్వమంద, న
ప్రాశి నటుంచి కూపమును బ్రాథమికంబన రెవ్వరేని యీ
యాశకు మేర లేదుగద! యందని పండ్లకె యఱ్ఱు చాఁచెడిన్.

* ఉ. పన్నుగ నాకు సత్కవన పద్ధతి నేర్పినబావ శాస్త్రసంపన్నుఁడు......
ఈ కవితావిధానమునకు మేమే ప్రాథమికులము" 3 "సందేహములేదు బావ
శాబ్దికజీవా." (వెం॥ రా॥ గ్రంథమాల 19-28-49 వ పుటలు చూ.)

మ. మొనమొన్నన్ గతియించు శిష్టకులజున్ మూర్తిన్ గవీంద్రేడ్యునిన్
జను లింకన్ వినకుండుగాక ఘటికాసద్యశ్శతగ్రంథక
ల్పనచుంచున్ ఘటరాట్కవిన్ దెలియరో!* లాఁతుల్ శతంబుండఁబో
లని యీమాట గలట్టి కాగితము నేలా చింపివేయింపరో. 120

ఉ. చింపిననేమి కాగితము చింపక యుంచిననేమి యెవ్వ రా
దంపుడుపాట నమ్మెదరు? తప్పడు వ్రాఁతనుబట్టి చింపివే
యింపఁగఁ బూనుచోఁ "గవనమెల్ల దసం" బగునంచుఁ జింపివే
యింపరుగాక, "గ్రుడ్డికనులేటికి మూసిన మూయకుండినన్?"

మ. అఱకన్ గట్టిన గంగిరెద్దుఱుకదే! యాత్మీయవాద్యధ్వని
స్ఫురణం బించుక విన్నయంత; నటులే సూరుల్ కలావాద దు
ర్భరతాఖండు లొకంటఁ గట్టువడియున్ బాండిత్యకండూయనో
త్సరణోత్సాహసహాయులై కవులతో సంధింప కెల్లుందురో.

శా. వేఁడున్ వాడని కీడుమాట లిసిరో! "వేయిండ్ల పూజారియౌ
వాఁ డా" యన్నవనాథయై యొకట విద్వాంసుండు గూర్చుండునే
మూడుంబోలె, మహాకవీంద్రచరితల్ మూచూడలేదొక్కొ "పం
డ్లూడుం బో!" యని నీవు మున్ననినదే యుక్తంబు ముమ్మాటికిన్.

ఉ. కుంటి కవిత్వమో మఱియు గ్రుడ్డి కవిత్వమొ కాని నేఁడు మె
చ్చంటుట దుర్లభం బనియె యక్కట! యిక్కవు లట్టి కైత కై
కొంటకునై కడంగెదరు కొందఱు ప్రాజ్ఞులచేత గుద్దులున్
గుంటులెకాక యన్యులను గొండొక పూజితు లా లెఱుంగరో!

ఉ. కబ్బము లచ్చువేతురఁటకా! యవియే పచియించుఁ గాక యా
రబ్బపమెల్ల నేమిటికి అవ్వయు ఊట్టును నీకుఁ? గోఁతికిం
గొబ్బరికాయలాగు సమకూడెను బత్రిక యొండు వారి; కా
గబ్బది మున్నె లోకులకుఁ గన్పడె నొండొరులేల దీనికిన్.

శా. లేకల్ పీరిపత్రిణతన్ దెలుపు నీ లేఖావివాదంబు లే
లా? కృష్ణం గని బోధినిన్ జదివి యన్యంబైన సత్పత్రికా

---

* ఖ్యాత శ్రీరఘునాథనాయక దయాధారానువారోన్మిష, ద్వీణావాదన సంస్కృతాంధ్రకవితాసామ్రాజ్యలక్ష్మీజుషా, తత్తాదృఘ్ఘటికార్థనిర్మితశతశ్లోకీ, ఫణిగ్రామణీ, వాణీప్రాకృతశాస్త్రనైపుణసమున్మీలద్యశశ్శ్రీజుషా॥ మధురవాణి (ఈమధురవాణి తంజాపురీ సంస్థాన విదుషి) స్వనర్మప్రకాశినీ పత్రిక చూడుఁడు.

నీకంబుఁ జవి చూచి రే మెఱిఁగితో ! నీ వల్ల యాకాశవా
ణీకళ్యాణపుఁ బాట నొక్కటియుఁ నేనిం బాడలేదా ! సఖా.

క. "మిడతంభొట్లు శకున" మను
వడువునఁ గన్నం బొకంటఁ బాతినయంతం
దుడుకు వడఁ జెల్లునే ! యె
క్కడ నెవ రున్నారొ సుంత గాంచఁగవలదే. 127

చ. "ఇరువుర మేము మీ రిరువు రిందెవ రెవ్వరిఁ గోరుకొంటి రి
ర్వురు నొకనన్నె నే యెదిరి పోరి జయింతునొ ? లేక యిర్వు రి
ర్వుర నెదిరింతునో ? తెలుపఁ బోలు" నటన్న వృథాగఁ జాటుగన్
మురిసిన నేమి లాభ మగు ? ముక్కున నూపిరిలేద యాదసన్.

ఉ. లోక మెఱుంగుఁ జూ ! కవితలోఁ గల పాకము; శత్రువైన సు
శ్రీ కలకబ్బముం గని 'యిసీ' యనఁ జాలఁడు, మిత్రుఁడైన న
శ్రీక కవిత్వమైన 'బళిరె' యని మెచ్చుకొనండు; నీవు నే
లా కలహంబు ? లోకమె రసారసచర్చ యొనర్చుచుండఁగన్.

శా. తాతాచార్యులు లోనుగాఁగలుగు తంత్రిజ్ఞుల్ వధానార్థమై
యే తేరం గన మెక్కొ ! సభ్యజను లీస్సీ యంటయుం గాంచమో!
యీ తంత్రిజ్ఞులు వారి కెంత వెనుకో యే తేరఁ గాఁ దగ్గవా
రేతన్మాత్రులతో వివాదమున కీ వేలాగు కా లాఁగితో.

ఉ. "మా కవితావిశేషములు మానసవీధుల సంచరింప" నం
చా కవు లాడు మాటలకు నప్పురవాసులె గేలి గొట్టుచున్
"మీ కవితావిశేషములు మేదరవీధుల సంచరించుఁ జుం
డో కవులార" యంచుఁ గడునుల్లస మాడుదు రంట ! వింటివే.

ఉ. 'మా కవితావిశేషములు మానసవీధుల' పద్య మందు "వీ
రేకవి" యన్నచోటఁ గల 'యే' ప్రకృతస్థితిఁ బట్టి ప్రశ్నగా
స్వీకృత మయ్యె, బెండ్లనుట సిద్ధము నయ్యె, రసజ్ఞు లెల్లరున్
మేకు బిగించి లాగుటయు మేకొనె నేమిటి కింక బీరముల్.

చ. కవి కవితావిలాసము జగన్నుతితోఁ బనిలేనిదేనిఁ గా
కవియుఁ గవీంద్రుఁడే యగును గాక వివేకముతోడ నేమి ! ఘూ
కవియుఁ గవీంద్రుఁడే యగును గాక రసారస చర్చయేల ! యే
కవియుఁ గవీంద్రుఁడే యగును గా కిఁకఁ బాకవివేక మేటికిన్. 133

చ. ఎవనికవిత్వముం గని యహీనమహామహిమానుభావులౌ
కవు "లిదివో! కవిత్వ" మని కంపితశీర్షచమత్కృతియౌ మహో
త్సవసవిశేషసూచితసుధారసధారఝరీకు లౌదురో,
కవియనఁగా నతండ యగుఁ గాకవు లేకవు లేనిఁ గాకవుల్.

శా. దారిం జిక్కిన లాడ ముందు గొని మోదం బంది "యీ మీఁదనే
స్వారిం జేయఁగ మూఁడు లాడములు నశ్వ మ్మొక్కఁడున్ లో" టటం
చూరం బొచ్చినభంగి బాలకవు లేదో కొంచె మార్జించి యా
ధారాధారమునన్ భవత్పదవికై ధ్యానించుచున్నా రహో!

ఉ. గారెల పిండివంటకయి కాంతుఁడు కాంతను బృచ్ఛ సేయ, నా
సారసనేత్రి వ్రేలొకటి చయ్యనఁ జూపి "యి దొక్కఁడున్న దా
ధార" మటన్న సామెతగ ధార యొకించుక కల్గుమాత్రనే
వీ రవధానపుంబనికి వీజేఁడులై ప్రయతించి రక్కటా!

ఉ. నీ వచనంబు లెందుకొ మనీషులు నవ్వుదు రంట సత్యముల్
లేవనియో కృతఘ్నతలు లేవనియో గురునింద లిందులో
లేవనియో ప్రమాదములు లేవనియో స్వవచోవిఘాతముల్
లేవనియో! మనీషులు మలీమసచిత్తులఁ గాని మెచ్చరో!

చ. గురువకుఁ బంగనామమిడు కోయిలపిట్టలు గాని పండితా
దరము వహింపరో! యుగవిధం బిదియో! యివి బోధ సేయు వ
ప్పరమరహస్యశాస్త్రములు బావయుఁ దానును దక్క నేరరో
యొరు! లవి నేర్వఁగాఁ దగిన దొండొకశాలను దాము నిల్పిరో!

శా. తా నేదో మనమందుఁ దుమ్ముకొని యాస్థానమ్మునన్ నన్నుఁ జే
రోఁక నుంకింపక పోయి, లోకులు "గురుద్రోహమ్ము గావించె" నాఁ
గా "నే నీశ్వరవేరు వారి" కనుచున్ గర్జించి నీ కోడి గే
హేనర్దిత్వముఁ బూనె నీతనిని నీ విం కేల జంకించెదో!

ఉ. "భారతనాటకమ్ముల సెబా సని లోకులు మెచ్చ వ్రాసి యీ
పాటుఁ దెలుంగఁడే యకట! పాడినవారినె పాడఁదోలుటే
పౌరుష?" మంచు నిన్ను బుధవర్యులు దూఱరఁటయ్య! యెందు కీ
సారవిచారులం గెలువఁ జాలఁబ్రయత్న మొనర్తు? వక్కటా! 140

శా. బాలమ్మన్యుల పోరు కీర్తికరమో! ప్రాగల్భ్యసందర్భమో!
శీలాలంకృతియో! భవత్సుకవితాసీమంతినీచారులీ

లాలాస్యానుగుణంబొ !- యేమిపనికై లాభించునో ? తెల్పు మీ
యాలం బింతటఁ జాలుఁ; జాలు నిఁక నేలా తూలికాచాలనల్ !

మ. చదరంగమ్మునఁ గలావివాదగతులున్ సంగ్రామరంగమ్ములున్
ముద మీనేర వసాగు లన్య లయినన్; మున్నున్న నైపుణ్యసం
పద గూడం దొలఁగించు; నీ కెచట సంప్రాప్తించి రీసత్కవుల్ !
పదముల్ దొట్రిలు వారి కైత నడఁపన్ బ్రాజ్ఞుల్ ప్రశంసింతురే!

శా. సింగం బాఁకలి దీఱ యున్నతతి నాచెంతం బ్రవేశించి వే
డ్కం గోమాయువు నోటిప్రక్కఁ బడుకండన్ లాగి భక్షించు, గో
లాంగూలాదులు హేలమై నరిగి వేళాకోళముల్ సేయు, నే
మిం గోపింపదు వానిపై, నటులె నెమ్మిం జూపుమీ వీరిపై.

చ. తిరిగితి కొంత దేశము ప్రతిజ్ఞ లొనర్చితి నిల్పుకొంటి ము
ష్కరుల నదల్చి సత్కవుల గౌరవ పద్యము లందుకొంటి "ది
క్కరి కెన యీతఁ"డన్ యశము గాంచితి కాంతువు కాంచుచుంటి వో
తిరుపతిశాస్త్రి ! నేఁ డనుమతింతుమ భీరులతో వివాదముల్.

చ. నలువది యేండ్లు వచ్చె నరనాథుల నేకులు నిన్నుఁ గోరువా
రలఘుమతుల్ గలారు, ధన మట్టులె యుంచుము విద్దెలోన ని
స్తులుఁడగు కృష్ణభూవిభునితోఁ గడు నెయ్యముఁ దియ్యమున్న నీ
వలకవులన్ జయించి ఫల మావల నందెడిదేమి చెప్పుమా. 145

మ. ఫలమే యందఁగ నిచ్చ యున్నయెడ నీ పాండిత్యమున్ తేనిముం
గలఁ జూపం జనఁగావలెం బిదప నీకవ్యగ్రణీవ్యగ్రతల్
తల యెత్తం గమకింప, నెత్తునెడఁ దద్భారంబు వారించు ని
గ్గులు నీ నేరని వాక్కా ! తాతకును దగ్గుల్ నేర్పఁగా నేటికిన్.

శా. ఇంకన్ గ్రొత్తనృపాలురం గనియెదే ! యీ, వెన్ని యేండ్లయ్యె రా
జాంకం బాత్మకురుప్రభుం డిడిన మాన్యం బింతకుం బుచ్చుకో
నుంకింపన్ మది లేనివాఁడ వెవరో యుద్వేగులై నోటి గా
టింకన్ గోసినవట్టికోఁతలకు నీ వేలాగు లక్షించెదో.

శా. మొనగాఁ డొక్కరుఁ డాఱుమాసములు సాముం జేసి మార్మూలఁ బం
డినభీపెంపున డాఁగియున్న ముసలాపెం బోరికిం జీరులా
గునఁ గూపస్థితదర్దురప్రకరదుర్ఘోషీవిరావార్భటీ
జనితాహంకృతి కాఁడవై పెనఁగు లేచందంబు నీ కోఁటికిన్.

శా. "ఏదో నన్ననినారు గాన సభకీ రేతెంతురా!" యంచు వి
ద్యాదత్తుండు వచించు(గా, కితరు లాతం డెవ్వ(డో, వాని వి
ద్యాదర్పం బది యెట్టిదో, యెఱి(గి యేలా పత్తు! రేలా యనం
తాదారుం డిది యిచ్ఛగించు? నిజవిద్వత్స్వారసంవేదిర్యై.

మ. ఉరువేగస్ఫురణాగపాటనపటుద్యోవాహినీవార్ఝరీ
పరిణాహారభటీపటాత్కృతులకున్ బ్రభగ్నప్రసారంబులౌ
తరుషండంబులు నిల్చునేని భవదుద్యద్వాగ్ఝరాసారపు
ప్కరకోలాహలముల్ సహింప(గలుగున్ గాకవ్యహంకారముల్.

చ. కలదుగదా! యశోధన, మఖుండు లనేకులు మిత్రు లున్నవా
రెలమి(గవిత్వరాజ్యరమ నేలుచు నుంటివి మున్నెయైన ని
శ్చలగతి నుండ కేమిటి కసారులతో(గలహమ్ము, లక్కటా!
తెలియవె "వృద్ధనారులు పతివ్రత"లంచు వచించు న్యాయముల్.

శా. ఉంఛుంగావృత శిష్యు(డొక్కరు(డు మాయోపాయమిథ్యావచో
ఖండప్రాభవశాలి నిస్తులకృతఘ్నత్వానుసంధాయివా
క్కాండుం డాతని సాదుసేయు టది నీశక్యంబె? నీ ముంద రా
తం డెట్టుల్ నిలుచున్ సభాస్థలిని? గాతర్యంబు బాధింపదే? 152

ఉ. తేజ మెఱుంగలేని యొక ధీరవిచారు(డు సారెకున్ మహా
రాజును "మాల" యంచు( దన గ్రామములో( దన వంటయింటిలో
భాజనముల్ వినన్ బలుకు(, బ్రాజ్ఞు(డు దానిని లెక్కసేయునే?
యేజను(డేని( జెప్పిన మ తేటికి ధాటి వరాటకోటిపై.

శా. "ఊరున్ బేరును లేక యెక్కడియెడ నెట్లో యెట్టులో యున్న యా
ధీరమ్మన్యుల పేరు పైకి నిత(డే తెచ్చెన్, వినిర్జించు(గా
కారంభింపక మున్న వెన్నిడెడి విద్యాభీరులన్ వైరులన్
బోలుంబోతుల( దోలి లాభమ, యశంబా?" యండ్రు నిన్నున్ జనుల్.

ఉ. దగ్గఱవారికిం దెలియు( దత్త్వము; దూరపువార "లిర్వురున్
దగ్గఱ తుల్యులే" యనియు( "దగ్గిన నించుకమాత్రమే"యటం
చెగ్గులు చెప్పికొందు రిది యేటికి మాన(గదయ్య; వారి యా
వగ్గులు లోకమే యెఱు(గవచ్చు( గ్రమమ్ముగ నా(డునా(టికిన్.

శా. "మొట్టో మే మనలే దసత్య" మను నమ్మొత్తున్ వినన్ రాదె!, యీ
చిట్టుంబుట్టు లి(కేల? చేసియును "నే( జేయంగ లే" దన్నచో

వత్తావందగు దోసమైన సతురిం బావశ్యకమ్మెంచు రీ
వెత్తెన్ మానఁగదయ్య! కాకవిగణోర్వీజాతఝంఝానిలా!

మ. అవధానం బన నెట్టిదో యెఱుఁగరం చవ్వానికిం బెట్టు చే
శ్ఛై విశేషించి వచించు "ధారణము లేనేలేద"టం చందు, వా
రివచోగుంఫమె సాక్ష్యమిచ్చు, "నిదివో వృత్తమ్ములిం" దంచు వ
య్యవధానమ్ములె చెప్పు, నే తెలుఁగ రీ వ్యాపార రూపం దగున్.

ఉ. ఆసభఁ జూచి రెందఱు మహాత్ములు నందఱు నొక్కపెట్టఁగాఁ
'గాసరకూసరయ్యె' నని కాని వచింపరు మేలి మాట; నీ
కీసు జనించుఁగాక, జగ మేటి కసూయ వహించెనో! రసా
భాసము గాకయున్న నొక పద్దెము నొక్కరుఁ డేని యిచ్చెనే!

*శా. శాంతింపంగదవోయి! దుస్సలతనూజాతుండు మున్ గ్రీడి వి
క్రాంతిం దా విని యేమిచేసెఁ? గురువీరవ్రాతముం గాంచుపై
గంతుల్ మానఁడె యుత్తరుం! డకట, కంగారైన యవ్వారిపైఁ
గంతుద్వేషిశిరస్సరద్వరఝరీకల్లోలముల్ నించెదే!

† శా. వీఁకన్ దమ్మును గోకిలమ్ములుగ నుర్విం బోల్చు విద్వాంసులన్
గాకుల్గా, బకముల్గ, గప్పలుగఁ, గోకశ్రేణిగాఁ జెప్పు ని

---

*శా. "శాంతింపంగదవోయి" యంచుఁ గడు వాత్సల్యంబు పెంపార మీ
యంతశ్శాంతి వచించెఁగాక; కలరే! ద్యావాపృథివ్యంతరా
శాంతవ్యాపకసుప్రసిద్ధగురుశిష్యవ్యాయవిచ్ఛేదివా
గంతేవాసికృతాపరాధసహనవ్యాపార పారాయణుల్.

మ. గురుధిక్కారణకారణం బయిన మత్కోపాగ్ని కీ కర్తృణాం
కురముల్ చాలిన యింధనంబు లగునో కో! దాని నార్పన్ ఘనుల్
దొరకో నేటికిఁ! దోడుగా నితరులం దోరించుచో నాఁడు కా
తరులం బ్రోవఁగ మీ ఘనప్రకృతిచేఁ దచ్ఛాంతి చేయందగున్.

శ్లో॥ యః కశ్చిత్త్రిసరేణు రల్పధిషణః కామం కృతఘ్నో రటేత్
కిం తేనాలి పరిత్యజంతు కరుణాం వంతో భవంతో ఽధునా
నిందా మా స్వమహాత్మన స్వ సహతే సవ్యాకృతివ్యాకృతి
ప్రజ్ఞావర్ధితసాహితీసుకవితా సర్వంకష శ్రీపతిః. తి॥ శా॥

† తే. గీ. కాకి తోడేలు చక్కవ కప్పు గొంగ
లార! కేలెత్తి మ్రొక్కెద యడిగికొనెద

ర్భికముల్ బంధుమువు లోఁజిక్కుచుండ గుణముల్ భీ మాన్యుఁగాఁరేరో! యీ
యూకంపం బది యేల? నిన్ గెలువరాదా వారి గారామునన్ ?

క. ఏల ఫికి మ్మన్నల్లలతోఁ
బోలనివాదమ్ము! లుబ్ధుసుపోకకు నీకీ
బాలకవు లేడ దొరకిరి!
చాలుం జాలింపు మీ విచారణ లింకన్.

క. "పనిలేని నాపితుఁడు పి
ల్లినిగొఱిగె" నటన్నరీతి లేకులతోఁ జో
రొనరించి మెచ్చు గొంటువె?
జను లెఱుఁగరె యెవరి శక్తిసామర్థ్యంబుల్ !

చ. ఎఱిఁగినవార లేని నృపు లీ వొనరించిన పద్దెముల్ చెవిన్
జొరఁబడుమీఁద నీ మొగముఁ జూడక యేగతి మిన్నకుంద్రు ! మం
తిరి తిరి వెట్టుఁగాక, కులదేవత వద్దనుగాక, లేక తొం
దరపను లుండుఁగాక, రసతత్పరుఁ డాఁగునె యిట్టిపట్టునన్ !

క. నాకే ప్రభుత్వ ముండిన
నీకవితాధారఁ జూచి నీ వాకచో నా
వాఁకిటికి రాకయుండిన
నీ కడ కేతెంచి కోరనే నీరాకన్ ! 164

తే. గీ. పాండవోద్యోగమునకుఁదోడ్పడు చటన్నఁ
దీర దన్నట్టివాఁడ వీభీరుకలహ
మునకు నేలాటి ధారను ముంచియెత్తి
తంపు మిఁకనైన నేఁ జెప్పుమన్న కవిత. 165

ఉ. "జీలుగు బెండ్లు మీ" రని వచింపక పూర్వమె "జీల్గుబెండ్లమే
జీలుగుబెండ్లమే" యనుచు సిద్ధపడందగు బుద్ధిమంతులన్
బోలునె నీ వెదుర్కొనఁగ ! బుద్ధులు కర్మముఁ బట్టి పోవుఁగా
కేల యెదుర్కొనం గడఁగి రిట్టి ప్రబుద్ధులు నిన్ను శ్రీపతీ!

---

గలకలము మాని విననిందు పలుకుచుండెఁ
గండుఁగోయిల వీనులపండువులుగ. (కవిత 2వ సంచిక చూ.)

సీ. తిరుపతి వేంకటేశ్వరుల పేరులఁబట్టి తమపేరు లోనఁగూర్పఁ దలఁపవలయు
వారి కబ్బములఁజొప్పడు పద్యముల పాదములను దస్కరణంబుసలుపవలయు
నుప్పుపత్తిరి లేనియప్పు డవ్వారి శిష్యోపశిష్యులపోల్కె నుండవలయు
సేకణంబులో సంగ్రహించి యాపైఁ గృతఘ్నతకల్మిఁగోకిలల్ గాఁగవలయు
తే. గీ. మీఁదఁ దిరుపతి నెదిరించి "మెమ్మెమే" య
టంచు "డెంకాయ పిచ్చికొం" డనగవలయు
నంచు దైవంబు నొసట వ్రాయంగఁబోలు
లేక యుండినఁ గలవె యీ లేకిపనులు.

* ఉ. కాకము నేవఁ టూయన పికం బఁట ! తాను గృతఘ్నుఁ డౌట కీ
కోకిల నేర్ప నంట ! వెఱిగొల్లలు మేఁకలఁ బట్టి నేర్చుకో
లే కెటు పోయిరో మిథునలీలలు ! దుష్పథ మూన రాదుగా
కే కుటిలంపుజంతువులో యేరికి నేర్పవు దుష్ప్రపత్తనల్ !

---

* కాకమా ! నీవు నల్లనిదానవు. నీ కంఠధ్వని కర్కశఘోరము. కావున నిన్నెవ్వఁడు గనుఁగొనఁడు. సుఖమున దుఃఖమున, సంపదయందు నాపద యందు, వసంతమున వర్షఋతువున, నొకప్పుడన నేల ? ఎల్ల వేళలయందు నుందువు. నిన్నెవ్వరు గనుఁగొనకుండుట కిదియొక మూలకారణము......... అన్నా ! నీ పట్టి యనాదరమునకు నట్టి నిగ్రహమునకును భాజనమైతివా? అయ్యో ! భగవంతుఁడు సృష్టికర్త నిన్నిట్లలచేసెను ?......... నీవును నల్లని దానవే. కోయిలయు నల్లనిదే. నీవును గూయుచున్నావు. అదియును గూయుచున్నది. మీ రిరువురు గాయకులే మఱి యిఁక విశేషమేమన—కోయిల యాదరణీయ మయ్యెను, నీవు గర్హణీయమనైతివి. దీని కేమి కారణము ? అది సమయోచితముగ గానము సేయుచున్నది. నీ వట్లు చేయవు. కోయిల వసంతాగంధమున మృదుమలయానిలవ్యావర్తితం బగు రసాలపల్లవము చెంత నధివసించి యభినవజ్యోత్స్నా సముద్భాసమానంబు లగు దిగంతముల ముఖరితములఁ జేయు నా ధ్వని నాలకించి జగ మెల్ల మిగుల మోహించును.........నీవు మాత్రము నీ ప్రాగల్భ్యమును సమయానుగుణముగఁ జూపించుటలేదు. దానివలె నుత్తరంగిత మగు స్వరలహరిచె నీజగమును వ్యామోహపెట్టుటయు లేదు. ......... కావుననే నిన్నెవ్వరును బ్రేమింపరు. నీ గానతత్త్వము నెఱుంగ నెవ్వరును బ్రయత్నింపరు. ఎల్ల యప్పుడు వినుచున్న నీగానము నెవ్వరును వినరు. కావున నీ యన్నమును దిని పెఱిఁగిన పరపుష్టము సమయానుగుణముగ నొనరించి జయము

ఉ. "బాబుకుఁ బెండ్లి యయ్యె నని బాలుఁడు సంతసమందెఁగాని మే
కై బహిపెట్టు చెట్ట సవతమ్మ ఘటించు టెఱుంగఁ డయ్యె!" నౌ!
రా, బధిరత్వ! మేము బికమైతిఁగదా! యని యుబ్బెఁగాని యీ
శా బకపుంగవీశ్వరుఁ డెసంగు కృతఘ్నతఁ జూడఁబోఁడహో.

మ. అనుకొన్నట్లె యొక మానె కాకి? శునకం బావానె? యానే గజం
బెనుఁబో? తానొకొ పిల్లి పెద్దపులి? యా యీ జంతునిష్ఠంబు సు

---

నొందె ననియు నీవు సమయాసమయములను లోకమర్యాదను దెలియనిదానవై నిజస్వభావమునే యవలంబించి పరాజయము నొందితివనియుఁ జెప్పుచున్నారము. ఈ ప్రపంచమునను మీ వంటివా రనేకులు గలరు. తఱచుగ వారిలోఁ జాలమంది కోయిలవంటి వారలే. తఱచుగఁ గోయిలవంటివారికే మిగుల శ్రేయము. ఎల్లప్పుడు నేకస్వరంబున నీచమౌ గానము చేయువారలు పరిస్థితుల నొక్కప్పుడును జయింపలేరు. ఓ వాయసకులతిలకమా! ఈభువనమున నందఱను జయించి వావదూకత్వము నొందుటకును నేర్పున జగమునెల్ల వ్యామోహ పెట్టుటకును నీవు కోరుదువేని సమయానుగుణముగఁ బ్రాగల్భ్యమును జూప నభ్యసింపుము. చిరకాలోపనతంబగు నీరాగమును బరిత్యజించి మంజులముగ గానముఁ జేయఁ బ్రయత్నింపుము. అవునుగాని, నీ కట్లు చేయ శక్తిలేదు. ఏలన నీవు కాకమవు, కోయిలవు గావు. కావున నో కాకమా! నీ వెన్నటికిఁ గోయిలవు కాకుము. ......... నీ వన్నివిధములఁ గోయిలకుఁ బినతల్లివంటిదానవై తివి. యుక్తవయను వచ్చువఱకుఁ బినతల్లిచే సాదరముగఁ బెంపఁబడి సుఖముగ నున్నవారలయ్యుఁ బిదపఁ దల్లిదండ్రులను నిందింప వెనుదియనికొండఱు నవనాగరికులవలెఁ గోయిలయు నీయెడఁ గృతజ్ఞతను వహించుటలేదు. ......... నానాప్రదేశములనుండి యొక్కొక్క తృణమును సంగ్రహించి యొక చిన్నగూడు కట్టుకొని యా గూటిలోనే కోయిలపిల్లను పెట్టుకొని గృహస్థధర్మములఁ బరిపాలించుచుంటివి ... జగము నిజముగ బాహ్యాడంబరములచే మోసపోవుచున్నది. నీ స్వతస్సిద్ధములైన యౌదార్యాది సద్గుణములను బిగ్గరగఁ దాళలయానుగుణముగ గానముచేసితివేని యప్పుడు నీవును బ్రసిద్ధిఁ జెందుదువు. ఇది నీకు సాధింప నలవి గాదు. ......... అన్నా! నీవు వచ్చి మాయింటిముంగిట నెండి యున్న మామిడికొమ్మపై గూరుచుండి తడిసిన ఱెక్కలను బటపట దులుపుకొనుచు యథాప్రకారముగనే కూయుము. మేమును నిన్ను బహుమానింతుము.. (కవిత)

స్వనముఁ శుద్ధియు ధీరతాగరిమయుఁ జండాలిచండత్వముఁ
దన కేలాగు ఘటించు ? వర్ణసమతఁ దత్తద్గతుల్ గల్గునే !

సీ. కాకకోకిలముల పోకలం బట్టి యెవ్వాఁడు వేటకునితో వైర మూను ?
మేఁకపోతులఁ జూచి వేలుగీతి యటంచు నెవ్వాఁడు తల్లితో నవ్వులాడు?
నాలమందలఁ జూచి యహా ఒళీ ! యిదియంచు భక్షించు నెవ్వాఁడు పచ్చికసవు?
తురకబిడ్డలఁజూచి సరియంచు నెవ్వాఁడు పినతండ్రి కొమిరెలఁ బెండ్లియాడు?

తే. గీ. పక్షులంబట్టి పశువులఁ బట్టి యితర
మనుజులం బట్టి నీతులు మనకుఁ గొన్ని
గలవు నేర్వంగ నివి కావు కావు కావు
పిల్లకాకి యెఱుంగునే వింటిదెబ్బ!

ఉ. కాకి గురూత్తముండును పికంబును శిష్యుఁడు నౌట కేగుణ
శ్రీ కరమో, విచారణము సేయఁ గృతఘ్నత యొండు పక్క వే
ఱే కనరాదు హేతువు; పరీక్ష యొనర్ప నపశ్రుతిస్వరూ
పాకులగాత్రముల్ గలవె యక్కట, కోకిల లెక్కడేనియుఁ !

క. "కోకిలము కృతఘ్నత్వము
కాకియెడం జూపెఁ" నంచుఁ గాకవి చెప్పం
గాక, యది యెట్లు సరిపడు
నీ కల్పన సమ్మతింతురే సుకవీంద్రుల్ ! 173

తే. గీ. కాకి నామరూపమ్ములు గలుగఁజేసి
కోకిలమ్మను బోషించుఁ గొన్నినాళ్లు
అంత ఱెక్కలువచ్చునై నవలి కేగు
నంతమాత్రఁ గృతఘ్న మెట్లౌను పికము ?

క. మతిమాలిన మా టిది "తు
ష్యతు దుర్జన" యన్న నీతి నంగీకారం
బతికించుకొంద మన్నను
బ్రతిపక్షికి లేశమేని ఫల మున్నదియే ? 174

క. ఇది "సహృదయ" యను పత్రిక
బోదలెడునది యనిన వారు బుద్ధిగలిగి చూ
డఁదగదె, "ఎను బోధీన
యది" యనఁ గట్టుమని చెప్పనగునే చూడన్ ?

సీ. కల్లుద్రావుమనొక్క! కలఁడల్ల బలరాముఁడనియెంచియెవ్వ రేనలఘుమతులు
జూదమాడుమనొక్క సూచు తేరేని ధర్మాత్మజాతుండు దృష్టాంత మనుచు
తల్లిఁజంపుమనొక్క! తగ వేచి యెవరేని బరశురాముండున్నవాఁ డటంచు
కుక్కమాంసము తినుమనొక్క! విశ్వామిత్రముని మాలి యున్నవాఁడని తలంచి

తే. గీ. ఉత్తమగుణంబు నేర్చుకో నొప్పుఁగాక
యధమగుణమున కకట! దృష్టాంత మేల?
కోకిలము గాఁగఁ జక్కని గొంతు వలయుఁ
గాని కృతమును మఱచుట గాదు సూవె!

చ. మన మొనరించునట్టి పని మాన్యుఁడునుం బొనరించుఁగాక ; యా
తనికి యశంబు దెచ్చినది తత్కృతియో, మతియొక్కటో ? యెఱిం
గిన నరుఁడేనిఁ దా నొక యకించనకార్యము సల్పియుఁ నిద
ర్శనముగ నాతనిం గొనఁడు; సార మసారు లెఱుంగ నేర్తురే!

సీ. కొండెగాండ్రంద ఉద్దండగాయకవరేణ్యుఁడు నారదునికీర్తి నొందఁ బోరు
కొంప లంటించు దుర్గుణరాసులెల్ల శ్రీయాంజనేయులసాటి నందఁ బోరు
పరభార్యలనుగూడు దురితాత్ములెల్ల దేవేంద్రుతో సామ్యమ్ము నెనయఁబోరు
అనృతమ్ములాడు నీచాచారులెల్ల సాక్షాద్ధర్మరాజులై గ్రాలఁ బోరు

తే. గీ. ఒరు లొనర్చిన మేలును మఱచి “తిన్న
యింటి వాసాలు లెక్కించు” దంటలెల్లఁ
గోటిజన్మమ్ములకునైనఁ గోకిలములు
గారు సూ! కాకవిద్విపగర్వహారి!

ఉ. కోరుటువార లప్పు నొగి గూబలు నల్పి వసూలు చేతు, రె
వ్వారు కృతఘ్నతాప్తి గురువర్యుని గాకముమీఁదఁ బెట్టి య
వ్వారిగఁ బట్టి తాము పికవైఖరి గంటిమటన్న తృప్తిఁ జె
న్నారుదు? రట్టివారి కెవ రయ్యెదరయ్య జగాన శిక్షకుల్!

క. “గురుఁడను నే”నన “మీరా!
త్వరపడి మా బాబటంచు భావించితి నీ
పొగపోటు సైఁపుఁ” డను ధీ
వరు లెప్పుడు గలరు సూ! ప్రపంచకమందున్.

క. “వంటింట సిట్టికృతి తగ”
దంటకు నొక్కింత కొంకి “యా నిది తులసీ

"మంటప మనుకొంటి" నసెడి
దంట లిపుడుఁ గలరునా! శతమ్ములు వేలున్.

ఉ. ఉండఁగ నిమ్ము వారిక మహోదయమందము గాక యింత బ్ర
హ్మాండము మోయునట్టి పరమాత్ముఁడు వారిని మోయలేఁడె! లే
కుండిన నిట్టిసృష్టి కెటు లొప్పెడి? దేవునిదృష్టి తేఁటిపై
నుండెడునట్లు తేలుపయి నుండు నఖండుని కేటిభేదముల్!

క. తేఁటి యితరకీటమ్ముల
మాటికిఁ దనయొద్దఁ జేర్చి మంతిరించుచు నా
నాఁటికి నాత్మభేదము
వాటించున్ దేలు వీలువడఁ బడఁ గుట్టున్.

ఉ. ఎందుల కీవివాద? మిది యెవ్వరుతీర్తు? రరణ్యరోదనం,
బందఱికిన్ భవత్కవితయందలిసారి మెఱుంగవచ్చె, వా
రిందుల కుత్తరం బిడుట యెట్లు ఘటించెడి? నిన్నెదుర్చు శ
క్తిం డమ రెడ నుండి కొని తెత్తురు? చిత్తరు వేమి చేసెడిన్!

మ. మనలన్ జూడరు మాట లాడ రెపుడున్ "మద్దేశికుల్ వీ" రటం
చనువా రెంపఱు లేరు! వారిపయి రోషావేశమున్ జూపితే
"యనృత మ్మాడి" రటంచు? నీతని యసత్యం బట్టులే నైఁపు మె
ప్పనికి న్నష్టము దీన నానా గుఱుతింపన్ లేరె లోకుల్, సఖా! 185

మ. మనశిష్యుం డనినంత నేమి యగు! సన్మార్గుల్ ప్రశంసింప ధీ
శనిరై పోచ్చెము లేని యాశుకవియై కష్టావధానమ్ములన్
ఘనులౌ వారలమెచ్చు లేని కుహనాకల్ప ప్రవిష్టుండు, శి
ష్యునియజ్ఞాము దేశికున్ జడు నొనర్చుం గాదె విద్వత్కవీ!

చ. చరలకలాక్షిచంద్రుని ప్రశంసయు లేదొకపట్ల, నట్టియు
క్కరమలు గల్గఁ బద్దెము నొకండును దా లిఖియించి నట్టి దా
ధరణిపుసన్నిధానమునఁ దాఁ బఠియించిన దేది? చూపినన్
గురువులకెల్ల నయ్యది యొకొండె నివేదనయై చెలంగుతన్.

ఉ. నే నొకచర్లబ్రహ్మయ మనీషినె పేర్కొనినాఁడ నంట! తా
నా నియతిన్ జరించెనఁట! యట్టిప్రధాన గురుండు వీఁడె యాఁ
గాని కలాక్షిచంద్రుఁ డెటు గాఁడగుఁ? దప్పొనరించి యింక న
ద్దాని సమర్థనమ్మునకుఁ దాఁ బడుపాటు లెవం డెఱుంగఁడో.

సీ. రఘువంశము భుజంగరాడ్గురుసన్నిధి నింపుమీఱఁగఁ బఠియించినాఁడ
శ్రీపాద కృష్ణమూర్తికవీంద్రునికడ నైదు మాసముల్ శుశ్రూష చేసినాఁడ
కాజులూరను నూరఁగామసోములయొద్ద నొక మూఁడుమాసమ్ము లున్నవాఁడ
చామర్లకోటలోఁ జదివితి రాఘవాచార్యసన్నిధిని మాసత్రయమ్ము

‡ తే. గీ. పైన నవంతార్య నూరయపండితు లిరు
వురును మూఁడుమాసమ్ములు గురువులైరి
పిదప శ్రీబ్రహ్మయామనీషి పేరు దెచ్చు
గురుఁడు నాకయ్యెఁ దన కట్టిగురుఁడ చేను.

తే. గీ. "ఎవఁడు నెట్టిముండాకొడు కీనమున్న
వాని"దన "నేనె" యని చెప్పువానిరీతి
నాకుఁ జేకూరి నందుకు నవ్వఁ బోకు
మయ్య! యేనాఁటి కేమానొ యరయఁగలమె.

క. శ్రీకరము భాగవత మే
నాకృతికిన్ గృతి యొసంగ, నది కాదని నా
కీకవి కాకవ్యాసము
"కైకొను" మని కృతి యొసంగెఁ గడుభక్తిమెయిన్. 191

తే. గీ. మధునపంతుల నూరయబుధునియొద్దఁ
జదివె ముందట, నామీఁదఁ జర్లకులజు
నొద్దఁ బఠియించెఁ, బిదప నాయొద్దఁ జదివి
కోకిలం బయ్యె; నింకొక్క గురు నెఱుఁగడు.

శా. ఓ, నా, మా, లను జెప్పు నొక్కగురుఁ, డింకొక్కండు దా నక్షర
జ్ఞానం బించుక వృద్ధి సేయుఁ, బయి శాస్త్రం బింక నొక్కండు రాఁ
గా నేర్పున్, గురుమాతృలెల్లరు నమస్కారార్హులే యైన, వి
జ్ఞానం బబ్బినచోటు ప్రప్రథమవక్తవ్యంబు శ్రేయోర్థికిన్.

* చ. కను మిది నన్నుఁగూర్చి "కవిగండఁ" డటంచు నొకంటఁ బద్యముల్
మును రచియించి యిప్పుడది ముద్రణమందునఁ ద్రోసివేసి రీ
ఘనమతు, లంతమాత్రమున గండర గండఁడఁ గాకపోతినో
మును పెటులైతినో! యివియపో మనకోకిలకున్న యోజనల్.

‡ గురుపరంపరను దెల్పు పద్యములు తుది పుటలోఁ జూడఁదగు.

* "........వెనుక వీరు యానాంలో శతావధాన మొనర్చినప్పుడు తమ

క. కోడియుఁ గుంపటి లే కే
"జూడం దెలవాఱు నన్న" సామెతగా వీ
రాడినమాట నశించినఁ
గాఁడే గండండు వీఁడు కాఁ దగియున్నన్.

చ. తినునెడ రాయి రాఁగఁ గసి దీఱఁగ వైష్ణవుఁ డిట్టివాఁడె లిం
గనిగ భ్రమించి తాఁ గొఱికెఁ "గట్టని" నెట్టనఁ బండ్లు వోయెఁ జే
ర్కొని యది ముద్రణంబునను గూర్పనియంతన పోయెనొక్కొ! వ్రా
సినజను లుండరే? యది నశించెనె! వారిని వారు వ్రాసిరే!

క. పంచాంగమ్ములు చించి "న
శించెన్ జుక్క" లను గణకశేఖరులకు వీ
రెంచఁగ నన్నలొ, తమ్ములొ!
కించిత్సంబంధ మున్నక్రియఁ జూపట్టెన్. 197

సీ. చామర్లకోట స్టేషనువద్ద జరిగిన చిత్రమ్ము వినుమయ్య! చెలిమికాఁడ
అల పురాణపు వెంకటప్పయ్య రావుబహదరుగారును వారి యనుజుఁడైన
నాగభూషణముగా ర్నొకటఁ బొడకట్టి రవ్వారితో మాటలాడునప్పు
డీకోకిలయు వెంటనే యుండె నవ్వార లడిగి "ఈతం డెవ్వ" రనుచునన్ను

తే.గీ. నే వచించితి "రావునూర్యేంద్రుశతవ
ధాను" లని, తా వచించె నీతండు "వీరి

---

సహాయములేనిదే వారేమియుఁ జేయలేక పోయిరను ననేక దృష్టాంతములచే నొక వ్యాస మేపత్రికకైన వ్రాసి ప్రకటించుటకు నా కనేక దినములనుండి యభిలాష కలదు........."

16—3—1911, వంటెద్దు రెడ్డినాయుడు.

'.........ఆపద్యము ఒకప్పుడు వెం|| శా|| గారి మీఁద చెప్పినామని చదివిరిగాని నాకు కంఠపాఠముకాదు. ధారణకు తెచ్చికొని యిందువ్రాసితి, నాల్గవపాదము నాకు విశ్రమస్థానమునుండి జ్ఞాపకము చాలదు.........యింత వరకు 'మాకు శతావధాన మసమాన" అని కొంత జ్ఞాపకము." వెం|| సు|| రా||

ఉ. ప్రాకట సత్కవిత్వ పరిపాటిని మేటిసభాంతరమ్ములన్
వీక శతావధానములు వేనకు వే లొనరించి యందు ము
క్కాకలు దీరినట్టి కవిగండఁడు వేంకటశాస్త్రియుండఁగా
(మాకవధానపుంగృతికి మానసమందుఁ దలంక నేటికిన్)

శిష్యుఁడనె" యంచు సభలోనఁ జెప్ప కప్పు
డేల చెప్పంగవలయునో యెఱుఁగరాదు.

శా. ఆనాఁడే కననయ్యె నయ్యెడల విద్యాదత్తుఁడౌ శ్రీరి కా
శీనాథాఖ్యబుధేంద్రుఁ ; డయ్యనఘులో శిష్యత్వమున్ దెల్పె నీ
మానవపార్థివశాలి, రాజసభలో మన్నామసంబంధ మెం
దేనిన్ సుంత వచింపఁ బాపమయి యప్డేలాగు గాకుండెనో!

ఉ. ఇంతకు నాల్గురోజులయి యే నిటఁ దుండెడి యూరికేగి "నా
చెంతఁ బఠించి రాజసభఁ జెప్ప, నొకుత్తర మేని వ్రాయ వే
వింత యి" దన్నఁ గోకిలయు వెల్వెలఁ బోవుచు "నారికేళపుం
జెంతకు గడ్డికై చనుట" చెప్పెడి సామెత నుత్తరం బిడెన్.

తే. గీ. రాజసభలోన నల్లచర్లకులచంద్రు
శిష్యుఁ డగుఁగాక యీతండు చింతలేదు
పిదప నొకయుత్తరము వ్రాసి ముదము గూర్చు
పాటి విద్దెయు నావల్లఁ బడయఁ డోటు? 201

ఉ. "సత్కులమందుఁ బుట్టితివి సత్కవి వెంకటశాస్త్రిఁ గొల్చి యా
షత్కవనంబు నేర్చితివి చాలుఁ గృతఘ్నతఁ గాంచనేల, యా
పత్కర" మంచుఁ జెప్పితివి బాగునకై మదిఁ గోరి; దానిచే
నుత్కటమయ్యె నాతని మహోద్ధతి నీ విఁక నేమి చేసెదో!

ఉ. అర్భకులంచుఁ దమ్ముల మది నారసితంట! యెటుల్ ఘటించు నా
దుర్భరమైన మీసములు దొడ్డది గడ్డము నొడ్డు పొడ్గు పై
నర్భకు లొక్క మాఁగు,రెప రాడుదు రర్భకులంచుఁ దమ్ముల! మా
నిర్భయనిస్త్రపత్వములు నీ కెటు మాన్పఁగవచ్చు శ్రీపతీ.

చ. గురుధనమే హరించి తనుకొందము దానికి నెన్నిరెట్లులో
యురువగు దేవిభాగవత ముత్తమగ్రంథ మొసంగి దేశికా
దరమున కాలవాలమయి తత్కరుణన్ సిరి గల్గి నందన
స్ఫురణ మెలర్ప నొప్పెదవు పో! యవివేకవివాద మేటికిన్.

చ. ఇది తగునే యటంచుఁ దను నీవిపు డంటివి, విఁక కొక్క రెవ్వరో
మది గలవారు నీవలెనె మంచిది గాదని మందలించుచో
నెదిరియొ యొకండు నింద పయి నెట్టులొ పొల్చి కృతఘ్నతన్ వెలా
ర్పఁ దలఁచునొక్క! యెంతటి యుపాయము నేర్చెను శిష్యుఁ డద్దిరే!

ఉ. పత్రికలందు, బాలుర యపత్రపతేమిగుఱించి శ్లాఘ్యచా
రిత్రులు న్యాయవేదు "లరరే! యిది యెక్కడిపాప" మంచు స
ర్వత్ర హితమ్ముఁ జేర్కొనుచు వచ్చిరి, వారలఁగూడ నిట్టులే
ఘాతుని "లపాత్రు" లం చనఁగఁ జాలఁ బ్రయత్న మొనర్తురో కదే.

శా. ఇచ్ఛామాత్రమునన్ బ్రబంధముల నెన్నేనిన్ రసారామపుం
గుచ్ఛమ్ముల్ బలె సృష్టి సేయు నిను నెగ్గుల్ బల్కఁగా కీతఁ డ
స్మచ్ఛాఖీయుఁడె కాక బందుగుఁడు మచ్ఛాత్రుండు గాకుండుఁగా
కచ్ఛమ్మైత్రవ కొలమ్మువాఁ డితని నాకై నీవు సైరింపవే.

క. నీ వెంత కాలు దన్నివ్విన
మావాఁ డతి శాంతమూర్తి మాటాడఁడు లో
నేవో చాటుగ ననుకొను
టే వానికి మాన్పవచ్చు, నెందుకుఁ జర్చల్ ? 208

శా. 'చూడంజాలని' మాట సత్యమె, యెటుల్ చూడంగనౌ! శిష్యుఁడౌ
వాఁ డీకీతిఁ గృతఘ్నుఁ డౌటయుఁ, బరిభ్రష్టాపధాన క్రియా
పీడుం డౌటయుఁ, జేతఁగాని కవితన్ బెంపెది యల్లంతఁబో
కేఁడున్ లేఁ డని విఱ్ఱవీఁగి తుద కిట్లపాటు గైకొంటయున్.

శా. 'చూడంజాలని' మాట సత్యమె, యెటుల్ చూడంగనౌ! వట్టి యా
యాడంబంబులు, కుంటి గ్రుడ్డికవితల్, హేయాతిహేయమ్ములౌ
దూడల్, కూడని పోఁడుముల్, విఱుగులున్, దుర్వారగర్వోచ్ఛ్రతల్,
త్రాడున్ బొంగ్రము లేని యాటసుడుకుల్, తద్వ్యతరాలాపముల్.

శా. 'చూడంజాలని' మాట సత్యమె, కుశిష్యున్ గర్ణునిన్ దుర్ణయుం
జూడంజాలెనె భార్గవుం, డల వసిష్ఠుండు న్నిమిన్ శిష్యునిం
జూడంజాలెనె సాపరాధు! ననయున్ శుక్రుండు వక్రాశయుం
జూడంజాలెనె రావణున్! వినఁడొకో శుద్ధాత్ములౌ పూర్వులన్ !

శా. 'చూడంజాలని' మాటయే నిజము, శిష్యుండైన రంగార్యుఁడీ
జూడం జూపఁగ దండిభట్లకులభాస్వజ్జ్యోతి, భాష్యాంతవి
చ్ఛూడాలంకృతి, విశ్వనాథబుధుఁ డీసుం జెంది యంతేవస
చ్ఛూడాభారము వాపకే విడిచెనే, నూరుల్ ప్రశంసింపరే !

శా. "చూడంజాలక" యాట కర్థ మిది, శిష్యా! డొక్కరుం డాత్మకుం
బీడం గొల్పు కృతఘ్నతాభరము మైఁ జేకొంద నుంకించు నా

జాడం గొంత యెఱింగి లోకులకుఁ దత్సత్త్వంబు సత్యంబునుం
గూడం దెల్పి యథార్థమార్గమునకుం గొంపోవ యత్నించుచుటే.

క. 'కుండలలోఁ బాండిత్యము
దండిగఁ గలవాఁ' డటంచుఁ దమ గురుపుత్రున్
దుండగమున నిందించిన
పండితు లవ్వారి కుండవలదే తెగువల్. 214

మ. యతియున్ బ్రాసయుఁ గూర్చుమాత్రఁ గవియే! యామాత్రపుం దెల్వి యీ
క్షితి "యంబ్రహ్మల" కుండ దెందఱికి! వాసిన్ మీసముల్ దువ్వి యే
ప్రతినన్ దా నొనరించు దాని సభ నిల్పంజాలు నెవ్వాఁడు, ని
ష్పత్తిముండాతఁడు; నోటివాడుకిఁక "యంబ్రహ్మల్" మహాపండితుల్.

*మ. ఎఱుఁగన్ జాలరు బుద్ధిమంతు లిసిరో! "యింటింటి పూజారు" లం
చఱసంకోత్తురు విఘ్నులుంబలెనె, యాహా గాగ! బాణున్ యశ
స్కరు నేమంచుఁ దనూభవుండు వొగడెన్ గాదంబరీకావ్యమున్
సరిగాఁ గన్నులు రెండు విప్పి కని చర్చన్ జేయ విస్పష్టమా.

ఉ. ఒక్కఁడు శిష్యుఁ, డింక నొకఁడో పరికింపఁ బ్రశిష్యుఁ డయ్యె, నీ
ప్రక్కకుఁ జూడ నీవు సహపాఠవి, మాగురి మందలింపఁగా
హా కొక్కకయింత నాకుఁగల; దైనను లాభములేదు. నారు చె
ట్టైక్కిరి కోకిలమ్ములయి; యిక్కతన న్నిను మందలించితిన్.

చ. ఇది విని యేరిశిష్యుఁడును నిట్టి కృతఘ్నత చూపకుండుఁ గా;
కదియును గల్గెనేని గురుఁ డాచతురున్ క్షమియింప కుండుఁ గా;
కెదిరిని దమ్ముఁ దా మెఱిఁగియే చరియింతురుగాక యేరు; స
త్పదము దొరంగియున్ మరల దారికి వత్తురుగాక యుత్తముల్. 218

---

* శ్లో॥ అర్ఘ్యం య మర్చతి గృహేగృహ ఏవ లోకః
పుత్రైః కృతశ్చయత ఏవ మయాఽత్మలాభః
సృష్టాచ యేనచ కథేయ మనన్యశక్యా
వాగీశ్వరం పితర మేవ త మానతోఽస్మి. (కాదంబరి)

# 7

## ఇతిహాస పర్వము.

శా. చూడంజాలవొ నీవు భూపతిసదస్సుల్ ? జూడఁగాఁ బోయినన్
శ్రోఁ "డీతం డసమర్థుఁ" డంచు సభకు న్నీరాక కొప్పండొ ! నిన్
జూడంగూడినమీఁద వీరి నటుపైఁ జూడన్ బ్రసక్తించునో !
చూడంబోమిరొ తమ్ము మన్నుటని లోఁ జూడంగలే రక్కటా !

ఉ. "ఎందుకుఁ బోరు వీరు నృపుఁ డెంతయు దాత గదా" యటంచు లో
సందియ ముండవచ్చుఁ గవిసంతతి కయ్యది వాపు టొప్పు, న
మ్మం దగునేని నమ్ముదురు మానిన మానుదు, రా నృపాలమౌ
ళిం దిలకింప నొప్పమికి లే దితరం బిది విన్ము శ్రీపతీ.

చ. కడియము శ్రేనిగ్రామ మది కాపురమా మఱి నాకుఁ బూర్వమం
దొడికపుఁగైత కెవ్వఁడు మహోదధి మత్ప్రపితామహానుజుం
డెడపక శ్రేనిసన్నిధికి నేగకె కాలము పుచ్చె' నప్పు డా
తఁడు గలచోటికే నృపవతంసుఁడు వచ్చె రసజ్ఞుఁ డౌటచేన్.

* శా. నీలాద్రిక్షితిపాలుఁ "డేమి వలయున్ మీ"కన్న "నా కన్నవ
స్త్రాలం దెందు గొఱంత లేదు నరనాథా ! నీవు మేల్ దాత వం
చేలా గీతఁడు గోరు నిన్ను ! సకలం బీవిచ్చినట్లే; ధరా
పాలుర్ మీ రెపుడో యొసంగునిలయే బాలించెడిన్ మమ్ములన్. 222

చ. తగ విను మయ్య ! నాదగజేతమ్మునఁ బండితులౌ టెఱింగి మె
చ్చుగ మును మాదుపూర్వులకు సూరిజనాదరు లెప్పుడో యొక
డ్డాగి నొకకొంతభూమి యిడి రో నరపాలక ! మీనృపుల్; తదా
దిగ నది పెంచుచున్నది మదీయుల నెల్లరఁ గామధేనువై.

చ. వలపనికోరికల్ తగవు బ్రాహ్మణజాతికి, నున్నదానితో
నలుఘటయొప్పు జీవనము; సంపద హెచ్చు కొలంది ముందువా
రలు మదమత్తులై చెడి పరంపరగాఁ గల వేదశాస్త్రపుం
జెలిమికి బాహ్యులౌదు; రటు చేసిన బ్రాహ్మణజాతియే చెడున్.

ఆ. వె. మూఁడు జాము లైన మ్రుచ్చు పొద్దున నైన
నెవఁడు శాకమాత్రమేని యింటఁ

---

* నరసకవికృత వేంకటేశ్వర విలాస పీఠిక చూడుఁడు

దనకు నున్న దానిఁ దాఁ దినునో యట్టి
వాఁడు శ్లాఘ్యుఁ డంద్రు బ్రహ్మవిదులు.

శా. అంతో యింతయొ పండు భూమి గల దావంతైనను జింత లే
దెంతేఁ జింత యొకండు గల్గినను నాయీచింతయే మాకు న
శ్రాంతమ్మున్ ఫలదాత, తత్ఫలములున్ శాకమ్ములున్ గల్గ మా
పంతం బెట్టులు చెల్లకుండు నృపతీ! భవ్యాకృతీ! సత్కృతీ.

ఉ. పొట్టకు లేనియప్పుడు నృపుల్ గల, రూరక నిన్నుఁగోరఁగాఁ
బుట్టదు మానసం; బితఁడుపూజ్యుఁ డటంచు నెఱుంగు టేసుమీ!
పట్టము గట్టుటన్న; నరపాలక! నీపరిపాటి నేఁడు గాఁ
బట్టదు పూర్వపున్ యుగమువానిఁగ నిన్ మది నెంతు" నావుడున్.

ఉ. కోరియెతీరఁగా వలయుఁ గోరిన దిచ్చి యశమ్ము నందియే
తీరవలెన్ నృపుం డితఁడు; తేజము లేనియపాత్రదానముల్
పేరొడఁగూర్ప నేరవు, కవిప్రవరుం డొకఁ డిచ్చుపద్దమే
చేరుచు స్వర్గమున్; యశము చేఁ గద! యయ్యెడ నిల్వఁ గల్గుట ల్.

క. నేరని కవి కవితాఖర
వారారోహణమహోత్సవమ్మునకన్నన్,
నేరుచుకవి కవితార్వప
దోరూఢారప్రహారయోగము మెఱుఁగౌ. 229

ఉ. ఇంద్రుఁడు చంద్రుఁ డంచుఁ గవు లెందఱు సన్నుతు లెన్ని చేసినన్
బందకవిత్వమేని యది, పాడఱు నున్న యశంబుఁగూడఁ; జే
రందిన మిమ్ముబోఁటికవు లాగ్రహ మంది యొకంటఁ దిట్టినన్
బొందు యశమ్ము దాన, రసపూరిత మయ్యది గాన సత్కవీ.

క. కుట్టికవి మహిషశతకము
గట్టిగఁ గోపించి చెప్పెఁగద! తంజావూ
ర్పట్టణ విభుపై నాతఁడు
దిట్టువడియు మెచ్చుకొనఁడె ధీవరుఁ డతనిన్!

ఉ. మున్న మహామ్మదీయనృపముఖ్యుఁడు దా ననుమాటఁ దప్పఁగాఁ,
గ్రన్ననఁ గోపగించి కవిగండరగండఁ డొకండు తొల్లిఁ దాఁ
బన్నినకైత చింపి, పయిఁ బన్నెను దిట్టుచుఁ గావ్య మొండు; దా
న న్నృపుఁ డందె మోద మనినన్ సుకవీంద్రమహత్త్వ మల్పమే!

క. కల దిట్టివశ్లోకము లీ
కలికాలమునందుఁ గూడఁ గవుల చరిత్రల్;
కలరు నృపాలకు లిట్టిరు
బలవంతపుటేవి యశము పడసినవారల్.

ఉ. కావున మీకతానఁ గృతిగావలె నీతఁడు కోరుఁ డెద్దియో,
పావనుఁ జేయుఁ డీ నృపునిఁ; బాత్రము చేకుఱు నెంతవారి కౌఁ,
బోవు ధనం బెటో; యశము పుట్టఁగఁ జేసెడిదాన మన్నచో
నీవిధమైన సత్కవుల కిచ్చినదే యది నిల్చునెప్పుడున్.

తే. గీ. సత్కవుల గ్రంథములు గాక సాక్ష్య మేది?
రాముఁ డెట్టిఁడో, యెట్టిఁడో రావణుండు?
తా రెచట నున్నమృగ్యులే తజ్ఞులెందుఁ
గీర్తికామున కల చక్రవర్తికేని. 235

క. అని చెప్పి కోరుఁ డని ప
ట్టును బట్టినఁ దాత గోరెదున్ విను "మోయీ
జనపాల! నాదుకోరిక
గను మది యిచ్చుటయె నాకుఁ గనకాచలమౌ.

చ. కల దని మున్నె చెప్పితిని గా! యిల మీ రిడినట్టి దింత, య
య్యిల కొకకొంత కట్టుబడి యేర్పడి యున్నది మున్న; దానిలోఁ
పలఁ గల మూఁడుభాగముల భాగ మొకం డది నాది; దానికిం
గలకరమున్ వెలార్చు మది గాఁడగు నాకొకకోటితుల్యమై.

క. కృతియన్న యామినీ పూ
ర్ణతిలకలో నీదు పేరు నాటించితి నిం
తకుమున్న దేవునికి నం
కిత మది చేసితిని ధన మకించిత్కరమౌ."

క. అని తేనిసమాధానం
బు నెటో పొనరించె; నట్టిపుణ్యాత్మునికిన్
మునిమనుమఁడ నరసకవీం
ద్రునికిన్; నాయంత నరుగుదునె నృపుఁ జూడన్.

క. తిరుపతికి వేంకటేశ్వరుఁ
డరుగనియెడ కరుగు టొప్పు నని యెంతురె యె

వ్వరుగాని మనకుఁ గల్గిన
పరస్పరస్నేహ మెఱుఁగు పండితమాత్రుల్. 240

చ. ఇది యిటులుండ నింకొకటి యీశ్వరవేర్లట మున్నవారు నీ
కెద భయమౌఁగదా యటకు నేఁగ! నృపాలుఁడు పిల్చె నేనిఁ గో
విదు లెటు లెంతురో యనుచు వీసము దాఁసము లేక కైత తా
పదరిన దీనెఱుంగవొకో వారలధాటికి వాఁగ నేర్తువే.

* ఉ. ఊరును బేరునుం జెఱచి "హు" ష్షని తోలఁగఁ జాలుపండితుల్
ధీరులు రామకృష్ణు లరుదెంచి సభాస్థలిఁ గూరుచున్నచో
నోరు మెదల్పఁగాఁగలరె, నూటి కటుంచు మొకండు పద్యముం
గోరినఁ జెప్ప నేరుతువొకో! వృథగాఁ జన నేటి కో సఖా!

ఉ. పల్లెలలోన నల్పబుధులఁ బామరసంఘమునొద్దఁ దక్క భూ
వల్లభసత్సభాస్థలుల వాక్కటు లేచెడి నీకు! నీదు వి
ద్యోల్లసనం బెవం డెఱుఁగఁ డూరక యంకెలు వైవఁ; "దల్లిపు
ట్టి" ల్లనునట్టి సామెతగ నీశ్వరవేరు లెఱుంగరే సఖా!

ఉ. వచ్చును రెండు శాస్త్రములు వారికి నీ కొకటేని రాదు; స
ద్యోచ్చముగాఁ గవిత్వ మలయుగ్మము సెప్పెడి నీవు చెప్పలే;
వెచ్చటనో రచించుటకు నిచ్చటికిం గడు భేద ముండు; ని
న్నెచ్చట మెచ్చి రొక్కఘను నేనియు సాక్షిగఁ జూప నేర్తువే?

చ. ఇటు మొగమోటమున్ విడిచి యే ననినాఁడ నటంచుఁ గోపము
త్కట మగునేమొ నీకు; వృథగా మఱి నాపయి రాకు మీఁగతిన్
రటనము సారెసారెకు దురంబుగఁ బత్రికయందు నించు మా
యటమొగపున్ బ్రబుద్ధుల పరాక్రమపుం దెలువుల్ లిఖించితిన్.

క. కలరేమొ యిట్టివారి
క్కలియుగమున నేని యొండు కడ నక్కట! యీ
కలిబొల్లి వ్రాఁతలే తమ
కలవఱచునె సుకవివీరు లను సద్యశమున్. 246

---

* ఉ. ......... ఈ హీరహీయెంత పీఠపురి నీశ్వరవేర్లు వసించువారు నీ
యూరును బేరునుం జెఱచి హుష్షని తోలెద రేగి వ్రాలుమీ. (సత్యసందేశము 6 వ పుట)

క. ఎందులకుఁ బిచ్చివ్రాఁతలు
సందేహములేదయేని సత్సభకుం బొం
దందఱుఁ గంగురు మీ శ
త్రిం దగ నని చెప్ప నొక్క ధీరుఁడు లేఁడే.

క. మన యవధానంబఁట ! వీ
రొనరుచు నవధానమునకు నొక నూఱవ పం
తునఁ గూడ మాఱదనియే
ఘనుఁడో లిఖియించె నంట ! కంటివె సఖుఁడా.

క. రెండును విడిచినవ్రాఁతను
నొండొక సందియము కూడ నుండునె? మఱియొ
వ్వండేని యొకఁడు వ్రాసినఁ
గొండురె తా మట్టివ్రాఁత కోవిదులేనిన్ !

క. ఎవఁడో సీతను సైతము
వివేకరహితుఁడయి యాడె విని నమ్మెనె యా
యవివేకుని ప్రల్లదములు
కవిలోకము నిజము పిచపఁ గని వ్రాయదొకో !

తే. గీ. అట్లె యెవ్వండొ వ్రాయుఁగా కంతమాత్రఁ
జంకలం గొట్టుదురె వివేచనయె యున్న
తిరుపతి యెవండు ! వేంకటేశ్వరుఁ డెవం ! డ
టంచు నించుకయేని యోజించ వలదె.

క. గేహానర్దు లొనర్చు దు
రూహలవలనన యశమ్ము లుడివోయిన నై
దేహి పతివ్రతయై తా
నేహానియు లేక జగతి నెటు వెలసె సఖా !

* క. బందరులో ఘనులందఱు
నిందించి రటంచు నెవఁడొ నెటి వ్రాసె నటం
చుం దారువ్రాసికొని రత
నిం దెలిపినఁ బిదప దాని నిక్కము తేలున్. 253

---

*అట్టహాసము 10–11–వ పుటలు చూడుఁడు మఱికొన్ని ప్రల్లదములకు 17 వ పుట

ఆ. వె. వ్రాలు దెల్పరేని వ్రాసిన యా పెద్ద
మానిసిని దగుం బ్రమాణ మొప్ప
నడుగఁ దగిన వారె యడుగుదు రేల దో
బూచి దొంగబూచి బూటకములు.

తే. గీ. బందరే వచ్చి యటు లేని ప్రజ్ఞ చూపి
ముసలితనపు మన వధానమునకు నేని
దీ టటన్న మాటను దారు తెచ్చికొన్న
మనల మ్రొక్కింపరే వారి ఘనత కోరులు!

క. మసి పూసి యెట్టులో బిరు
దు సారముం గూడఁ జెఱిచి తుందుడుకున వె
క్కసమగు కోఁతలు కోసెడి
యసత్యపుంగనుల నెవ్వ రాఁగెదరు? సఖా!

ఉ. ఆతఁడు నాయెడన్ సలిపినట్టి కృతఘ్నత కీవు లోకవి
ఖ్యాతకవిత్వతత్త్వకృతి కల్పలతావలి తామ్రశాఖివై
చేఁతకుఁ జేఁత చేసితివి, చేకుఱె మోదము; తిట్టనిమ్ము, వా
రితతి నెంత తిట్టినను నించుక ఖేదము లేదు తిర్పతీ!

ఉ. సంతసమైనదే యగును ఛాత్రుని వృద్ధి; మనంబునందు నా
వంత కృతజ్ఞతం గనఁడ యంతటఁ బోక వృథాగ నక్కఱిం
పంతట నేనిఁ బోక యిటు లాఁబడి వ్రాఁతలు పిచ్చిగంతులున్
బంతములున్; సభాస్థలికిఁ వచ్చునో? రాఁ డిది యేటి బీరమో!

చ. నపుఁడు శిఖండి యల్ల కురునాథుఁడుఁ దమ్ములు నొడ్లు ద్రోణు కిం
కరులయి విద్య నేర్చికొనఁగా సమకట్టిరి నేర్చి రెల్ల; రం
ఎఱును బ్రవీణులైనను ధనంజయుఁ డొక్కఁడె తుల్యుఁ డయ్యె నె
వ్వరు తన యగ్రమందు నిలువం గల రన్న గురుం డెఱుంగఁడే.

క. గురువుల వంచించెడి ధ
ర్మరతులకున్ ధర్మరాజు మార్గముఁ జూపెన్
బరుషోక్తులతని నోటన్
దొరల వసత్యమ్ము వానితోఁ దుల యగునే! 260

ఉ. ఆలములోనఁ గూడ గురునంఘ్రులకున్ బ్రణమిల్లి గాని స
చ్ఛీలుఁడు పార్థుఁ డెప్పుడును జేసియెఱుంగఁడు యుద్ధ; మందుకే

చాలియుఁ ద్రోణుఁడాతనికిఁ జాలనియట్లు ఘటించి ప్రాణముల్
బాలిశునట్లు పోవిడిచి పాండవులన్ గెలిపించె ప్రేమ్మెఱిన్.

ఉ. నీ కసమానకక్ష యిది నే ఘటియించితిఁ దప్పు సైఁపు మీ
లోకము నిన్నెఱుంగు "నతిలోకకవిత్వవిదుండ" వంచు; ని
న్నాకవు లేమి యన్న నవి యన్నియు నోర్వఁగదయ్య! యింతకే
చెకుఱెఁ గార్యసిద్ధి; యిఁకఁ జేయుప్రయత్నము లేటికో సఖా!

చ. వలసినవారు "వీరలకు వారల కెంతటి వార యున్నదో!
తెలియుఁడ" మంచుఁ గబ్బములు దీసి వివేచన సేయరొక్కొ! యీ
కలహ మదేల నీకుఁ? గవికాంతులతో నగు నేని యొప్పఁగా
కిల నిటువంటి యర్భకుల నే మని నీవు జయించి మించితో!

సీ. తిరుపతివేంకటేశ్వర కవీంద్రులముందు నిల్తురో యివ్వారు నిల్వలేరొ
వారికవిత్వమే సారవంత మొక్కొ వీరికవిత్వమే సార మొక్కొ
వారికి వీరికి నారయ గురుశిష్యభావమో సహపాఠిభావ మొక్కొ
అవధాన మన్న వీ రాచరించెడితంత్రమే యౌనొ యవ్వారిదే యగునొకో

తే. గీ. వారి పేరన్న వీరొక్కతీరు గాఁగ
నభినయించుట కేమొక్కొ యవసరంబు
అనుచు సంశయమున నోలలాడులోక
మిపుడు నిక్క మ్మెఱింగి స్వస్థపడుఁగాక.

ఉ. వీరి కసూయ యంచును, నవీనుల సైఁప రటంచుఁ, గొంద ఱె
వ్వారొ వచింత్రు గాక; యది వాస్తవమైన, నధాను లెందఱు
న్నా రిపు, డట్టివారిపయి నాకును నీకు నసూయ లేక యి
వ్వాలిపయిం బొసంగుటకు వారె యెఱుంగఁ గలారు హేతువున్.

క. పలుమాట లేల పోటన్
దలఁ దూరిచి రోఁకటి కిఁకఁ దులఁకం బని శే
బిల [illegible]లైన మాటల
పాలకుప లిట్టివె" యటంచు బుధు లెఱుఁగరొకో! 267

# 8

## ద్వైతపర్వము

* ఉ. తిట్టుచునున్నవారని పదింబది వార్తలు వచ్చుచున్న; వా
తిట్టులకెల్ల నుత్తరము దేవుఁడె తా నిడువాఁడు గాక; యా
దట్టుల కెట్టులో దొరలు తప్పుడుకైతకుఁ దోడు తిట్టులా
కట్టుట! యట్టికైతలకె కావలె నెక్కుడు తెల్వి శ్రీపతీ!

---

* నడుమ తమ క్షేమములు తెలియుటలేదు. రామకృష్ణకవులు, తమ ఉభయులపైని "తిరుపతివేంకటేశ్వరీయ" మను నొక శ్లేషకావ్యము, అట్టిదే యొక శతకమున్నూ వ్రాసిరనియు అందు విగ్రహారాధనము చేయఁగూడదను నర్థము బాహ్యముగానున్నూ, తమరిని పూర్వులెవరైన పూజించిన పూజింతురుగాక ఆధునికులెవ్వరు అట్లు చేయరనియును అర్థమువచ్చునట! కొద్దిరోజులలో అచ్చువేసి పబ్లిష్ చేయుదురట. అందుల వక పద్యమొక కుర్రవానివల్ల నా వద్దకు వచ్చినది, యిందుతో పంపించినాను. పయిసంగతులన్నియు.........గారి వల్ల విన్నానని ......... శాస్త్రిగారు నాతో హేళనగా చెప్పినారు, యిందుగురించి అనగా రామకృష్ణులుచేయు అనవసర ప్రసంగములను గురించి ......... సమాధానము వ్రాయుటలో తాము ......... పూనుకొననిచో

శ్రీ॥ ది॥ తిరుపతిశాస్త్రిగారు అంతశ్రద్ధగా పనిచేస్తారని నమ్మకంచాలక నాకు ......... హేళనవినుట చాలా కష్టము తోచి విశదీకరించుకున్నాను."

లక్ష్మీనరసాపురం, 4-12-10. శ్రీరాములు.

క. "కొంగొంగురనుచుఁ గూసెడు
కొంగను ముంగిళుల మెలఁగు కొంచెపుకాకిన్
బంగారుపంజరమ్మున
సింగారింపంగ నెవడు చిత్తముగొలుపున్."

గొల్లప్రోలు 31-1-11.

"..........త॥ బ్ర॥ ద్విభాష్యం పుల్లకవిగారు నిన్నటిరోజున పిఠాపురం వెళ్ళినారు. ఆయనవద్ద తిరుపతివేంకటేశ్వరశతకం పిఠాపురం కవులు చదివి వినిపించినారట. ఆయన నాతో చెప్పిరి.........."

అల్లంరాజు లక్ష్మీపతి.

పై సంగతికే 8-9 సంచికలుంగల కవిత టైటిల్ పేజీకూడ చూడఁదగు.

ఉ. తిట్టుట నాకు సమ్మతమె, తియ్యనిపల్కులు మేల్మిశయ్యయున్
బెట్టినకైతయేని యది పేర్మిలుపుం గద వారికిన్ ! వృథా
తిట్టుటపట్ల గ్రామ్యులకుఁ దీర్పవిశేషము గాన వారలన్
గట్టిగ మేపి తిట్టుఁ డనఁగాఁ దగదో! తమ కేటి కీర్తిమల్?

ఉ. తిట్టుచుఁ జెప్పినారలఁట! తిర్పతివెంకటఈశ్వరీయ మం
టట్టి పబంధమందు నఁట! యన్నియు శ్లేష్మము లంట! "విగ్రహం
బెట్టిదిగ్రానఁ బూజ్య మిఁక నీపయి గా" దని సారమంట! సీ!
యెట్టివివేక మాకవుల కిచ్చెనొకో భగవంతుఁ డింతకున్! 271

చ. తిరుపతివేంకటేశ్వరుని దేవుని వాని యభిఖ్యఁ బూనుత
ద్గురువుల మమ్ముఁ బట్టికద తోఁచినపట్టును దిట్టఁజొచ్చిరి
ర్వురు కవు లక్కటా! యిచట ద్రోహము సర్వము వాని పేరునన్
బరఁగెడి మాది, యేమనిఁ బండితు లాదృతిమై వినం దగున్.

---

*చ. కలి గనుఁ బ్రామ నేలికలఁ గాడన నేమగు! లాఁతివారలే
దలఁపరు వేల్పు లంచెడఁడఁ, దత్రిమూర్తులవార్త లేమన
స్నారా! విపరీతవాసనల నంకొను వారును పీపి నీదు చె
ప్పులు దల కెక్కఁ గప్పుమిడి మోయరె తిర్పతి వేంకటేశ్వరా! 1

చ. కొలఁదికి మీఱె నీదు గుణకోటి గణింపఁగ నెవ్వఁడోపు! నే
తలమునన్న వేల్పు లరుదా! యటమానితు లౌట; యెట్టిగో
డలకడనేని శోభనపటంకము నీ డగునామ మొప్పి పూ
జలఁగొను వారిశ్రేయములఁ జాటుచుఁ దిర్పతి వేంకటేశ్వరా! 2

చ. కొలుతురు నిన్నుఁ బామరులుఁ గోవిదులున్ మఱి రాజరాజులున్
దలఁప నశక్య మెంఁడొకఁడు దప్పను నీయెడ, శిష్టవీఁగినన్
దలగోఁకగించి "దండ మిడి దాసుఁడ నే"ననఁ బ్రోతు, దానఁజూ
కలియుగదైవతప్రతిగాంచితి తిర్పతి వేంకటేశ్వరా! 3

ఉ. లేరె త్వదీయనామ మొకలీల ధరించినవార లెందఱో
వారును నీవునున్ గవులె, వచ్చునె నీదు ప్రతిష్ఠ వారికిన్ ?
జేరువ నీరు పాఱె యెటో చేరినమాత్రన పల్వలమ్ములున్
వారక మానసంబు లనవచ్చునె తిర్పతి వేంకటేశ్వరా! 4

తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి, చందవోలు (రేపల్లె తా॥)

ఉ. నవ్వయుఁ బోనిమేము త్రిజగమ్ములకున్ బ్రభువైనవాని నే
రెవ్వగనో ధరించుటకు నీకవు లొప్పక పోయి రందుచే
నవ్వఁ దొడంగి రాకుధరనాథునియోరిమిఁ జూచి; లేనిచో
నెవ్వఁడు నవ్వఁ జాలు నల యేలికఁ దిర్పతి వేంకటేశ్వరున్.

మ. అసమర్థుండు సమర్థపేరు గొనఁగా నర్షింపరెవ్వారు నె
క్కసమా తాదృశ భక్తి యంచుఁ దెలుపన్ గష్టించు మావారి యా
వ్యసనంబున్ బుధు లాదరించుటకునై ప్రార్థించుచున్నార మా
కసి యేమైనను దీనిసార మిటులే కన్పట్టె మా కియ్యెడన్. 273

## తిరుపతి వేంకటేశ్వర స్తవము.

శ్రీమత్పరదేవతాయైనమః

"కలౌ వేంకటనాయకః"

శ్లో. "పాపధ్వాంతదివాకరం కుకవిరాడ్భద్రేభకంఠీరవం
రంగత్కోమలగద్యపద్యలహరీధారాదిధారాధరం
నానాశాస్త్రపురాణపావనకరం లక్ష్మీమనోనాయకం
ఆర్తత్రాణపరాయణం తిరుపతి శ్రీ వేంకటేశం భజే"

ఉ. నీ కరుణాకటాక్షమున నిచ్చలు నెన్నని జూతు వాతఁడే
లోకములోన మెండుగ వెలుంగును; ని న్వినుతింప శక్యమే!
ప్రాకటమైన నీదు పదపద్మములన్ భజియించుచుండినం
జేకుఱుఁగాదె విద్యలును శ్రీకర! తిర్పతి వేంకటేశ్వరా! 1

ఉ. భారతవర్షమందుఁ దగ భాసిలుచుండిన నాంధ్రదేశమం
దారయ నీదు నామమును నాత్మఁ దలంపనియట్టి కీర్తివి
స్తారుఁడు గానరాఁ డిదియె సత్యము సత్యము సత్యమయ్య! సు
శ్రీరమణీశ! సద్విబుధసేవిత! తిర్పతి వేంకటేశ్వరా! 2

ఉ. రాలకు మ్రొక్కఁగూడదఁట! రాతికి మ్రొక్కిన పాపమంట! భూ
పాలురఁ జేరి గొప్పగ స్తవంబులఁ జేయఁగవచ్చునంట! మే
ల్మేలు! బళీ! యెఱింగితిమె మేదినిలోపల నిట్టిమాటలన్
బాలితభక్తలోక జన వందిత! తిర్పతి వేంకటేశ్వరా. 3

చ. తిరుపతి వేంకటేశ్వరుని తేజ మొకింత యెఱుంగలేక త
త్తిరుపతి నేల చేరుదురు దేవుఁ డటంచు భజింతు రేల యం
చరయఁగఁ బల్కుచున్ సతత మక్కట! భక్తివిహీనులౌదు రీ
కరణి మదాంధులౌచు; దయఁ గావుము తిర్పతి వేంకటేశ్వరా. 4

ఆ. వె. కాని మమ్ముఁ దిట్టి కవి దీర్చులౌవక వ
ద్దెవ్వఁ డిట్టు లరిది; తెలివి యాధిక
మైనకతన నిట్టిపూనిక గల్గె మా
వారి కదియు మాకుఁ బ్రాభవంబె.

క. కాకవ్యాసము తమకే
మేకా గతి నిదియు నెత్తిమీఁదికి వచ్చెం
బో ! కత్తిసాము వేరని
ప్రాకృతులను గాలొ గేలొ బలి గోరుఁజుమీ. 275

---

చ. "గురుఁడను నేనె లోకములకున్, నను గొల్వుఁ"డటంచు వేడుకన్
నిరతము పల్కుచున్ మఱియు నిర్భయలీలను నావహించి యీ
నరులను నేఁపుచుందువఁట ! నమ్మఁగరాదఁట! గల్గనౌనె యీ
సరణి వచించువారలకు సద్గతి తిర్పతి వెంకటేశ్వరా! 5

చ. సరసిజసంభవాది సురసంఘకిరీటవినూత్నరత్నసం
స్ఫురితమరీచిజాలపరిపూరితపాదసరోజయుగ్మ ! నీ
వర కరుణారసంబునకుఁ బాత్రులు గారె కవీంద్రులెల్ల గీ
పరధరణీస్థలిన్ సుకవి వందిత ! తిర్పతివేంకటేశ్వరా. 6

చ. నిరతము మీ మహాద్భుత వినిర్మలనామచరిత్రి మెప్పు డే
మఱక యహర్నిశంబులును మానసమందుఁ బఠించు మానవుల్
పరమపవిత్రులై రనుచుఁ బల్వురచే వినియున్నవాఁడ నీ
సరకిని "రామకృష్ణ" యను చక్కని మంత్రము దోఁచదయ్యె న
న్నరయఁగ నేమి చేయుదొ మహాత్మక ! తిర్పతివెంకటేశ్వరా! 7

మ. ధనధాన్యంబులు సంగ్రహింతురు సుహృద్దారాసుపుత్రాదులన్
మనుపన్ రాజులఁ జేరి గర్వులగుచున్ దైవంబు లెక్కింపకే
ఘనపహా సద్గురుసేవ సల్పరకటా ! గర్వాంధులైనట్లు దోఁ
చె నరుల్ కొందఱు భూమిలోఁ దిరుపతి శ్రీ వేంకటేశ ప్రభూ! 8

మ. ధరణిన్ క్షీరపయోధిమధ్యగతరత్నద్వీప రత్నావళిన్
బరికింపక నత్త గుల్లలనుచున్ భక్షింపఁగాఁ బోవు కా
క్కుర ఫల్గుంబలె సద్గురున్ సభలలో గణించు దుశ్శీలుఁడున్
స్థిరమోదంబును బొందునే ! తిరుపతి శ్రీ వెంకటేశప్రభూ.

మ. శతలేఖిన్యవధానపద్యరచనా చాతుర్యధారేయుఁగా
నతిభోగాన్వితుఁగా సుశీలునిఁగ నార్యశ్రేష్ఠునింగా సమం

చ. తిరుపతిమార్గ మిట్టి దని తెల్పితి మున్ గతంబిది; వీర లట్టిచోఁ
దిరుపతి కేగి మ్రొక్కులను దీర్పఁగ దండ్రి ట్టేఁకొప్పు! దక్కడన్
జరుగు మహోత్సవంబుల వసం గని పొంగుట యొప్పు! వేంకటే
శ్వరచరణారుణాంబుజరజంబు శిరంబునఁ దాల్పు టొప్పుఁగన్.

చ. తిరుపతి వేంకటేశ్వరుల తీరు తెలుంగని వారు లేరు, మ్రు
ప్కరములు సాఁగి రా వచట సాగిలి మ్రొక్కఁగఁ బోయి నప్పుడున్
శిరమున భార మున్న నల శ్రీపతి సైఁపఁడు; వానిఁ దిట్టుటల్
కొలవిని వెత్తి గోకికొనఁగోరుట యందురు భక్తులో సఖా!

---

చిత కీర్తిప్రదుఁగా నిగర్గళవచశ్శ్రీ తాదిగ్రాఁ జేయునీ
స్థితకారుణ్యము భూమిలోఁ దిరుపతి శ్రీ వేంకటేశ ప్రభూ. 10

మ. సమదాటోపపతంగ పుంగవవిభాస్వద్దీర్ఘ చంచూసమ
క్షమునం దల్పఫణావిజృంభణనటత్కాకోదరం బట్టు నీ
దు మహత్త్వంబెఱుఁగంగలేక యెపుడుం దూషించు దుర్మార్గుఁడున్
స్తిమితానందముఁ బొందునే ? తిరుపతి శ్రీ వేంకటేశ ప్రభూ. 11

మ. గురువై యాప్తుఁడవై సఖుండవునునై కొండంతచుట్టంబవై
పరభక్తాళినిఁ బ్రోచుచుందువు కృపాపాథోధివై యొప్పు; డీ
నరులేరున్ నినుఁ గొల్వఁగూడ దనుచుం బల్కంగ మూఢాత్మకుల్
చిఱునవ్వుల్ జనియింపవే! తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ. 12

మ. ఎవరేమన్నను నెట్టి భంగులను నిన్నెవ్వారు దూషించినన్
స్తవముల్ సేయకపోయినన్ మఱియుఁ జర్చల్ చేసినం బండిత
స్తవనీయంబగు నీచరిత్ర సుజనుల్ సద్భక్తిఁ బూజింపరే
శివపాదాంబుజచింతనా ! తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ. 13

మ. శ్రవణానందము నీచరిత్రము మహాసక్తిం బఠింపంగ స
త్కవిబృందంబుల నెల్ల నిశ్చయముగా ధన్యాత్ములం జేయవే
భువి నీనామము భక్తితోడ నెపుడున్ బూజించువారిం గృపన్
శివపాదాంబుజచింతనా ! తిరుపతి శ్రీ వేంకటేశ ప్రభూ. 14

ఉ. "బొంగు బుజాన వేసికొని పో" మ్మని కొందఱు పల్కనంతనే
భంగమురాదు మీ కెపుడు బాలురు వారలు పల్కినారు పే
ర్మిం గరుణింపు తప్పులు క్షమింపుము పుత్రులు తప్పుఁజేయ వా
రిం గనుఁగాదె తండ్రి కృప శ్రీకర ! తిర్పతివేంకటేశ్వరా ! 15

శా. బ్రహ్మసమాజముల్ పనికిరా వచటన్ గలికాలరీతి 'యం
బ్రిహ్మల' పేరు విన్నయెడ మండిపడున్ జమీయాతఁ, డాపర
బ్రహ్మము రాముతమ్ముని సెపంబుల కంకని దేవదేవుఁ, డా
జిహ్మగశైలవాసువఁట ! శ్లేషకుఁ దార్చెదరంట వీరిఁకన్ !

సీ. ఏడుకొండల వేంకటేశ్వరస్వామిపే ర్కుక్కుటేశ్వరుఁ డందఁగోరు టెట్లు?
వేంకటగిరిదేవవిభుమహైశ్వర్యంబు పీఠికాపురి వేల్పు పెరయు టెట్లు ?
వేంకటేశపదారవిందసౌభాగ్యంబు గయరాక్షసునికాళ్లు గాంచు టెట్లు ?
అలమేలువిభుని యుద్యానంబుతోఁ గోడిపుంజయ్య పూఁదోఁట పోలు టెట్లు?
తే. గీ. తోడఁ బక్కడి శేషగిరీడధిత్య
కావతంసునితోడ సామ్యం బదెట్లు
గలుగు ? దుర్వర్ణకగిరీశగహ్వరాంత
రస్థితం బగు హీనముద్రకుఁ దలంప. 279

---

మ. సువివేకుల్ నృపులెల్ల మీదు మహిమన్ శోధింపఁగా నెంచి యి
య్యవనిన్ భక్తిని బూజసేతురు కదా ! యశ్రాంత మిప్పట్టునన్
భవదుద్యత్సుగుణంబులం దెలియఁగన్ శక్యంబె మూఢాత్మకుల్
శివపాదాంబుజచింతనా ! తిరుపతిశ్రీ వేంకటేశప్రభూ. 16

ఉ. పాఱుఁడనంటి నీచరణపద్మములే మది నమ్మియుంటి నె
వ్వారిని వేఁడనంటి నను బాలన సేయఁగ వేఁడుచుంటి నీ
ధారుణిలోన నీకు సరిదైవము లేఁడని చెప్పుచుంటి సు
శ్రీరమణీశ ! సద్బుధసేవిత ! తిర్పతివేంకటేశ్వరా. 17

చ. స్థిరముగ నీదుహస్తమున దీనులగావఁగ ధర్మకంకణం
బరయఁగఁ దాల్చినాఁడవని యందఱుఁ జెప్పఁగ నాలకించి నీ
గురుతరసత్కృపారసముఁ గ్రోలఁగ నెంచితిఁగాన వేగమే
దరికిని జేర్పుమయ్య నతతాపస ! తిర్పతివేంకటేశ్వరా. 18

మ. అనిశంబున్ భవదీయ నామకచరిత్రాకర్ణనాసక్తి స
జ్జనసాంగత్యము ధర్మతత్పరత షట్ఛాస్త్రప్రవీణత్వమున్
ఘనసుజ్ఞానముఁ గల్గునట్లు వరమున్ గాంక్షించితిన్ నిన్ భజిం
చిన నేనున్ సురవందితా ! తిరుపతిశ్రీ వేంకటేశప్రభూ. 19

చ. "తిరుపతి వీఁడు" మం చొకరు దెల్పిన యంతనె మాదు వేంకటే
శ్వరుఁ డటు జేయునంచు ఘనసాహసలీలను నెంచినారు భా

శా. హాలాపానమొనర్చియున్ మృగయుగవ్యాపన్నతన్. గాంచి ము
న్నోలిన్ రాముఁడుఁ గృష్ణుఁడుం జనిరి యుద్యోగంబు చాలించి; పై
లీలన్ దిర్పతివేంకటేశ్వరమహోలి స్తంభులై దిక్కు లు
ద్వేలశ్రీవహియించె నీతఁడె కలి స్వేల్పన్న నోఁ గా రొరుల్.

మ. కలి నిం కాటలు సాగి రా వనుచు వీఁకన్ రాముఁడున్ గృష్ణుఁడున్
దొలి రూపంబులు వీడి యేగి రటుపై దుర్మార్గులన్ శిక్షలన్
గొలుపన్ శిష్టుల రక్షసేయ నలవైకుంఠుండు శేషాచల
స్థలి శ్రీతిర్పతివేంకటేశుఁ డయి సత్తావత్తఁ బెంపారెడిన్.

చ. "కలియుగదైవతప్రతిభ గాంచెడిఁ దిర్పతి వేంకటేశ్వరుం,
డలయికమాత్రమే మనకు నర్చన లెచ్చటొ కాని కానరా
విల గిరులందుఁ దద్గిరులకే గలుగున్, రసపత్తి" యంచు ని
క్కలి తొలి రామకృష్ణులు జగద్గతికిన్ వెలియైరి తిర్పతీ.

చ. తిరుపతివేంకటేశ్వరులతీర్థముముందఱ నెన్ని ద్వారకా
తిరుపతి వేంకటేశ్వరులతీర్థము లెందుకు మాఱునేర్చు ! న
ప్పురధరణీభృదున్నతియుఁ బ్రాజ్ఞులు తక్కు కుభృద్విభూతిఁ దా
మెఱుఁగరె ! యాత్మ యొక్కటగు నేనియుఁ బిల్లులు వ్యాఘ్రము మెట్టులౌ!

తే. గీ. రత్నగిరియందు సత్యనారాయణుండు
వెలసెఁ దద్వైభవము చూచి తెలియవలయు
నాయెడమగుట్ట బదరినారాయణుండు
వెలసెఁ, దాటాకు గుడిసెయు వెలసె మీఁద. 284

---

స్కారుఁడును ద్రోవఁదప్పినను సత్యము సత్యము సత్యమయ్య ! యీ
కరణిని జేయ వీవు బుధ కాంక్షిత ! తిర్పతి వేంకటేశ్వరా ! 20

ఉ. బ్రహ్మమతం బనంబడెడు మాన్యతకెక్కిన జాతియంట ! స
ద్బ్రాహ్మణు లందుఁ జొచ్చిరఁట ! పహ్వరె ! నీపదభక్తిమాని స
ద్బ్రహ్మము నీవు గావనుచుఁ బాటలుఁ బాడుచు నుండిరంట ! శ్రీ
బ్రహ్మమునీషి నంది ! గుణరాజిత ! తిర్పతి వేంకటేశ్వరా ! 21

మ. నను నారాయణరావు కూర్మిసుతునిన్ బాలామహామంత్రచిం
తనసంపాదితచిత్రచారుకవితాధారాలసత్కీర్తిచం
దను సంలబ్ధమహావధానధను సీతారామనామాంకుఁ గాఁ
చిన మీ కివ్వె నమస్కృతుల్ తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ ! 22

క. అల రామేశ్వరమును న
త్తలరామేశ్వరముఁ దూఁపఁ దలఁతురె తత్త్వ
జ్ఞులు, తలఁతురేని యవ్వా
రలె "కంసాలు" లన మ్రొక్క రా దవ్వారిన్.

క. తలయో రభేద మని హా
తలకున్ మ్రొక్కంగఁ దలఁచు రాజులకుఁ గవీం
ద్రులకున్ బుట్టెల్లగునో కా
కలికాలం ? బైన నట్లు గాని మ్మనఘా !

---

## 9

### విద్వత్పర్వము.

క. త్యాగయ్యకృతులు గల వని
జోగయ్యయుఁ జెప్పెఁ గృతులు, శోధించి యటన్
బాగోగులు దెలుప మహా
భాగులు లే రొక్కొ, సుకవిపంచాస్యంబుల్ !

క. ధనకోటి నాగరత్నం
బు వల భవానియును రసము పొంపిరి వోవం
గను బాడ వింటిఁ గోలా
రు నాగరత్నంబు గాత్రియుతములు గంటిన్.

తే. గీ. హాయి యన నల్లపిచ్చాయి యభినయించె
నీ ! యనఁగ నింక నొకతేమ చేయి ద్రిప్పె
దద్దిందక్కు పట్టొక్కతరుణి ద్రొక్కె
కాళ్ళచే పట్టు బియ్యమ్ముగా నొనర్చె.

తే. గీ. వేణుగానంబు చేసె శ్రీవిభుఁడు మున్న
శరభశాస్త్రియు వద్దాన జగమునిండె
రాణఁగనె నేఁడు సంజీవరావు దానఁ
బాడుచున్నారు పసుల కాపరులుగూడ.

తే. గీ. కాళిదాసును గవియె నిక్కముగ మనము
గవులమే; పరత్వమ్మును గాలి దూళి
యగుఁ బదార్థముల్; నిర్ఝరాపగయు నీరె
తక్కుకాలువలును నీరె, యెక్కువేమి ?

ఉ. ధారుణిలేనె మామిడులు, తత్ఫలముల్ మఱి వేనవేలు బా
జారుల నుండు దింత్రిణులసంగతి నుండెడిఁ గొన్ని, కొన్ని ని
స్సారము లుండుఁ గొన్నిటి రసంబు విసంబుగ నుండెడిన్, 'జహాం
గీరు, నిమాన్ పసందు' దిలకించు పయిందిగదుద్దు లన్నియున్.

క. 'నాజూకుపసం'దను ఫల
రాజ మ్మొక్కండుగలదు రాజార్హము, త
త్తేజం 'బిమాన్, జహాంగీర్'
తేజముకడ దివ్వటీకి దీపంబె యగున్.

క. నారాయణదా సనియెడి
ధీరు నెఱుంగుదుము కాదె, తేఁకువమైన
వీరుంబలె నొకదాసరి
ప్రారంభము చేసి పాట పాడఁగ వింటిన్.

ఉ. ఎల్లజగమ్ములన్ దెలియ నెవ్వని వేఁట యతండె శాంబకి
భిల్లుఁ డనంగ, వేఁటి పృథివీపతులందున వేఁట యన్నచో
'వల్లూరి పెద్దతాని,' దిఁకఁ బక్షుల నుండెలఁ గొట్టుబోయలున్
బిల్లులు వేఁటకాండ్రెలుకపిల్లల నల్లనఁ బట్టు పట్టునన్.

క. రవివర్మ నెవ్వరేనియు
నవివేకులు చిత్రరచనయందుం బోలం
దవులుకొనిన నది గనఁగొని
నవుబాటని యననివార్గనంబడుదురొకో!

# 10

## కాఁకరపర్తిపర్వము.

ఉ. కాఁకరపర్తి నుండెడి యఖండమనీషివరేణ్యులార! వి
ద్యాకమలాప్తులార! గురుతాభరితాంతరులార! బంధుతా
శ్రీకరులార! నాకు నల శిష్యునికిన్ సము లీర, లిందులో
నేకడ లోప మున్నదియొ యేర్పఱుపుండని మిమ్ముఁ గోరితిన్

ఉ. శాఖకు నప్రతిష్ఠ, గురుసంతతికిన్ దలవంపు, శిష్యతా
రేఖకు వేరుపుర్వు, కళరీతికిఁ జెంపుడుతల్లి నుండి మా
వైఖరి; యిందుఁ దప్పెఱుఁగ వచ్చినచోఁ దగఁ దెల్పి న్యాయవి
చ్ఛేఖురులై జగమ్మున విశేషయశంబు వహింపు టొప్పదే.

ఉ. విద్యకు నేమి! యెల్లరకు విద్యలె వచ్చెనె! యందు మీరు మా
హృద్యత నేర్పఱింపఁగఁ బరిశ్రమ సేయుట లాభకారి గా
దద్యతనుల్ మహామహు లనంతము గా బుధు లుండవచ్చుఁ డ
త్తద్యశముల్ తదీయములు, తక్కిన వారవి గోర వచ్చునే.

మ. "గురుశిష్యత్వవిభాగ మెంత" యని నేఁ గోరన్, మఱేమన్న, నా
గురుతన్ సున్నను జుట్టుమీఁద సభలోఁ గూర్చుండి నామీసముల్
పరిహాస్యమ్ములు సేయు టొప్పగునె? యాపై నెట్టులోవచ్చె "నీ
శ్వర వే" దన్నది సత్యమే యనుచు నే స్వాంతమ్మునం దెంచెదన్.

మ. గురుతన్ జెప్పనిహేతు వే నడిగితిన్, గొంకెన్ సమాధానపుం
దఱి, నెక్కెట్లొ క్షమాపణంబు నొడివెం దప్పైన నొప్పైన నం
తరమం దుంచికొనంగఁ జెల్లు నని యంతన్ మిన్నకే యుంటి, నె
క్కిరిపింపన్ గొనఁ గేమి చేసితి నహో! కించిత్తు యోజింపుఁడీ. 301

చ. తిరుపతిశాస్త్రియుత్తరము తీవ్రమొ కాదొ జగం బెఱుంగుఁ బై
నటిమటి చాటుపద్దెముల నార్యులు మీర లెఱుంగ లేరె! యు
త్తరమునకన్నఁ బూర్వము సదస్సున మీసముఁ బట్టి లాగు ము
ష్కరులకు నేమి చెప్పెదరు? కాఁకరపర్తినివాసు, లుత్తముల్!

క. ఉత్తరము వ్రాయుపై వా
రెత్తెఱుఁగున నేమి యన్న నిష్టమె నాకున్

జిత్తరఁ బెరియుఱఁ గారికి
నీతత్త్వమును జూచుపిదప నుత్తలపడరే.

ఉ. చిత్తమునందుఁ దత్తఱము చేరినపిమ్మట శక్తి చాలియో
యుత్తలపాటు గూరియొ, మఱొక్కనిమిత్తము దాపరించియో
సత్తువఁబట్టి పోశనముసల్పిన సల్పఁగనిందు; దానఁ గిం
చిత్తును నన్నుఁ దాప మవి చెందదు; మీసలజోలి యేటికిన్ ?

క. మీసలుఁ జుట్టలు నొక్కట
నే సూత్రములోన నుంట నిలు చేసిరొ! యా
మీసల పద్దెము నాకై
చేసినయది కాదొ? మీరె చెప్పఁగ వలయున్.

సీ. ఆణివిళ్లకులాబ్ధి నవతరించిన మహామహులార! బంధుతామహితులార!
చర్లవంశమునందు జననమందిన మహామహులార! వైదుష్యమహితులార!
వేదులాన్వయమున వెలుఁగొందు నో మహామహులార! సాహితీమహితులార
ఆకొండివంశమ్మునందు వర్ధిలు మహామహులార! పాండితీ మహితులార!
తే. మఱియునుం గల బంధుసంబంధులార!
యెల్లఱును మీరు పండితు లెల్లవిషయ
మెఱిఁగి యుండకపో రందు రెవరిదయ్య
మొదటితప్పిద? మెఱిఁగించి కదలుఁడయ్య.

తే. గీ. మొదటితప్పిదమే కాదు పిదపఁ గూడ
మురుసుతన మేరిదో మీకుఁ దోఁపకున్నె ?
చాటుపద్దెములను జూచి చాటు వదలి
తెలుఁపుఁ డయ్య సత్యము, నెనుదీయ నేల.?

ఆ. వె. ఎందు కీకృతఘ్ను? లెందుకయ్య శతఘ్ను?
లకట కాకులేల, పికములేల?
పట్టి మీసములను బడఁ బీకఁగా నేల ?
డాఁగ నేల! వేరు కాఁగ నేల!

క. పౌర్వాపర్య విచారము
సర్వమునకు మీకు ముఖ్యసాధన, మది మీ
ర్వార్వాఱఁ దెలిసికొన్నను
గుర్వారాధన పరత్వ గోష్ఠులు తెలియున్.

ఉ. కాఁకరపర్తి మూలమునఁ గాదె! ద్విజత్వము శాఖకెల్ల నిం
దాఁకను నిల్చె, నాదు ప్రపితామహుఁడౌ నరసన్న సత్కవి
త్వాకలనమ్మునన్ గరిమ మంది ప్రబంధ మొనర్చి పిమ్మటన్
వ్యాకరణంబు మీపురికి వచ్చి పఠించుట యే నెఱుంగుదన్.

సీ. ఆతఁ డొనర్చిన 'యామినీపూర్ణతిలక' రెండు ప్రతులు మామకగృహమునఁ
గల, వందొకటమూఁడుగలవు భాగమ్ములు మఱియొకంటను నాఱువదులుచుండు
రెండుప్రతులునూచి యొం డేమి కారణంబని యెంచుచుండ మాయయ్యగారు
'మొదటఁ జెప్పినదేమొ మూఁడెయాశ్వాసమ్ము లటుమీఁదిపుస్తకం బాఱునుమిన్న

తే. గీ. తప్పు లుంటకుఁ గొంకి మాతాతగారు
కారవల్లీపురమున వ్యాకరణమును బ
ఠించె" నని వారితండ్రి వచించినట్లు
చెప్పె; నిది నిక్క మని మీకుఁ జెప్పవలెనె !

1 మ. కవియై కాఁకరపర్తి కేగి యచటన్ గష్టించి యామీఁద శా
బ్దవిధుల్ నేరిచి యాకృతజ్ఞతకునై తద్దేశికున్ గ్రంథమం
దు విశేషించి నుతించె నయ్యనఘుఁ డీతోఁ బ్రవల్ ప్రసంగింపఁ డీ
సువివేకం బిసుమంత నేరఁ డివి యిచ్చోఁ గల్గె ధీరోత్తముల్.

ఉ. కౌముది పూర్తిగాఁ జదివి కాదుసుఁడీ ! యతఁ డట్లు సన్నుతిన్
శ్రీమహనీయు నాగురునిఁ జేసిన; దాతనిశాస్త్ర మెంతయో
యామహితుండు వ్రాసికొని వట్టిది సంపుట మిప్డు నున్న; ది
ట్లే మహిలో ననేకబుధు లెందుఁ గలారు కృతజ్ఞతాఖనుల్.

2 తే. 'మేడపరపుఁగోనయ్యగా' ర్గాడఁ దనకుఁ
జిన్నతనమునఁ దెలుఁగులు సెప్పుకతన
వారిసైతము మ్రొక్కెఁ గావ్యంబు మొదట
నరసకవిగారు వారి నెన్నఁబనియేమి.

---

1 మ. తనరారన్నతయింతు దాంతులను మేధావంతులన్ సాహితీ
ధనవిశ్రాంతుల భాష్యకారసమసిద్ధస్వాంతులన్ మానసా
చ్ఛనగారిమణికాంతులన్ గుణవిభాస్వన్మృఖ్యనామాత్మబో
ధనహృద్వేద్యుల వెంకటార్యజన భృత్సామంతులన్ శాంతులన్.

2 తే. గీ. సరససుజ్ఞానవరమంత్రి చక్రవర్తి
సమదపరవాదిగజగజాశన కరాగ్రి
జాగ్రదుగ్రప్రతాపసమగ్రమూర్తి
కోనయాఖ్యాంధ్రగురుకీర్తి గూర్తు మదిని.

చ. ప్రకృతము చూచి కొందము; భవత్పుర మిప్పటి కేమి నేఁటికే
మి! కళకె కాదు, రౌాగ్యలకు మేల్మితనంబున కాటుపట్టు కా
ఖకుఁ గుదు, రిట్టిపట్టున నఖండులు పండితు లుండి మిన్నకుం
టకుఁ గత మేమి! ధర్మము నెడఁ జను నే! వినువుల్ బుధోత్తముల్.

చ. గురుతను గూర్చి చెప్పుమని కోరుట తప్పది వాదియే, యశ
స్కరులకు నన్నువంటి చెడుగాకము దేశికుఁ డౌట యెట్లు! నా
గరువము నెంచి మీసములు గట్టిగఁ బట్టి బలాత్కరించి నా
గురుతకు దక్షిణన్ గొలుపు కోరిక కేమనువారు మీ రిఁకన్ ?

ఆ. వె. గురుఁడు గర్విరైన గురుని గర్వమ్మును
దల్లి చెడ్డదైనఁ దల్లి చెట్ట
తనము శిష్యసుతులు తడవిన క్లెందేని
జదివియున్న బోధ సలుపుఁడయ్యా.

మ. గురుతన్ జెప్పనికారణం బడుగుటే కోపానకున్ హేతు వం
దురో! లేదా, మును పేనొనర్చిన మహాదోషంబు నేదేని నా
కరయం జేతురో! అట్టి పద్యమును నీయం దేల యారోపణం
బు రహిం జేసికొనంగఁ జెల్లు ననుచున్ బుద్ధుల్ ప్రసాదింతురో!

తే. గీ. అన్నియును నచ్చుపడియున్న పరసియుందు
రేది యే తేది జరిగె మీ కెఱుఁగఁ జెప్ప
వలసి వచ్చిన నే వ్రాసి పంపువాఁడఁ
దగు ప్రమాణమ్ములను జేర్చి తథ్యముగను.

క. త ప్పెవరిదో సెప్పుఁడు! మా
యప్పలు, మీకన్న నెవ్వ రన్యులు దీనిం
దప్పింప నేర్తు! రూరక
యొప్పరికించు టిదె మీకు నొప్పదు విబుధుల్.

తే. గీ. శంకరాచార్యు లిది తీర్పఁ జాల రింకఁ
బ్రభువు లేనియు దీనిని బట్టుకడ!
మీరు మా కిర్వురకుఁ దగు గౌరవంపు
బందుగులు గానఁ దీర్పఁగ వలదె వాదు? 821

తే. గీ. గురుత యేమైన నగుఁ గాక గురుఁ డపాత్రుఁ
డైన నగుఁ గాక యాతనియందు ద్వేష

మంకురించును గాక సభాంతరముల
గేలి సేయుట కొప్పినఁ జాలు మీరు.

చ. నిజమున కీరు పాటుపడు నిష్ఠ గలట్టి మనీషులేని శి
ష్యజను లనాదిగా మిము యశస్కరులన్ స్మరియింతురేని నా
భజనమహత్త్వ మెట్టిదియొ బాగుగ మీ కెఱుఁగంగ నయ్యెనే
ని జగతి సందియంబును గణించి తొలంచుట మీకుఁ జెల్లదే.

ఉ. నాయెడఁ దప్పు లున్న వను నమ్మిక మీ కుదయించెనేని, లే
దీయెడఁ గొంకుతోడఁ బని; "యియ్యది నీదొసఁ" గంచుఁ దెల్పఁగ, జే
నాయెడఁ జూపఁగాఁ దగిన యాదరు వుండినఁ జూపువాఁడ; లే
దా, "యిదమిత్థ" మం చెఱిఁగి తాపము మానెద మానసమ్మునన్.

---

# 11

## సభా పర్వము.

మ. పిదపన్ గాఁకరపర్తి కేగితి నటన్ విద్వాంసులున్ బంధులున్
సదయాంతఃకరణుల్ మదీయకవితాచాతుర్యమున్ బ్రేమసం
పద దైవారఁగ సత్సభన్ గని జగన్మాన్యుల్ ముదం బంది ర
య్యద నెల్లన్ సరసమ్ముగా జరిగె విద్యాగోష్ఠి యొప్పారఁగన్.

మ. ప్రతివిద్వాంసునియింటి కేగి కని సంభావించి యవ్వారి స
మ్మతికిం బాత్రుఁడ నైతి; వచ్చిరి జగన్మాన్యుల్ సభం జూడ న
ర్చితుఁ గావించిరి పుష్పమాలికలచేఁ జేతఃప్రియం బొప్ప మ
త్కృతమౌ గీరతమందుఁ గొంత విని కౌతూహల్యంబు దీపింపఁగన్.

ఆ. వె. ఆణివిళ్లవారి యాలసౌధమున యందు
సకలబంధుజనులు సంతసింప
గీరతమును నెల్లగీరతుల్ విని మెచ్చ
వినికి చేసినాఁడ వినుము సఖుఁడ! 327

క. ఆసభ సమకూర్చిన యల
శ్రీ సీతారామశాస్త్రి శేఖరునకుఁ ద

చ్ఛాసనమును మానించిన
ధీసము పేతులకు నే నతిం బొనరింతున్.

ఆ. వె. వ్యాసలింగశాస్త్రివరుఁడు శ్రీయాకొండి
కులజుఁ డుత్తముండు గుణసముద్రుఁ
డంతరాంతరముల నస్మత్కవిత్వంబు
నకు శిరంబు నూఁచి నన్నుఁ దనిపె.

ఉ. శ్రీపరదేవతాపదకుశేశయబంభరితాంతరుండు గౌ
రీపతిశాస్త్రి గౌరవపరిస్ఫురణమ్మున నన్నుఁ జూచెఁ; జి
త్రాపి పురాణపండకులధూర్వహుఁ డిమ్మహనీయుఁ బోలఁగా
నా పురిలోన వేఱొకబుధాగ్రణి లేఁడని యందు రందఱున్.

ఆ. వె. శ్రీద్వివేదివంశశీతాంశుఁడు కవీంద్రుఁ
డమలహృదయుఁ డతిరసార్ద్రచిత్తుఁ
డెంతయేని ముదము నెనసె బ్రహ్మానంద
పండితుండు సుకవివందితుండు.

తే. గీ. వారు వీ రన నేల, యెవ్వారుగాని
నాఁటిసభలోన మోదంబు నాటుకున్న
వారు నా కెందుఁ దోఁపరు, వారిగుణమె
కారణం బేరు మెప్పింపఁ గలరు వారి.

క. ఒక యామము వినిపించితి
నకళంకముగాఁగ వినిరి యాప్తులు విబుధుల్
సుకవిత్వ మనుచు మెచ్చిరి
యిఁక నొకసభ మఱుదినమున నేర్పాటాయెన్.

---

# 12

## చప్పట్ల పర్వము.

క. మఱునాఁటి యుదయమున నే
నతిముతిఁ గాల్యములు దీర్చి యారామ మొకం
డరయఁగ నేగెడిచోఁ దోఁ
ప రహిన్ గనుపట్టె నొక్కపండితుఁ డనఘా.

తే. గీ. ఈయనఘుఁ డాశిపిళ్లకులేందుఁడైన
యల్లసుందరరామసమాహ్వయుండు
ఆలమూరున మును మనదైన శతవ
ధాన మీక్షించినట్టి విద్వత్ప్రభుండు. 335

తే. గీ. గతదినము సభఁ జూడని కారణమునఁ
గోరె సారాంశమును దెల్పఁగొంచె మేను
మరల వినిపింప మొదలిడ మంచిచెడ్డ
లరయుచుండె మహామహుం డతఁడు పేర్మి.

తే. గీ. నీ రిజస్టరుత్తరము విన్పించి వారి
చాటు పద్యమ్ములను విన్కి సల్పినాఁడ
మోటు లేవియొ తెల్పె నా బుధవరుండు
వ్యాసలింగమనీషి గేహమ్మునందు.

తే. గీ. వ్యాసలింగమనీషియు నయ్యనఘుని
నిర్ణయమె మంచి దనియె సునీతియొఱఁగి
తెలివితేటలుగల్గిన ధీరహృదయుఁ
డెవఁడు గురుదూషణము మెచ్చునే సఖుండ!

ఆ. వె. అంత నేగుదెంచి రయ్యెడ కిఁకఁ గొంద
అందు నిరువు రొక్క యంశమునకు
మున్నె వాదు సల్పియున్న కారణమున
మరల వాదమునకు మనము నిడిరి.

తే. గీ. తలఁపు "డిద్ధడబిద్ధ" యుద్ధప్రహాపన
కర్త యందొక్కరుఁడు వేఱొకండు మఱొకఁ
డిరువురును వాదురాకకై యెంతయేని
వాద మొనరింపఁబూని రవ్వారిగాఁగ.

శా. ఆవాదం బిటుఁ గాదు ప్రస్తుతము వారంతంత లెంతెంతకో
పోవం జేసి యథేష్టరీతిగ నుడుల్ పూరించి ఘోరార్భటుల్
చేవల్ దేఱఁగ నొండొరొకళ్లుఱక 'సీ, సీ!'యంచు నేమేమొయం
చావేశ౯ గదనంబు సల్పిరి భవిష్యత్సూచనల్ దేలఁగ౯. 341

ఉ. ఒక్కఁడు వాదుపక్ష మిఁక నొక్కఁడు వేఱొకపక్షముండి 'వీ
రెక్కుడు వారె యెక్కు' డని యొక్కటి నెక్కటిఁ బోరఁ జొచ్చి "శ్రీ

టక్కరు లేల యిట్టులు కడంగి" రటంచుఁ దలంచునంత మీ
రిక్కడ రాఁ గతంబెదియొ యేర్పడఁ జెప్పఁ డటంచుఁ బల్కుడున్.

ఉ. కాఁకరపత్తి పర్వము దగన్ విని యుంటిరి నిన్నరాత్రి, నా
రాకకుఁ గారణం బది కరంబును దెల్పెడిఁగాదె యేటికీ
రాకడ యూరకుండుఁ డన అంకెలు కొండొక మాని రిద్దియే
సూ! కరతాళ నాటకపుసూచక మాముఖ మంచు నెంచుమా.

ఉ. ఇం దొకరుండు యోగ్యుఁడగునేమొ యటంచుఁ మదిం దలంతు నెం
బెందుకుఁ గాక హీనకులులేనియు వాడని బూతుకూఁతలన్
బొందుగఁ గైత చెప్పిన ప్రబుద్ధుఁడు 'డిద్ధడబిద్ధ' కర్త ము
న్మ్రంచొనరించు నల్లరికి మూలవిరాట్టని లో నెఱుంగుమీ.

ఆ. వె. అతని ప్రహసనంబు నంపె నాకడకు ము
న్నది గనంగ భీతమయ్యె మనము
మందలించి దీని ప్రమందంపు మిది బూతు
చిక్కుఁ దెచ్చుననుచుఁ జెప్పియుంటి.

క. అది హేతువుగా నతఁ డి
య్యదనన్ నా కేదియేని యపమతి సేయం
గఁ దలంపఁ బోలు; సుపకృతి
సదమలులకు నమృతమూ విషమగు నొరులకున్.

తే. గీ. చర్ల నారాయణమనీషిచంద్రుశిష్యు
లొకరివెంబడి నొకరుగ నొకరిమొగము
లొకరు చూచుకొనుచు వచ్చి యొక్కపెట్టఁ
జుట్టుముట్టిరి నన్ను చప్పట్లనందు.

క. సుందరరామమనీషియు
గందరగోళమ్ము జరుగుఁగా యని మెలమె
ల్లం దెలిసి చనియె, బ్రహ్మా
నందమనీషియును గ్రన్ననం జనియె నటుల్.

క. అల రామకృష్ణకవి బం
ధులు దులువ ప్రసంగమునకుఁ దొడఁగిరి, కడుబం
డలు చుట్టును గరతాళము
లొలయించుచు నంగుసేయుచుండిరి తతితోన్. 349

తే. గీ. ఇంటియజమానుఁడైన కృతీశ్వరుండు
వ్యాసలింగాహ్వయుఁడు తక్కఁ బ్రాజ్ఞుఁడొక్క
రుండు నర్యాద లేఁడ, యయోగ్యుఁ డూర
కుండె నల్లరినాఁగ శక్తుండుగామి.

సీ. కౌముది పాఠమ్మె గావలె నా కిప్పు డంచొక్కవిద్యార్థి యడుగఁ దొడఁగె
పోనిమ్ము రఘువంశమేనిఁ జెప్పుమటంచు నిఁక నొక్కవిద్యార్థి యీసడించె
కాఁకరపర్తి యీగ్రామం బెఱుఁగు మంచు వేఱొక్కవిద్యార్థి వెక్కిరించె
పెద్దపేరుగ విందు మిద్దియే నా పస యంచొక్కవిద్యార్థి హంకరించె

తే. గీ. వీరినే పండితు లటంచుఁ బేరుపెట్టి
శృంగభంగాన లిఖియించెఁ గృష్ణసుకవి
అతని ధైర్యమ్మునకుఁ బోలునట్టి ధైర్య
మనృతమునయందు నేనెందు నరయ సఖుఁడ !

ఆ. వె. అటులు చుట్టుకొనిన యవ్వార లెల్లరు
నఱవ లేనుగూడ నఱవ నగుట
"నఱవ గోల" యనెడి యార్యులమాట య
త్తఱిని మదికిఁ దగిలెఁ దరుణ మగుట.

సీ. ఆర్ట్సుకాలేజిలో నాంధ్రగీర్వాణపండితులు శ్రీవ్యాసమనీషివరుల
యనుజుఁ డొనర్చినయల్లరి యప్పట్ల వర్ణనీయము వినవయ్య సఖుఁడ !
భటరాజకవనంబు పచరింతు వీ వని యొక్కొక్క పరి నన్ను నొక్కి పలుకు
మీసాలుదీయించివేసెద నని మఱియొక్కమా టాగ్రహం బొందుచుండు

తే. గీ. ఆయశస్వి సీతారామయాహ్వయుండు
భ్రాతృభక్తికి సౌమిత్రిపార్థులతని
కించుకయుఁ బోల రింతకు హేతువేమొ
యెఱుఁగుదే తిర్పతిమనీషి ! యిదిగో వినుము.

ఉ. వ్యాసమనీషి కైతమును వహ్వరె యంచును మెచ్చునంట ! యే;
నాసకలజ్ఞు మెచ్చని యహంకృతిశాలికిఁ బాచితం బిటుల్
చేసిన నొప్పునఁట ! యిటు చెప్పఁ దొడంగె నతండు దీర్ఘని
శ్వాసపురస్సరంబుగఁ; బ్రశాంతముగా నిటు లేను బల్కితిన్. 354

ఉ. వ్యాసులవారు నాకుఁ గడు బందుగు, లెంతయొ గొప్పవారు, త
ద్దాసుఁడ నేను; వారి కవితాకలనం బది నాకు నచ్చదే

దోసమొకాని, యే నొక బుధుండను గాను, మఱొక్క రమ్యహా
భ్యాసుని మెచ్చవచ్చు; బలవంతము పెట్టిన నేను మెత్తునే! 355

ఉ. నాకవనంబు వారలకు నచ్చదు, నా కలవారి కైతలోఁ
బోకడ లింపు నింప; విది పూర్వ జనుర్మహిమంబొ యేమొ! న
న్నీకతనన్ వృథాగ నిటు లిక్కడ నొక్కట కిచ్చనేయు మీ
రాకడ ప్రాజ్ఞు లొప్పరు, కరం బిది క్రూరముగాఁగఁ దోఁచెడున్.

క. అని యేదో యొక తెఱఁగున
ఘను సీతారామమూర్తిగారిని వారిం
చు నుపాయమ్ములు వెదకుచు
వినయముతోఁ గల్పుచుంటిఁ బెంకితనమ్మున్.

క. నినె్నన్నఁ గొట్టుదురు న
న్నన్నన్ శాఖాభిమాన మడ్డుపడె న్నా
యన్నా! యే మని తెల్పుదుఁ
జిన్నెలు వన్నెలును నాఁటి శిష్యులచెయ్దుల్.

క. నాపినతండ్రికుమారుం
డోపికమై వారి కేమొ యుక్తులు సెప్పన్
గోపంబె హెచ్చె వారికి
బాపురె, యే మందు నాసభాశోభ సఖా!

ఉ. నాలుకయొండె నాకుఁ జిననాఁడు మొదల్ మఱి నేఁటిదాఁక నా
కీలలి యెచ్చటన్ జరుగ దీపయినేనియు నాఁటెగీతి నా
కేల ఘటించు దైవ "యిహిహీ యిహిహ" యని నన్ను సారెకున్
గేలిని గొట్టసాగిరి పగిల్చిరి భూమియు నాకసంబునున్.

ఉ. కాఁకరపత్రిలోనఁ గపికాండము లున్న పటంచు వింటి నేఁ
డాకలితంబులయ్యె నవి, యందఱు నొక్కటఁ జట్టికొన్నచో
నాకవనంబు వారల నణంపఁగ నేర్చునె! దేహదార్ఢ్యమా
నా కొకభంగిదయ్యె, నిఁక నాగతి యేమగునో వచింపుమా!

తే. గీ. గణపతిని బోలు విద్యార్థిగణము కొంత
ఆంజనేయుని బోలెడు నదియుఁ గొంత
కుంభకర్ణుని బోలెడు కొంతగణము
చుట్టుముట్టె సేనాపతి చూచుచుండ. 362

క. సేనాపతి యగు నలవ్యా
సానుజువాగ్ధోరణికి నహంకృతికి మితిన్
గానను; దలనరసిన యల
మానిసి కల్లరి యొనర్పు మన సెటు లయ్యెన్!

తే. గీ. "నాయనా! బా"బటంచు సేనాయనాథ
గతిని వేఁబుచ్చుచును నొక్క గంటకాల
మెట్లొ గడపితి నంతట నేగుదెంచె
చర్ల నారాయణమనీషిచంద్రుఁ డనఘు.

చ. "బ్రతుకుము జీవుఁడా" యని యపారముదంబును బొందునంతఁ బం
డితుఁ డతఁ డాస్య మెంతయుఁ గడిందిగ నెజ్జవడంగ "శబ్దసం
గతి నెఱుఁగంగ లేక కవి కాదగు ద" ట్లని వెక్కిరించుచున్
మితికిని మించు నొక్క మిడిమేలపుఁ ద్రోవకు బండితోలుచున్.

ఉ. "కౌముది చెప్పనేరవఁట! కాఁడగుసంగతి చూచికొన్మ, నీ
వీమెయిఁ గాగితమ్ముపయి నిట్లనె వ్రాయు" మటంచుఁ గోపము
ద్రాముషితాత్మగౌరవభరంబుగఁ బల్కెను, వ్రాసి యీయఁగా
నామెయి నేను సిద్ధపడునంతట నొక్కకలార్థి వేర్మిడిన్.

మ. తతవాగ్ధాటి చెలంగఁగా ననియె "చత్వారింశదబ్దంబు సం
గత మెట్లయ్యెనొ తెల్పు"మం, చతని వెడ్కన్ దీర్చితిన్; మీఁదఁ ద
త్ప్రతిరోషం బొక కొంత తగ్గె, నటుపైఁ బ్రాజ్ఞేతరాలాపసం
గతి యొక్కించుక తగ్గెఁ, జప్పటలు తగ్గంజొచ్చె నంతంతకున్.

తే. గీ. అశ్వమేధ విమర్శమ్ము నందునున్న
'దుర్ణయ' పదంబునందు సాధుత్వ మిట్టి
దనుచు నాయంత నేఁ జెప్ప నలఘుమూర్తి
చర్ల నారాయణమనీషి సంతసించె.

తే. గీ. ఏకవచనప్రయోగాన నిమ్మహాత్ముఁ
డింతదాఁకనె మట్లాడె నంతలోన
మరల గౌరవమును జూపి మాటలాడఁ
దొడఁగెఁ బండితుఁ డెట్లు తుందుడుకు చెందు! 363

ఉ. కోపవశమ్మునం గలిగెఁ గొండొక తుందుడు కిమ్మహాత్మునం,
దాపయి నెట్టులో యడఁగె నయ్యది; పిమ్మట మంచిరీతి నే

చూపె నితండు శిష్యులను జూపరు దౌష్ట్యము నంతగా "యథా
భూపతి" యన్న న్యాయమును బూర్తిగ నే మది నప్డెఱింగితిన్. 370

చ. అదియునుగాక నాగశర మట్టులు దాఁచినప్రశ్న మంతలోఁ
బయట నడంగ నిం కితఁడు పట్టువడం డని తోఁచి గౌరవా
స్పదముగ మాటలాడుటకు శాస్త్రులకున్ మది గల్గఁబోలు; నా
కది గన నట్లు తోఁచె, నిజమౌనో, యసత్యమెయౌనో! తిర్పతీ!

శా. ఈ నారాయణశాస్త్రిగా రనఁగ నెంతే యోగ్యులుం బందుగుల్
జ్ఞానుల్ తుందుడు కందు కారణము నేఁ గన్పెట్టితిన్ వీరిపే
రానంగాఁబడె గీరతమ్మున, నదే యాత్మన్ గలంగించె; లే
దే నిన్ "నీ" వని నన్ను వారనుట కన్నే గుండె లుండున్, సఖా!

ఉ. వీరిగురుండు వీరయ వివేకి యొకించుక నాకు శిష్యుఁ, డా
కారణమై ప్రశిష్యతను గాదనఁజాలఁడు దేవుఁడైన; నీ
ధీరుఁడు నన్ను "నీ" వనుచుఁ దేఁకువమాలి వచించు టెట్లు! ధీ
దూరులు త్రొక్కు త్రోవను బుధుం డెటు త్రొక్కు? వచింపుమో సఖా!

తే. గీ. హీనసంబోధనము గురు నెడలఁ దప్పు
గాదనుచు నీతఁడే బాలకవికిఁ జెప్పె
నేమొ, యని యెంచితిని గాని యిమ్మహాత్ము
పదపటిచరిత్ర మది ధృవపఱచదయ్యె.

మ. మితభాషిత్వము మేనిమేలిమియు సన్మిత్రిత్వముం బోల్చి పం
డితుఁ డీతండు కలావివాదమునకున్ డీకొంట యుక్తంబె; త
త్కృతికిన్ శిష్యుల నొప్పగించి వృథగాఁ గీకీధ్వనుల్ చప్పటల్
ప్రతియోగ్యుల్ విని నొచ్చుకోఁగ నొనరింపం జేసినాఁ డేటికో.

ఉ. "కౌముదిచెప్పు"మం చొకఁడు, "గంటకు నూఱు వచింపు"మం చొకం
డేమియుఁ దోఁపనీక యొకఁ, "డీ వసమర్థుఁడ"వంచు వేఱొకం
డీ మహనీయు ప్రేరణము నే గొని యల్లరి చేసినారు; వి
ద్యామహితుం డితం డెటులు తప్పుపథమ్మునఁ గాలు వెట్టెనో!

ఉ. 'పండితు డంచు వ్రాసెద వవారిగ సారెకు నెంత పండితా
ఖండలు డాతఁ'డం చదుగఁగా గమకింతువొ, చెప్ప నేల! యా
తండె ప్రమాణపూర్తిగ శతఘ్నికిఁ గర్త; తదీయపాండితీ
చండిమ మాశతఘ్ని పెలుచన్ వచియించెడిఁ జూడు మయ్యెడన్. 377

ఉ. ఏదియుఁ జేతఁగా దనుచు నే వచియించుట తప్పు నన్య మిం
కేదియు లేక పోయె నొకఁడే నియుపాయము; దానఁ జేసి యే
నా దెస వారి కెంతటి ఘనంబగు కోపము గల్గియున్న న
న్నేదియుఁ జేయలేక యిటు లింటికిఁ బంపిరి సుమ్ము తిర్పతీ !

చ. అడిగిన దెల్ల రా దనుట కాత్మను బొంగిరి గేలి గొట్టి రా
బెడిదము సైఁచితిన్ సురిఁగి వేఱొకచోటికి వచ్చుపిమ్మటం
గడబిడ నెల్ల నాఁగఁదగు కార్య మొనర్పఁగ వచ్చునంచు నా
యెడఁద నుపాయ మిట్టి దొకఁ డెట్టులొ తోఁచెను దైవికమ్ముగన్.

చ. "కల రిట రామకృష్ణకవిగా రలవారికి మీకు నున్ సభన్
గలిపెద, మెవ్వ రెక్కుడొ తగన్ దెలియంబడు" నంచుఁ గొంద ఱు
జ్జ్వలితగతిన్ వచించి రల ఛాత్రులయందలివారు, వారికిన్
దెలియదొ పూర్వవృత్త, మిటు తేఁకువమాలి వచించు టేటికో !

చ. తిరుపతిశాస్త్రి వారిపయిఁ దేఁకువ డీకొనినప్పుడోడి నేఁ
డరయక నన్ను మార్కొనుట కాకవిగా రెటు లొప్పికొందు ! రా
తిరుపతిఁ బిల్వఁ దండులకుఁ దీర్చును మీఱుద మంచుఁ జెప్ప వా
గ్దురుసుగ నాపయిం దొడరి తుందుడుకున్ బచరించి రయ్యెడన్.

శా. వారే కాదెవ రేగుదెంచినను నే వారింపఁగా నేర్తు నే
నా గామద్రివిడుండ నయ్యు సమయం బాలాటి దయ్యెన్ మహో
దారుల్ తక్కిన పండితోత్తములు లేరచ్చోట, నున్నప్పు డి
వ్వీరుల్ వీటేఁడిపోకలన్ జలిపిరే ! వీక్షింపుమో శ్రీపతీ !

మ. తతవిద్యాచతురప్రభావు లగు సీతారామశాస్త్ర్యాదు లు
న్నతటిన్ దప్పుడుపోక లొప్పరని విజ్ఞానుల్ కలార్థుల్ మహా
మతి నారాయణశాస్త్రిలున్ గనలి యీమాడ్కిన్ బ్రసంగింప కు
న్నతబుద్ధుల్ బలె మిన్నకుండి రిపుడన్నన్ లేచి రొక్కుమ్మడిన్.

ఆ. వె. "బాలనాయకంబు బహునాయక" మటన్న
యార్యజనుల మాట యాత్మయందు
జ్ఞప్తిదగిలె నాకుఁ గాఁకరపర్తిసం
ఘమ్ము చుట్టుముట్టి కలఁచునపుడు. 364

శా. మీసాల్ దిర్గించెడి వ్యాససోదరుల కేమేన్ జెప్పితో నెంతునా !
కీనుం బాసను లేని యల్లరుల నే కేలెత్తి తూలింతునా !

“సీ! సీ! యిట్టిదశే కదా!” యనెడి సుస్త్రీవారి వారింతునా!
నా సామర్థ్యము దేని కిందుఁ దగు నన్నా! శ్రీపతీ, చెప్పుమా!

చ. కలకలముల్ గళార్భటులు గ్రిందుకొనం, దరిలేని చప్పటల్
మోలయఁగఁ, బోటుమాటలును బొంపిరివోవఁగ, వెక్కిరింపుకం
పలమఁగ, నేమి చెప్పుదు నహో, యిఁక నాకగు శృంగభంగముల్ !
నలుదెస ధార్తరాష్ట్రులును నద్మ మురారియు నయ్యొ నయ్యొడన్.

ఉ. ఆతటి విశ్వరూపమున నందఱధాటికి నాఁగెఁ గేశవుం;
డీతటి విశ్వరూపమున నెల్లరధాటికి వీఁడు లోఁగినాఁ;
డాతటి భీష్ముఁ డెట్టు లటు లయ్యెను వ్యాసమనీషి నేఁడు; ప్ర
ఖ్యాతులు లేరు పెద్ద; లిఁక నయ్యెడ నల్లరి యెట్లు రూపఱున్ ?

ఉ. ‘బందు వటంచు సైఁచి’ రని వ్రాసి రదెక్కడఁ బోయెనొక్కొ! యీ
సందునఁ బెట్టి నొక్కెనెడ సాక్ష్యము నేఁటొకఁ డేల! వారి వ్రాఁ
తం దిలకించినం దెలియదా! నికరంబును దేల్చికొన్న; డాఁ
చం దలఁపూనినం బయికి సత్య మెటో యుబుకున్ దనంతటన్.

ఉ. ఎంతని వ్రాయుదున్ సలిపి రెంతటి గోలయునేని, సర్వమున్
శాంతము నూఁతగాఁగఁ గొని సైఁచితి వ్యాసమనీషి “సాగ” దం
చింతయు నాఁగుయత్నమున కియ్యకొనం గమకింపఁ డెంతయున్
సంతస మిచ్చెఁ జర్లకులచంద్రున కీ యెకసక్కెపు న్నుడుల్.

మ. “మన దీయూరు గదా, యెటే నితని జిమ్మం గట్టఁగాలేమె” యం
చనుకొన్నా రలవారు; నే నది నిజం బౌనంచు లో నెంచి యెం
దునకుం డిగ్గకపోతి; నంతనె ననుం దూలించిన ట్లెంచి రా
ఘనబుద్ధుల్; గను “శృంగభంగ” మను సద్గ్రంథమ్ము నం దంతయున్. 390

---

## శృంగభంగము.

(కాఁకరపర్తినివాసి చర్ల వెంకటచలపతి శాస్త్రిగారి పేర బ్రకటితము)

### పీఠిక.

“ఏ దేశము మీకు సమ్మతమొ?” అని వ్రాయించిన చళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు “హూలెండు!” అనుమాటమీఁద మా గ్రామమునకు దయచేసి యీ క్రిందిచర్య నంతయు నడపిరి. ఇం దసత్యలేశముగాని, యతిశయోక్తిగాని, లే దనుట కిందుఁ బేర్కొనఁబడిన విద్వచ్ఛేఖరులె సాక్షులు. కవిసమయసిద్ధ మగు నేకవచనప్రయోగాదిక మిందుఁగలదు. పండితుల కది హర్షదాయక మగుననియే తలంచెదను.

(శృంగభంగము)

క. నారాయణునకు గురునకు
భారతకవయితకు వ్యాసపండితునకు జో
హారు లొనరించి కవితా
భారతికిన్ మ్రొక్కి జయముఁ బఠియింపఁదగున్.

మ. ప్రశమం బబ్బ విరోధికృత్సమమహావైశాఖశుద్ధత్రయో
దశినాఁ డిర్వురు బందువుల్ నడుపఁ బత్రగ్రంథదుర్లేఖలన్
దశలోనం గదియించి వేంకటకవీంద్రశ్రోత యేతెంచె దు
ర్యశముం బాపుకొనంగ గెల్పుగొనఁ గారావల్లిమత్తల్లికిన్.

వ. అట్లు బహు పండితమండితంబును కృష్ణకవినివాసగ్రామంబు నగు కాఁకరపర్తికి శకటారూఢుండై యరుగుదెంచి సంపన్నుఁడును బందుగు నగు నొక గృహస్థునియింట విడిసి యిష్టాన్న సంతృప్తుండును సుఖశయితుండు నయి—

ఉ. కాఁకరపర్తి పండితశిఖామణి మండలి వేఱువేఱ నా
లోకన మాచరించి తమలోపము లేదని తెల్పి రాముపై
వాకొనినాఁడ గీరతము వచ్చి వినుండని పిల్చి యొక్క సు
శ్లోకుని సౌధ మెక్కి తనశ్లోకములం బఠియించు నత్తఱిన్.

ఉ. "వ్యాసకవీశ్వరుం డలఁతివాఁ"డని కబ్బములోన "నేడ నా
తో సరివారు లే"రనియుఁ దోఁచిన రీతిఁ బ్రగల్భమాట రా
గా సభవారు సైఁచి రది కర్ణకఠోరమె యైన బంగతం
జేసి విడంబముల్ మఱియుఁ జెప్పఁగ సాగె నతండు ప్రేల్మిడిన్.

చ. పలువుర వేంకటేశ్వరుఁడె ప్రార్థనఁ బిల్చె దనంతఁ; గొందఱున్
బిలిచెను దత్సభాపతియుఁ; బిల్వఁగలే దొకరైనఁ గృష్ణు; న
బ్బలి "ననుఁ బిల్వఁబంచెనె? సభాపతిగా" రన, దూత "లే"దనెన్;
గలహము నాత్మ నెంచి కవిగండరగండఁడు రాఁడు మేడకున్.

వ. వెండియు గీరతాఖ్యానమునందు "గురువులతోడం గూడియేని జయింపరం" డను నర్థముగల యొక వికత్థనవాక్యముం జదువుచు నెదుట బృహస్పతిబోనివాని నారాయణ బుధేంద్రుం గని నెఱచఱచి,

చ. "ఎఱుఁగను మీమహత్త్వ మిదమిత్థ మటంచును దెల్లమయ్యె నేఁ
బొరబడి రజ్జులాడితిని, పోఁడిమి గల్గిన రామకృష్ణులన్

(శృంగభంగము)

గురువులతోడఁ గయ్యమునకుం జనుదెండని తప్పవ్రాసితిన్
శర ణది తీసివైతు” నని చల్లఁగ దాఁటె యథార్థభాషలన్.

ఉ. మేకుబిగింపు పర్వమును, మేలగు నీశ్వరవేరుగిర్వమున్
గేకల మందలింపనెడు గిర్వము, జీలుగుబెండు గిర్వమున్
స్తోకము శాంతిగిర్వమును జొప్పడు వాసినిగన్న గిర్వమున్
గాఁకరపత్తి గిర్వమును గైకొనిపాడె నతండు వేడుకన్.

క. కల్లరివారలజాబుల
నల్లరిపద్దెముల గిరతాక్షేపములో
బొల్లుల నుల్లాసంబునఁ
గొల్లలుగా నతఁడు విబుధకోటికి వినిచెన్.

వ. అంత దివాకరుం డస్తాద్రి కేగుటయు నాఁటికిఁ గొలువు సాలించి యందఱుఁ దమతమ విడిదలకుం జనిరి. వేంకటేశ్వరుండును నిజనివాసంబున కరిగి కతిపయసుహృజ్జనపరివృతుండై “కృష్ణకవి ధీరమ్ము గలాఁడేని యెల్లి నాతో నవధానము సేయఁగూడు” ననియు, “నేటికొల్వున నారాయణబుధుం క్షమింపఁగోరుట వినయమార్గం” బనియు నిచ్ఛానురూపమ్ముగఁ బద్దులాడుటయు నదియెల్ల నాప్తముఖమ్మునం దెలిసి శ్రీనారాయణబుధేంద్రుండు కృష్ణకవి రావించి యిట్లనియె.

ఉ. వింటివె రామకృష్ణ! మన వేంకటశాస్త్రివచోనిరూఢి? న
ట్లింటికి నేగి నెండియును నెప్పటియాటమె యాడుచున్నవాఁ
డంట! యెదుర్చ మీనృపునియానతి యున్నదియొక్కొ నాఁగ, నా
డంట “భవన్నియుక్తి నవధానమొనర్పఁగ మెచ్చ రేఁ”డనెన్.

వ. క్రమమ్మున నారేయి గడచనుటయు మఱుచటినాఁడు పూర్వాహ్ణమ్మునందు,

సీ. అగ్రహారికుఁడు విద్యాధికుండు సుగుణశాలి సుందరరామశాస్త్రిగారు
ఘనకీర్తి హితకారిణిని గురుండును సాధుమతి వ్యాసలింగపండితుఁడుగారు
ధవళాద్రిలో నుపాధ్యాయుండు సౌభాగ్యశాలి సీతారామశాస్త్రిగారు
గానవిద్యను బేరుగలవాఁడు చర్లాబ్ధిచంద్రుండు లక్ష్మణశాస్త్రిగారు
వేదులాన్వయవార్ధి విమలశీతాంశుండు సూర్యనారాయణసూరిగారు
అవధాని సంస్కృతాంధ్రాభిఖ్యాయికాకర్త సూర్యనారాయణసూరిగారు

(శృంగభంగము)

తుని రాజుగారియుద్యోగి పండితపురస్సరుఁడు బ్రహ్మానందశాస్త్రిగారు
చళ్ళపిళ్ళాన్వయ సాగరేందువు కవిశశి చిన్న వేంకటశాస్త్రిగారు
సంస్కృతసత్కళాశాలలో నొజ్జ సజ్జనసుతమతి రామశాస్త్రిగారు
సాహితీఘనుఁడు శాస్త్రప్రసక్తుం డభిజాతుఁడు వేంకటశాస్త్రిగారు

గీ. మఱియుఁ బండితులును గవుల్ మఱియు ఘనులుఁ
పిన్నలును బెద్దలును గూడియున్న సభను
చళ్ళపిళ్ళ వేంకటకవీశ్వరుఁడుగారు
గీరతము విప్పి నెండియు గెలిచేయ.

వ. కతిపయచ్ఛాత్రసహితుండై యాసభావేదికను విచ్చేసియున్న నారాయణ బుధేంద్రుం డది సహింపఁజాలక సముచితభాషణమ్ముల వేంకటేశ్వరు గీతపాఠమ్ము నాఁగి,

ఉ. "మీరు రచించు చిత్రముల మీఁది రచించును కృష్ణశాస్త్రి నా
కూరిమి శిష్యుఁ; డెచ్చటనొ గొప్పలు చెప్పుదు రేమి కార్యమో!
పోరుఁడి యాతనిం బిలువఁబుత్తు" నటంచు గురుండు వల్క, నా
ధీరుఁ డికేమి చెప్పుదును "దత్తెతె పెప్పెపె మెమ్మెమే" యనెన్.

క. ఎవియో వీరము లాడిన
నవధానము సేయఁ గృష్ణుఁ డరుదేఁడు యశం
బవల నుసాధం బను మతిఁ
గవి వేంకటశాస్త్రి రేయి గరువము చూపెన్.

చ. తిరుపతిశాస్త్రి వచ్చునెడఁ దీర్పరి యాతఁడు సేయుఁగాని నే
మఱచితి నే మెఱుంగ నను మాట యిదేమిటి నిన్నరేయియే
పురుషుఁడయేని కృష్ణకవి పోరెడివాఁడని యంటిరంట; నా
నుఁకయ పక్కవాఁడ నని యోడినతండు వచించె నద్దిరా!

ఉ. వారలలోనఁ గృష్ణకవివర్యుఁడు మద్భ్రాయమందు నేనెపో
ధీరుఁడనంచు నెల్లరకుఁ దెల్పుచునుందురు గాన నిర్వురన్
బోరఁడు మీవధానముల పోఁడిమిఁ జూతుమటంచుఁ బల్క నా
నేరుపుకాఁడు మా తిరుపతి న్వెలఁబొందఁగ సభ్యులందఱున్.

శా. నాకున్ శిష్యుఁడు రామశాస్త్రికవి కొన్నాళ్ళాయె మీచెంత నే
దో కాలక్షయ మాచరించుటయ నోహో శిష్యుఁడం చెప్పుడున్

(శృంగభంగము)

మీకబ్బమ్ములఁ జెప్పుకొండు రది మేల్మికానె? మీరెట్టు లా
శ్రీకృష్ణున్ గవిరాజుఁ జెప్పి రన, నిస్సీ! మాట రా దచ్చటన్.

వ. అంత

ఉ. కౌముది జేతఁబట్టి నయగారపుమాటల రామశాస్త్రి "మీ
రేమి యెఱుంగువారో, యిపు డించుక చెప్పుఁ" డటంచు వేఁడఁగా
నామహనీయమూర్తి "యదియంతయు విస్మృతమయ్యె నిప్పుడే
నేమియుఁ జెప్పలే" ననియె నెల్లరు విజ్ఞులు బిట్టు నవ్వఁగన్.

ఉ. వ్యాకరణమ్మున న్గెలుతు వాదమునం దని రిత్తపట్టముల్
గోఁకి; యిదేమి? నేఁడిటులు కొంచెమి లేదని నిక్కమాడుటల్
నాకు సతీర్థ్యులాకవులు, నన్జదివింపఁగలేని మీరెటుల్
వాకొనవేర్తు రాపిబుధవర్యులయొద్ద; విడంబ మేటికిన్.

ఉ. కౌముదిసెప్పుడం చడుగఁగా మఱి వేదులరామశాస్త్రి య
ప్రామహితుండు పుస్తకము నంది పదంపడి కొంత చూచి "య
య్యా! మతిలేదు విస్మృతమె యయ్యెను సర్వము చెప్పలేను న
న్నేమనియాడువారలిఁక, నింత నిజం"బనె నెల్లవోవుచున్.

చ. సరగున రామశాస్త్రియుఁ బ్రశంస యొనర్పఁగఁ జెప్పనేరమిన్
గిలుదయి యాకవీశ్వరుఁడు క్రిందులు మీఁదులు సూచుచున్నచో
గురుఁ డిటు పల్కె "శబ్దకృతిఁగూడ నెఱుంగనియట్టివార ల
బ్బిరుదులు వ్రాయనే?" యనినఁ 'జెప్పెపె మెన్నమె చెప్పలే' ననెన్.

ఉ. "తాముపచింపఁగావలెఁ బ్రతాపచరిత్రముఁ దెచ్చినాఁడ నిం
దేమి పఠింపఁజేయుదురో? యి"ట్టని రామబుధుండు పల్కఁగా
నామహనీయుఁడున్ "దిరుపతయ్యకవీంద్రుఁడు గాని యిందు నే
నేమియుఁ జెప్పఁజాల" ననియెన్, నిజమాడినఁ దప్పులేదుగా.

చ. "పెరుఁగును బువ్వయున్ బెసవి పెద్దసహోదరుఁ దోడఁగొంచు స
త్వరముగ వత్తు నందనుక తాఘము నిల్వు" మటన్న బచ్చునాఁ
"డిరుపతివెంటరా నరుగుదెంచెద శ్రావణమాసమందు నే
మరల బలమ్ము మీఱ"నన మార్కొని బుచ్చివధాని యిట్లనెన్.

చ. "తలనరియుంగ వారలును దాతలు తండ్రులతాతలై మఱిన్
గలహము సేయవచ్చెదరుగాని, యిదెట్లిపుడయ్యెఁ జాలులెం

డలయిక నంద నేమిటికి? నల్కవహింపకుఁ డింకమీఁద మీ
బలమును వారిశక్తియును బాహ్యములయ్యె జగమ్ము మెచ్చఁగన్."

వ. ఇట్లు పరాజితుండగుటయు నొక సభ్యుండు లేచి;

ఉ. "వ్యాసకవీంద్రుఁ డింతయనువాఁడవె? నీవును బట్టుపద్దెముల్
జేసిన యంతమాత్రమునఁ జెల్లెనె? యాయన తేరిచూడ నీ
కూసుకవిత్వ మెంత? యిదిగో నన లోఁగితి; కారవెల్లకున్
మీసము లప్పగించి చనుమీ! యిఁక మాటలు వేయు నేటికిన్.

క. ఘనులు శిరసావహించెదు
వనర్ఘరాఘవముఁ దూలనాడెదు దానిం
గనుఁగొని నీ యిష్టము వ
చ్చిన దొకపద్దెమ్ము విప్పి చెప్పంగలవే?"

వ. అని యుల్లఁబుచ్చిపోనాడె నిట్లు కొలువు ముగియుటయు దుండగీలగు బాలకులు కొందఱు కరతాళంబులు వైచిరి. మధ్యాహ్నంబగుటయు నెల్లరుభోజనమ్ములకై తమతమ నెలవులకుం జనిరి. వేంకటకవీంద్రుండును,

చ. స్థిరపడి ప్రశ్నకుత్తరముఁ జెప్పఁగ నేరక కుఱ్ఱవారల
ల్లరి యొనరించిరంచు నపలాపము సేసెదునంట బాపురే!
గురుఁడును కుఱ్ఱ, శిష్యులును గుఱ్ఱలు నూటికినెంచిజూడఁగా
నిరువదియొన్మి దేడులకు నెక్కుడు ప్రాయము లేద యేరికిన్.

వ. మెండియు సాయాహ్నమ్మునందు సీతారామశాస్త్రి గౌరీపతిశాస్త్రి ఘన స్వరులగు బుధేంద్రులు కొలువైయుండ సతీర్థ్యసంఘమ్ముతో నల్లమరాజు రామబుధుం డచ్చటికి విచ్చేసి వేంకటకవివరు నుపలక్షించి "పూర్వాహ్ణమ్మున వారందఱు దూయఁబట్టుకొనుట నే నట్టింటి నని పల్కరఁట, నిక్కంబే?" యనుటయు నక్కవివరేణ్యుండును నిది యథార్థము కాదని ప్రతిపాదించె నంత మఱియు నొక ప్రధానచ్ఛాత్రుం డయ్యుపండితుల సాక్షులుగాఁ బలికి,

మ. "అవధానమ్మునయందు వ్యాకరణమం దధ్యాపనమ్మందు నే
వివిధప్రక్రియలందు మీకుఁగల ప్రావీణ్యంబు సూపింపుఁడీ
వ్యవధాన మ్మింకఁ లేదు కృష్ణుఁ డిదిగో వచ్చెన్ బుధా!" యన్న న
క్కవి పూర్వోక్తమె నిర్వహించెను వినంగాఁ బండితుల్ మెండియున్.

(శృంగభంగము)

చ. కల్లలువల్కినార లని గ్రంథములన్ లిఖియింప నేలొకో?
కొల్లలుగాఁగ దోషములఁ గోవిదులొప్పినవాని వ్రాసినా
రెల్లెడఁ జిమ్ముచుండి, రవి యే బుధుఁడున్ గనియుండుఁ, గాదనం
జెల్లునె? వానిదిద్దుకొనఁ జేఁదె? యథార్థము తా మెఱుంగరే?

ఉ. వారు శతఘ్ని వ్రాసిన ప్రవార్యములౌటను దిద్దుకొందు మం
చీరు వచించినారొగద? యిన్ని యబద్ధము లున్నగ్రంథ మె
వ్వారలు సూచి యాడ, రిఁక వారలగ్రంథము మీఁద నెవ్వరో
దూఱులు వ్రాసినార లవి దోసములే? ధర గొడ్డువోయెనే!

వ. కాదేని ముఖాముఖి వాదించి సాధించుకొనుం డనుటయు నా కవిశేఖరుం
డంగుల కియ్యకొనక,

ఉ. "తిరుపతిశాస్త్రి పల్కఁబడెఁ దిర్పతియంచును రామశాస్త్రిచేఁ
బఱపతినిల్ప నేనిటకు వచ్చితి, దప్పదికాదొకో?" యనన్
సరసులు సభ్యు లిట్లనిరి "చాలును వేంకటరామశాస్త్రి నా
తిరుపతి 'రామయా!' యనినఁ దీరదె? తిర్పతిఁ 'దిర్పతీ' యనన్."

ఉ. వేంకటరామకృష్ణ కవిపీరులు రిత్తలు వ్రాసిరంచు మీ
రంకము చేసినారలట యయ్యా! యథేచ్ఛగ, నెందు మీకు శ్రీ
కింకపిరాజ మత్తగజకేసరినామము నెవ్వఁ డిచ్చినా
డింక వచింపుఁడన్న, నది యేమొ ధరించితిమంచుఁ జెప్పవో
వేంకటనేత! వారనన వేడ్కయె? మే! లని రెల్లవారలున్.

వ. అట్లు సభ ముగియుటయు నాటిరాత్రి వేంకటకవీంద్రుండు భాష్యకార బుధేంద్రుం గని యెల్లిని సంధనడపుఁడని కోరి వేకువకడ లేచి సబంధుండై తమ గ్రామమ్మునకు విచ్చేసె నంతనిక్కడఁ బౌరులు,

గీ. శతవధానముఁ జేయఁగఁజాలనన్న
యతని కింతవిడంబమే మనెడువారు
కౌముది మఱచిపోయిన ఘనున కింత
యల్లరిం జేయ నేమిటి కనెడువారు.

ఉ. తారె శతావధానులఁట! తక్కినవారలు పేరుపెట్టుకొ
న్నారఁట! లోకమందుఁ గవినాయకు లందఱు జన్నిదమ్ములో

(శృంగభంగము)

వారఁట! రండు పొండులఁట వహ్వారె! హీ౯విడనాడి యాడు న
ర్బీరము లన్నియుఙ్ ముగియఁ జెప్పెనె మెమ్మె మె యయ్యొ నేఁటికిఙ్.

ఉ. తారును కృష్ణుడుఙ్ శతావధానముసేయఁగ మెత్తు మన్నచో
నేర నటంచు నిబ్బడిగ నిక్క_ము వేంకటశాస్త్రి చెప్పె, నిం
కారయ నెన్నియెన్ని యయథార్థము లాడిన నేమియయ్యెడుఙ్
బీరము వోయె, గీరతము పిప్పియె సారము లేదు దానిలోఙ్.

వ. అని చెప్పఁ గొనసాగిరి.

ఉ. శౌర్యము గల్గువాఁ డని ప్రజల్ జయవెట్టగఁ దన్ను సింగమం
చార్యులు నవ్వ లేళ్లనుచు నన్యులఁ జెప్పిన కల్లకీడె దో
ర్వీర్యమునూపు చెళ్లపిళ వేంకటశాస్త్రిది మేఁకపోతుగాం
భీర్యమటంచు నెల్లరకు వెల్లడియయ్యె; నిఁకేమికావలెఙ్.

ఫలితార్థము.

చ. వినుకలి గిల్లికయ్యమును వెట్టిన వేంకటశాస్త్రి యోడపో
యెను, గురుపాదభక్తుఁడగు కృష్ణునకుం జయము ల్చె నింకమీ
దను జెళపిళ్ల వేంకటవధాని యెదేనియువాదియ వారితోఁ
జెనఁగఁగ రామకృష్ణకవివీరులకుం బనిలే దొకింతయుఙ్.

---

## (1) ప్రశ్న.

ఈ శృంగభంగకవిత్వ మింయు వ్రాలు చేసిన చర్ల వెంకటచలపతిశాస్త్రు
వారిదే యగునా?

### ఉత్తరము.

పల్లెపాలెము, 8-7-11

.........గారికి— మధునాపంతుల వెంకట సుబ్బారావు నమస్కా_ర......
మఱియు రామకృ......... యీమధ్య నిచ్చటి కేతెంచి తాను చేసిన శృంగ
భంగము, యిచ్చటి వారికి విన్పించి......"కారవల్లికిఙ్ మీసము లప్పగించి
చనుమీ యిక చాలును నీప్రతాపముల్" అనుచుఁ గొన్ని పద్దెములు చదివెను
........... వెం॥ సు॥ రా॥

ఉ. ఇంతటిమాత్రనే విజయ మేర్పడుటే ఘటియించునేని, వృ
త్తాంత మెఱుంగఁ బోవు నల యంజనపుత్రుని తోఁకఁ గాల్చి ని
శ్చింతత గన్న రక్కసుల శ్రీ గద యీ విజయంబు; మేలు, మే
లెంతటి బుద్ధిమంతు లుదయించిరి కాఁకరపర్తి నో సఖా !

మ. అపుడేఁ జెప్పితి వారితోడ "మిము నే నాఁగంగలే నియ్యెడన్
గృపమైఁ దఱ్ఱుడకోమ అెూక్కుడకో మీ రే తెంతురేనిన్ భవ
చ్ఛపథంపుంబలుకుల్ గనుంగొనెద మీ సామర్థ్యముల్ నా కవి
త్వ పటుత్వమ్మును బ్రాజ్ఞలోకమునకుం దార్కాణమౌ నయ్యెడన్."

ఉ. కాఁకరపర్తి కేగునెడఁ గావలెఁ బోలిసువారి సాయ, మిం
కేకడనైన నయ్యది యొకించుకయున్ వల, దందు నుత్తము
శ్లోకులు పండితుల్ గలరు శుద్ధమనస్కులు; వారిఁగూడ నీ
పాకులు లెక్క వెట్టరఁట ! వారొనరించెడిదేమి పిమ్మటన్?

---

14-7-11, విజయనగరము.

"..........గారికి ......... వేదుల నారాయణ మూర్తి.........
శృంగభంగమను పుస్తకములో ఆకొండివ్యాసమూర్తిశాస్త్రి గారి తమ్ములు చేసిన ......... చేష్టల మాత్రము వ్రాయనట్టు అల్లంరాజు రామమూర్తి నాతో చెప్పి నాడు ఆతడీమధ్య తీపర్రువెళ్ళినాడు, ......... శృంగభంగ గ్రంథకర్తయగు చర్ల చలపతికి కవిత్వమననేమో తెలియదు. అతడు చేసినట్లు వీరు వ్రాసిరట, ఆహాహా యెంతవింతగనున్నయది. ఈయది విచారింప గలియుగ మహాత్మ్యమని తోచెడిని ........." వే. నారాయణశాస్త్రి

కాకరపర్రు, 23—7—11

"......యిందుతో శృంగభంగం వకటి పంపించుచున్నాను. ఈగ్రంథము రామకృష్ణకవిచేతనున్నూ కాకరపర్తి వెంకన్న చేతనున్నూ రచియింపబడి వేదుల బ్రహ్మన్నగారి కుమారుడు సూర్యనారాయణశాస్త్రులుచే తణుకు తీసుకు వెళ్లబడి చర్ల చలపతి పేర నచ్చు నొత్తింపబడినది. గాని యితనుమాత్రం గ్రంథకర్తగాడు. ఏమన యితను కవిత్వమెట్టిదో యెఱుగడు. యితను రామకృష్ణకవికి భావమరది అయి యున్నాడు. యీ గ్రంథముకు యీ సూర్యనారాయణశాస్త్రులు చాలా ప్రేరేపణ కర్తయయి యున్నాడు. గనుక యీ సంగతులు యావత్తు తమకు విశదపర్చుచున్నాను. ........."

చర్ల సీతారామయ్య వ్రాలు

ఉ. కాఁకరప త్రివారికి నొకానొక లేఖను బంపుమయ్య, వా
రేకడ కేగుదెంచెదరొ, యెందుఁ గవిత్వములో జయింతురో ?
లేక ననున్ జయించినటులే కరతాళమహాహవంబునన్
దాఁకి నినున్ జయించెదరొ ! తథ్యము లోక మెఱింగి మెచ్చెడిన్.

ఉ. ఈయెడలన్ శతఘ్ని నొక యించుక పొందితి నీకు వల్ల నా
రాయణశాస్త్రిగారిది కరంబును బోఁ్కపడెం గదా ! సభన్
శ్రీయుతమూర్తి యా సుకవిశేఖరు వాక్పటిమంబు సత్కవి
త్వాయతియున్ జమత్కృతియు నంతయునుం దెలియున్ క్షణమ్మునన్

క. కనుగొందుగ్రాక పండిత
జను లాయన కున్న శక్తి సత్సభ నీ కుం
డిన శక్తియు వెనువెంటన
వినమెక్కొ పాటిమీఁది విద్దెల బలుముల్ !

---

4 అగస్టు 1911—ఆలమూరు (పోస్టుముద్ర)

"............శృంగభంగంలో వున్న పేరు, రామకృష్ణశాస్త్రిగారి భావమరిది, 20 సంవత్సరములు వయస్సుగలవాడు........." కామసరపు వీరాగ్రజు,

కాకరపఱ్ఱ 25—7—11,

"......... రామకృష్ణు ......... బావయగు చలపతి పేరు పెట్టినాడు. .........కాకరపర్తి వెంకన్నయను నతడున్నూ యిద్దరుచేసినారు. రెండవ యతను పేరు పెడతానంటే అతను వద్దనగా, బావమరిది పేరు పెట్టినాడు యిక్కడ యింకా వేదుల సూర్యనారాయణ అను నొక పుణ్యజనుడు తనుకు స్వయముగా పట్టుకువెళ్ళి ముద్రణచేసినాడు........."

పురాణపండ సూర్యనారాయణశాస్త్రి.

23—7—11, పోస్టుముద్ర.

"కాకరపఱ్ఱు శ్రీభారతీనిలయము భాండాగారము సెక్రటరీగారి వద్దనుంచి ............తిరుపతిశాస్త్రులుగారి చరణసన్నిధికి—

.........కృష్ణునికి, శృంగభంగంపైని కతృత్వమున్న చలపతి, బావయగు, .........గురువు నారాయణశాస్త్రి మొదలైనవారు పద్యములు వ్రాయుచుండిరి ........." భా॥ భాం॥ శ॥

ఉ. కసి గలదేనిఁ దా స్వయముగా నెదిరించుట కొంత యొప్పుఁగా
క సరసులైన పండితనికాయము లున్న సభన్ రసోచితిన్;
బసపస మూఁక నాపయిఁ బంపు టిదేటి వివేక; మింతతో
వ్యసనము తీఱునే యకట! పాపము దాఁగదు దాఁచిపెట్టినన్.

ఉ. వింటిరె, యీతఁడే సుమి వివేకులు నవ్వెడిరీతి నేవియో
కొంటెతనంపు మాటలను గొల్చుచు భారత నాటకమ్ములం
గుంటివిగా నొనర్చుటకుఁ గూర్చెడు శిష్యులకై యతించువాఁ
డంట! నిజమ్ముగాఁ దెలిసెనయ్య సమస్తము నాలమూరునన్.

ఉ. ఆయెడనుండి నే నడలి యాలము రేగిన తత్క్షణంబ "నా
రాయణశాస్త్రిగారు నొక రామసమాహ్వయుఁడౌ కంగార్థియున్
బాయక యశ్వమేధమును బట్టిరి పాడొనరింప" నంచు నా
రాయణమూర్తి సత్యపదరాజితుఁ డొప్పుగఁ జెప్పె నాకడన్.

తే. గీ. పట్టినారాయణుఁ డసత్యవాది యైన
నయ్యెడుంగాక సత్యనారాయణుండు
కాఁ డసత్యంబునకు నొడిగట్టువాఁడు
సత్య మియ్యది సత్యంబు సత్యమయ్య.

---

## 2 ప్రశ్న.

సదరు చర్ల వెంకటచలపతిగారేమైన వ్రాసిరా!

## ఉత్తరము.

దివాకర్ల తిరుపతిశాస్త్రి శతావధానిగారికి,

1. నిత్యం వ్రజామి శరణం। గణంతపకామపం, శిష్యానుగ్రహసంసక్తం, వృషైస్సేవిత విగ్రహం। కథయామి తవేదంతు హృద్య మేతచ్ఛ్వచక్షుణు, నమాం మన్యస్వసతతం శృంగభంగస్యకారిణం॥ 2. త్వయాచ ప్రేషితాం దృష్ట్వా పత్రికాంజనకో మమ। జ్ఞాత్వా రిజష్టుప్రియా పేణ। ఆగ్రహం కురు తేమయి॥ 3. ఏతదాభాషణంశ్రుత్వా అనుగృహ్ణాం త్వమంజనం। భవతాం సర్వకార్యేషు మంగళం ప్రార్థయామ్యహం॥ 4 తస్మాద్భ్యాయం మయిదయాం కుర్వంతు। త్వచ్ఛాత్రపమూహేమామప్యేక ఇవమన్యస్వ। మయి ఆగ్రహం నాస్తీతి ప్రత్యుత్తరం శహాసి విలిఖంతు॥ తప్పుల ననుగ్రహింపవలెను. చర్ల వెంకటాచలపతి

ఉ. "కాఁకరపర్తిలో నెవరొ గాని విమర్శన మాచరించి" రం
చాకడఁ జూచి చెప్పిన కలార్థివనోరచనన్ లిఖించె ము
న్నే కడు సత్యసంధుఁ డొకఁ; డీ విషయమ్ము నెఱుంగుపాంటె నేఁ
గాఁకరపర్తి కేగితిఁ దగన్ సకలమ్ము నెఱింగి వచ్చితిన్.

ఉ. ఆతఁ డెఱుంగఁ డంచు నొకఁ డాయన శిష్యుఁడు చెప్పెఁ గాని ప్ర
ఖ్యాతకులుల్ మహామహు లఖండు లనేకులు గూఢవర్తన
స్ఫీతి నెఱుంగఁ జెప్పి రిట వేఱొకఁ డేటికిఁ జెప్పఁగావలెన్
జాతురి లేని వర్తనమె సర్వము దెల్పెఁగదా సభాస్థలిన్.

మ. కపటం బింతయు లేకయున్నయెడ నిష్కంపమ్ముగాఁ దా నప
త్రప యొక్కింతయుఁ బూనకే యకట! "శబ్దజ్ఞానమే లే దెటుల్
కపితమ్ముల్ రచియింతు వీ" వనఁగ వేడ్కల్ పుట్టునే! చర్గవం
శపయోరాశి శశాంకమూర్తికి వపుస్సారస్యసంస్ఫూర్తికిన్.

---

మఱియొక యుత్తరము

"కాకరపర్తి శ్రీ భారతీనిలయ భాండాగారాధిపతుల వద్దనుంచి.

7 ఆగష్టు 1911, పోస్టుముద్ర.

.........ఇంక తమరు వ్రాసిన ప్రశ్నలకుత్తరము, అతడు బహు కొంచెము కౌముది చదివెను. పంచకావ్యములు, శాకుంతలము మొదలగు రెండు నాటకములు చదివెను. పాఠంచెప్పే సామర్థ్యం వున్నట్లు తోచదు. వయస్సు 20 సంవత్సరములు ......... ఇప్పుడు నారాయణశాస్త్రిలుగారి శిష్యుడు— పై తెలుగు పద్యశైలిని ఆంధ్రమున కవిత్వము కొద్దిగా చెప్పును. సంస్కృత శ్లోకములు ఊహించతగు......"

౨ ప్రశ్న.

అల్లరిసభ యన్నందుల కాధారముకలదా ?

ఉత్తరము.

రాఘవభట్ల విశ్వనాథ కృతానేకనతయః ... యిక కాకరపర్తి సమాచారము, ఆ॥ సీతారామయ్యగారు వచ్చినవెంటనే యీసంగతి యావత్తును తమరు సెలవిచ్చినట్లుగానే చెప్పిరి. అల్లరికితానే ప్రోత్సాహకుడనని వప్పుకొనిరి. మా అన్నగారిని ఆక్షేపించుటచే చేసితిననిరి.

ఉ. "ఏమియు రాదు" మంత్ర మొకండే సమయమ్మునకుఁ స్ఫురించె, శ్రీ
రామునిమంత్రిమయ్యె నది; రాక్షసవర్గ మొకింత గొంకఁగా
సామముకల్మి నే నిలువఁ జాలితి; దాని కొకింతదక్క నా
గ్రామము దాఁటఁజాల నని గట్టిభయం బుదయించె నెచ్చెలీ!

చ. పలువురు పండితుల్ గలరు పల్వు రపండితులుం గలారు స
ర్వ్వలు మనశిష్యవర్తనకుఁ బోలమి చెప్పెడివారె గాని లో
పల నొకఁడూని పైకి నొకఫక్కి గ వర్తిలువారు కొండ ఱీ
పలుగుతనంబుఁ జూపుటకుఁ బాల్పడి రజ్ఞులు తోడునీడగన్.

---

4 ప్రశ్న.

ఆ యీ అల్లరినిగూర్చి పనివచ్చినచో నప్పటి యోగ్యులెవరని సాక్ష్య మిచ్చెదరా?

ఉత్తరము.

కాకినాడ, 29—7—11.

పురాణపండగవరయ్య అనేక నమస్కారములు,......... తమరు వ్రాసిన కార్డుచేరినది. అందుల సంగతులు గ్రహించితిని. బ్రహ్మశ్రీ సీతారామయ్యగారున్నూ మీరున్నూ కూడ నాకు బంధువులేయగుటచేత, తమయుత్తరమునకు ప్రత్యుత్తర మేది యిచ్చుటకు తోచక యింతకాల మాలస్యము చేయుడమైనది. ఆయన సన్నిహితబంధువగుట చేతను వారియన్నగారు నాకు గురువులగుటచేతను సదరు విషయంబున నా సాక్ష్యంబు విడువగోరెద. ఇదియ నాప్రార్థన ఆకాలమున తమరు దాల్చిన శాంతత మాయుల్లంబుల కెంతయు నానందము గలుగ జేసెనని మాత్రము చెప్పగలను......... పు. గవరయ్య

7—8—11, తుని.

బ్రహ్మానందశాస్త్రి, నమస్కారములు.

తమ యుత్తరమందినది. కొన్ని కారణములవలన యథార్థములగు సంగతులుగూడ వ్రాయఁజాలమికి క్షమింపగోరెదను. చిత్తగింపుఁడు.

మఱియొకయుత్తరము.

.........శృంగభంగం పాడువ్రాతగానున్నది. ...... వ్యాఘ్రమూర్తి శాస్త్రిగారు ప్రత్యుత్తర మిచ్చుట కిట్టకేల కొప్పికొనిరి. ఏయేసంగతుల కిచ్చెదగని యడుగ మీయుత్తరము చూచికాని చెప్ప వీలులేదన్నారు. అల్లరి సభయగునా కాదాయని యడుగ "రఘువంశపాఠము చెప్పనడుగుట యల్లరి కాకేమి" యనిరి ......... 5—8—11 వెం॥

మ. విదురాదుల్ పలుమంది నాగపురిలో విచ్చేసియున్నార ల
య్యదునాథాగ్రణిపూనికన్ దెలియువా రచ్చో సభన్ మాధవున్
మృదుతాశూన్యులు కౌరవాధములు బల్మిం బట్ట నుంకించిరే
కద! యాపైపని యెట్టిదైన; విరసుల్ గర్జంబు లూహింతురే.

చ. తతమతి వేటి నాదుపినతండ్రికుమారుఁడు వెంకటాఖ్యుఁ డు
ద్ధతభుజశాలి నాదుపినతల్లి కుమారుఁడు వీరయాఖ్యుఁ డా
ర్జితు లల సాత్యకిన్ గదనరీతివిదున్ గృతవర్మనిన్ మహో
న్నతులు స్ఫురింపఁ జేసి రట నా కల కాఁకరపర్తి హస్తినన్.

ఉ. ఆయన సత్కులీనుఁడు కళాకరుఁ డయ్యును నేమొ కాని నా
రాయణశాస్త్రిగారు ధృతరాష్ట్రసుతాగ్రజుభాతి నీయస
త్కార్యము నాచరించి; రిది తథ్యము దేశమందు దీపముం
బాయఁగ నార్పి చెప్పఁ గలఁ బాపము లేదు యథార్థ మాటచే.

శా. విద్యావాసనగల్గు హేతువున నీవిద్వాంసుఁ డెట్టెట్టులో
సద్యశ్శాంతి వహించెఁ గాని మఱి వ్యాసప్రీతిపాత్రుల్ పునః
పాండిత్యశ్రీచణః ప్రపంచమునకున్ బుట్టిల్లుగా నెన్నియో
గద్యంబుల్ ప్రవహింపఁ జేసిరి తిరస్కారధ్వనుల్ భోరనన్.

---

5 ప్రశ్న.

ఇంతేమైన శృంగభంగమువంటి కల్పనలు బాలకవులు చేసిరా?

ఉత్తరము.

"......చక్రవర్తుల కృష్ణమూర్తి సిద్ధాంతి......
తమకు మతిపోయినదని యిచ్చట ఓలేటి వెంకట్రామశాస్త్రి ఒక తంపివార్త వేసినాఁడు. దీని నిజము యెంతో తెలియదు. ఏమియు తోచడములేదు......"

ఇంక నొకటి.

...... యిండరములో వెంకటశాస్త్రికి మతిపోయినట్లున్నూ డాక్టరు వచ్చి చూచినట్లున్నూ తిరుపతయ్యాకు టిక్ట్రాము యిచ్చి నీవు తీసుకువెళ్లి నీవద్ద వుంచుకోవలసినది. అని చెప్పినట్టు పుకారు...... వెంకటాచలము

(పై రెండుత్తరములున్నూ యానాంనుండి వచ్చినవి)

చ. ముగిసెఁ గ్రమమ్ముగా సభ నభోమణి యంబరమధ్యభాగమం
దొగి నిలిచెం బదంపడి యథోచితకృత్యము లాచరించి గ
ద్యగ సకలమ్ము వ్రాసి విదితంబుగ సుందరరామశాస్త్రి కొ
ప్పుగ వినిపింప నాబుధవిభుండు దురాగత మంచుఁ దేలిచెన్. 410

చ. పదఁపడి వ్యాసలింగకృతి భద్రగజం బగుపట్టె నాతఁ డ
య్యదన స్వకీయగేహమునయం దటు లొటకుఁ జింత నొంది "దు
ర్మదు లొనరించు కృత్యములు మాన్యులు తారు గణింప" రన్న ధీ
సదనులతోన దెల్పి తనసజ్జనతన్ బ్రకటించెఁ బిమ్మటన్.

మ. ధనవిద్యాగుణగౌరవాస్పదుని సీతారామశాస్త్రిన్ గనం
జన నాధీరుఁడు సర్వమున్ వినఁగ సచ్ఛాత్రుండుగా గేహవే
దిని గూర్చుండుడు విన్కి చేసితి మహాధీరుల్ మఱిం గొంద ఱం
తన యేతెంచిరి మత్కృతిన్ వినిరి తాత్పర్యం బవార్యంబుగన్.

---

## 6 ప్రశ్న.

శృంగభంగపు వ్రాఁతపై వివేకుల కెట్టి యుద్దేశము కల్గుచున్నది?

### ఉత్తరము.

నర్సారావుపేట, 30-7-11.

.........కాకరపర్తిలో మీ కసన్మానము జరిగినట్టు......పద్యరూప
ముగా ప్రకటించిన ప్రకటన పత్రిక చూచి చాల దుఃఖించితి .........దాని
యాదార్థ్యమంతయు......తెలిపి చింతాలతన్ ద్రెంపివేయఁ బ్రార్థితులు......
శతఘ్నుని చూచినకొలది చింత హెచ్చియున్న నాకు పాకుపతము వచ్చి యెట్లు
నివర్తిచేసెనో యట్లే యీయపవాద విని చింతిల్లెడి నన్ను తదభావబోధక భవ
దీయలేఖ యానందింపజేయుగాక.........  జా. పట్టాభిరామశాస్త్రి.

మఱి యొకటి.

......పిఠాపురంనుంచి కవితతోకూడా రామకృష్ణకవులు పంపించిన
కాగితం ఇందుతోపంపించినాను. ఇది చూచినప్పటినుంచి నాకున్నూ శ్రీబాబు
లుగున్నూ వున్న ఖేదం వ్రాయచాలను. ఇందుల యథార్థం వెంటనే తెలిసీలుగా
వ్రాయప్రార్థితులు.  7-8-11, నూజివీడు.  రా॥ వెం॥

ఉ. ఆపలుధీరులందు నొకయార్యుఁ డఖండకళాకరుండు గౌ
రీపతిశాస్త్రి; "యీతని వరించె సరస్వతి" యంచుఁ జెప్ప నే
నాపురి నెందు వింటి; నొకఁ డంచు వచింపఁగ నేల సర్వవి
ద్యాపథముల్ వశమ్ములయి యమ్మహనీయుని గొల్చు దాసులై.

శా. సీతారామఘనుండు పండితజనశ్రేయోర్థి సాహిత్యవి
ద్యాతత్త్వజ్ఞుఁడుదారమానసుఁడు ఛాత్రశ్రేణిచేయుక్తుండు సం
జాతామోదముమై మదీయ కవితాసందర్భమేకాక యా
ప్రాతఃకాలపువారి యల్లరిని దాఁ బ్రత్యక్షరంబున్ వినెన్.

చ. విని కడు నొచ్చుకొంచు 'నవివేకుల హేతువునన్ జగమ్ములో
ఘనమతు లున్నయీళ్లకును గల్గఁగదా యపకీర్తి'యన్న చిం
తను వెలిఁబుచ్చునంతఁ గరతాళమహాహవకర్త వ్యాసమూ
ర్త్యనుజుఁడు నన్నుఁ గాంచి తన యాగ్రహమున్ బ్రకటించె నీగతిన్.

---

7 ప్రశ్న.

ఆయూర నల్లరిచేయు విద్యావంతులును గలరా!

ఉత్తరము.

13-2-11, తుని.

బ్రహ్మశ్రీ...... గారికి- ద్వివేది బ్రహ్మానందశాస్త్రి నమస్కారోపరి, కారణాంతరమున నే నిక్కడ నున్నప్పటికి స్వగ్రామ మగుటచే కాకరపర్రు రెండురోజుల క్రిందట వెళ్ళి నేఁడే అక్కడనుండి వచ్చితిని. కాకరపర్రిలో నెవరో కొందఱు మీకుఁ బ్రతికూలవాదము సేయుచున్నట్లు కాకరపర్రి నివాసు లెవరో మీకుఁ దెలియపరిచినట్లును ఆప్రకార మిప్పుడు మీవ్రాయు గీరతములో వారినిగూడ నెక్కించినట్లును గర్ణాకర్ణికగా వింటి. ఇందు నిజ మెంతో తెలి యదు. అక్కడిది మూడువంశములు కోతిమూక. మీకు వ్యతిరేకవాదు లొకరయి నచో నింకొకరిని వారిసెడు ప్రబుద్ధులు. కావున మీ గీరతములో నుదాహరింతు రేని తగు మనుష్యులవలన యథార్థమరయు టావశ్యకము. కొన్నిమాటలు తమ సమక్షమున మాటాడవలయు నను సంకల్ప మున్నను దూర మగుటవలన వలను పడకున్నది, అయినను అది వేసవి సెలవులలో సంఘటిల్లవచ్చు......

(ఈశాస్త్రులవారే యల్లరిప్రారంభ మైనతోడనే యా స్థలము విడిచి చని తమ పరితాపమును దెల్పిన పరమోత్తములలో రెండవవారు.)

ఉ. ఔచ్చము నెత్తె నీదుపిత పేదతనంబున నీవుఁగూడ ని
ష్పచ్ఛరమున్ భరించితివి పాండితి నేఁటికిఁ గల్గుఁగాక యీ
యచ్ఛరముల్ యథార్థములొ, యట్టివి కావొ! వచింపుమన్న నే
నిచ్చలు నొప్పికొంటి నవి నిక్కము లౌకతనన్ సహోదరా.

చ. అది విని యాణివిల్లకులుఁ డాస్యమునన్ జిఱునవ్వొలర్ప నీ
ముదిమనుజుం డిదేమి యిటు మూలములేని ప్రసక్తిఁ దెచ్చె నం
చెద యొకయింత చేసికొని యేవము మోమున నెల్లడించు న
య్యదన మహాగ్రహమ్మమెయి వ్యాససహోదరుఁ డిట్లు పల్కెడిన్.

---

## 8 ప్రశ్న.

నిజముగా నాయూరివారి కెవరికేని ప్రకృతవివాదమును సభాముఖమునఁ దీర్పవలయునను నుద్దేశమున్నదా!

## ఉత్తరము.

కాకరపర్రు, 21-1-11.

......సభ జరుగుట యసంభవము. జరుగు టొకానొకప్పుడు (వేఱొకచోట) సంభవించినచో వెంటనే యీ సంగతి వ్రాయవలయును. తప్పక రా నుద్యోగించుచున్నాను, గనుక ముఖ్యముగా వ్రాయించ గోరుచున్నాను......

చల్లా సోమనాథశాస్త్రివార్లు.

(వీరిదే ఇఁక నొక యుత్తరము)

......... మరియును "సభనుగూర్చి మీ గ్రామస్థులు యత్నించినట్లు విన్నాను...... వారేమి జవా బిచ్చినది వినగోరితిని" యని వ్రాసియున్నారు .........సభసంగతి మాగ్రామములో నున్న వేదుల బుచ్చన్నగారనే సుబ్బారాయుడుగారు వేళాకోళమున నొకసారి బాలురతో నుడివిరని కర్ణాకర్ణికగా వినియున్నాను గాని మరి యేపండితులవల్లగాని యగ్రహారీకులవల్లగాని మరి యే యోగ్యగృహస్థులవల్లగాని వినియుండకపోవుటయేగాక యట్టి యుద్దేశ్యమైనను మాగ్రామస్థ పండిత పామరుల కింతకుపూర్వమందుగాని యికముందుగాని కలుగబోదని నిక్కముగా వక్కాణింపగలను. నాలుగురోజులక్రితం మాగ్రామము నుంచి యొకరు యేలవూరు వెళ్ళినపుడు బ్రహ్మశ్రీ కామవరపు వీర్రాజుగారు కాకరపర్తిలో సభాప్రయత్నము జరుగుచున్నట్లు తమకు బత్రికాముఖమున

క. మాయన్న గారికడ నం
తో యింతో చదువుమీర లోఁగిఁ దన్నిందన్
జేయునితని సైరించుట
న్యాయంబె! కృతఘ్ను లనఁగ నన్యులె చెపుఁడా.

ఉ. వెంకటరామకృష్ణులు వివేకులు గా రన నేల, మీరు ని
శ్శంకగ నట్టివారె విలసత్కవితారససేవధిన్ నిరా
తంకు మదగ్రజున్ గణన తద్దయుఁ జేయనియాతనిన్ సభన్
గొంకక నిందఁ జేయఁ దొరకొని భవద్గుణవర్గ మేటికిన్? 419

ఉ. ఈపగిదిన్ మహాగ్రహపరీతుఁడు వ్యాససహోదరుండు సం
స్థాపితకోపుఁ డౌరక సదస్సున నేదియొ వల్కుచుండ గౌ
రీపతిశాస్త్రి యిట్టు లనుఁ "బ్రీతికి లక్షణ మిట్టిదౌనె! మీ
రేపగిదిన్ గృతఘ్ను లని యీమముఁ జెప్పఁగలారు శిష్యులన్.

మ. భవదీయాగ్రజులన్ గవిత్వమునెడన్ బాటింప మన్నంతనే
యవివేకంబని చెప్పఁగాఁ గలమె యిష్టానిష్టముల్ సర్వవ
స్తువిశేషమ్ములయందు నొక్కొకరికిన్ దోఁచున్ విభిన్నమ్ముగా
నవనిన్; మెచ్చనియంత దూష్యులన నన్యాయంబు గాకుండునే!"

మ. అని గౌరీపతిశాస్త్రి వల్కుటయు వ్యాసానుజుండున్ గ్రమం
బున వాగ్ధోరణిఁ గట్టిపెట్టి యెటకో పోయెన్ ఘనుల్ యోగ్యతా
ఖనులున్నట్టి సభాస్థలమ్మున వృథాగా వాగ్వ్యయం బెట్టొ నే
య నెటుల్ సాఁగు నెవండు మెచ్చెడి నగస్త్యభ్రాతృధౌరేయులన్.

---

తెలియజేసినట్లున్నూ అందుకు దమరు సిద్ధముగా నుంటిమనియును గాకరపర్తిలోనే కాదు......... తప్పక వచ్చితీరెద మనియును, ఆవీర్రాజుగారికి ప్రత్యుత్తర మిచ్చినట్లున్నూ ఆయుత్తరమును వీర్రాజుగారు మా గ్రామస్థునకు చూపినట్లున్నూ ఆయన యీ గ్రామమంతయుఁ జెప్పినాడు. వినినవా రందరు వారు సమర్థులగుట నట్లే వ్రాసెదరనియు జెప్పికొన్నారు. ఏతద్వ్యతిరిక్త మేమియును జరుగలేదు...... చ. కవిత యొనర్చుటన్న నతి కష్టము దానికి పత్కవీడ్యమా। చవి గలుగంగజేయుట యసాధ్యము, అట్లొనరింపగల్గ నా। శువుగ రచించుటన్న నతి చోద్యము దానికి దోడు ధారుణీ। ధవుల సభాస్థలిన్ శతవధాన మొనర్పఁ డటన్న శక్యమే."

చళ్లా సోమనాథశాస్త్రివ్రాలు.

ఉ. పోవుమ "శృంగభంగ" మను పాత్రము రేపటి కేగు దెంచు నీ
కై విలిఖించెఁ గృష్ణకవి యల్లదె యచ్చునకేగ నిప్పుడే
కేవల మక్కటా తాన నిఁక గీరతమెల్ల నడంగు నంచు ని
చ్చావిధి నాడె నిప్పలుకు సభ్యులు విన్నదె సుమ్ము తిర్పతీ.

క. అల శృంగభంగమును గృ
ష్ణులె వ్రాసియుఁ బేరు మార్చి శుద్ధుల కిర్యు నెం
దులకో దాఁగిరి సూ! కో
కిలకాకముకన్న నిందుఁ గీ డున్నదియే.

చ. చలపతిగారికిన్ దుదిని శాస్త్రిపదంబు డగిల్చి దీని వ
య్యాలఘుఁడు చేసినట్లు సుమహాత్ములు కృష్ణులు వారనూరులున్
తెలియఁగఁ జేసి రీ నుడి వివేకు లెఱుంగరె? యొండొరుల ఔ
క్కటలహమునందు శాస్త్రులయి గ్రీరి కాఁకరపర్తి నో సఖా!

క. అల్లరిసభ గాడనుటయుఁ
గొల్లలుగా శాస్త్రిపేళ్లు గూర్చి రకట! యీ
కల్ల నిజంబుల నాపుర
మెల్ల నెఱుఁగకున్నె! యితరు లెఱుఁగకయున్నన్. 426

---

## 9 ప్రశ్న.

ఆయూరి పెద్దపండితుల కీ శృంగభంగ ప్రసంగము నెపలఁ గల్గిన యుద్దేశ మెట్టిది.

## ఉత్తరము.

ఆలమూరు, 3-7-11.

......కాకరపర్తి పద్యములు అచ్చుపడినవట, వేదుల సూర్యనారాయణ అవధానులు నేత్రవధాని యిక్కడకు వచ్చి నాతో చెప్పినాడు, మీకు వక ప్రతి పంపిస్తానని చెప్పినాడు...... మనము కాకరపర్తినుంచి వచ్చిన తరువాతను వారిలో వారికి చాలా కలహములు జరిగినవట. బ్ర॥ శ్రీ॥ సీతారామశాస్త్రులవారు వగైరాలు అంతా 'మంచిపని చేసినారుకారు' అని అన్నారట...... అంతా స్పష్టంగా తెలిసినది...... క్రియకు వీరు (అల్లరిసభలోనివారు) యెవరూ సభకు రారు............... కా. వీరరాజు.

క. వా రెవ్వరి శిష్యులుగాఁ
చేరుకొనిరో నేను వారిఁ జేరుకొనెద న
వ్వారలలో నొకకొందఱు
దారగుణ్యులు గలరు వార లాడ రనృతమున్.

క. సీతారామమనీషి య
నేతాదృశుఁ డమ్మహాత్ముఁ డెది చెప్పిన వే
దాతిగము తద్వచన మది
గీతార్థముకన్న మిన్న కృతబుద్ధులకున్.

ఆ. వె. ఆమహాత్మునెదుట నల్లరి యొక్కింత
సలుప మొదలువెట్ట సాఁగనీక
యాఁగె నాతఁ డతని యభ్యర్థితత్వంబు
నింత యని వచింప నెవ్వఁ డోపు.

క. ధవళాద్రిసీతరామ
స్థవిరు లనిఁ బ్రల్లదములు తత్సవిధమునం
దవుటను సీతారామసు
కవినేత వచించు టొప్పుఁ గలనిజ మెల్లన్.

ఉ. సుందరరామశాస్త్రులు విశుద్ధులు సర్వము చూడలేదు వా
రిం దొకకొంతనే యెఱిఁగి యెల్లవిశేషము లెట్లు చెప్పువా
రిందఱు నన్నిసంగతుల నారయ రిం దొకకొంద ఱేని యీ
చందము సర్వమున్ దెలియుసాక్షి పరాత్పరుఁ డొక్కఁడే సఖా.

---

10 ప్రశ్న.

మొదటి సభకు సభ్యత్వులగు శ్రీసీతారామశాస్త్రులవారి యాదర మెట్టిది.

ఉత్తరము.

బ్ర॥ శ్రీ॥ ...... వెంకటశాస్త్రులవారి సన్నిధికి.

ఆశీః ల్ల సీతారామశాస్త్రి...... చిరకాలము అయినది తమ దర్శనమునకు నిరీక్షించుచున్నాము తమరు వ్రాయించిన వుత్తరమును చూచికొని తమరిని చూచినట్లుగానే సంతోషించినాను...... ఆ॥ సీ॥ శా॥ వైశాఖ. శు ౧౦ సోమవారం.

క. గౌరీపతిశాస్త్రి మహో
దారగుణుండు వినియె నన్ను వ్యాసానుజు లే
ధారను నుతించిరో యది
నారక యాసుగుణి చెప్పవాఁడని యెంతున్.

ఉ. ఏపున నొక్కసారి మనకృష్ణకవిం గని సారవేది గౌ
రీపతిశాస్త్రిగారు "బళిరే! యవధానివరేణ్య! నాకడం
జూపఁగ నేర్తె పృచ్ఛ" యన "సూర్యనృపాలుని చెంతఁ దక్క నేఁ
జూప" నటన్న వా దొకటి నూరులు చెప్పఁగ వింటి నయ్యెడన్.

ఆ. వె. అట్టివాఁడు గురునియాజ్ఞమై నామీఁది
కపుడు వత్తు ననియె నంట! వింటె
యెట్టిమాటసాక్ష్య మిది "రాను రప్పింప"
నన్నపద్య మెచట నడఁగెనొక్కొ.

చ. ఎదుటికి రాకయే గెలిచె నీవను గర్వపగోఢహేతు వి
య్యదన నృపాజ్ఞ నాఁగె నవురా! యివి యెక్కడియుక్తు! లిట్టులే
గద యశమున్ జయంబులును గాంచిరి పూర్వు! లొకింతకాలమున్
బ్రదుకని పిల్లయూ యశము వచ్చిన నే మది రాక యేమగున్.

---

## 11 ప్రశ్న.

మాకవనమం దిప్పటి ప్రాజ్ఞులు 'బట్టుకవిత్వ' మనునభిప్రాయము కలవారేనా!

### ఉత్తరము.

25 — మె 11 (ఇది పోస్టుముద్ర)

......... వెనుక నేను తమ దర్శనమునకు బందరు వచ్చినప్పుడు...... (15) ఈ పుస్తకముల నొసంగితిరి. అప్పటికి అనగా నే నున్నరోజులలో నే దేవీ భాగవతమును అచ్చువేయుట కిచ్చి యుంటిరి. పిమ్మట కొన్ని పుస్తకములు మాగ్రామం వచ్చినవి...... నాయందు సానుగ్రహులై అచ్చుపడ్డ దేవీ భాగవత సంపుటములనున్నూ...నున్ను నున్నూ ......నున్నూ ......నున్నూ ......యావత్తు పుస్తకములనున్నూ దయచేయించ గోరితిని.

చల్లా సోమనాథశాస్త్రి (కాకరపఱ్ఱు)

చ. కల పల శృంగభంగమునఁ గల్లలు కొన్ని నిజాలు గొన్ని యో
గ్యులు తమచేయునల్లరిని "గూడదు వో" యని దూఱుమీఁద న
ప్పలుకుల కోడి దుర్యశముఁ బాపికొనన్ బ్రయతించి వ్రాసిర
వ్వల నలశృంగభంగ, మట వాస్తవమున్ జగమే యెఱుంగుతన్. 436

చ. తుదిఁ గలపద్దెముం జదువఁ దోఁచకపోదు నిజంబు గాన నే
విదిత మొనర్ప నేల యిఁక వేంకటశాస్త్రి నెదుర్ప రారఁ ట
భ్యుదయము గల్గె నంట ! యాఁయోగ్యులు కృష్ణుల కౌర ! యెట్టి నే
ర్పిది, యొకమాఱు గెల్చినసుధీశ్వరుఁ డింకొకమాఱు గెల్వఁడే?

శా. ఏదే రీతిని నల్లరన్ సలుపఁగా నిచ్చల్ పిసాళించు దు
ర్వాదోదగ్రుఁడు కృష్ణసూరి తనదౌ గ్రామంబు నే నేగ దా
యాదుల్ పల్వర లేఁపి తా గృహమునం దంతర్ధిమై నుండి సం
పాదించెన్ విజయంబు తిర్పతికవీ ! ప్రావీణ్యమున్ గంటివే.

ఉ. తా సభ కేగుదెంచిన పృథాగఁ దనున్ మఱి నీవు దుర్వ్యవ
భ్యాసము చూపి జట్టు నొగిఁ బట్టుక గొట్టుదు వంచు వ్రాసె నేఁ
డాసరణిన్ ననన్ సలుప నాయనయే ప్రయతించెఁ జూచితే
యోసఖ ! "ఆత్మవ" త్తనెడి యోగ్యులమాట స్మరింపఁజేయుచున్.

---

మఱియొక యుత్తరము.

శతావధానిగారికి— 2-12-10 కాకరపఱ్ఱు-
వుప్పలధడియం వెంకటరావయ్య వ్రాసినది

క. ఘనచెళ్లపిళ్లకులమం । దున జననం బొందె దిశల తుదల యశముఁ జెం । దిన వెంకటశాస్త్రికి వం । దనములనొనరించి వ్రాయునదియేమనినన్. చ. పటు తరవాక్యనైపుణి ప్రబంధములన్ రచియించి కీర్తిది । క్తటముల నంట జేసిన బుధాగ్రణి యోరసి కాగ్రగణ్య వేంకటకవి ! మీదుగ్రంథములకై కడు సంతస మంది పత్రి మొక్కటి లిఖియించినాఁడ దమ, కారసి యయ్యది వేగఁ బంపుఁడీ. చ. 'ఇపి' యని నామధేయము లిఖించిన వాడవు కావు వెట్టివాఁ డవు గద! వెంకటాఖ్యుఁడ! యటంచను మీరు వచింతు రేమొకో భవతరుణీకటాక్ష విభవాయితసత్కవితాధురంధరుండవు గద యుష్మదీయకృతు లన్నియుఁ జూతు విపశ్చిదుత్తమా॥

చ. పలువురఁ గూడి యొక్కెటులొ పట్టున గెల్చి యొకర్చి "నోటితో
పల నొగి నుగ్రడ్డ్రుక్కి" రను ప్రైఖరి యూరఁతగఁ గీర్తి గొన్న; యో
గ్యులసభ లేల! కీరితికి గొప్పప్రయత్నము లేల! విద్వునన్
గొలిచి పఠింప నేల యిది గూర్పదె కీర్తి క్షణంబులోపలన్.

ఆ. వె. అహహ! కృష్ణకవి గృహాంతరమ్మునుండి
నన్ను గెల్చినాఁడు నాకు శృంగ
భంగమయ్యె! నెట్టి ప్రాజ్ఞులు పుట్టక
యేమి! కలియుగంబు నెఱుఁగ రెవరు. 441

ఉ. ఏయెడ నే రెఱుంగకయ యింపెసలారెడి పండితుండు నా
రాయణశాస్త్రి గారికడ నంతయు నింతయు నేర్చు శిష్యులే
హా! యని నన్ను గెల్చినపు డొండొరుఁ డెవ్వఁడు గెల్వ లేఁడు, నా
రాయణశాస్త్రిగారఁట, బృహస్పతియంట! యెఱుంగు మోసఖా.

ఉ. ఇంటనె కూరుచుండి యిటు లెల్లజగమ్ము జయించునట్టి బల్
దంటల కాకరం బయి యిలన్ గడుఁ గాఁకరపర్తి యొప్పఁ గా
కంటియు నంటకుండ జగమంతయు గ్రుడ్డిదిగాఁ దలంచుచున్
బంటుతనంబు చెప్పికొను ప్రాజ్ఞులు వర్తిలుగాక యెల్లెడన్.

---

మఱియొక యుత్తరము.

కాకరపర్తినుంచి

......తమ గ్రంథములరసము యెంతగోలినను అమృతరసము సురలకుంబోలె తనివి దీరక యున్నది, మరియు తమ గ్రంథములు అన్ని చూడవలెననియున్నను, శ్లో॥ అసంతుష్టా ద్విజా నష్టా' యనెడు వాక్యమును బట్టి యొక్కడికక్కడికి సంతసము నొందుచుంటిమి. కావున...... కటాక్షము వుంచి తమ గ్రంథములలో కేవలకల్పితంబును కీర్తికందళమ్మును నయిన శ్రవణానందమ్మును ... ఈపదకొండు గ్రంథములు ... పంపినచో ... నామనస్సు తృప్తికరం బగును...

ఇట్లు తమవిధేయుఁడు,

వేదుల వెంకట సత్యనారాయణమూర్తి.

సీ. సూనృతవాణియౌ సుందరరామబుధోత్తముం డెటు లనృతోక్తి వలుకు
తత్త్వవిగ్రహుఁడు సీతారామబుధనేత యేరీతి ననృతాన కిచ్చగించు
కనులారఁ గాంచిన ఘనుఁడు శ్రీవ్యాసలింగమనీషి యేరీతిఁ గల్ల పల్కు
నఖిలం బెఱుంగు బ్రహ్మానందపండితుం డెందు కాడెడి నించుకేని యనృత

తే. గీ. మక్కటా ! నన్ను విద్యార్థి యడుగవలెనె
యల్ల నారాయణమనీషి యడుగఁదగిన
పాటి తెల్వియు లేదె నావద్ద, నింను
కేమి యందురో విబుధు లే నెఱుఁగవలయు. 444

మ. ఇది యిట్లుంచుము వ్యాససోదరులతప్పేర్పాటుగా శాస్త్రిగా
రెద నూహించినవెంటనే యతఁడు తా నెట్లో చనెన్మీఁదఁ గో
విదుఁ డయ్యాణివిళాన్వనాయుఁ డిటు చెప్పెం బేర్మి దైవారఁ, బ
ల్కాడి సేయుట్ బరికోటులో తిరుపతీ ! యాలింపు వాక్రుచ్చెదన్.

---

"...మాయనుజుండు నిన్నటిదినమున తమవద్దనుంచి తెప్పించిన పుస్తకములు చూచి మాగ్రామములో వారందరు మీదాతృత్వమునకు గ్రంథసారస్యమునకు అత్యంతము సంతసము నొందినారు... ఇవి మఱియొకరికి సాధ్యమగునా ! ఏవో రెండు మూడు పద్యములు అల్లుచు బంధువులు నలుగురు ముగ్గురు వున్నచోట్ల చులకనగు సమస్యలు వారిచేత నీయఁబడి అవి పూర్తిచేసి రాజసభలలో శతావధానము చేసినామను వారలా! కవులు ... నూటికి ఒకగ్రంథము తప్పుల కుప్పలతో చేసి ... కుకవులు మీగ్రంథములు చూచి తలలు వంచిరి. సుకవులు తలలెత్తిరి... కొందరు కుకవులు తమతో వైరముపెట్టి పద్యములు వ్రాయుదురు "శ్లో॥ మహాగజాః పలాయంతే మశకానాంతు కాకథా" అని మీపాండవవిజయములో ఉదాహరించిన సామ్యతను బట్టి గొప్పకవులే పరుగెత్తుచుంటే మనము వూరుకొంటేమేలనియయినా బుద్ధి తెచ్చుకొనిన బాగుండును. మీశతావధానసారములో కొన్నివర్ణనలు పదములు ఇటీవల కవుల శతావధానములో కానబడుచున్నవి. ఆపాదములు ఇప్పుడు వుదహరించిన చిక్కువచ్చునని వుదహరింపలేదు. తమకు పంపుమను... నాశిష్యులకు కొందఱికి తెలుగు మనుచరిత్రము మొదలైన గ్రంథములుచెప్పుటకు యత్నించితిని. ఇప్పుడు తమ ప్రబంధములు చెప్పవలయుననుకుతూహలముతో యుంటిని..."

వేమల పేరయ్యశాస్త్రి, తణుకుతాలూకా, కాకరపఱ్ఱు.

చ. "సకలము మీదుగీరతము చక్కఁగ నున్నది విన్నవట్టు, మీ
రకుటిలచిత్తు లాతఁ డిటు లజ్ఞతచే మిము నిందచేసెఁ బు
త్రకుడొసఁగుఁడ్ క్షమించు టది తండ్రికిఁ దప్పునె ! మీ రెఱుంగరే
యకట, తనూజశిష్యులకు నంతర ముండునె ! యెంచి చూచినన్.

ఉ. కబ్బము చేసి శాశ్వతముగా నొనరింపకుఁ డంచు మిమ్ము నే
నిబ్బరమైన పేర్మిని మనీషులఁ గోరెద" నాఁగ నేనునున్
గొబ్బున "నోమహాత్మ ! మిముఁ గోరికమైఁ గనుఁగొంటకున్ ఫలం
బబ్బె యథార్థ మాడితి రహో ! మిము నేమని సన్నుతించెదన్.

ఉ. అచ్చున కైన ద్రవ్య మది యంతయు నష్టమ యౌను గాక మీ
యిచ్చయె నాదునిచ్చ "క్షమియింపు" మటంచును శిష్యుఁ డాడినన్
జిచ్చున బుగ్గిగాఁగ నిది చింపి యడంచెద నట్లు కూర్చుఁ డో
సచ్చరితుల్ ! ప్రమాణముగ సత్పెద మీనుడి మీఱ నేర్తునే."

---

"......తమచే రచింపఁబడిన శ్రవణానందము.........గ్రంథములు మాబంధువులకద్ద...చూచి చదివి ఆనందలహరీనిమగ్నుడ నైతిని. కాని తమచే రచియింపఁబడిన గ్రంథముల నన్నిటిని చూచుటకు ఆతురతకలవాడనై యుంటి ...యీదిగువ పుస్తకముల పంపింపు డని ప్రార్థిస్తున్నాను ... న్యాయ మని యూహించి దీనితో 0—8—0 అణాబిళ్లలు పంపితిని......"

చర్ల పండుశాస్త్రిగారి కుమారుడు సూర్యనారాయణ, కాకరపర్రు
తణుకు తాలూకా. 27—11—10.

......అయ్యా తమరు చేసిన పుస్తకములను చూడవలె నని కుతూహల పడుచున్న నాకు తమరీ క్రిందిపుస్తకములు పంపింపఁ బ్రార్థితులు......

వేమల సుబ్బారాయుడు.

12 ప్రశ్న.

గీరతమునం దచ్చటి ప్రాజ్ఞులకు పిప్పి యను నభిప్రాయము కలదా !

ఉత్తరము.

9-7-11, కాకరపర్రు.

"......గీరతంకూడా యెంత అచ్చుపడితే అంతే పంపించవలెను..."

చర్ల సీతారామయ్యవ్రాలు.

*చ. అనినఁ "బ్రయత్నముల్ సలిపి యాళుఖు వ్రాసెద నచ్చు వాపుఁ డొ
క్కనెల" యటంచుఁ బల్కె విధిగా నటు చేసెద నంచుఁ జెప్పి య
య్యనఘునియాజ్ఞ గైకొని రయమ్మున నారయ శాస్త్రిగారి ద
గ్గన మొనరించి యాబుధుని శాసనముల్ వచియించితిన్ సఖా.

చ. అది విని యాతఁడుం బయికి "నట్టిదె యుక్త"మటంచు శీర్షముల్
గదిపి బహూకరించెఁ దదనంతర మాయన యంప నేగి యా
పదపడి భాష్యకార బుధవర్యునితో సకలమ్ము దెల్పి కో
విదుఁ డతఁ డాచరించిన కవిత్వప్రబంధముఁ గంటిఁ బిమ్మటన్.

ఉ. ఈయన నిప్పుడే కలిసి యించుక గోష్ఠి యొనర్చినాఁడఁ గా
ర్యాయతి నిమ్మహాత్ముఁడు సభార్థము మున్నరుదేఁడు మేటి సు
శ్రీయుతుఁ డీతఁ డెంతయును జేవగలట్టి మనీషి సత్స్వభా
వాయతసమ్ముగాఁ దెలిసెనయ్య యొకించుక చూచినంతనే.

శా. తర్కవ్యాకరణజ్ఞుఁడున్ గవనబంధజ్ఞుండు గీర్వాణవా
క్కార్కశ్యప్రవిభేది బంధకవితాఘట్టమ్మునం ఘట్టుఁ డ
య్యర్కున్ బోలెడువాఁడు తేజమున నార్యాచారి యొద్దాన సం
పర్కం బీతఁడు వెట్టికోఁ డఁట! కళావ్యాసంగి వాలాయమున్. 452

---

"............గిరతాది గ్రంథములను ముగిసిన వెంటనే పంపించుటకు ప్రార్థితులు."
చల్లా సోమనాథశాస్త్రి.

*"శ్రీ వేదమూర్తులగు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులవారి సన్నిధికి. ఆణివిళ్ళ సీతారామశాస్త్రి నమస్కార పూర్వకముగా చేయు విజ్ఞాపన మేమనగా,...... తమతో మనవిచేసినట్టే వారితోకూడా చెప్పినాను. మేము మానుటయే కాని వారు చేయక మానరని చెప్పగా, వారు తిరిగీ యేమియు చేయరు, మీరు మానవలసినదని చెప్పితిని. తిరిగి ఆలాగుననే చెప్పినారు. పిమ్మట యేమి తోచినదో అచ్చు వేయించినారు... మీరు చాలా యోగ్యులు, విద్వత్కవులు గాన విశేషించి వ్రాయనక్కరలేదు. ఇటుపైని మీయిచ్చానుసారముగా చేయవలయును."

ఆ॥ సీ॥ శా॥ ఆషాఢ బ ౯ గు॥

శా. వెలనాఁట్యాన్వయుఁ డొక్కఁడే వెలయు నవ్వీటన్ మహాపండితుం
డలఘుం డాతఁడు సోమనాథబుధుఁ డయ్యార్యుండు చల్లాకులుం
డెలమిన్ నానభ లొక్కరెండు గనినాఁ డీసూరి చప్పట్లనేఁ
తలవేళన్ దరి లేఁడ యుండినను నీతం డాఁపలేఁ డల్లరిన్.

---

## 13 ప్రశ్న.

అచ్చటివారిలో నెవరేని మమ్మును దూషించి చాటుగా నేవేని పద్యము లల్లుచున్నవారు కలరా!

### ఉత్తరము.

కాకరపర్రు.

"...... యనగా కొంతమందికవులు తమరిమీద చెప్పినపద్యములని కొంద రచ్చటచ్చట చదివిరి కాని యవి యిప్పుడు నాకు దొరకలేదు. దొరికి నచో నేనే పంపించుదును. మీరు నాకు వేరే వుత్తరము వ్రాయవద్దు. యెందు చేతనన ...... కావున నేనే దొరకినప్పుడు తమకు పంపగలను. అచ్చు పత్రిక లలోలేని పద్యములు......."

వేదుల వెంకటసత్యనారాయణమూర్తి.

"......... తమకు అయిష్టులైనకుకవులు కొంతమంది "కననము బాగున్నదికా" దని యిటువంటి మొదలైన కొన్ని వాక్యములచే వారికిన్ని మాకున్నూ కొంచెము వైరము కలుగు చుండును. మేమున్నూ ఒకొక్కవేళ "తే. గీ. నికటమున నుండి శ్రుతిపుటనిష్ఠురముగ। అదరి కాకులు బిట్టు పెద్దా ర్చినప్పు। డుదధిరాయంచ యూరకయుండు టొప్పు నైఁపరాకున్న నెందేని జనుటయొప్పు॥ అన్న భీమేశ్వరపురాణకుకవినిందను బట్టి సంచరించుచుందుము. ...... మొదలగు గ్రంథమ్ములు నేను దెప్పించి స్వయముగా చూచితిని వాట్ల యందు నైనఁగాని అక్కడక్కడ రసహీనపదంబులుండును గాని తమ పాండవ విజయ శ్రవణానందాదులయం దెచ్చటం గానరావు, ఆరామద్రావిడులలో యింతకీర్తిగల పురుషుఁడు ...... కలిగినవారిలో కానమని తలంచుచుంటిని— బ్రహ్మన్నశాస్త్రులవారి యశఃకందళమ్ము లనుమిమ్ముఁ బొగడుటకు శ్వాసనగ్రసనాధిపునకైన అసామర్థ్యము, ......" ఆరామద్రావిడి వేదుల వెంకటసత్యనారాయణ, తణుకుతాలూకా, కాకరపర్రు.

ఉ. ఈయనయే "యితం డిటకు నెన్మొయి రాఁ గత"మంచుఁ గొంద ఱం
దాయనమీఁదఁ గొంత విశయంబు[illegible] బూనిరిగాని యెట్టులో
పోయెను సంశయం, బదియు పోవక నిల్చిన నీతఁ డప్పురిన్
బాయు నవస్థ వచ్చునఁట! బాపురె! యీ పురి క ట్టిటింగితే.

ఉ. పండితులైనవార లటఁ బల్వురు గల్గియు నిట్టిపట్ల ను
ద్దండుల నాఁగఁజాలరఁట! తాదృశులేగద కృష్ణమూరికిన్
గండరగండఁడన్ బిరుదు గట్టిరి చూడుము "శృంగభంగ" మె
వ్వం డెఱుఁగున్ గృహస్థుప్రతిభల్ వెలి కేగినదాఁకఁ దిర్పతీ!

ఉ. ఇఁక ముగియింతు నీగొడవ యుద్ధచరిత్రుఁడు భాష్యకారశా
స్త్రికి మఱి సోమనాథబుధశీతమయూఖునకున్ గృతజ్ఞతం
బ్రకటన చేసెదన్ మిగుల మన్నన చేసిన యాణివిల్లవా
రికి మఱి చర్లవారికి మఱింగల సూరులకున్ గృతజ్ఞుఁడన్.

తే గీ. భాష్యకారుల కవనంపు బంధములను
వినఁగ నారేయి యొకకొంత నెడలిపోయె
పిదప నిద్రించి తెలతెలవేగు వేళఁ
బయనమై యాలమూరికి వచ్చినాఁడ. 457

---

## 14 ప్రశ్న.

పాండవాశ్వమేధవిమర్శనము (శతఘ్ని) వెంకటరామకృష్ణ కవులదియే యగునా ? కాఁకరపర్తి వా రెవరేని యందుఁగలరా ?

## ఉత్తరము.

ఆకిరిపల్లి, 22—3—11.

" ......... కాకరపర్తింతయు వెంక— కృష్ణులంటే అత్యభిమానముగ మున్నదఁట ! ఆయూర మఱినలువురు శతావధానులు గలరఁట, వాండ్రు అశ్వమేధమును విమర్శించుచున్నారఁట గ్రంథము పూర్తియైనదఁట శ్రవణానంద ములో వృద్ధవేశ్య వర్ణనసీసము "పంది" యనునది స్త్రీలింగ విశేషణమగుట "పందిని" యుండ వలయు నని యొకవాదము చేసిరి. ఇత్యాదులు పెక్కు లసందర్భము లొకవిద్యార్థితో ముచ్చటించిరఁట. ......"

శివరామశాస్త్రి.

ఉ. పాండవపత్ని నింబలెనె చండితకీర్తిని దస్కరింప నే
దుండగమో పౌనర్భనెడ దూఱువినా ఫల ముండ దంచు ధీ
శౌండుఁ డెఱుంగు నన్యులకు సత్పథముల్ గనరామి వ్యాజ మొ
క్కండును నూఁతఁ జేసికొని కాపథమం దడుగంటుదుర్ తుదిన్.

చ. ఇపు డెటులన్న నేమి యగు? నీతని దేశికతన్ దదీయశి
ష్యపదవి, కాకకోకిలము, నాత్మకృతిత్వము, మత్కృతిత్వమున్
గపటపు శృంగభంగమునఁ గల్గిన కల్లలు నారనూరిగా
రెపుడొ వచింత్రుగాక పరమేశ్వరుఁడే వినుఁగాక సర్వమున్.

ఉ. కోకిలకాకమంచుఁ గల కోడిగపుంగతికన్న నన్ శత
ఘ్నీకృతియందుఁ గల్గు కడునీచపుధోరణికన్న శృంగఖం
గాకృతి గర్వ్యమైనదియె! యన్యుని గర్తగఁ జెట్టనేల? క
న్నాకు శతఘ్నికర్త యల నారయశాస్త్రి యిటుల్ విధించెనో! 460

ఉ. సూర్యునను గ్రహమ్మునఁ బ్రసూజనగుప్తిని పాండవుండుగా
నార్యులు కర్ణునిం దెలియ రైరి యనంతరమందు డాఁగనే
కార్యము నేఁడు గుప్తముగఁ గాఁకరప ట్టిదియెల్ల డాఁచుఁగా
కార్యులమూలమై తుదకు నంతయునుం బయలెక్కెడిన్ సభా.

---

## కాఁకరపర్తి శృంగభంగము.

కాఁకరపర్తి కరతాడనంబు లాంధ్రదేశమునకు నూఱుయోజనముల మీఁదనున్న కలకత్తాపురమందు, జాతీయ వైద్యకళాశాలలోఁ జదువుకొనుచున్న మా చెవులకు, తప్పెట్లమ్రోఁతవలె వినంబడఁగా దద్దరిల్లి యేమియుఁ దోఁచక, నిర్ఘాంతపోయితిమి... ఇక్కడ నున్న యాంధ్రవిద్యార్థులలోఁ గలిగిన సంభ్రమమింతయని చెప్ప శక్యముగాదు.

మ. కవులీలోకమునందుఁ గల్గరె? దమిన్ గాల్ చివ్వకున్ దవ్వరే। యవుగాదంచనఁ జాలుపండితులు మధ్యస్థంబుగా నుండి స। త్కవి యీతండని చెప్పరే బళిరె! యీకార్వల్లి గ్రామంబునన్ । గవులో ఘూకవులో యొకన్ద్భుపని యేకాలంబునన్ గంటిమే.' ఉ. జబ్బలు పట్టికూల్చి యొక సక్కెములాడుచు "శాస్త్రిగారు మీకబ్బినసాహితిన్ గవన మందఱు మెచ్చఁగఁ జైటు

చ. గురుఁడఁట! పాదభక్తి యఁట! కొండొక యాజయమిచ్చెనంట! త
స్ఫురణపువేషముల్ మను పొసంగక యోడినజాడ దెల్పున
త్తతి గురు వేమి యయ్యెనొకదా! యగురా! గురు వెట్టిఁడో తిర
స్కరిణిని జేర్చి యిక్కరణిగా బ్రదుకుం డని తోఁపఁ జూపెనో!

చ. గురునిపసన్ గనుంగొనఁగఁ గొంచొక చూతము గాక యాతఁడే
నరవరునాజ్ఞ నాఁగునెడ నాటక మీగతి గట్టనేల! త
త్స్ఫురణపుఁ బ్రోవలన్ యశము గైకొనఁ గోరఁగ నేల! శిష్యుఁడున్
గురువును గూడి సత్సభలకుం జనుదేఁ దగుఁగాద శ్రీపతీ. 463

---

వేయుఁడీ। నిబ్బరమేమొచూతు" మన నేరిమి గల్గిన వెంకటేశుఁడా। దబ్బఱగాండ్రఁ దప్పికొని దాఁటుట పాటియె గాద చూడఁగన్. సీ. శాస్త్రార్థమునఁగాని చప్పట్లఁ దేలునే వ్యాకరణమున నస్తోకగరిమ। సుకవిత్వమునఁగాని యెకసక్కెములఁ దేలునే కవిత్వమునందు నేర్పుకలిమి। అవధానమునఁగాని యల్లరిఁ దేలునే ధారణాశక్తిలోఁ దారతమ్య। మననూయతనుగాని ఘనరోషమునఁ దేలునే యొండులొండుల యెక్కువలును। గీ. కాకిమూఁకల యట్టులఁ గేకలిడుచు। గేలి సేసిన యంతనె గెలుపుగలదె। ఇట్టిగెల్పున జాట నిగ్గులేదొ। బళిర! యియ్యదియే శృంగభంగమాయె. చ. "జరుపుదుమేము సత్సభను జయ్యనరం"డన రాక, "మీరలే। జరుపుఁ"డటన్న మార్పలుకఁజాలక, యొక్కని వెంకటేశునిన్। దెఱిగను బెట్టి పట్టి కరతాడన పర్వము సల్పిరంట హా। యెఱుకఁగలేక నాకు నితఁడోడె "బలాఁడు"రటన్న చాడ్పునన్. ఉ. వారును వీరు మాకు నొకవైఖరివారలె, వీరిలోన నె। వ్వారిని నేరు గెల్చినను వారికి వారికిఁ జాలినట్లుగా। గౌరవమేము నూపుదుము, కానిపనుల్ పొనరించువారలన్। దూఱక మాన మేరయిన, దోసము లోక మెఱుంగునట్లుగన్."

ఇట్లు సుజన విధేయుఁడు,

దంటు సుబ్బావధాని,

191 బోబజారువీధి, కలకత్తా, 13-9-11.

(శృంగభంగమును గూర్చిన మంచిచెడ్డలను విమర్శించుకొనుటకై చదువరులకుఁ గొంత యాధారమునకై యాయా యుత్తరములు మొదలైన వుదాహరింపఁబడియె. గ్రంథవిస్తరభీతిచే నింకను బెక్కు లున్నను నవి వదలఁబడియె. ఈ శృంగభంగము మొదట నేదోరీతిగా నచ్చొత్తించి పదఁపడి దేశమాతలోఁ బ్రకటింపించి పిమ్మట వారికవితాపత్రికలోనే ప్రకటించుకొనిరనియెఱుంగునది.)

చ. గురుఁడు యథార్థముఁ దెలుపఁగోరెడివాఁడె గురుండువాఁగ న
ల్లరి పను లాచరించిన నలందురువాఁడె గురుం డనన్ యశ
స్కరుఁడె గురుండువాఁ డనకు సద్గతి చూపినవాఁడె యెల్లరున్
గురువులె యెల్లరున్ హితులె కోవిదులే కలివేళ నోసఖా.

చ. గురువన నేమి ! సత్యమునకున్ జవదాఁటనివాఁడె, నాణెపుం
గురువన నేమి ! యల్లరులకున్ ముదమందనివాఁడె, నిక్కపుం
గురువన నేమి ! దోసమునకున్ దెరువీయనివాఁడె, యెల్లరున్
గురువులె యట్టులేని యల గుమ్మడుకాయఁ బగిల్చి చూడుమా. 465

చ. అకపటులైన శిష్యులకు నట్టియశమ్ములె గల్గుఁగాక నేఁ
టికపటు లిట్టికీర్తినె గడింతురుగా కది తాటియాకుద
ళ్లకరణి వెంటనే దుసికిలంబడుఁగాక సదా యథార్థవ
ర్తికి జయమో మఱొక్కటియొ తీఱని దబ్బెడుఁగాక యేకమై.

---

# 13

## శాఖా చంక్రమణ పర్వము.

రిజస్టరీ ఉత్తరమునకు సరియైన నకలు.

దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధానిగారి వద్దనుండి } శ్రీ వేదమూర్తులయిన చర్ల వెంకటచలపతిశాస్త్రిగారికి -

ఉ. చూచితి శృంగభంగమునఁ జూపఱు నవ్వఁగఁ జిత్తమందు సం
కోచ మొకింతయుం గనక కొంకు వహింపక జంకులేక మీ
కీఁచురవంబు గన్పడ లిఖించిన యా యనృతంపువ్రాఁత; దో
బూచులకున్ భయంపడునె భూతము లక్కట ! భూతలమ్మునన్.

ఉ. కాఁకరపర్తిలో నఁట ! జగంబులు మెచ్చ శతావధాన సు
శ్రీకతనన్ బ్రతిష్ఠ బ్రచురించిన వేంకటశాస్త్రి కెవ్వరో
యాకవిరాజ శిష్యపరమాణువు డీకొన మూలమూలలం
దేఁకిన పాలుబోతఁట ! యొదే నొనరించె నఁటెంతవింతయో! 468

ఉ. చుక్కలు రాలలేదు రవిసోముల పోకడ మాఱలేదు; న
ల్దిక్కులు కూలలేదు జలధిజ్వలనం బుబుకంగలేదు; నేఁ
డక్కట! రామకృష్ణకవు లర్భకు లేగతి సేయనేర్తు రా
ధిక్కృతవైరి వేంకటసుధీకవిమౌళికి శృంగభంగమున్?

ఉ. ప్రేలినఁ గీర్తి రా దవృతపిష్టము నూఱినఁ బూర్తి కాదు రాఁ
జాలిన రమ్మి మీకవుల సంబరముం గెలిపించుకొమ్మి బిం
కాలకు జంకువారమొకో కాఁకరపర్తికిఁ గీర్తితెమ్మి, సీ!
జాలమికేల వేగ నొక జాబు లిఖింపుము వచ్చి వ్రాలెదన్.

శా. మున్నే కోరితి రామకృష్ణులను "మమ్ముం గెల్వ రండంచు" వా
రెన్నెన్నో లిఖియించి "యేసభకు మే మేతేరలే" మంచు మే
ల్కొన్నా రేటికి నీకు నీ దురద వీలుం జాలు లేకుండ న
ట్లున్నన్, వారలఁ గూడి నేఁడయిన నా యుత్సాహమున్ దీర్పుమా.

ఉ. కాఁకరపర్తి యొక్కటియె కాదు, జగమ్మఖిలంబు నేకమూఁ
గా కల రామకృష్ణులకుఁ గల్గునె శ్రీపతి వేంకటేశ్వరా
స్తోకశతావధాన కవి ధూర్వహదివ్య[illegible]ప్రతిష్ఠతో
డీకొను శక్తి? యయ్యది ఘటించిన మాకును మోదమే కదా!

సీ. రామకృష్ణులు సభార్థము పిల్వలే దందుకొఱకు వేంకటశాస్త్రి యరుగలేదు
చుట్టాలతోఁ జెప్పి చూడ నేతేర మీ గ్రామమం దున్న శ్రీరామసేన
యూరి గౌరవమును నూరిలో నున్న పెద్దలగౌరవంబును దలఁపకుండఁ
జప్పట్లపర్వంబు జరిగించి యెక్కసక్కెములాడుకొనుచుఁ బ్రశ్నములు వేయఁ

గీ. దగినటులు చెప్పుటయె కాక తగునె యచట
యోగ్యతములకు ఋజురీతి నుత్తరంబు
పొంగుచును నంతలో "శృంగభంగ" మనుచు
గోల గావింప మీకు సిగ్గేల లేదు!

ఉ. గోణము కట్టుటాది బుధకోటి నుతింపఁ గవిత్వవైదుషీ
వేణికయౌచుఁ బేర్పడిన వేంకటశాస్త్రికి "శృంగభంగ" మన్
వాణి వినంబడం బ్రజలు నమ్మరు చింతవహింప రింతకుం
బ్రాణముతోడఁ బంపిరని మాత్రము మిమ్ము నుతింతు రిచ్చలున్.

ఉ. ఆతఁడొకండె కో, సభకు నాయతమై గెలుపొందఁ గాక మీ
చేతులలోని దేకొలఁదు చొప్పడనట్టుల్ వీడువాడు సభ్యులే
నేఁతలు సేయనేల? తలఁడు చేసిన దంతయుఁ గప్పిపుచ్చ నే
వ్రాఁతలు వ్రాయలేరు గుణవంతులు కొంకరపర్తి పండితుల్!

సీ. ఎందేని సభసేయ నేర్పాటుఁ గావించి సభ కొక్క రాజ్యార్హు నీశ్వరునిఁ జేసి
రామకృష్ణులచేత "రం" డంచు వ్రాయరచి మీ రేగుదెం డారుటూరు మనుచు
శృంగభంగము శిరశ్ఛేదంబొ కావించి తిరుపతి వేంకటేశ్వరుల రామ
కృష్ణకవులచేత గెలిపించి తెంచు కొంకరపర్తికి పెద్ద గౌరవంబు
గీ. ప్రాజ్ఞు లున్నారు కవులు విద్వాంసు లున్న
వారు భూపతు లున్నారు వారువారు
సంతసింపఁగఁ జేయఁ డీ సాహసంబు
నందుకొనుఁడయ్య యివియె నా వందనములు.

కాకినాడ, 26-7-11. } దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధాని.

ఈ రిజిష్టరుత్తరముపై నేవో కొన్ని వికటపు మాటలతో "సత్యసందేశ" మను పేర రిజష్టరుచేసి పంపిరి. సత్సభకు సంబంధించిన యుత్తర మందు లేమిం జేసి దానికిఁ బ్రత్యుత్తర మీయఁబడదయ్యె. పిష్టపేషణమని యెంచి యది యుం దుదాహరింపలేదు. దాని సత్యాసత్యము లుపోద్ఘాతమున నించుక విమర్శింపఁ బడినవి అందుఁ జూడఁదగు.

---

## 14

### పాశుపత పర్వము.

తే. గీ. సత్సభ యటన్న రం డనఁజాల రైతి
రల్లరి యొనర్చువారల కన్నలైతి
రౌర! ధీరులరై గడేకారిపదవి
కాస చేసితి రేమందుమయ్య మిమ్ము.

శా. నారం బన్నను గూపనీరమును, నెన్నం గప్ప లం దెందు సం
చారంబుల్ జరిగించుచుల్ ఋత్రికటుల్ చాలన్ బ్రసంగించు నా
దూరావం బిడ నేర దేరికిని సంతోషంబు, నారాయణా
ఖ్యారూఢిన్ బ్రకటింతురే యకట! యే యారావమో సేయుచున్.

ఉ. "పుట్టె నెటో స్వశాఖ నిది పో దిఁకఁ దోఁటకుఁ జేటు తెచ్చు నీ
చెట్టనె ఱెంగి రక్ష నిడి శ్రేయము గూర్చుట మీకుఁ గీర్తి" యం
చెట్టులో నేను జెప్పుటకు నెంచిన నల్లరిఁ జేసి నిందలన్
గట్టినయంతనే యశము గైకొన నేర్తురొకో యనామకుల్ !

† సీ. నాల్గుశాస్త్రముల నున్నతిగన్న వెంకటసుబ్బశాస్త్రుల వచశ్శ్రుతులకన్న
అత్యాశుకవియు భాష్యాంతవేత్తయు నైన రంగార్య వాక్ప్రసారంబుకన్న
సర్వశాస్త్రముల విజ్ఞత్వమ్ము గల వానమామలస్వామి సమ్మతులకన్న
మఱియు నెందఱొ మహామహులు మెచ్చియొసంగు జయపత్రికాసముదయముకన్న

తే. గీ. మిన్న యగునొక్కొ మీ వ్రాయు చిన్నతనపు
శృంగభంగపు వ్రాఁతలు చెళ్ళపిళ్ళ
వెంకన యశమ్మునకు నివి వీసమేని
లోటు దెచ్చునె మీకు ఫల్గుతయె కాని. 480

శా. ఆయా పండితవర్గ మిచ్చు జయపత్రానీకముల్ వోయి మీ
దాయల్ మీరును వ్రాయు కుచ్చితపు వ్రాఁతల్ బైటికే తెంచి "హీ
హీ !" యంచున్ నను మీరునుంబలెనె యేరే నన్నుఁ జూతున్ ; వృథా
హేయంబుల్ పచరించు మిమ్మడుగ నా కేలా ! యసద్వాదులన్."

చ. ఎఱిఁగియు నిద్రవోవుజను నెవ్వఁడు మేల్కొనఁ జేయు ! వేంకటే
శ్వరుబలెఁ గొన్ని కబ్బములు సల్పి వధానము లాచరించి కొం
దఱు బుధవర్యులన్ గని యనంతర మాతనితోడఁ బోరుసం
బరమున కీయకొన్న బుధవర్యులు మెత్తురు మీప్రయత్నమున్.

ఉ. మీర లుపాయశూన్యు లటు మేకులు చెక్కుచు శృంగభంగమున్
గాఱుగ వ్రాయువారె యది గాంచిన తోడన "క్రోధమూర్ఛితుల్
దూఱునకై దురుద్యమముతో నిది కూర్చిరి సీ !" యటంచు నే
మోఱకుఁ డేని లో నొగులు మోసపువాసన గొట్టు నామమే.

మ. చరితన్ వ్రాయుటొ ! దుఃఖమున్ దెలుపుటో ! సత్యంబు వాక్రుచ్చుటో
గరితల్ వోలె గృహమ్మునన్ మడఁగి యీకాఱుల్ ప్రసంగించుచో
ప్పరయన్ మాటికిఁ గాక కేవల మసూయామాత్రపర్యాప్తమై
విరసత్వమ్మును దెల్పుచున్న దిటువో ! విఖ్యాతి నార్జించుటల్.

† ఇందలి పండితుల ప్రశంసలు శతావధానసారమునఁ జూడఁదగు.

శా. తోలుంబొమ్మలయాటగా "నెవనినో దోళించు నేతెంతు మా
బాలు న్నీ వెదిరించెదే" యనిన నబ్బాలుం డెవం డంచు నే
నాలోచింపనె, వాఁడు నాయెదుటి కేలా వచ్చు? నామోము వాఁ
డేలా చూడఁగలాఁడు, నే నెఱుఁగనే యీ గారడీవేసముల్ !

* గీ. "రాను రప్పింపఁబని గానరా" దటంచు
వ్రాసి ప్రకటించినట్టి యాబాలసుకవి
యితఁడు గాఁడొక్క రానేల యిచ్చగించు
నల్లరికిఁ గాకయున్న నారయబుధేంద్ర!

తే. గీ. అతని శక్తి మీశక్తియు నఖిలమెఱుఁగు
వాఁడ నీజన్మమంతయు వ్యవధి మీకు
సత్సభకు రండు నిల్వండు చాలు ; నోరు
మెదప నక్కఱలేదు మీచదువు తెలియు.

సీ. దాతృత్వమునఁగర్ణుదాఁటినాఁడను పేర్మిగాంచువాఁడు యశమ్మునించువాఁడు
అఖిలవిద్యలు చూతునని ప్రతిజ్ఞవహించి నెగడువాఁడు బుధాళి పొగడువాఁడు
తారతమ్యమెఱుంగఁ దగు పండితుల చేత మెలఁగువాఁడహితంబుతలఁగువాఁడు
విద్వాంసుఁడను పేరు విన్నంత నానంద మందువాఁ డాశీస్సు లొందువాఁడు
తే. గీ. రావు వెంకట శ్రీ సూర్యరాయవిభుని
బోలఁ "జాల" మటంచు మీబాలు రనర
యేని యామేటి యేటి కుపేక్ష సేయు
నారసి వచింపుమయ్య యోనారయార్య! 488

సీ. అచ్చులోఁ బొరఁబడ్డయక్కరమ్ముల నేరి దోషమ్ములను విజిగీషులార
భారతాదుల వాడఁబడినలక్ష్యము లెఱుంగక కుమ్ములాడు మేటికవులార
ఎవరి నేతప్పు పట్టవలెనో యెఱుఁగక పత్రికల్ చెఱుచు సర్వజ్ఞులార
భానుపైనిఁ బరాగపటలిఁ జల్లఁగఁ జూచు ప్రౌఢి చేకుఱినవిద్వాంసులార
తే. గీ. యింటఁ గూర్చుండి మీచిత్తమెట్లు వచ్చు
నట్లు గొప్పలు సెప్పికొం డంతెకాని
పత్రికలకు విమర్శనల్ పంపకుండు
మీరహస్యంబు బయలెక్కు మేలుకొనుఁడు.

* "రాను రప్పింపఁ బని గానరాదుమాకు" అను పద్య మప్రస్తుత ప్రశం
సలో ముఖపత్రమందుఁ జూడఁదగు.

చ. అదె చనుదెంచెఁ * బాశుపత! మందుఁ గృతఘ్నులఁ బూను శతఘ్నులన్
బదును చెడున్ మహామహుఁడు పార్థుఁడు మున్నది వాఁడె దాని కి
ప్డదనుదయించె గౌరవమహాహవ మిత్తఱి నత్తమిల్లుటన్
గుదురుచుఁ గాక యాశరము కూర్పరగవీపటలావలేఖముల్.

ఉ. ఇంటనె డాఁగి కృష్ణకవి యేఁటియొ ముగ్ధులు నెట్ట పేరినో
కొంటెల నంపి మీరలను గోల యవారిగఁ జేయఁజేయ నే
నొంటరి నేమి సేయఁగల "హూ" యిఁక లెండన నెట్టు లేతు మీ
దంటతనంబు లయ్యెడఁ గదా! ప్రకటింపవలెన్ మహోదయుల్.

ఉ. అల్లరికేమి యెట్టులనొ యజ్ఞతమై ఘటియింపవచ్చు మీ
యుల్లమె సాక్షి దాని, కది యూరక పో దని లోన జంకి యే
కల్లలొ కొన్ని నించి యొకకబ్బము కూడన! దాని వెంటనే
వెల్లడిసేయుటా! యకట! పేరిఁక దానికి శృంగభంగమా!

చ. ఇది యిటులుండ నిత్త మెటులేని యశమ్మును గోరు వీర లొ
ప్పిదముగ నింటనుండ కెటు పిప్పి ప్రసంగముగా శతఘ్నికన్
గుదిరిచినార లాపదును గోఁడు సమస్తము వెళ్లఁగ్రక్కు మీ
కిదియును రాదు నిక్క మని యేర్పడఁ జేసెడి దానిపోకడల్.

ఉ. అందునఁ దాము లేమనెదరా, యది మీపుర మెప్పికోదు నే
నందకె వచ్చి మీ సలుపునల్లరి చల్లఁగ నోర్చినాఁడ మీ
రందుల నున్న సంగతి యథార్థముగాఁ గనిపెట్టినాఁడ మీ
నిందలకెల్ల సైఁచితి గణించితి నట్టియమూల్యతత్త్వమున్.

శా. శబ్దజ్ఞానము నాకె యున్నదియొ నిచ్చల్ మీకె తా నున్నదో
యబ్దంబుల్ మఱి యెన్ని నాదుకడ శిష్యత్వంబు గావించుపై
శబ్దజ్ఞానము సుంత కల్గెడినొ యీసందర్భమే తెల్పు "హూ"
శబ్దజ్ఞానము పైపయిం గలదె! వాచాశూరతల్ కూడునే?

చ. "పలుకఁగవచ్చు నూఱొకటి వ్రాయుట శక్యము గా" దటన్న యీ
పలు కెపుడేసి మీమదికి వచ్చెనె యూరక గేలిసేయు నా
ఫల మెదిరించెడిన్ గడచు ప్రాజ్ఞత యుండినఁ గాంచికొందు పే
రలుక వహించినట్టిఫల మందుఁడు యుక్తికిఁ జాల కుండినన్.

---

* "పాశుపతము" ఇది వారి శతఘ్నికిఁ బ్రత్యుత్తరము.

ఉ. అల్లరిసేయ నేర్చిన కలార్థులతో నిటు సాఁగిరాదు వి
ద్యోల్లసనంబు గల్గు నుపయోగము సేకుటు లేనిచోఁ గడుం
దల్లడపాటు పైఁబడు వృథా యొనరించిన వాగ్వ్యయంబు మి
మ్మెల్లవిధమ్ముల౯ గడకు నింతకుఁ దెచ్చె లిఖింపుఁ డీపయి౯.

చ. ఒడలి బలమ్మున౯ గెలువ నూహయొనర్చితి రీరటంచు నా
యెడఁద నెటో గ్రహించితి సహించితి నాపయి మీరు శిష్యులే
గడబిడఁ జేసిన౯, దెలియఁగాఁ బడెనే యిపుడేని మీకు నా
యెడఁద తెలుంగు? పాండితి నోకించుక పాశుపతంబె తెల్పెడిన్.

తే. గీ. ఏకవచనప్రయోగాన నెక్కు సక్కు
యాముగ "నీకు శబ్దజ్ఞాన మకట లేదు
కవిత యిఁక నెట్టు"లనుమాట జ్ఞప్తియందుఁ
బెట్టుకొని యుత్తరము వ్రాసి పెనఁగుఁడింక.

ఉ. వేంకటశాస్త్రినైపుణి వివేకు లెఱుంగనివారు కారు మీ
లెంకలు మీరుఁ దుల్యులని లేకియుఁ గూడ వచింపఁ దట్టిచో
లెంకల నంపి నన్ను నదలించెద రెంతటిసాహసమ్ము మీ
కంకెఁగఁ జేసె దేవుఁ! డిపు డాతఁడె యడ్డెడుఁ గాక పీఁకమై.

తే. గీ. కూపకూర్మప్రసంగముల్ గూడవిచట
చప్పటలు గొట్టుటలు కొనసాఁగ విచట
వట్టిప్రల్లదములు పనకట్ట విచట
పాండితియు నైపుణియు నుంత వలయుఁ జూండి.

ఉ. వెంకటరామకృష్ణు లతివీరులు వాండ్రి నటుంట నిందు మీ
శంకల కుత్తరం బొసఁగి జాడ్యము వాపుట ప్రస్తుతంబుగా
వేంకటశాస్త్రి పూనె మును వేగిరపాటున నైచినట్టియీ
అంకెలు సాఁగిరా విచట వ్రాఁతయన౯ బలిఁ గోరెడిం జుఁడీ.

చ. దయగలదేవుఁ డెట్టులో శతఘ్నిని వ్రాయఁగఁ జేసె మిమ్ము మీ
చెయి రచియించు మీచెయిది చెప్పకయే, జగ మక్కటాన నె
మ్మెయి గ్రహియించు వెంకయకు మీకును గల్గినవార, యౌర! యే
రియశము లేరి కబ్బెడు, వరించునె గీర్తులు తమ్ముతామయై!

చ. ఒడలిబలమ్మున౯ గెలుతు రొప్పితి, నందునఁ గూడఁ దిర్పతి౯
దడఁబడఁ గొట్టఁజాల రొకదద్దపదిందక పట్టుఁ బట్టి న౯

గడపుదు రట్టిపట్టులకుఁ గేవలవిద్యకు నేడ కేడ ! యీ
వెడఁగుఁదనంపుఁద్రోవలు వివేకులు నేర్తురె కీర్తి నిత్తురే.

చ. ఇఁకఁ బ్రయతించి పాశుపత మెట్టులొ త్రిప్పికొనుండు దాన మీ
కకలుషమైన కీర్తి యగు నందుకుఁ జాలరయేని నన్ను మీ
రోకరె హాసింపఁ బాడితు 'లహో' యని యెల్లరు మిమ్ము నవ్వి 'హ
స్తికి నలదోమ యెక్కు' డని తేల్తురు సారము బీర నేటికిన్.

సీ. చర్ల నారాయణశాస్త్రియు నాకుండి వ్యాసమూర్త్యాఖ్య మహాకవియును
అల్లపురాణపండాన్వయాభరణంబు మల్లయాఖ్యబుధేంద్రతల్లజుఁడును
వెదకి తప్పులు నూప వెంకటరామకృష్ణకవీశ్వరుల్ కృతజ్ఞత్వనిధులు
వెంకటసూర్యరాడ్విభు నేలుబడి నుండి మా నాటకమును సమ్మదముకల్మి

తే. గీ. పాడొనర్పఁ బ్రయత్నించి పంపినట్టి
యలశతఘ్నుని జూచిన యనఘులెల్ల
మరల మా పాశుపతమును దఱచిచూచి
గుణవివేచన మొనరింపఁ గోరువాఁడ.

* ఉ. "అంక మొకింత గల్గని మహాత్ముఁడు వ్యాసమనీషియున్ నిరా
తంకుఁడు మల్లసూరియును దక్షుఁడు యోగ్యుఁ డుదారుఁడైన శ్రీ
వెంకటసూర్యభూవిభుఁడు" ప్రేరకు లంచును వారిపద్దెమే
కొంకక తేల్చె నే నొకనిఁ గ్రొత్తగఁ జేర్చితిఁ జర్లచంద్రునిన్.

ఉ. ఈయనయే ననున్ మిగుల హేళనచేసిన బుద్ధిశాలి నా
రాయణశాస్త్రిగారి కెటులైనను జ్ఞానము గల్గెనేని ల
జ్జాయతి నిట్టివ్రాత లడుఁగంటు నటంచు మదిం దలంతు న
న్నాయన గేలిసేసినను నాయన కేను వచింతు నొప్పులన్.

ఉ. తప్పొకఁ డాచరించితిరి దానిని గప్పికొనంగ నెన్నియో
తప్పు లొనర్చుచుంటిరి వృథా నుఁడి మీ రొనరించుయత్న మే
మొప్పియు మిమ్ము మెచ్చఁడు 'నమోనమ' యంచు వచింపుఁ డెందుకీ
తప్పుడుతోవ లెందుకుఁ గృతఘ్నశతఘ్నులలోనఁ దూఱుటల్. 509

---

ఉ. అంక మొకింత కల్గని మహాత్ముఁడు వ్యాస మనీషియున్ నిరా। తంకుఁడు మల్లసూరియును, దాళలు నేమము చూచుచుండఁగా। వేంకటసూర్యరాయప్రభు వీరమణుం డనుకూలుఁ డేలఁగా। వేంకటరామకృష్ణకవివీరులగారపుబిడ్డ కైత క। డ్డంకులు వల్కుపోటరలు డాఁగక లోఁగకయుండు టెట్లగున్॥
(కవిత 1911 సం॥ 10 సంచిక)

సీ. శృంగభంగమటంచుఁ జెలరేఁగి తప్పుడువ్రాఁతలు ప్రకటింప వచ్చుఁగాక
అతిమతిఁ బోరిఁబోరిఁ బురపుర్షమై గురువరుని బ్రివ్వఁగఁ దిట్టవచ్చుఁగాక
చాలు మూలము లేక శబ్దార్థములు తప్పువట్టి పత్రికనింపవచ్చుఁగాక
చదువుకొంటినటంచుఁజక్క వ్రాయుచుఁ దల్లిపై వసంతముచల్లవచ్చుఁగాక

గీ. 'హూ' యనఁగ వచ్చుఁగాక, యేమో యనంగ
వచ్చుఁగాక, రెండును వీడవచ్చుఁగాక
పైని మాటి జయింపఁగా వచ్చుఁగాక
పాశుపతమును ద్రిప్పఁగా వచ్చు నెట్లు !

ఉ. దిక్కుల నెల్ల నాత్మ గురుతేజము నింపి దివాకరుండు తి
ర్యక్కుల కందరాని గగనాంతరసౌధపుఁజంద్రశాలపై
నెక్కుతఱిన్ శతఘ్ని యొకఁ డిట్టులె రోజును రోజు ప్రేలు నే
తుక్కునొ మూర్ఖతుష్టికయి 'తుస్తుసు తుస్స'ని వెళ్లఁగ్రక్కుచున్.

ఉ. పాశుపతాగ్నిహోత్రమున భగ్గున మండి వెలింగి బూదియై
రాశికి రాక దూళియుఁ బరస్పరమేళన లేమి బ్రుంగఁగా
నాశనమయ్యె దానికి వినాశనకాలము మూఁడి మున్నె మీ
యాశలతో శతఘ్ని; యిఁకనైనను మేల్కొని మేల్కొనం దగున్

సీ. నావల్లనే మీకు నామరూపమ్ములు వచ్చినమాట ధ్రువంబయేని
నాకున్నశక్తిలో మీకున్నశక్తి యెన్నవవంతుగామి సత్యంబయేని
కపటవర్తనుల హృత్కాలుష్యములు భగవంతున కెఱుఁగంగ వచ్చునేని
పనిపాటులను వీడి పరులగుణాగుణములు సూచువా రిలఁ గలరయేని

తే. గీ. ఎందులకు నేను వ్రాయుట? యెల్లకల్ల
నిజములవి వానియంతనే నెగడు; నట్లు
కానినాఁ డేను గష్టించి కలదె ఫలము?
వ్రాసికొనుఁ డింక మీయిచ్చ వచ్చినట్లు.

# 15

## ఉపసంహార పర్వము.

ఉ. ఊరక వ్రాయు మంటి నొకయుత్తర మంతన నీదుపాండితీ
పారము నెల్లఁ జూపి తలవారలపై సభ యన్నచో గడే
కారులు వత్తురయ్య ! గుణగణ్యులు సేతురటయ్య యల్లరుల్ !
చోరులు త్రోవఁ గాచు నెడ శూరులొ, వేయొకపట్ల శూరులో !

తే. గీ. సభకు రాఁదగువారలు శాస్త్రవిదులు
కొంద ఱప్పరి నున్నారు కొంతవఱకు
వారిఁ దెల్పియె యుంటి నవ్వారికొఱకె
చనవలసె సత్యసంధు లాఘనహృదయులు.

తే. గీ. తజ్ఞులగు వారివారియుత్తరము లుండు
టెఱుఁగ కవ్వారి పేర్గూడఁ జెఱుపఁదలఁచి
తమకుటుంబమ్ములోఁ జేర్చి దబ్బఱలను
మనప్రబుద్ధులు ప్రకటించికొనిరి కంటె ?

* చ. చలపతిశాస్త్రి పేరను రిజస్టరుపత్రిక నీవు పంప లో
పల దిగులంది యాతఁడు "కృపన్ క్షమియింపుఁడు త" ప్పటంచు వె
ల్వెలఁబడుచున్ లిఖించి పయి వీరును వారును భీతి మాన్పి యొ
గ్గులు లిఖియింప దాని పయిఁ గొండొక వ్రాలొనరించెఁ గంటివే.

గీ. "సత్యసందేశ" మఁట ! దానిఁ జదివియుందు
వదియుఁ గవితయె ప్రకటించె నంతఁ బోక
శృంగభంగమ్ముగూడఁ బత్రికను జేర్చి
కొనిరి బ్రతులయ్యొ బాలురగుట్టు కంటె!

ఆ. వె. ఎవని వ్రాలొ చేసి యేడకో రమ్మని
వ్రాయ నేల ? సభకు వచ్చుశక్తి
తమకుఁ గల్గియున్నఁ దమరె వ్రాయఁగ రాదె
యింతమాత్ర మెఱుఁగదే ! జగంబు.

---

* ఈయనక్షమాపణ యుత్తరము 79 వ పుటలోఁ జూడఁదగు.

ఉ. ఇంతటిబుద్ధిమంతు లని యిప్పటికేనియు నీకుఁ జక్కఁగా
నెంత యెఱుంగఁగాఁ బడెనె కుంతలచేఁతలు పత్రికన్ సుధీ
కాంతులు గొందురే ! తమకుఁగా లిఖియించిన పాడువ్రాఁతగా
నెంతురు లోకు లం చెఱుఁగ రేమన వచ్చెడి వారిచెయ్వులన్ !

ఉ. ఏదియొ గిల్కుచుందు రది యెవ్వరొ మెచ్చుచునుంద్రు వీరికిన్
లేదు సుబుద్ధి వారలకు లే దది యంతకుమున్నె, మద్యశ
శ్శ్రీదరి కేగ నీదుడుకుచేఁతల కేమధికార ? మెట్లొ వా
పోదురుగాక యీ చెనఁటి పోకలు లోకులు విశ్వసింతురే.

చ. ఎఱుఁగని వారి వ్రాఁతలకు నేదియు నుత్తర ముండఁబోదు స
ద్గురుపదపంకజమ్ములను గొల్వఁగ నేరక తప్పువ్రాఁతలన్
బురపుర నింపి పత్రికలు పుచ్చెడిశిష్యుల సైఁపుమయ్య కాఁ
కరపురిలోని పెద్దల మొగమ్ములనైనను జూచి శ్రీపతీ.

ఉ. శ్రీపతి వీవు నీకవిత సీత విశుద్ధచరిత్ర; యాపె కె
ట్లో పనిఁబూని యెవ్వరొ జడుల్ దొసఁగుల్ పొసగింప నెంచఁ ద
ద్వ్యాపృతి నాఁగఁగా మొదట వా రెవరో యెఱుఁగంగఁ గోరి నే
నాపురి కేగితిం దెలియ నయ్యె నొకింతన వారిపోకడల్.

ఉ. సీతనుజూచి రామునకుఁ జెప్పఁగఁబోయిన వాయుసూతి తా
నాతతి నయ్యశోకవనముం దొనరించినకృత్య మేమి ! యా
దూతమనమ్మునం దపుడు తోఁచినయూహయె నాకుఁ దోఁచెఁ బ్ర
ఖ్యాతికి మూల మైన నగుఁగాక మఱొం డగుఁగాక శ్రీపతీ.

ఉ. పట్టిరి కొట్టి రయ్యనిలుపట్టిని బిట్టుగ సోఁకుముందలన్
బెట్టిరి తోఁక కాల్చిరి బిభీషికలన్ గనఁజేసిరిన్ని యున్
బెట్టిదముల్ సహించి యల వీరుఁడు గుట్టు నెఱింగి రాఁడె ? యా
దట్టునితోవఁ బట్టితి యథార్థ మెఱింగితి నెట్లొ వచ్చితిన్.

క. దొంగ గతి తప్పఁ దనకు స
భం గెలు పిఁక లేక "శృంగభంగ" మనుచు వ్రా
సెం గృష్ణుఁడు మఱికొం దఱు
వెంగలులన్ జేర్చికొని వివేక మెడలఁగన్.

క. వేంకటరామకృష్ణా నీ
పంకమ్మునఁగలఁడో లేఁడో వ్రాసె నరుఁడు నుణ్
గొంకక కోకిలకాకము
పంకిలచిత్తులకుఁ గలవె భయభక్తు లిలన్.

* క. గురుదక్షిణ యిడఁ గాదె శి
వరామకవి నీకు నూటపదియాఱుల నో
తిరుపతిశాస్త్రి! యితఁడిదు
గురుదక్షిణ నేల యందుకొనఁ దగదో కో!

గద్య

ఇది శ్రీ ...... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబగు
గీరతామ్నాయమ్మున నధికప్రసంగదమనమను
ప్రథమభాగము సంపూర్ణము.

---

* (తెనాలి శతావధాన పీఠికనుండి)

అవధానిగారి కొసఁగఁబడిన బహుమానము ( రు 116—0—0) లును బ్రహ్మ సభవా రొసంగిన సత్కారము ( రు 25—0—0 ) లును అవధానిగారు తమకుఁ గల భక్తి విశ్వాసములు వెలువడునటుల బ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రి గారికి సమర్పించిరి. గురువులయెడ శిష్యుఁడిట్లే కదా ప్రవర్తింపవలయును.......

ఇట్లు విద్వజ్జన విధేయులు
ప్రిభల వీరరాఘవులు.
పెద్దిభట్ల లక్ష్మీనరసింహం.

తెనాలి,
28–12–11.



# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 19 | వంశ | నంశ |
| 4 | 10 | కుబోఁరె | కుఁబోరె |
| 20 | 11 | ప్రబద్ధు | ప్రబుద్ధు |
| 25 | 15 | 'లేవని | లేవని |
| 27 | 15 | నీముందరా | నీముందఱా |
| 28 | 20 | గంతె | గంతే |
| 32 | 21 | పచ్చుబై | వచ్చుఁబై |
| 34 | 22 | యజ్ఞాము | యజ్ఞానము |
| 36 | 2 | జూడం | జాడం |
| ,, | 24 | చెచ్చి | దెచ్చి |
| 42 | 4 | కేని | కేవి |
| ,, | 18 | యయున్నది | యయున్నది |
| 55 | 2 | పగత్వ | పర్వత |
| 57 | 22 | తెలుఁపు | తెలుపు |
| 82 | 11 | తారియము | తాప్రియము |
| ,, | 16 | భోరనణ | బోరనణ |
| 83 | 5 | పదఁప | పదప |
| 84 | 5 | డిజన | డితజన |
| 94 | 14 | ఘట్టుఁడ | దట్టుఁడ |
| 99 | 8 | గుమ్మడు | గుమ్మడి |
| 102 | 19 | బుథ | బుధ |
| 103 | 15 | పండితుల | పండితులు |
| 104 | 18 | నండకె | నందుకె |
| 107 | 7 | మూటి | మూఁటి |
| 109 | 14 | పాసగింప | పాసఁగింప |

గిర. చరిత.

# ఉపోద్ఘాతము

చదువరులారా!

గీరతప్రథమభాగము చదివి యుంటిరికదా, సర్వవిషయములును సూత్రప్రాయముగా నందే గతార్థము లగుటచే నిప్పుడు ప్రకటించు ద్వితీయభాగమున గాని, ప్రకటింపఁబోవు తృతీయభాగమునఁ గాని తెలియఁదగు విశేషాంశము లంతగా నుండవు. ఎన్నాళ్ళుచదివినను నాయా యీగ్రంథభాగములయందు—

(1) శిష్యుఁడు గురుద్రోహముచేయుట తప్పు. (2) అందులో నీ శిష్యుఁడు వత్సరములకొలఁది చదివిన శిష్యుఁడు గాని వేఱొక విధమగువాఁడు కాఁడు. (3) పైఁగా నితఁడు కృతఘ్నుఁడగుటతోఁ జాలింపక వదరుఁబోతువ్రాఁతలు, అసత్యములు, అపవాదులు లోనగునవి ప్రకటించుట మొట్టమొదలే తప్పు.

అను నియమములు దక్క వక్తవ్యాంశము గానరాదు. గురువే దోషియో, లేక శిష్యుఁడే దోషియో మీకు మొదటిభాగమువలననే గతార్థమై యుంటచే దీనిప్రకటన మంత యావశ్యకమని మాకును దోఁచలేదు గాని మొదటిభాగమునందు విస్తరభీతిచే వదలిన యంశములు కొండొక యుంటచే నయ్యవి యిందు ఖండించు మిషమీఁద గురుశిష్యధర్మములు కొన్ని సంగ్రహించి చూపుటకై దీనిని ముద్రించితిమి. 'అట్టహాసము' అనునది ప్రథమభాగమందే యించుక స్పృశించి వదలఁబడినది. పిమ్మట గుంటూరుసీమ పూర్వరంగము 45, 46, 47 వ పుటలలోఁ గొండొకదాని బండారము బయటబెట్టఁబడినది. ఇందుంగూడ నక్కడక్కడ దానింగూర్చి ప్రస్తావింపఁ బడినది. 'అట్టహాసమే' యననేల, మాశిష్యులు వ్రాసెడి వ్రాఁతలెల్లఁ బరికించి చూచినచో—

(1) మాగురువు పండితుఁడుగాఁడు. (2) పాత్రుఁడుగాఁడు.

అను నంశము సాధించుటకై పాటుపడుటదక్క వేఱొక్కటిగానరాదు. ఇందులకు వారు చూపుప్రమాణములో, పేరు దాఁచికొని తోఁచిన ప్రల్లదము లెల్ల వ్యయపఱచిన తస్కరుల వ్రాఁతలు. ఆవ్రాఁతలవలననే గీరత ప్రథమ

భాగము నిస్సార మనియో నిరుపయోగమనియో గూడ లిఖించి సంతసించుచుండిరి. ఆవ్రాఁతల తత్త్వము లోకమెల్ల నెఱుంగును. మాశిష్యు లంతకుమున్నె యెఱుఁగుదురు. ఎఱిఁగియును వానివలన మాకేదియో న్యూనత కలుగు ననియు నంతలోఁ దమ గురుత్వముకూడఁ బోవు ననియుం గాఁబోలును వీ రవి పట్టుకొని సారెకు వ్రేలాడుట!

"శ్లో॥ కతిపయదివసైః క్షయం ప్రయాయా, త్కనకగిరిః కృతవాసరావసానః
ఇతిముదముపయాతి చక్రవాకీ వితరణశాలిని వీరరుద్రదేవే.

(విద్యానాథకృతము)

"తుష్యతు దుర్జన" న్యాయమున నాయీ యాతప్పుడువ్రాఁతలెల్ల నిజములే యైనను దమ కవి సాయముగావు. అవి మాకుఁ గల యశమును బోఁగొట్టినఁ బోఁగొట్టుఁగాక. తమ గురుత్వము నెట్లు పోఁగొట్టఁగలవు? కావున వీరు మమ్ము దోషులనుగాఁ జేయుటకు వ్రాయు వ్రాఁతలేమి, యందులకై వ్యయపడుచున్న ద్రవ్యప్రదాతల సొమ్మేమి వమ్మేగాని లాభకారి గాదని వారి కిప్పటికేనిఁ దెలిసినచోఁ గొంత యుక్తముగా నుండును. నానాఁటికి వీరు మఱియును నట్టడవిని బడుచున్నట్లు వ్రాఁతలవలనఁ దెలియవచ్చుచున్నది. మొదట గురుని కవాత్రత్వము సాధించుటకు "గాకి" యని వదరఁ దొరఁకొనిరి.

"పక్షిణాం కాకీ చండాలీ" అనుటవలన నది యపాత్రత్వమునకు సాధకమే. ఇటేనలనో? ఈ వేంకటేశ్వరుఁడే యా వేంకటేశ్వరుఁ డని యభేదాధ్యవసాయము చేసికొని పడఁదిట్ట నారంభించిరి. అతివిస్తర మెందులకు? ఏదో విధమునఁ దిట్టుట వీరి ముఖ్యోద్దేశము. ఏదోవిధమున నీతి గఱపుట మాముఖ్యోద్దేశము. వారంములకును మే మిందులకును బాటుపడవలసిన దని భగవంతుఁ డేర్పఱచియుంటచే నేవో వ్రాసికొనుచుందుము. రసాసవిచారముతో మాకుఁ బని లేదు కావునఁ జదువరులు మమ్ము నిందింపకుందురుగాక....

ప్రకృత మగు 'కోకిలకాకము'ను గూర్చియు, నింతకుమున్న ప్రచురించిన గీరశ ప్రథమభాగముపై వారు ప్రకటించిన శంకలనుగూర్చియుఁ గొండొక వ్రాసి విరమించెదము. "కోకిలకాక" మన్యాపదేశముగదా, దానిని మీపై నేల పెట్టుకొంటిరి? అని ప్రశ్నరావచ్చును. అందులకుఁ బ్రథమభాగ పీఠికలో

మాశిష్యుల వ్రాఁతలనే బోధకములనుగాఁ జూపి యున్నారము. ఇందుఁగూడ గొండొక చూపెదము.

(కవితలోని ప్రభాకరపరామర్శమునుండి)

చ॥ ......మీగురులకుఁ దెల్లమే,......మాగురులశక్తి......కుండిలు బద్ధశక్తి......దెబ్బఁదినుకాకియె కాక నిసుంగెఱుంగునే॥

ఈ పద్యము 41 వ పుట మొదలుకొని యుదాహరించిన వేటూరి ప్రభాకరశాస్త్రి సతీర్థ్యసంప్రార్థన పద్యముల కిచ్చిన ప్రత్యుత్తరములోనిది. అతఁడు గురువును గాక యని వ్రాయుట తప్పని మందలించిన పైని వ్రాసిన వ్రాఁతలో మఱల నదే పాటపాడుచు లేదని బొంక మొదలిడిన వీరి తెల్వినిఁ, వీరి దైవానుకూల్యమును జదువరులే విచారించుకొందురుగాక. ఈ బొంకులను దమపేరితోఁ బ్రకటింపక శిష్యుని పేరఁ బ్రకటించుటవలనఁ దా మతని మందలింపున కుత్తరమీలేమి స్ఫుటమగుచున్నది. ఏశిష్యుపేర నీ ప్రల్లదములను వీరు ప్రచురించిరో ఆశిష్యుఁడే యిటీవల "పాణిగృహీతాశ్రితాపనాదర్శృంఖల" యను పేరితో 120 పుటలకు మించిన బూతుఁగూఁతలను వ్రాసి లోకుల స్తోత్రముల కర్హమైన గుణాఢ్యుఁడు అతని పేరా పాత్రముననే చూడఁదగు. అతని శంకల కుత్తరములు "శృంఖలాత్మ్యలీకరణము" చదివిన విస్పష్టముగఁ దెలియఁగలవు. ఆబూతుల వ్రాఁతలు వెం॥ రా॥ ల యెఱుకమీఁదనే జరిగినదనుటకు సాక్షిభూతము లగు నంశములు బోలెఁడుకలవు. అవిగూడ నన్యత్ర చూడవలయును. మఱియుఁ బ్రకృతమగు "ప్రభాకర పరామర్శము"నుండియె మఱికొన్ని యాసందర్భప్రలాపములను జూపుచున్నారము.

"మ...వ్రాయఁగ నాయఁటె సతీర్థ్యులంచు ... కొద్దిగ శ్రీరామకవీంద్రుఁ డొకప్పుడు చెప్పెన్నే ర్చె...యిర్వురకు బిలిచెదే.

ప్రభాకరశాస్త్రి "సతీర్థ్యులార" అని వెం॥ రా॥ ల నిరువురను బిల్చుట తప్పఁట ! ఈతప్పెట్లు సమర్థింపఁబడుఁగాక. ఏండ్లకొలఁది వెంకటరామయ్య శిష్యుఁడు. వెంకటేశ్వర్లెవరో ? కొన్నాళ్ళు మాత్రము శిష్యుఁడు. దీనింగూర్చి భారవిమహాకావ్యములోని ద్వితీయసర్గమును, రామకృష్ణశాస్త్రి తండ్రిగారగు కృష్ణములు, బ్ర॥శ్రీ॥ రామచంద్రశాస్త్రులవారును సాక్షులగుదురుగాక. మఱియు నీవిషయము 60 వ పుటలోని యుత్తరములోని 5, 6, 7,వ పంక్తులవలనఁ గూడఁ

దెలిసికొనవచ్చును, ఆయుత్తరము రామకృష్ణశాస్త్రి పినతండ్రికుమారుఁడు వ్రాసినదే, అగుఁగాక. అతఁడుగూడ వేంకటశాస్త్రికే దగ్గఱబంధువని రామకృష్ణశాస్త్రి యపలాపింపక మానఁడు. ఇట్టి యపలాపమునకు రోసి యొకరిట్లు వ్రాసిరి.

(1912 సం॥ సెప్టెంబరు అభినవసరస్వతినుండి)

ఓకృష్ణకవిగారూ ! మీరు గీరతవిమర్శనమని వ్రాయుచు నందు నన్ను మీకిరువురకు సరిపడిన బంధుగుడననియు మీకు గల్గిన తంపియంతయు పెట్టినవాడను నేననియు, నుడివితిరి. అసత్యములేయాడ గంకణము గట్టికొనిన మీకిది యొక వ్యత్యాసముగ దోపకున్నను నాకు గడుగడు నసహ్యముగ నుండుటచే లోకులెఱుంగుటకై నాసత్యమును జెప్పుచున్నాఁడను. అది మీరును గ్రహింతురుగాత. నేను మీకే సమీపబంధువుడగాని (బ్ర॥ శ్రీ॥ వెంకటశాస్త్రిలుశతావధానిగారికి అంత బంధువుడగాను మీవాదసారస్యమునకై మీరు వేరుగా చెప్పునప్పటికి మనబాంధవ్య మెఱుంగువారెవ్వరు నొప్పరు.........

పల్లెపాలెం.
M. V. Subba Row, 16-8-12.

---

ఈయపలాపములను గూర్చి గ్రంథములో నచ్చటచ్చటఁ గొండొక చర్చింపఁబడుచునే యుండును. ఇది యిటులుండుఁగాక. అతఁడు 'సంప్రార్థనము' అని వ్రాయ వీరు 'పరామర్శము' అని వ్రాయుటవలననే కొంతవఱకు యోగ్యత స్ఫుటమగుచున్నది. దానివలన వచ్చు దుర్ధ్వని నివారింత మన్నను నివారింపఁ బడదు. అది యటులుండె, దాని నిండఁ దిట్లు శరపరంపరగా నున్నవి.

(1) ఉ॥...కోకిలకాకము నెల్లడించుటల్, మంకుతనంబటంచుఁ బలుమాటికిలించితిరి... (2) చ॥...ఛాత్రుడ వెంకరామకృష్ణ ధీవరులకటంచు మొ్రక్కఁడు॥ (ఇట్టివనేకములు.)

ప్రభాకరశాస్త్రి 'మీ యడుగుల్ మ్రొక్కి' అని వ్రాసినది చాలదఁట ! పైఁగా 'ఛాత్రుఁడ' నవలె నఁట !

"చ॥...రామకవిపీరుఁడె నీకు సతీర్థ్యుడైనచోఁ దిరుపతిశాస్త్రిగారును సతీర్థ్యులె"

తిరుపతిశాస్త్రి వెంకటశాస్త్రి నద్దఁ జదివిన దేదియును లేదు. అట్లే వెంకటరామయ్యకూడ నని శిష్యుని వ్రాలుతోఁ బ్రకటించు మా శిష్యులసాహస

# V

మును లోకమే పరికించుఁగాక. తిరుపతిశాస్త్రి వెంకటశాస్త్రియందు గురుత్వమును జూపుటకుఁ గారణము, అతనికంటె నితఁడు ముందుగాఁ గవనము రచించు నలవాటు గల్గిన వాఁడగుటచే నే కందపద్యలక్షణమునో యే యొక నిముషమందో యితనివలనఁ దెలిసికొనుటతప్ప వేఱుగాదు. ఇఁక వెంకటరామశాస్త్రికిఁ గల యావద్గురుత్వములో నెన్ని వంతులలోనో యొక వంతుమాత్ర మితరులదియుఁ దక్కినదెల్ల వెంకటశాస్త్రిదియు నగుటకు భగవంతుఁడే సాక్షి కాఁగలఁడు. దీనింగూర్చి మూఁడవభాగములో విస్తరింపఁదలచి యిందు సూత్రమాత్రము వ్రాసి విరమింపఁబడుచున్నది. అప్రస్తుత ప్రశంసలో మూఁడుమాసము లని కృష్ణకవి వ్రాసినను, కోకిలకాకములో 'చాలఁగాలము విసివి' అని యిరువుర చేవ్రాళ్లతోఁ బ్రకటించి యున్నారు. "చాలఁగాల" మనఁగా, మూఁడుమాసములే యని పోట్లాడుదురా? అయినచో 'స్త్రీప్రత్యయాంతము కౌముది' చదువుట పొసఁగదు, ఎక్కువ బుద్ధిమంతులకు మూఁడుమాసములలోనే స్త్రీప్రత్యయాంతము కావచ్చునని వాదమునకు దిగినను నిలువదు. మూఁడుమాసములు శుశ్రూష చేసెను, మాసము 1కి ననధ్యాయములు 10 దినములు. అవిగాక మధ్యమధ్య నైమిత్తికములు కొన్ని యుండును. అవి యెల్లఁ బోఁద్రోసినచో షుమారు 45 దినములు చదివినట్లు తేలును. ఆ దినములలోనే స్త్రీప్రత్యయాంతము చదువుటకు వైయాకరణు లెవ్వరును నొప్పరు, పైగా నా నలుబదియైదు దినములేని పాఠము జరుగుటకు!—

"తా నెప్పుడుఁ బొట్టకూటికొఱకే తిరుగాడుచు నంట నేమియుం
జెప్పదు కాకి కోయిలకు", (కోకిలకాకము)

అను వారి వాక్యమొప్పికొనదు. కావున విమర్శించుచో మాశిష్యులు వ్రాయువ్రాఁతలెల్ల నింతసారము కలవి, వారియదృష్టము మంచిది. కావున వారికి గురుదూషణ, దేవదూషణ 'అనృతోక్తులు' ఇక నేమి కావలెను? కలియుగమునకుఁ గావలసిన సామగ్రి యంతయుఁ దటస్థించినది. 'దానితో' బోలెడు గ్రంథమును వ్రాయుచున్నారు, వ్రాయఁగలరు. ప్రతి గ్రంథమును నిట్లు విమర్శించి నిగ్గు తేల్చువారెవరు? ఎవరికిఁ గావలెను? స్థూలదృష్టిచేఁ దిలకించువారో, "కాఁబోలును" అని యనుకొందురు. ఇది యిటులుండె, "పరామర్శము" నుండి యిఁక నొకమాట నుదాహరించి దానిసారమును దేల్చి వదలుచున్నారము.

# VI

"సీ॥ దయమీఱ నైషధాంతము కావ్యములు చెప్పి సాహిత్యయుతునిగాఁ జల్పినాఁడు"

వెంకటశాస్త్రికి శ్రీశ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారు నైషధాంతము కావ్యములు చెప్పిరనియుఁ గవిత్వము మొదలైనవి నేర్పిరనియు వారియెడల వెంకటశాస్త్రి కృతఘ్నుఁ డయ్యెననియుఁ బై పద్యమునందలి సారము, శ్రీకృష్ణమూర్తిశాస్త్రులవారివద్ద వెంకటశాస్త్రి చేసిన విద్యాభ్యాసాదికము క్రింది పద్యములవలనఁ దెలిసికొనఁగోరెదము.

చ॥ కదలి యనంతరం బచటు కాటవరంబను నొక్కపల్లె కింపొదవఁగ నేగ..." (జాతకచర్యనుండి)

కాటవరమనునది శ్రీశాస్త్రులవారి నివాసస్థానము. శ్రీవారివలఁ జాలకాలమునకిందట రాజమండ్రి ప్రవేశించిరి.—

తే. గీ. అచట శ్రీపాదవంశజుఁ డనఘ మూర్తి, కృష్ణమూర్త్యాఖ్య సుకవివరేణ్యునొద్ద, మొదలిడి కుమార సంభవము నను దెండు, సర్గలు పఠించె మూడు మాసములకెలమి" ... తే॥ గీ॥ గురుడునుఁ దత్సహాపాఠియుఁ గూడితెలుపు, నాడు చుందురు చదరంగ మట్టెరెవెడు, అర్ణవంటెట్లు లట్లు తల్లడపడుంబు, నతఁడు గ్రహియించె నాపెమెసకమెసఁగ ... తే. గీ. అంత వేసవినందే కావ్యములు మొదలుపెట్టి చదువుచు నున్నంత విఘ్నకార, ణం బసియయుఁ దత్స్వరూపంబు దెలియఁ బలకెద..." చ॥... గురునింతి మృతిఁగనె నాత్మదేహమం, దొదవె నొకింతుకంత జ్వరరోగము, ... గురునికిఁ వచియించి యానమాఖ్యపురముం జనెఁ దల్లిని దండ్రినింగనన్"... (జాతకచర్యనుండి)

నైషధము శ్రీశాస్త్రులవారివద్దనే కాదు, మఱియొకరి యొద్దఁగూడ నిప్పటికిని వెంకటశాస్త్రి చదువనే లేదు. ఇంక ముందు చదువవలసియుండును, అయినను యంశములకు శ్రీ శాస్త్రులవారే సాక్షులు, శ్రీశాస్త్రులవారు వెంకటశాస్త్రిని కృతఘ్నుఁ డనియందురో, యే మందురో 48 వ పుట. 12 వ పంక్తిలోని గాదే జగన్నాథస్వామిగారి పద్యములోఁ జూడఁ గోరెదము, గీరతప్రథమభాగమున 35 వ పుటలోని సీసపద్యమునఁగూడ శ్రీశాస్త్రులవారి విషయము కొంతకలదు. చదువఁగోరెదము, అథవా, శ్రీశాస్త్రులవారికి వెంకటశాస్త్రి కృతఘ్నుఁడు గాఁడు. అంతమాత్రమునఁ దమ కేమి లాభము? అతఁడే రౌరవాదినరకములఁ గష్టమై పోవుఁగాక, అతనిత్రోవ నింద్య మని యెఱిఁగియు వీరేల పట్టవలెను ?

ఖండించుకొనుటకన్న శబ్దవిచారమేమి ముఖ్యము? కృతఘ్నత్వమును గాని యసత్యతత్పరత్వమును గాని లేకుండఁ గాపాడుకొనఁ బ్రయత్నించ వలయునే కాని యా శబ్దము బాగులేదు. అందలి యుత్తరములు వ్రాసినవారు 'తి॥ వెం॥ కవులకు బందుగులు' మఱియుఁ 'గొందఱుస్నేహితులు' లోనగునవపలాపములవలన ఫలమేమి? ఒక రిద్దఱు మూగురు లేక నలుగురైదుగురు వెం॥ శాస్త్రికి బందుగులే యగుదురుగాక, వారు వ్రాసినవ్రాఁతలో నున్నవిశేషమేమి ? వెంకటశాస్త్రికిఁ బిచ్చియెత్తిన దని యెవరేని ప్రిమరము చేసినప్పుడు దానింగూర్చి క్షేమసమాచారము తెలిసికొనుటకు వ్రాయువారు బందుగులు కాఁగూడదా ? అంతమాత్రమున నందలి యుత్తరములెల్ల బందుగులవియు స్నేహితులవియు నని బొంకినఁబోవునా? మఱికొన్ని "తమంతఁదామే కల్పించినవి" యని కూడ వ్రాయ మొదలిడిరి. ఈ మాట కర్థమేమైనఁ గలదా ? అట్లు కల్పించినచో నయ్యవార లూరకుండుదురా? ఈ త్రోప కొప్పరపుఁద్రోవ, దీనింగూర్చి గుంటూరిసీమ, ఉత్తరరంగపత్రిక చూడఁదగు. యిట్టివే యనేకములు ప్రల్లదములందుఁ గలవు. ద్విభాష్యం పుల్లకవిగారు వీరియందభిమానము కలవారా ? కారా ? ఆయన వ్రాసినయుత్తరము సీగురుదక్షిణలోఁ బ్రచురించితిమి. 45 వ పుటలోఁ జూడఁదగు. ఆయనకు వీరియందుఁ గలయభిమానమును స్వీకరించుచున్నారము.

(కవితాపత్రికనుండి.)

క॥ శ్రీవేదమూర్తులైతగు, శ్రీవేదుల రామకృష్ణశేఖరునకుఁ బద్మాభవుకుఁ
డోలేట్యన్వయుఁ, డౌ వెంకటరామకవి సదంఘ్రిద్వయికిన్ ॥౧॥...మ॥ ఒకచో
ముద్దులు మూటఁ గట్టు నొకచో నొయ్యారముల్ సూపు నిం, కొకచో మంజుల
శయ్యలందు నొకచో నుత్సాహముల్ పెంచు నిం, కొకచో నిండు నలంక్రియా
దులను; బ్రాజ్ఞుల్ సంతసింపంగఁ గొం, తక రాజిల్లెడు రామకృష్ణకవితా కళ్యా
ణలీలాగతుల్ ॥......

యిట్లువిధేయుఁడు

ద్వి॥ పుల్లకవి, దుర్గాడ. 22-9-1910.

ఈయన కట్లు మన మేల విఱిగి పోవలెనో యోజింపుఁడు. తా మొనర్చు దురుద్యమదుష్ప్రసంగాదికములు తల్లి వెనుకఁ దల్లి యనఁదగిన పెద్దతల్లిలోనగు వారికే రుచింపనియప్పు డితర బంధువ్రల కెట్లురుచించును, ధర్మము బంధుత్వాదికము ననుసరించునది కాదుగదా. ఈ పుల్లకవిగారు వెం॥రా॥ల భావిప్రయత్నమును గూర్చి యిట్లు వ్రాయుచున్నారు.

......తే॥ గీ॥ గిరతమ్ము విమర్శింఛు గ్రిటయొక్కటి, వెలువడుచునున్న యది దాని వెనుకనుండి, నిజవిశేషమ్ములను గని నెగడవచ్చు...కుకవి కాండ వేదండఖండ విఖండనాఖ్య.

ద్విభాష్యం పుల్లకవి,

30-7-13 గోదావరి డి॥ పిఠాపురం, డి॥ దుర్గాడ.

---

ఇది యిటులుండె, మాశిష్యుని పెద్దతల్లులిరువురు. వీరు కడు ధర్మతత్పరురాండ్రని మాబంధువులెల్ల నెఱుఁగుదురు. ఆ యిరువురలో నొకరి హృదయము పరికృతవిషయమున నసంతుష్టమని కనిపెట్టఁబడినది. అందులకు సూచకమగు లేఖ 73 వ పుటలోఁ గలదు. అది వారి సౌహార్దమునే తెల్పునుగాని తక్కిన విషయములను దెల్పదు. దానింబట్టి తక్కినయంశము తెలియఁగుదురుగాక. దానిని వ్రాసిన కాఁకరపర్తి నారాయణమూర్తి మాశిష్యునికిఁ బెదతల్లి కుమారుఁ డని యెఱుఁగఁదగు. వేఱొక పెదతల్లిగారీతని ప్రకృతోద్యమమునకు మొదలే సమ్మతింపరు గాని ఆవిషయమున మేమిట వ్రాయ సాధారములు లేవు. ఆధారమే యక్కఱలేదనుఁడీ, ఏమాత్రమేని మనస్సునువది యొకటి యుండెనేని కృతఘ్నత్వ దోషము నది యెవ్వరినిగాని సంతసింపనీయదు; కాన వారు వీ రననేల, మాశిష్యుఁడు కృతఘ్నుఁడేయగునేని యితఁడొనర్చుపనులు మనుజజన్మమెత్తిన యెరికిఁగాని యసహ్యములు గాకపోవని చెప్ప సాహసించుచున్నారము. అది యటులుండె.

(1913 సం॥ అగస్టు 27 వ తేదీ ఆంధ్రపత్రికనుండి)

ఆంధ్ర చంపూభారతము.

ఈగ్రంథము పుస్తకవితాపత్రికయందు ముద్రితమైనది. పిఠాపురసంస్థాన కవులగు రామకృష్ణకవు లీగ్రంథమును సాదరంబున తమ కవితలో ప్రచురించుటయే గ్రంథోత్కృష్టత చాటుచున్నది...... (తిరుమల వెంకటరమణకవులు)

పైపంక్తులవలన నాకవులకు వెం॥ రా॥ లయందుఁ గొండొక ప్రేమకలదని విస్పష్టమే. వీరు మాకు పంపిన పద్యములను 48 వ పుటలో ముద్రించి యుంటిమి. వీరి కృతఘ్నతాదుల విషయమున వారికిం గల యేవము నవి పూర్తిగా వెల్లడించెడిని. స్వారస్యమేమనఁగా వీరి వాక్పారుష్యాదికమును బట్టి బంధువులేమి లోకులేమి వీరిని మంపటించు తలఁపు గలవారగుచున్నారు. త్రోవలేక వారిని వీరు మాకు మిత్రులుగ నభిలాపించి తన్మూలమునఁ దమకు శత్రుత్వమును సాధింపఁజూచుచున్నారు.

# X

## (కవికర్ణరసాయనమునుండి)

క. కాకేమి తన్నుఁ దిట్టెనె, కోకిల తన్నేమి ధనము కోకొమ్మనెనే
లోకము పగ యగు పరుసని, వాకునఁ జుట్టమగు మధురవాక్యము కలిమిన్.

మా శిష్యుల ప్రకృతస్థితి పైపద్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. మొదటఁ దా మవలంబించిన పికత్వమే కాకత్వముగాఁ బరిణమించుచున్నది. దానిని వారింప నెవరితరము? ఇతరకారణములచే శత్రువులగువా రిట్టిపట్టుల నేవేని యపకతవకలు తమ్మనుగూర్చి వ్రాసినచో నవి తోసివేయనగును గాని యట్టిది లవమును లేనివారు శత్రువులగుచుండఁగా వారించుట యెట్లు? ఈ విషయమును సమర్థింపఁదగు నంశములు పెక్కులున్నను దిఙ్మాత్రము సూచించి వదలితిమి. వీరికి గురుద్రోహ మనిన బెల్లమునుంగాదు. ఇది మాయెడలమాత్రమే యనుకొనుచుంటిరేమో? అట్లుకాదు. సార్వత్రికము, దీనిని సూచించి వదలుచున్నారము.

"భగీరథశాస్త్రిలుగారు, వీరు సత్తములు... ఇాయన యింజరములో నున్నప్పుడు భారద్వాజఘట్టములోని విశేషములు తెలిసికొనుటకై వెంకటరామశాస్త్రిగా రాయన యొద్దకు వెళ్లినమాట సత్యమే"

ఇది కృష్ణకవివ్రాఁత, చదువుకొనుటకు వెళ్లెనన్నచోఁ బరువు దక్కువ యని యెంచి కాఁబోలు. "విశేషములు తెలిసికొనుట" కని వ్రాసి పాపపు బండి తోల మొదలిడినాఁడు. ఒకవిశేషము మాత్రమున్నది. కృష్ణకవివ్రాఁత నాఁగఁ జాలకున్నను వెంకటరామయ్య తానుగూడ నింగుఁ జేవ్రాలు జేయకుండుటచేఁ గొండొక సంతసింపవలసియున్నది. ఈ గీరతవిమర్శన ప్రకరణమేమి, అట్టహాసమేమి, కృష్ణకవిగారి వ్రాలుమాత్రమె కలవి యని చదువరు లెఱిఁగియే యున్నారు. ఆయనయొద్దకు విశేషములు తెల్పుటకై వెళ్లినట్లు లిఖించినను లిఖింపఁ గల సాహసి నుఁడీ కృష్ణకవి. అతని కసత్యమువలన లవమును భీతిలేదు. ఈయంశము శృంగభంగాదికము వలనఁ దెలిసికోవచ్చును. ఆతనికి దీటగువాఁడు చర్ల చలపతి, అతఁ డతని బాపమఱఁది. అతనింగూర్చి వ్రాసినచో మాలేఖిని కంతేని పనిగలుగఁ గ. డు "యతోవాచో నివర్తంతే" శ్లో॥ కథాపిఖలు... అశ్రేయసేయతః, ప్రకృతమనుసరామః, భగీరథశాస్త్రిలవారి యొద్దఁ జదివి కొన్న సంగతి నొప్పికొన్నచో నావిద్యాభ్యసన కాలము ప్లవంగ సంవత్సరమగుటచేఁ దదనంతర భావియగు కీలకవత్సరములోనే వ్రాసికొన మొదలిడిన 'ఉభయ

శాస్త్రప్రవీణత్వము' బ్రతుకదు. ఇందునుగూర్చి గీరప్రథమభాగపీఠిక 13, 14 పుటలలోఁ గొన్ని పంక్తులు చదువఁగోరెదము. దానిని బ్రతికింపవలయు నని భగీరథశాస్త్రిలవారి శిష్యత్వమును బ్రచ్ఛకత్వముగా మాకృష్ణనుకవి యప లాపింపఁ జొచ్చెను. తన బావమఱఁది యగు చర్ల చలపతి పెద్ద పండితుఁడని లోకమునకుఁ దెలియునట్టి కృష్ణశాస్త్రి కొండొక యపలపించెను. అసోదెవలన నితనికిఁ బ్రయోజన మెంతయున్నది? 'శృంగభంగ' 'సత్యసందేశముల' కవిత్వము తనదికాదని లోకము విశ్వసించుటయే దానికి ఫలము. ఎన్నియని చూపుదుము. ఇతఁ డసత్యమునకుఁ బుట్టినిల్లు. భగవంతుఁడును, దజ్ఞులును ఇందులకు సాక్షులు. ఆచలపతి వ్రాఁత కితఁ డిట్లు వ్యాఖ్యాన మొనర్చుచున్నాఁడు.

"వెంకటశాస్త్రిగారి బండారమంతో కృష్ణకవి తేల్చుననియు, నాపిదప గణపతిశాస్త్రి వెంకటరామశాస్త్రిలుగార్ల సంగతి చూచుకోవచ్చుననియు నందు గల యర్థము యథార్థమని ముమ్మాటికి వారు విశ్వసింతురుగాక."

("రాను రప్పింపఁ బనిగానరాదు మాకు")

అను నప్రస్తుత ప్రశంసావాక్యము నెఱుఁగనిలోకులు దప్ప నీపృథారావము నెవ్వరు విశ్వసింతురో.

ఉ॥ వేదుల రామకృష్ణులఁట ? వెంకసనంట జయించునంట? యెం,దో ?
దురితంపుబండి నొకఁ డోలెడిసాహసమందు; నింక నెం,దో? దుడు కందివ్రాసి
పయిఁ దోఁపక మిన్ననుటఁయు, నింక నెం, దో ? దెలియంగరాద యది యొక్క-
టియే సభ తేల్చఁగా నగునె"

అది యటులుండె, పాపము ! ఆచలపతి * క్షమాపణవ్రాసికొని నిర్దోషి యగుటకుఁ బ్రయత్నింపఁగా మరల నాతని నితఁడు దోషదూషితుని జేయఁజొచ్చెను జూచితిరా !

---

* క్షమాపణ. ఇది నిందగ్రామ్యమని వెం॥ రా॥ ల శతఘ్ని, శ్లో॥ క్షమాపణైకపదయోః పదయోః పతతిప్రియే (రసగంగాధరము) ఇందులకుఁ బాఠపతముకూడఁ జూడఁదగు. ఆయీసమర్థనమెల్ల 'గుజనీపుస్తక'ములలోని పారపాటులవలన నైనట్లు వావిడుచు మాశిష్యులను సభాస్థానమునకు రప్పించువారికాఁ లమ్మున లేకుండుట కడు విచార్యము. అప్పుడుగదా నిగ్గు తేలును.

# XII

"చర్ల వెంకటాచలపతిశాస్త్రి, యను నతఁడు నాకు బావమఱందియే...
యితఁడు వ్రాసినట్లుగా వెం॥ శాస్త్రిగారి ప్రోత్సాహముచే నచ్చటి విద్యార్థులలో నెవ్వరో వ్రాసిరి."

వెంకటశాస్త్రిగారి ప్రోత్సాహ మఁట, దానిపై నచటి విద్యార్థు లెవరో వ్రాసిరఁట! ('పృష్టతాడనాద్దన్తభంగః') అన్నట్లిట్లు వ్రాయు నీతనిఁ దజ్ఞులు మందలింపకుండుట కడు నయశస్కరము. తక్కిన యసత్యములును బ్రగల్భములును నటులుంతము. ఈవిషయము నేని ధ్రువపఱచుటకు నితఁడు సత్సభలో మాయెదుటికి రాఁగలఁడేమో మా చదువరు లడిగి తెలిసికొందురుగాక యని హెచ్చరించుచున్నారము. అక్షమాపణ చలపతి పేరితో నితరులే వ్రాసినచో వారిని శిక్షింపఁ జేయుట యుక్తముకదా? నేఁడు చలపతిపేర నిట్లు సృష్టించినవారు మఱియొకప్పుడు రామకృష్ణులపేరనే వేఱొక క్షమాపణనుగాని, నోటునుగాని మఱియొకటిగాని సృష్టింపవచ్చునుగదా? కావున నిట్టిపట్టుల నౌదాసీన్యముచితముకాదని కృష్ణకవికిఁ దెలుపుదురని చదువరులను మఱిమఱి హెచ్చరించుచున్నారము. ఇట్లే 'ముఖమస్తీతి' వక్తవ్యముగాఁ గొంత సోది వెళ్లఁబెట్టెను. దానినెల్ల నూఁచకోఁతగా ఖండించినఁ బ్రయోజనము లేమి నిందు విస్తరింపమైతిమి.

"అట్టి యుత్తరములు మాయొద్ద కోటానకోట్లు గలవు."

ఎట్టియుత్తరములు? గీరతములో, తి॥ వెం॥ కవులు ప్రచురించినట్టియుత్తరములవంటివి. ఎన్నియున్నవి? కోటానకోట్లు! పదులుగావు, వందలుగావు, వేలునుంగావు, లక్షలునుగావు, కోట్లునుగావు, ఇఁకనెన్ని? కోటానకోట్లు. అబద్ధమాడినను నింత బట్టబయలుగా నాడవలయునుగాఁబోలు; పోలు? పోలు? కోటానకోట్లగుఁగాక అర్బుదములగుగాక. కృతఘ్నత్వము సుగుణమని వ్రాయు పెద్దమానిసు లేడదొరకుదురో? ఆయంశమును బోధింపని యుత్తరము లేమి పనిచేయును? లేదా, శిష్యత్వము నేని యాయుత్తరము లపలాపింపవలెను. ఈ రెంటికిని దక్కినయంశముల నెన్నిటిని వానివలన సాధించినను బ్రకృతమున కవి లవమునుపయోగింపవని మేము వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ప్రధానవిషయమును వదలికొని యప్రధానవిషయములకుఁ బాటుపడు వీరి ప్రచారమువలన నీక్రింది లోకోక్తి స్మృతికివచ్చుచున్నది.

# XIII

"జగతి శిరశ్ఛేదసమయమందునఁ దనకుండలమ్ముల యాస గానెననంగ"
(యామినీపూర్ణతిలక.)

వీరు ప్రిమరించు నుత్తరముల స్వరూప మొక్కంత చవి చూపి విమర్శిం చుట ప్రస్తుతముకాకపోదు గాన దిజ్మాత్రి మట్లొనరించుచున్నారము

(కవితాపత్రికలోని యొక యుత్తరమునుండి)

(1)"...రసికత్వలోపమునకు జడిసి ప్రాసముల బెంచి కవిత్వమున మాపరాక్రమమునకుగా నుంచితి మన్న నెవరు సహింతురు..."

ఇతరులు సహింపకుందురుగాక, దానికిఁ దగినఫలముంగూడఁ గాంతురు గాక, శిష్యపరమాణువులు సైఁప కుండుట తప్పగదా? అంత రుచింపని-  లో లోఁ బరితపింపవలెఁ గాని. "ప్రాసమ్ముల్ మెలిపెట్టి" అని సత్సభలలో వెక్కిరింపు మని యే వివేకి బోధించును? పైఁగా నెవరో కొంటెతనముగా వ్రాసిన "రసికత్వలోపమునకు" ఇత్యాది యొకసక్కుపు మాటలను శిష్యులు ప్రిచురించుట తప్పు గా దని చెప్పువా రెవరు? ఇంతకు నిద్దానివలనఁ దమ కృతఘ్నత యేమి నివతిఁ-ంచినది.

(2) 'మీ రింకను గొంతకాల మోపిక పెట్టిన లోకము మి మ్మధునికకవిసార్వభౌము లని యభినందించును,

ఆవ్రాఁతకన్న నీవ్రాఁత యుక్తమనవచ్చును. ప్రసిద్ధులెల్లరు క్రమక్రమముగా గతించినపిదప వీరినే యట్లు గౌరవింపఁదగ్గ కాలము రావచ్చును. "దొడ్డేఁడు... దొంగలు దోలుకొనిపోతే...గొడ్డు...శ్రీమహాలక్ష్మి" యగునుగదా, అభవిష్య త్సార్వభౌమత్వమునకు మెట్టుమొదట కీర్తనర్పవలసినప్రయత్నము గురుద్రోహమే యగునోటు?, అందులకా యీపూనిక, బాగుబాగు!, 1, 2, అంకెలు గుఱుతుగాఁ గల వాక్యములకు స్థానభూతమగు నుత్తర మొక్కటియేగాని, అది వ్రాసినవారు మాత్ర మిరువురు. అందులో నొకరు వ్రాలు తుదను 'గారు' అని తగుల్చుకొన్నారు. అదికూడ మాపిూనమువలెనే యెందులకో తగుల్చుకొనిన ట్లూహింప వలసినదే. ఇంతటి తెల్వితేటలు గలవా రేమివ్రాసినను వ్రాయుదురు. అట్టి వారి పేరుల నిందేల ప్రచురింపవలెను. వలయువా రన్యత్ర చూడఁగలరని యుపేక్షించితిమి.

# XIV

## (3) "గిరతము నేతిబీరకాయగా భావించుకాలము రాకపోదు"

ఈవాక్యముగూడ, ఆ॥ "గారి" గారిదే, వీరభోగవసంతరాయఁడు పుట్టఁ గలఁ డని చెప్పినట్టీయన భవిష్యద్వృత్తాంతమును దెల్పి రామకృష్ణుల నోదార్చి పరామర్శించుచున్నట్లు వాక్యముల శైలి చెప్పుచున్నది. పరామర్శించువా రెంతో యాప్తులుగ నుండవలయును, కావున మా వెం॥ రా॥ లిట్టివారియుత్తర ములను బ్రకటించుకొనుట స్వవచోవ్యాఘాత మని చెప్పక తప్పక వచ్చినది. మఱియు నింకెవరో మాకాప్తులుగా నుండువారే యొక సందర్భమున "పిచ్చి పుల్లయ్య" అని వెం॥ రా॥ లకు వ్రాసిరఁట. అవ్వ్రాఁత యితరోద్దిష్టమైనను నయ్యది యెట్లో మాలోనొకరికి సందర్భించునఁట! దానింబట్టి వీరికేమి ఫలము కల్గెనో కాని యాసోద యింత వెళ్ళఁ గొట్టిరి. ఆయీ యనుపయోగ పరితాపమెల్ల నేసందర్భమునందలి దనుకొంటిరి? మా 'పాశుపతమును' ఖండింపఁ బోవుటకు వారియనుపోద్ఘాతములోనిది. శాస్త్రము నుపయోగించుటకు వీలులేనియప్పుడు తా మింతకన్నఁ జేయవలసిన గత్యంతర ముండఁ బోదని యాసోదెకుఁ దాత్పర్య మనునది యావదర్థము. ఏపిచ్చిపుల్లయ్యయో యేదియో వ్రాసెను, దానిని ఖండించుట యుక్తమో? ఎవరో "పిచ్చిపుల్లయ్య" అనిరి గాన మేమును 'పిచ్చి పుల్లయ్య' అనియందుమనునది యుక్తమో? విజ్ఞులకు నొకరు తెల్పవలసి యుం డునా? అదియటులుండె, వెం॥ రా॥ లు, దమయజ్ఞతను నిరసించువారినెల్ల నేసంబంధములేకున్నను మాకు మిత్రులనుగా నభినయించుచుఁ దమకు శత్రు వులుగా భావించుచున్నా రని యింతకు ముందే ప్రసంగించి యుంటిమి. అందులకిఁక నొకయుత్తర ముదాహరింపఁబడుచున్నది.

"వెం॥ రా॥ కవులు, మేము అశ్వమేధమున పద్యములు ప్రకటించితి మను దురభిప్రాయముతో కవితాపత్రిక వెనుకటివలె రు 1-0-0 కి పంప మనియు పూర్తి వెలకుగాని పంప వీలు కాదనియు వ్రాయించిరి. యింతకన్న మమ్ము వీరేవిధమున సాధింపఁగలరో..." శేషాద్రిరమణులు (సోదరులు)

తమయకృత్యముకతమునఁ దమవలని లాభమునుగూడ గణింపక తమ మిత్రులు తమకు శత్రులగుచున్నా రనునంశమున కింతకన్న దృష్టాంత మేమి కావలయును? ఎవరో ——"భంగుమేదుత్తూరులు" తప్ప సుజనులెల్లరుఁ దమ యకృత్యమున కేపగించుకొనువారేకద. 51 వపుట 21 వ పంక్తిలోని చామర్తి

జగ్గరావు తమకెట్టిబందుగుఁడు? అతనికి గీరతము నందాసక్తి యుండుటకుఁ గారణమేమి? పైఁగా నితఁడు, వెం॥ రా॥లకు, సహాధ్యాయి, బ్రి॥ శ్రీ॥ మధునా పంతుల సూరయ్యగారివద్ద వీరు మూఁగురును గాళిదాసత్రయమును వఱకో, అంత కొకింత తక్కువగనో చదివినవారలు. అట్టిచో నతఁడు గీరతమునభిలషించుట కర్థమేమి? అంతకన్న నెక్కుడుగ వారియాత్మబంధువు లేమి వ్రాయఁ గలరు? 54 వ పుటలోని 16 వ పంక్తిలోని ఆకొండి సుబ్రహ్మణ్యులుగా రెంతమధ్యాస కలవారు? ఆయన మాశిష్యుని పెదతల్లికుమారుఁడగు బ్ర॥ శ్రీ॥ ఆకొండి రామమూర్తిగారికిఁ బినతండ్రి. అట్టివారెల్ల మాగీరత కావ్యము నేల యాదరింతురో? 53 వ పుట 22 వ పంక్తిలోని, ఆకొండి వెంకటశాస్త్రిగారు, దూరదేశస్థులు, మాయుభయులకును శాఖామాత్ర బంధువులే కాఁదగువారు, బాగుగవిచారించినచో శ్రీ ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రులవారికి దూరపు జ్ఞాతులేని కాఁదగువారు, వారినిబట్టి వెం॥ రా॥ లకే బాంధవ్య మెక్కుడనక తప్పదు. వారు మా ‘గీరతము’ నందేల ప్రేమ చూపవలయునో? ఇట్టివారికెల్ల నేదో ‘పతుపాతిపదమునో’ ‘మూర్ఖపదమునో, నివేదించి తమమార్గమును దాము వదలక మాకుఁ బనిగల్పించు మాశిష్యుల నెవరు సన్మార్గమునకుఁ ద్రిప్పఁగలుగుదురో కదా? వీరెల్లరును మాయొద్దఁ బుస్తకములు వెలలేకుండ సంగ్రహించుట కట్లు వ్రాయుచున్న వారలఁట! ఆమాటకే యొప్పుకొందము. తమవద్ద నట్టిలాభమును బొందువారుకూడఁ దమమార్గము నేల నిందింపవలెనో? నరములేనినాలుక యిచ్చవచ్చినట్లుదిరుగును. అంతియ కాని ప్రాజ్ఞులగువారు కూలికి విసమెన్నఁడును ద్రాగరు. అందులో నొక పుస్తక మూరకవచ్చునంతలోఁ గలుగు ఫలమెంతటిది? అదిగాక ‘ఆపుస్తకమేని “కుక్కమూతి పిందె” గాని రసవత్తరమైనది కూడఁ గాదుగదా! అట్టిపాడు కాగితపు చెత్తకట్ట కాసించి యేప్రాజ్ఞులుగాని తమ్మును గర్హించి మమ్ము నర్హించుచున్నారని వ్రాయుట స్వవచోవ్యాఘాతము కాక మఱియేమి? దానితత్త్వమిది. ఎవరుగాని పాపకార్యమునకు వనుమోదకులుగా నుండ వెఱతురు. పుణ్యకార్యమునకో, నిస్సంశయముగాఁ దోడ్పడుదురు ఇందు లాభాలాభము లకించిత్కరములు. అదిగాక, స్వల్పలాభములతోఁ బనియేమి? వారలకు మహాలాభమొకటి కలదు. అది పుణ్యపాపసంపాదనరూపము. దేనిని గోరువారు దానికనుమోదకు లగుచుందురు.

---

వెం॥ రా॥ ల, గీరతవిమర్శనమునకుఁ గృష్ణాపత్రిక చూడఁ గు.

# XVI

శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః.

ఇంతతో నీవిషయము ముగించి విషయాంతర ముపక్రమింతము. చదువరులారా! వీరి "కోకిలకాక" మునకై మేము వ్రాసిన పద్యములకుఁ బరిమితియే లేదు. కాని నానాఁటికి వీరి గోలనుండి విరమింపవలెనని యూహ పొడముటవల్లను, సత్యమిదివఱకే ప్రాజ్ఞలోకమునకు విస్పష్టమయినట్లు వారివారి లేఖల వలన మామనికిఁ బూర్తిగా వచ్చుటవల్లను జాలపద్యములను డిగవిడిచితిమి. అందుఁ గొన్ని మచ్చుచూపుచున్నారము.

చ. "గరుసగునే వికస్వరపికస్వర" మంటివి, వారిదార్భటీ
భరభరితాంతరంబగు సభన్ "గుభాలు గుభాల్ గుభాలు" మం
చుఱుమఁగ విద్యుదుద్యదసుల్లసిలం గరుసౌనొ? సారెకున్
బిరుసగునో? పికధ్వని కపిధ్వనియై తలక్రిందు లాడునో?

శా. గాంభీర్యంబది సన్నయించుఁ దెలిపెన్ గాకీ పికత్వ, మ్మిదే
డంభం, బెక్కడనేర్చితీ యనృతవాక్తత్త్వం? బెపఁడిచ్చె? నీ
యాంభోవాహవిహారఘోరవిపులవ్యాహారబాహుళ్యది
కుంభీశ్రీపతిఘీంకృతుల్ వినియు మీ "కోకో"ధ్వనుల్ నిల్చునే!

మ. సభలో లేవదు బావకున్ గళము, తత్స్వానంబు మానార్హమే
ప్రభకై లేచినవెంటనే తవులు దుర్వారం బవధ్వానదూ
రభసం, బయ్యది నిల్వనీయదుసుమీ! బ్రాజ్ఞశ్రవోనిష్ఠసా
రభసౌభాగ్యపరంపరాగ్రహణమాత్రస్వైరసంచారులన్.

క. కమ్మనఁగ శిరము, కుకవుల కమ్మనియను కొందమా? 'అకతియనఁ గొటి
ల్యమ్మడను గతి యగున్ ది, ద్దిమ్మని కుకవితలదిమ్మ దింపుట లేలెన్.

కవిత్వపుఁ బోలికకు నుదాహరించితిమే కాని పైపద్యములందు నూత్నాంశము లెవ్వియు లేవు. మాశిష్యులను గృతఘ్నతాఘము నుండి తప్పింపఁగమనియు, దానివలన నితరు లట్టిత్రోవ తప్పని తెలిసికొందురనియు, మేమీపనికిఁ బూనితిమి కాని క్రమముగా వారది బలపఱచుకొనుచుంటచే నింతఱకు మాపరిశ్రమకు సార్థక్యమే కనుపట్టదు. వీరి విషయమున నింక నొక రహస్యము తెలిసికొనవలసి యున్నది. వీరికిఁ జెడ్డ మంచిగను, మంచి చెడ్డగను గోచరించుచున్నట్టు మఱి కొన్ని వీరి వ్రాఁతలు బోధించుచున్నవి. వీరికి వ్యాసకృతభారతము తప్పు, ధర్మ

రాజపాతుగ్రీఁడు, దుర్యోధనాదులు పుణ్యాత్ములు, ఈయంశము వీరు ప్రచురించిన "కౌరవ గౌరవము" లోఁ జూడఁదగు. ఈ విపరీతజ్ఞానమే వీరు సర్వత్ర వినియోగింపఁదగువారు. దానిచేఁ గృతజ్ఞుఁడు మహాపాపాత్ముఁడుగను గృతఘ్నుఁడు మహాపుణ్యాత్ముఁడుగను గోచరింపక తప్పదు. వీరి కీవిషయము ప్రకృతము గదు ముఖ్యము. కావున వీరు భారతమును వదలుకొనక తప్పదు. అది గురువును నిందించుట కొప్పదు.

(మహాభారత శాంతిపర్వమునుండి )

భీష్మః॥ శ్లో॥ మాతా పిత్రో ర్గురూణాంచ పూజా బహుమతామమ... గురుర్గరీయాన్ పితృతో మాతృతశ్చేతి మే మతిః, ఉభౌహిమాతా పితరౌ జన్మన్యేవోపయుజ్యతః ... ఆచార్య శిష్టాయాజాతి స్సాదివ్యాసాఽజరాఽమరా॥ శ్లో॥ వీధ్యాం పాపం భ్రూణహత్యావిశిష్టం, నాఽన్యస్తేభ్యః పాపకృదస్తిలోకే ...శ్లో॥ మాతృతః పితృతశ్చైవ తస్మాత్పూజ్యతమో గురుః... శ్లో॥ మిత్రద్రుహః కృతఘ్నస్య స్త్రీఘ్నస్య గురుఘాతినః, చతుర్ణాం వ్యయ మేతేషాం నిష్కృతిర్నానుశుశ్రుమ. (విస్తరస్తు తత్రైవ ద్రష్టవ్యః)

గురుశిష్య ధర్మబోధకము లగు మఱికొన్ని శ్లోకములు 32. 68, 69, 70, 71; పుటలయం దుదాహరింపఁబడి యున్నవి. ప్రకృతము మాశిష్యు లవలంబించినది గురుద్రోహ యజ్ఞదీక్ష. దానికి వ్యతిరేకమగు ధర్మమును బోధించునది వ్యాసభారతము. 'భారతః పంచమో వేదః' అని దానిని పూర్వప్రాజ్ఞులేమి నవీనవిజ్ఞులేమి శిరసావహింతురు గాక. ఇతర పంచమవేదములయం దభిరుచి నించి తిరుపతి వెంకటేశ్వరాది దేవగురునిందల నొనరించు వీరికా పంచమవేద మెట్లు ప్రమాణము కాఁగలదు? కావుననే వారి ప్రవృత్తి కనుకూలముగా వేఱొక భారతమును మాశిష్యులు వ్రాసికొనఁ దలఁచిరి.

"ఉ. వ్రాయఁగవచ్చు వ్యాసమునివర్యుఁడు వ్రాసినయట్టి భారతా, మ్నాయములోనియంశములు మాఱిచికూరిచి వేఱె భారతా, మ్నాయము... నమ్మరు గాక, పండితుల్" (ఆంధ్రభాషా పరిషత్పత్రికలోని కౌరవగౌరవము చూ.)

ఇంతకు మున్ను 'కుక్కమూతిపిందె' అని మాగీరతమునే వీరు దూషించి నట్లు ప్రథమభాగ పీఠికయందుఁ జూపితిమి. ఇప్పటికి 'వీరికి భారతముగూడఁ నట్టిదశకే వచ్చినది. ఇంతతో నేమయ్యె. ఇంకను వీరిచర్యలు వీరివ్రాఁతలు

# XVIII

ముందు చూడవలసి యున్నది. 'పండితులు నమ్మరఁట' కాని లేకున్నచోఁ దల క్రిందుసంగతులతో వీరు వేఱొక భారతము వ్రాయుదురంట!

శ్లో. ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం॥

అని కాళిదాసంత మహాకవి వాక్రుచ్చినది వీరికిఁ దృణప్రాయమే. ఏగ్రంథముగాని పండితుల మెప్పునకును అపండితుల త్రిప్పునకును, నాస్పదముగా నుండఁదగు ఆయీయంశము ప్రథమభాగ పీఠికలోఁ గొండొక వివరించితిమి. ఇఁక నస్మచ్ఛిష్యోపజ్ఞకమగు కృతఘ్న మతమున కనుకూలించు నొకవ్రాఁతయు దానికి మారకమగు నింకొకవ్రాఁతయు నుదాహరించుచున్నారము.

"ఈ కార్యమునం దొకరి నొకరు తిట్టుకొనుటయే కవిత్వమైనది. ఆతిట్లే యామ్నాయములైనవి. భారతామ్నాయముతోఁ దుల్యములఁట!, మూర్ఖులు వానినే యాసక్తితోఁ బఠించుచున్నారు.

ఇటువంటివా రిట్లే వ్రాయుట యుక్తము. ఇతఁడు లేశమును సహృదయుఁడు గాఁడనుటకా ఘట్టమునందలివే యీ క్రిందిపంక్తులుపోద్బలకములు.

"......ఈ వాక్యములు కాదంబరిలోనివి,... ఇవ్విధమున సందర్భము లేని యుపమలయొక్కయు శబ్దశ్లేషలయొక్కయు, జాబితాలు కొండవీటి చేదు తాళ్లవలె...నొప్పారు కాదంబర్యాదులు..."

కాదంబర్యాదులే నీరసగ్రంథములని తలపోయు జ్ఞానలవదుర్విదగ్ధులకు మాగ్రంథము లేల రుచింపవలెను? రుచింపనక్కఱలేదు. అది యటులుండ, సహృదయులిల్లు శ్లాఘించుచున్నారు.

"గీరతమహాకావ్యములోఁ గాని యిటీవల గుంటూరిసీమలోఁ గాని యొక పద్యమునకు, యీ చదువరి మున్నగువారి యుపనిషదుపన్యాసములు తుదకు "అసావాదిత్యోబ్రహ్మ" చేయించుటకైనఁ బనికిరావు. మెదడులో నేమాత్రపు రసగ్రహణపుసిరలున్నను, సహనబుద్ధియున్నను, గీరతకావ్యము లోని శాంతింపు పర్వములో నొక్కపద్యముఁ జదివి భారతీముక్తిసౌధ మెక్కి తరించఁగలరు, లేనిచో సన్నిపాతరోగికిఁ జక్కరయుఁ జేఁదె, యెవ్వరేమి చేయఁగలరు? (సుదర్శనీ పత్రికనుండి,)

వారట్లు నిందించుటకు హేతువేదో గాని వీరట్లభినందించుటకు హేతు విది. భారతము సకలసుకవిజనవినుత మేల యయ్యె? కేవలకవిత్వ ధర్మమును

బట్టియా ? కాదు, పినింగూర్చి వ్రాసినచో నింతట నంతటఁ దేలదు. భారతమునఁ బ్రధానరసమేదియో, తెల్పుఁడన నీనాఁ డెందఱో చేతులునలుపవలసినవారు కలరు. స్థూలదృష్టికి నందు వీరరసమేమో ముఖ్యమని తోఁచ వచ్చును. అది యట్టిదియే యగుచో దానికి నేత్రాద్యశగౌరవము రాదు. అందలి ప్రధానరసము శాంతము, యీ యంశమునకు,

“...భారతే శాంతిః, రామాయణే కరుణ, ఇతి, ఏవం రసాది ధ్వనయ షడ్విధాః॥

అను సాహిత్యకౌముదియు, మఱియు ధ్వన్యాలోకమును బ్రమాణములు. అట్లు కొన్ని పట్టుల వివాదపరిధానముగా స్థూలబుద్ధులకుఁ బొడకట్టినను, మా గీరతముకూడ శాంతరసప్రధాన మనుట నిర్వివాదము. కావుననే యిది ప్రాజ్ఞుల నతికిం బాత్రమైనది. తదితరులు విద్వల్లోకమునకు సహజశత్రువులు.

(1) శ్లో॥ మూర్ఖాణాం పండితా ద్వేష్యాః” (భారతము.)

(2) శ్లో॥...బుధజన ఇవ గ్రామ్యసదసి; (కాళిదాసః)

ప్రకృత మనుసరింపుదము. మాశిష్యులకు నస్మత్కృతగీరతమే కాక వ్యాసకృతభారతముగూడ గర్హ్యమగుచున్న దనునది పరిష్కృతాంశము. వీరి కెవరో కొంద అనుయాయులుకూడ నుండుట సహజమే. ఏమత మేని యొకరితో నుండుట లోకమును గని వినినది కాదుకదా ? అది యటులుండె, వీరిమతమున దుర్యోధనుఁ డెట్టివాఁడు ? కడు యోగ్యుఁడు.

మ॥ ... దుర్యోధనుఁ...గలియంశమ్మునఁ బుట్టినాఁ డనుచు వక్కాణింపఁగాఁ జెల్లునే! (కౌరవ గౌరవము)

ఇట్టి నిషధయోగ్యుఁ డగుదుర్యోధనునితో వీ రొక్కటఁ దమమతమునఁ గేవలాపాత్రుఁ డగునొకని కభేదము చేసి పరిష్కృతసందర్భమునందే కొంత నిందించి యున్నారు. దాని కర్థ మేమో? వీరపాత్రుఁడనుకొనుచున్న మానిసి నిషధయోగ్యుఁడు కావలసి వచ్చుచున్నదే! లేదా, దుర్యోధనుఁడపాత్రుఁడగును. విమర్శించుచో వీరి తప్పదు సాక్ష్యపు వ్రాఁతలెల్ల నింతటిసారము కలవియేగదా. వీరికిఁ దామొనరించిన గురుద్రోహాపరాధమును సమర్థించుకొనుటకే తప్పదు త్రోసలావశ్యకము లగుచున్నవి. కాని మొట్టమొదట వీరిమత మెట్టిది? ప్రాచీనార్య సమ్మతమైనదియే! దానిని ఋజువుచేయుట యెట్లు?, ఇటు.

# XX

## శ్రీశాంకర్యైనమః

చ॥ కులము ద్యజించి శాస్త్రములకుఁ బ్రతికూలత సంఘటించి య
న్యులధనముల్ హరించుటకు నూహలఁ జేయుచు పొట్టకూటి వి
ద్యలఁ గని నాస్తికత్వపు మతంబున సంచరణంబుఁ జేయు వా
రలదరిఁ జేరఁబోకుము పరాకున నైనను మూఢచిత్తమా! ౧

ఉ॥ యాచకపాళి కొక్కతృణమైన నొసంగక యింటి మూలలో
దాచి వృథాప్రయాసము లెదంగనఁ బోక ధనంబటన్నచో
గాచముతోడుతఁ సమముగాఁ గనుఁగొంటయె మేలు, చచ్చుచో
బూచిక పుల్లయైనఁ గొనిపోదువె చెప్పుము మూఢచిత్తమా! ౨

ఉ॥ విత్తము వెంట రాదుసుమి, వేదన తప్పదు మీ,భవంబు పె
న్నత్తులబోను మీ, నిజముగా దలపోయుమి, యిప్పుడున్న సం
పత్తు లిటుండఁబోవు సుమి; పాపము నొందకు సుమ్మి పైన నీ
చిత్తము చేతనైనటులఁ జెప్పితి నించుక మూఢచిత్తమా! 3

అసలుకు సరియైన నకలు. ది 27-6-03 సం॥రం.

ఓలేటి వెంకట రామయ్య.

పైపద్యములు మా శిష్యుఁడు మాకడఁ జదువుమానుకొనఁబోవు దినములలో రచించినవి, అందులకందుగల తేదీ ప్రమాణము. ఆ తేదీ శోభకృత్సం, ఆషాఢశుద్ధ తృతీయా శనివారమునకు సరిపడును. ఆ సం॥ జ్యేష్ఠములో వెంకటశాస్త్రి యింట యింజరములో నూతన గృహప్రవేశము. అంతవఱకితఁడు శ్రద్ధగాఁ జదువుచున్నవాఁడే. ఇందుల కా గృహప్రవేశమునకు వచ్చినవారెల్ల సాక్షులే, విద్యాభ్యాసారంభము శార్వరి సం॥ శ్రావణము. ఈ మూఁడువత్సరములును అప్రస్తుత ప్రశంసలో మూఁడుమాసములుగాఁ గృష్ణకవి యుపలపించెను. దానింగూర్చి యిందు బ్రస్తావించుటకన్నఁ బ్రశంసాఖండనముకుఁగా నేర్పడిన లోకాభిరామాయణములోనే ప్రసంగించుట యుక్తము. పైపద్యముల కాగితము మా శిష్యుని వ్రాలుంటయేకాక యతని స్వహస్తలిఖితాక్షరములుగూడఁగలది. కృష్ణకవి దీని నెట్లో యుపలపింపక మానఁడు. ఉగ్గచలపతి వ్యాకరణశేషు కన్న నిని యెక్కువ యేమి.

"న సాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి"

# XXI

ఈ కారిక నతఁడసత్యవిషయమునఁ జేయూఁతగా గ్రహించుచున్నాఁడు. అది యటులుండె, ఆపద్యము లిప్పటియితని 'దేవగురు నిందాత్మకమగు మతము' నకుఁ దోడ్పడవు. ఈమత మిటీవల కుక్షింభరిత్వప్రయుక్తమైన 'గురుదూషణను సమర్థించుకొనుట కవలంబించినదియే, దీనిపేరేమి? వివేకదారిద్ర్యము. అది యవలంబించినవారి కొక మతమేమి, యొక తోవయేమి, యొక తెన్నేమి?

"శ్లో॥...వివేక భ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః"

అను భర్తృహరి బుద్ధివిహీనుఁడా? శాంతం పాపం. ఇట్టి వీరి వ్రాఁతల నేల విమర్శింపవలెను? విమర్శించు మావంటి మూర్ఖులను,

"కొయ్యతోఁటకూరకును సిగ్గులేదు, కొడవటికిని సిగ్గు లేదు"

అని చదువరులు విసిగికొందు రని మేమెఱుఁగుదుము. కాని మాశిష్యపరమాణువు లిరువురలో రెండవవానిని లిఖియించు ననృతములకుఁ బారము లేకయుండుటంజేసి సత్యప్రతిష్ఠాపనమునకు దిగక తప్పని విధియగుచున్నది. వేయేల, ఆరఁడు వ్రాఁత యని ప్రారంభించినది మొదలు నేఁటివఱకును ప్రచురించిన యక్షరములలో నే యొకటి రెండు నిలుచునోగాని తక్కినవెల్ల 'హు' ష్షని యూఁదిన నెగిరిపోయెడివేకదా? ప్రకృత వివాదవిషయ మటులుండనిండు. ఈ కృష్ణకవి

"భాష్యాంతమధీతం"

అని వ్రాసికొనియున్నాఁడు. ఈయొక్కమాట కీతఁడు స్వగ్రామము నుండియేని తగిన సాక్ష్యమును దెచ్చుకోఁగలఁడేమో చదువరులు పరిశీలింతురుగాక. కౌముది చెప్పినగురు వెవరు? వ్యాఖ్యానములు చెప్పినగురువు లెవరు? భాష్యము చెప్పిన గురు వెవరు? అతని వ్రాఁతలో— 'వీరేశ్వరావు' అని యున్నది. ప్రకృతము యశఃకాయుఁడగు వీరేశ్వరుఁడు మాయింటిపురోహితుఁడో యింతయో మఱికొంతయో శిష్యుఁడే! అతఁడీతని గురువులలో నొకఁడుగ నారాయణశాస్త్రిగారికిని గురువు. ఆ నారాయణశాస్త్రిగారికి భాష్యాంతము చెప్పె నితనికిఁ జెప్పెనో, లేక యిరువురకును గల్పి చెప్పెనో, కాక యితనికి మాత్రమే రహస్యముగాఁ జెప్పెనో? ఈవిషయము నొకదానినేను ప్రసిద్ధి సేసి తెలిసికొని యితని వ్రాఁతల తత్త్వమును లోకము గుర్తించుఁగాక. తుది కీవిషయము నకుఁ బ్రకృతము వీరింబట్టి మాకు శత్రుకోటిలో నొకరుగా నున్న నారాయణ

శాస్త్రిగారేని యంగీకరించినచోఁ జదువరులు విశ్వసింప వచ్చును, లేదా కృష్ణకవితండ్రి గారేని "మా అబ్బాయి రామదుగుల వీరయ్యశాస్త్రులవద్దఁగాని వేఱొకరి వద్దఁగాని భాష్యాంతము చదివికొనియె" నని చెప్పినచో విశ్వసింప వచ్చును ఇతనితోఁ జేరుటచే మా శిష్యుఁడు వెంకటరామయ్యకూడ నసత్యతత్పరుఁడుగఁ దోఁచుచున్నాఁడే కాని వాస్తవమున కతఁ డట్టివాఁడు కాఁడు. వెంకటశాస్త్రిగారి యొద్ద నీ వెంతవఱకుఁ జదివితివి ఎన్నాళ్లు చదివితివి చెప్పు మని యడుగువారున్నచో నిప్పటికేని నిజము చెప్పియే తీరును. పైఁగా గురుత్వారోపన మొనర్చుటకుఁ బరికృతము చెప్పు హేతువులను జెప్పఁడు. కృష్ణకవి వెంటనుండుటచే నిట్టి కర్మము తటస్థించిన దనియే చెప్పును. కృష్ణకవికి వెంకటశాస్త్రి గురుపరంపరలో వాఁడయ్యును బరిగణింపఁ దగినంత గురువు కాఁడు, కావున నతఁ డెవరినో పేర్కొనియెను. ఇతనికిఁగూడ వారే గురువులుగావలసివచ్చినది. దానితో లోకములోఁ గలకల ముదయించినది. అది తుదకు 'వీరేశ్వర పేరు'లగుటకుఁ గారణ మైనది. దానివలన నింత మునిఁగినది. ఇది సంగ్రహము. ఎన్నిగ్రంథములేని దీనికే పెరుగుచున్నవి. ఎన్నియసత్యములేని యిందులకే వినియోగించుచున్నారు. అసత్యము నుపేక్షించుట పాడిగాదని మేము పరిశ్రమ చేయుచున్నారము. ఆయా యీ విషయములు ముందుభాగములలో విస్తరించియుండును గాన నిఁక ముగింపనెంచుచున్నారము. ఇందిక్కడక్కడ నుదాహరించిన 'గురుగీత' అను వ్రాఁతప్రతిని మాకు యాదృచ్ఛికముగా నొసంగిన బ్ర॥ శ్రీ॥ నైషధం భాస్కరరావుగారికి మా కృతజ్ఞతావందనముల నర్పించుచున్నారము. ఆయీ గీతభాగములు చదువునప్పుడు చదువరు లచ్చటచ్చట నుదాహరించిన యుత్తరములయందలి విషయములను బరిశోధించుచోఁ గాఁకరపర్తికి సంబంధించినవాని నెక్కుడు శ్రద్ధతోఁ దిలకింపవలయుననియు నందునను కృష్ణకవికి సంబంధించిన దేహబంధువులవి మఱియును శ్రద్ధగాఁ దిలకింపవలయు ననియు, ఆయీ యుత్తరముల కీలఁడు చెప్పు తప్పుటర్థములను జాగరూకతతో విమర్శించినఁ దత్త్వము బోధపడఁగల దనియుం దెల్పుచున్నారము. ఇం దుదాహరింపకున్నను మా 'వేమవరాగ్రహార శతావధాన పీఠికలో' 67 వ పుటలో నుదాహరించిన 'అణివిళ్ల సీతారామశాస్త్రిలవారి యుత్తరము నుదివితిరేని కాఁకరపర్తిని బురస్కరించుకొని కల్పించి కృష్ణకవి వ్రాయు తప్పుడువ్రాఁత లెట్టివో తెలియఁగలవని హెచ్చరించుచున్నారము. ఆ గ్రామము పండితగ్రామ మగుటకుఁగాని అన్నదాననిరతమను ప్రతిష్ఠకుఁ గుదురగుటకుఁగాని, మఱి యేయితర యశస్సునకుఁగాని మూలకంద మాణివిళ్ల

# XXIII

వారు అందులో నీ సీతారామశాస్త్రిలవారు సర్వవిధములఁ బూర్వులను బోలినవారు. అట్టియోగ్యునకు మాయెడల నెట్టి గౌరవప్రపత్తియో, ఆయుత్తరము చెప్పును. ఈకృష్ణకవికిని, ఆ యనఘునకును గల తారతమ్యము సర్వబంధుజనవిదితము. ఇకఁ డేయయుక్తపువ్రాఁత వ్రాసి యేమి చేయఁగలఁడు కాని, ఆయా పరస్పరసందర్భము తెలియఁగని దూరస్థులకొఱకై తత్త్వనిర్ణయమునకుఁ గొంత సామగ్రి చూపవలయును. గాన తన్మాత్రప్రదర్శనమునకై యీచిన్నిపొత్తములను, చిన్ని పీఠికలును మేము ప్రకటించుచుంటిమి. సత్యముకొఱకుఁ బరిశోధన చేయుట ప్రాజ్ఞలోక సమ్మతముగదా ?

శ్లో॥ త్యాగాయ సంభృతార్థానాం, సత్యాయమితభాషిణాం, యశసే విజిగీషూణాం, ప్రజాయై గృహమేధినామ్.

(ఇతి కాళిదాసః)

ఓమ్, సత్యం తపః, నాఽనృతం వదేత్.

ఇట్లు

తిరుపతి వేంకటేశ్వరులు.

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# గిరతము

## గురుదక్షిణ

(అను రెండవ భాగము)

## I

### ఆశీర్వచనసర్గము

క. వత్సుండు గురుదక్షిణ యిడ, నుత్సాహం బెంతయేనియును జూపంగ "నో
వత్సా! వల" దనియెడి గురు,వత్సలు వరలెంతు మానివరుఁ బ్రణుతింతున్.

ఉ. 'తప్పక కైకొనంగఁ దగు దక్షిణ దేవర' యంచు వేఁడుచే
తప్పగ నెంచి శిష్యపయిఁ దాఁ గను వెట్టుఁగఁ జేసి "పొమ్మి తె
మ్మిప్పుడ కొన్ని కోటు" లని యేగురుఁ డానతిపెట్టెఁ దత్కథన్
జెప్పిన కాళిదాసకవిశేఖరుఁ డెల్లజగమ్ము నేలుతన్.

తే గీ. అంత ముక్కోపి, యంత పరార్థచిత్తు,
నంత నిస్స్పృహు, నంత ధర్మైకలుబ్ధు,
శాంతు, సంతోషవంతుఁగా నలఘు శాస్త్రు
చరిత దురితాపహము సర్వసమ్మతంబు. 3

క గురుశిష్యధర్మముల నెఱుఁగరు పల్వురు పెద్దలిపుడు కలికాలవశుల్
తిరుపతిశాస్త్రీ! వారల కొఱకుఁ జుమీ గిరతాఖ్యగురుఁడు దేర్పడియెన్. 4

క. గురుదక్షిణ నూటాఱు * శివరామకవి నాకు నిడఁగ వచ్చినకంటెన్
బరమానందమొసంగెడి, గురుదక్షిణ చూవె 'కాకకోకిలము' సఖా! 5

---

(బెజవాడ శతావధాన పీఠికనుండి)

*... అట్టిబహుమతిని నవధానిగారు (శివరామశాస్త్రి) తమకుంగల గురు

క. * కోలకాకముఁ గంటివె, యేకళగా నున్నదో యిహీ! యని నగరే
కోకిలమఁ గాకియెడ గురుతాకల్పన మెట్లు కుదురఁజెగునో యకటా! 6

భక్తింబ్రకటించుచు బ్రహ్మ॥ వేంకటేశ్వరశాస్త్రిలగారి నొసంగిర కాని వారు నీభక్తియ నాకు వేయినూటపదారులని గ్రహింపరయిరి....

ఇట్లు, గొల్లపూడి లక్ష్మణశాస్త్రి.

# * కోకిలకాకము

గీ॥ బలునకు మఱంది; కృష్ణునిబావ జెట్టి। యసు నగు భీమునకోడి సుయోధనుండు। ధైర్యమును గోలుపోయి యెద్దానడాఁగె। నాఁడో యదియొండు ద్వైపాయన హ్రదంబు గీ॥ ఆమడువు చెంత నీరసంబైన చింత। కొమ్మపైఁ గూర్మిమైఁ గులాయమొక్కండు। గట్టుకొని యందుఁ బలుగాకి కాకియొకటి। లాఁతికవులొక కొన్ని గొల్వఁగ వసించు క॥ కాకవులు నాఁడు నాఁడును। నీకంఠస్వరము ప్రశంసనీయంబని తే। న్నేకొని యాపఁగ నదెనిజ। మేకదె! యని తలఁచి వాయసేశ్వరుఁ డెగయున్॥ గీ॥ క్రమముగా గర్వమధికముగాఁగ గాయ। కోత్తముఁడ నేనటంచు నూరూరఁ దిరుగు। కాకి పలుగాకిమూఁకలఁ గలసి మెలసి। కడకు గాయక బిరుదమ్ము గట్టుకొనియె॥ సీ॥ ఒకసారి పొగడిక్కు శుకశారికాదులఁ గయ్యంబు నకుఁ బిల్వఁగాలుదువ్వి। యొకమాఱు కాకవిపరికరంబు తనతీరు వినుతింప నుత్తిల్లు విఱ్ఱవీఁగి। యొకవేళ వెడఁగుబాలకులు గాకికి మువ్వఁ గట్ట మిన్నంటు ముట్టు గంతులైచి। యొకనాఁడు తనపాటలకు మెచ్చు పక్షులఁ జేరి "కా" యని కూయు నోరు దెఱచి। వేఱొకప్పుడు తనమూపరపు భవమెల్ల। వారుఁ గనుఁగొని యాచ్చెరుపాటు నొందఁ। దఱచి పటపట ఱెక్కలు దులుపుకొనుచు। నొక్కయెండిన చెట్టుపై నెక్కినిక్కు॥ క॥ ఏకడకు నేగినప్పుడో। రాకోవిదుల సౌధశేఖరంబుల వ్రాలుం। గాక వికటంబుగా మఱి కాకేశ్వరుఁ డంతమాత్రి గరుడుండగునే?॥ చ॥ కొలఁది యెఱుంగలేని యొలకోయిల యొక్కఁడు వాయసేశ్వరు। న్వలఁతియ కాఁ దలంచి తన వారలఁ జేరికిఁగోక ముద్దుగాఁ। బలుకున దయ్యు గానమునఁ బాండితినెక్కుడు సంగ్రహింపఁగాఁ। దలఁపునఁ జేసి వా య స ప దం బు న కే గ ము దం బు పెం పు న న్॥ ఉ॥ జ్ఞానములేని వాయసుఁడు గాయకుఁడంచుఁ దలంచి వానితో। గానము నభ్యసింపఁగఁ బికంబునభిజ్ఞత నేగుదేరఁగాఁ। దానును గాయకుండనని తత్త్వము మార్పడఁజేసి

దానికిం। గానము సెప్ప సిద్ధపడెఁ గాకము లోకమువారు నవ్వఁగన్॥ క॥ లో
కోత్తరమగు గానము। కోకిలడింభకము చదువుకొనవచ్చుట నెం। తో కులుకుచు
మన్నించెను। గాకిగుణం బెవ్వఁడేని కాఁదనగలఁడే॥ గీ॥ దినదినము మేఁతకై
దేశదేశములకుఁ। జనుచుఁ గలవారి ముంగిళ్ళఁ గునికిపాట్లు। పడుచునుండిన విడు
వక భక్తితోడఁ। గొలుచుఁ గోయిల విద్దెపైఁ గలుగుపేర్మి॥ ఉ॥ గొప్పకు
నెందుఁ బోయినను గోయిలఁ దోకొని పోవుఁగాని దా। నెప్పుడుఁ బొట్టకూటి
కొఱకే తిరుగాడుచునుంట నేమియున్। జెప్పదు కాకి కోయిలకుఁ జెల్లియొక
ప్పుడు సెప్పఁజూచినన్। జప్పని కూఁతడక్క సరసంబగు పల్కొకఁడైన
రాదుగా॥ గీ॥ ఎన్నఁటికినైనఁ జెవులకునింపునింపు। నొక్కపలుకేని తెలుప
దో కో! యటంచుఁ। గాకిలము పుట్టెఁడాసలోఁ గొఱచెఁగాని। యెప్పటికి
దానికొక్క యీ పేరడియెన్॥ క॥ ఎఱుఁగదు పికపోతము దన। గురువునకుం
గలుగునిస్వకోలఁదెఁ బసితనం। బఱగిన పిఱుఁడనే యా। త్రొఁ గంతయు దాని
కొయ్యాఁ దెలియఁగనయ్యెన్॥ గీ॥ కాకి వైఖరి మన మెఱుంగనిది కాదు। కాకి
గానము క్రొత్తది గాదు మనకు। గండుఁ గోయిలపిల్ల యకాలమందుఁ బసితనం
బాటఁ దెలియక భంగపడియె॥ గీ॥ చాలఁ గాలంబు విసిగి వేసారి తుదకుఁ।
గాకపికి గాంచెన మెట్లు గలుగు ననుచుఁ। దల్లిమగుటయు మివులఁ జింతిల్లిపికము।
కాకమును వీడి తనవారిఁ గలసి చెలఁగు॥ గీ॥ అంతఁ గోయిలపిల్ల వసంతకాల।
మవతరింప రసాలము నధిగమించి। సరసులెల్లరు మెచ్చ స్వజాతిసులభ। మయిన
గానంబు కర్ణపేయంబు సేయు॥ ఉ॥ కోయిలపిల్ల మేలు తనకున్ లభియింపక
యుంటఁజేసి యా। త్యాయటి మానసూయ హృదయంబుఁ గలంప సహర్నిశంబు
న। వ్వాయసమూతిన్ భూమిఁగల వారికిఁ గోయిలపాటఁ జేఁదుగాఁ। జేయు
తలంపునం జెవులు చిల్లులువోవఁగ గూయు నీగతిన్॥ గీ॥ విబుధవరులార!
కోయిలపిల్లపాట। కర్ణపరుషంబు; ముస్నుకాకమనె విద్య। నేర్చె; దీని కొకింత
యే నేరుపు; కలకంఠములు గౌరవాస్వాములే "కావుకావు"॥ గీ॥ చాలఁగాలము
నుండి ముచ్చటగఁ బాడు। కాకములసొమ్ము గానము; గాని మొన్న। మొన్న
వాయొద్ద నేరుచుకొన్న పికము। కలరవమ్ములు మధురముల్ "కావు కావు"॥
గీ॥ కాకియోర్వఁగలేక యొక్కరణి నెపడు। 'కావుకా'వని కూయునకాని ధరణి॥
నెఱుఁగరొకో కలకంఠము నెల్లవారు। వినరొకో! దానిగానము వీనులార॥
క॥ కాకము దనకొక గురువని యే కోయిల సెప్పు,నైన నేమి? యసూయం। జేకొని

పికముం గాకం। బేకరణినో నింపలావనే తలపోయున్॥ గీ॥ కాకి యొకనాఁడు కోయిలకడకువచ్చి। యోరి! పికపోత! నీగర్వమధికమయ్యె। తొల్లి గానంబు నెల్ల నాతోడఁ జదివి। కృతమెఱుంగవు నీకింతపేరఁటంబె?॥ క॥ అంచుం గించు దనంబునఁ। జంచువుఁగదలించి వాయసము దన్నున్ యా। చించిన నోజ్ఝటికముఁ బ్రమరించెద నని కోకిలమ్మ కేప్రున్ నాప్రున్॥ ఉ॥ తేఁకు-గల్గువాఁడు పరదేశ ములం జరియించు నాఁ డతి। శ్లోకుఁడు వేఁపపండ్లుదిని చొక్కుడు కాకవిసార్వ భౌముఁడే। నాకు గురుండు నమ్ముఁ డనినన్ వసి కోకిలపాక; మేలోకో। లోకమునాటు నమ్మరది లోపముకామగ వారిబుద్ధికిన్॥ ఉ॥ కాకము గాయకుం డఁట! పికంబునకుం గురువంట! తన్ను సు। శ్లోకులలోన వాకొనని లోపము కోయిలపిల్లదంట! తా। నేకడుఘస్మరత్రియుఁట! యుద్ధగుణుండఁట! వింటి రయ్య! యీ। సాఁకు లటంచుఁ జెప్పకొనసాగిరి లోకులు వింతవింతగన్॥ క॥ కోయిలకుం గురుఁడను నే। నే యని యెప్పుడును బాటు నెల్లెడలను గా। నీ యేరును బాటింపమిఁ బాయని గోసమునఁ గలఁతపడు వాయసుఁడున్॥ క॥ ఈ యున్నతతిని గంటం। గోయిల కాకము సముంగుఁగొఁగంగని యొం। దొ యొత్తిలి నగెనఁట; యది। యేయొకసంస్కృతముగ విగ్రహింపఁగఁదొడఁగెన్॥ ఉ॥ కోకిల మట్లు కయ్యమునకు న్మది గొల్పను ముద్దులొల్కఁగా। వాకొని యెల్లలోకులను వశ్యులజేసినదయ్య నెప్పుడో। కాకమునొద్ద నొక్కపరి గానము నేర్వఁగఁ బోయి యుండుటన్। గాకికిఁ గోకిలమ్మనకుఁ గయ్యము తియ్యము గాక యుండుటన్॥ క॥ అదికారణమ్ముగాఁ ద। న్నాదుగఁగలే దని తలంచెనేమొ? కాకం। బాఁటగి పికకూజితమ్ముల। వెదకివెదకి చూపసాగె నెట్టిదొసంగుల్॥ చ॥ ఎఱుఁగదుగాక కాక యొకయించుకయేనియు నాత్మశక్తి; నా। దెఱవ నపస్వరంబులుగదే! తనకుం బొడసూపు! గాయకో। త్తరకలకంఠనాదమునఁ దానును దప్పులు పట్టఁ జూచినన్। గరుసగునే వికస్వర పికస్వర మెవ్వరికేని యంతలోన్॥ క॥ కాక మొకవక్త, కోయిల! మూకంబని మదిఁ దలంచు మొఱకులఁ దలుపన్। లోకోత్తర మగు భణితిని। కోకోయని కూయసాగెఁ గోకిలమంతన్॥ ఉ॥ చేసెడుచేఁత యుత్తములచిత్తము నుత్తలపెట్టుచుండుటం। గూసెడుకూఁత కర్ణములకుం బరుసం బుగఁ దాఁకుచుండుటన్। వాసియు వన్నెయుం గలుగువారలు "హు"షనిపాఱఁ దోలినన్। నాసరివారు లేరనియె నమ్మను వాయసుఁడేమిసెప్పదున్?॥ క॥ కొం గొంగురనుచుఁ గూసెడు। కొంగను ముంగిళ్ళుల మెలఁగు కొంచెపుఁగాకిన్। బం

సీ. తాను నాయొద్ద వృథాగ శుశ్రూష చేసెనె కాని విద్దె చెప్పనంట! నేను
విద్దె చెప్పుటయేమి కొద్దిగానైనను జ్ఞానంబు గలవాఁడఁ గానఁటేను
పొరబాటుచే నాదు చరణ మంటెనెకాని తా నంతయున్న విద్వాంసుఁడంట!
పొట్టకై తిరుగు టెప్పుడు నాదుపనియంట! యక్కటా! మున్ను నేను రవంతయైన

తే. గీ. విద్దె చెప్పనె లేదంట! విసిగిపోయె
నంట! చెప్పిన ముక్కైన నంత మంచి
ముక్క గాదంట! చప్పనిముక్కయంట!
పిదపఁ దియ్యనిముక్కలు చదివెనంట!

సీ. పసితనం బరిగినపై నేను మూర్ఖుఁడ నని తాఁ దెలిసెనంట! యంతమీఁద
సంగపడితిఁ గదా! భగవంతుఁడా యంచుఁ జింతించి చనెనంట! యంతలోన
సంతతంబు బ్రతుకంట! జాతిసులభమైన శక్తి యబ్బినదంట! నీను లలరఁ
గవిత చెప్పెడినేర్పు కలిగి రసాలంబు నాశ్రయించినదంట! యకట! 'కంచి

తే. గీ. గరుడ సేవయె' కాని నాకాళ్లఁబడిన
ఫలము లేదంట! యెందుకో తెలియదిట్టి
పాడు ప్రాతలు, నన్న వాగ్దోషవంక
దృష్టి నిరసింతురనియేని దెలియఁబడదొ! 8

తే. గీ. ధనికులగృహమ్ములంట, యేను గునికిపాటు
లచటఁ బడుచుంటినంట, ద్వారమందుఁ, దాను
స్తుతితో నవ్వఁడునుగూడఁ బాయకే యొ
నర్చునంట సేవ, ఫలము సున్నయంట తుదకు! 9

సీ. తన సిరికోర్వక తప్పులు తన శబ్దములను బట్టెపనంట! యేమి నొకట
నెట్టులేనిరచు నన్ను నీవు దేశికునిగాఁ జెప్పికొమ్మంచు యాచించితినఁట!

---

గారు పంజరమ్మున సింగారింపఁగ నెవండు చిత్తముఁ గొలుపుఁ ॥ । తెలిసిన
తాను గానమును దెల్పిన దేయగుచోఁ। గొలువక యున్న దోసమున కోయిలపిల్లదె
కా। తలఁపఁగ రానికూఁతలను దత్త్వమెఱుంగక రో । కిలమును దూఱి వాయ
సము కీరితిఁ జెందునో కో!

శ్రీ పీఠికాపుర సంస్థాన విద్వాంసులు, వేంకటరామకృష్ణకవులు.

తాను గోకిలమాటఁ దప్పంట కాకినా నను గురుగాఁ జెప్పికొనెడు నెడల!
నయినను జెప్పుట కంగీకరించెనం, టామీఁద లోకు లీయంశము విని

తే. గీ. "కాకముఁట! తాను గురువఁట! కోకిలకఁట!
యిందులకుఁ గోకిల మొకింత యేని సిగ్గు
లేక యెటు చెప్పికొనియె సుశ్లోకులకడ"
నంచు నచ్చెరు వడిరంట! యనఘులెల్ల 10

క. అచ్చెరు వటుఁ జెందెడి యో, సచ్చరితులు! మీరుఁగూడ జగమునఁ గలరే!
పొచ్చెము లేక వచింపుఁడు, చచ్చెనె మీయెడలఁ గూడ జ్ఞానలవంబుల్ ?

క. గురువుగ 'గురువని' చెప్పన, దురితమ్ము సహింపరోటు! దుర్మార్గముగాఁ
బటకించితిరే మీరలు, సరిగాఁ బరీయింపుఁ డయ్య! సజ్జనులారా! 12

క. క్షమియింపుఁడు మీరును లోకమునం దున్నారటంచుఁ గాంచనుజుం డో
యమలాత్ములార! యీ యక్రమపుఁ బ్రాఁతలకుఁ జేయి కదలుట యెట్లో!

సీ. నాకంతరవము వర్ణన చేయు మీరెల్లఁ గాకవులంట! యక్కతన నాకు
గర్వం బదిగెనంట! కాలికి మువ్వంట గట్టినారఁట! పలుగాకినంట!
పటుతరంబుగ నేను బటుపటు టెక్కులుదులుపు కొంచును జరింతునఁట! యకట,
తాను నాయొద్ద విద్యను నేర్చుకొన రాఁగ మన్నించి చెప్ప నమ్మంచితనము

తే. గీ. గూడఁ గూడనిపని యంట! గొప్పకంట
తన్ను నే వెంటఁ ద్రోలని తరలు టెల్ల!
నంతియే కాని చెప్ప లేదంట ముక్క!
యెక్కడున్నాఁడొ భగవంతుఁ, డెంచు లేఁడొ! 14

క. ఔరా! భగవంతుఁడ! నీ, నేరుపు మెచ్చంగ వచ్చు నేఁటికి సృష్టి
ప్రారంభ మాది యిప్పటి, కీకీతి మహాత్ము జగతి కిచ్చిన కతనన్. 15

క. మంతనపు సంగతుల నలు, సంతయుఁ దూచాలు తప్ప కంతయు నేను
స్వాంతుం డెఱుంగు నాభగ, వంతుం డున్న యెడఁ దెలియవలయు న్నిజముల్.

క. ఎంతో నీచ మగు తటా, కాంతరమున నేస్తుపావ మల్లనఁ గొనుదు
శ్చింతము మొసలి నెఱుఁగు భగ వంతుం డున్న యెడఁ దెలియవలయు న్నిజముల్.

క. ఇంతి ద్రుపదాత్మజాత స, భాంతరమున దుస్ససేను నవమానంపుం
గంతులకుఁ బాపఁగల భగ, వంతుం డున్న యెడఁ దెలియవలయు న్నిజముల్.

క. భ్రాంతిన్ బ్రాజదువు లుద, స్వాంతునిలో డాఁచు దొంగవాని ననుర గు
శ్చింతుని గనుఁగొను నాభగవంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

క. ఇంతి జగన్మోహిని దా, సంతర్పణఁ జేయ సురలసందున నరి య
ల్లంత నిలుకు వెడలఁగిన భగ, వంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్.

క. సంతమసములోన నుప, స్వాంతునిలో నుండు కొండపర్కిక జరుగు వృ
త్తాంతమ్ము నెఱుఁగు నాభగ, వంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్.

క. ఓయీ తిరుపతిశాస్త్రీ!, నాయీ శిష్యుండు కాకి నానుసు నాకున్
వేయాఱు లిచ్చుటకు బను, లాయుర్భాగ్యములు గోరి యర్పణఁ జేసెన్. 22

ఉ. ఏనును నీవు నిక్కపుఁ గవీంద్రులమై యగు టొప్పనేని దు
ర్మాని మదీయశిష్యు నపరాధ మొకింతటిదైన నేమి యా
జ్ఞానకృతంబుగాఁ దలఁచి కాచి నిను న్నను సస్యాకశపరా
ధినులఁ జేయుఁగాతఁ బర దేవత శిష్యుఁ జిరాయుఁ జేయుతన్. 23

మ. మనలం దిట్టినఁ దిట్టుఁగాక, తగ నస్మచ్ఛిష్యుఁడౌ నీతనిన్
ధనధాన్యాదిక మాయువున్ సిరియు విద్యాబుద్ధులం గూర్చి వృ
ద్ధిని నందించెడిఁ గాత మాత, గురుభక్తిన్ వచ్చు జన్మాంతరా
ననుసంధించుతఁ, గీర్తియుం గలుగుఁగా కానాఁడె యవ్వారికిన్. 24

మ. కలుగుం గావుత సూర్యరాడ్విభునకున్ గళ్యాణపారంపరల్!
దెలియుం గావుత పేరికన్నఁ గవులే దేవాంశసంభూతులం!
చిల నీతోఁ దొరరించు పుణ్యములె మాయీశిష్యు దుర్గోపపుం
గలికాలంపుఁ బ్రిసక్తసం బుడిపి పైఁ గాపాడి రక్షించుతన్! 25

సీ. మొదలంట నడుగంటి మూలమూలలనుండు వేదశాస్త్రమ్ములు వెలికివచ్చె
మనకు దిక్కెవ్వరో యనికుందు నాంధ్రకవుల కవిత్వము నేఁడు వెలికివచ్చె
నెందుకు సృష్టించె నీమమ్ము నని బిట్టువందురు ననదలనంత లమోఁగె
నెట్టునిల్చెడినాకో యీపాఠశాల లిమ్మలనన్న శాల లుజ్జ్వలత కెక్కె

తే. గీ నెవ్వని కతమున నట్టిమనీషిపాద
రేణుపావితసత్సభా శ్రీవికాసుఁ
డార్యసూర్య రాయేంద్రు ననర్ఘసుకృత
మగును గాక మాశిష్యుని కంగరక్ష!

క. ఇఁక నీయవస్థవినుమా! బకమైతివి-నీవు; నిన్నుఁ బకపక నెపుడో
పికపోతము పొగరున నెం, దుకొ నవ్వెసదంట! యెఱుఁగుదువె,యదిసఖుఁడా!

క. అదియే కారణ మఁట! నీ, మది గలఁగుట కక్కతమున మచ్చరమునఁ ద
మ్మెదిరింప నుండటంచున్, గదనమునకుఁ బిల్చి తంట! కంటివె యిదియున్?

క. ఎదిరించెడి నేర్పది యుఁ, న్నదియఁట! చదు వబ్బకున్న నదియే పోయెన్
గదనము గుఱుతోఁ జేయఁ ద, గదు పొమ్మని మానెనంట! కంటివె సఖుఁడా!

క. ఎంతటి తెల్వియొ చూడుమ!, యంతేవాసిత్వ మాతఁ డంతో యింతో
యెంతో నా కొనరించెను, జింతింపఁగ నేల నిన్నుఁ జెనఁకుట కనఘా! 30

క. గాంగేయు నెఱుఁగఁడో! పా, ర్థుం గనఁడో! భారతమున; దొంగప్రసంగం
బుం గనలేరె లోకులు, "మంగలిమాధ్యస్థ్య" మనుచు మది నెంచెనొకో!

క. సందియ మందెను సరియే, పందవలెన్ వదరుపట్ల భయ మది లేదో!
యెందుల కీవ్యాస మ్మది, పందతనము తెలుప దొకొ బాలున కిలన్. 32

క. భారతమున నన్నదొ యిఁక, గీరతమునయందుఁ గలదొ కేవలముగ ని
న్నారతి వ్రాసినదేకద!, మేటకు లనగొకొ వినిన బుధవరులెల్లన్? 33

క. అన్యాపదేశ మన ని, ట్లన్యాయస్థవాస్త్రిత యగునె? యకటా, విద్యా
శూన్యులకుఁ దెల్వి, ధీరమ్మన్యులకున్ మంచి పెద్ద మహిలోఁ గలదే!

క. ఎవఁ డేడ్చెఁ దన్నుఁ. 'శిష్యుఁడ నవుదును నే నని వచింప' మని, లేదని కొం
కు విధుసు దీనికి నెంతో, సవిశేషము గాక యున్నె? జడుఁ డెఱుఁగు నెటుల్.

చ. "చదివితి నిక్కమే, గురుఁడు చప్పనికూఁతలు సెప్పినాఁడు నే
నదివఱకే కలాపిదుఁడ" నంచు వచించి వికత్థ మూని దు
ర్మదమునఁ గాకిఁగా గురుని మాటికిఁ జెప్పుటకన్న నొప్పదే
"చదువను లే"దటన్న! నిది సత్య మటంచుఁ దలంచెనో కదే!

ఆ. వె. పల్లకాటిసత్య మిల్లు పట్టేటిలోఁ
గట్టికొన్న పగిదిఁ గానఁబడెడి
నెల్లవారు నగరె! "యిహిహి" దురాగతం
బనరె! యేరు చెప్పి రకట యిట్లు! 37

ఉ. కొంగనగ నిన్నుఁ జేర్కొనిరి, కోరినవాఁడవు నీవు వారితో
సంగర, మందులోఁ జొరఁగఁ జాలమికిన్, "బిక మేడఁ గాకిలో

సంగర మేడ" నంచుఁ బెలుచన్ శిఖియించిరి హేతు, వింతలోఁ
గొంగవు కాకి వెట్లయితో ? గొంగ యనంగను శత్రు వందురో. 38

క. అటుమీఁద శత్రువునకున్, దటకాఁడి మూలఁబడుట తథ్యముకాదే!
యెటు వ్రాసి కొన్ననేమి క, పట మెఱుఁగం బడదె జగము పాషాణంబే.

గీ. సోమ యేనుఁగుకడ కేగ దొంకపఱకు
రక్తమును గ్రోలు నిచ్చ, భద్రిగిజరాజు
నోడలు తనపాలు చేసె, నీవడఁగుసోమ
పాడుతుండంబునకు లేదు పాటవంబు. 40

క. నాకును మండంబున్నద, నేకపరాజునకుఁ గలద యిది యని యాపై
డీకొని పోరఁగఁ జొచ్చిన, నా కదనం బెట్టులుండు నరయుము సఖుఁడా!



(2) సూర్యారాయ పర్వము.

సీ. ఉఁగొండివారింట నాకంపముగ నెక్కి సతిఱింబు చెప్పిన జాణతనము
మధునపంతులసూరబుధు దేశికత్వమ్ము మున్ను చెప్పినరీతి నున్నయెడుట
అటుమీఁదఁ దాఁ బికంబై వసన్నఁగాకంబుగా వ్యాసములు వ్రాయఁగా జాణతనము
ఆవ్యాసములు గూడ నట నిట గోమయోపిక సేచనము గోరు వెకలితనము

తే. గీ. గాంచి 'యేమి దురాగతం' బంచు నడుగు
వాఁ డొకఁడు లేఁడు గా! యని నగచుచుండ
దొరకె నొక్కఁడు నూజివీట్మ్యాము నందు
గొగ, రసజ్ఞుండు, సత్కవిచరణాంతుఁడు. 42

క. విరప యను నూరుకాఁపురి, మఱసినవాఁడెపుడు సకలమగు కావ్యములున్
సరిగారు వెలమలన్ ధీ, వరు లతని కటన్న జనుల వాకొననేలా? 43

క. ఎఱుఁగవె? సంస్కృతభారత, పరమార్గజ్ఞుండు రావు వంగడమున నీ
పరిసరమునఁ గలవారలకు, శిరోవిభూషణము సుగుణసింధుం డెంచన్. 44

ఉ. వెంకటసూర్యరావు సుకవిత్వవిదుండగు రామచంద్రనా
మాంకుని సార్యలకుండు ధనమం డెటులైనను బీఠికాపురీ

పంకజబాంధవుం డనఁగ భాసిలు నతనికి ధర్మమూర్తికిన్
వెంకటసూర్యరాయనికి వినుము వివేకి * యథార్థవాదియున్. 45

క. ఆతం డడిగెద నని; నిఁక, బూతులపంచాంగములను బొగడుచు వగలున్
జాతురికిఁ దక్క కోఁతలు మూఁతంబడు నమ్మఁ డతఁడు పొంకుంగూఁతల్.

క. 'దానన్ లాభం బే మని, యూ'? నీవడిగెదవు, వారి కాపైనేనిన్
జ్ఞానంబు గలుగు ననియున్, దానన్ యశ మబ్బుననియుఁ దలఁచెద సఖుఁడా!

గీ. ఎఱుఁగు నీతండు నాయొద్ద నెంతపఱకుఁ
జదువుకొన్నాఁడొ, పిదప నీసాహసమున
కెట్టులొడిగట్టె పాపంపు గుట్టనెక్కఁ
దలఁచుచున్నాఁడొ, సర్వమ్ము తథ్యముగను. 48

క. నాకడకు వచ్చునప్పటి, కీతని జ్ఞానం బదెంతొ, యీడెంతయొ, నా
కాకత్వ మితని కోకిల, పాకత్వముగూడ నెఱుఁగు భవ్యుఁ డతండే. 49

---

* "మహారాజశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి శిష్యుడు రావు వెంకటసూర్యారావు కృతానేకవందనములు............ నేను యిచ్చటకువచ్చి వారంరోజులు అయినది. అది మొదలు యిప్పటివరకున్నూ, అత్యద్భుత శతావధానులదర్శనం చాదామని ఎంత యత్నించినను నాకు సంప్రాప్తించక పోయినందున రెండుసార్లు వారిబసకే వెళ్ళినను, సమావేశం కాలేదు. కారణం నేను వ్రాయచాలను. ఇంతకూ అట్టిలాభం నాకు ప్రాప్తించినదికాదు అని అనుకున్నాను...... ప్రస్తుతం చాలా పశ్చాత్తాపంలోకి వచ్చినట్లు నా ఆప్తులవల్ల రూఢిగా విన్నాను. నేను వక్కసారి సమావేశమయినచో ఎంత అందముగానైనా యుండును. గాని వీలుపడ్డదికాదు వక్కసారి సమావేశమయిన యెడల మీకు నేను శిష్యుడనైనందుకు గురురుణం తీర్చుకొనిన వాడను అగుదును అపని ఈసమయంలో నెరవేర్పలేనందున నేనున్నూ వారివలె గురువిషయంలో కృతఘ్నుడనే కావలసివచ్చినది......... నా ఆప్తులున్నూ నేనున్నూకూడ మిగీరతమునే త్వరలో చదివి ఆనందించు కుతూహలంతో నున్నాము. గీరతంయొక్క పూర్వోత్తరం పిఠాపురంలో వున్న పండితులు అందరికిన్ని పద్యములు నోటికి రాకపోయినా సంగతియాపత్తున్నూ చెప్పినాను. అటువంటి గ్రంథం బయలుదేరితే లోకమునకు ఉపకారమవుతుంది అని అన్నారు. అంతా......వేస్తూన్నారట........"

రా॥ వెం॥ పిఠాపురం, 18-1-11.

ఉ. ఏ వలనూజివీడుపురి కేగి వధానము సేయునాఁటి కీ
జ్ఞానిశిరోవిభూషణము ధాతుశ్రీఁడుగాఁ జనుఁదెంచెనాకు వి
జ్ఞానము బోధ సేయుటకుఁగా దయ గల్గిన వాఁడుగాన, ని
వ్యానిని సూర్యరావప్రుడు వాస్తవ భక్తిని జూచినాఁడటన్. 50

శా. సూరిశ్రీసకలస్వవేత్త యగు నీసూర్యేంద్రుఁడెసూ! పూర్వ మ
ప్పారాయేంద్రుని సన్నిధానమునఁ గాఁపట్యంపు విద్యాఖనిన్
శ్రీరామాఖ్యశతావధానిపసఁ దేల్చెన్; మీఁద నాసూరి వ
ప్పారా వొక్కఁడె కాక తన్నగరమే వాకోదు తత్త్వజ్ఞుఁగన్. 51

శా. అప్పారావునసంతరమ్మునను విద్యావేదులైనట్టినా
గప్పారావును, నమ్మహాత్మునను జుం జైనట్టి సింహాద్రి శ్రీ
యప్పారావును జూడవచ్చెనితఁ; డయ్యార్యుల్ "భవచ్ఛక్తి మా
కొప్పన్ బో" యని యండ్రిపోల్కిని రార్యుల్ తత్త్వ మూహింపరే.

ఆ. వె. ఈరసజ్ఞమూర్తియే కాదు శ్రీకూచి
కులుఁడు నారసింహకోవిదుండు
గూడ నెఱుఁగు నితనిగురుతయు, నాశిష్య
భావ మడుగ నతఁడు పలుకు నిజము.

క. ఎవ్వాఁడుపలుక నేటికి, అవ్వయు గట్టును నిదేల రసికులకు? ననున్
బుత్రుఁగఁ బట్టిన వ్యాసమె, ముక్కలు గట్టికొని యిట్లు మెఱుఁగుచునుండన్

మ. ఎవ రీకోకిల! శ్రీమనోహరకులాహీనాబ్ధిరాకావిధుం
డవు శ్రీ వేంకటరామశాస్త్రియను లోకాహోది; కాకం బెవం?
డెవఁడో యెట్లగు శాస్త్రిగారి గురువౌ నీవేంకటేశుం డహో!
యెవఁడీ కొంగ? దివాకరాన్వయమణీ! యీవేసమీ శ్రీపతీ! 55

సీ. నావాఁడఁ దాఁ గృతఘ్నత్వనామకమహాపాతకి యనాట విస్పష్ట మంట!
ఈపాతకమ్మున కేర్పడ్డశిక్షఁ దాఁ బరమందుఁ గనుట తప్పనిది యంట!
అంతియే కాని నాకాతఁడు శిష్యుఁ డం చని నేను జెప్పు టనర్హ మంట!
పైడానఁ దనకీర్తిఁ బబలించునేకాని నాకు యశంబు నున్న యగునంట!

తే గీ. ఔర! యెటువంటివేదాంత మభ్యసించె?
"నేమి శాశ్వత మాగోద యించుకంత

యవల జరిగించి "పెట్టికొం" డని వచించు
నెట్టివేదాంతితన మిట "బట్టు" మనియె. 56

## (3) సంబుద్ధిపర్వము-

క. "మావాఁడతిదుర్మార్గుఁడు, మీవాని శిరమ్మునందు మేకులు గొట్టుం
డేవేళ నేమి సేయునొ, కావలమున" నన్ను నీతి గనఁజేసెదవా! 57

ఉ. వేంకటరామశాస్త్రి! విను విద్యపఠించితి నంచు నొప్పకో
జంకియుఁ గోకిలమ్మనయి చక్కఁగ స్పష్టము గాఁగ నెంతయో
పెంకెతనంబుఁ జూపియును "బెప్పెపెమెమ్మెమె" యంచు నేఁడు ని
శ్శంకగ నొప్పికొంటి; వది చాలు జయం బగుఁగాక నీ కిఁకన్. 58

ఉ. "కాక" మటంచుఁ దిట్టుదువు గాక, శ్వపాకుఁడ వందుగాక, యిం
కేకలుషంపుఁ బేరు లిఖియింతువు గాక! స్వకార్యసిద్ధి నేఁ
జేకొనినాఁడ నేఁడుగద! చేకుఱె మోదము; నీవు తిట్ట లే;
దీకవి నీతఁడే యనక యిట్టులు తిట్టుకొనన్ గుమారకా! 59

ఉ. "చప్పనికూఁతలే" యనుము ఛాత్రుఁడవైగద! నన్ భజించుచున్
జెప్పినఁ జెప్పికొంటివి ప్రసిద్ధుఁడ వప్పటి కయ్యె నీవు నీ
చెప్పను గాని నాదరిని శిష్యుఁడ వైతివి తండ్రి! నీమనం
బొప్పెనె యిట్టితిట్టుల కహో! యిటు కృష్ణుఁడు వ్రాసిపెట్టెనే? 60

చ. మొదట "రిజస్ట్రరుత్తరము" మోటుతనం బగుపట్టకుండ నేఁ
గద లిఖియించి తిర్పతిని గయ్యముకై పురికొల్పినాఁడ; నీ
వది గని యెంతగా బెదరితయ్యయొ? పాతకినైతిఁ దండ్రి! నా
యదయత సైఁపుమయ్య! యిఁకనైనను భీతిని మాను మర్భకా! 61

చ. "తిరుపతిసింహ మొక్కఁడొగిఁ దీవ్రతరంబుగ వచ్చి పీఠికా
పురమున నున్న నాపయి 'శుభుక్కన' మాఁకు" నటంచు నెంతకా
తరపడినాఁడవో యకట! తండ్రి! కృతఘ్నత కాదు హేతు 'వీ
శ్వర' యను వేరుసుమ్ము నిను జంకఁగఁ జేసిన దేమిసేయుదున్. 62

శా. నీయజ్ఞానము నీదులోభగుణమున్ నీదౌ కృతఘ్నత్వమున్
నీయల్పజ్ఞతఁ జేసి గాక యకటా! నీమీఁది కే మంచు యు
ద్ధాయత్తుం డయి రాఁగడంగు నొకఁ?డే నవ్వానిఁ బ్రాణాలతోఁ
డాయ న్నిత్తునె? నన్ను వీడిగద! కట్టా! చెట్ట వైతింతకున్. 63

చ. తిరుపతిసింహమున్ సరిగఁ ద్రిప్పి పరిక్రాంతమొనర్ప వేంకటే
శ్వరునకుఁ దక్క నీయనుఁగుబావకు నీవకు నోజ గూర్ప నీ
గురునకుఁ జగ్గచంద్రునకుఁ గూడ వశం బెటు లయ్యెడిన్ ? దుర
ద్ధర మది, నేను దానిబలుధాటికి నొక్కొకవేళ జంకెదన్. 64

ఉ. కాఁకరపత్రిపై నులుకఁగా గమకించె నెఱుంగుదే ? “శత
ఘ్ని”కృతి సాహ్యకర్తలను నీవును బావయుఁ బోలె ‘శృంగభం’
గాకలనప్రసంగ మది యజ్ఞతమై లిఖియించినట్లె వా
పోకయ పోయినట్టులుగఁ బూర్తిగ వేఁకిరి జ్ఞప్తియున్నదే? 65

ఉ. వెంకన బందు వొకతన వేఁదుఱుఁబ్రాంత లాకింత సైఁచు; మీ
ర్జంకుటగాఁ దలంచి పెలుచం గుఱుచల్ లిఖియించుచుందురు; మీ
పెంకెతనాలు సాఁగ -ల జెబ్బులికై; తెలనాఁటి సింగ ము
ట్టెంకుల నింకఁ జేయు నెపుడేనియు; డొంకలె సూ! శరగ్న్యానుల్. 66

ఉ. ఏది, సముత్తరం బతని కెమ్మెత్తెఱవారికితకుఁ [illegible]మా ? [illegible]
శ్ఛేదము కాద పందె మిదె! సిగ్గు గలట్టి నృపాలురఁ జేని * “మా
రే దెసకేని బొం” డనుచు నీయఁగఁ జేయునె యీయుత్తరంబు దా
యాదుని పేరు పెట్టి! యహురా, యిపిరా! చవిరాని బీరముల్. 67

ఉ. “పొం డల పిఠికాపురికిఁ బొం డటుపొం” డని నీదుబావ డా
వొండొకలేఖ వ్రాసె, నది యారఁతగ నయ్యెడ వేగు దేర న
వ్వండొకొ తేఁడు “మీ రిటను వచ్చితి రేటి?” కటంచు, నెందుకీ
గండతనంపు వ్రాఁతలు జగంబు మొగంబుల నవ్వ చేటు సూ. 68

చ. “పిలిచినయప్డు రాక యటు * బెట్టుగ నుత్తర మిచ్చి యెవ్వరో
చలపతి ‘పీఠికాపురము దక్కికిఁ బో’ మ్మనినట్టు లెవ్వరో
గిలికిన వచ్చువాఁడవె ? నగించెడి నీదుప్రసక్తి” యందు న
వ్వల నల తేఁడు నవ్వులరఁ బల్కిన నుత్తరమేది పుత్రకా! 69

---

* గీరతము, 1 భాగము శాఖాచంక్రమణపర్వము చూ. 10 వ పుట

* శ్రీపిఠాపురీ రాజపుత్రోదయవిషయిక పద్యత్రయము.

సీ॥ ఉదయించె రాజు రావూవన్వయోదన్వదభివర్ధనుండు సూర్యాంశవలన
జన్మించె సంతానశాఖి నందనశుభశ్రీ పెంపుమీఱఁ బిఠాపురమున। వెసలెఁ

ఉ. కరుణ గలట్టి మెత్తనగు కాకిని గేరడ మాడినట్లు గా
దగయుఁగఁ గొంగపై కరుగు టంచని పూర్తిగ బుద్ధి వచ్చియుఁన్

---

జనూసంభవుఁడు సూర్యునందు నారాయణాంశం బున్నదంచుఁ దెలుపఁ, బొడమె నాం డాలమ్మకడుపు చల్లఁగ రాజసస్యంబు సజ్జన క్షేమ మడఁప॥ గీ॥ మంగళాంబ గణించిన మాననీయ। సుకృతపరిపాక మెల్ల నేఁటికిలభించెఁ। గంటికగ పడె రావు గంగాధరోప। పదుఁడు రామావనీపాలవరుఁడు మరల॥ గీ॥ తనిసె. సాధారణం బసాధారణముగ। మఱియు నందును నాశ్వయుజ్మాసబహుళ। పక్షముఁ దృతీయయును శుక్రవాసరంబు। మకరలగ్నంబు సూర్యసంభవునివలన। మ॥ గురుఁడున్ సూర్యుఁడుఁ జంద్రుఁడున్ గుజుఁడు శుక్రుండున్ బుధుండున్ శనై। శ్చరుఁడుం గేతువు రాహువుం గలసి యశ్రాంతంబు నీబాలునిన్। సిరి దీర్ఘాయు వొసంగి, పోరితురు బుధాశీర్వాదముల్ తోడుగా। నరవిందాక్షునకుం సహాయు లయి సూర్యారాయభూపాలకా!

25-10-10
కాకినాడ.

దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధాని.
శ్రీరాజా కొచ్చెర్లకోట రామచంద్ర వెంకట
కృష్ణారావు బహద్దరుగారి యాస్థాన విద్వత్కవి.

True copy of letter from the Private Secretary to the Rajah of Pithapuram dated 29th October 10, addressed to Brahmasree Satavadhani D. Tirupati Sastri Garu.

"I am desired by the Rajah to convey his thanks to you for your congratulatory verses on the occasion of the birth of his son and heir."

(శుభలేఖ పంపినప్పటి విజ్ఞాపనము.)

మ. ఘనవంశావళి గల్గువాఁడవని చక్కన్ దిద్దరన్ జేరి నే। రినచియ్యోత్తిన
దుర్గజమ్ముల వక్రక్రీడావినోదమ్ముగాఁ। దునియల్ సేయఁదలంచుచుండినమ్మ
గేంద్రుండూరకే వచ్చిపో। యిన గర్హింపరె? యెప్పుడేని యిటఁజన్నే వచ్చు
భూభృన్మణీ! తి॥ శా॥

దిరిగియు * "జార్జి" పద్దెములఁ దేఁకువమాలుదొసఁగులన్ గనం
బఱుపఁగఁ బూను మీకుఁ బసవా? కఱవా? తెరువాటుదాఁటులన్.

ఉ. "ఈశ్వర వేరు లున్న యెడ కేగుఁ" డటంచు చొక బంధుమాత్రునిన్
బశ్వసతారు నూఁతగొని పల్కితి; రాతని చెయ్వు లన్నియున్
శశ్వదుదారకీర్తుల ప్రసంగములో బయలయ్యె వింటి: లో
కేశ్వరుఁ డెట్టిచుట్టఱిక మేర్పడఁ జేసె సెబాసు! మేల్! బళి!

క. విను నీపినతండ్రికుమా, రుని గనుఁగొను మతఁడు చెప్పు రూఢిగఁ; దాప్ర
ష్టును నలతిర్పతిఁ బట్టం, గను బూన్చితి రెంతకేని గలవారు సుమా.

క. అతఁడేల చెప్పవలె? సం, స్కృతనిశ్శేషానదాతభృతనిద్రాసం
గతిగతకాఁకరపత్రి, స్థితసుశ్రీనేత్ర మదుగఁ జెప్పు నఖిలమున్.

ఉ. అట్టిఁడతండు కావుననె యాతని వ్రాల్ గలయుత్తరమ్ము నా
పట్టుననుండె నం చేఁగి బావ "యతండు † దది వ్రాయులే" డటంచు
చొట్టలు సత్యముల్ గికికి యుత్పథచారిగ మూఁకఁ జొచ్చె "వీఁ
డిట్టిఁడు బొంకి యాత్మ కేటులేని యశం బొడఁగూర్చె" నం చొసిన్.

క. తాదృశులుడక్కి వీరు దు, ర్వాదములకుఁ దోడునూప రా; రతఁడేనిన్
బాదాకాంతత కొడఁబడి, నీదగు నఘు మడఁచెఁ గొంతనీతి గలాఁడే!

---

(*కవితా పత్రికలోని "అట్టహాసము" నుండి)

*...ఈపద్యము వ్రాసిన మహాకవి యెతడోయని యాలోచించుచున్నట్టున్నారు ఈయన పోలవరము సంస్థాన పండితుండు దివాకర్ల తిరుపతిశాస్త్రి శతావధాని గారు...పరి యాచకమున కేమిగాని యీపద్యము వెనుకటిదానకన్న మస్థితిలోనున్నది. ...... ఇట్టితప్పులతడకను బ్రకటించి నందులకుఁ గొంకిరేమో కాఁబోలు విశేషజ్ఞుఁడనిపించుకొనుచున్న వేంకటశాస్త్రిగారీపద్యమును దోసి రాజని కృష్ణాపత్రికలోఁ దక్కిన పద్యములను మాత్రము ప్రకటించియున్నారు. (ఇట్టివనేక హాస్యములు)

† తి॥ శా॥ గారు శృంగభంగ గ్రంథకర్తకు రిజష్టరు జాబు వ్రాసియుం జేఁగాని యాతఁడు వ్రాసినట్లు యాథార్థవాది యభినవ సరస్వతీపత్రికలోఁ బ్రక టించిన యుత్తరముచేఁగాని ప్రయోజనములేదు. ఆయుత్తరము సత్యాసత్యములు సమయము వచ్చినప్పుడు తేలకపోవు. ...

(నవంబరు 24 వ తేది 1911 సం॥ కృష్ణాపత్రికనుండి.)

చ. కలతెలుఁగుల్ లిఖించె నలకాతఁడుఁ డక్కట! పేరు పెట్టి; యా
వ్వల నెవరో లిఖించు నలపత్రము తన్ను ఘటించి తీర్పతి
జ్వలనము చుట్టుముట్టు నని సందియ మందఁగఁ బోలుఁ బాప? మే
కొలఁదియుఁ గాని తన్నెరుఁగుకొన్న జగంబు మఱింతనవ్వదే!

క. తిరుపతి ధోరణి తెలిసెనె, "శఠ"యని నీబావకై యశస్కుఁ డతోన్
దరి నిడినబావమఱఁదినిఁ, బోరిఁబోరిఁ బలికించి కాచు ప్రోచెఁ గరుణన్.

చ. అతఁడు కృతజ్ఞుఁ డౌటఁ జామి యాత్మకు వెంకననాము వీని నీ
చతురపికాభిషగ్ధుని ‡ సద్గురుఁగా లిఖియించె; దానిచే
నితనికి వాఁడు తక్కు వని యెంచుచుఁ దిట్టితి వెంత చేలవో!
కృతమును జూపనంతటనె పీపలనీచుఁ డెవండుఁ గాఁడునూ!

చ. కృతమునఁ జూపకుండు నరుఁ డేమగునో! యిపుడేని స్పష్టమై
మతి నతికెంగదా! సకలమర్మ మెఱింగియుఁ దత్తఱంబునన్
మతి చెడి "కాక" యంచు నొకమాటును గల్పనఁ జేసి నన్నుఁ ది
ట్టితి పది యేమికార్యము! కడింది యశమ్ము గడింపుతో ప్రియే!

చ. "తిరుపతి నాపయిం గవిసెఁ దీప్రిత మద్గురువైన వేంకటే
శ్వరుని కతానఁ గాఁడ" యని శాంతి యెఱింగిన నీవు తద్గుణ
స్ఫురణము చూపి యుత్తరము సూటిగ వ్రాయక యేటికయ్య? యా
దురసఫవాత్రిత; కృష్ణుఁ డిటు దోఁపఁగఁ జేసెఁ గుమారి! చెప్పవే.

క. నరుఁకు శాంతిం గఱపెడి, పరమోత్తమగురుఁడ వీవు బాలక! నీకున్
గఱపఁగ నేఁ జాలుదునే, దురితపుఁ గాకి నని నీకుఁ దోఁచినదె కదా!

చ. "గురు వని చెప్పనందులకుఁ గోప మిదేమిటి? కీపనుల్ యశ
స్కరమగునే?" యటంటివి; వది సమ్మతమే; కొమరుల్ గలారు నీ
కరయఁగ నర్ధమాను లిటు లాచిరజీవులు నిన్ను నల్పన
త్తరుణమునందు నీహృదయతాప మదెట్టిది యౌనో తెల్పుమా 82

‡ మ. భవునిన్ బాపపదారవిందభవుఁ జేల్వాప్తిళ్ళవంశార్ణవో! । ద్భవునిన్ శాస్త్రసదంపదానపటుభవున్ భాస్వద్గవున్ సాహితీ। ధవునిన్ మేఘగభీర విస్ఫుట రవునిన్ ధైర్యప్రభామేరువున్। గవితాసద్గురు వేంకయాభిధుని వక్కాణింతు నెక్కాలమున్ (ఇది తి॥శా॥ గారి మొదటికవిత్వము, కుమారసంభవములోనిది )

క. గురునకుఁ దండ్రికి భేదం బరయంగా లేదు; శిష్యుఁడనఁ గొమరుండే
యెఱిఁగినవారికి; వాఁడే, తిరస్కృతిఁ జూప మదికిఁ దిగులు గలుగదే.

క. ఇఁకగాక నీవు చుట్టమ, వనియు విచారింపఁ బుత్త్రితాపాదకమే
గద! * 'బా' బనివ్రాసిన నీ, పదములమగు లేఖ కలదు చదువుము దానిన్.

క. నీకనకు నాయనమ్మను, నాజనకుని తల్లి యొక్క నాయనకును నొం
డే జననికి జన్మించిన, యోజ నెఱుంగుదువో? మఱచితివో? గురునిబలెన్

ఉ. ఏ నల చర్ల బ్రహ్మయ మనీషియొడన్ గడుభక్తియుక్ కృతం
బూనినవాఁడ నంచెఱుఁగు యోగ్యుఁడ వీ వది నమ్మ దేని నా
మానసమందు నున్న యది మాత్రము నమ్మక పోవు కాన నీ
శానుని సాక్షిగా వినుము సత్యము చెప్పెద నారహస్యమున్.

ఉ. ఏ నల పీఠికాపుర నరేంద్రుని చెంతను జేరి తన్మహా
స్థానమునందు నుండుటకుఁ బద్ధతిఁ గోరినవాఁడ నౌచు నీ
పైని నసూయ నొంటి నని పల్కులు దేల్చితి వీవు వ్రాఁతలో;
నీనుడి నిక్కమే యగునె? నీవు నెఱుంగుదు నాదుభావమున్.

---

సీ. తనకు వేంకటశాస్త్రి తగిన సహాధ్యాయిగాఁ బాణినీయాబ్ధి కడచి రెండు, భాషలలోఁ దర్కృపన్ గవియయ్యె నసేకముల్ శతలేఖినీకవిత్వ, తంత్రముల్ పెక్కుగ్రంథమ్ము లాతనిసహాయమునఁ గావించి యయ్యవధులఁ గూడ్, శ్రీపోలవరపురీభూపాలుఁడాంగ్లేయ భాషాప్రవీణుండు బహుకథాధు, తే. గీ. రంగ, చండతిళాంతుండు సనసుఁడునగు, రామచంద్ర వేంకట కృష్ణరాయచంద్రు, నొద్ద బుధుఁడును గవియు మాన్యుండునై చె, లంగు తిరుపతి శాస్త్రి తెలుఁగుఁ జేసె.

* బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రులవారుగారి సముఖమునకు. ఓలేటి వెంకటరామయ్య నమస్కారములు చేసి వ్రాయు శుభలేఖార్థములు... శుభ ముహూర్తమునకు సకుటుంబపరివారముగా విచ్చేయగలందులకు ప్రార్థించు చున్నాఁడను... తమరు రచియించి అచ్చువేయించిన గ్రంథములు ఒక్కొక్కటి చొప్పున పంపించగలందులకు ప్రార్థించుచున్నాను. దయయుంచవలెను."

పల్లిపాలెం, ఓ. వెంకట్రామయ్య.

ఉ. ఎందఱు రాజు లుండిరి! యహీనులు నాయెడఁ బేర్మి భక్తియున్
బిందుకొనంబు గల్గిన వివేకులు; వారలయొద్ద నుంటినే!
గందరగోళ మైన మది గల్గినవాఁడ, స్వతంత్రుఁడన్, జిదా
నందుఁడ నే ‡ నొకానొకని నాయకుఁగా వరియించి యుందునే.

ఉ॥ అన్నము లేదొ! వస్త్రములకై కొదవుండెనొ! యున్నదానినే
యెన్నఁగ నెప్పఁడుం దినఁగ నిప్పటికిన్ మఱి గానరాఁడు; నీ
యన్నముకోసమై మనసునందుఁ బ్రియత్న మదేల నాకు? నీ
చిన్నతనంపువాటలకుఁ జేతము పొక్కెడి దుఃఖ మెక్కెడిన్.

ఉ. నిక్కముగాఁ బితాపురికి నేఁ జనుదెంచెడివాఁడ నేని ని
న్నక్కడఁ గింపఁగా వలయునో! వరపాలుఁడు నిన్ను నన్ను నొం
డొక్కరుఁ గూడ నేలుకొనఁడో టు! సమగ్రత లేనివాఁడొ! నా
కక్కఱ యేమున్న నేనికడ కంతకు ముందె జను దేరకుందునే?

ఉ. ఎందఱో భార్యలుండియును నింకొకచాన స్వయంవరంబుగా
నందముపొల్చు జాణ తనకిచ్చినఁ గైకొనరే నృపాలు? రా
చందమునన్ మదీయకృతిచంపకగంధిని గూడ మీనృపుం
డందఱితోటిపాటు తనయా! కొని యేలఁగవచ్చు నచ్చుగన్.

తే. గీ. ఏకపత్నీవ్రతముగూడ నిట్టిపట్టు
నందు రామాదులకుఁ బోలె నడ్డు పడదు;
రాము పేరిట నెందఱు ధీమహీశులు
తమ కృతికుమారికల నిచ్చి తనియరయ్యా!

ఉ. జంకితినందువో! యధిపుసన్నిధికిన్ దగ నందువో! తదీ
యాంకణమందు నొక్కఁడును నక్కట! నాసవాఁడు లేఁడె, "ని
శ్శంకగఁ గాకి పంజరపుచిత్కృతికిన్ దగ" వందువే! యెటుల్
బొంకెదు సర్వమున్ దెలిసి పుత్రిక! తండ్రికిఁ జేటు గూర్చెదే?

---

‡ మ. నరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నంగాని తత్సన్నిధిన్
స్థిరవాస మ్మొనరించునట్టి పని నాచేఁ గాదు; నీవంటి స
త్కరుణాశాలిని వెంపఁగాఁ బెరిఁగి విద్యాబుద్ధుల న్నేర్చి నేఁ
బరుల న్నిత్యము గొల్చు టొప్పగునె యంబా! దేవి! కామేశ్వరీ! (కా॥ శ॥)

## (4) బందరుపర్వము.

క. గౌరీనాథ బుధుండనఁ, గా రాజో? రెడ్డో? చెప్పు కాకమ! యన్నన్
సూరియుఁ ద్యాగియు భోగియు, గౌరవభాజనుల నెఱుఁగు కర్మకుఁడునుతా!

క. న్యాయబుకకార్థులు మాకై, చాలన్ యత్నించి సభనుసల్పియు మొనమొ
న్నేలాగు గౌరవించిరొ! బాలక! పొత్తమ్మునందుఁ బలియుంపరొకో?

క. బందరన నిట్టి దక్కుడ, "సందేహము లేదు బావ శాబ్దికజీవుల్"
చిందులు ద్రొక్కుఁజనఁగ నో, విందా! యనిపించు కవులు వేవేలు సుమీ!

క. బందరనఁగ నిట్టిదియట, నెందఱో యున్నార యెల్లమొప విద్వాంసుల్;
తందరపడు నవధానుల, చిందు లచట సాగిరావు శిష్యుఁడ! వింటే?

క. 'బందరనగ నెట్టిది' యని, సందేహము లేదు బావశాబ్దికజీవా
నందుని బోలెడు శ్రీరా, ముంపగ నొకమాఱడిగి సమాల మెఱుఁగుమీ!

క. బందరులోఁ గోకిలకవి, చందిరులకు బిచ్చమైన సాగదు; కాకం
బుం దిలకింతురు, కపటపు బొందలయత్యద్భుతములు పొసఁగవు సుమ్మా!

క. బందరునకె యొకపరి మీ, "సందేహము లేదు బావ శాబ్దికజీవా"
నందునినే నమ్ముంటిని, చిందులు సాఁగవని యటకుఁ జేరఁడువినుమీ!

క. అప్పటికిఁ జిలుక కాలే, చెప్పుడు పంజర మనంగి నెట్టిదో యెఱుఁగం
డిప్పుడొకసారి యడుగుము, చెప్పు నతఁడు ధారణావిశేషము కలిమిన్.

క. ఇప్పటి కేనియు బహుమతు, లిప్పించెద సమ్మునేమొ? కృష్ణకవీంద్రున్
దప్పక పేర్కొరపింపుము, చెప్పుము నరపాలుఁడేల నెల వీఁడు? సుతా!

క. సంగన్నగారు వీణా, శృంగారతీపనోదచేష్టాహ్లప్టో
త్సంగులు తత్త్వంగ్యా, లింగితులై యొటకు నేని లేదే చనుటల్?

తే. గీ. ఒక్కసంస్థానమందు మీయునికియేమి,
ఏటిపోలిక వారికి నెందు మీరు?

---

వలసినదని నా తాత్పర్యము. మీరు కోరవలసిన పత్రిక యిదివరకే పొందినారు. వచ్చే ఆదివారం తిరిగి మీటింగుచేసి యెవరినో సకరిని నేము అప్పాయింటు చేయవలసి వున్నది. ...అంతకంటె విళంబనము చేయజాలము. త్వరగా జవాబు పంపించకోరుతాను.

జంధ్యాల గౌరీనాథశాస్త్రి.

అక్కటా! * వీణరూపంబు నడుగఁ బాడు
చేసినది చూచి నేనెంతొ సిగ్గుపడితి.

క. ఈసిగ్గున నేమయ్యెడఁ, జేసిన యావధానమందుఁ జెప్పిన కవనం
బేసరసముగాఁ బడినదొ, యా సర్వేశ్వరుని కెఱుక యది యట్లుండెన్.

క. ఆనరపతికిని మన యవధానులు గండ లసద్గీర్తి దవులు, నదియుఁగా
కేనాఁడు నాజ్ఞగొని విద్వానిను లెక్కడికిఁగాని యరుగుటలేదే!

క. ఇది యిటులుంతము; బందరు, పదిశెట్టిదొ రామశాస్త్రిఁ బరవాచ్యుతపుం
బదము గలశతావధానిం, గనిసి యడిగి తెలిసికొన సకలము తెలుపున్.

క. అప్పండితు నవధానము, నప్పటు కొక్కొక్క రాములు సభలో
నొప్పిరిసూ! వాక 'సీ' యనఁ, జెప్పపిమ్మని యొక్కనమస్సుపెట్టె నహాగుఘూ!

క. ఇది యప్రస్తుత; మతఁడును, సదయుఁ డినుఁబోలెఁగాక సక్కఁగఁగోన్నా
ళ్ళొదిగెం గాకయు కడ బ, ల్లిగ్గుఁ డగు పరాకృష్ణను కపిలీలన్ సోలన్.

---

(5) సమృద్ధి పర్వము.

క. ఇఁకఁ బ్రకృతము వినుమయ్యా, ఏకరాజమ! పనుకఁబోలెఁ బృథివీపతులన్
నకనకలాడెడి పొట్టకుఁ, గకపికఁ గనుఁగొను ప్రసక్తి కలుగదు సుమ్మా.

ఉ. పొట్టలు మూఁడు మారి, సరిపోవును బట్టలు మూఁడుమారు; ని
ప్పట్టున నాకు మాన్యముల వచ్చెడి శిస్తది చాలదొక్కొ, నీ
కెట్టులు దోఁచె. లోకు లిది రెట్టలు నన్నొకచో నటంచు వ్రాసి తీ
చెట్టతలంపుమాట! యిటు చెప్పుట పాపముకాదె పుత్రికా!

చ. నెల కొక నూఱురూప్యకలు నీదయకొమ్మ 'కనీసపక్ష' మొ
ప్పు లోలుకు నాదుపుస్తకపుఁబుత్రికలు వచ్చి యొసంగువారు; పై
నెలమిని రోజు కొక్కొకటి యిత్తురు రూపక మొక్కొటులోన; నెం
దుల కిఁక దేపిరింపవలెనో? నను గోరని కొండ్ర సన్నిధిన్.

---

(వెంకటరామకృష్ణ గ్రంథమాల 74 వ పుటనుండి)

* వీణాస్వరూపము, ( సంగమేశ్వరశాస్త్రిగారు కోరినది )

క. వీణాస్వరూపమెన్నఁగ, వీణాగానంబుఁ బొగడ వేడుకతోడన్
వైణికుల నభినుతింపఁగ, వాణియె యసమానురాలు వసుధాధీశా!

ఉ. ఎక్కడి కేగ కూరకయ యింటనె యుంద మటన్నఁ గాని నా
కెక్కడినుండియో సభల కెన్నియొ ♦ జాబులు వచ్చుచుండు; నం
దొక్కసభ౯ బొనర్చినను నొక్కటి తాసకుఁ జావు లేదు! నీ
కెక్కడి యూహపుట్టె? నిది యెవ్వరి కిత్తునొ తెల్పు పుత్రికా!

---

(1)♦ విధేయుడు బంటా శ్రీశయిలం కృతానేకశిరసాష్టాంగనమస్కృతులు. ...తమవలన జరుపబడు అష్టావధాన శతావధానములయొక్క కష్టము తెలిసి తమకు సరియయిన మన్నన రాజలోకమువల్ల జరుగవలయునేగాని మాబోట్లు యేమిచేయగలమా అనే భయము ముందుగా కలుగుచున్నది 'అయితే చంద్రునకు నూలుపోగను సామెత ప్రకారం మాయొక్క శక్తిని గణించక తమవంటి మహా నీయులు యట్లయినను మాకోరిక తీర్చడమే ముఖ్యముగా ఆలోచించవలసినదయి వున్నది. ...గనుక నా మనవి సంపూర్ణ ప్రియతో అంగీకరించి యెప్పుడయినను దరిశనమిచ్చి నాగృహం పావనమయ్యేలాగు యీ ఓడవాని గు...కు విజయం చేసి కోర్కెను తీర్చగలందులకు ప్రార్థించుచున్నాడను. ......

ఆటపాక, 30-1-10    శే. క్ష, బంటా శ్రీశయిలం.

— — —

2 నే పండ్రంగి రామారావు అనేక నమస్కారములు చేసి చేయుంగల విన్నపములు... వెనుక నేను మనవిచేసుకున్నప్పుడు తిరుపతి శతావధానం చేసెదమని సెలవిచ్చినారు గాని అప్పుడు మాయుద్దేశము నెరవేరలేదు. ఇప్పుడు తిరిగ యిక్కడ కాలేజి విద్యార్థులు అతి కుతూహలముగా నున్నారు. ఈవిషయమై యిప్పుడు తిరుపతిశాస్త్రులవారి దగ్గరకు వెళ్లినాము అనుమతిని పొందినాము. కాబట్టి మాయందు దయయుంచి మాప్రార్థన కనుకూలముగు జవాబు తిరుగు టపాలో వ్రాయగలందులకు కోరుచున్నాము    చిత్తగించవలెను.

పిఠాపురం రాజావారి కాలేజి హాస్టలు, కాకినాడ, 27-11-11    పండ్రంగి రామారావు.

3 ఇక్కడ కాకినాడలో స్టూడెంట్సు అవధానము చేయించెదమని అడుగుచున్నారు. వీరికిని వ్రాయుదురు మీ అభిప్రాయము చెప్పదు... ది॥ తి॥

— — —

(4)...కర్ణాకర్ణి వినియుండి మిమ్మునుఁ బ్రార్థించినచో బ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రిలుగారి సహా మీరు వస్తారను నమ్మకముతో నిచ్చట నీనెల 19, 20

ఉ. ఇంతటి దన్క వ్రాసికొనుచే విషయమ్ము స్వకీయ మాటచేఁ
గొంతవొసంగు, 'దాత' నని కూడ లిఖించుట యెట్టు లొప్పుఁ? గా
నంత యుదారతాగరిమ యంటని శిష్యులు బ్రహ్మశాస్త్రి స
త్రాంతరభోక్తలందుఁ గలరం చనుకొమ్ము కుమార! చెప్పితిన్.

---

తేదీలను తమ యుభయులును శతావధానము సల్పుటకు నేర్పాటు చేసినారము గాన మీరు తప్పక 18 వ తేదికే దయచేసి మమ్ము నానందింపజేయ మిక్కిలిగా ప్రార్థించుచున్నాము. తిరుపతిశాస్త్రిగారిని తీసుకొని మీరు తప్పక వత్తురని నమ్మకముతో కొన్ని ప్రయత్నములను జేసియున్నారము. కావున తమరు తప్పక రావలయును. చిత్తగించవలయును.

ఇట్లు విధేయులు

గుంటూరు 12-8-11 } రంగావఝ్ఝుల హనుమయ్య. (జిల్లాకోర్టు ప్లీడరు)
వేమూరి వెంకటసుబ్బారావు, (జిల్లాకోర్టు శిరస్తాదారు)

(5)...రైలుదగ్గరనుండి గ్రామములోనికి సకలసంభ్రమములతో తీసికొనిపోవలయునని కుతూహలపడుచున్నారు. గనుక తాముభయులు సమకాలమునకే వత్తురని యెంతయు

కొల్లా హనుమచ్ఛాస్త్రి.

(6)...తమకు లోగడ యుత్తరము వ్రాసియుంటిని ...తమరు శ్రీతిరుపతిశాస్త్రిగారు ఒకసారిగా గుంటూరుకు దయచేసినయెడల ప్రత్యుపకారముగా గ్రామములోనికి తమరిని తీసుకరావలయునని నాకోరిక. ...గుంటూరు స్టేషను వద్ద స్నేహితులందరు తమరాకకు యెదురుచూచుచుందురు గనుక యీప్రకారము చేయుదురని నాకోరిక.

గుంటూరు, 15-8-11. మజుందారు వెంకటహనుమంతరావు.

---

(7)...తామున్ను ఆగ్రోణుకు యిచ్చటికి దయచేసి సభ జరుపగలందులకు మిక్కిలి వేడుకగలవారమై యున్నారము.

ఇట్లు విధేయుడు

పినపాడు, 15-9-1911. కూరాములూరి కోటయ్య.

---

(8)...12-12-11 అద్దంకిలో అవధానమట వత్తురా? సత్తెనపల్లికి వచ్చే ఆదివారం రాగలరా?...

గుంటూరు, 4-11-11. రంగావఝ్ఝుల హనుమయ్య.

ఉ. కాఁకరపర్తి లేఖలనుగాంచి సదుత్తరమేదిలేమి వా
ర్తాకు సమీప బంధు లనినన్ జగమొప్పెడి నంచు నెంచి,యా
సాఁకున దూరదేశగతసజ్జనులన్ గికురింప నెంచెదే?
యీకపటంబు కృష్ణకవిదే యగునో? మఱి సీదియో? సుతా. 312

---

(1),.. గీ॥ మీ కవిత్వమునన్ బహు మిన్నగునఁట !। బహుకవులచేత సన్నుతుల్ వడసినదఁట!। ప్రకృతులంగూడ సంతోసపఱచినదఁట !। భారతమునకుఁ బ్రతియగు గీరతంబు.

(2)......మీరంపిన గీరతమందినది. దానిని సమగ్రముగా జూచినాను. మీగీరతమందు మాకు తెలిసిన విషయములు వారివిషయమై విసుండు. (1) గురువును మఱచుట. (2) రజష్టరుత్తరం త్రిప్పివేయుట. (3) చాటునపద్యములల్లుట. (4) వ్రాసినమాటకు బదులు వ్రాయకుండుట. (5) శృంగభంగములు వ్రాయుట మొదలయినవి గ్రహించితిమి. మార్గముఁ జూపినను తెలిసికొనలేనివారితో నేమి సార్థకము. ... తెలిచేపల్లి రామకృష్ణయ్య, వేలూరు, చిల్కలూరిపేటపోస్టు.

---

...ఉ॥ గీరతమున్న సర్వగుణకీలితమార్దవ పాకసారమ। వ్వారిగఁ జూచి దానిప్రతివర్ణసరద్రసపూరమానఁడ। ద్భారతనైఖరిం దెగడెఁ దక్షిణభాగము లన్ని పూర్తిగా। గోరిచి వేగమంపుఁడిద గోరెదఁ దిర్పతి వేంకటేశ్వరా.
18-11-12, సోమవారం. గుంటుపల్లి గోపాలకృష్ణయ్య.

---

అయ్యా !

తమరు చేసిన గీరతము చాలాబాగావున్నదనిన్ని, మిక్కిలి రసవంతముగా వున్నదనిన్ని, మీవాక్కు ఆనేసరస్వతికి ఈగ్రంథము ముఖ్యస్థానమనిన్ని వింటిని.

చర్ల సూర్యనారాయణవ్రాలు.

---

(1)...గీరతము 1 ప్రతిన్ని... ఈ నాల్గుప్రతులు వీ. పీ. గా పంపవలయునని నిత్యయి సమస్కరింపుచున్నాను.

(2) ... గీరతామ్నాయము కడవరకు చదివినాను. యియ్యది కలియుగ భారతమనుటకు యేమిన్నీ సందియము లేదాయెను.

పేరేచర్ల హనుమంతరాజువ్రాలు, ది 6-9-1912.
కాకాని, సంతమాగులూరుపోస్టు.

* శా. నీమేనత్త కొమారుఁడే తెలిపె? వానింగూడ నా బందు వం
చేమేనిన్ లిఖియింప నేరుతువె? మీకృష్ణుండు నీతండునున్
సామాన్యంబుగ నన్నదమ్ములనుచున్; సత్యంబునం దొక్కఁడు
ద్దాముం, డింకొకఁడో? యసత్యమునఁ విద్వాంసుండు శిష్యాగ్రణీ! 213

---

ది 18-9-10.

గొల్లకోట భైరవశాస్త్రి అనేక నమస్కారములు ... యీమధ్య తమరు అచ్చువేయించిన వాదపత్రిక నాకు వినడమందు చాలా కుతూహలముగానున్నది. పిఠాపురములో తమ పత్రికను చూచినవారు చాలా సంతోషించుచున్నారు... ...యీపత్రికయున్న పంపించితే దానిఖరీదులు దాఖలుచేస్తున్నాను.

ఇట్లు విధేయుడు గొ॥ భై॥ శాస్త్రి.

......ఉ॥ వింటిని గీరతమ్మును వేదమె యౌనని ధర్మబోధయం| డుంటిని, వచ్చునెట్లొ యని యో గురుశేఖర! గీరతమ్ము నే| డంటిని వేదమే యనుచు నారసి యో రసవిత్ కవీంద్ర! వా| కొంటిని వీ పి. గా నొకటి కోరిక నా కొకఁడంప మిమ్ములన్.

ఇట్లు
శిష్ట్లా హనుమత్ శాస్త్రులవారి శిష్యుఁడు,
మంత్రాల కామేశ్వరరావు.

---

......శ్లో॥ శ్రీమద్వేంకట రామకృష్ణకవిభి ర్మిథ్యాప్రలాపాత్మకో, యుష్మద్గ్రంథవిమాననాత్మకతయాగ్రంథస్తు యో నిర్మితః, దృష్ట్వాతం బహుధా వినిశ్చితధియా మస్మిన్ప్రజానాంపచ శ్రుత్వా కించిదపి, ప్రవక్తుమలస స్తద్గీరతా దర్శనాత్॥ శ్లో॥ యుష్మన్నిరాఘాట కవిత్వధాటీ, సముత్థితాఖండయశోఝరీం తాం, సభాసువిస్తారయితుం మనో మే, నిరీక్షితుం కాంక్షతి గీరతంచ॥

ఇట్లు తమ విధేయుడు, మేడవరం సుబ్రహ్మణ్యశాస్త్రి,
కర్నూల్ జిల్లా, మార్కాపురం తాలూకా, యెర్రగొండపాలెం

* ...తమ గీరతామ్నాయము అనేకమార్లు నేను చదివియున్నాను. దాని శైలి యిట్టిదని వర్ణించుటకు తగినంత సామర్థ్యం భగవంతుడు యివ్వలేదు...చప్పట్లపర్వములో మా సూర్యనారాయణశాస్త్రులను నాటి అల్లరికి అంతకీ కారకుడుగా వ్రాయించినారు. అది అన్యాయమని నేను దలచుచుంటిని. అతడు వెంకట్రామయ్యవలె తమకు చిరకాలపు శిష్యుడు కాకపోయినను మా రామకృష్ణమ్మంత శిష్యుడు

ఉ. వేదుల రామకృష్ణునకు వేదులవారును, జర్లకున్ స్వదా
యాదులును విరుద్ధులయి యర్భక! సత్యము తెల్పఁ బూను టు
న్మాదము పుట్టికా; దది ప్రమాదములోఁ బడు వారిఁబట్టి దు
ర్వాదము చేయు టొప్పదని వారు తలంచుట నమ్ము పుత్రికా! 214

చ. ఒకఁ డెవఁడో వివేకవిరహం బుదయించిన నంతమాత్ర స
త్ప్రకరపరంపరాజనిపదంబులు వంశము లప్రతిష్ఠచేఁ
గకవికఁ గాంచఁబోవనుచు గట్టిగ చాటుట కున్నమాట వా
రకుటిలచిత్తులై దెలిపి రంచు జగంబు గ్రహించుఁ గావుతన్. 215

---

కాకపోడు. వీరుభయులున్నూ మీయందున, మీకవిత్వమందున, విశేషమైన భక్తి కలవారైనను, మా పెత్తండ్రిగారి అబ్బాయి యిటువంటి భక్తిలేనివాడుగా మీకు కనుపించుచున్నాడు అతనిని గురించి నేను వ్రాసినను వీలులేదు గాని నిజానికి అంతరంగమునందు మీరన్నా, మీకవిత్వమన్నా, ఇప్పటికిన్నీ భక్తిగలవాడే అని నేనేకాక మా గ్రామమంతా కూడా యెరిగిన సంగతియే, మా సూర్యనారాయణశాస్త్రియో మీవిషయమై యెప్పుడుగాని, యేవిధమైన చెడుప్రసంగమూ చేసినవాడుకాడు యితనిని శృంగభంగంలో సీసపద్యంలో సాక్షిగా వేసుకున్నను సమయంవస్తే నిజంచెప్పేవాడే కాని వేరు మోస్తరువాడు కాడు, యితడేకాదు వాళ్లు వ్రాసిన సాక్షులంతా ప్రమేయంవస్తే, ఆవేళను జరిగిన పని తప్పుడుపని అనిన్నీ దానికి ముఖ్యకారకులు మా రామకృష్ణమ్మ మాట అటుండగా, శ్రీవ్యాసమూర్తిశాస్త్రులు గారి తమ్ముడువల్లనే అని మా గ్రామంలో చెప్పనివారు వక్కరు వుండరు. యిట్టిస్థితిలో మా సూర్యనారాయణశాస్త్రి ముఖ్యకారకుడు అని తాము అభిప్రాయపడుట అతనికిన్నీ నాకున్నూ చాలా విచారముగానున్నది. యీ సంగతి అతడు చాలాసార్లు నాతో ముచ్చటించినాడు. శృంగభంగము తప్పడుకూతలు అయినప్పటికిన్నీ అతడు అచ్చునకు తీసుకొనివెళ్లుట, అనాలోచన పనిగా తమరు నమ్మవలెను, ఇటీవల అవధానములలో తమరిని గురుస్తుతిగా నుతించినాడు. ఆపద్యము నాతో చాలాసార్లు వినమని చెప్పినాడు. - గ్రంథములు ముందు అచ్చులోనున్నవి, చూడగలరు. ఆరెండవనాటి అల్లరిసభలో కాకరపర్తి వెంకటశాస్త్రియున్నూ; నారాయణశాస్త్రిగారున్నూ, వీరికి సంబంధించిన వారున్నూ కాక మిగతా వారియుద్దేశం కల

చ. ఎఱుఁగని వారి కన్నుల నెఱేటే నిను మూరక చల్లవచ్చుఁ; ద
గ్గఱఁగల బంధుజాతపు మొగంబులు మాయఁగనేర; వూరకే
పరుగిడ కిప్పుడేనియు నిబానసనిపించు కొనంగ యత్నముం
బొనరయుము; కృష్ణసత్కవికి బుద్ధిని జెప్పి మరల్పు మర్భకా! 216

---

వారు కారు. మీరుమాత్రం అప్పుడు అంతా దురుద్దేశం కలవారలే అని అనుకొనియుందురు. యిటీవల సత్యనిర్ధారణకు తోడ్పడినవాళ్లను తప్పించుటచే మాకార్యము స్పష్టమవుచున్నది మానూర్యనారాయణశాస్త్రి అల్లాతోడ్పడకున్నప్పటికి దురుద్దేశము కలవాడు కాడు, యితడు మీగీరతంరాకకై యెదురుచూచుచు నన్ను ప్రతిరోజున్నూ అడుగుచుండేవాడు. వచ్చినతరువాత మిక్కిలిగా సంతోషించిన భావ్యకారశాస్త్రి వగైరాలతో పాటితని నొక్కనిగా భావించుచు రెండవకూర్పులో యితనిని సవరించెదరని నమ్ముదును...... మరుదినమందు పశ్చాత్తాపపడని వారేలేరు, ఒకనాడు మా రామచంద్ర పెదనాయనగారు, మా రామకృష్ణమ్మను చీవాట్లువేయుగా నేనువిన్నాను. యెవళ్ళు యెంతదాచుకున్నా సంగతులు తెలియకపోవు కోకిలకాకములో 'కావు, కావు, కావు, కావు, అను కల్పనయె యిప్పటికిని మీ కవిత్వమందు వాళ్లకు భక్తి కలదని చెప్పుచునేయుండును. సీ॥ ఇవి రాజసుతులు చేయవలసిన పనులు కావు కావంచు గాకమ్ములఱచె' అను బుద్ధచరిత్ర సీసపద్యమును జూచినవారికి విస్పష్టమే, లోకములో సత్యమును గ్రహించేవారు పలువురు వున్నా అనృతపు వ్రాతలు వ్రాసేవారు వ్రాయకమానరు. పేమవరంలో తమకు జరిగిన సన్మానమును తమకు అక్కడ జూపిన అసాధారణశక్తియు ఒకవిద్యార్థి అక్కడ స్వయంగా చూచివచ్చి మావూరిలో నాకు చెప్పినాడు. శ్రీశీతారామశాస్త్రి, మరియు మొదలైనవార్లు చాలాసంతోషించినారు. ప్రచారించే కూటములో వారు గూడా కొంతమంది నావద్దర సంతోషించినారు. యీటీవల నేను యేలూరు వస్తిని అక్కడ ఆంధ్రపత్రికలో కామేశ్వరకవి వ్రాతచూస్తిని, ఆవ్రాతకున్నూ నేనువిన్నదానికీ సంబంధములేదు. ఆ వ్రాతలు ప్రకటించిన పత్రికాధిపతి తెల్వితేటలను గూర్చి నాకు చాలా విచారకరమైయున్నది. ఎప్పుడున్నూ దుర్మార్గులు చెడుపనులు చేస్తూనే వుంటారన్నందులకు, ఆవ్రాత దృష్టాంతముగా యున్నది. యీవ్రాతల నిజము మావాడు యెరిగివుండి కూడా యేదో పేరుపెట్టి ప్రకటిస్తూయుంటాడు, యిట్టి వ్రాతలవలన గాని పట్టికోతల వలన

చ. సకల మెఱింగి నా కపయశం బొడఁగూర్పఁగ నెంచి నెత్తిదు
ష్ప్రకటనముల్ పొరింబొరిఁ బత్రిక నించెదె? కొండవీటివా
రికి మఱి బాసటయ్యెదె? యరిపత్రికరంబు లిఖించు దుర్వచః
ప్రకరము పాత్రమందుఁ గొని ప్రల్లదముల్ లిఖియింతువే సుతా! 217

ఉ. పుట్టినదుత్తమాన్వయము, పోయి వసించినచోటు ధర్మపుం
బట్టము పీఠికాపురము, పార్థివుఁడో యలధర్మరాజె, నీ

---

గాని మీకీర్తికి యిసుమంతయు లోపంబురాదు ........ బ్రహ్మానందశాస్త్రి వ్రాసినట్టుగా మాగ్రామములో కొంతమంది కోతిమూకవున్నది ...... పుంగవుల కొరకు గుంటూరులో మూడుమాసములు వసించిన మీరు మాగ్రామములో రెండురోజులైనను వసించినయెడల మీవైరులెంతగంభీరులో తెలియక పోవునా, చర్ల చలపతి వ్రాసిన క్షమార్పణ వుత్తరం వల్లనే తమకు గోచరించివుండవచ్చును... పిడుగువంటిది తిరుపతిశాస్త్రిగారి వుత్తరం వచ్చినతోడనే అతనికే కాదు ఆపక్షములో పెద్దతలకాయలకును గుండెజలజనించె... మీధాటికి వారెవరు. వీరెందులోవారు. మహాగజాః పలాయంతే మశకానాంతుకాకథా, యిది పిచ్చుకపై వజ్రాయుధ మన్నట్లు యున్నది. అయిన నది ఒకమిషచేసుకొని మీరు మాబోంట్లందరికి గురుశిష్య ధర్మాలను వుపదేశించుటచే లోకోపకారమని చాలామంది పెద్దలెల్లరు నుడువగా నేను విన్నాను. మీగీరతమునుజూచి నారాయణశాస్త్రికూడా సూర్యనారాయణశాస్త్రితో 'నిన్ను కారకునిగా వ్రాసినారు. గాని యింతచేసిన మమ్ము యేమియు దూషణవ్రాత వ్రాయనేలేదు గదా. బాగుగానున్నదే' అని వకనాడు అనివున్నాడు ... రెండవ కూర్పులో సూర్యనారాయణశాస్త్రిని తప్పక నిరపరాధినిగా సవరణచేస్తారని నానమ్మకము యివియే అనేక నమస్కారములు.

సామవేద్దు సూర్యనారాయణావధానులు వ్రాలు
సాకిన్ కాకరపర్రు.

---

క్షేమము, ఆశీర్వచనములు.

మీరు మావూరు వచ్చినప్పుడు ఇంకా వుంటారుకదా అనుకొన్నాము. వెంటనే వెళ్ళిపోయినారు. మీరు యెంతగొప్పవారయినను బంధువులను అనాదరించడము న్యాయముకాదు. మావూళ్ళో యెవళ్ళో అల్లరిజేసినారని మేమంతా

కిట్టిదురూహ పుట్టుటకు హేతువు గానఁగలేక సారెకున్
గట్టితి నిన్ను పద్దెము లఖండయశమ్మును నీకొసంగితిన్ 218

ఉ: "ఎంతటివాఁడొ శిష్యుఁ? డతఁ డెంతటివాఁడును గాఁడయేని దు
ర్దాంతుఁడు వేంకటేశ్వరుఁడు 'తన్నుఁ దలంపఁ' డటంచు నింతగాఁ
జింత వహించునే? మఱియుఁ జెప్పనె భారతమంత గ్రంథ" మం
చెంతురు లోకు; లట్లయిన నేమి, కృతార్థుఁడవైతి పర్భకా! 219

ఉ. ఎందఱు శిష్యులో కడు నహీనునిగా ననుఁ గొల్చుచుండ నీ
యందునె పట్టు పట్టుటది యారయ నీదు పురాకృతంపు భా
గ్యం దిరగాక యిందు నొక హేతువు గల్గునె? ధన్యమూర్తి వీ
వందఱు శిష్యులందునను నర్భక! సందియ మిందు లేదు సూ. 220

ఉ. "శృంగపు భంగమున్" గని యిసీ! యని కొందఱు రాజమౌళు లీ
వెంగలివ్రాఁత వ్రాసిన ప్రవీణుల ప్రశ్నను సత్యభామహో
త్సంగమునందుఁ జాత మని జాబును మీకు లిఖింపనెంచి న
న్నుం గని పల్క, వారల ననుంగుల నేను మరల్చితిం జుమీ. 221

(9) సంకీర్ణ పర్వము.

ఉ. * పాపము! వా రెఱుంగుదురె పాండితి నీయది! వత్తు వంచు ని
న్నోపికఁ బిల్వ నెంచి రెటులో పిక! యీ పొక సాకుపన్ని యా

దానిలో వాళ్లమే అని వూహించి మామీద శీతకన్నేయుట ధర్మముకాదు. రామకిష్టమ్మ వ్రాసిన తప్పుడువ్రాతకు మావూళ్లో పెద్దలెవ్వరూ హర్షించడము లేదు. రామకిష్టమ్మ తండ్రిగారుకూడా కొడుకుచేసిన తప్పుపనికి చాలా నొచ్చుకోవడము నేను వినియున్నాను తండ్రే మెచ్చుకోనప్పుడు యితరులు మెచ్చుకొంటారని మీరాలోచించడము తప్పు ఆనిమళ్ల సీతారామశాస్త్రిలు వగైరాలు మీరు వెళ్ళినతరువాత రామకిష్టమ్మ వగైరాలను చాలా మందలించినారు. గ్రామానికి అప్రతిష్ట తెచ్చేపనులు పెద్దలెవ్వరూ సమ్మతించరు. నేను చదువక పోయినా మీకుమీకు వుండే తేడాపాడాలు యెరుగనివాడను కాను.

తాతపూడి భానప్పవాత్రిలు.

* వృత్తరం...శ్రీశ్రీ...లు ... చిత్తగించినారు. ఇంతమాత్రము చేతను వారిమనస్సుకు తృప్తిగాలేదు. ...సభచేయించి తగు పండితులను ఆహ్వానం

భూపులఁ జిన్నఁబుచ్చెదవు పొచ్చెము పన్నుటకీవు నేరవే ?
దాపున బావ లేఁడె? యిది తజ్ఞులు దక్క జగం బెఱుంగునే! 222

ఉ. కోయిల యెల్లకాల మొకకోటరమందె వసింప, దొక్కటౌ
తీయని మావిగున్ననె గతిం దలపోయదు; మావిగున్నలం
దేయెడ సంచరించు టది యెవ్వ రెఱుంగరె? యొక్కసారి పైఁ
బోయి స్వశక్తిపద్ధతులు పొంపిరివో విహరింపు మర్భకా!

ఉ. కాకులబాధ బాల్యమునఁ గాని యనంతరమందు నుండ దీ
పాకము నీవెఱుంగవొకో ? ప్రౌఢత గల్గిన కోకిలంబుతో
డీకొనవెందుఁ గాకములు డేకకు మూలల, సత్సభాస్థలిన్
బ్రాకటశక్తిఁ జూపుము ప్రపంచకమెల్ల నిజం బెఱింగెడిన్. 224

ఉ. అల్లెదు పద్దెముల్, సరిగ నయ్యవి యుండెడి, సందియంబు లే;
దల్లెడియంతనే జగము లల్లన మెచ్చునె ? యెన్నిశక్తులో
పల్లవితంబులైనయెడఁ బ్రాజ్ఞులు మెచ్చెద; రప్పుగూడఁ గీ
ర్త్యుల్లసనంబు దుర్లభమె యో పిక ! యోపికనెంచి చూడుమా ! 225

ఉ. నిద్దుర వోవువోము, గణనీయము గాని గళంబు, మేటియౌ
పద్దెళ దెల్పుధార, విన వాంఛ జనింపనివాక్కు గాక యే
విద్దియగాని నేర్చిన వివేకులు సత్సభలోనివారలన్
దద్దయు మెచ్చఁజేతు రని దజ్ఞులు దెల్పుదు రీ వెఱుంగవే! 226

ఉ. పెద్దలు వచ్చునక్కొలఁది బిట్టుగ విస్మృతమౌ శరీరమున్,
గద్దఱిమూఁకఁ జూచునెడఁ గంకెడు పెంకెతనమ్ము, వాక్కులం
బెద్దఱికంబుఁ బ్రౌఢిమయుఁ బెక్కుగుణమ్ములు వొల్చు జాణయే
తద్దఁ బ్రపంచపున్నుతికిఁ బాఁ దగు నన్యు లనర్హులే సుమీ. 227

ఉ. పెంకెతనఁ బెంకె, పెద్దమను పెద్దగ నెవ్వఁడు సంచరించునో
లంకకు వాఁడు వోయినను లక్ష్యము లేక జయించి వచ్చు, ని

---

సెదమనినీ వుభయపార్టీలకు పబ్లీకువుత్తరములు వ్రాయించెదమనినీ యీ
త్తరం అందినతోడనే ఒకరోజు శెల్వుపుచ్చుకొని రావలసినదిగా శెలవుయిచ్చి
నందున విన్నవించెదను. ది 11-6-11 (చేవ్రాలు)

శ్శంకుని నాంజనేయు నిట సాక్షిగఁ గైకొను; మాతఁ డెంతయో
పెంకె సురారికోటి యెడఁ, బృథ్వీతనూజ యెడన్ వినమ్రుఁడే. 228

ఉ. ఈ వచియించులక్షణము లిన్నియుఁ గల్గినవా రెందఱో
భూవలయమ్మునం దొకటఁ బొల్పువహింప రొకండొ యిద్దఱో
సూ! వెలయంగలార, లివి చొప్పడెఁ జూ శివరామునం దెటో
దైవవశమ్మునన్; వృథగఁ దజ్ఞుని వానిని దూఱు టొప్పునే. 229

ఉ. దూఱుము నన్ను సారెకును దూఱుకొలంది యశమ్ము నీకు నేఁ
జేరఁగఁజేతు; నూరక ప్రసిద్ధినుటిల్లుచున్న యప్పుడీ
వేరికి నేల జంకెద? విదే యొక విద్దెగఁ జేసికొంటి వా
ఘోరణి మేలు! మేలు! గురుదూఱి యశమ్ము వహించి తౌ బళీ! 230

మ. * "అవధానంబది చేయలేదు శివరామాఖ్యుండు తద్దేశికుల్
శివరామున్ గవిఁ జేసి వారె పనులన్ చేసెతఁ గావించి" రం
చు వివేకం బలరార వ్రాసితి వహో! శుంఠల్ ప్రసంగించు దు
ర్వ్యవసాయంబులు నీకు సాక్షులొకో? నీవన్యానికిన్ మాఱెదే. 231

చ. అతఁ డతిధర్మతత్పరత నాఱడికూఁతలు సైఁచినాఁడు; ప్రా
జ్ఞతగలవాఁడవే నతనిప్రజ్ఞ గనుంగొను; మింతయేల ధీ
యుతుఁ డతఁ డొక్క పద్దము నొహో యని లోకము మెచ్చఁబోదు, నా
చతురత నీకె కాదు చుమి సాక్ష్యము గా దది యెట్టిదిట్టకున్.

చ. అతనికి నీకుఁ బోల్కి యగు నంచును దజ్ఞుఁ డెవండు గాని సూ
నృతమును బాడుసేయని మనీషియొయేని వచింపఁబోఁడు; నీ

---

(అట్టహాసమునుండి)

*......కృష్ణ— ఇప్పుడు తిరుపతి వేంకటకవులు తమపుస్తకముల జాబితాలోఁ గలిపి ప్రకటించి యమ్ముకొనుచున్న యవధాన మదియేనా యేమిటి!

దేశమాత— ఔను. అదియే. మొదటనుండియూఁ బాపము! వారు దాని విషయమై చాల శ్రమ పుచ్చుకొన్నారు.

కృష్ణ — సరే! తెలిసినదిలే. శివరామశాస్త్రిగారనఁగా వీరాలో వ్యాఖ్యాన కర్తయేనా?

ఆంధ్రకేసరి — (పరిహాసించుచు) ఆఁ. ఆఁ. ఆయనయే (చెవిలో) ఇట్టి ఓటులు.

కుతుక మదెట్టి? దెవ్వఁడును గోవిదుఁ డుండనెకూడ దొక్కొ? నన్
బలితుఁ డటంటి సమ్మతమె, ప్రాజ్ఞుల నన్యుల దూఱనేటికిన్ ? 233

ఉ. చూడుము శక్తిహీనుఁ డున్నయెడ సూరిహితం బగు సత్సభాస్థలిన్
వాఁడె ఘనుండొ? నీవు మఱి బావయు వానినిమించు మిన్నలో?
రాఁడనుకొంకు రాఁగలఁడు రమ్మన, వచ్చెదవేని దానికిన్
గాఁడు పరాఙ్ముఖుండు సరిగా లిఖియింపుము జాబు దీనికిన్. 234

ఉ. *కాఁకరపత్రి రమ్మనెదొ? కాఁకరపత్రికె వచ్చు, శృంగభం
గాకలనంబు సల్పఁగల యయ్యలు తోడుగ నీవు బావయున్
దాఁకఁగ నేర్తురే యతని? నాలుక వచ్చిన యట్టులెల్ల నె
ట్లోకలహమ్ము సల్పెదరె! యోగ్యులు లేరె! నిజమ్ము తెల్పఁగన్. 235

ఉ. మానుఁడు వ్రాత లింక, నవమానపువ్రాఁతలు వ్రాయు దొంగదు
ర్మానుల నెల్లఁ బట్టుకొనిరాఁదగుశక్తిని దేవుఁ డిచ్చెఁ జూ!
సూనృత మాఁగ శక్యమె? సుషుప్తిని లోకము సర్వదా రతిన్
బూనదు, మేల్కొనున్ నిజము పూర్తిగఁ దానెఱుఁగుంగ్రమమ్మగన్.

ఆ. వె. పత్రికాధిపతులు 'బాబో! ప్రమాదమం'
చన్నవ్రాఁత నూని యనృతకల్ప

---

(తాలుకుట్టనమునుండి.)

*చ॥ శివుఁడనొ లేక రాముఁడనొ చేసెదనోమఱి చేయలేనొ నా, కవనముచూడఁగాఁ దలఁపుగల్గిన జాబులిఖింపుఁ డూరకే, సువిసువిఁ గ్రిక్కి పద్దెముల నూరులు నవ్వ లిఖింపనేల? యే, కవితయొ తేరగా నొకటి గల్గుటకున్ ఫలమిట్టి దానొకో? మ॥ సభకున్ రావలె నోరువిప్పవలె మీసామర్థ్యముం జూపి వాగ్వైభుతన్ గాంచవలెన్, వృథాగ నొక చక్కిన్ దాఁగి నానాఁట రాసభముల్ గోఁకిన పాడువ్రాఁతలకు దాసత్వమ్ము గావించు మీకు భయంబా? మఱిభక్తియా? యరకెటొ ఘోషింతురిచ్చాగతిన్. ఉ॥ వచ్చెదరమ్మటన్న నృపవల్లభు నాజ్ఞను బొంది మీరలే వచ్చిన నింతకన్నను శుభంబిటుసేయుఁడు లేదయేని యే, పిచ్చియొ వెళ్లఁ గ్రిక్కకుఁడు పెద్దలు నవ్వుచున్నవారు మీ. కుచ్చితవుం బ్రసంగములకుం జెవియొగ్గఁడు ప్రాజ్ఞుఁ డొక్కఁడున్ (విస్తరమాగ్రంథమునందే చూడఁదగు)

నములు చేయుబాపనాలుక కొకచంద్రి
హార మిత్తు, నెదుటి కనుపఁగలనె ? 237

చ. కల దొకకొంత తెల్వి, యది గాదని నేనన, నంతమాత్రచే
నిల సకలమ్ము మోసమున నే మునిఁగింపఁగ నెంచి యేదియో
గిలుకుచుఁ * "జేటభారతము" గీరతధోరణి నద్దునంచు వా
క్కులు ప్రచురింప నేల? వినఁ గూడనిపోకలు కట్టిపెట్టుఁడీ! 238

చ. తిరుపతివేంకటేశ్వరుని దిట్టుచుఁ జెప్పినయట్టిపద్దెముల్
గురువరు నింద సల్పినను, గొండొక చక్కఁగ నున్నవంచుఁ జె
ప్పిరి వినువారు, తిట్టినను బిప్పికవిత్వము కాదుగాన వా
విరి నవి బైటఁబెట్టుఁడు, ప్రవీణత కయ్యవి సాక్ష్య మిచ్చెడిన్. 239

ఉ. తిట్టిననేమి? నన్నరక దేవునిఁ జేసితి వంట! దాన నో
దట్టుఁడ! దేశికత్వమును దాఁటినమేల్పద మబ్బఁజేయు నా
తిట్టులు నాకు దీవనలె, తిర్పతివెంకనపేరు నాకు మున్
బెట్టిన యందు కీవు సరిపెట్టితి వంచు నుతింతు నిన్నిఁకన్. 240

ఉ. ఊరక యిచ్చినన్ గొనని యొప్పనిచప్పనికూఁత లెల్ల నె
వ్వారలొ "కర్చు" లిత్తురని వారక యచ్చునఁ గ్రుచ్చ నేల? దు
ర్వారరసప్రసారగుణబంధురదివ్యతరప్రబంధసం
సారులు గండు, వర్ధిలుఁడు, జాడ్యము మాని సుఖింపుఁ డింపుగన్. 241

ఉ. బీజము లేని వ్రాఁతలవి పెంపున హింపవు; మీకు బీజ మే
యోజ ఘటిల్లు? 'మే మురకయున్న గురున్ దిగఁద్రావి తిట్టఁగా
నాజడుఁ డూరకుండక యహంకృతిఁ జూపె' నటందురోటు! వీ
బీజము దెల్పినట్టులె వివేకులకున్ బొడకట్టెడిన్ జూఁడీ. 242

మ. యతులున్ బ్రాసలు వెట్టి యెట్టులొ కవిత్వాడంబరం బూని తి
ట్టితిరే యందము, దాన లాభ మది యొల్లేఁ గల్గఁగాఁబోదు; పం
డితు లాధోరణి మెచ్చ్రకొన్న, నల గోష్ఠిన్ సత్యవాక్ప్రౌఢికి
వితతప్రాజ్ఞత చూపకున్న వితయా వేయేల? చాలింపుఁడీ! 243

*... మనపిఠాపురపు వారు "చేటభారత" మొకటి వ్రాయుచున్నారట! ...
6-2-12 సుందరరావు

ఆ. వె. రాళ్లబండి శతవధాని వ్రాసినట్టి
పద్యముల సారమును మదిఁ బట్టుకొల్పి
త్రోవకున్ రండు; దేశికద్రోహచింత
వలనిదోసంబు ననుతాపభరము మిగ్గుంగు. 244

తే. గీ. ఏమి సార్థక్య? మేదియో యీవు వ్రాసి
వెంటనే యేను ఖండించివేసినంత;
సత్యమె జయమ్మునిచ్చు, యశమ్మునిచ్చు
సత్యమునఁ బొమ్ము మంచి యశమ్ము గొమ్ము. 245

ఉ. వెంకటశాస్త్రి నేరొ యవివేకులు తిట్టి రటంచుఁ గాని, యే
శంకయు సత్యభాస్థలిని గొట్టె నటంచును గాని యెవ్వఁడో
జంకక వ్రాయ నయ్యది యసత్య మటంచుఁ దలంపకుంటయే
పంకము, నమ్ముచో మూద మపారముగాంచుట చెప్పనేటికిన్! 246

తే. గీ. శత్రునకు నేని యూదపి సైఁపరాదు
పైని సంతసపడు టెంత పాతకంబు ?
పరమశత్రులు గిలికెడి పాడువ్రాఁత
లౌర ! పుస్తకమంచు వ్రాయంగఁ జనునె? 247

తే. గీ. అంతయో యింతయో యక్షరాస్యులైన
మీకుఁ బారమ్ము లేని నామీఁద నక్ష
రములె నేరని వారేమి రాఁ దలంతు ?
రింతమాత్రము తెలియ వింకేమనంగు. 248

క. మిముఁ బట్టి కొప్పరము కొ, ప్రముఁబట్టియు మీరు తప్పువ్రాఁతలు గిలుకన్
శ్రమ మొకటి దక్కె వెంకన, కమరునొకో యప్రతిష్ఠ యరయఁడికైనన్.

క. బ్రహ్మోత్సవములతోడన్, బ్రహ్మండం బగులుకీర్తి ప్రబలించెనే యో
జిహ్మగులారా ! మీ 'యం, బ్రహ్మ'తకు విచారమేల పడవలె నకటా !

శా. మీయజ్ఞానము కొప్పుఁదెలివియున్ మేల్గూర్చెడి న్యాయమ్ము, మీ
రాయాసం పడకుం డసత్యములు వ్రాయంగా ప్రయత్నింపకుం
డోయీశిష్యుఁడ! "వేఁడినీళ్లకు గృహం బొక్కింతయున్ గాల" దా
హా ! యజ్ఞానపుటట్టహాసములగు ర్వ్యాపారపాకీణతల్. 251

ఆ. వె. అట్టహాసమంట! అడ్డాని నిండఁ ద
ప్పుడు పరిసంగమంట! పుడమి తేఁడు
చూచియుండఁడొక్కొ? చూచియు వారింపఁ
డొక్కొ? చూడఁడనుటె యొప్పవలయు. 252

ఉ. చూచిననూరకుండఁ "డిది శుంఠప్రసంగము మానుఁ" డంచు బి
ట్టేచి చివాటులన్ గొలుప కెట్లును మానఁడ, ప్రాజ్ఞుఁడై యెటుల్
నీచత సమ్మతించు? నవనీపతి నిక్కము చూచియుండఁ డీ
తోఁచియుఁ దోఁచరాని నుడి త్రోవలు తేనికిఁ జూడ నేటికిన్! 253

చ. ఎవరు చివాట్లు పెట్టఁ బని యేమి? గురుండను నేనె చాలు, దు
ర్వ్యవహృతి ఘర్త్రిగా నెఱుఁగు పండితమండలి చాలు, బుద్ధి చె
ప్పపలసివచ్చినన్ గురుఁడుఁ బండితవర్గము, వీరిపైని బా
ర్థివుఁడు వచింపఁగావలయుఁ; దేఁకువ గల్గిన వీరె చాలరే? 254

ఉ. తప్పుడు వ్రాఁతలందును "శతఘ్నిని" వ్రాసెడునంతదాఁక వ్రా
భొప్పఁగఁ జేసితీ; విపుడొ యొక్కఁడె బావయ చేయుచుండె; నీ
కిప్పుడు బుద్ధివచ్చినదియే? వచియింపు "శతఘ్ని" యూరకే
'ట'ప్పని ప్రేలి పాశుపత ఘాంకృతి కుప్పునుగాక ప్రమగ్గుటన్. 255

ఉ. నీ కటు బుద్ధివచ్చుటయె నిక్కమయేని వచింపు మింకఁ బె
న్వ్రేఁకఁ జరించు బావకు వివేకము గూర్ప యతింతుఁగాక! యా
కాఁకరపత్తివాసికి నఖండమృషావచనప్రతాపికిన్
బ్రాకటధర్మముల్ పలుకు పద్ధతి వేఱుసుమా! కుమారకా! 256

ఆ. వె. అకట! పాశుపతము నడఁపఁ బరాస్త్ర పా
శుపతమునుచునొక్క "శొంతికాయ"
వ్రాఁతఁ వ్రాయు బావ వైఖరి గనియు నీ
వేలయూరకుంటి వెఱుఁగఁ జెపుమ? 257

క. అందుఁగల యనృతధోరణి, "సందేహము లేదు బావ శాబ్దికజీవా
నందుని" సారము తేల్చెడి, నెందుల కా పిచ్చివ్రాఁత లెఱిఁగింపు సుతా!

శా. ఏదో వ్రాసెడివానిపోల్కి నెదియో యింతింత వంపంగఁ బై
"నేదో వచ్చుఁగదా?" యటంచు నకటా! కృష్ణాఖ్యపత్రింబు గై వ

క్కో దూఁకెన్, బయి సిగ్గిలెన్ జుమి; వృథాకుంఠీభవచ్ఛౌర్యరే
ఖాదార్భాగ్య వచఃప్రచారకలనాగర్వాంధ్య మిట్లుండునే! 259

ఆ. వె. 'వ్రాఁత యట్టులుంచు పాశుపతమ్ముపైఁ
బాలు పేరునీకుఁ బట్టుపడెనె?'
అంచు బావతోడ నాడు మీ! నాకునై
గురుని కింత సలుపు చరణసేవ. 260

క. ♦ బావ పచనములు వినకుము, భావవచనములను వినుము బాగుపడుము సం
భావించి భవుఁడు చెప్పిన, భావుకవచనములు భావవచనములనఁగన్. 261

గీ. అల్లకృష్ణుండు సంధికి నంకనీక
పార్థుల నపార్థుల నొనర్చె; బాపమఱఁది
యంచుఁ గృష్ణునిబోధల నాలకించి
తాదృశుఁడ వీవు కాకు వృథావిధముగ. 262

ఉ. అన్యులతోడ మాకు నెపుడైనను వేరొకకారణమ్మునన్
జన్యము సంభవించునెడ సాయము వారల కాచరించి నీ
వు న్యశమున్ గలంచుటకు బుద్ధిని ద్రిప్పితి వెంత వెఱ్ఱివో?
ధన్యత లేనివారలను ధన్యులఁ జేయఁగ నీకు శక్యమే. 263

మ. ఒకచో గుంటురి కీవు పోదువనుకో మ్మొత్రిశిష్యుండ! తా
ళకునై వారలు నిన్ను నిట్టిగతిగాఁ గారింప యత్నింత్రు; నీ

---

♦ స్కాందోత్తర ఖండస్థగురుగీతనుండి.

శ్లో॥ అత్రినేత్రశ్శివస్సాక్షాద్ద్విబాహుశ్చహరిస్స్వయం, అచతుర్వదనో బ్రహ్మాశ్రీగురుః కథితః ప్రియే... శ్లో॥ గురోః కృపాప్రసాదేన బ్రహ్మావిష్ణుమహేశ్వరాః, సామర్థ్యమగమన్ సర్వే కేవలం గురుసేవయా... శ్లో॥ నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం, శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనతః॥...శ్లో॥...గురునిందాంకరోతియః, సయాతినరకాన్ ఘోరాన్ యావచ్చంద్రదివాకరౌ॥...శ్లో॥ "హుం" కారేణ నవక్తవ్యః ప్రాజ్ఞైశ్శిష్యైః కదాచన, గురోరగ్రే నవక్తవ్యమసత్యంతు కదాచన, గురుం త్వం కృత్య హుం కృత్య...సభవేద్బ్రహ్మరాక్షసః॥ ...శ్లో॥...కాలమృత్యుభయాద్వాపిగురుస్సంత్రాతిపార్వతి॥ ... శ్లో॥ గురుదేవార్పణం యత్తు తేనతుష్టోస్మి సువ్రతే॥...

కకటా! దిక్కెవ్వఁడున్నె? నాకొ? మఱి నీవా! కాదు, నీవంటి వా
రొక వేఱైనను లెక్కలేదుసుమి యోగ్యుల్ పండితుల్ స్నేహితుల్.

ఉ. వారలె లేకయున్నయెడ వాండ్రును నీవును గూడి దబ్బఱల్
సారెకు వ్రాసి యిట్లయిన సాయము వట్టఁ బో; రసత్యపున్
భారము మోయుప్రజ్ఞగల పండితులౌ కతనన్ యథార్థవి
ద్యారసికుల్ భవత్కృతుల నడ్డుము రేమియొనర్ప నేర్తువో. 265

ఉ. కావున నిప్పుడేనియు వికారపుఁ జెయ్వులు మాని ప్రాజ్ఞులౌ
ధీవరు లాడుపల్కులను దెల్లముగాఁ దలపోసి సత్యపుం
ద్రోవను రమ్ము, నిక్కమగు ద్రోహము నీ వొనరించియున్ ఋజు
శ్రీ విలసిల్లు హేతువున శిష్యుఁడ! మంచియశమ్ము గల్గెడిన్. 266

క. మనువచనమ్ములు విని తగ, మను, మనువచనములనంగ మనువచనము లే
మనుకొంటివో? మనుమార్గ, మ్మనుమాన మ్మడిగి పట్టు మది యఘము మడఁచున్.

మ. ‡ త్రివిధేయుండవు త్రిలోకజేతయనుచున్ "త్రిష్వప్రమాద్యన్" మను
ప్రవచస్సారము తెల్పు నీవు కడగా సత్రిల్లుచున్నట్టి యా

---

...శ్లో॥ గురోః పరతరం నాఽస్తి త్రివారం కథయామి తే। ధన్యా మాతా పితా ధన్యో గోత్రం ధన్యం కులం భవం, ధన్యా చ వసుధా దేవి యత్ర స్యాద్గురుభక్తతా ఆకల్పజన్మకోటీనాం యజ్ఞవ్రతతపః క్రియాః. తాస్సర్వాస్సఫలా దేవి గురుసంతోషమాత్రతః... శ్లో॥ ఏకాక్షర ప్రదాతారం యో గురుం నైవ మన్యతే, శ్వానయోనిశతం గత్వా, చండాలేష్వభిజాయతే॥ ... శ్లో॥ సప్తకోటిమహామంత్రా శ్చిత్తవిభ్రమకారకాః, ఏక ఏవ పరో మంత్రో గురురిత్యక్షరద్వయమ్...... శ్లో॥...కవిత్వాది గద్యం సుపద్యం కరోతి, గురోరంఘ్రియుగ్మే మనశ్చేన్న లగ్నం తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ (విస్తరస్తత్రైవ ద్రష్టవ్యః).

‡ శ్లో॥ త ఏవ హి త్రయో లోకా స్త ఏవ త్రయ ఆశ్రమాః, త ఏవ హి త్రయో వేదా స్త ఏవోక్తా స్త్రయోఽగ్నయః॥ ౨౩౦ పితా వై గార్హపత్యోఽగ్ని, ర్మాతాఽగ్ని ర్దక్షిణస్స్మృతః (గురురాహవనీయస్తు) సాఽగ్నిత్రేతా గరీయసీ॥ ౨౩౧. త్రిష్వప్రమాద్య న్నేతేషు త్రీన్ లోకాన్ విజయేద్గృహీ॥ ౨౩౨. (మనుస్మృతి ద్వితీయాధ్యాయము చూ)

(అభియుక్తోక్తి)

శ్లో॥ లజ్జామేకాం పరిత్యజ్య త్రిలోకీవిజయీ భవేత్॥

హవనీయాగ్నిని గాలఁ ద్రొక్కియును వత్సా! మూఁడులోకమ్ము లా
హవరంగమ్మున గెల్చుటన్ పృథయ ధర్మాధర్మ దుర్మర్మముల్. 268

శా. † ఆజన్మంబు గురున్ భజించునెడ బ్రహ్మప్రాప్తికర్హుండుగా
యోజించున్ స్మృతివాక్యముల్, వృషయసుమ్మో వత్స! యామ్మాట; నీ
కీజన్మమునఁ గొంత సేసయును 'హీహీహీ'లు 'హూహాహూ'లు త
ద్రాజద్బ్రహ్మసమాజమాన్యతకుఁ బాత్రత్వమ్ముఁ జేకూర్చుటన్. 269

మ. * తనయార్జించిన క్షేత్రముఖ్యధనముల్ దాతవ్యముల్ ముందుగాఁ
దన యాచార్యునకంచుఁ జెప్పు స్మృతి, తద్ధర్మంబు గన్పట్టె నో
తనయా! నీయెడ; నెట్టులన్న, విను దుర్ధర్మంబుత ద్విత్త మా
త్తనయా! నాయెడఁ దొల్త నీవు వినియుక్తంబౌట సూచించుటన్. 270

శా. ‡ ఛాత్రిస్వార్జితవిత్తమందు నొక షష్ఠంబంశముల్ గైకొనం
జాత్రుండంట! గురుండు వింటివె? భవత్ప్రీ జ్ఞార్జితాచార్యదు
శ్శతుత్రిత్వాఖ్య ధనంబు సర్వమును నస్మత్స్వాత్కృతం బయ్యె; నే
పాత్రంబో యిడ కంతయున్ బేరము నిమ్మాడ్కిన్ గురున్ జేర్తురే. 271

మ. ♦ శ్రుతిదూరంబయినన్ స్మృతిన్ దపితె నెచ్చో నిషిద్ధితుల్ "నిత్యము
ద్ధృతపాణిర్భవము" చెప్పెఁగా? మనువు, నీధీమత్త చే దాని నా

---

† శ్లో॥ ఇమం లోకం మాతృభక్త్యా పితృభక్త్యాతు మధ్యమం, గురుశుశ్రూషయా త్వేవం బ్రహ్మలోకం సమశ్నుతే॥ ౨౩౩. శ్లో॥ ఆసమాప్తేశ్శరీరస్య యస్తు శుశ్రూషతే గురుం, సగచ్ఛత్యంజసా విప్రో బ్రహ్మణ్యస్సద్మశాశ్వతం॥ ౨౪౪ (మనుస్మృతి ద్వితీయాధ్యాయము చూ॰)

* శ్లో॥ స్నాస్యంస్తు గురుణాజ్ఞప్తశ్శక్త్యా గుర్వర్థమాహరేత్, క్షేత్రం హిరణ్యం గామశ్వం ఛత్రోపానహమాసనం, ధాన్యం శాకంచ వాసాంసి, గురవే ప్రీతి మావహేత్ ౨౪౬ అతివ్యాఖ్యా॥ స్నాస్యన్సద్గురుణాదత్తాజ్ఞో యథాశక్తిధనివం యాచిత్వాఽపి ప్రతిగ్రహాదినాఽపి గురవేఽర్థ మాహృత్యాఽవశ్యం దద్యాత్॥ (మనుస్మృతి ద్వితీయాధ్యాయము.)

‡ శ్లో॥ షడ్భాగం స్వార్జితం విత్తం కృత్వాఽనందాత్మకో నరః। ఏకంతు గురవేదద్యాత్ ......

♦ శ్లో॥ నిత్య ముద్ధృత పాణిస్స్యా త్స్వాధ్యాయాచారస్సు సంయతః, ఆసతామితి చోక్తస్సన్నాసీతాభిముఖంగురోః॥ (మను ౨. అ.)

ద్రుతముఁ జేసితి; వగ్ర మం డగపడఁ దేలుం జుమీ నీదును
ద్రుతపాణిత్వఫలమ్ము, స్మార్తమతవర్తీ ! నీకగుఁ భద్రముల్. 272

క. ♦భారతవచనమ్ముల మదెఁ, జేరుతమని భావనడును శ్రీరతులుఁ స
ద్ధీరతులు నీదుపద్ధతి, ఘోరతరం బనెడిరీతి గొనకు మిఁకైనఁ. 273

క. గురుశరవహ్నికిఁ గృష్ణుం, డతిమతి భీతివడు ధర్మజాదుల సత్య
స్థిరుల నసత్యంపుమహా, దురితమ్మునఁ ద్రోచె నెఱుఁగుదో యెఱుఁగవో ॥274

---

(భారతాదిపర్వమునుండి)

♦ కశ్చిదృషి ర్ధౌమ్యోనామ ... తస్య శిష్యాస్త్రయో బభూవు రుప మన్యు రారుణి ర్వేదశ్చేతి, సఏకంశిష్యమారుణిం పాంచాల్యం ప్రేషయామాస "గచ్ఛ కేదారఖండంబధానేతి ... యస్మాచ్చత్వయా మద్వచన మనుష్ఠితం, తస్మాచ్ఛ్రేయోఽ వాప్స్యసి, సర్వే ఏవతేవేదాః ప్రతిభాస్యంతి సర్వాణి చ ధర్మశాస్త్రాణీతి ... తంచోపాధ్యాయః ప్రేషయామాస" వతోఽపమన్యో గారక్షస్వేతి ... మయ్యనివేద్య భైక్ష్యం నోపయోక్తవ్యమితి ... భో ఉపమ న్యో క్వాఽసిపన్నైహీతి, స ఉపాధ్యాయవచనం శ్రుత్వా ప్రత్యువాచ ... కూపేపతితోఽ హమితి, తముపాధ్యాయః ప్రత్యువాచ. కథం త్వ మస్మిన్ కూపే పతిత ఇతి, సఉపాధ్యాయం ప్రత్యువాచ. అర్కపత్రాణి భక్షిత్వాఽం ధో భూతోఽ స్మ్యతః కూపే పతిత ఇతి, తముపాధ్యాయః ప్రత్యువాచ అశ్వి నాస్తుహి ... త్వాం చక్షుష్మంతం కర్తారా వితి, ... అశ్వినాస్తోతు ముపచ క్రమే, ... అశ్వినావాజగ్మ రాహతు శ్చైనం, ప్రీతౌ స్వ ఏవతేఽ పూపోఽ శానైనమితి, ... నత్వాహమే తమపూపముపయోక్తు ముత్స హేగురవే ఽ నివే ద్యేతి, ... తమశ్వినావాహతుః, ప్రీతౌ స్వస్తవానయా గురుభక్త్యా,... చక్షు ష్మాం శ్చభవిష్యసి శ్రేయశ్చా వాప్స్యసీతి, ... లబ్ధచక్షుః ... ఉపాధ్యాయ మభ్యవాదయత్, ... ఏషాతస్యాఽపిపరీక్షోపమన్యోః, అథాపరశిష్యః ... వేదోనామ ... గౌరివనిత్యం గురుణాధూర్షు నియోజ్యమానః, తస్య మహతా కాలేన గురుఃపరితోషంజగామ, తత్పరితోషా చ్ఛ్రేయ స్సర్వజ్ఞతాంచావాప, ఏషాతస్యాఽపి పరీక్షా వేదస్య......

(విస్తరస్తుకతైవదంష్ట్రవ్యః)

క. నిజమైనతిట్లు తిట్టుము, గజగజ నీకేల? లేని కార్లనము భూ
ప్రజలు సహింపరు లోలో, * స్వజనంబేనియును దప్పు సైఁపరెఱుఁగుమీ.

క. చదువెఱుఁగఁడనియుఁ, గంటము, మృదువైనది గాదటనియు, నేరికి విద్దల్
గుదిరి వచింపఁడనియు నా? పదరి జగము మెచ్చుగోరు పద్ధతిచెపుమా.

క. 'నాయొద్దఁ జదివినదె' యని, కోయిల నీవాయసంబు గూయుట తప్పా
నే? యరయుమయ్య! బావయె, వ్రాయన్ వలె,నీకుఁ జేయి రాదిటు వ్రాయన్.

క. ఇరువురచే వ్రాయించుట, యరసియు నీ కిట్లు వ్రాయుటది రాదనియే
పొరఁబడితిఁ గొంతకాలము, పరమాప్తుఁడు రామమూర్తి పలికెడిదనుకన్.

చ. తతమతి నీ కతండు పెదతల్లికుమారుఁడు, నాకు మిత్రుఁడు
న్నతుఁ డనృతం బతండు జననంబును బొందిన వంగదమ్మె యా
కృతయుగ మాదిగా నెఱుఁగ; దిప్పుడు నీకయి నేర్చుఁబోదు; సూ
నృతవచనుండు నీకతనసే విని నాకు వచించె నర్భకా! 279

చ. కుతుకముతో నొకానొకటఁ "గోకిల కాకము" నాకవిత్వ మం
చతనికిఁ జెప్పినాఁడఁట! యయ్యది జ్ఞప్తికిఁ దెచ్చికొమ్మ; శ
త్రుతకలిమిన్ వచింపఁడు బుధుం డతఁడేదొ ప్రసంగమందు సం
గతమగుటన్ వచించె నడుగం దగుసందియ ముండెనేనియున్. 280

చ. అనయుఁడవై స్పృహాగ నెపు డాఁడవ్రాఁతలు వ్రాయుచున్ నిజం
బు నడఁచి నేఁటిసేనియు సుబుద్ధికి కాక పరాక్రమించు ని
న్నను సుజనుల్ బొనర్చుట కనుంగుఁజెలిన్ ఘనురామమూర్తి గా
రిని నొక సాక్షిఁ జేసితి నెఱింగి యతండు క్షమింపకుండునే 281

---

రాజమండ్రి.
ది 28-8-13

*...తమరు కాకినాడ వెళ్లినప్పట్లో "లోకములోని కవులందరు నా జంద్యములోనివారు" అని అన్నందుచే యీ అల్లరి జరిగినదనిన్ని పిమ్మట తప్ప అంతయును కాకరపర్తివారిదే అనిన్ని శ్రీ ఆ॥ వ్యాసలింగశాస్త్రులవారు నాతో చెప్పినారు. యింకా కొన్ని సంగతు లున్నవి కాని విస్తరించుటకు స్థలములేక వ్రాయలేదు. ... రామకృష్ణులు ముందు భారతము ప్రచురించెదరట. వారు యెన్ని వ్రాసినను గురుద్రోహమును బలపరచేవే అని శ్రీ, ఆ॥ వ్యాసలింగశాస్త్రి గారు అన్నారు...... చె. కొండయ్యవ్రాలు.

ఉ. అందఱు నాకు బంధుగులె యంచు లిఖించెద వింతసాహసం
బెందుకు? దూరగుల్ బలెనె యింజర కాఁకరపట్టు వారలున్
బొందఁబడంగలారె యిటు బొంకఁగ నేటికి? రామమూర్తి నే
నుందునొ చెప్పుమా యకట? యాతఁడు నాపెదతల్లి పుత్త్రుఁడే. 282

శా. చాడీలన్ వచియించువాఁడొ? జడుఁడో? చండాలపుంబుంత లే
నాఁడున్ ద్రొక్కనివాఁడొ? త్రొక్కఁగలఁడో? నాబోఁటిలెక్కమి యే
ప్రొద్దల్ నెత్తిని బెట్టుకోఁదగిన సత్పుణ్యుండు, గణ్యుండు తా
నాడంబోయెనొకో యసత్యము? కుమారా! నిన్ను వంచింపఁగన్.

శా. ఆడుంబో యనృతంబు నీకొఱకు వ్యాసాకొండి యొడ్డేని, ప్రొ
ద్దాడంగాక మఱొక్కచోఁ బాడమి కామాకొండిచేఁ బ్రిల్లదం
బాడింపంగలదేమొ చూచెదనుగా కంచున్ బరీక్షార్థమై
నేఁ డిచ్చో నొకసాక్షిగా నతని వర్ణింపన్ బ్రిసక్తించెఁ జూ 284

చ. ఘనుఁడల రామమూర్తి యెటుగా లిఖియించిన నెందుఁజేరునో?
తన లిపి యంచుఁ గొంకుఁజుమి తథ్యమెఱింగియుఁ, బెద్దతల్లికిం
దనయుఁడె వేఱొకండిపుడు దా ధవళాద్రి వసించు; నాతఁడున్
ఘనుఁడు తదంబయు న్మ్రగులఁ గందురు నేఁటికి నన్నుఁ బేర్మితోన్. 285

†క. కృతమీవుమఱచితివి నీ, కతనంగద? వారు నాకుఁ గడుఁ గూర్తురు; నీ
కతిశత్రుఁడు వారలకే, గతిఁ బ్రేమాస్పదుఁడొ? తెలుపఁగాఁగలవె సుతా.

క. గురుఁ గాకము గానుడివిన, దురితపువ్యాసమ్ము గాంచి దుఃఖింపక యె
వ్వరొ మెచ్చిరనియు వ్రాసెద, వరరే! యిటువంటియోగ్యు లవనింగలరే.

‡క. శత్త్రులుమిత్త్రులు సైతము, పుత్త్రా! తలయూఁచిరనుచుఁ బొంగెఁగదా! మీ
పత్త్రిక, యూఁచుటకర్థ మ, పాత్త్రవ్యాస మని చేయుపని గాదుగదా?

---

ధవళేశ్వరము, 26-౯-13

† ...శ్రీ మానాన్నగారు శ్రీ మాయమ్మగారు, సదా మీ శ్రేయోభివృద్ధిని కోరుచున్నవారలు. కా॥ నారాయణమూర్తి.

(కవితనుండి)

‡ కోకిలకాకము, ఇది కోకిలమును గాకమును గూర్చిన యొకచిత్రకథ. శత్త్రులు మిత్త్రులుగూడఁ దలయూఁచిన పద్యములు.

క. నీకవితాప్రాశస్త్య, శ్రీకతనఁ గలుగు యశము చెందెడి నను; నీ
కో! కృతముమఱచు పాతక, మే కడకుఁ మిగులు సారమిదియె కుమారా.

క. ఎందుకుఁ బెంచెద పఘుమిది? యందఱకు న్నిజము దెలిసె; నాఁగునె కస్తూ
రిందాఁచినఁ బరిమళమది, బొందఁబడకు నిజమునుడివి పొందుము శుభముల్.

## (10) మంగళపర్వము.

చ. తిరుపతి! నాకు నింతటి విధేయుఁడు శిష్యుఁడు గల్గె వాని సం
చరణము లీశ్వరుఁ దెగడు సాహసమానెడి, పట్టివానికిఁ
గురువన నెంత? తాదృశుని గొండొక యోగ్యునిఁ జేయ వేంకటే
శ్వరుఁ డొనరించె ధర్మపుఁ బ్రసంగ మెసంగు ప్రసంగసంగతిఁ. 231

చ. తిరుపతి వేంకటేశ్వరుని దిట్టి దిసంతులు గొట్టు వానికిం
దిరుపతి! వేంకటేశ్వరుని దిట్టి దిసంతులు గొట్టు టెంత? యే
మఱఁజన దైననుఁ మనకు మంచికిఁ ద్రిప్పు ప్రసంగమేదియో
జరుపుట యొప్పు వాని కిటె సాయముఁ జేసినఁ జేయకుండినఁ. 232

చ. హితము పఠింపఁ దావొసఁగు నెవ్వఁడు వాఁ డెపుడుఁ వినండ; భా
రతమున నేమి, తక్కిన పురాణములందున నేమి, యెవ్వఁడే
హితము గ్రహించె? నట్లని మఱెవ్వఁడు చెప్పుటమానె? చెప్ప నే
చతురుని కోయగున్ గణనసల్పి కృతార్థుఁడు వేఱొకండగుఁ. 233

ఉ. కావున నేరొనర్చినను గష్టము లోకముకోసమే యశ
శ్శ్రీవిమలీకృతోజ్జ్వలదశేషవిశేషదిగంతరాళు లౌ
ధీవరులెల్ల లోకమునఁ దేలవలెఁ బరిశుద్ధలోకసం
భావితులే సుమీ జగతి భవ్యులు సేవ్యులు కావ్యభావ్యులుఁ. 234

ఉ. లోకము మెచ్చగాంచు నతిలోకుని యాదవపట్టభద్రు దు
ష్పాకుఁడు దుర్ణయుండు శిశుపాలుఁడు పట్టుకతిట్టె; దానిచే
నాకటివేల్పు పూజనము లడ్డెనె? సాక్షికలోక మెన్నఁడుఁ
లోకములోనఁ జేర; దరలోకపు శోకము కీర్తికే యగున్. 235

సీ. ఖరముఖాసురకోటి కహకహార్భటిలేక రాముకీర్తికి నట్టిరాణ యెట్లు?
శిశుపాలదుర్విపాత్పశుపస్పశలు లేక కృష్ణుకీర్తికి నట్టి కెలస మెట్లు
కనకకశిపుదుష్టకష్టచేష్టలులేక నరసింహుకీర్తి కాగరిమ యెట్లు?
ఖలనృపాలకహాలాహాలహాళాహళి లేక కల్కికీర్తికి నట్టి కలిమి యెట్లు?

తే. గీ. ఎంతవాఁడేని విమతులొక్కింతసాయ
మాచరింపక పేరెక్కఁడట్టులగుట
నిరతసత్కీర్తిదాతల నిర్గుణస్వ
రూపుల నుతించి గీర్తిఁ బ్రేరేపవలయు. 286

ఉ. నుతియింతున్ మనరామకృష్ణకవులన్ సన్మార్గ్యధర్మైకస
ద్గతులన్ సూనృతవాగరాతుల, వృథాదంభాశుఘోషానృత
శ్రితులన్ దాదృశకోప్రపుంగవుల, నశ్లీలాపవాదప్రద
ప్రతిభామాతల వారివీరిహితులన్ బ్రాంచద్యశోదాతలన్. 297

మ. దయకై కొల్చుటకన్నఁ దిట్టుటయ మేల్ దైవాలకున్, బూర్వమే
జయుఁడున్ శ్రీవిజయుండు శాపహతులై శాసించి రీత్రోవ, త
ద్దయు సౌకర్యము దీనియం దగపడున్, దైన్యంబు గన్పట్టదా
శ్రయణక్లేశము సున్న, తుల్యము ఫలైశ్వర్యంబు యోజించినన్. 298

మ. కలికిన్ మంగళమస్తు దానికి సిరిన్ గల్పింప యత్నించు ధీ
రులకున్ మంగళమస్తు నిస్తులసచోరూఢిన్ గలిన్ ద్రుంచు నా
ర్యులకున్ మంగళమస్తు వేదమతశాస్త్రోక్తార్యధర్మైకవ
ర్తులకున్ మంగళమస్తు గీరతవచోదుగ్ధాబ్ధికిన్ మంగళమ్. 299

గద్య

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర విరచితంబగు గీరతామ్నా
యమ్మునందు గురుదక్షిణ యను ద్వితీయభాగము,
సంపూర్ణము.



# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 1 | కోల | కోకిల |
| 7 | 1 | బాఱిజగువు | బాఱిఁజగువు |
| 8 | 1 | నెప్పుడొ | నెప్పుడో |
| 11 | 18 | మెఱుఁగుచు | మొఱుఁగుచు |
| ,, | 20 | కాహోద | కాహ్లోది |
| ,, | 26 | బబలించు | బఱిబలించు |
| 16 | 23 | ర్ధమాను | వర్ధమాను |
| 22 | 17 | ద్దేము | ద్దేశము |
| 24 | 25 | గలాడఁ | గలాఁడ |
| 28 | 7 | నికాౘలంబునన్ | నిప్పట్లన్ వృథా |
| 33 | 15 | వేరోక | వేఱోక |
| 38 | 17 | గిరతం | గీరతం |
| 62 | 18 | దజ్ఞులు | తజ్ఞులు |
| 67 | 28 | కైవ | కై |
| 71 | 3 | బారత | భారత |
| 75 | 9 | దైవాలదున్ | దైవాదులన్ |

గీర. ద్వితీ.

# గీరతము

(విగ్రహారాధన)



# ఉపోద్ఘాతము

చదువరులారా!

("వివేకభ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః")

అను భర్తృహరిసుభాషితమున కుదాహరణముగ నుండునట్లు మా "దైవవంచితులు" ప్రకటించిన "తిరుపతివేంకటేశ్వరార్ధశతకమును" జదివియుందురు. చదివిన వారిలోఁ గొందఱు ఱెట్టియేవమును బొందిరో ఆసందర్భమును దెల్పునుత్తరములు గొన్నిటిని 41 వ పుటలో నుదాహరించియుంటిమి. లోకముచే నట్లు గర్హింపఁబడుచున్న తిప్పడుఁగూఁతల కుత్తరము వ్రాయుట వ్యర్థమని మే మెతేఁగియుఁ బ్రసక్తానుప్రసక్తముగాఁ గొన్ని లోకోపకారములగు సద్ధర్మముల నీవ్యాజమునఁ బ్రచురింపఁ దలఁచి యాతప్పడుఁగూఁతలనే గౌరవించి 'విగ్రహారాధనము' అను పేరితో నీగీరతతృతీయభాగము ముద్రింపించితిమి. ఇంతకు మున్నిది గీరతచతుర్థభాగముగా ముద్రింపించెద మని ప్రచురించియుంటిమి. కాని గుంటూరిసభలో దీనియందలి పద్యములు కొన్ని విన్నది మొదలు దీనికై నిత్యమును వచ్చునార్డర్లమితములుగా నుంటంజేసి లోకాభిరామాయణముకన్న దీనినే ముందు ప్రకటింపవలసినవారమైతిమి. అనేకమహావిషయము లిందున్నవి, అవి చదువరులే గ్రహింపఁగలరు. అక్కడక్కడఁ గల విశేషముల నేకత్రి చేర్చి సమన్వయించుకొనువారికి బోధపడినట్లిది యితరులకు బోధపడదు, కానఁ జదువరు లప్పట్ల జాగరూకులుగ నుండఁగోరెదము. ఇది యిటులుండె. ఈయనర్ఘశతకమును జూచి లోకులెల్ల నిష్ఠీవనమాచరించుచుండఁగా నీమర్యాద చాలక కాఁబోలు 'రామకృష్ణమ + హాభారత' మనఁదగు ధోరణితో "రామకృష్ణమహాభారత" మను నేతిబీఱకాయ నొకదానిని మనదైవవంచితులు లేవఁదీసిరి. ఇది పడుచు, లేచుచు, చచ్చుచు, పుట్టుచు, "దచ్చిచెడిచేయుంగలవిన్నపములు" కావించుచున్నది. ఇప్పటికి 128 పద్యములు, 24 పుటలు 7 పర్వములుగాఁ దలచూపి రోదనసంఖ్యాపర్వ మసమాప్తిలో నుండఁగనే మురల నాఁగిపోయినది- అప్రగల్భానృతవచఃపూరితమగు నియ్యది వెలువడినది మొదలు ప్రాజ్ఞలోక మిట్లు గౌరవించుచున్నది.

"తిరిగి యీ నడుమ ‘కవిత’ పత్రికలో నిదివఱకు కృష్ణాపత్రికయందుఁ బ్రచురించిన ‘పరాస్తపాశుపతమును’ బ్రచురించుచున్నారు. ‘పాడిందే పాడరా పాచిపండ్లదాసరి’ అను సామెతకుఁ దగియున్నది. మీ గీరతమునకు మరల ‘భారతమును’ వ్రాయుచున్నవారలు. ప్రారంభపర్వముమాత్రము వ్రాసిరి, వ్రాసినను మీరు దయచేసి వానికిఖండనముగా గ్రంథములు వ్రాయక యేవియో కొన్ని వ్యాసములు వ్రాసిన బాగుండును. కారణ మేమన? వారు వ్రాయువానియందు విషయవిమర్శనముండదు కాఁబట్టి."

సికిందరాబాదా (దక్కన్) చివుకుల అప్పయ్య. 24-9-13.

---

19-5-14. సికిందరాబాదు, సెకండుబజారు.

"గీరత" ద్వితీయభాగమందలి సంబుద్ధిపర్వాదులను జూచిన రామకృష్ణసతీర్థ్యులిఁక శాంతింతురేమో యనుకొంటిని మరల వారు తమ చేటభారతమందు, తొంటి యవివేక ప్రసారమును గుప్పించుచున్నారు. ఒడలుకొనరిండు. యీ దేశమందు వారినిగూర్చి యేవపడని వివేకులు లేరు.

ముదిగొండ నాగవీరేశ్వరుఁడు.

---

(1) అబ్బో!, ‘శతపర్వభారతంబఁట? మతిమంతులు వ్రాసిరఁట?’ ఇత్యాద్యుక్తులు కొంతపట్టు కాలుచున్నవి. స్థాణువు పల్లవశోభ నందవచ్చును గాని మనవారు త్రోవకు వచ్చునట్లులేదే? ఇది కలిమాహాత్మ్యము. కేవలము వారి లోపము గాదు.

మ కలికాలంబది? భవన్మహత్త్వగిరిశృంగస్థానశృంగాటకో
చ్చలదత్యాగ్రహకర్యపుణ్యజననాచాకీచకస్వానని
స్తులసత్యప్రతిబంధకల్పనకు సంతోషించి భక్తాగ్రగ
ణ్యులు మ్రొక్కుల్ పదివేలు మ్రొక్కెదరు మాయోపాయసంధానమా!

అని వేడఁ దగియున్నది, "బ్రహ్మాఽపి నరం నరంజయతి" కోటిలోనికి వచ్చినది..." శి॥ హ॥ 1-9-13.

(2) "కవితఁ" జూచి యుందురు, అందు శ్రీ "వారి" భారతము బయల్పడినది. ప్రారంభపర్వము ముందుదారిని సూచించునేయున్నది. తత్త్వము లోకమెఱుఁగినపిమ్మటఁగూడ వీరి కీప్రయత్నములు శుభకరములు కావనియే ప్రాజ్ఞసంఘము నుడువుచున్నది... శి॥ హ॥ 20-9-13

"ఉ॥ "శిక్షయొనర్చి, యక్షరముఁజెప్పి, ప్రయోజకుఁ జేయు నొజ్జనేఁ దక్షుఁడనైతి నంచుఁ, గడుఁ దానపమానమొనర్చెఁగూళ" అని శ్రీమూర్తి వసుప్రకాశిక, రామకృష్ణకవులు మున్నగువారే, పయిసంగతికి నాధారమవుదురు. వీరి శృంఖలగాని, బృహద్భారతముగాని, భవత్ప్రతిభాయశః ప్రసరణములకు, ప్రతిబంధకములు కాఁజాలవు తాము మనుష్యమాత్రులుగా, నేప్రాజ్ఞులచేతను దలఁపఁబడుటలేదు. మీ ప్రబంధరాజములను అందు మరియు మీగీరతామ్నాయముఁ జదివిన విద్వత్కవులు, సాక్షాత్తుగ, మీరు తిరుపతి వేంకటేశ్వరులే యని, భావించుచుండిరి."

బాపట్లతాలూకా
పెదనందిపాడుపోష్టు.

జమ్ములమడక శ్రీరామకవి.
కొండపాటూరు.

---

అతివిస్తరమేల. "పువ్వుపుట్టినతోడనే పరిమళము— పుట్టినతోడనే కంపు" అను సామెతకు మన సువివేకులభారతము ప్రథమోదాహరణము. అది యింతవఱకుఁ గొంచెము తక్కువగా నేడుపర్వములు వెలువడిన దని వ్రాసియుంటిమి. ఏడుపర్వములలోఁ దుట్టతుదిపర్వము పేరు 'పునరుక్తిపర్వము'. దీనిలోని యీ పద్యముంబట్టి చూడ నయ్యాల కప్పుడే నాడి వెనుకకు లాగుచున్నట్లు మూర్ఖులకుఁ గూడ సుగమమే.

గీ. "చాటుపద్దెములెద్దాని జాటితెలిపె
శృంగభృంగమునందెద్ది చెప్పఁబడియె
సత్యసందేశమును దేనిసంప్రతించె,
నదియె వివరింపవలసె భంగ్యంతరమున"

ఏడవపర్వమునకుఁ బెట్టిన పేరుం బట్టియేమి, పైనుదాహరించిన పద్యపువాలకముం బట్టియేమి యయ్యాల భావిగతి సూచితమగుచున్నది. చాటుపద్దెములగతి నెఱుఁగని వారెవరు? శృంగభంగ సత్యసందేశములదుర్గతి నెఱుఁగని వారెవ్వరు? ఆ ప్రల్లదములుతప్ప గతిలేని దేవయ్యాలంత పెద్దపేరుతో వ్రాఁతకు దిగుటెందులకో? ఇప్పటికిని శృంగభంగ సత్యసందేశములనుగూర్చి సత్యాన్వేషులు మరలమరలఁ బ్రయత్నించి నిజమరసి "తస్య ప్రహారణములను" దగిలించుచునే యున్నారు. చూడుఁడు.

---

పినపాడు. 6-11-13

"నేను యీ నెల, 2-11-13 తేదీని కాకరపర్తిదగ్గిర నున్న "వడలి" అనేగ్రామమునకు కార్యార్థినై వెళ్లియుంటిని. అక్కడికి కాకరపర్తి చాలా సమీపమని తెలిసినది. కాకరపర్తితగాదా విషయమై ఎవరినైనను కనుక్కొందామనే కుతూహలముతో నుండగా, 3-11-13 తేదీని సాయంత్రం, 7 ఘంటలకు కాకరపర్తినివాసులగు బ్రి॥ శ్రీ॥ కూచిభొట్ల మహాదేవయ్య, అనేవారు తటస్థమైరి. వారిని యీ తగాదా విషయమై నిజము యెంతవరకు, అని ప్రశ్నించితిని. వారు యీ క్రిందివిధముగా చెప్పిరి. మీరు కాకరపర్తిలో సభ చేసినప్పుడు తానుకూడ అక్కడ నున్నాననిన్నీ తమరు ప్రథమంలో గ్రంథము (గీరతము) చదువుచుండగా అందరికీ చాలా సంతోషంగా నుండెననిన్నీ తరువాత అక్కడవారు యెవరో రచించిన పుస్తకమును మీకు చూపి మీ అభిప్రాయమును కోరగా అది మీకు నచ్చకున్నట్టున్నూ అక్కడనుంచి అక్కడ నున్నవారందరు అనేకవిధములుగా మిమ్ము అవమానించవలయు నని పట్టుపట్టినట్టున్నూ అట్టివాండ్రలో తనకుమారుడుకూడా వుండినట్టున్నూ, వానిని వారు మందలించినట్టున్నూ, చెప్పినారు. తమయందుమాత్రం ఏమీ లోపము లేదనిన్నీ, లోపము వాండ్రిదే ననిన్నీ మిమ్ములను ఎట్లాగైనా అవమానించాలని వాండ్రిందరు అదివరకే అనుకొని వున్నట్టుగాకూడా వారు అభిప్రాయము కనుపరచినారు యింకను బ్రి॥ శ్రీ॥ రామకృష్ణకవులలో కృష్ణకవి అనేవారు తమదగ్గర శుశ్రూష చేసి అవధానరహస్యములున్నూ ... మీవద్దనే తుదనెగ్గించుకొన్నట్లు సెలవిచ్చినారు. అంతేకాక మీకవిత్వముతో ఆవూరిలో ఎవరికవిత్వమున్నూ సరితూగచాలదనిన్నీ మిమ్ములను జయింపలేరనిన్నీ బ్రి॥ శ్రీ॥ పెద సీతారామశాస్త్రులవారు పదిమందిలో చెపుతూ యుండగా తాను విన్నాననిన్నీ చెప్పినారు వారి సంభాషణవల్ల ముఖ్యపరిపోర్టు ఏమనగా, మోసము రామకృష్ణకవులదనిన్నీ, ఆవూరియందు యింకా కొంతమంది దనిన్నీ, తేలినది. అప్పుడు నేను "లోపము ఎవరియందువుంటే వారిని మీవూరి పండితులు మందలించరాదా" అని అంటిని. అందుకు వారు రామకృష్ణకవులు అక్కడివారికి చాలా దగ్గరబంధువులు కావడమువల్ల ఏమీ అనుటకు వీలులేకున్నదనిన్నీ, తిరుపతి వేంకటకవుల కీర్తి యితరులవల్ల పొయ్యేది కాదనిన్నీ, మావూరియందున్న పెద్దలు పూరుకుండియున్నారు. అని సెలవుయిచ్చినారు. మీరు గీరత

ములో న్యాయముగా వెళ్ళినట్టు వారు చెప్పిన మాటలవల్ల నామనస్సుకు (తోచి) చాలా సంతోషించినాను..."

**T. KOTAYYA.**

ఈ. టి. కోటయ్యగారి గ్రామ మెక్కడిది? గుంటూరు డి॥ లోనిది. సత్యాన్వేషణతత్పరత్వము తప్ప నీయన కీపరిశ్రమమేల? సత్యజిజ్ఞాసువులు చేయు పరిశీలనమున కెన్నాళ్ళు చాటక యసత్యజీవనుల పదరులు నిలువఁ గలవు? అట్టిచో నా పాడుఁగూఁతలనే మరల మరల నేల వదరవలయునో? పైవిషయ మును గూర్చినదే మఱియొక యుత్తరము.

"నాలుగుదినములకిందట బ్ర॥ శ్రీ॥ చెర్ల రామశాస్త్రిలగారును, వారితో బ్ర॥ శ్రీ॥ ఆణివిళ్ల సీతారామశాస్త్రిగారును యీగ్రామము లౌక్యసం॥ కార్య ముమీద విచ్చేసిరి. మమ్ముల జూడవచ్చిరి. పేరువినుటతోడనే, బ్ర॥ శ్రీ॥ సీ॥ శా॥ గారిని "శృంగభంగపు" వ్రాతలనుగురించి ముచ్చటించితిని. అందు చాలురచేష్టలును, తా మచటి కేగుట మొ॥ సంగతులు చెప్పిరి; తమయందు మంచితాత్పర్యం కలదు"

1-7-13 ఏలూరు. మై॥ కృ॥

---

ఇ ట్లిందఱిచేతనో ప్రతిక్షణమున విమర్శింపఁబడుచు నిగ్గు తేల్పఁ బడుచు న్నీ, యని రోయఁబడుచున్న తన కుకల్పనయం దింకను రామకృష్ణమ్మకు నాశా భంగము కలుగనేలేదు పైఁగా నా, శృంగభంగసత్యసందేశములలో రెండవ దానిని మేము మాగీరతమునఁ గైకొననేలేఁదట? కైకొన్న "శృంగభంగము" వలనఁ దనకుఁ గలుగుచున్న మర్యాద చాలదా? పునరుక్తిప్రాయ మగుదానిం గూడ నేల కైకొనవలెనో? ఆ వ్యయమే యననేల? ప్రకృతవిషయమునం దా నేది వ్రాసినను నయ్యది యప్రగల్భానృతమయముగానే యుండెననుట యెవ్వ రెఱుంగనిది? శృంగభంగసత్యసందేశముల కర్తృత్వ మెవని నెత్తిని బులుమఁబడినదో యా చర్ల చలపతి పత్రనముం బోలె నాయీ ప్రకటనములును వెలుఁగఁ గల వని తలఁపని ప్రాజ్ఞు లెవరు? చర్ల చలపతి పత్రనము కొంత గూఢముగా గురుదక్షిణలో 15 వ పుటలో సూచింపఁబడినది. మఱికొంత తెలి యఁగోరువారు మాశిష్యుఁడు వెంకటరామయ్య కొకవేళ్రిలు విడిచిన పినతండ్రి యగు బ్ర॥ శ్రీ॥ ఓలేటి నారాయణశాస్త్రిలవారి సరిక్రొత్తయుపానద్ద్వంద్వ మును బ్రశ్నింపఁ గోరెదము. అట్టి యుత్కృష్టునికి స్వాలకుఁడగుట కర్మవశ

ముగాని అందులకు దుఃఖింపక యవ్వానితో క్షీరనీరన్యాయమున నుండి కుకల్ప
నలు ప్రకటించుట తత్తుల్యత్వ సంపాదకము కాక తీరదు. కావుననే దూర
గులు సైతము ప్రత్యయము చాలక రామకృష్ణుని వ్రాఁతలు ప్రతిపదమును విమ
ర్శించి తజ్ఞులవలన గుట్టుమట్టులను గనిపెట్టి త్యజించుచున్నా రనునంశ మింతకు
మునుపే సిద్ధాంతీకరింపఁబడినది. దానినే బలపఱుచు నతని స్వయంకృతాప
రాధబోధకము లగు నక్కరములు మఱికొన్ని చూపఁబడుచున్నవి.

(రా॥ కృ. భా. కథావతారపర్వమునుండి.)

చ. ఒకతఱి రామకృష్ణకవులొద్దకు వెంకటశాస్త్రి చూడ ను
త్సుకుఁడును బోలె వచ్చి "తగుచోట ననుంగొని మీగురుండుగాఁ
బ్రకటన సేయఁ గోరెద భవద్గుణతాపదలబ్ధి నాకుఁ గొం
డొకయుపకార మానుతిలెడున్ భవదీయనృపాలసన్నిధిన్.

ఉ. వేసవికాల మేగుడును వెంజీయు నేముదెంతు మింతలో
మానడి మీనృపాలుని సమక్షమునందుఁ బ్రసంగమార్గముం
జేసి వచింపుఁ డేను నృపశేఖరుదర్శన మబ్బ యత్నముల్
చేసెద"నంచుఁ జెన్మి మెయిఁ జెప్పెను దత్సమయోచితంబుగన్.

ఉ. మంచిది "వేంకటేశ్వరుఁడు మాకు గురుం డని పల్కి మీకు లా
భించెడి దున్ననల్లె కలిపించెద" మంచు వచించి యాతనిం
బంచిరి రామకృష్ణు,లటు ప్రాప్తమనోరథుఁడౌట నాతఁ డిం
చించుక సంతసంపడియు నీసును వీడఁడు లేశ మేనియున్.

ఇట్లు వెం॥ శా॥ తమ్ము నాశ్రయించినది నిక్కమే యగునెడల నీయం
శము "లప్రస్తుత ప్రశంసలో" వ్రాయమానుటకుం గతము పూజ్యము. వెం॥ శా॥
రాజదర్శనార్థియే యగుచో వీరి నాశ్రయింపవలె నేమి? అసత్యమాడుపట్టులఁ
గూడఁ గొంత తెల్వి యుండవలయును. అదియే యున్నచో నీమా "దైవసం
చితు" లీయంశమునుగూడ స్వాప్నికపర్వములో నేనిఁ జేర్చుకొనినఁ గొందఱు
కాకున్నఁ గొందఱైన "పాపము వారికట్లు స్వప్నము వచ్చియుండఁబోలు" నని
యనుకొనుటకైన దటస్థించునేమో? ఎట్లు తటస్థించెడిని? వాదిప్రతివాదులలో
నొకరుఁ డింకొకఁడు చెప్పినట్లు తన కనుకూలించు సంగతులను గిలికి "ఇట్లాతఁ
డెప్పుడు చెప్పె" నను ప్రశ్నము వచ్చినప్పుడు "స్వప్నమునం" దని యుత్తర

మిచ్చుచో నమ్మ తీర్పరు లెక్కడనుందురు? కావున నీస్వప్నప్రసంగము కూడ మా "దైవవంచితులు" శుద్ధాసత్యములను వదరు నికృష్టులని లోకులకుఁ జెప్పక చెప్పుట కేర్పడినదియే యని మేమిందు వేఱుగ వ్రాయనక్కఱలేదు. స్వప్నములో వెం॥ శా॥ చెప్పినట్లు లెన్నో సంగతులు కల్పింపఁబడినవి అందు రామకృష్ణమ్మకుఁ గల రిక్తమనోరథమును దెల్పఁజేయు నొక యుపగ్రకల్పము(ఁబద్దె) మిట నుదాహరింపఁబడుచున్నది

సీ. "పగ్గెకు మిమ్ము గెల్తు నని పల్కుచునుందును గాని కృష్ణుతో
నెగ్గఁగ లేము తిర్పతియు నేను నాతని పేరు విన్నచో
దిగ్గనను౯ మనం? బెపుడు దృష్టమ్ము గాధిపడింభమో యన౯
దిగ్గనఁ జైఁ బఱంగ నగు డెందమునో యంచు భయంబుఁ జెందుదు౯."

పాపము వీనికెంత కోరికయున్నదో? అవును.

శ్లో. ఉత్పద్యంతే ప్రలీయంతే దరిద్రాణాం మనోరథాః
బాల్యవైధవ్య దగ్ధానాం కులస్త్రీణాం... విష.
"రిక్తుని మనసుకోరికలు పెద్ద"

అది యటు లుండె. ఇట్లని వెం॥ శా॥, వెం॥ రా॥ లతోఁ బల్కినదెప్పుడు? స్వప్నమునందు. స్వప్నఫలవేత్తలిట్టి స్వప్నన కర్థ మెట్లు చెప్పుదురు? "ఇట్టిమాట వెం॥ శా॥ వలన నీవెన్నఁడును విన నేరవు" అని చెప్పుదురు. అట్లేల చెప్పవలె నందురా? వేఱొకప్పుడు వెం॥ శా॥ యొకటికి రాఁగానే నిలువునఁ దమ యాయువు లెగిరి పోయినట్లు కల వచ్చె ననుకొనుఁడు. అయ్యది యట్లు జరుగ వలసినదియే యగునోటు?

(దేవీభాగవత షష్ఠస్కంధమునుండి.)

శ్లో॥ నివృత్తియా చాల్యతే చిత్తం భవన్తి స్వప్నసంభవాః। నానావిధ మనో భేదాః... శ్లో॥ మృతం పితామహం స్వప్నే పశ్యతి స్వగృహాగతం...। భ్రమో౽య మితి నిశ్చయః॥

దీని కిన్ని ప్రమాణము లెందులకు, నిజముగా స్వప్నము వచ్చియే, వెం॥ రా॥ లట్లు వ్రాసినను నది వృథా, వీరలకట్టిస్వప్నమే రానిచో నిటఁ జెప్పవల సినదేమి? స్వప్నముగాదు గాని యిది యొక జాతిప్రలాపసన్నిపాతప్రయుక్త మగువికార మైనఁ గావచ్చును. ఈవికల్పములకేమి, "రామకృష్ణమ్మకు, తి॥ వెం॥

కవులను జయింప వలయునను మనోరథ మున్నది. అట్టిశక్తి భగవంతుఁ డియ్య లేదు. అందుచే నిట్టిపాటులు పడవలసివచ్చుచున్నది." ఇది సారము, పై మనోరథ మెట్టిభయముతోఁ గలసి మెలసి వర్తించుచున్నదో, అధయ మెట్టితెల్వి తక్కువ పరిసంగమును జేయించుచున్నదో, యీక్రిందిసాకులవలనఁ దెలిసికొన వచ్చును.

(రా॥ కృ॥ మ॥ భా॥ పునరుక్తిపర్వమునుండి)

"చ॥... తారు తుల్యపదభాగులె మే మెసరేఁగి తాఁకఁగన్.

క॥ సమశీలోద్యోగులకున్, సమవిజ్ఞానులకు సమసుచారిత్రులకున్
దమలో సఖ్యమును వివా, దము దగు నని వ్యాసభారతమ్మనలేదే."

ఇందుచేత తి॥ వెం॥ కవులు పిల్చినను వెం॥ రా॥ లు విద్యావివాదమునకు రారఁట? సత్యమే కావచ్చును, వేదుల రామకృష్ణమ్మకీ విషయమైన పట్టుదల పూర్తిగానున్నట్లు బలవత్తరమైన సాక్ష్యమున్నది గానఁ బై సంగతి విశ్వసించి తీరవలయును. ఇతఁడు చర్ల చలపతితో వివాదమునకుఁ గాకున్నను వివాహము నకును స్నేహమునకును నంగీకరించి యశ మార్జింప యత్నించుట లోక విదితమే! శీలాదులయం దితని కితఁడు సముఁడు. "సర్వం సంపన్నం". ఇఁకఁ బై పద్యమునకు బీజభూతమగు భారతశ్లోకముదాహరించి కొండొక చర్చింప వలసియున్నది.

శ్లో॥ యయోరేవ సమం విత్తం యయోరేవ సమం శ్రుతం
తయో ర్వివాహ స్సఖ్యంచ నతు పుష్టవిపుష్టయోః

ఈశ్లోకమునకును ఆపద్యమునకును విశేషభేదమున్నను బ్రకృత మది యంత గణ్యముగాదు. "పైవాక్య మెవరిది? ఎవరిని గూర్చినది? ఈవక్తకుఁదుట్టతుదకుఁ బ్రాప్తమైన గతియేమి" అనునది ప్రస్తుతము, పైవచనము రాజ్యమదాంధుఁడగు ద్రుపదునిది;ద్రోణునుద్దేశించి పలుకఁ బడినది. ద్రోణశిష్యులచేఁ దుట్టతుదకు వక్తకుఁ దటస్థించినదుర్గతి సర్వవిదితము. కావున దానిననుకరించువాండ్రగతి విచారింపనేల? ఔరా! దైవవంచితుల ప్రమాదములు! "నీదయా, నీదయా, నిద్రియా". ఇంతతెల్వితక్కువలో నున్న తమరవు? †ఉన్నతస్థానమం

† ఉ॥ (క్రిందుగనున్నవాఁడు... తెగియించు... ఉన్నతిం బొందినవాఁడు ... సందియమందు...॥ (రా॥ కృ. భా. పునరుక్తిపర్వముచూ.)

గున్నారష! తి॥ వెం॥ కవులష! అథస్థానమున నున్నారష! వీరి కోడినను గెల్చినను లాభమేమష! తమకో? యోడిన నష్టమష! కావున విద్యావివాదమునకు రారష! అంతియకాని సామర్థ్య మేమో చాలానున్నదష!!! ఏమీ యున్నతస్థానస్థితి, సిగ్గుసిగ్గు

“ఎన్నఁడు తెలుఁగనివాని కేగానిదొరకితే యెందులోఁ బెట్టనేకందుల బుట్టా”,

అది యటులుండె, ఇప్పటి కచ్చయినంతవఱకు వీరి నేతిబీఱకాయ భారత మిట్టియప్రగల్భానృతోక్తులతో నిండి యున్నయది, అందింతవఱకుఁ జెల్పినకథాంశమేమియును లేదు. “కథావతారపర్వమని” ప్రారంభించి అందు మా శిష్యుఁడు చదివినగురువులను గొండొక పేర్కొనిరి, అందు వెం॥ శాస్త్రిని మొట్టమొదట వదలిరి, పదపడి జ్ఞప్తికివచ్చి కాఁబోలు.

ఉ. ...చెళ్ళపిళ్ళ వేంకటేశ్వరా,
ఖ్యాతునితో నెటో చదివెఁ గౌముది నిర్వదినాల్గుపత్రముల్.

అని యొకచోఁ దప్పుడుఁగూఁత నొకదానిని గూసిరి. ఈ కూఁతకర్థమే లేదు. లేదన్నందులకు * అప్రస్తుత ప్రశంసలో వ్రాసిన ‘స్త్రీప్రత్యయాంతమే’ అనునదియే సాక్షి. స్త్రీప్రత్యయాంతము 24 పుటలలో నిమిడియున్న కౌముదీ సంపుటములు కానరావు. చదివినది స్త్రీప్రత్యయాంతమును గాదుసుఁడీ! దానికిఁ గౌముదిలో నెన్నియక్షరములు వచ్చునో అవియన్నియు వెం॥ శాస్త్రి భిక్షయే యని పంచభూతములును సూర్యచంద్రులును దర్భలును తెలుఁగుదురు కాన విస్తరింపఁ బనిలేదు. యీతని పరస్పరవిరుద్ధాప్రగల్భానృతవాక్యములతోఁ గాగితములు నింపుచు మా దేవయ్యలకు జాగ్రత్తన్నిపాత మంకురించిన దని యనుమానింపఁ దగు సంశయములుగూడ నా నేతిబీఱకాయలోనే కలవు. అందొకటి వృథాగా విజయగ్రామమును బట్టుక పడఁదిట్టుట. దీనింగూర్చి యీగ్రంథము తుట్టతుదను గొండొక విమర్శింపఁ బడి యున్నది. 49వ పుట మొదలుకొని చూడఁదగు మఱియు నాయీ యీపర్వములలో మా ‘దైవవంచితులు, వ్రాసిన సంగతులు సంగ్రహముగాఁ జెప్పుచున్నారము. “వెం॥ శా॥ గారికి శాస్త్రము

* “వెంకటశాస్త్రిగారివద్ద వెంకటరామశాస్త్రిగారు వ్యాకరణము ప్రారంభించి కొన్నిమాసములకుఁ గౌముదిలో స్త్రీప్రత్యయాంతమే— ఎంతైన నేమి, చదివిరి. (అప్రస్తుతప్రశంస చూ.)

రాదు. మాయకవిత్వము వచ్చును. శ్రవణానంద, పాణిగృహీతా, నానారాజసందర్శన, పాండవాశ్వమేధములు పనికివాలిన చెత్తపుస్తకములు; గీరత మిన్నిటికన్నఁ బాడు. దీనిం జదివినవారికిఁ బాపము. వెం॥ శా॥ గారి యాజ్ఞమీద నేమే మీభారతము వ్రాయుచున్నారము. స్వప్నములో వచ్చి, వెం॥ శా॥ తాను దోషి యని యొప్పికొనియెను. వెం॥ శా॥ వ్యాసమూర్తిశాస్త్రిలవారికి మున్నెపుడో విందు చేసి విలువగల నూత్నవస్త్రములు కట్టఁ బెట్టెను. కావున వ్యాసమూర్తిశాస్త్రిలవారు చాల గొప్పవారు. వీరి కతఁ డొనర్చిన విందు శబరి శ్రీరాములవారి కొనర్చిన విందువంటిది.” ఇత్యాదులు వ్రాయఁబడినవి. ఇందులో నీవిందుమాట మాత్రము సత్యము. కాని శ్రీశాస్త్రిలవారికి శబరివలె వెం॥ శా॥ యెంగిలిపదార్థములను బెట్టెనని వ్యంగ్యమర్యాదచే స్ఫురించునట్లు వ్రాయుట దండ్యమగు దోసము. మఱియు నీవిందు వ్యాసమూర్తిశాస్త్రిలవారు పెద్దలు పండితులు బంధుసమ్ముద్రులు అను గౌరవము వెం॥ శా॥ కిఁ గలుగుటకే బోధకమగును గాని వారి కవిత్వమున్న వతని కేవము లేదని తెల్పుటకుఁ బనికిరాదు. వారి కవిత్వమునందు లోకుల కెంత గౌరవమో, వెం॥ శా॥ కిని నంతియ యని విజ్ఞు లెఱుఁగుదురుగాక. అది యటులుండె. ఇట్టి అనుపయుక్తములగు మఱికొన్ని సంగతులు వ్రాయఁబడియున్నవి, అనునది ప్రకృతము. అవ్రాసిన సందర్భములలోఁ దక్కినవి విమర్శనకు నాఁగనియసత్యము లగుట యంత తప్పుగాదు గాని విం జరదూషణ ముపానత్ప్రయోగార్హ మని యననివా రుండఁగూడదు. ఆభాగము ప్రచురించునెడల నంతవఱకు వచ్చుటయు, దానిపై నది కొన్నిమానము లాపి తుట్టతుద కొక సీసపద్యములో నాగాప్రముస్థులలోఁ గొందఱను భూషించి “పెంకాయపిచ్చికొండ” చేయుటయుఁ బలువు రెఱుఁగుదురు. మఱియు నాయీ తప్పడుభారతములో వెం॥ శా॥ గారి విూసములగుఱించి తాము నెక్కిరింపలేదనియు, నేమో యనియుఁ గొంత ప్రలపింపఁబడినది. ‘రానురప్పింపఁ బనిగానరాదు మాకు’ అనుదానికిఁ జెల్లితక్కువగా వ్యాఖ్యాన మొనర్పఁబడినది. దానివలనఁ దేలు సారము “మీరు వచ్చునెడల మేము మిమ్ము రప్పింపము గాని మిమ్ము జయించుట కే ప్రదేశమునకేని మేము వత్తుము. వచ్చుట మాత్రమే కాదు. విధిగా జయింతుము. అనునది, అగుచో నొకపరి బందరుపట్టణమునకే వచ్చుట యుక్తము. ఇందునుగూర్చి, గీరత 1 భాగము 45 వ పుటలోని “తే॥ గీ॥ బందరే వచ్చి” అను పద్యము చూడఁదగు. ఎప్పుడువత్తురో తెల్పునెడల సభ యేర్పఱిచి వారి రాకకై ప్రతీక్షింపఁబడును. చేవ యే

యున్నచో శ్రీరాజా రావు చెల్లయ్యామ్మారావు బహద్దరువారి షష్టిపూర్తికావ్యా నింపఁబడి 'వత్తు' మని యంగీకృతిం దెల్పి కూడఁ బలాయనమంత్రము స్వస్తి చెప్పుటకుఁ గత మేమో యెఱుఁగనివా రెవ్వరు? "పిల్లి కనులు మూసికొని పాలు ద్రావిన" నది దాఁగు నెట్లు. ఇందుఁగూర్చి యీపొత్తమున 51, 52 పుటలు చూడఁదగు. ఆయీ సందర్భములెల్లఁ బరికించువారికి 'రామకృష్ణమ + హాభారతముగాఁ' గన్పట్టక యెట్లుమానెడిని. అది యటులుండె గీరత ముత్తమగ్రంథ మని తెల్పఁదగు నుత్తరము లెన్నో, 1, 2, భాగములలోఁ జూపఁబడినవి. దజ్మాత్ర మీభాగమందును బ్రచురించితిమి. కాని యెన్నో యుత్తరము లింకను నిల్వయున్నవి. కొన్ని యిటఁ జూపఁబడుచున్నవి.

(1) సీ॥ శ్రీపతి వేంకటేశకవి సింహములార! శతావధాన వ్యాపార భాగధారసకలాంధ్రసరాధనసత్సభాప్రభా। దీపకకీర్త్యుదంచితవిధప్రతిభాత్మకులార! సత్కృతి। స్థాపకులార! వేఁడుమపదంబులకుం బ్రణతుల్ ఘటించెదన్॥ చ॥ చరితములందు గీరతము చాలఁగ సాకరమయ్యె నీతి। విస్ఫురణము గాంచనయ్యె, గురుసూరులమన్నన పెంచనయ్యెనేఁ। డరుదుగ 'సీమ' యన్ చరిత మాన్యులు తాము రచించినట్లు నే। నెఱిఁగి లిఖింతు నొక్కప్రతి సీమొద కుందయసేయు వీ. పి. గాన్॥ క॥ అద్భుతనోభయకవులం। 'దుద్యత్కీర్తిప్రతాప యుక్తులకలనన్। హృద్యులగు తమకు నే నన। పద్యప్రణతిం బొనర్చి ప్రముదము గాంతున్. 6-3-13.

(2) తాముప్రిమరించిన 'గురుదక్షిణను' జూచితిని, ఇంతకు ముందటి ప్రథమ భాగముం జదివియుంటిని. ఇక్కాలమున శిష్యహితోపదేశము చేయ నింతటి స్మృతిగ్రంథమును రచియించి, లోకోపకృతిబొనర్చుచున్న తమ్ము నహస్రిథా కొనియాడుచు నొక్కగురుదక్షిణను వీ.పి. గా దయచేయఁ బ్రార్థించుచున్నాఁడను.

గుంటూరు — పెరవలి, సార్వభౌశశాస్త్రి,
16-11-13. — ఏ, ఈ, ఎల్, ఎమ్, కాలేజీ, సహాయాంధ్రోపాధ్యాయుఁడు,

---

పెద్దింటి హయగ్రీవస్వామి అనేక ప్రణామములు సా॥ ఆర్యవటం-గొల్ల పాలెంపోస్టు, కాకినాడతాలూకా, గోదావరిడిస్ట్రిక్టు. తాము చెప్పిన గీరతము నాకు నక ప్రతివెంటనే వీ. పీ. గా దయచేయించుటకు ప్రార్థించుచున్నాను.

చదువరుల కపరిమితానంద దాయకమని మన ప్రెసిడెన్సీ యంతయు కీర్తివిస్తరిం చెను. గాన సదరు గ్రంథము చదువనెంతో వేడుక కలిగి యీ విజ్ఞాపనపత్రిక వ్రాసినాను. ది 16-11-13.

---

తమ రిదివరకు రచించిన గ్రంథములు కొన్ని మాత్రము నావద్ద నున్నవి. అందు, సర్వజనోపయుక్తంబై, కల్పభూరుహంబువలె సకలార్థదానశాలియై, కాల మేఘుంబుచందంబున గంభీరధ్వని విరాజితంబై, భారత కథావిధంబున, నానా వర్ణ సమస్తపదభూయిష్టంబై, యొప్పారుచున్న గీరత ప్రథమభాగమును జూడ నాడెందం బమందానంద తుందిలంబయ్యె. మల్లాది వెంకటసుబ్బయ్య. గుంటూరు 14-3-1913.

---

19-1-13.

తమ గీరతము నామూలాగ్రముగఁ జదివితిని. మిక్కిలి యొప్పను దెలు పుమ నానంద మొనఁగూర్చుచున్నది.

పురాణం, రామచంద్రశాస్త్రి. ముక్త్యాల (సంస్థానం) కృష్ణాడి॥

---

సీ॥ పరశాఁ కృతఘ్నుల జక్కాడి జయమొంది ప్రథవిల్లు మీపాసుపతము గంటి... భారతప్రతిన మైఁ బండితకోటిని దన్పెడు మీగీరతమ్ము గంటి..."

దార్వేముల, వెంకటశేషశాస్త్రి. 22-3-14

గోవువానిపాలెం, వీపూరుపోష్టు, వినుకొండతా॥ గుంటూరుడి॥

---

ఇగ్లండులో నిర్వ్యాజముగా నుతింపు పొత్తమును వెం॥ రా! తిట్లు తిట్టిన నేమి ప్రయోజనము? అదిగాక వారేని స్వార్థచిత్తులై వ్రాయువ్రాతలో నిందం చుచున్నారా? పాపము! గీరతమును జదివి అవసరముం బట్టి ఖండింపనెంచి వీలు లేక చేయు "మహాభారతము" లోఁగదా తిట్టుచున్నారు. దుఃఖసముద్రములో మునిఁగినవా రేమన్నను నవి శిక్షలు పాటింపఁ దగదు. అదియటులుండె, చూచి నంతలో నీ "మహాభారతము" సత్యమునకుఁ జాలదూరముగ నగపడుచున్నది. కాని యతిప్రాసాదు లనుకూలముగ నున్నవని జెప్పుటకు సందియము లేదు. అందుక్రింది పద్యమును, వెం॥ రా॥ లెందుకో వ్రాసికొనియుండిరి.

క. 'ఒకపండితుఁ డొకపామరుఁ, డొకలోకంబైన నేమిరో యనవచ్చున్
సకలమ్ముం దముఁదెగడిన, స్వకీయదోషమును దెలియఁజాలరు కుకవుల్.'

లోకులు వీరిప్రవృత్తిని గుఱించి యేవపడుటనుగూర్చి గీరతమెల్లెడఁ బలు ప్రమాణము లిచ్చియుంటిమి. అవి చదివి యీ పద్యమును జదివికొన్నవారి కిందుల కుదాహరణమును వేఱుగ వెదకవలసి యుండదు గదా? ఇఁక నసత్యవర్తనుల ప్రతిజ్ఞ లెట్లుండునో తెలిసికొనఁదగునొక యుదాహరణము మాత్రము వెం॥ రా॥ ల "మహాభారతము" నుండి చూపుచున్నారము.

తే. గీ. 'అనృతవిషయమ్ము లెల్ల సత్యములు గాఁగఁ
జెప్పి మెప్పులు గొనుట మాచేతఁ గాదు
ఉన్న దున్నట్లు వ్రాసెద మొప్పుఁ దప్పుఁ
జెప్ప రారయ్య పండితశ్రేష్ఠులార.'

పండితశ్రేష్ఠులు రావలయునఁట!, పాప! మెంతధైర్యమున్నదియో, అస్తు. ఇందలి వ్యంగ్యమువలన గీరతమును లోకమెల్ల మెచ్చె ననుటకుఁ బ్రతిపక్షులుఁ గూడ నొప్పికొనక తప్పక వచ్చినది యని విస్పష్ట మగుచున్నది. అందనృత విషయమే యున్నదో సూనృతమే యున్నదో తెల్పవలసిన యావశ్యకత లేదు. ఈ యంశమును సాధింపఁదగు లోకాభిప్రాయము లుదాహరించి విసివితిమి. కాక, "ముంజేతికంకణమున కద్దమెందులకు" "జగ మెఱిఁగిన బ్రాహ్మణునకు జందెమెందులకు" "నీరుపల్ల మెఱుఁగు నిజము దేవుఁడెఱుఁగు" కొన్నిటి యందలి నిజమును గనిపెట్టుటకు దేవునివఱకుం బోవలయును గాని "పట్టపగటి దొంగతనపు" వ్రాఁతల యందలి సత్యమును గనిపెట్టుట కెవ్వరేనియుఁ జాలుదురు. అట్టివ్రాఁతలను వ్రాయుచు మా వెం॥ రా॥ లు లోకమును విశ్వసింపఁ జేయవలయు నని విశ్వప్రయత్నము చేయుచున్నారు. వారెన్ని యొట్లు, యసత్యములు, కావించి సంగతిసందర్భములు ప్రకటించుచున్నను నయ్యవి గని లోకు లేవగించుకొనుచునే యున్నారు. అట్టిస్థితిలో వారొనర్పఁదగిన దేమి ? పాపము స్వయంకృతాపరాధము వలని ఫల మనుభవింపవలసినదే. ఒక యసత్యమునకై తొంబది తొమ్మిది యసత్యములను లిఖించి వానివలన లోకులచే గర్హితు లగుటకన్న దుర్దశ యొండుండెడినా? ఉండదు.

శ్లో॥ అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫల ముచ్యతే॥

అనుట కింతకన్న దృష్టాంత మేమి కావలయును, ముందు గురుత్వమును దాఁచి "పిదప స్త్రీప్రత్యయాంతము వఱ" కని బొంకి పదపడి 24 పుటలు

మాత్రమే యని "నానాఁటికిఁ దీసికట్టు నాగంభట్టు" గాఁ బాట్లు పడుచున్న మా వెం॥ రా॥ల కష్టమును భగవంతుఁడే పాలింప వలయును. స్త్రీప్రత్యయాంత మన్నప్పుడు సుమారు సగమును, యిప్పుడు మరల నా సగములో సగమును లోపింపఁ జేసిరి. దీనివలన వెం॥ రా॥ గురుత్వ మేమో క్షీణించు నని తలఁచు చుండిరి గాని యయ్యది "యాదవ కులపు ముసలము" వలె నెంత యరుగఁ దీసిన నంత విస్తరించి చేయఁదగు పనిని జేసియే తీరునని మాత్రము గుఱుతింపఁ జాలకున్నారు. "స్త్రీప్రత్యయాంతము" కొన్ని ప్రతులలో 63 పుటలు, కొన్నిటిలో 58 పుటలు, కొన్నిటిలో 49 పుటలుగను గానవచ్చెడిని. యిందుఁ దక్కువ సంఖ్యను గైకొన్నచో 24 దానిలో సగభాగముగఁ బరిణమించెడిని. యింతలో నజంతస్త్రీలింగములు ప్రారంభ మగును. తక్కిన సంగతు లెటులున్నను వెంకట రామయ్యకుఁ గౌముదిలో శబ్దాధికారము గూడఁ దుదముట్ట లేదని పై వ్రాఁతల వలనఁ దేలును. అగుచో నితఁడు "శాబ్దికజీవుఁ" డెట్లగునో? ఈ "శాబ్దికజీవ" త్వమునకై వ్యాఖ్యానాదుల వఱకుఁ బోకున్నను గౌముదిలో మఱికొంతయేని చదువ వలయును గాన నాభాగమునకు గురువులను వెదక వలయును, చర్లనారాయణశాస్త్రి గారినే పేర్కొందమన్నచో నాయన యొద్ద లఘుకౌముది మాత్రమే చదివినట్లు వ్రాసిన వ్రాఁత బాధించును. (చర్లనారాయణ బుధేంద్రు సాకతమునఁ। గావ్య నాటకాదులు లఘు కౌముదియును) (రా, కృ, మ, భా. కథావతార పర్వము చూ.) ఇఁక —

క. "గణుతి గలవ్యాసముఖబుధగణులపై" (రా, కృ, మ, భా, క, ప, చూ.)

నన్యాయముగా నీభారము మోపవలెను, గాని యిందులకు వారును నంగీకరింపరు. పైఁగా——

("తటస్థించినపుడు...క్షణశశకణశః.") (రా, కృ, మ, భా, క, ప, చూ.)

అను "గోడమీఁదిపిల్లి, వ్రాఁత" యంత భారమును మోపుటకుఁ దోడ్పడదు. ఇఁక నెవ్వరి యందీభారమును మోపవలెనో చదువరులే విచారింప వలయును. వెంకటరామయ్య కౌముదిలో 24 పుటలు మాత్రమే కాని స్త్రీప్రత్యయాంతము మాత్రమే కాని చదివె ననునది సత్యదూరము. అంతకన్నఁ జాల నధికమే చదివెను. గురువును మాత్రము వెదక వలెను. యెంతవఱకుఁ జదివెనో లోకాభిరామాయణ పీఠికలో వివరింతుము. ప్రకృత మీ యిసుకపాఁతఱ పని నుండి యింతతో విరమింతుము. వీరి యసత్యములను జూపుట కింతవఱకుఁ బెంచవలసి వచ్చినది. గాని ప్రస్తుత మగు విగ్రహారాధనమునకును దీనికిని బొత్తిగా సంబంధమే లేదని మే మెఱుఁగుదుము.

ఇట్లు,
తిరుపతి వేంకటేశ్వరులు.

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# గీరతము

## విగ్రహారాధనము

శ్లో. స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం, న్యాయేన్యమార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం, లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు. 1

శ్లో. కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్యశాలినీ
దేశోఽయం క్షోభరహితో, బ్రాహ్మణా స్సన్తు నిర్భయాః. 2

శ్లో. అపుత్రాః పుత్రిణ స్సన్తు, పుత్రిణ స్సన్తు పౌత్రిణః
అధనా స్సధనా స్సన్తు, జీవన్తు శరదాం శతమ్. 3

శ్లో. మఙ్గళం భగవన్ విష్ణో, మఙ్గళం మధుసూదన
మఙ్గళం పుణ్డరీకాక్ష, మఙ్గళం గరుడధ్వజ. 4

శ్లో. నీలాచలనివాసాయ, నిత్యాయ పరమాత్మనే
సుభద్రాప్రాణనాథాయ, జగన్నాథాయ మఙ్గళమ్. 5

శ్లో. ఉపనయతు మఙ్గళం న, స్సకలజగన్మఙ్గళాలయ శ్శ్రీమాన్
దినకరకిరణనిబోధిత, నవనళినదళేక్షణో రామః" శ్రీ. శ్రీ. శ్రీ. 6

## గ్రంథప్రారంభము

ఉ. కర్ణమలప్రభూతమధుకైటభఘాతుకదుష్కృతఘ్నతా
దుర్ణయహారి శౌరిఁ దలఁతున్ మధుసూదను వేంకటేశ్వరా
భ్యర్ణసమాప్తవిద్యు, రచితాగను, వేంకటరాము, దుర్వచః
పూర్ణముఖాంతరున్ వినయపుంజసమంజసుఁగా నొనర్పఁగన్. 1

మ. సరియౌ నుత్తర మొండు లేమి నసురాచారుండవై వేంకటే
శ్వరునిం దిట్టఁ దలంచి స్వాంతగతవిశ్వాసమ్ముఁ బోఁద్రుంచి యీ
శ్వరదూరంబగు దుర్మతం బొకఁడు సంపాదించి యారౌర! ము
ష్కరవాక్యమ్ములు వెళ్ళఁ గ్రక్కెదె, కృతఘ్నగ్రామచూడామణీ! 2

మ. అనృత మ్మన్న గుడమ్మ నీకు, గురుదేవామ్నాయనిందాప్తి జీ
వనమే నీకుఁ, గుమార్గవర్తన మనన్ స్వారాజ్యమే నీకు ని
న్నన నేమున్నది? జన్మకాల మటు సవ్యాసవ్యభేదమ్ములన్
గనఁగా నీక కలంచుచుండె, నెటు శిక్యం బట్టెచో నర్భకా? 3

ఉ. వెంకనఁ దిట్టిపోయు నల వెంకనతోడ నభేద మొందు నీ
కంకెను; రామకృష్ణులను నట్టు లభేదము చేసి తిట్ట నే
జంకఁగ నేల? కైత యది సాగదొ? లేఖిని వ్రాయదో? వృథా
పంకమునందు ద్రుంగుటకుఁ బ్రాజ్ఞుఁ డెవండు కడంగు నర్భకా. 4

ఉ. ఏఁబది చెప్పి యుంటి, "విఁక నేఁబది చెప్పఁగ నుంటి" నంటి; వీఁ
డేఁబదు లెన్ని చెప్పఁగలఁ డిట్టియభేదము పట్టె నేని యో
శాబక! యుద్ధరంగమున శాతకృపాణిక పాణి నూని దు
ర్ధీబహుశారికంఠములు ద్రెంచునొ? త్రెంచుకొనం దలంచునో. 5

శా. తిట్టన్ రాదని కాని యట్టి దొకసందేహమ్మె లేకున్నచో
నెట్టో చెప్పుము రామకృష్ణులకు నిర్ద్వైయత్వసంసిద్ధి? తి
రుగ్గట్టన్ బొల్చెడి వేంకటేశ్వరున కేరున్ దోసమున్ వీసమున్
గట్టంగా వినఁబోము కృష్ణున కటుల్ గాఁడెంచువా రున్నచో. 6

సీ. జారుం డనఁగవచ్చుఁ జోరుం డనఁగవచ్చు
బానిసమగఁడంచుఁ బలుకవచ్చు

స్త్రీఘ్నుం డనఁగవచ్చు గోఘ్నుం డనఁగవచ్చుఁ
బసులకాపరిఁ జంపుఁ బలుకవచ్చుఁ
గల్లరిఁ డనవచ్చుఁ గొల్లటోఁ డనవచ్చుఁ
బల్లెవాఁడని చుల్కఁ బల్కవచ్చు
ఉత్తముం డనవచ్చు సత్తముం డనవచ్చుఁ
బాఱుఁబోతని నొక్కి పలుకవచ్చు

గీ. చాకివాఁ డని యనవచ్చు సన్న 'బొంకు'
పెదవిఁ జేర్చెడివాఁడని వదరవచ్చు;
ఏమనిననేమి భక్తి యొక్కింతగల్గి?
యేమనక యేమి యది లేని హీనజనుఁడు! 7

సీ. చెడుకంపు గొట్టెడి చేఁప నాఁ జెల్లదో?
తాబేలని వచింపఁ దప్పు గలదొ?
పంకానఁ బొరలాడు పంది నాఁ జెల్లదో?
అరమానిసి యటన్న నతుకదొక్కొ?
బలి నాశ్రయించిన పాఱువాఁ డనరాదొ?
మాతృఘాతుకుఁ డన్నమాట తగదొ?
తండ్రి 'పోపా'మ్మన్న ధన్యుండనఁగ రాదొ?
త్రాగుఁబోతనుమాట తగనిదగునొ?

గీ. తిండిపోతన్నఁ జెల్లదో? మొండిజగ్గఁ
డన్న సరిగాదొ? కలికిగా నాడరాదొ?
అతని పూర్వోత్తరమ్ముల నరసి భక్తి
గల్గి యేమన్న దోసఁగొండు గలుగఁబోదు. 8

సీ. విధవవాజి యటన్న బుధు లొప్పరో? విషా
శ్రయుఁడన్న సత్కవీశ్వరులు వినరొ?
కీరహితుం డన్న సూరు లొప్పరొ? యశో
దాదారకుం డంచు వేదు లనరొ?
నరకాభిగామి యన్న మహాత్ము లొప్పరో?
స్థిరగదుం డన విపశ్చితులు కనరొ?

హరశిశుపాలకుం డనరొకో విజ్ఞులు?
గోత్రోద్ధరణుఁ డనుకొనరొ కవులు?

గీ. ఎందుఁ గురుకులవిద్వేషి యీతఁ డనఁగ
వచ్చు, నీశునక మ్మనవచ్చు; నిచ్చ
భక్తి యొక్కింత యేనియుఁ బాదుకొన్న
వాఁ, డితరుఁ డేమి యన్నను వమ్ము నమ్ము. 9

గీ. తల్లికి మగండు, * లంజకు ధవుఁడు, నోట
మన్ను గొట్టుకొనినవాఁడు, మామగారి
కొంప గూల్చినవాఁ, డత్తఁ గొనరువాఁడు
లోనగు పదంబు లెన్నియు నేని గలవు. 10

తే. గీ. అన్ని పదములు భగవంతునందుఁ జెల్లు
నన్ని శ్లేషలు వానికి నన్యథా స
మంజసార్థప్రదము లయి మలయు; వాని
పేరు ధరియించుచోటఁ జేకూఱు టెట్లు? 11

తే. గీ. మంచిగంధపుఁ జెక్కలసంచి రాస
భంబు లెటు లట్ల యా భగవంతునామ
మందఱును జేర్చి ధరియింతు; రంతమాత్రఁ
దత్తదుచితంబులు గొనాలు దవులఁ బోవు. 12

క. తిరుపతి వెంకనయనఁగాఁ, దిరుపతివెంకనయె యనుచుఁ * దెగఁబొగడిరి కొం
దఱు; నీవో తెగఁదిట్టితి, విరుమతముల దేవతాత్వమే నస్నెసెఁ. 13

---

* లంజా, లక్ష్మీః, (ఏష్టి, నిఘంటువు చూ.)

* తిరుపతి వెంకటేశ్వర నామము తమకు సార్థకమేయగుచున్నది... ఇమ్మహాకలియందు దేవరవారు నామమాత్రముననే గాక ... యు...ము... ము...మును...విచారించిన శ్రీ తిరుపతి వెంకటేశ్వరుని భాతిఁ జెలంగిరన్న నెంతయు నొప్పిదమే యగుచున్నది..."

వేలూరి సుబ్రహ్మణ్యం, అమరవరం, భద్రాచలంపోష్టు, 4-8-13

[illegible] పరా:— ఈవిషయమున కెన్నేని యుత్తరములున్నను విస్తరభీతిచే నొకటి మాత్రమే యుదాహరించి యిన్నకుంటిమి.

ఆ. వె. హితుల సుతుల కే మహితుఁడవయ్యును నీవు, నన్ను దేవుఁ జేసినావు గాన
నతనియంశ మేదొ యధిక మందలకన్న, నన్నుఁ జెందినట్టు లెన్నవలయు.

ఉ. తిట్టిన నేమి, నీనుడువు తిట్లు మహాత్మకు సాక్ష్య మిచ్చె; నా
"గొట్టియ చేతిలోఁబడియె"; రోసముతోఁ బని లేదు గాని నీ
పట్టినపట్టు తప్పు, పలుపాపము లక్కటనం బొనర్చుచు
న్నట్టులు నాకుఁ దోఁచు; నది యడ్డెద శక్తికొలంది నందుచే. 15

ఉ. ఏదియొ హేతు వుండవలె నించుక, తిర్పతివేంకటేశు మ
ర్యాదకు వీఁడు పాల్పడుట యన్నది యూరక యెట్టులబ్బు? వీఁ
డేదెసవాఁడు? తిర్పతి మఱేదెసవాఁ? డెటు లిర్వు రేకమై
రో? దురితపరిచారుఁకు నూరక గోచర మేల కావలెన్. 16

ఉ. అందుకె కాదు, పూర్వకృత మన్నది యెందులకేని తప్పు; దే
వందదయొ తక్క నీనుడికి బద్ధుఁడు గాని వివేకి లేఁడ; యిం
తెందుకు? నీవు దేవగురుహేళన సల్పుటకేని యేదియో
కందు పురాకృతం బొకటి కల్గియ తీరవలెన్ గుమారకా. 17

ఉ. కర్మవశంబ కాక యిటుగాఁ దిగియుంతువె? బుద్ధిచెప్పుడుం
గర్మము నంటి పోవు; నది కార్యము చే నను మేయ మయ్యె; నే
కర్మము త్రిప్ప నాతరము గాదని కొంత యెఱింగియుండియున్
ధర్మము గామిఁ గొండొక వృథా ప్రలపింతు భవద్గతార్తినై. 18

ఉ. కాన సమస్తమానవులు గర్మపుదాసులు, నిక్కమింత; య
ద్దాని కతాననే యెటులొ దక్కను దిర్పతివేంకటేశు నా
మానఁ బ్రసిద్ధి చెందఁగల మాన్యత నా; కికఁ నీకొ? దక్కె న
ద్దాననె వేంకటేశగురుదైవతవైరకృతాపచారముల్. 19

గీ. ఒకఁడు వేంకటరాముఁ డింకొకఁడు రామ
కృష్ణుఁ డీరెంటిలోఁ గొంత గిలుబుఁ జేసి
వ్రాఁకినా రట్లొ వేంకటరామకృష్ణ
పదవి; కీపాట్లు మాకుఁ జొప్పడవు తనయ ! 20

ఉ. వేంకటనేతఁ దిట్టినను వేంకట నామము మోము ద్రొక్కె నీ
వంక మడంచుచున్నయది; బాలక! 'వేంకటఁ' దీసికొన్న స

ర్వ్యాంకము రామకృష్ణునిది యగు; నొక "రామ" పదమ్ము లోన మీ
రింక నడంగఁగా వలయు నిర్వురు భావుకు లెంత కష్టమో ? 21

ఉ. 'వేంకటరామ' లోనఁ గల వేంకట శబ్దముఁ దీసి, రామకృ
ష్ణాంకము లోని రాము పద మట్టులె యూడఁగఁ దీకి, రామకృ
ష్ణాంకము దాల్చినన్ గురుని యాకృతి పేరునఁ దోఁపకుండు; మీ
రింక నటుల్ పొనర్పఁ జను; హేయపు "వేంకట" నామ మేటికిన్ ? 22

ఉ. ఏ యవివేకియో యొకరుఁ డెట్టులొ * మీసములం దగిల్చి 'పి
న్నాయన !' యంచుఁ బిల్చెనఁట నాయన చెల్లెలి; నట్లె వెంకనన్
బాయఁగఁ దోఁచి నీవు గురుపట్టపుఁ బీఠమునందుఁ జర్లనా
రాయణు నిల్పుపూనికయుఁ బ్రాజ్ఞులకుం గనుపట్టు నర్భకా! 23

ఉ. ఏ యొక లేశమో నోడువు లేని జ, మంతన నీకుఁ జర్లనా
రాయణుఁ డోజ్జయై యొసఁడు రాయియు అప్పయు నయ్యెనేమి ? నన్
డాయఁగ వచ్చినప్పు డొకటన్ మును కాఁకరపత్రిఁ జర్లనా
రాయణుఁ డే పచించెఁ జుమి యర్భక ! తద్గురు తాల్ప తాగతిన్. 24

క. ఏకాక్షర పరిదాతృత, చేకొని యుం గురుని గాఁగఁ జెప్పికొనఁగ నా;
నాకిది యక్కఱ జ, మీ తని, నేకతనన్ దోఁయఁగల్గి తెలిఁగింపవనా! 25

ఉ. వేంకటశైల దేవుపయి వేరము పుట్టుటఁ జేసి వానిపా
పాంకము దాల్చు వెంకనయు నట్టిఁడ యయ్యెను ? బాగు బాగహో !
"వేంకట" యన్ పద మ్మరిది, వీడుము దాని; * నరిప్రతిష్ఠితం
బంకము పెట్టుకోఁడగని వంపురు పెద్ద లెఱుంగు మర్భకా. 26

గీ. "కాలు పట్టుక పడలాఁగఁగాఁగడంగఁ,
జూరుపట్టుక వ్రేలాడు" తీరుదోఁచె :
"బొంగరి బుజానఁ బెట్టుక పొమ్మటన్నఁ,"
బోక వెంకన నీకేఁ దేఁకుఁ గంటె ? 27

---

* "సీ. మేనత్తమూతికి మీసమ్ములంటించి పిన్నాయనాయని పిల్చినట్లు."

* "ఘోష పదాద్యంత రంతస్థం... (అనరిప్రతిష్ఠితం)... నామ కుర్యాదితి నామకరణ సంప్రదాయవిదో యాజ్ఞికాః.

ఉ. పేరది మార్చికొమ్మ, పయి వేంకటనేతభయంబు నీకు దు
ర్వారము గాకయుండుఁ; గులపద్ధతి మున్నుగఁ గొన్ని మార్చుకోఁ
గోరిన నీకుఁ బేరొకటి కొండొక మార్చిన నేమి పోవు? ని
స్సారపుఁ ద్రోవ ద్రొక్కెదవె? చాలు నిఁకన్ విడు మీదురంతముల్.

ఉ. ఎట్టికులమ్మునన్ బొడమి, తెట్టియపాత్రపుఁ ద్రోపఁ బాపపుం
గుట్టెగఁ ద్రొక్కుమంటివి? విది గూడదునూ, కని గల్గెనేని నన్
దిట్టుము మిన్నకుండెదను; దేవునిఁ దిట్టకు, మెల్లలోకముల్
దిట్టి శపించు ని, న్నొకట దేఁకుడు నందనుకోకు మర్భకా. 29

ఉ. ఎందులకేని యేగవలె నెక్కడకేనియు, "వీఁడె వీఁడె యా
నిందకుఁ," డంచు వ్రేలిడొన నిన్ గనిపించుచు నొండొరుల్ పరిన్
ముందర వెన్క నాడుకొన ముచ్చముడుంగుట యెంత కష్ట? మే
నిందకు సైఁచినన్ ద్రిభువనీపతి నిందకు సైఁప రెవ్వరున్. 30

☞ పరా:— చదువరులారా? ఈ పైని, వెం॥ రా॥ ల॥ తిరుపతి వేంకటేశ్వరార్ధ శతకమునుండి గొన్ని పద్యములనెత్తి చూపుచు వానికి సంబంధించిన మాసిద్ధాంతములను దెల్పుపద్యములు నెలకొల్పుదుము. వెం॥ రా॥ లయుక్త ప్రసంగము సర్వమును జూడఁగోరువారు, వారియర్ధశతకము పూర్తిగాఁ జూడఁగోరుచున్నాము. తి॥ వెం॥

(...సకలాంధ్ర జగమ్మున కీపవేల్పువై వెలయఁగ లేదుగా...)

శా. నాకున్ దేవుఁడె, నీకు దేవుఁడె సుమీ నాయన్న! వెంకన్న; యే
లోకుల్ వానిని సన్నుతింతు రఘుపల్లుల్ దెప్పింపఁగా; నాంధ్రిపన్
లోకంబం దొకకొంత గాదు పదునాల్గున్ లోకముల్ గూడ న
య్యేకాకారుని గొల్తు రెరో విమతుల్ హీనుల్ జడాత్ముల్ వినా. 31

(...ఏరాజమహేంద్రిమందిరవరమ్మున నీకుఁ బ్రతిష్ఠ గల్గె...)

ఉ. రాజమహేంద్రిమందిరవరానఁ బ్రతిష్ఠయె లేదుగా? మహా
రాజనతాంఘ్రి వేంకటపరాత్పరమూర్తికిఁ; *సీకాపురీ

---

*(1910 సం॥ 1-2- సంచికలుఆర్యమతబోధినినుండి)
శ్రీతిరుపతి వేంకటేశ్వర మాహాత్మ్యము.

"శ్లో॥ సగర్భాపాంబరహేతీనాం సుషమావహమూర్తయే, సర్వార్తిశమనాయాఽస్తు వేంకటేశాయమంగళం." (వేంకటేశ్వరస్తోత్రం)

రాజమహేంద్రిమందిరవరంబునఁ గల్గినపూజకూడ నీ
కో జడబుద్ధి! సుంతయిన నూహకు రాదది యేమికర్మమో. 32

(పామరులైన దాసరులు బ్రహ్మరథమ్మును బట్టి దేవతాగ్రమణివీవ యంచును ముఖస్తుతి సేయుచుందురు.)

ఉ. "పామరులైన దాసరులు పట్టిరి బ్రహ్మరథం" బటంటి; వా
నామము నెట్లు వ్రాసితి వనాథజనంబులు పట్టినప్పు? డీ

---

ఈకలియుగములో వేంకటేశ్వరుఁడు ప్రత్యక్షదైవమై యున్నాఁడు. కావుననే పెద్దలు "కలౌ వేంకటనాయకః" అని నుడివియున్నారు. వేంకటేశ్వరుఁ డార్తత్రాణపరాయణుఁడు. ఈతఁడు నతజనుల బాధలుమాన్ప, తిరుపతిలో వేంకటాద్రియందు వేంచేసియున్నాఁడు. నిక్కమైనభక్తితో నీదైవమును గొలిచిన డింగరీంద్రు సర్వవిధములగు బాధలనుండియుఁ దొలఁగి సుఖపడుదురు. కావునఁ బ్రతివత్సరమును వేలకొలఁది భక్తులు తిరుపతివేంకటేశ్వరుల దర్శనమునకుఁబోయి యార్తిరహితులై గతకిల్బిషులై తమతమ నిలయంబులకుఁ జనుచుందురు. ఇయ్యది యాస్తికులగు హిందువులకెల్ల బాగుగాఁ దెలిసినవిషయమే యైనను నిప్పుడు మనహిందువులలోనే కొందఱు క్రీస్తుమతవికారమగు బ్రాహ్మమతమును గల్పించుకొని యీప్రత్యక్షదైవతముయొక్క మహిమను గూర్చి సందేహించుచున్నారు. సందేహించుటయేకాదు, భక్తిచే వేంకటేశ్వరుని సేవించు సాధుజనులఁ బరిపరివిధముల నిందించుచున్నారు. ఇట్టి వారికిఁ గూడఁ దనమహిమ బోధపడి వారు కూడఁ దనభక్తులై తరింపవలెనను వత్సలత్వముచేఁ గాఁబోలు గాఢముగా నీబ్రాహ్మమతప్రథ ప్రకాశించుచున్న బ్రాహ్మసామాజిక శిబిరములలోనే తనదివ్యమహిమను శ్రీవేంకటేశ్వరులు చూపుచున్నారు. ఈనడుమనే యీక్రింది మహాద్భుతము జరిగినది.

పిఠాపురపు సంస్థానాధిపతులై శ్రీవేంకటేశ్వరపాదభక్తులై యాస్తికశిఖామణులై కీర్తిశేషులయిన శ్రీరాజా రావు గంగాధర రామారావు బహదరు వారి భార్యలలో శ్రీరాజా భావయమ్మారావుబహదరుగారనువారొకరు పిఠాపురపు సంస్థానాధిపతుల యింటనే యున్నారు. వీరొక సంవత్సరమునుండి యజీర్ణవ్యాధిచే మిక్కిలి బాధపడుచుండిరి. ఏమి తినినను ఇముడుటలేదు. మంచినీళ్ళు పుచ్చుకొనినను దత్క్షణమే వెళ్ళిపోయెడివి. దాన దేహము చాల

వేమతితోక్కొ? బ్రహ్మరథ మెవ్వరు పట్టిన సార్థకంబొ వా
రే మతి పట్టి; రూర కరు లేడ్చి కృశించిన నేమగుఁగా సుతా. 33

చ. ధనికడ దాస్య మూను నొక దాసరి, వేంకటనాథుపాదవం
దనమున దాస్యముల్ సలుపు దాసులు పామరు లంచు దూఱుటల్

---

శుష్కీభూతమై పోయినది. ఇప్పటి సంస్థానాధిపతులు తమ కామెయందుగల భక్తిచే ననేకవిధ ఘనవైద్యులచే వైద్యము చేయించిరి. ఆలోపథీ, హోమోపథీ, మున్నగు పథములెల్ల నయినవి. ఆయుర్వైద్యశిఖామణులగు పండిత గోపాలాచారిగారిని చెన్నపురినుండి రప్పించి వారిచే వైద్యము చేయించినారు. కాని యేమియుఁ గార్యము లేకపోయినది. మానవప్రియత్నమంతయు నీవిధముగా నిష్ఫలముకాఁగా నప్పుడా సాధ్వీమణి తనకు దైవమే శరణమని నిక్కముగా నమ్మి తమ యిలువేల్పగు వెంకటేశ్వరుని "అన్యథాశరణం నాస్తిత్వమేవశరణం మమ" యని యంతరంగమునఁ బ్రార్థింప మొదలుపెట్టినది. భక్తవత్సలుఁడగు వేంకటేశ్వరుఁడు తన్నునే నమ్మిన యీభక్తురాలిపైఁ గరుణకలవాఁడై యొక నాఁడామెయం దావేశమై "నాకొండకు వచ్చి నన్ను దర్శించినయెడల నీరుగ్ణత నివారితమగు" నని పలికినాఁడు. అప్పటికి వ్యాధి మిక్కిలి హెచ్చుగానున్నది. కొండకు వచ్చెద నని మ్రొక్కికొనినది మొదలు వ్యాధి నివారించునని వేంకటేశ్వరులు వచించిరి. ఈవార్తను పిఠాపురపు సంస్థానాధిపతిగారికిఁ దెలిపిరి. వారు బాధ నివారణమగునెడలఁ దప్పక యట్లు మ్రొక్కుకొనవలసినదే యని మిక్కిలి సరసముగాఁ బలికిరి. ఆమెయందుఁగల భక్తిచే వారా మ్రొక్కును చెల్లించుట కంగీకరించిరి. వారిమాటపై యాసతి యట్లు మ్రొక్కికొనినది. అదియేమి యద్భుతమో! ఆ వేంకటేశ్వరుని ప్రభావమెట్టిదో! గాని మ్రొక్కికొనినదాదిగా నారోగమంతయు మటుమాయమై పోయినది. తినిన పదార్థము లెల్ల వెళ్ళిపోకుండ నిముడఁజొచ్చెను. ఈ శుభవర్తమానము సంస్థానాధిపతిగారికిఁ దెలుపఁగా వారాశ్చర్యచకితులైరఁట! ఆమె భుజించువేళఁ దామచ్చటనుండి భుజించినపిమ్మట గంటవఱకును నచ్చటనే యుండి తినినపదార్థమిముడుటను గని యామెను వెంటనే మ్రొక్కికొనినప్రకారముగాఁ దిరుపతి పంపించిరి. ఆమె తిరుపతివెళ్ళి స్వామిని దర్శించివచ్చిరి. ఇప్పు డారోగ్యస్థితియందుండినది. ఇక్కడ నామెభక్తి, శ్రీ వేంకటేశ్వరుల మహిమ, శ్రీపిఠాపురపు

కనిన వివేకి సైఁపఁడు, వికావికనవ్వు, వహో! ధవంబు* దం
ధన మని తిట్టుఁ; బామరులు ద్రవ్యపుదాను, లౌరల్ వివేకులే. 34

రాజుగారి సరసతయు, చాల వర్ణనీయముగా నున్నవి. నిక్కమగు భక్తి యెన్నఁటికిని వృథాగాఁబోదు. "సర్వార్తిశమనాయాస్తు వేంకటేశాయ మంగళం."

---

(1911 సం॥ 1, 2 సంచికలు, ఆర్యమతబోధినినుండి)

(వేంకటనాయకుని మహిమ.)

కలికాలదైవతమగు వేంకటనాయకుఁడు తనమహిమనంతను నిప్పుడు పిఠాపురపు కోటలోఁ జూపుచున్నాఁడు. కీర్తిశేషులయిన వెనుకటి పిఠాపురపు రాజుగారి రాణులలో నొక్కరు బహుకాలము తీఱనివ్యాధిచే బాధపడి తుదకు వేంకటేశ్వరుని దయచే నారోగ్యస్థితి నందెనని వ్రాసియుంటిమి. ఈసాధ్వికీనడుమ మరల రుగ్మతకలిగినదంట. అంత దానికిఁ గారణము నారయఁబోఁగా మరల నామెయందు వేంకటేశ్వరు లావేశమై యిప్పటిరాజుగారికిఁ బుత్రలాభము కలిగినప్పుడు తనకు 1116 రూపాయల ముడుపు చెల్లింతుమని వాగ్దానము చేసియును జెల్లింపనందున నీరోగము మరల నంకురించెనని నుడివెనంట. ఆపలుకుల నిప్పటిరాజుగారాలించి జరిమానాసహితముగా 1116 రూపాయలను వేంకటేశ్వరులగుడికిఁ బంపఁగా నాసతీమణి రుగ్మతయంతయుఁ దృటిలో నివారితమయ్యెనంట! ఆహా? వేంకటేశ్వరుని మహిమ చాల వర్ణనీయముకదా. నిక్కమగు భక్తిగలచోట దైవమహిమ కాన్పింపకపోదు.

(శ్రీ వేదాంతదేశికస్వామివారి శ్లోకములు)

* శ్లో. శరీరపతనావధి ప్రభునిషేవణాపాదనా
దబింధనధనంజయప్రశమదం ధనం దంధనం
ధనంజయవివర్ధనం ధన ముదూఢగోవర్ధనం
సుసాధన మబాధనం సుమనసాం సమారాధనం.

శ్లో. కాచాయ నీచం కమనీయవాచా, మోచాఫలస్వాదముచా న యాచే
స్థితేఽకుచేలే శ్రితమాకుచేలే, దయాకుచేలే ధనదత్కుచేలే.

శ్లో. శిలం కి మనలం భవే దనల మౌదరం బాధితుం
పయఃప్రసృతిపూరకం కిము న ధారకం సారసం

ఉ. కూఁతున కత్తె పేరిడి రగుల్కొను కోపముకల్మిఁ గుంపటన్
బాఁతివరీతి నెందులకొ పాడునదుల్ జగదీశుఁ బల్కు నీ
వాతివివేక మే మనఁగ వచ్చుఁ గుమార ? విభుండు నిన్నటో
నీతికిఁ ద్రిప్పి దోసము గణింపక నాకయి ప్రోచుఁగావుతన్. 35

మ. "గురులన్ దూఱుటత" ప్పటంచు సుజనుల్ గొండాడ, "లెక్కేమి? దే
వర నే దూఱెద నే" నటంచుఁ గవితన్ బాటించునీతెల్వి క
వ్వరు శోకింపరె ? నీకు శ్రీయ మెటులో ప్రాప్తించుతన్ వేంకటే
శ్వరుఁడే నా కయి ప్రేమఁ జూపుచు భవద్వాచాలతల్ సైఁపుచున్. 36

సీ. వేంకటేశ్వరుఁడు నీవెకలితనం బోర్చి రక్షించుఁగాక మాపక్ష ముండి
యతనిదేవేరి మహాలక్ష్మి పతికోప ముపశమింపించి ని న్నోముఁగాక
ఆదేవు రెండవపైదలి భూదేవి క్షమ నిన్నుఁజూచి శ్రేయ మిడుఁగాక
యతనిపేర్మిమడిచాన యాత్మజబుద్ధి నీపై నుంచి నీల కాపాడుఁగాక

తే. గీ. అతని కావాస మగు వేంకటాచలంబు
నీదొసంగు లడంచి మన్నించి "వేంక
టటి" యనెడుమాట సార్థకగతి నెసంగ
సద్యశము( బొందుటకు నిన్ను సాఁకుఁగాక. 37

("దేవుఁరుగొట్టువై బయలుదేఱుదు తిర్పతి వేం...")

ఉ. "దేవురుగొ" ట్టటంచు నలదేవుని దిట్టెడి నీదువాల్కకున్
శ్రీవిభుఁ డల్గకుండుత; స్వసేవ యొనర్చెడి నాకునై సదా
నీ వెటు ప్రేలినన్ సయిచి నీకు శుభం బొడఁగూర్చి నన్ను సం
భావన సేయుఁతన్ జగతిఁ బండితమండలి మెచ్చునట్లుగన్. 38

మ. "పగనైనన్ వగనైనఁ బ్రాణభయమున్ బ్రాపించియైనన్ సదా
భగవన్నామ మెదం దలంచుటయపో భాగ్యంబు, ముక్తుండు వాఁ
డగు" నంచున్ వచియించు గ్రంథములు; నీ వద్దేవునిందిట్టియే
న గడింపం గల వమ్మహాత్మ్యపదము న్నిక్కమ్ము నమ్మర్భకా. 39

మ. "చిరకాలమ్మునఁగాని భక్తిమెయి వాసిం గొల్చి పొందంగనే
రరు తద్దేవుని పాదదర్శనము; నైరం బూనుచో శీఘ్రమే

అయత్నమలమల్లకం పథి పటచ్చరం కచ్చరం
భజన్తి విబుధా ముధాహ్యహహ కుక్షితః కుక్షితః

యరయుం జాలుదు" రంచు విందు; మది తథ్యమ్మైనచో నీ కరుణ్
ద్వారలోఁ దిర్పతివేంకటేశపదపద్మప్రాప్తి యాత్రారతిన్. 40

(నీ। వదివఱ కీశ్వరుండవఁట ?...నీకొకయయ్య...వైష్ణవంబిడినవాఁడఁట)

మ. హరుఁడే కా, యల వేంకటేశ్వరుఁడు ము ? స్పష్టేయగుంగాక నో
రలుగన్ దిట్టితి రుష్టుఁ డయ్యె నతఁ; డీయత్యాహితం బాఁగ నీ
గురుముఖ్యుండె గలండు, దేశికుని కగ్గల్ గట్టి దుష్టత్వమున్
బొరయన్ జేసెద వేది దిక్కు ? * శివుఁడున్ బూనండ యిప్పట్టునన్.

మ. హరుఁడే దేశికు నడ్డఁజాలఁ డనుచో నన్యామరశ్రేణికిం
దరమే ? వారలయంశ మింత గల ధన్యమ్మన్యసంసారు లె
వ్వరికేనిం దరమే ? శరణ్య మెదియో వాక్రుత్తు నీ వేంకటే
శ్వరుఁడే నూ ! యల వేంకటేశుఁడును గావన్ లేఁడ యిప్పట్టునన్. 42

ఉ. "దేవుఁడె లేని మానిసికి దేశికుఁ డెక్కడినుండివచ్చు" నం
చీవల నింతకాలమున కించుక బోధకు వచ్చె; మేలు ! నీ
చేవ, సెబాసు ! నీవవను, సీ ! వహవా ! భవదాస్తికత్వ, మీ
త్రోవను బోవుసాహసికి ద్రోహము చేయఁగ రాని దుండునే. 43

ఆ. వె. "అమ్మ చెవులు ద్రించు నమలాత్ములకు నెందుఁ
బిన్నతల్లిచెవులు బీఱుపూలుఁ
గావు" దేవుఁ దిట్టు గడుసుమానిసి కుపా
ధ్యాయుఁ దిట్టు టెంత తప్పిదంబు. 44

(తాతికి ఱప్పకు మ్రొక్కఁజెల్లునే)

చ. తొలి నతఁ డీశ్వరుం డగుచుఁ దోఁచియు వేంకటనప్రసక్తిఁ జె
న్నలరెను వేంకటేశుఁడుగ; నజ్ఞులరజ్ఞులకేమి, సోమయా
జులు మును గొల్చు వేల్పువలెఁ జూ మ్మృతుఁడౌ హరియున్ హరుండు; మూ
ర్ఖుల కతఁ డొక్కటాయియు నగున్ దలదిమ్మ వదల్చుపట్టునన్. 45

ఉ. రాతిని దిట్టి తా "నొకయరాతిని తిట్టితి" నంచు నెంచు నే
వీతనయుండు, వాఁ డొకట వేరము భారము గాఁగ నెత్తితో

శ్లో॥ * శివక్రోధాద్గురుస్త్రాతా, గురుక్రోధాచ్ఛివోనచ॥ (గురుగీత)

కాలిని బిట్టు మట్టితయు "నగాలిని మట్టితి"వంచు నెంచుఁ జూ
ఘ్మాతనయా! వివేక మిటు లూరుచు నున్నది వాఁడు వాఁటికిన్.

ఉ. రాతి కరాతి వైరి, వలరాతిని దేవుఁడె యున్నచోఁ బురా
రాతి కరాతి వైరివి, భరం బది మైమయిఁ బోన దమ్ము రా
రాతి కరాతివైరివి, పురాతనవిజ్ఞులు రోసినట్టి దీ
భూతిమతంబు; దీనఁ బరభూతియు వక్త్రవిభూతియుం జెడున్. 47

చ. తిలకము లేనిమోము పితృదేవత లాదటఁ జూచి "యక్కటా!
తిల + కము మాకు నున్న" యని తిట్టి శపింతు రటంచు చెలుంగ రే
యులఁతులు, వారి త్రోవఁబడి యర్భక! చక్కని యన్వయంబు తి
ప్పల కెరఁ జేసి తంచు భగవన్ వలసెన్, దలిసెన్ భవద్గతుల్. 48

(దేవుఁడ నాఁదువేని... వేంకటేశ్వరా)

ఉ. "దేవుఁడ డాదువేని" యని దిట్టతనాన నెదో సచించి; తా
దేవుని కింతమాత్రమునఁ దీవ్రత పుట్టను; ముందు మొక్కి కో,
మ్మా వెనుకన్ నిరాదరణ కగ్గము గమ్ము పు దేమి యానో? యా
దేవుని దేవతాగరిమ తెల్ల మగు న్నిమునమ్ము లోపలన్. 49

శా. నేనే యించుక చర్చ చేసితిని నీ నేరంబు వారింప;నీ
వేనోరో యెర దొండు తెచ్చికొని యొంతేఁ బ్రేలు, మా వేంకటే
శానుం డీయుఱపుల్ గణింపఁడు, శిలాసౌజన్యమే చూపు నీ
పై; నేమందువొ?* "యాదృశీ" యనెడివిద్వద్వాణి దుర్వాణియే. 50

(మహాత్ముఁడు విగ్రహపూజ గాదనెన్)

ఉ. స్వచ్ఛపువంశమున్ గణన సల్పవ, పెద్దలమాట లెక్కలే,
దిచ్ఛను వచ్చినట్టులుగ నేవియొ పల్లదము ల్లిఖించి యే
మ్లేచ్ఛమతంబొ పట్టి పయిమిక్కిలి దేవునిగూడఁ దిట్టి సం
పచ్ఛకలంబుకోస మిటు పాటుపడం దగునే కుమారకా. 51

(విగ్రహారాధన సేయురెవ్వరు)

ఉ. విగ్రహమున్ ద్యజించి గురువిగ్రహమున్ దల కెత్తికొంటి,నీ
కాగ్రహచార మెట్లయిన నాపలకున్ జనదయ్యె; నిన్ను నే

---

తిల + కము, తిలోదకము,

*శ్లో॥ యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ.

దో గ్రహ మొండు చెడ్డదయి యోగ్యతకుం గడు దవ్వొనర్చె; నీ
వాగ్రహతృప్తి కీమతము నందితి వంతయు నే నెఱుంగుదుక్. 52

(శంకరపాదుఁ డర్చికోపాసన నీసడించెను)

ఉ. కావలె భార్య, పుత్రులును గావలె, ద్రవ్యము గావలెక్, మఱిం
గావలె సౌఖ్యముల్, మఱియుఁ గావలె సర్వము; విగ్రహమ్ము పోఁ
గావలెనే కుమార ? సరిగా విను "విగ్రహపూజనమ్ము మూ
ర్ఖావళి" కందు వేని యెటు లార్యులు శంకరముఖ్యులొప్పిరో. 53

(వ్యాసమతంబు... నేఁడు క్రొత్తగాఁ జేసినదారిగా దిది)

ఉ. వ్యాసులవారు సూత్రముల బ్రహ్మముఁ దెల్పి పురాణమందుఁద
ద్భాసుర చిద్విలాసముల భంగులు దెల్పిన వారు; సూత్రవి
న్యాసము చూపి తర్కగల సంగతులక్ ద్యజియించువారు స
న్న్యాసులు, భ్రష్టు లౌదురు గృహస్థు లటుల్ చరియింపఁ బూనినన్. 54

ఉ. అన్నిటి కేకవాక్యతగ నారసి చూచిన విగ్రహంబు సం
పన్న గృహస్థుకోస మనుభావము దేలెడి, నిర్గుణాత్మ నె
ట్లెన్నఁగ నేర్చు వీఁడు ? గుణమే కడుముఖ్యము గాఁ దెలంగు నీ
సన్న యెఱుంగ రారకయ జందెము ద్రెంపెడి గేస్తు లర్భకా. 55

ఉ. వ్యాసులు బ్రహ్మముం దలఁచి యాతని విగ్రహరూపమం దెదో
గ్రాసముఁ బూని తిట్టు మనిరో ? విని రోయుదు రిట్టిత్రోవ జ
జ్ఞానువు లర్భకా ! యిటులు కానరకూసర బోధసేయఁ డా
వ్యాసుఁడు; దీని నింక నొకవ్యాసు నుపాసితుఁ జేసి నేర్చితే ? 56

ఉ. వ్యాసమతమ్ముఁ బట్టి యలబ్రహ్మముఁ గొల్తువుగాక, యెడ దీ
కూసుమతంబు ? దేవగురుకోపమహాపదవాప్తసర్వస
న్న్యాసకృతంబు; నీపలుకు లర్థములేని పదార్థపద్ధనా
భ్యాసపు వ్యాసముల్ గిలుకువారలకాఱు లసారముల్ సుమీ.

శా. వ్యాసుం డీమత మొప్పెనే ? కటకటా ! వ్యాసాశయం బెట్లు ? స
న్న్యాసుల్ పోవుపథంబు గేస్తులకుఁగా వ్యాసుఁడు శాసించునే ?
దాసీదాసకళత్రపుత్రవితతిక్ దౌదవ్వులం ద్రోలకే
లా ? సంసారికిఁ గర్మబంధ మది వాలాయమ్ము డీలయ్యెడిక్. 58

ఉ. శంకరు లొప్పినారు మతపట్టము; విగ్రహపూజయందు ని
శ్శంక మె పట్టము౯; జడులసంగతి నిప్పటియట్ల పాపపుం
బంకముగా జగంబు నిలుప౯ గమకించినయార్యుఁ డాతఁ డీ
శంకరుఁ బోఁడు, వ్యాసమతసర్వరహస్యవిదుండు గాఁడొకో. 59

క. శంకరమతమ్ము గా దిది, సంకరమత మైన నగును; శంకరుఁ డెట్లా
శాంకరిని బీఠమున ని, శ్శంకమ్మగ నుంచి పూజ సల్పెఁ గుమారా. 60

మ. తల బోడిం బొనరించి, జందెములు తద్దం దెంచి, "సన్న్యాసిపో
కలు గాఁ బోదు" మటందు రెవ్వ రలవా ర్కంజాక్షుల౯ వీడ, రే
తలఁపుల్ మానరు, "దేవళం" బనిన నిందల్ సేతు; రీచెట్టపో
కలు నీ కేగతి నబ్బెఁ దుట్టతుదకు౯ గార్హస్థ్యసంచారికి౯ ? 61

శా. ఏకర్మమ్మును వారు మానరుసుమీ ! యీ కర్మమే తక్క; నీ
వీకర్మం బన నేమిగాఁ దలఁచెదో ? యేకర్మ మార్యుల్ బుధ
శ్లోకుల్ శ్రీకరు లప్పదీక్షితముఖుల్ శోధించిరో వేదవి
ద్యాకంజాతభవావతారు; లది యేతచ్ఛబ్దతో బోధ్య మా. 62

శా. జ్ఞానప్రాప్తి కనేక మార్గములు విజ్ఞానుల్ పరిసంగించి ర
య్యానందాత్ముని కిన్ని మార్గములు తుల్యంబుల్ సుమీ, విగ్రహా
ధీనుల్ గొందఱు గల్గుమాత్రమున నే దేశంబు గోసెత్తెనే ?
జ్ఞానం బూరక కల్గునే ? యదియు నంగళ్లమ్మ క్రియ్యామ్మెకో ! 63

మ. ఎవఁడో యొక్కని కబ్బెఁగాక శ్రమ లేకే జ్ఞానసంపత్తి; యిం
కననిఁ దక్కినవార లెల్లరును నట్లో వారె ? యవ్వారికై
శివవిష్ణ్వాలయముల్ చెలంగుత; మెటుల్ శిష్యుండ ! నీ కర్త్య నీ
యవివేకంపుమతంబు? దేవగురునిందానందసంధాయి వై. 64

ఉ. వేదములందు లేదనుచు విగ్రహపూజన మొప్ప దంట ! యీ
వాదులు గొంద; ఱయ్యది యవాస్తవ మందము; నూఁడుపూటలున్
సాదము మెక్కి కుల్కుఁ డని సారెకు వేదము లేర్పుచున్నవే ?
లే దట భుక్తికి౯ విధి; యలీకము గా దది మాన రాదొకో. 65

శా. ఏమీ, వేదము నంతమున్ దెలిసియే యీ మెట్టవేదాంతపుం
బూమె ల్వ్యాప్తెనె ? దీనికి౯ ఫల మెదో పోనిమ్ము యోజింత, మా

ర్యామోదం బడి తప్పిపోవుట, యుపాధ్యాయాగ్రహోదగ్రసం
గ్రామారంభము నెత్తిపైఁ బడుటయుంగా కన్యముం గల్గునే ?. 66

చ. తిరుపతివేంకటేశ్వరుని దిట్టితివే యను, మట్టితిట్లనున్
దుగకలు దూదెకుల్ మురియుఁ దొల్లిటిపెద్దలహద్దు లెట్టివో
యెఱుఁగనిమోటకుల్ గద సహింతురు; వీరలమెచ్చు సత్కవీ
శ్వరులకు వారిశిష్యుల కసహ్య మెఱుంగుదువో, యెఱుంగవో ! 67

చ. ఇతరకులస్థుఁ డేమతము నేని గ్రహించిన నంత నష్టి లేఁ;
దతులము బ్రాహ్మణాన్వయమునం దుదయించి పితామహాదులున్
బితరులు వోవుమార్గములు పిప్పిగ నెంచి స్వతంత్రులై శ్రుతి
స్మృతిగృతిదూరమైనగతిఁ జెందినవారియవస్థ శోచ్యమా. 68

క. రామానుజాదు లందఱు, నీమాత్రము తెల్వి లేకయే విగ్రహపూ
జామంత్రము లొప్పిరిగా?, యేమీ సాహసము తుదకు నిందు దిగితివే. 69

(సలాముఁ జేసి గుడిదూరెదు తిర్పతివేంకటేశ్వరా?)

చ. లలి మనవేంకటేశుఁడు "సలామిడు" నంటివి; "సలాం" పదమ్ము చేఁ
దెలియఁగ నయ్యె 'మల్క' కని; దేవుఁడు వానికి నల్గఁడే చుమీ,
"మలక పదమ్ము సాచి తను మట్టుఁడు నర్చకుఁ గొట్టె దేవి" యన్
పలుకు లెఱుంగవే తనయ? భ్రష్టుఁ తోఁ బనియేమి సామికిన్. 70

(తలఁకుచు...దండము పెట్టఁగవచ్చువారినే తలగొతిగించి...చెప్పుతో...
గొట్టెదవు)

చ. తలఁకెడివారికే విభునిదండన, 'మేనుఁగుఁ జూచి భీతిమైఁ
దలరెడిమానవుండె యొకతప్పున ముప్పన కగ్గమౌనుఁగా,
కలగజరాజుమార్గమున నట్టె చలింపక యుండు తాటియా
కులచెడు చెత్తముక్కలకుఁ గుంజరరాడ్భయ మేడ దర్భకా. 72

చ. అవుర ! విచిత్ర, మెంతటియనార్యమొకో కలి; బ్రహ్మవక్త్రసం
భవులకువంట ! మల్కల* యపాత్రపుఁగూఁతలు గీతలంట ! హా

(* రద్దేహించానుండి.)

సీ॥ కోతిరూపంబైన పోతుహన్మంతునూ వేపార్లు దైవమని వేడుకొనిరి...
అడ్డబొట్లందరూ "హరాహరా, బల్కరీ సుద్దబొట్లంత హరి పెద్దయనిరి,...

శివశివ ! రామరామ ! హరి ! శిష్టవిగర్హితమైనమార్గముం
దవిలిన శిష్యునిన్ మనిచి ధర్మ్యపథమ్మునఁ బెట్టి ప్రోవరే. 72

ఉ. సారాచారవిచారదక్షు మగు వంశమ్మందు జన్మించి ని
స్సారుల్ మల్కులః వోవుమార్గముల నిచ్చల్ నించు నీచైదిచే
ధీరుల్ దూఱక యుందురే కటకటా ! "దీన్ మావులా" వారికిన్
వీరల్ దాసులు, వారిబాస తుద కబ్బెన్ వీరి కంచున్ సుతా !

(లభించినమాయకీర్తికిన్ భంగమువచ్చె నీమహిమ పాడ్వడె)

చ. తిరుపతివేంకటేశ్వరుని దేవళ మూడినమీఁదఁగాని యీ
తిరుపతివేంకటేశునిప్రతిష్ఠకు భంగములేమి తేలె; నెం
దఱు మలకల్ ప్రయత్నపడి తద్విపిమ్మటఁగూడ దేవళా
లూరుగక నిల్చియున్నయవియో వినియుండవుగాక యర్భకా! 74

---

కొంటెలందరుగూడి కృష్ణు డనిరి... సీ॥ ...పంచితము పేడలే బహుశుద్ధి అను కొని యిల్లువాకిళ్ళల్ల చల్లుకొనిరి,... భాగవతాభక్తులు బాయగామానుకొని విగ్రహాపూజలే యిష్టమనిరి, మలమూత్రమే దోషములు తీర్చుననుకొని పేడ వుండలు పంచితాలు తినిరి... శిలలు బొమ్మలు నిమ్ము రక్షించగలవా... సీ॥ పార్వతీ దేవిపై భస్మాసురుడు మోహించి దాని మొగుడుని చంప తరిమినాడు...యింత ముండల బోతును యీనుప్రడనక, కొల్వనలెనయ్యా అల్లాను క్రమముగాను ... సీ॥...గీ॥ భిడియపడరయ్యా పాపముకు ఝడియరయ్యా, మడ్డిపూజలు యిఖనైన మానివేసి, ...౧౯॥ సీ;...భాగవతమునుబట్టి పలుగు కృష్ణునిచెరియ నిజమువ్రాసి తినయ్యా సుజనులారా,...౩౦॥ సీ॥ రామాయణమునకు భారతంబేబొంకు గొల్ల భాగవతంబుపొల్లుమనుచు,... తే॥ ఇహములోయొక్క ఖురఅను హెచ్చు యనుచూ, సత్యపురుషులు చెప్పిరీజగతియందు...॥ ౩౧ సీ॥...మొహమ్మదు... దేవతులనైననూ...రాళ్ళనైనా, పూజించకూడదని బోధించి చెప్పినామాన లేదు, ...॥ ౩౩॥ సీ॥ కుడిపరాగ్రంథమే ఖురఆను ఘనమయా యితరగ్రంథములన్ని రొంపమనుంచి,...॥ ౩౯॥ సీ॥...గోమాంసములు మాకు గోమయంబేమీకు పాలు మాకును పంచితాలు మీకు॥ ... ౪౨ ॥ సీ॥ ... గీ॥ శంకరాచారి చేసె మీ సంకరంబు, ... ౪౫॥ ... (మక్కీ మక్కీ నకలు).

(ముంగలవారు...దైవ మటంచు నిన్ గొనియాడువార లవి నేఁటికి
బూటక మయ్యె)

చ. ఎఱిఁగియు నోర్వలేనిజడు లేవిమె ప్రోగినయంతమాత్రనే
"తిరుపతివేంకటేశ్వరు ప్రతిష్ఠకు భంగముగల్గె" నంచు నీ
వఱచె; దుపాంగమై జలధి యంతయుఁ గల్లనుకోకు మయ్య! ది
క్కుఱిగ తినేమి యడ్డు భషకపరికరప్రకటారవార్భటుల్ ! 75

శా. అబ్బాయీ! నినువంటివాఁ డొకఁడు మర్యాదల్ దిగంద్రావి తే
కబ్బంబో యొకఁడల్లినంత నది నిక్కంబై జగజ్జాలముల్
తబ్బిబ్బైనను బోనికీర్తి గలభూధ్రిస్వామి కగ్గౌనె ? యే
మబ్బా ! సూర్యుని బుగ్గిచే నడఁచుదేవయ్యల్ ధరన్ గల్గిరే. 76

ఆ వె. అర్థశతకమ్ము తుపకు నవర్థశతక
మగును సంపూర్తిఁ జెందిన యట్టికతన
నప్పుడునుగూడ నీకోలి కతఁడు రాఁడు,
భయపడక తక్కుసగ మెట్లో పాడు మబ్బ ! 77

ఉ. తీతువుపిట్ట యఘ్రిము క్షితిం బడకుండఁగ నాఁగునంట ! విం
తే ? తనయా ! యటుల్ సుమీ నగేశుయశంబది వోకయుంటకై
కై తయొకింత డాఁతునను గర్వపుఁ బల్లదముల్; యథార్థపూ
ఖ్యాతియు యేని దుర్భగుల కాఱులు దాని నడంప నేర్చునే. 78

(నీకుఁ గలట్టిపాత్రిథమం బందఱులోన మెచ్చుకొనునట్టి యకాలము సంభవించె)

ఉ. ముందఱమెచ్చు మెప్పులవి ముప్పులుగా నెఱుఁగం దగున్, యశం
'బందఱు లోన మెచ్చుకొని' నప్పుడయా; నెటువంటిపండుడు
న్మందఱ 'మేల్ బళీ!' యనియు, మోమటుతిప్పి 'యపాత్రుఁ డీతనిన్
గందుమ యేని పాతకము గల్గు' నటందురుగాదె పుత్రికా !

ఉ. చిందులు ద్రొక్కి 'నేను గురుశేఖరుఁ దిట్టుట కిట్లు దేవతా
నిందకుఁ బూనుకొంటి' నన నీకడనే 'సరిగా' నటందురి పో
కొందఱు, కొందఱో, మొగముకొంచొక దిప్పినమీఁద నేమిగా
నందురొ నీ వెఱింగినరహస్యమె నే వచియింప నేటికిన్. 80

ఉ. మానసమే ప్రధాన మగు మానిసి; కందళితభక్తి భక్తి, యం
దూనినపూజ పూజ, యది యొప్పినమె చ్చది మెచ్చు, దాని కిం
పైనది యింపు, దీనికి సమస్తజగమ్ము ననుసమ్మతించు; నీ
మానసమేని యొప్పు; నది మాత్రము బ్రహ్మ సృజింపకుండెనే. 81

మ. మునుకొన్నాళ్లు త్రిశుద్ధిగా సతత మమ్మూర్తిన్ బ్రశంసించి నేఁ
డనిశమ్మున్ మదినెంచుచున్ బయికి నన్యాయమ్ములన్ గిల్కి యీ
యనయ మ్మేరికొ కట్టి పెట్టెదవె? నీయాంతర్య మల్లోనఁగా
కనఘుల్ తక్కినవారి కట్లగుట కే మత్యాహితం బర్భకా? 82

(నవ్యులు నీవు దైవత మన న్నగువారలు)

క. నవ్యుండు గాఁడె? శిష్టా, కవ్యగ్రణి హనుమదాఖ్య గలబుధుఁ; డెటు సం
స్తవ్యునిగ వేంకటేశ్వరు, నవ్యయు నుతియించెఁ జెప్పు మర్భక! నాకున్. 83

(1934 సం॥ ఫిబ్రవరి ఆంధ్రనవ సరస్వతినుండి)

# తిరుపతి వేంకటేశ్వర తత్త్వము.

చ. "తిరుపతి వేంకటేశ్వరుఁడు దేవుఁడుకాఁ"డని తిట్టుచున్న యా
పురుషుల నైతమున్ మడుపుమూటలు కట్టునటుల్ పొనర్చి నీ
గిరి కరుదేర బుజ్జగొటిగించి పసంపడి చెప్పుదెబ్బ లే
త్తెఱ నపరాధశిక్షగ విధింతువు తిర్పతివేంకటేశ్వరా! 1

ఉ. నీమహిమంబెఱుంగని వినీతులు కొందఱు నిన్నుదూఱుచో
సామము చేతనో, ధమరసంబుననో మరలించి వారికిం
గామిత మీఁగడంగెదవ కాని నిజంబుగ నీవ యగ్గినన్
భూమివుడైన ధర్మమయిపోరొకో? తిర్పతి వేంకటేశ్వరా! 2

చ. ప్రణతులొనర్చలేని తులువల్ పొనరించెడి దుష్టచేష్టలం
గణనయొనర్పఁబోకుమి, యొకానొకఁ డట్టులొనర్చకున్న న
గ్గుణరహితున్ సహింపకుమి, కోపదులేరుమ దాన నిన్ను దు
ర్గుణుఁడనఁబోక, కి పథ మెఱుంగుము తిర్పతి॥ 3

ఉ. భక్తులయందు నీకుఁ గలపారములేని కృపారసంబు సం
రక్తియుఁ జూపు పొందె నపరాధులనేరము వారినోట సా
మోక్తులచేత ముందు వినకున్న భయోక్తులచేతఁ బిమ్మటన్
వ్యక్తముఁజేసి మ్రొక్కుబడు లందెదు తిర్పతి॥

ఉ. అపమతి నీకుఁ జేసెడు దురాత్ములగర్వ మడంప నెల్లమా
నవులను బూనియుండు తిరుణమ్ముకనఁ దద్భరమేల నీకు? వా
స్తవమిది; సేనగల్గు నృపసత్తముఁ డెవ్వఁడయేని తాన శా
త్రవుల నదల్చు పూనికను దాల్చునె తిర్పతీ॥

ఉ. దైవమవైన నీయెడలఁ "దప్పులు గల్గు"నటంచుఁ బల్కు బ
ల్కావలులైన వారిపయిఁ గారుణికత్వముఁ జూపఁబోకు మ
య్యా! విధిగానఁ జెప్పితిని, నాగ్రహమొందకుమయ్య! నేతకున్
సేనకులైన వారలు వచింపరె॥ తిర్పతి॥

చ. ఎఱుఁగక నీపరితాపము, సహింపక నీఘనగౌరవంబు, కా
ర్లఱచుచుఁ బతిరికాపళులనంపియు నీదు సుదర్శనస్ఫుర
త్తరళగవీపరంపరకుఁ దాళక చొచ్చిరి సూర్యమండలో
పరిపథమందు దైత్యకవిపక్షులు తిర్ప॥

ఉ. దేవుని నిన్నుఁదిట్టు దురదృష్టులు లేరొకో మున్ను! దానిచే
నీ వహి తగ్గెనే? యిపు డనేకులు తావకదివ్యజంఘికా
పీపరకేశలేశమును బీఁకఁగలారె? భవత్ప్రతిష్ఠయుం
బోవుట యీజగంబు సరిపోవుట తిర్ప॥ 8

ఉ. భావమునందుఁ జంచలతఁబాయఁగ దేవుని రాతియందు సం
భావనచేసినారు మును ప్రాజ్ఞులు, కాని నవీను లట్టి సం
భావనసేయఁజాలరఁట! భార్యయుఁ, దల్లియు నంచు భేదసం
భావన యెట్లుచేసెదరొ వారలు తిర్ప॥ 9

చ. "గురువును దైవమున్ మనకుఁ గూడ" దటంచు వచించువారికిం
దిరుపతి వేంకటేశ్వరుఁడు దేవుఁడుకాఁడు, యథార్థవస్తుత
త్పరులగువారికిన్ గలఁడు దైవము తిర్పతి వేంకటేశ్వరుం
డరమరలేక నీ వరయుమా యిది తిర్ప॥ 10

ఉ. దేశికుఁడంచు నిన్ను వినుతించెడివారిపయిం గృపారసా
వేశముఁ జూపుమయ్య! యొకవెంబరగొట్టు నఱింపఁడేని నీ
వాశఠునిన్ సహించిన మహాత్ములు నవ్వుదు; రట్లుగాన నో
యీశుఁడ! తగ్గశిక్ష విధియింపుము తిర్ప॥ 11

చ. తెలియక నీప్రతాపము, మదిందలపోయక నీమహత్త్వముం
బలువలు తిట్టి, నాపదలు వచ్చినవేళల నీపదాబ్జముల్
గొలిచెదువట్లుచేసి కడకున్ దరిఁజేరఁగఁదీసి వారలం
దలగొఱిగించి కొట్టు మిఱుదోడలఁ దిర్ప॥ 12

చ. యశముపహించుఁ దత్త్వవిధి నబ్బిన నీ ఘనముద్రిదాల్చుటం
బశువులుగూడ గోపతిసమాఖ్యవహించి చరించెదున్ నిరం
కుశగతి సంస్కరించు నలగోవులఁ గావున నేరు నీకృపా
వశులు మహత్త్వముం గననివారలు? తిర్ప॥ 13

ఉ. నీయభిధానముద్రి గమనించెదుగోపతి కెవ్వఁడో సురా
పాయిరొ, జారుఁడో, తులువ, పాపి, శఠాత్ముఁడు, శుంఠ ముష్కుద్రా
డ్వోయఁ దలంచుఁగాక, యటువోయఁగశక్యమె? శక్యమే నిలం
జేయుల వారి నీవు నిరసింపవె తిర్ప॥ 14

ఉ. పేరునునూరులేని పెఱవేల్పులనామము లుగ్గడించినన్
జేరెఁడుముష్టియుం దొరకఁ జెల్లదు గాని భవద్భటుండు నీ
పేరుపఠించుచున్ బయలువెళ్ళిన భుక్తికి లోటులేదు; నీ
పేరుమహత్త్వ మెంత వినిపింతును? దిర్ప॥ 15

ఉ. ముంగలివారు నీచరణపూజయొనర్పకయున్నఁ దావకాం
శంగొను రామకృష్ణులనుసైతము పూజయొనర్పఁబోవువా
రుం గలఁగంగఁబోరుగద? రోయక వారినిఁగూడ నీవు నీ
బొంగు బుజానఁ బెట్టి కొనిపొమ్మిఁకఁ దిర్ప॥ 16

ఉ. నీపదముల్ భజించు నవినీతు లనేకులు దెల్వివచ్చి వా
రాపని మానిరంట! యిదియంతయు నిక్కమయేని పాపం
పూపలు రామకృష్ణులకు బొంగుబుజంబునఁ బెట్టి తోఁపయుం
జూపుచుఁ బొమ్మ నీవరుగుచోటికిఁ దిర్ప॥ 17

చ. "పరమును మీర లందఱు నుపాసన సేయుఁడు" టంచుఁ జెప్పి, "య
స్వరమువు నీవ" యంచనిన వ్యాసునిపై నిఁకఁ గోపమేల? "గో
పరమును నీవుకా" వనుచు వాకొనువారల నొంచఁగా నిరం
తరముగుదీక్ష నెల్లపుడుఁ దాల్చును తిర్ప॥ 18

ఉ. జ్ఞానవిహీన గోతి, యదిస్పైతము నీకథ వ్రాసె; నింక వి
జ్ఞానముగల్గుపూరుషులు మానుదురే? మఱి గోతికన్నమం
జ్ఞానము లేనిమర్త్యుఁడు రసాస్థలమం దెవఁడేనియున్నచోఁ
వీనికిఁగూడ గాథ వినిపింతును దిర్ప ॥ 19

ఉ. "వ్యాసుఁడు కాలఁటేరుఁ"డని వాకొనుటెట్టిదో, "రామకృష్ణు ల
భ్యాసము చేసినారు సురపానము, జారత" యఁట యే మప
న్యాసమొ, "గంగిరె" ద్దని మహాత్ములు నిన్ననుటట్టిదే; విప
ర్యాసముగాఁ దలంతురి జడు లయ్యది తిర్ప॥ 20

చ. కలవు రసప్రవాహము, లఖండఘనాగమశృంగగౌరవం
బులుఁ గల, వద్భుతార్థకవిపోషణజాతమహాఫలంబులుం
గలవని యెంచి నీకలిమి గల్పిరి తిర్పతితోడ; దాని మూ
ర్ఖు లెఱుఁగలేక గుట్ట యనుకొందురు తిర్ప ॥ 21

ఉ. కనఁబడుఁ జిత్రధాతువులు, గన్పడు సిద్ధపదంబులున్, సుదు
ర్జనగణనీయవస్తువులుఁ గన్పడు, దృశ్యములెల్లఁ దిర్పతిం
గనఁబడు బుద్ధిగల్గి సరిగా గుఱిగా గురుపాదసేవ సే
సిన యనఘాత్ములందఱకిఁ జిత్రము తిర్ప॥ 22

చ. "తిరుపతిఁబట్టి నీకుఁగల తేజ" మటంచును, "నిన్నుఁబట్టియే
తిరుపతి" కంచు మూర్ఖులు పదింబదిఁ దంత్రము లెన్నియేని రే
ర్పఱచినఁగాని మీర లవి పాటియొనర్పరు; బ్రహ్మచేత కె
వ్వరు ప్రతిసేయఁగాఁ గలుగువారలు? తిర్ప ॥ 23

ఉ. "ప్రాయియు నప్ప" యంచు నిను నప్పయొనర్చుచు, "నీకుఁ దేజముం
బోయె" నటంచుఁ జెప్పు నెఱమూర్ఖులు తిర్పతి గ్రామసింహముం
జేయఁగ నీకు గొప్ప మహనీయత గూర్తు; రెఱుంగరేమొ యీ
న్యాయము "రాత్రిభార్య పప" లమ్మని తిర్ప ॥ 24

ఉ. ఏగిరియందు నీవు వసియింతువొ, లీలలు చూపుచుందువో,
యాగిరి పల్లెయైన జను లందురు తిర్పతియంచు, దానితో
సంయోగమె కాని యేటికి వియోగము నీకు ఘటించు? "వీడినన్
భోగము లేదు నీ" కనుట మూర్ఖత, తిర్ప ॥ 25

చ. గురు వగునిన్నుఁ 'గా'వనుచుఁ గూయుటయే యొకతప్పు, దానిపై
గురువును బల్కరాని పలుకుల్ పలికించు టిఁకొక్కతప్పు, దు
స్తర మగుపాప మిప్పగిది సారెకుఁ జేసెడివారికోస మే
నరకము క్రొత్త దేర్పఱచినాఁడవొ! తిర్ప॥ 26

చ. ఎవఁడు దశావతారముల నెత్తెనొ వాఁడవు నీవు, తత్కళా
భవులనికాదె వ్యాసుఁడు ప్రబంధములం దల రామకృష్ణపుం
గవుల నుతించు, టీవు నొక కంటను గన్గొనుచుంటఁ బీఠికా
భవనమునం బ్రతిష్ఠ కనుపట్టుట తిర్ప॥ 27

ఉ. "దేవుఁడ" వంచు నీకు వినుతిం, బ్రణతిం బొనరించువారెపో
కోవిదు, లట్టి కోవిదుల కోసమె నీవిభవంబు సర్వమున్
గావలె నంచుఁ గోరుదువుకాని కటా! తెగనాడఁజూతు నే,
కావలులైన వార లది గానరు తిర్ప॥ 28

ఉ. రాజితరాజరాజనగరంబు లనేకములందుఁ జెంది తే
వోజమెయింబ్రతిష్ఠ, యది యుండఁగని, మ్మతుఁ మున్న పొంది శ్రీ
రాజమహేంద్రిమందిరవరమ్ములు మిన్నగు పేరుకాపురే
రాజమహేంద్రిమందిరవరంబునఁ దిర్ప॥ 29

ఉ. ఎల్లరు "నీవ యాదిపతి వీశ్రీరంగంబుల" కంచు నిన్ను వే
నోళ్ల నుతింపుచుండఁగ, జనుల్ మరికొందఱు "నీకు స్తోత్రమేసు
చెల్ల"దటంచు నిన్ను నిరసింపఁగసాగిరి, స్వామి! యేమి యీ
యల్లరి! పెట్టవీవు చెవినైనను తిర్ప॥ 30

ఉ. కర్ణమునందుఁ బెట్ట వనికాదు సుమీ, ప్రచయించు టింత గాఁ
బూర్ణముగాఁగ నించితివి ము; న్నదిచాలక యిప్డు తిర్గి వ్యా
కీర్ణత నొందుచుండిరి నికృష్టులు వారలు తృప్తిలేక; వ
ద్యార్ణవ! తృప్తిసేయఁదగదా? యిఁకఁ దిర్ప॥ 31

ఉ. సేమముగోరి తిర్పతి వసించి ప్రసన్నతఁదాల్చి సేవక
స్తోమసురద్రుమంబ వగుచున్ విలసిల్లెడి నిన్ను రామరా
మా! మహి నేఁడు దూఱుదురు! టింతటి మాత్రన నీదు పక్కపై
రోమముగూడఁ బోదని రమేశుఁ డిఱుగు తిర్ప॥ 33

ఉ. కింకరులై భవత్స్తవ మొగిం బచరించెడి భక్తకోటి కే
కొంకును జంకులేని కఱకుందన మొక్కఁడొసంగి, వైరితా
టంకవతీమనోహరనిటాలతటాలకకుంకుమప్రభా
పంకముఁ బాపుశక్తి నిడువాఁడవు తిర్ప ॥ 33

ఉ. “పంబినవేడ్కఁ నిన్ గొలుచు పార్థివు లజ్ఞు”లటంచు, “నీకు న
ర్థంబు లొసంగువార లపథంబునఁ బోయెడివార”లంచు నై
చ్యంబు ఘటింతుర్ పాలకునియందునఁ గొందఱు “తిన్నయింటి వా
సంబులు లెక్కపెట్టు” సరసం బిది తిర్ప॥ 34

ఉ. ఆవట గల్గి విన్మ్ర, భవదంశసముద్భవులైన రామకృ
ష్ణాదుల కెందునైన జగమందున ముందు సపర్య చేసి యా
మీఁదను “నీవులే”వనఁగ మేకొనుదుర్మతు లుండ, రున్నచో
మోఁదరె యోగ్యులెల్లఁ బనిముట్టునఁ దిర్పతి ॥ 35

ఉ. పండలు వేలు పద్యము లవారిగ నిం బడఁ దిట్టుచుం గటా!
క్రిందును మీఁదుఁ గానక లిఖింతురు పత్రికలందుఁ గొంద; ఱీ
చందముఁజూడ వారిది దొసంగని తోఁచదు, వారికట్టి శ
క్తిం దయసేసినట్టి తమదే యది, తిర్ప ॥ 36

ఉ. “దాసులు సేసినట్టి పలుతప్పులనైన సహింతు” వంచుఁ, “జే
రోమ్రసినవాఁడవీ”వనుచు, మొరకులేగతి నిన్నుదూఱినన్
రోసముఁజెందకుండుట “విరుద్ధమటం” చెవరేనియన్న నీ
చేసెడుకార్య మేమఱఁగఁజెల్లదు దిర్ప ॥ 37

చ. శరణము నీమనోహరయశస్సరసీరుహవైరిమూర్తికిన్
శరణము నీమనోహరకనచ్ఛవిదంతురమూర్తికిన్, సమ
స్కరణము నీపదాంబుజయుగంబునకుం గయిమోడ్చుచుం బుర
స్కరణము నీదుభక్తుల కొసంగెదఁ దిర్ప ॥ 38

ఉ. మంగళమయ్య నీదు మహిమంబున కాయలమేలుమంగకున్
మంగళమయ్య నీవు కడుమాన్యత గూర్చిన యొమ్మెలాఁడికిన్
మంగళమయ్య నీగుడికి మంగళమయ్య భవద్భటాళికిన్
మంగళమయ్య నీ కొకనమస్కృతి తిర్ప ॥ 39

ఉ. సేమము నీకు, నీయనుఁగుశిష్యులకుం గుశలంబు, నీదువి
ద్యామహనీయపద్ధతి కనామయ, మార్జితసర్వదిక్తట
స్తోమనిరంకుశప్రబలసుందరకీర్తిలతానతాంగికిన్
సేమము, నీదుభక్తులకు సేమము తిర్ప॥ 40

ఉ. పాలకుఁ డాత్మకూరునరపాలుఁడు గ్రంథమువ్రాయఁజేసి యే
వేళను నీదునామము జపించుచు నిన్ను సదా భజించుచున్
గాలము వెళ్ళఁబుచ్చుచు సుఖంబుగ భోగములందుచుండె; ని
న్నోలి భజింప లోప మొక టుండునె? తిర్ప॥ 41

ఉ. "ఈవొక రాతిబొమ్మ" వని యెంతురుకాని నిజంబుగా మదిన్
భావనసేయుచో బయట వత్తువు దివ్యదఖండవైభవ
శ్రీవిజయస్వరూపమును జేకొని; మున్నొక పండితుండు నిన్
* దీవరపెట్టఁగాఁ దలుపు దీయవె తిర్ప॥ 42

ఉ. నీప్రతిబింబచిత్రము లనేకము లుండనియిండ్లు లేవు, నీ
సుప్రథితప్రబంధములు చూడనియోగ్యులు లేరు, వేల్పులన్
బ్రప్రథమంబు నీచరణపద్ధతికిం దల యూనివారు లే
రప్రతిమప్రభావ! జగమందునఁ దిర్ప॥

ఉ. పూచిన మావిగున్న గతిఁ బొల్చెడి నీఘనవజ్రకంచుక
శ్రీ చెలువారువిగ్రహము చెల్వ గనుంగొనలేక నోటికిన్
దోఁచినయట్లు ప్రేలుదురు ధూర్తులు; వారలపాపమేమొ సం
కోచములేక చెప్ప వినఁగోరెదఁ దిర్పతి॥

ఉ. చిత్రమునందు శిల్పులు రచించిన బొమ్మలు తల్లిదండ్రులున్
బుత్రులు మిత్రు లంచుఁ దలపోసెదు రిప్పటివారు దివ్యచా
రిత్రుని దేవు విగ్రహము నీతిగ భావనసేయలేరఁటే
చిత్రము వింటివే! మిగులఁ జిత్రము తిర్పతి॥

ఉ. రాజుల విగ్రహంబు గజరాజులపై నిడి యుత్సవంబులున్,
బూజలు సేయు నిప్పటిజనుల్ గుడిలోఁగల వేల్పుబొమ్మకున్

---

*శ్లో॥ ఐశ్వర్యమదమత్తో౽సి మాం నజానాసి దుర్మతే
పరైః పరిభవే ప్రాప్తే మదధీనా తవస్థితిః॥

బూజయొనర్పరాదనుట పోలదు; గావున నెప్పుడేని యుం
బూజలు విగ్రహంబులకుఁ బోలును దీ॥

ఉ. తిట్టెడినోటికేని నిను "దేవుఁడ, దేవుఁడ!" యన్న తిట్టె గ
న్పట్టునుగాని వేఱు గనుపట్టదు మార్గము; కాన నూరకే
పట్టిపృలాపముల్ పలుకువారల తిట్లఫలంబు వారినే
కొట్టెడు కాల మీవు కనుఁగొందువు తి॥

ఉ. ఎప్పటినుండియో భువి వహింపుచునుంటివి కీర్తి, యెందఱో
కప్పము నిచ్చువార లధికంబుగఁ దాసకనామధారులై
యెప్పెడివార లెందఱో, యహో! యెటువంటివి నీయనేకప్రభల్!
'పెప్పెపెమెమ్మెమే'లు పెకలింతురె? తి॥ 48

ఉ. ఈవునిజంబు దేవుఁడవయేని భవన్మహిమంబు సర్వభూ
మీపలయాలయంబులను మేటితనంబు సహించెనేని దు
ర్భీవశు లౌచు నిన్నుఁ జెడఁదిట్టినవారలమీఁదఁ జూపుమా
దేవర! తీవ్రతంబు వెనుదీయక తిర్పతివేంకటేశ్వరా. 49

ఇట్లు, శిష్టాహనుమచ్ఛాస్త్రి.

---

చ. 'తిరుపతివేంకటేశ్వరుఁడు దేవుఁడుకాఁ'డని నీవు, 'కాదు, దే
వర' యని నేను, "లేదు, పలుబండలలో నొకబండ" యందు నీ,
వురక యిదేటిగోఁత! మను పాక్కుటనాపైకనోదు నొక్కు శం
కరుఁ; డది *"నాస్తిచే" తనెడి కారిక దానిఁ బఠింపు మర్భకా. 83

(త్వత్కృత గ్రంథముల్ శ్రావ్యములై విపశ్చితుల సంతస పెట్టవు)

ఉ. *ఏమన నేర్తు, నేమనిన నేమగుదో కొ? నృసింహభారతీ
స్వామి విపశ్చిదగ్రణియొ? జంతుసమానుఁడో? యమ్మహాత్ముఁ డెం

---

(*శ్లో॥ నాఽస్తిచే న్నాఽస్తినో హానిః, రస్తిచే న్నాఽస్తికో హతః.)

(*శ్లో॥ శ్రీశేషశైల సునికేతన దివ్యమూర్తే, నారాయణాఽచ్యుత హరే నళినాయతాక్ష, లీలాకటాక్ష పరిరక్షితసర్వలోక, శ్రీవేంకటేశ మమ దేహి కరావలంబమ్......శ్లో॥ తాపత్రయం హర విభో రభసా న్మురారే, సంరక్ష మాం కరుణయా సరసీరుహాక్ష, మచ్ఛిష్య మప్యనుదినం పరిరక్ష విష్ణో శ్రీవేం. ...

తే. మునివంద్యు నీగుణఖనిన్ వినుతించె; విపత్పరంపరా
గాములోకో? "విపశ్చి" దధికారులు, కాఱు లివేల పుత్రికా. 84

(ప్రాజ్ఞులు నుతింపరు)

శా. ‡భారద్వాజుఁడు మ్రొక్కె, గౌతముఁడు సంభావించె, నాకశ్యపుం
డారాధించె, యజించె నత్రియును, విశ్వామిత్రుఁ డర్చించె, సత్
కారించెన్ జమదగ్ని, తక్కు ఋషియున్ గావించె జోహారు; వం
దారుల్ సప్తఋషుల్ ప్రపన్నజనమందారుం డతం డర్భకా. 85

శా. *మార్కండేయు నెఱుంగదే మునిమణిన్; మారారిలింగార్చనో
దర్కుం డాతఁడు విగ్రహార్చకుఁడు కాలాభీలపాశావళీ
కార్కశ్యంబు తృణీకరించె నలసత్కర్మిష్ఠుఁ డాపుణ్యసం
పర్కున్ వేంకటనేతఁ గొల్చె నలఁతుల్ వాపోవ నేమయ్యెడున్? 86

ఉ. ఉక్కునయందుఁ జింగ మొకఁ డుద్భవమందుట నమ్మరేని "తా
యెక్కడ దేవుఁ డెక్క" డను ‡నెగ్గులు బొగ్గు లగుం గుమార! లే
దొక్కటికూడ దేవునకు నుండఁగ రానిప్రదేశ, మందులో
నొక్కొకచోటు ముఖ్యమను సుక్తికి ‡గీతలె సమ్మతించెడిన్. 87

ఉ. ఉక్కునుండి, సత్కవులయుక్తులనుండి, జలమ్ము నుండి, నల్
దిక్కులనుండి, పావనులదేహమునుండి, స్వతఃప్రభూతముల్
ఋక్కులనుండి దేవుఁడు దురీహులకై యవతార మెత్తు; దు
ర్వాక్కులె కాకయుండినఁ బురాణము లాగమపుం దుకాణముల్. 88

క॥ గతిలేక తుదకు ‡"జీవ,న్మృతమత మొకఁ డాశ్రయించి మితిమీఱి దురా
గతమొడిగట్టిన నినుఁగని, క్షితి వగవనియోగ్యుఁ డొకనిఁ జెప్పంగలవే? 89

(తిర్పతి గ్రామసింహము)

చ। తిరుపతి "గ్రామసింహ" మని తెల్లమ యెల్లరకున్; మకారమున్
మరునుతనానఁ జేర్చితివి; నోరది పూర్తిగ *మూఁత వెట్టున

---

‡(సప్తర్షికృత-వేంకటేశ్వర శరణాగతి స్తోత్రము చూ.)
(* మార్కండేయ కృతవజ్రకవచము చూ.)
(‡ భగవద్గీతాదశమాధ్యాయము చూ.)
‡ శ్లో॥ య స్స్వధర్మాత్పరి భ్రష్టో వృథైశ్చైవ బహిష్కృతః, స జీవన్నేవ లోకేఽస్మిన్ మృత ఇత్యభిధీయతే॥ (విష్ణుపురాణవ్యాఖ్య చూ.)
(* వకారస్యదన్తోష్ఠం, ఉపూపధ్మానీయానామోష్ఠౌ) (కౌముది చూ.)

క్కుర;మగుఁగాక యేమి చెడుఁ? గారుణికత్వముకల్మి వేంకటే
శ్వరగురుపాదరక్ష యది సాఁగఁగఁజేయుత నో ర్వారింబొరిన్. 89

ఉ. ఎందుకుఁ బేరిలె దూరఁ? కిఁక నేనియు నోటికి బుద్ధిఁ జెప్పికొ;
మ్మండలు నీమొగమ్ము గనినప్పుడు చేసెడిచేఁత యేమొ నే
నిందు లిఖింప నేల? యది యింతకుఁ బూర్వమె నీకు స్వానుభూ
తిం దెలియంగ వచ్చు; గురుదేవవినిందకు సైఁప రెవ్వరున్. 90

(వేఱురీతి నెపు డీశతకార్థము)

చ. తనకపవాదలం బలికి తాండవ మాడుదుగాక యల్గఁ డా
యన; నగుచుండు "వీఁడెవఁడురా!" యని, మున్నిటులాడి *తత్సద
ర్శనమున కగ్గమై శిరము సర్వము ముండిత మైనమీఁద మ్రొ
క్కినజడు లెందఱన్ గనఁ డకించనులన్ మనవెంకఁ డర్భకా! 91

(వందన మాచరించెదము)

ఉ. వందన మాచరించెదరె! బాగది మంచియుపాయమే; విభుం
డందికొనండు వందనము లట్టివికాని యెఱుంగరేమి? యే
చందపు శిక్ష మున్ మొగిచి సామి కెరంగుట యొప్పనో యటుల్
సందరిసించి వందనము సల్పఁ డఘుం ఓడియెల్లఁ బొల్లగున్. 92

(భక్తితో వెంట్రుకలే నొసంగఁ గృప వెంచెదవు)

ఉ. ఎవ్వని ‡రెండు వెండ్రుకలు కృష్ణుఁడు రాముఁడుగూడ నయ్యె న
ప్పువ్వులుకాని తండ్రికి "నమో" యనుపట్టున నెత్తినున్నయ
క్రొక్కు వ్వఱఁగావలెన్ గనుకఁ గొండుప ముండన మండనంబు; స
విప్వివరం బెఱుంగమి నెటే పదరిం కొఁకొంటి వర్భకా. 93

(బోధములేనికాల మది పోయెను)

ఉ. "బోధము లేనికాల మదిపోయె" నటంటి, వెవండు నమ్మ? స
ర్వాధమమైన యిక్కలికి నక్కట, బోధముగూడ నేడ! యే

(* వేంకటాచలమాహాత్మ్యము 2, 3 ఆశ్వాసములు చూ.)

(‡దేవీభాగవత చతుర్థస్కంధద్వావింశాధ్యాయము చూ.)

గాథలయందు నీకనికి ‡ గణ్యత మున్న; ధవావృకుల్ మహా
సాధువు లిక్కలిస్థితికి సర్వధనంబుచుమీ కుమారకా. 94

మ॥ కృతగుర్వంఘ్రిభిషేకు, లుజ్ఝితసుధీశ్రీకుల్, బుతశ్లోకు, లా
దృతిపర్వాగమవాకు, లుత్తపితృమాతృప్రీతిసంధాకు, లూ
ర్జితసత్యప్రతిభాకు, లాచరితసుత్క్షేత్రికయాత్రికు లి
ప్పతితుండొకలికిన్ విరోధులు సుమీ! భ్రష్టుల్ కడుబంధుకుల్. 95

శా. ఏకాలమ్మున బాపకార్యములనే యీతండు ప్రేరేచు, స్వ
శ్లోక మ్మన్నను, జన్న మన్నను, దగాదూఢిన్ బ్రవర్తించువే
దైకద్రిష్టు శిష్టులన్న నితం డత్యంతమ్ము ద్వేషించు, దు
ష్పాకుం డీకలి, వీనియాకృతియుఁ * బాపప్రాయ మోయర్భకా. 96

ఉ. ఆకృతిఁబట్టియే గుణము లబ్బెడి నందురు పెద్ద; లిట్టిభ్ర
ష్టాకృతి కెట్లు మంచిగుణ మబ్బెడి? ద్వాపర మేగ, నంత దు
ష్పాకుఁడు వీఁడు వచ్చెఁ; బసిప్రాయ మెటో చనె, బాల్య మేగు ని
ష్టీకలి కెట్లు బోధ మది యీతని కాలమునన్ జనించెడిన్? 97

ఉ. భారతమందుఁ జేర్కొనెడిపాతకులన్ బ్రథముండు దుర్గుణ
శ్రీరమణుండు కౌరవకులేశయశీతకరుండు దుర్యశ
శ్చారి ‡ సుయోధనుం డితనిసారమె యేమనుకొంటివో! యెటుల్
గూరు సుబోధ మిక్కలికిఁ? గొండొకవృద్ధి ఘటిల్లు నియ్యెడన్. 98

చ. కలికలుషం బెఱుంగనియకాలపువెఱ్ఱు లబోధమున్ మదిం
దలఁతురు బోధ మంచు; విబుధప్రవరుల్ జడబుద్ధులైన య
య్యలఁతులఁ జూచి 'యక్కటకటా! కలిగానికి లోఁగి వీరు త
ప్పల కెర లైరిగా!' యనుచుఁ బొక్కుదు రేమియుఁ జేయ నేరమిన్. 99

ఉ. వీనియనంతరమ్మునఁ బ్రవేశమగున్ † యుగరాజు వానిలోఁ
దానెగడున్ సుబోధము; కృతజ్ఞు లెఱుంగుదు రీరహస్య, మా

(‡విష్ణు పురాణ షష్ఠాంశము చూ)
(* శ్రీనాథనైషధ సప్తమాశ్వాసము కలివర్ణనము చూ.)
(‡ శ్లో॥ దుర్యోధనః కలేరంశః) (దేవీభా ర స్కం, ౨౨ అ, చూ)
(† విష్ణుపురాణ చతుర్థాంశము చూ)

శ్రీనిధి మున్ను మిన్నయుఁ బ్రసిద్ధుఁడునయ్యె నొకంట నిప్పు డే
మేనియుఁగాక యుక్తసమయేక్షణతత్పరతన్ వసించెడిన్. 100

చ. కనుకఁ గలిన్ బ్రబోధ మది కల్గమి నిక్కువ; మీవు పూర్వపు
స్మృతులమతంబు రోసితివి, ముగ్ధుఁడ వైతి పటించుఁ దేలె; ము
గ్ధుని కొనరింపరాని దొకకూర్మిత యుండునె? యమ్మఁ దిట్టు, దే
వునిఁ జెడఁదిట్టు, దేశికునిఁ బూర్తిగఁ దిట్టెడిఁ, దిట్టుఁ దండ్రినిన్. 101

మ. కలిదోషం బిది, దైవసృష్టి నతఁ డొక్కం; డాతఁ డేనిన్ జడా
త్ములయం దాడెడునట్లు పండితులయందుం దాండవంబాడఁ, డీ
యలఁతిన్ వారలు లెక్కసేయరు; మహోర్వ్యాచారపారంపరీ
ష్ఠలదాచారులు వానిదాసులయి చక్కన్ బోదు రాచక్కికిన్. 102

మ. కలి సంప్రాప్తిగ నైనువే లరగ, సాంకర్య మ్మెట్లున్ దప్పు, ని
వ్విలయమ్మందును * నిశ్చలాత్ములకు దుర్విజ్ఞానముల్ పుట్టు, వి
ప్రులు కావ్యాసమహర్షి దేసుమి! పృథాప్రాగల్భ్యనారంధరీ
కులకో, సర్వయుగమ్ము లొక్కటియె సంకోచమ్ము లే దక్కటా.

సీ. అకులీనుఁడగువాని నాశ్రయింపంగ విద్వజ్జనం బెపు డపత్రప వహించు
హద్దు మీఱిన తనయానుజాదులవృద్ధి కెపుడు శిష్టకులమ్ము లిచ్చ రోయు
స్త్రీపునఃపరిణయవ్యాపార మెపుడు నీచాతినీచమ్ముగా నరయుఁ జగము
ఎపుడు కృతఘ్నునే మాక్షించి విజ్ఞులంబూకృతిపరివణతానుఖులరోడు

తే. గీ. కది సుమీ కుత్తు! బోధమునన్ గట్టికాల,
మది గతించి యొన్నేనేఁడులయ్యె; నెఱుక
చాలని భవాదృశులకు నిక్కాల మకట!
బోధముగలట్టి కాలమై పోలుపుమీఱె.

ఉ. బోధములేని కాల మది పోవుట చేతనె సూ! వితంతుబిం
బాధరలన్ వరించు సుగుణాఢ్యులు. వారల మన్చుపేర్మి రకుల్,
శీధురతుల్, గుణారతులు, శిష్టజనేతరు, లెంచు విగ్రహా
రాధకమాషకుల్ ధరఁ బరంగిరి, మున్నిటు లుండ నేర్చరే! 105

(*దేవీభాగవత షష్ఠస్కంధము చూ.)

సీ. తొలి ధనాఢ్యులకెల్లఁ దలలోనినాల్కలై యొందు నాస్తికులు పెంపొందిరెలమి
మును ధనం బిడువారు ధనదాతలెల్లఁ "గళ్యాణంబు విధవానుయాయి" కన్న
బ్రహ్మవిద్వేషసంబంధమాత్రమున ముక్తజనులెల్ల మొక్కి రెవ్వనికి నేని
అంత్యజాచార్యమతావలంబనమును వెనుకటివారు గైకొనిరి తలచు

గీ. ఇప్పుడును నట్టి యుత్సాహ మెల్లయెడల
వ్యాప్తిఁ జెందెఁ జెందుచునుండె వ్యాప్తిఁ జెందఁ
గలదు; సరిపెట్టుకొంద మిక్కలుష మిట్లు;
కాక శోకించి చేసెడికార్య మేమి. 106

(వేఱురీతి...నీదుభోగముల్...నమ్రత...సహింపఁగ)

చ. తిరుపతి భోగి, యగ్గిరిని దీప్తినెసంగెడిసామి భోగి, నీ
వరయక భోగముల్ గినిసి యాడఁ బోడంగితి "వేఱురీతి" నీ
*దురిత మడంగ శంకరునితో యజనేత్ర స్మరింపు మాపె పా
దరజము శ్రీవిరాజితము ధన్యునిఁ జేసినఁ జేయు నిన్నిఁకన్. 107

ఉ. బ్రహ్మమతంబు నిప్పటికిఁ బట్టితి, నాకడ నున్న యప్ప స
య్యమ్మ ప్రసాదమే గతి యథార్థము సెప్పుము? యాపెయాలయ
మ్మిమ్మగ నుండి మంత్రిజప మేగతిఁ జేసితి పిట్టనీవు? మె
త్తమ్మన నిన్నుఁ బోలెడుకృతఘ్నుఁడు లేఁడు సుమీ జగమ్మునన్. 108

ఉ. భోగము, భోగి, భోగినులు వొల్చెడి శంకరు నర్ధమూర్తి, యా
భాగిని మందభాగి నిను భక్తునిగాఁ దలపోసి సత్కళా
భోగిని గాన జ్ఞానలవభోగినిగా నొనరించె, నిప్పు డే
లాగున దూష్యమయ్యెను శిలాప్రతిమార్చన [illegible]మాటికా. 109

మ. భవితవ్యంబు నెఱుంగ నేరవు, భవత్పాపోదయం బిట్లు సం
దపలెం గావున వేంకటేశ కురుఁడన్నా! ‡ భోగినీరాగివై
భువి నెందున్ వినుతింపఁగాఁ బడెడిఁ దప్పంగూఁతలం గూయుకా
కవి కీలాటినుహారహాస్యము తెలుంగన్ శక్యమె ట్లయ్యెడిన్. 110

---

( * దేవీభాగవత షష్ఠస్కందము చూ. )

(‡ వేంకటాచల మాహాత్మ్యము, ౧ అ, చూ.)

మ. దురితం బీ వొడిఁగట్టినప్పుడు భవద్ద్రోహమ్ము సర్వమ్ము నే
నెఱుఁగం జాలిన యంతవట్టు నొడువన్ హేయమ్ముగాఁ జూడ రె
వ్వరు; నట్లైనఁ గృతఘ్ను లాఘ మొకఁడే వాక్రుత్తు, నన్యాఘమో?
‡ పరకీయాననసేయ, మూఁక వృథాభారమ్ము నాకేటికిన్? 111

చ. *గురుపితృమాతృదేవులతఁ గుల్ విడరింపఁగ రాదు, భోగముల్
తిరుపతి వేంకటేశ్వరుఁడు తేలనివాఁ డని కాదు, దాన నీ
గురుతకు భంగమేమి? యిదికొంటెతనంపుఁబ్రసంగ; "వేల కొ
బ్బరితరు వెక్కె" దన్నఁ "దృణభారముకోస" మటందువే సుతా? 112

చ. "తిరుపతి వెంకటేశగురుదేవుఁడు 'భోగి' యటన్నఁ దప్పా? 'చి
త్తర మలవాఁడు దేవయ కృతఘ్నుఁ' డటన్నది తప్పా? సుంత నీ
వరయఁగలేకపోతి" వని యాడుదు కేకవనమ్ము చూచి; త
త్తఱపడినాఁడ వెయ్యదియు దారి గనంబడకోయమాయికా 113

(నీపదములే భజియించెడివారు గూడ...మున్నటివలె నిన్నుఁ గొల్వరు)

చ. " 'తిరుపతి వేంకటేశ్వరుఁడు దేవుఁడు మా, న్నిపు డట్లు కాఁడు కొ
ల్వరు పలుమంది' యన్నదియె లాఘవమో? 'కృతముం దలంపఁ డ
మ్మెఱు' కన లాఘవంబొ? కనఁ బోఁడితఁ" డందురు లోకు; లెంత త
త్తఱపడినాఁడ వెయ్యదియు దారి గనంబడ కోయమాయికా. 114

క. "దురితము లెన్ని కృతఘ్నుల, సరివచ్చెడి? దానిఁ జెంచసాఁగె నితఁడు వేఁ
దుఱువాఁ" డందురు సుమి! త, త్తఱపడితివి దారియొండు దగులక పుత్రా.

క. తిరుపతి వెంకన భోగము, లెఱిగించితి యశము సుడిఁగెనే? యింతటు, నె
వ్వరొ తక్కెఁ గీర్తిపరుఁడం, డొరకవె తాదృశులు విబుధ ధూర్వహులెందున్.

చ. ఇదిగద, నీవు ప్రల్లదము లెన్ని పఠించినఁ జేలు సాగ? వి
చయమునఁ గీర్తిగాంచెదు యశమ్మది లేశము లేద; చాఁపరై,

---

‡ శా. చెల్లాచెక్కికిఁ దీసికట్టయితివా చీ? మాట లింకేటికిన్ (ఈపద్యపాద మెవరికవిత్వమో, దీని ప్రసక్తికిం గలసంగతి సందర్భము లెట్టివో మా శిష్యులు వెం॥ రా॥ లే చెప్పవలయును గాన వలయువారు వారివలన నెఱుఁగఁదగు.)

*శ్లో. భవానీశంకరాదీనాం పిత్రోర్వా కేళివర్ణనమ్, (ఇత్యాదినిషేధస్తావ దలంకారశేఖరాద్యాలంకారికగ్రంథేషు ద్రష్టవ్యః.)

చదరయి నిల్చి యిప్పటికిఁ జాల దినమ్ములు వోవుచుంచె; ని
య్యాది గని యోర్వలేని జడు లంతయునుండిన నెంతయేడ్తురో! 117

ఉ. కావున నున్న కీరితికె కావలె బోలెఁడు చోటు, నీవు నిం
దేవిధినేనిఁ గొంత గొను మీఁగలఁ డాతఁడు; నీకొసంగఁగా
నావల నిల్చినట్టిదియె యాతనికిన్ సరి పోవు; మాసియే
పోవునొ ? పోవనీ, యశమపో' గడుఁ గాఁతియ హేతు వర్భకా. 118

క. *తఱుఁగు నిఁకఁగీర్తి యనుకొని, పొరఁబొరి లిఖియించి తీవు బూతులు; దానం
బెరిఁగెడినని భయపడు నతఁ, డరసితివే హేతు ? వర్భకా ! యిప్పట్లన్.

చ. మును హరిశాస్త్రిగారి నొక మోఱకు, నీవల వేంకటేశ్వరున్
గనలి యవాచ్యముల్ గిలుకుక్తవడి, నేవియొ వ్రేల దానికా
యన "జగమింత యుండ నను నాయలఘుం డటు దూఱుటే సుమీ
ఘనతకు నొప్పికొంట" యని కైకొనె మోదము గాఁగవింటివే. 120

సీ. భోగినీరతుఁడయ్యు, భోగినీరతుఁడయ్యు భోగినీరతుఁడె యప్పుణ్యమూర్తి
విభ్రమద్గతియయ్యు, విభ్రమద్గతియయ్యు విభ్రమద్గతియె యవ్విశ్వమూర్తి
అచలానుగతుఁడయ్యునచలానుగతుఁడయ్యునచలానుగతుఁడెయయ్యచలమూర్తి
శృఙ్గసఙ్గతుఁడయ్యు, శృఙ్గసఙ్గతుఁడయ్యు శృఙ్గసఙ్గతుఁడె యాజిష్ణుమూర్తి

తే. గీ. సానుగతుఁడయ్యు, నతఁడు దాసానుగతుఁడె
వేశపరుఁడయ్యు, నాతఁ డావేశపరుఁడె
భీరహితుఁడయ్యు నాతఁ డాభీరహితుఁడె
ఏమెఱుఁగు దీనఁ గలభావ మెడ్డెజనుఁడు. 121

(మాసె భవత్ప్రతిష్ఠ యిదె మాయుచునున్నది మాసిపోవు)

చ. అతిమతి నేవియో గిలికి యంతన "దేవళముండఁ బో దిఁకన్
దిరుపతి" నంచు నెంచు భవదీయవివేకము "వార్ధి దోయిటన్
బురపురఁ దోడి లోఁగె" నని పొంగెడివానివిధమ్ము దెల్పె; సం
బరపడు, మేల నీమదిమః నల్పన సేయవలెన్ ? గుమారకా ! 122

---

* శ్లో॥ భాగ్యవన్తం ప్రసూయేథా, మాశూరం మాచపండితం, శూరాశ్చకృత విద్యాశ్చ మమపుత్రావనంగతాః" (ఇతి ద్రౌపదీం ప్రతికుంత్యా ఆశీః).

ఉ. మాయను సూర్యుఁడున్, శశియు, మాయఁ జరాచరజంతుజాలముల్,
మాయను భూమియున్, దివియు, మాయను సప్తకులాచలమ్ములున్;
మాయని వస్తువేది? వినుమాయది, తిర్పతివేంకటేశ్వర
శ్రీయుఁ బ్రతిష్ఠయున్ మిగులఁ జేవకుఁ దావయి పొల్చు నెప్పుడున్.

గీ. జగమఖిల మప్రతిష్ఠావశమున నుఱుఁగు
నయ్యదనఁగూడ నచలమై యలరు శేష
* శయ్యపైఁ బొల్చు వేంకటేశ్వరుప్రతిష్ఠ;
దాని మాయింప నొకరికిఁ దరమె పుత్రి! 124

(ఊరక లేనిపోనికార్లండ్రు భవద్గుణం బెఱుఁగ నట్టిరు)

ఉ. "కొందఱు తద్గుణం బెఱుక గూరక యూరక లేనిపోని కా
ర్లందు" రటం చెఱుంగుదున; యంతయొ యింతయొ గాక పూర్తిగా
నెందుకు సర్వమున్ దెలిసి యేసపుఁ గావలము ల్లిఖించి గో
సం బెదవో? యెఱుంగ నకటా! వికటంబులు నీప్రచారముల్. 125

(నిక్కము పల్కె నెపింతు పంచు)

చ. అతఁడు "శపించు" నంచెఱుఁగు; దట్లగు దే ధృతిప మేని మూఁడుదు
ర్గతియు నెఱుంగు; దేమునుముఁ గాఱులు నూఱెదొ, పెంకెకొయ్యనై!
యతని దయార్ద్రభావమకదా? నిను నింతకుఁ దెచ్చె; నింక స
ద్గతి యిహమందు చేకొకటఁ గల్గుట కేలెరుపోయి, ప్రసిక్రా? 126

మ. గురువిద్వేషమె త్రోవయో? యనృతవాక్పారత్వమే త్రోవయో?
తిరుపత్యగ్రపతిప్రకృష్టతరవిద్వేషిత్వమే త్రోవయో?
చిరసంహాఘమును వేదవిస్మృతము 'నిస్సీ' యంటయే త్రోవయో?
పరమార్థ మ్మన కేల మాయకొని డంబాల్ గొట్టెదోయీ, సుతా! 127
(తులువా తులువా యని నీవు...పన్కెద పన్యాల నావహించి)

మ. ఎవరో నీదగుతుల్యచెయ్యులకు నెంతే లోనఁ జింతించి నీ
యవివేకమ్మును గాంచి 'తుల్వ' యని నిన్నామంత్రితున్ జేయ, వా
రి వచోధోరణి వేంకటేశ్వరుఁడు ప్రేరేపించిన ట్లెంచవే
సువివేకీ? యతఁ డేమిసేయునుర! నీకుంతత్వపర్యాప్తికిన్? 128

(* దేవీభాగవతం 3 వ స్కంధము చూ.)

ఉ. తానొనరించుకర్మ మది తన్ను ఘటించి కలంచుపట్ల న
జ్ఞాని యిటేచుమీ, పృథగఁ జాల దురుక్తులు వల్కు దేవు; సు
జ్ఞానియొ కర్మముం దలఁచి, కష్టము సెట్టులొ సైఁచి, వచ్చుజ
న్మానకుఁ గూడఁబెట్టుకొనఁగా గమకించు సుకర్మపుంజముల్. 129

(ముష్టిచెంబుంగొని... బొంగు బుజానవేసికొనిపోదురు)

ఉ. "బొంగు బుజాన వైచికొని పోయినఁ" బోదురుగాక, "ముష్టిచెం
బుం గొనిపెట్టు" మంచడుగఁ బోయినఁ బోదురుగాక, "గంగిరె
ద్దుం గొని దేవుఁ డంచుఁ బలుత్రోవలఁ బోదురు" గాక; దేవనిం
దం, గురునింద సేయఁదగదా! యలవారల కేల యగ్గిదో? 130

ఉ. శక్తుఁడవేని దేవగురుసంస్మరణం దిగఁదాఁవి, ♦ పై నికృ
ష్టోక్తులు పేర్లు దుర్మదుల కుల్లములం బగులింపు, ధర్మశా
స్త్రోక్తులు సమ్మతించు నిది; యూరక తీరికకర్మ నేటి య
వ్యక్తత, బక్కదాసరుల కగ్గెను నీసరులేమి కైసరా? 131

(బొంగుబుజాన వైచుకొని పొమ్మఁకఁ దిర్పతివేంకటేశ్వరా)

ఉ. "బొంగు బుజాన వైచుకొని" పోఁడు; వరాంగముమీఁద నెక్కి మా
ర్దంగికరావ ముప్పతిల "దద్ద దదిందక దద్దదోం దదోం
దొంగిణతక్క తక్క" యని తొల్లిటి కాళియమర్దనంబు జ
ష్టిం గొలుపుంజుమీ, తుదకు వేంకటనేతపదారవిందముల్. 132

(మాసినమూపపేరుగళమండనము... నీవేసముసూడ నెవ్వరికివేడుక)

ఉ. దాసునివాసికిన్ సరిగ దైవము తత్తదుపాధిరూపముల్
భాసిలఁ జేయు; నీకు నగపట్టెను దేవునికిన్ నక్కటా!
"మాసినమూవపేరు"; కనుఁగొయని వజ్రపుజోడు గల్గు శ్రీ
వాసుఁడు నీకుఁ గన్పడఁడు వాస్తవరూపముతోడఁ బుత్రికా. 133

ఉ. స్వామి ధరించు * వజ్రకవచమ్ము నెఱుంగుదె? యెన్నికోట్లు తా
నో? మహిపాలుఁ డెవ్వఁ డిడెనో? యటువంటి వివేకశాల్లరున్
బావురులా? దురుద్యమపద్ధతుల న్నెగడింప సామ్మ వ
మ్మాన్మమయాద కొప్పెడి ధరాధిపతుల్ సువివేకులా సుతా? 134

(♦ స్కాందోత్తరఖండము చూ.)
(* వేంకటాచలమహాత్మ్యము 5 ఆ, చూ)

(శౌర్యము లేనివాఁడుగద శంకరుఁడు)

ఉ. ఈశునకమ్మ కృష్ణుఁడయి యీశుఁడు పురత్రితయం బటుల్ పొరి
న్నాశము సేసినాఁ డనుట నమ్మెడిచో నెటు "శౌర్యహీనుఁ"డన్
రాశికి రానిమాట జనరంజక మా? మదిలోన నర్ధనా
రీశుని బెట్టి వ్రాసితివొ యీనుడి; దానఁ గవిత్వభంగ మౌ. 135

ఉ. "శౌర్యము లేనివాఁడుగద? శంకరుఁ" డంచొకబొంకు బొంకి, తే
యార్యులు విశ్వసింత్రు? "నిటలాక్షుఁడు శూరుఁడు గాఁ" డటన్న; నీ
ధైర్యమదేమొ? దేవగురుతత్త్వముపట్టునఁగూడ బొంకులన్
గార్యమకార్యమున్ మఱచి క్రక్కెద, వెక్కడిపాప మక్కటా! 136

(నిం దిరుపతివేంకటేశుఁ డనఁ దీరదు తిర్పతివేంకటేశ్వరా)

చ. "తిరుపతివేంకటేశుఁ డనఁ దీర" దటంచొకవాక్కు డొక్కి, పైఁ
"దిరుపతివేంకటేశ" యని దీర్ఘము నేమని తీసితోయి? యే
మఱితో? విడంబనో? యది ప్రమోదమొ? హాస్యమొ? తప్పమాపితో
నటిముఠఁ బాచితమ్ముగఁ దదాహ్వయమున్ స్మరియించుటో సుతా! 137

(ద్వాసరుల్ తిరిపము నెత్తువేళ నినుఁ దల్వఁగ)

చ. తిరిపము నెత్తువార లొకతిర్పతివేంకటదేవుమాత్రమే
స్మరణ యొనర్తు; రొక్కొక రుమారమణున్, మఱి రాముఁ, గృష్ణు నిం
స్మరణ యొనర్తు; రేటి కివి సాఁగనికల్పన? లింతమాత్రనే
వరదుఁడు వేంకటేశ్వరుఁడు వైభవశూన్యుఁ డెటుల్ కుమారకా? 138

ఉ. ఎంచి కనంగ లేదుకద? యెన్నఁడు నర్భక! * నారయప్పరా
వంచును "స్వామిసన్నిధి" యటంచును 'బైఠె' యటంచుఁ దంబురాఁ
గొం చరుదెంచుభిక్షుకులఁ, గొందఱొ కేల నిఁ స్మరింపరేమి? య
య్యంచితువాసి గాసిలుట లేనకొ? మానము లిట్టిగానముల్. 139

---

హిందూస్థానీ కీర్తన.

* అప్పారావు, దునియామే, నైరాజా, అప్పారావు స్వామిసన్నిధి బైఠె, అప్పారావు వైకుంఠమే నై రాజా. అప్పారావు కాశీమేయిసకటిహే॥ పల్లవి॥ ఖానే లడ్డూ దియా, పీనే తంబక్ దియా, హాత్మే లకిడీ దియా, సోనే కంబల్ దియా, దునియామే నై రాజా, అప్పారావు। ౧॥ పీనేలోక్కు రాజా,

ఉ. ఎవ్వని పేరు చెప్పికొన నిందుక ముష్టియుఁగూడఁ బుట్ట దా
గవ్వ నెవండు పాడుఁ? దిగ్జగమ్ములు మోసినవానిఁ దక్క; నీ
నవ్వున కర్థమేమి? యలనారయభూరమణుం డలంతియే ?
యెవ్వరు నీకుఁ జెప్పఁ గల? రేవియు పేర్లెదు తోఁచినట్లుగన్. 139

చ. అతని చరిత్రమున్ వినిన, వాన్పృపుఁబాడిన, నాపదాన్య దా
తృతకు నమస్కరించినఁ, దదీయయశమ్ము పఠించు భిక్షుక
ప్రతతిపదస్ఫురద్రజము ఫాలమునన్ ధరియించినన్ భవ
త్కృతము కృతఘ్నతాఘర మొగిన్ శమియించు,నటుల్ పొనర్పుమా.140

---

హుక్కా దియా రాజా, గుడ్గుడ్ దియా రాజా, చిల్మ్ దియా రాజా, గంజాయి దియా రాజా, చిష్టా దియా రాజా, దునియామే నై రాజా, అప్పారావు॥ 2॥ బైఠ్నే చెత్తర్ దియా, సోనేకె సత్తర్ దియా, యేలూర్మే, యేక్ బడా సత్తర్ దియా,దునియామే నైరాజా,అప్పారావు॥3॥ దూశ్మే గత్రీదియా, పాంకు బూతీ దియా, సిర్కే టోపీ దియా, చఢ్నే ఘోడీ దియా, దునియామే నైరాజా, అప్పారావు॥ 4॥ రోటీ ఖానేలోక్కు, రోటీ దియా రాజా, ధూ త్పీనేలోక్కు, ధూ, ద్దియా రాజా, దునియామే నైరాజా॥ 5॥ బామణ్ లోక్కు రాజా, ఏక్ సత్తర్ దియా, అమ్లీ దియా రాజా, బైగన్ దియా రాజా, డాల్, దియా రాజా, ఘై, దియా రాజా, షీ, దియా రాజా, సమ్మక్ దియా రాజా, దునియామే నై రాజా, అప్పారావు॥ 6॥ కాశీరోట్టుదియా, జగన్నాద్ రోట్టుదియా, మదరాస్ రోట్టుదియా, ప్రియాగ్రోట్టుదియా, గయారోట్టుదియా, దునియామే నైరాజా. అప్పారావు స్వామిసన్నిధిబైఠే॥ 7॥......శ్రీ.శ్రీ.శ్రీ.

(ష రా:—ఈ మహాపురుషుని పుణ్యకార్యముల నిదేరీతిని బైరాగులు గానము చేయుచుందురు. ఇయ్యనఘుఁడు సాక్షాద్భగవద్భక్తుఁడై జనులపాలిటికి భగవంతుఁడేయై యుక్తాయుక్తవిచక్షణత నెఱిఁగిన దాతయై నెగడెనఁట? ఈతని యుక్త దాతృత్వమునుగూర్చి యొక మహాకావ్యము వ్రాసినఁగాని యింతతోఁ దేలునదికాదు. భస్మాహుతిప్రాయముగ సొమ్ము వమ్మొనరించు నేఁటిదాతల కనేకుల కీయనఘుని చరిత్రము నీతిగఱపఁగలదని యెంచి కొలఁది దినములలో నీధర్మాప్పరాయుల పుణ్యచరిత్రమును వ్రాయనెంచి యిప్పటికి గ్రంథవిస్తరభీతిచే నింతతో విరమించుచున్నాము.)

(తిరుపతి వీడి వేఱొకప్రదేశముఁ జేరితివేని నీ, పరపతి యెంత యున్నదియొ
పైఁబడుఁ దిర్పతి వేంకటేశ్వరా)

చ. తిరుపతి వీడి వేఱొకప్రదేశముఁ జేరిన వేంకటేశుఁ డే
పరపతి నుండెనో యెఱుఁగు వాంఛ జనించిన దేమి? చూడుమా
* కురుపతిపర్వతమ్మరిగి కొండొక యచ్చటనున్న వేంకటే
శ్వరు; మది సందియం బుడుగు, సంశయముండుట నష్టి పుత్రికా! 141

చ. కురుపతిపర్వతంబు గనుఁగొం డెటు లందువొ? యాత్మకూర్ప్రభున్
బరిచితుఁ జేసినొ, మ్మతని పట్టణసీమకు నుత్తరమ్మునన్
బరఁగెడు నాగిరెండ్రి, మట భాసిలు వేంకటనేత, వాని న
న్నరపతి యింటివేలుపుగ నమ్మి భజించు ననేక భంగులన్. 142

శా. దేవబ్రాహ్మణభక్తిపోషి యచటిపృథ్వీనాథుఁ, డెంతేని స
ద్భావుం, డాగమదేవదేశికుల కెందస్ జేయునవ్వారిఁ గ
న్నో వాంఛింపఁ డెఱుంగఁ జెప్పితిని నీకున్; వైష్ణవగ్రామణీ
సేవాతత్పరుఁ డాన్నృపాలుఁ గన జేజే జూచినట్లుండెడిన్. 143

మ. సిరిఁ జెన్నారు మొగమ్మునన్ దిరుమణిన్ శ్రీచూర్ణముం బూని, శ్రీ
హరినామమ్ము జపించి, సాపశి, యథార్హాలంకృతుల్ దాల్చి, భా
స్వరపద్మాక్ష గాయకు ల్గొలువ నాస్థానమ్మునన్ గొల్చున
న్నరనాథుని గనుఁగొన్న దేవగుణునిందాపాపముల్ రూపఱున్. 144

చ. చేయఁ డపాత్రదానములు, చేయఁ డనర్హనమస్కృతుల్, మఱిం
జేయఁ డనైదికార్చనలు, చేయఁ డవిద్వదుదారసత్కృతుల్;
శ్రీయు యశంబు దాతృతయుఁ జేసియుఁ బొల్చెడివాఁడు, సత్కవి
ధ్యేయుఁ డతండు, పండితవిధేయుఁ, డహేయుఁ డెఱుంగఁ జెప్పితిన్. 145

ఉ. ఏగతిపైన నీమనత పెట్టినొ కన్గొని, నీకుఁ గల్గువి
ద్యాగరిమమ్ము తెల్పి, యుచితం బగుసత్కృతిఁ జేసి, మీఁద న
య్యాగమవేద్యుఁ డన్నగిరి కంపు సహాయుల నిచ్చి; యూరకే
వాఁగుటె కాని నీ వెటకు వారక పోవఁగ లే దెఱుంగుమున్. 146

* (ఆంధ్రీకృత శ్రీనివాసవిలాసము ౧, ఆ, చూ.)

మ. అసహాయమ్మగఁ బోకు; మేగు నెడ నయ్యాద్రింద్రమం దెందు *వ్యా
ఘ్రసమాజమ్ములు "గాండ్రు గాండ్రు" మనుచుం గర్జిల్లు నందెందు బ్ర
హ్మసమాజంబులు కేసమాజములు సేమం బీయ; వీదోసముల్
పసి గట్టం గల వా మెకంబు లచటన్ భద్రంబు సూ పుత్రికా. 147

ఉ. భక్తు లనేకు లయ్యెడకు వచ్చుచుఁ బోవుచు నుంద్రు; వారిపై
రక్తిగ నుండు నంట యది; బ్రహ్మసమాజము భక్తదూరమా
రిక్తమతమ్ము గానఁ జెలరేఁగఁగ వచ్చు నటంచు నెంచి సు
వ్యక్తముఁ జేసితిన్ దగినయట్లుకుం జని చూడు వెంకనన్. 148

క. కుమతియని కుమ్మతియని, కుమూర్తియు నాఁగ నుతియుఁ గుమ్మార్తియనన్
బరఁగెడిగిరి యది; యచటం గుమూర్తియె నీకుఁదోఁచు గుణవిహీనముతో.

చ. "తిరుపతి, వేంకటేశ్వరుని తేజమునన్ యశ మందె" నంచు ము
న్నతిముతి వ్రాసి; తప్పు డింపులు భిన్నము గాఁగ వ్రాసి; తే
మతితివొ? బుద్ధి కేడ్చెనో? "నాదిగమంచవుఁ" గుక్కెమో? యెవో
యెఱుఁగఁగ రాదు; సంకరము లీవు గ్రహించుము సుమ్ము కుమారకా! 150

చ. తిరుపతివేంకటేశ్వరుల తీరది యట్టిక! చంద్రికం ప్రికా
స్ఫురణము భాస్వదాతపవిభూతి జ్వలజ్జ్వలనప్రభాధురం
ధరమును గా నెఱుంగుదురు ప్రజ్ఞులు; మోఁజకులో, యెటేసియుం
దిరిగెడి వారినాలుకలు తెల్లుసు గావు సుమీ కుమారకా 151

ఉ. అంబ నెఱుంగుదే? మహిషునాశక మాఁగినతల్లి, యాపెసిం
గంబు నెఱుంగుదే? త్రిజగన్నము ఖర్వ మొనర్చె నేర్చె; నా
యంబరము సింగ ... పిడిగ వాక్కృతులన్ ధృతి మాని యున్నె? యా
వెంబరగొట్టు సోదుముల వేషబము ల్లిఖియించు వేటికో. 152

(కానుల పూరుషోత్తముఁడు... శ్రీకనకాంబ్రదేవుపైఁ జేసినయట్లు మేము ను
రచించితి మీశతకార్థము)

ఉ. కానుల పూరుషోత్తముఁడు గట్టిన పద్దెము లెల్ల భక్తి కా
వాసము; లీవుగట్టినవి బ్రహ్మసమాజసమాశ్రయత్వపుం

---

*వ్యాఘ్రసమజ ఇతి తు యుక్తం, తథాఽపీదం కేవలస్వార్థమాత్రపరత యానప్రవర్తత ఇతి కృత్వా సమాజ ఇత్యేవ ప్రయుక్తమితి తు రహస్యమ్

దోసము వెళ్లఁగ్రుక్కుటను దుండగపుం జెడుగంప, లద్దిరా
కాసులప్రోవ కాసులగు కాసుల కూరక వేపుఁ దిట్టెదే. 153

ఉ. కాసుల పూరుషోత్తముఁడు గట్టిన పద్దెములందు రాముని
గోసెను, కృష్ణుగోసె, మఱి ‡ గోయఁడ తిర్పతి వేంకటేశు; నీ
యీసునకుం సహాయుఁ డతఁ డెట్లగు? వారల కీ వభేదముం
జేసెదొ? నీదురుక్తు లవి నీదుశిరస్థలి నెక్కుత్రొక్కుడిం. 154

ఉ. "దేవునిఁ దిట్ట రా" దనియె తెల్పుదునో? "గురుఁ దిట్ట రా" దటం
చే వినిపింతునో? వృథయె యీయుపదేశములెల్ల నెంతదు
ర్భావుఁడు గూడ నీపను లపాత్రము లంచు నెఱుంగు; నట్టిచో
నే వచియింప నేల? ఫల మెయ్యది కోరి యిటుల్ వొనర్చెదో. 155

ఉ. "సెట్టికి నేదియో ఫలము చేకుఱుఁ బోలు" నటన్న సాహితం
బట్టితినా? యధఃపతనభాగ్యము తప్పద; పట్టుకుంటినా?
తిట్టెద వింతకన్న; నిను దేవుఁడె యిందుకుఁ బుట్టఁ జేసె; నే
నెట్టులు బాగుసేయఁ గల? నేపయినం వచియించుచుండెదం. 156

(వివరించెద మింతకుమించి నీయపఖ్యాతిని దక్కు సామిశతకంబున)

ఉ. ఇంతకు మించి తిట్టఁగలవేమి! యచెట్టిదొ యింక నొక్కమా
ర్గొం తది చెప్పుమా! భవదకుంఠితనీచతరప్రసంగవా
గ్దంతురతాప్రభగ్నతరకాంతహృదంతరసౌమనస్య
త్సంతతులే భవద్ధృదయసౌకరిసాకిరులై చెలంగుతం. 157

ఉ. ఈవఱకే "యపాత్రు" లని యెల్లరు ♦ మీనడి యెత్తికొంచు ని
క్షిపనముల్ పొనర్చగతి చేకుఱె నాఁగద? యింతకన్న దు

‡సీ. అప్పనంబులు గొను నఖిలబ్రహ్మాండకోటీశ్వరులచే వేంకటాచలనివాసుఁ
డరుదుగా నలువదావసరంబుల మహాభోగంబుగొను నీలభూశ్రీవరుఁడు
పానకంబాలుసాబాలు భక్తులకిచ్చి యొసఁగును మంగళాదీశ్వరుండు
పట్లకొలందిమై పూఁతగాఁ గొను మంచిగంధంబు సింహాద్రిప్రభుండు
తే. గీ. సాటిసాములరీతి నిచ్చోట నీవు
మూర్తిమత్త్వంబుఁ జూపక కీర్తిగలవె. చి॥

♦ (1) "ఈమధ్యను జూన్, జూలై, కవిత, సంచికలో మరల తిరుపతి
వేంకటేశ్వరనిందలు గన్పట్టినవని వ్రాయుటకు దురపిల్లుచున్నవాఁడను ఏతద్గ్రంథ

ర్భావపు గూఁతలక్ వదరి పోఁమికొనందగుభాగ్య మేమొ; ధూ
ర్తా! యిఁకేల? పండితపదస్పృశ కించుక వచ్చి తెల్పుమా! 159

కర్తలకు మతి యెన్నఁటికిని బుద్ధిరానేరదని నాయభిప్రాయము..."
రాజమహేంద్రపురి, 1-9-13. K. S. Raghuramaswamy.

(2) చెట్టెక్కినవారింతతో శాంతిఁ బొందిన సరసముగానుండును. ఇప్పటికే యపయశస్సు లెస్సగా వ్యాపించినది చేయుపని యెంతమేలు చేయుచున్నదో గమనించుకొను ప్రతిభకూడ సామాన్యము కాదుగదా!
గుంటూరు, 2-8-14. శి॥ హ॥

(3) "నేను స్వగ్రామముప్రక్కకు వెళ్ళినప్పుడు వీరి యర్థశతకాది ప్రశంసను జెప్పఁగా యోగ్యతెల్లరిది యేమియన్యాయము... చదువుకొంటిమని తమంతటఁ దామే యొప్పికొనియు నన్యాపదేశముగనో మఱియెట్లో యింకను దిట్టి తిక్కనుబడుచు దర్బార్కవులు దైవపంచితులగుచున్నారే' యనియే పగవసాగిరి, వారికి మనవిగఁ గొందఱుఁ వ్రాసికొందుమనియుం జెప్పిరి మొత్తమున వీరి ప్రసక్తికి సంతసించువారులేరు. కాపథమున కెవరభిముఖులగుదురు?" శి॥హ॥

(4) శిష్యులు గురునిందాపరులైరని, తాము మందలించుచుండఁగా నారు "అదేమి చూచెద విదిచూడు" మన్నట్లు కవితలో వేంకటేశ్వరునిఁ దిట్టి దిసంటులు గొట్టసాగిరి. దేవా! పురాకృతపుణ్యవశమున నిట్టిశిష్యులు లభించినందులకు ననుకొనవలెను గాని వేఱేముండును. కానిందు సాధారణముగా ధర్మచ్యుతి కల్గెడి యీయుగంబున మీగీరతధర్మసంహిత తద్దోషనివారకంబై మహాశయహర్షదాయకంబై వెలుంగుఁగాక. బృందావనము నరసింహాచార్యులు,
పొన్నూరుపోస్టు, గరికిపాడు, బాపట్లతాలూకా.

(1913 సం॥ సెప్టెంబరు 30 తేది మంగళవారము శశిరేఖనుండి)

శ్రీరామకృష్ణకవులు, విగ్రహారాధననిరసనము.

అనుపేర నేఁబదిపద్యముల రచించి తమ కవితారత్నముస్సఁ బ్రకటించియున్న సంగతి పాఠకులంద ఱెఱింగినదే. వానిం జదివిన వివేకులకు శ్రీరామకృష్ణకవులు సర్వలోకగురు తిరుపతివేంకటేశ్వర పూజానిరసనరూపమునఁ దమ గురుశతృవుల నెవ్వరినో దూషించుచున్నట్లు బోధపడకపోదు. అయినను వారుంచిన నామమునుబట్టియు వ్రాసిన టిప్పణమునుబట్టియు జనసామాన్యమునకు విగ్రహా

రాధన నిరసనమనియే తో(చుటనిశ్చయము. కాన( బామరజనాళిబాగును గోరియుం "స్పర్థయావర్ధతే విద్యా" అను నార్యోక్తిని దలంచి పండితులును గవిసత్తములును నగు శ్రీరామకృష్ణకవులతోడి ధర్మవివాదమువలన నాకు విద్యాభివృద్ధియగుననియుం నమ్మి వారు రచించిన విగ్రహారాధన నిరసనము మాత్రమే యించుక నిరసింప మొదలిడుచున్నవాడను గాన సదయహృదయులగు చదువరు లిందలి యుచితానుచితముల నారయుదురుగాత....

శ్రు॥'దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యం,' అనిశిక్షావల్లి, దేవపితృకార్యములవలన ప్రమాదము చెందకుము, అనియర్థము దేవకార్యమన దేవతాపూజయని మనము తలంచవలయును (పరాశరమాధవీయము 41వ పుటయందు) 'సంధ్యాస్నానం జపోహోమో దేవతానాంచ పూజనం' అని పరాశరుడు చెప్పియున్నవాడు; ఇందువలన దేవకార్యమన దేవతాపూజయని స్పష్టపడినది. దేవతలనేకులు కలరు మనమే దేవుని బూజింపవలెను? దేనియందు(బూజింపవలెను? ఇదివఱకెవరు పూజించిరి? అని ప్రశ్నలు కలుగకపోవు. వీనికన్నిటికి( బ్రత్యుత్తరములు గలవు. వినుడు. "సర్వజ్ఞశ్చ హి మాధవః" అని వ్రాసికొనియున్న బ్ర॥ మాధవాచార్యులవారు తమపరాశరమాధవీయమున 68వ పుటను ఆగ్నేయమే పి, శ్లో॥ అర్చనం సంప్రవక్ష్యామి విష్ణోరమితతేజసః, యత్కృత్వా మునయస్సర్వే పరం నిర్వాణమాప్నుయుః, ఇందు(జేయవలసిన పూజ విష్ణుపూజయనియు విష్ణునారాధించి మునులుముక్తినిబొందెరనియు( దెలియవచ్చినదికదా? ఇక నీపూజనెందుగావింపవలెనను విషయముంగూర్చి ముచ్చటింపుకొందము. పైశ్లోకమువెంటనే "అప్సు వాగ్నౌ హృదయే సూర్యేస్థండిలే ప్రతిమాసుచ, షట్స్వేతేషుహరేస్సమ్యగర్చనం మునిభిస్స్మృతం......

ప్రత్యహ్నం స్నాత్వా కృత్వా పిత్రర్చనం ప్రతిమాదిషు హరిహరాది దేవపూజనం, ఇట్లు శ్రుతులు స్మృతులు పురాణములు విగ్రహారాధన గావింపు(డన(గా, మునులట్లు చేసి ముక్తిపొంద(గా, నది తెలిసి యాచరించిన కుల్లూకభట్టమాధవవిద్యారణ్యాది వ్యాఖ్యాతృ శిరోమణులు బోధించియుండ(గా( బాతాళలోకము (అమెరికా) వఱకు వేళ్లు దిగిదిగంతవ్యాప్తి నందియున్న యీ విగ్రహారాధన సాలవృక్షము శ్రీరామకృష్ణకవులవంటివారు చేయు నల్పవిమర్శనచికిత్సలయుపాయములకు( గదలునా? కదలదు. ఇంతియెకాదు. వీరి బోధలచే రాజులవలనను బండితపామరులవలనను నిరంతరము పూజలు గైకొనుచున్న

ఉ. కీర్తి వసంతసేన, యది కేవలమున్ గుణరక్త దానికై
యార్తి శకారుఁ డూని యది యాత్మ వరించిన చారుదత్తునిన్
ధూర్తుఁడు తిట్టితిట్టి యల త్రొయ్యలిఁ జంపఁగడంగి యయ్యస
ద్వర్తనుఁ డేమి దా మిడికెఁ? దద్గతి నీకుచితంబె పుత్రకా! 159

(ప్రజల్ పరమేశ్వరుఁ గొల్వ నేర్చి యీ వెంగలి రాతిబొమ్మలను వేఁడరు)

చ. "పరుఁ డొకఁ డున్నవాఁ" డనిన భాగ్యము లేదనుమీ, కుమార! య
ప్పరువికృతుల్ గుణుండు మఱి పార్థివుఁడున్ జనకుండు; నిందు నొ
క్కరు దిగఁద్రావినన్ బరుని గా దని యంటరొ; వేదశాస్త్రముల్
మొఱలిడు నిట్లు; దాని నొకమోఱకు 'గా' దనినంత నే మగున్. 160

(1) బ్రహ్మముఁ గొల్వ దైవవిశ్వాసము లేదు వీరికని ...దూఱెదవేమి)

చ. పరుఁ డన నెవ్వఁడో తెలియు భాగ్యము లేకయె పోవుఁ గాక, త
త్పరుఁడయి పెద్దలం గొలుచు భవ్యుఁడు భవ్యము లందఁగల్గు; న
న్నరునకు విగ్రహమ్ము నెడ, నాయనపట్టున, నమ్మచోట, భూ
వరుకడ, నొజ్జచాయఁ గనుపట్టుఁ బరాత్పరుఁ డేకరూపియై. 161

(జీసను క్రీస్తునుం బ్రతిమ సేవను రోసెను)

మ. పరుఁ డెవ్వారికి లేఁడు? బౌద్ధులకు, నవ్వారే నియమున్ దేశికా
దరమున్ వీడరు; క్రైస్తవాదులకు నిత్యధ్యేయుఁడే యొజ్జ; యె
వ్వరికిన్ దూరమె నీమతం బెచట సంపాదించి తో తండ్రి? నా
తరమే నిన్ను మరల్ప? వర్ధిలుము శీతజ్యోతిచందమ్మునన్. 162

---

శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల పూజలకు లోటు వాటిల్లునా? వాటిల్లదు. "సత్యమేవజయతి నానృతం." (ఇందు విస్తరభీతిచేఁ జాలవదలితిమి) తి॥ వెం॥

ఇట్లు విన్నవించువాఁడు మహబూబు కాలేజి సహోయాంధ్రోపాధ్యాయపద

విభ్రాజి. శివానుగ్రహవిరాజి

శివపురపు వీరభద్రపాకయాజి.

సనాతన ధర్మబోధినీ సామాజికుఁడు, శికిందరాబాదు.

(1) ఈగుఱుతుగల వాక్యము, వేంకటేశ్వరస్వామివారికి సమన్వయించదు. స్వామివారు బ్రహ్మముగొల్చువారల నెవ్వరిని దూఱిరి? ప్రమాణమేమి? ఇట్టివెన్నో కలవు. మఱియొకటి మాత్రము చూపుచున్నారము. చ. పరులను

(పేర్పడు పనవర్తియు న్నిను సభాజనపాత్రము సేయఁడు)

క. ఏపవనవర్తియు ఘనభువ, నావనవర్తి యగు వేంకటాచలపతిపై
నీవలెఁ గాపల మూనఁడ, సేవించియొతీరుసేప చేకూరినచోఁ. 163

తే. గీ. లుబ్ధకుఁడు పనవర్తి యాలుబ్ధకు లెటు
గొల్తురో యట్లు గొలిచెడిఁ గొసరికొసరి;
ఇంతయెందుకు ? చెంచురా జెప్పఁ, డతఁడు
గాఁడె పనవర్తి ? కూఁతునె కాన్కయొసఁగె. 164

గీ. వాని యేర్పాటుచొప్పున వాఁడు గొలిచె;
నదియు సామికిఁదగుఁగాక, యట్లు కాక
పోవుఁగాక, యవ్వానికి సేవకుండు
గాఁ డనెడి దోసమును గట్టఁబోఁడు సుకృతి. 165

క. "పేర్పడుపనవర్తి" యటం, చేర్పాటొనరించితో కో ? యిఁటు లగునేని
దిర్పతివెంకనకుఁ వాఁ, డర్పింపఁడు నుతులు నిక్క మాడితిపుత్రా! 166

(బహుమార్గనేపులంజేయులు గాఁ దలంపకుము)

ఆ. వె యేకమార్గవేదియే వేది, బహుమార్గ, వేది యేటివేది ? వేఁదు అతఁడు
ఏకమార్గ మన్న నే మనుకొంటివో ?, సత్యమార్గ మది ప్రశస్తి తెరువు.

ఉ. కారొకో ? రక్కసుల్ కడు నకార్యరతుల్ 'బహుమార్గవేదు' ల
వ్వారల మార్గముల్ తుడకుఁ బాడటి యోపరె ? జయ్యులైనవా
రేరును బెక్కుత్రోవలనె యేగుచునుందు, రజయ్యు లొక్కటే
దారిని బోదు రయ్యది సదా జయ మిచ్చు యశం బొసంగుచుఁ. 168

చ. అరయఁగ నేర్తు వీవు చతురంగ మొకించుక నుర్తురే ? యే
లురిపురి నిక్కతాన నిను నొక్కట శిక్షితుఁ జేసినాఁడ, నీ
చరిత మటుండె; నియ్యెడ నజయ్యుల యెత్తొకతీర యుత్తు, త
త్తఱపడి సార నోటుపడు తజ్ఞులదాఁటు లనేకమార్గముల్. 169

---

బూని తిట్టెదవు బ్రహ్మసమాజము జిహ్మవృత్తివై' వేంకటేశ్వరస్వామివారు బ్రహ్మసమాజము నెవ్వరి నావేశించి తిట్టినారో అయాచోట్లు పనిఁబడినచో దేవయ్యలకుఁ జిక్కు తెచ్చెడివి యని యెఱుఁగుదురుగాక.

చ. ఒకయెడ మూలయె త్రొక్కట నొండొకయె త్రొక్కమాఱు కేవిబం
ట్లు కదలునెత్తు మంత్రికదలున్ మఱియొక్కెడ నేఁడె దాఁటు వే
ఱొకయెడ నన్నిటం దుపకు నోడుదు రీ 'బహుమార్గవేదు', లే
రికి జయ మబ్బు వార లొకరీతినె యెత్తుదు రెత్తు లర్భకా. 170

(ఈ సంగతి యెల్లవారికి నసహ్యమె యయ్యెను)

ఉ. ముంగల సద్గతుల్ వొలయు పుణ్యులకెల్లను వేంకటేశు స
త్సంగతి సహ్య, మందులకె నల్పుచునుందురు సర్వదా; వృథా
భంగురమైనకుక్షికయి పాపకృతుల్ రచియించువారి కా
సంగతి యెట్టు లబ్బెడి ? నసహ్య మలభ్యము కొంతమందికిన్. 171

క. కటికిక్ విగ్రహరిమిస్త్రీఁడు, ఘుటియింప డటం చెఱింగి కామ్యార్థముపై
నటియించు ననావృతి; వేం, కటపతిసంగతియు నెట్లుకట ? సంకర్యోన్.

(విశ్వములోన నెల్లను వివేకులు వేడుకతోఁ బఠింపఁగా)

ఉ. "హైదరుబాదు" వీధి నొకయజ్ఞుడు హేలను నొక్కెడేహిఁ జా
మోఁది చసంగ నేఱొకఁడు వొవ్వుచు నెంచెనుఁ జూచి 'కత్తిఖా
గాఁ దెగె 'సా' ఫిటుల్ వలయుఁగా ?' యని మెచ్చెనఁ; టట్టులే సుబ్బా
నీదు కవిత్వపుంగరిమ నీతివిహీనమతుల్ పఠించుటల్. 173

(పొంగుచు నంటె "నన్ జనులు పూజలొనర్తు" రటంచు)

చ. పతులకు నోఁచుకోని యెలప్రాయపుటంగన లూరకే హిమ
ద్యుతిమలయానిలాదులను దూఱుదు, రాదర ముప్పతిల్ల సం
గతపతులైన కాంతలు నికామమహోత్సవముల్ పొనర్చి స
త్కృతులుగఁ జేతు రిందుఁ గల దేవరహాస్యము నీ వెఱుంగవే. 174

మ. ఉపయోగింపవు దేశికాఖ్య మొదటన్ 'నోదాహరే దస్య నా
మపరోక్ష' మ్మను శాసనమ్ము కతనన్ మవ్యాజమై నట్టి ప
ప్పవలాపింపఁగ వచ్చు నక్కటకటా ? యాపై వృథామోషక
త్వపదం బెక్కితి వేస్మృతిన్ జదివి ? తేథన్యుండు శాసించెనో ? 175

శా. అల్పంబే యగుఁగాక నాగరిమ వేనల్పుండనే యాదుఁగా
కల్పత్వ మ్మది తిట్టునీకు నొకసాహాయ్యమ్ము గావింప, దే

శల్పమ్మందును నీ వొనర్చ్పని యేకష్టంబు గావింపఁ; డీ
శిల్పం బేగురునొద్ద నేర్చి తరచె? శిష్యా, స్వయంవ్యక్తమో! 176

ఉ. "వేదులవాఁడు నామఁ బిది వేఁదుఱు వ్రాఁతలు వ్రాసినాఁడు వాఁ
డీదురితమ్మునన్ జెడెడి నే నఘ మొంద" నటంచు నెంచె దే
వో? దురితంబు వాని దనఁ బోలదు నీకయి వాఁడు వ్రేలుటన్
నీదియె పాతకంబు మహానీయుల వేత్తల నడ్గి చూడుమా. 177

ఉ. గొల్లది చల్లలోఁ గలుపుఁ గొంపకుఁ గొంపకుఁగూడ నీళ్లు, లే
పల్లవపాణి యేనియు "సెబా! సిది యేమె యపాత్రురాల? యీ
చల్లకుఁ దెల్పు చచ్చె" ననఁ, జాన వృథా జల మిచ్చినట్టియా
తల్లులఁ దిట్టు "నేచెనఁటి తా నిట నీ రిదె" నం చెఱుంగుదే. 178

క. గురు నేల తిట్టితన, మా, గురువే యిటు చెప్పెనంచు గొణుఁగకుమా! యీ
దురితమ్మెల్లను మెల్ల ను, పరి నాశిర మెక్కు మిగుల బరు విది తనయా. 179

(తత్ప్రతిమారాధనము నిరసించినచోఁ బ్రధాననిబర్హణన్యాయమునఁ
దక్కిన విగ్రహముల పూజయు నిరస్తము)

ఉ. తిట్టఁగ లేదు నీవు మముఁ, దిర్పతివేంకటనాథు నే చెడం
దిట్టితి విగ్రహార్చనవిధి న్నిరసించుట, కైనఁ గాశికా
పట్టణనేత దిట్టుటకుఁ బాల్పడ వే? మతిఁ దగ్రగణ్యుఁ డా
దట్టునిఁ దిట్టినప్పుడ "ప్రధాననిబర్హణ" నీతి సార్థమా. 180

క. 'కాశ్యత' ఇతి వివరణమునఁ, గాశ్యపి చనుఁగాక శూలకలితం బగుచున్
దృశ్య మగుఁ గాశి యది "య, ద్దృశ్యం తన్నశ్య" మనువిధికి లోఁగదునూ-

(కలౌ వేంకటనాయక, అను వచనము)

క. కానఁ 'గలౌ వేంకట' యను, మాన మ్మొండినను గాశి మహిమ మధిక మె
న్నేఁ యు రెట్లట్లగుటఁ 'బ్ర, ధాననిబర్హణత' కదియ తగుఁ జుమి పుత్రా.

క. క్షేత్రములలోనఁ గాశీ, క్షేత్ర మ్ముత్తమము దానిఁ జెఱిచినపై నీ
క్షేత్రమ్మొకనిఁ జెఱుచుట పాత్ర మ్మద్దాని విడువఁ బాడియె కుజ్జా. 183

ఉ. ఎందఱు కాశి కేగుదురొ, యెందఱు తిర్పతిఁ జూడఁ బోదురో?
విఁదుమఁ కాదె? సర్వపృథివీస్థలి క్షేత్రములెల్లఁ గాశితో

పం మలఁదూఁగ నయ్యది చెడక జెడు సర్వము, దాన నున్న రా
తిం బెగఁ దిట్టి విగ్రహావిధి న్నిరసింతువు గాక యూపయిన్. 184

(దిక్కుటి కొండయెక్కుతివి దేవుఁడ? తిర్పతి వేంకటేశ్వరా)

ఉ. మొక్కులు ముడ్పులుం గలుగుముగ్ధులు మాత్రమె వేంకటేశుకొం
డెక్కుదు, రల్లకాశి కెవరేనియుఁ బోయెద రట్లుకాన న
మ్మక్కలికంటె లింగమును మీఱుము దూఱులు పోవునంతఁ దా
దిక్కటి దాన విగ్రహావిధి న్నిరసించుట సర్వసిద్ధమా. 185

క. కావునఁ గాశీక్షేత్రము, పోవలయున్ ముందు దానిపోకకునై వా
చావిభవము వెలయింపు వ్ర, భావో దది చెడియెతీరుఁ దగుకవివేనిన్.

సీ. అట్లొనర్చితివేనియది గంగఁబడు, మీఁద రామేశ్వరము సముద్రమున మున్గు,
నాపైఁ బ్రియాగయు నటుపై గయాతీర్థయంబడుగంటుఁ దత్తదర్థస్థలముల,
నల్లంత రంగనపతార మదియుఁ గావేరిలో మున్గు దేవేరితోడఁ,
బిదపఁ గాంచ్యాదుల పేర్వోవు, నంతలో దక్షిణదేశయాత్రలవి సుఖుఁగు

తే. గీ. పైని "మక్కా మదీ" నాది పగముక్తి
దాయక క్షేత్రములు మనుధర్మశాస్త్ర
మూప్యపరదేశయాత్రలు శిష్య! మన కు
పాస్యతాభాజనములు గావలయుఁగొక్క.

(మే మీవిధిసర్వమంగళము నెప్పుడుఁ బాడుచుమ్మ్యా నీకు-)

తే. గీ. "పాముతోఁ జెలగాటముల్" పనికి రావు,
శేషశైలేశుపై నేల రోష మన్న,
వింటివో? విన, "వీశ్వరవేర" నైతి,
విన వని యూటెంగియును జెప్పెదను కుమార!

మ. గురువిద్వేష మొకండుచాలదె? వృథా పూర్వ్ఁ వేంకటే
శ్వరవిద్వేషముగూడ నేమిటికి? దేవద్వేషమున్ దేశో
త్తరవిద్వేషము రెండునుం గలియుచందం బట్టిదో నీకు నే
నెఱిఁగింపన్ వలెనే కుమార! సుఖివై యీ త్రోవ రాఁబోకుమీ. 183

మ. గురునిందాదురితంబు చాలక వృథా గొంటాట లీ వేంకటే
శర్వనిందాదురితంబు లేటికి; బళా! సంపూర్త్రుతల్ చాలుఁ; దే

పరహాస్యమ్ములఁజోలిఁ బోకు మవి సంభావింప శక్యమ్ముగా,
పరయం బోకుము భక్తి లేనియెడ నీ వద్దేవుపాదాబ్జముల్. 190

చ. నరుఁ డురవైనచో నితఁడు తృణమ్మగు మేరువు, మంగళంబు లీ
పటిమతి నెన్నిపాడితివొ యన్నియు నన్నియుఁ గోటులై నినున్
దిరిగి వరించునట్టు లలతిర్పతివేంకటశాస్త్రి చేయుఁ ద
చ్చరణములెట్లు పట్టిన నొసంగు ఫలమ్ముల దేవుఁ డర్భకా. 191

ఉ. మంగళముల్ బఠించు టది మంచిదియే గురుమూర్తిఁగూర్చి య
మ్మంగళమూర్తి నీమనసు మర్మ మెఱింగి యతోధికమ్ముగా
మంగళముల్ ఘటించుతఁ బ్రమాదములన్ క్షమియించి దానిచే
తం గరుణాళుఁ డన్ బిరుదు దైవతమూర్తికి చెల్లఁగావుతన్. 192

ఉ. ఆర్పను దీర్పనుం దగనియజ్ఞులయందున డాఁగి సారెకుం
దిర్పతి వేంకటేశ్వరుని దిట్టెదు నోరికొలంది, నిట్టినీ
దర్పము ధైర్యమున్ * గవిసదస్సునఁ జెట్టి సకలమ్మెఱింగి రి
ట్లూర్పులు పుచ్చుచున్నయవియో? కనుఁగొంచుక విప్రదర్భకా. 193

---

* భవత్ప్రణీతగీరతామ్నాయం శ్రుత్వా సంతోషవశా దేవం లిఖామి॥ గృహ్ణంతు కరుణానిధయః॥

శ్లో॥ లోకేఽస్మిన్ కలినామకాంధతమసవ్యాప్తే తమో దూషితే। గ్రన్థాదిత్యవిసింహైశ్చ బహుభి। ర్గూఢీకృతే సజ్జనే, కృత్వా గీరతభాస్కరం బహుసుపర్వానందసంధాయకం, విద్వద్భ్యో దదతుః ప్రబంధ మతులం యౌ తౌ కవీంద్రౌ స్తుమః॥ శ్లో॥ సన్మార్గగౌ శ్రీపతివేంకటేశౌ। కళాసమగ్రావిహ పుష్పదంతౌ। సుజ్ఞానదానా జనస్య సమ్యక్ప్రకాశితారౌ జయతాం చిరజ్ఞౌ॥ శ్లో॥ గురుభూసురదైవదూషణేషు స్వకృతైనోఽంధదృశో విముక్తతాప్య। కవికంకళితాత్మకాః ప్రబుద్ధాః పరమాభ్యుత్కటకాంచితాః స్ఫురంతు॥ శ్లో॥ ఏతాదృగ్గ్రంథనిర్మాణే లోకజ్ఞానాదికారణే। భవంతావేవ దక్షౌ ద్వౌ కింకవీంద్రఘటావరైః॥

పంచాగ్ని, మార్కండేయశాస్త్రి. కవిగీరతాలుబ్ధా
పోలవరగ్రామవాసీ. ప్రకృతే పాతగుంటూరుపురవాసీ.

శ్రీరామకృష్ణకవులు గురుసింగాపతులగుటచే నన్యులైనను శిష్యస్థితి తుల్యమగు నిట్టిగీరతామ్నాయమును దమచేఁ జెప్పించుటచే నెంతయుఁ బ్రశంసనీయులే.

తే. గీ. *అమ్మపుట్టిల్లు నీకింజరమ్ము, దాని
"లంజలకుఁ బంజరం'బనెడుం జెనంటి.

---

వారు చెట్టెక్కి కోకిలమ్మలైరి. తమ సదుపదేశములను వినరు సరికదా, ఏవియో సాహసప్రయుక్త శతకాదులనుగూడ రచింప సాగిరి. ఏదియో తీగఁ ద్రొక్కిన వారు దారితప్పినట్లు వీరిప్పటికిని ద్రోవకురారు. కానిండు, వారికై యమర్చిన గ్రంథము వారికొక్కరికిఁ గాకున్నను లోకమున కంతటికి నుపకారకము గాక తప్పదు....

స్కూలుమాష్టరు. శిష్ట్లా వెంకట సుబ్బశాస్త్రి.
అప్పాపురం బాపట్లపోష్టు,

శ్లో॥ స్వచ్ఛందప్రసరత్సుధారసఝరీ మాధుర్యసారస్ఫుర। ద్ధీరోదార శతావధాన కవితాసింహాసనాధ్యాసినౌ। ఈక్షామాత్రనిబద్ధ సర్వకుకవిప్రాగల్భ్య గర్వగ్రహౌ। శ్రీమత్తిర్పతివేంకటేశ్వరకవీంద్రౌ శిష్యకల్పద్రుమౌ॥ శ్లో॥ అంగీకురుతం కృపయా, చంపకమాలాం మదర్పితామేతాం, ఇత్యభివాద పురస్సర మభ్యర్థనమాతనోమి యువాం॥

చ॥ కలి కలుషోన్మదైకమదఖండనచండసరస్వతీసము, జ్జ్వలనయదాన శౌండ మపవారితవైరివృథావితండమై, వెలసెడుగీరతాగమము వీనుల విందుగ నిందు నెల్లవా, రలము పఠించినారను పరాపరమూర్తులరైన మీకు శిష్యులు కలి పూరుషుల్ గురుయశో౽సహనమ్మునఁ దమ్మ మిమ్మునుం, దుల నిడికోఁదలంచి సరితూఁగ భ్రమించియు మీయశంబు దొం, గిలు పనిఁబూన దానిఁ దమగీరత మెల్లెడ నెల్లడించె మేకులుబిగియుంచి లాగితిరి కోయని కూయఁగ సర్వముండన, మ్ముల జరిపించి మించితిరి. మూలముడుంగఁగఁజేసి మేల్మినుం, గులఁ దవిలింప నెంచితిరి, కోయిల లోర్వనె యట్టిధాటికా, జిలిబిలిమాటలు న్నగవు సేఁతలు [illegible] దగపంచు మీవిపక్షులకు జగమ్మెతాఁ దెలుపఁ జొచ్చె, పికోద్ధతి చచ్చె, [illegible] భూ, వలయము మెచ్చె మీయశమభంగురమై కడు హెచ్చె..., వైది[illegible]డ నుగాను నన్నొక చిన్నశిష్యుఁగాఁ, దలఁపుడు శైవశేషుఁడ... గమలాపురినుండుదుఁ గడ్పమండలిన్॥

శైవశేషశాస్త్రి. కమలాపురం, కడపజిల్లా.

‡(రామకృష్ణ మహాభారతము, వింజరపర్వమునుండి)
క॥ వింజరము...వేశ్యా (లంజల) పంజరము..."

నీవు ననుఁగాని యెవ్వరినేని గాని
యెట్టితిట్లు తిట్టిన గణియింపవలెనె! 194

సీ. అలయయ్య నెఱుఁగుదే యతఁడు †పాచకమాలి తాత నీకగుఁ జుమ్మి తల్లివంక
అలకాస్త్రీ నెఱుఁగుదువతఁడు వంటలవాఁడె యతఁడు బావకు జ్ఞాతియగునొ కాఁడొ
*'మేల్మి' మీయాతఁడేమి కుట్టంపున్ ధూమపాయి జూదరి గ్రామపాచకుండు
ఇంకనొండొక ‡చందుఁ డెల్లభూములనమ్మి యేమిచేసెనో? నీవు నెఱుకపడవె

తే. గీ. ఇట్టియాత్మసంబంధులకెల్లఁ దవుల
నింజరమ్మును దిట్టితి, వింజరమున
కిక్కథకు నేమి సంబంధ? †మిల్లునాకు
నచటనుండినయంత నేమయ్యెఁ బుత్ర.

గీ. పాచకత, యాచకత, నీళ్ళుమోచుపనియుఁ,
గృతము మఱచి యవాచ్యముల్ గిలుకువాని
పనికిఁ దుల్యమ్ములనుకోకు; పడరువారు
నరకమున వారినేటికి నవ్వెదీవు!

ఉ. ఇంజరమేమి చేసె మతిహీను నినుఁ గని ప్రీతికల్మి *"నీ
కుంజన దిట్టిదుర్ణయము, కూళవుకాకుము, వేంకటేశు ప
త్కంజరజంబ వీవిపుడు కాఱులు ప్రేలినలాభమేమి" నా,
"లంజలపంజరం" బయి యలందురునే? "కవికుంజరం" బరే? 196

(† సీ॥...తే॥...పాచకులు, యాచకులు, నీళ్ళుమోచువారుగలరు కొందఱు ఇం
జరగ్రామమందు") (రా, కృ, భా, విం, ప, చూ.)

(* ఉ॥...వింజరమందు మేల్మిబంగారమువంటి న్యాయపథగాములు..."సీ॥...
అహిఫేన ధూమదండాదుల సేవించి యుపగతభాగ్యులైనట్టివారు..." జూదం
బాడి యప్పులపాలైన యట్టివారు,) (రా, కృ, భా, విం, ప, చూ.)

(‡ ...ండ్రి ననురక్తిగలమాంత్రి గా నమ్మి యర్థమ్ము గోల్పోయినట్టివారు")

(† తే॥ అట్టివింజరమునఁ జెయ్విగట్టువరిని, బెంచుటెలు గట్టికొని యుండె వేంకటే
శుఁడు") (రా, కృ, భా, విం, ప, చూ.)

(* క॥...కొందఱు విద్వ, ద్గణమునధిక్షేపింపన్ గలుఁగుదురు")

పరా:— ఈ పద్యము నందేమి, దీనికిఁ బూర్వమున నున్న, 104,105. సంఖ్య
లుగల గీతములందేమి, వెం॥ రా॥ లెవరిని మనమందుంచుకొని, శుంఠలు, గుణహీ

సీ. కాళికాఘట్టానఁ గలవిజ్ఞుఁ డొక్కండు నిన్ను బహ్వర్థముఖునిం బొనర్చె
నైజాము రాజ్యమ్మునఁ గలవారెందఱో నీపేరు వినుటకే యోపమనిరి
కడప కర్నూల్ ప్రక్కఁ గల ప్రాజ్ఞులెల్ల నిన్ గలిపురుషునిగాఁ గఁదలఁచుచుండి
రల్లనెల్లూరివై పంతకుమున్నె నిన్ బతితునిగా వ్రాసి పంపఁదొడఁగి

గీ. తెలిఁగె విజయనగరము నీ హేయచరిత
తెలిసికొనియె గుంటూరు నీ చులుకఁదనము;
ఇంజరంబును గూసిన యెడ్డెకూఁత
తెన్నిగ్రామమ్ములను గూసె తెలుఁగఁ జెప్పుమ. 197

శా. ఏయూరన్ దెగఁదిట్టనేమి యగు, నీ వవ్వారలన్ గొట్టఁ జే
మా; యాథార్థ్యము దాఁగ; దింపరము మాటట్లుంచు నీ దబ్బఱల్
నీయాత్మన్ గనుపట్టవే, అది నిను 'న్నీచుండ వీ' వంచుఁ దా
రోయన్ మానెనె? దానిఁ దిట్టికొను మేరన్ రారు నీజోలికిన్. 198

గీ. రమణ శ్రీలక్ష్మినరసాపురమున మొన్న
రావు శ్రీచెల్లయాంబకు రాణయొసఁగ
జరిగినది షష్టిపూర్తి, యచటికి నీవు
రావు, బావయు రాఁడు. మీ చేవ తెలిసె. 199

(1914 సం॥ నవంబరు నెల 17వ తేదీ మంగళవారం శశిలేఖనుండి)

షష్టిపూర్తి, అవధానములు.

ఈనెల 9వ తేది సోమవారంనాడు చెల్లాయమ్మారావు బహద్దరువారి షష్టిపూర్తి మహోత్సవము జరిగినది... వెంకటరామకృష్ణకవులను, తిరుపతివెంకటకవులను అవధానములకు శ్రీ చెల్లాయమ్మారావు వారు పిలిపించగా మొదట సమ్మతించిరి. అంత కార్యక్రమపట్టికలు అచ్చొత్తించిరి. ఏకారణము చేతనో

---

నులు, సంకరులు, లోనగునీచపదములలోఁ దిట్టమొదలిడిరో వారలెల్లఁ దగు మాత్రము సాహిత్య సౌహిత్యములుగల్గి కవిత చెప్పఁగలవారనియు, సంపన్నగృహస్థులనియు. వీండ్రికృతఘ్నతను రోయుటచే సకలము నెఱిగిన వారియెదుట నేమియు ననఁజాలక యిట్లుతిట్టఁబూనిరనియు, నెఱుఁగఁదగు, మఱివారినేకాక గ్రామము నెల్లఁదిట్టదొరఁకొనుటచే నాగ్రామమందలి వారలెల్ల వీరికృతఘ్నతకు వేవగించుకొనువారేయని విస్పష్టముకాన వ్యాఖ్యానమనపేక్ష్యము,)

రామకృష్ణకవులు వచ్చుటకు వీలులేనట్లు సూచన చూపింప నాకార్యక్రమపట్టికలు వదలి, తిరిగి కార్యక్రమపట్టికలు ముద్రింపించి... 6 వ తేదీ తిరుపతి వేంకటకవుల శిష్యులలో నొకరగు బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిచేరను అష్టావధానము చాల బాగుగా జరిగినది. రు116లు బహుమాన మొసర్చిరి...అవధానులకు రెండు నూటపదార్లు బహుమాన మిచ్చిరి. తిరుపతి వేంకటకవులకు వెంకటరామకృష్ణకవులకు సమావేశము కలుగుచున్నది. యెద్దియో వైచిత్ర్యముండునని అనేకయూళ్ళనుండి చాలమంది జనమువచ్చిరి... శ్రీరాజా చెల్లాయమ్మారావువారి వంటివారే పిఠాపురం ఆస్థానమునకు సంబంధించినవారు పిలపించినప్పుడు సభకురాని వెంకటరామకృష్ణకవులను, మరి యేరాజులు వీరికి తిరుపతి వెంకటకవులకును సమావేశము చూపించి సభ చేయింపగలరు. ఇంక యిట్టి వూహా యెద్దియయిన ఎవరికయిన నున్నయెడల అద్దిమానుకుందురుగాక. ఇట్లు,

తులసి విశ్వనాధము.

---

చ. 'అనది'లటంచు మిమ్మెఱుఁగు నంతకుమున్నె జగంబు! చెల్లప-
జననికి షష్టిపూర్తి, మనశాస్త్రికిఁ దిర్పతి కిష్టిపూర్తి, భూ-
జనులకుఁ దుష్టిపూర్తిగా, ధృతిచాలని బావకు నష్టిపూర్తిగా యుఁగా
దనరుకతాన సర్వవిదితం బది యయ్యె నిఁకేమి వ్రాసెదో! 200

చ. పిలువఁగలేదొ? మిమ్ములను, బిల్చిన 'వత్తు' మనంగలేదొ? పైఁ
దలఁ కుదయింపలేదొ? కలతత్త్వము లోకమెఱుంగలేదొ? య-
న్యుల నటులుంచు, శ్రీకరుఁడు యోగ్యుఁడు సూర్యవిభుండు రాజబం-
ధులును నిజం బెఱింగి రని తోఁపదొ? నీమదికేని యర్భకా! 201

గీ. సకలము నెఱింగియును నిన్ను సాఁకువిభుని
మోముచూచి నిన్నేమియుఁ మొగము నెదుట
నాడకుండిరిగాక, నీయనృతములకుఁ
బార మున్నదె? నీగుట్టు బయలుగాదె. 202

ఉ. ఈ వొనరించుదోషము లనేకము; లందును నింజరంపు భూ-
దేవులజోలి కేగు టది తీరనిదోసము, వారి పాదముల్
కేవలభక్తి మ్రొక్కి మలిగింపకు, 'మాచెడుకూఁత లెల్ల నా-
బావలిఖించినాఁ' డనుచు వారికిఁ దెల్పుము శాంతి కల్గెడిన్. 203

ఉ. చూడఁడుగాక చూచునెడ సూర్యనృపాలుఁడు గూడ వేంకటా
ద్రీడవమాన మొప్పినను దీనికి నొప్పికొనండు; గ్రామమం
దేఁడొ యొకండు నీకు సరియే యగుఁగా కది కారణమ్ముగా
గాడఁగఁ దిట్టిపోసెదవె గ్రామమునెల్ల; వివేకి సైఁచునే. 204

ఉ. ఎప్పుడుగాని సూర్యనృపుఁ డీవును బావయువ్రాయు తప్పడుం
జెప్పులమారి పిప్పినడిచెయ్యులు తాఁ దిలకించి యుండఁ; డె
ట్లొప్పెడిఁ జూచెనేని; యతఁ డొప్పిన నొప్పుత, మేముమాత్ర మా
యొప్పులకుప్ప యొప్పినటు లుల్లమునం దలపోయ మర్భకా. 205

ఉ. ఆయన దర్శనమ్మునకు నందనివారము మేము, కాకతా
ళీయము గాఁగ నానృపనిలింపుఁడు మాసభ కేగుదెంచుచో
ప్పాయితమయ్యెఁ గాని యది యంతటిభాగ్యము లేనిదయ్యె, లే
దా, యతఁ డిందు కేమనునొ యానుడు లిందు లిఖింపకుందుమే? 206

చ. ధనమిడి పత్రికన్నిలిపి 'తజ్ఞులమెప్పును గొం' డటంచు న
య్యానఘుఁడు సెప్పఁగాని 'కనినంతన కేల నుపానహమ్ము కై
కొని మరియాద సేయఁదగు కొంటె నుడు ల్లిఖియించి పాప భా
జనమగుఁ' డంచు నానృపతిచంద్రుఁడు చెప్పు వనంగఁ జెల్లునే. 207

చ. తిరుపతి వేంకటేశ్వరుని దేవుని దిట్టెడినీకుఁ బ్రాఁతె? యిం
జరము; భవద్విధంబుమనుజన్మలు లే ర్దనుజన్మ లుండ్రు నీ
దురితపుధోరణిన్ గడకుఁ ద్రోచుచుఁ దిర్పతివేంకటేశుఁ డిం
జరపురవాసులున్ సుఖ మొసంగి క్షమింతురు గాక వీఁకమై! 208

గద్య

ఇది శ్రీ... తిరుపతివేంకటేశ్వరవిరచితంబగు విగ్రహారాధనము

సంపూర్ణము.

## తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 1 | న్యాయేన్య | న్యాయ్యేన |
| 3 | 3 | గల్లరీఁడనవచ్చుఁ | గల్లరీఁడనవచ్చు |
| 5 | 21 | కికఁ | కిఁక |
| 7 | 6 | బాగ్రికుచుంటి | బాగ్రిఁకుచుంటి |
| ,, | 11 | ముంపగ | ముందఱ |
| 13 | 3 | దేపుఁడె | దేవుఁడె |
| ,, | 12 | హౌదువేని | వౌదువేని |
| 27 | 23 | తె్లము | తెల్లము |
| 29 | 21 | యక్కటక్కటా | యక్కటకటా |
| 32 | 16 | మ్రెుఱకన | మ్రొుఱకన |

# గీరతము

(లోకాభిరామాయణము)



# గ్రంథ పరిచయము

షష్టిపూర్తి మహోత్సవమైన పిమ్మట గ్రంథముద్రణము ప్రారంభింపక పూర్వమే మా గురుపాదులగు శ్రీవేంకట శాస్త్రిలవారు రుగ్ణులగుట తటస్థించి, దాదాపు ఆఱు సంపుటములు పూర్తియగు వఱకుఁ గూడ మంచముపట్టియుండిరి. కావున గ్రంథముద్రణమున నాకప్పుడప్పుడు పొడముచువచ్చిన సందియము లను వారి వలన దీర్చుకొనుటకు వలనుపడకపోవుటయే కాక అముద్రితగ్రంథము లింక నేమేమి యున్నవోకూడ దెలియవయ్యెను. ఇటీవల శ్రీశాస్త్రిలవారి కించుక యారోగ్యము చేకూరిన పిమ్మట నేను వారిని దర్శించుటకుఁ గడియము వెళ్ళినపుడు అముద్రితగ్రంథములింక నేమేని యున్నవా? యని యడుగ, ఏదో బీరువాలో నింకను గొన్నియున్నట్లు సెలవిచ్చినారు. తీసిచూడగా నీ 'లోకాభిరామాయణమును' 'స్త్రీవిద్య' యను నొక యసంపూర్ణ గ్రంథమును లభించినవి.

1915, 16 సంవత్సరములనాటికే అచ్చగుచున్న గ్రంథముల పట్టికలో దీనిని చేర్చి ప్రకటించుచువచ్చిరి, గాన నింతకుమున్ను దీని పేరు వినినదియే. మఱియును, 'ఉ॥ ఇప్పటి కాఱువత్సరము లీ కలహమ్ము జనించియాయె' అను నిందలిపద్యమువలనగూడ నిది యీ వివాదమునకు సంబంధించిన మొదటి రిజిస్టరుత్తరము వ్రాసిననాటికి ఆఱుసంవత్సరముల ప్రాంతముల రచింపబడి నట్లు తేలుచున్నది. అనగా శ్రీశాస్త్రిలవారు బందరు వదలిపెట్టక పూర్వమే దీనిని రచించిరి. రచనానంతరము అల్పకాలముననే శ్రీశాస్త్రిలవారు స్వగ్రామ మగు కడియము ప్రవేశించుటయు గ్రంథముద్రణ విషయమున అశ్రద్ధ సేయు టయు తటస్థించినది. అంతలో శ్రీ వెంకటరామకృష్ణ కవులలో నొకరగు రామకృష్ణశాస్త్రిగారు దివంగతులగుటయు, పిమ్మట మూడు సంవత్సరములకు శ్రీ తిరుపతిశాస్త్రిలవారు స్వర్గతులగుటయు తటస్థించి ఆ యీ కారణములచే నిది ప్రకటితము కాలేదు.

ఈ గీరతము ముఖ్యముగా సత్యనిర్ధారణమును గూర్చి ప్రవర్తించినది. అందులో ఈ నాల్గవ భాగము మఱియు నాయంశము స్థిరీకరించును. వెం॥ శా॥ కవులు తమ మహాభారతములో, వెం॥ శా॥ గారు తమకు స్వప్నములో కను పడి యేమో ప్రసంగించినట్లును, పిదప చిన వెంకటశాస్త్రిగారు ప్రత్యక్ష

ముననే తమతో నేమో పలికినట్లును, వ్రాసిరి. ఈ తుదికల్పనము చిన వెంకటశాస్త్రిగారు గతించిన రెండు సంవత్సరములకు పిమ్మట చేయబడినది. ఈయసత్య కల్పనమును గూర్చి వ్రాయుటకే ఈ లోకాభిరామాయణము రచింపబడినట్లు ఇందలి పద్యముల నేకములు స్ఫుటపఱచెడిని. ఇక నిందలి కల్పనమును గూర్చి మా గురువుగారొక యైతిహ్యమును చెప్పిరి. వారి యింటనొక ముసలి దాసి పనిచేయుచుండెడిదట. ఎన్నడును దొంగతన మెట్టిదో యెఱుగని యా యమాయికురాలొకనాడు కర్మము చాలక కడుస్వల్పమూల్యముగల ఇత్తడి వస్తువొకటి దొంగిలించెనట. పిమ్మట నాసంగతి నిముడ్చుకొనజాలక ఆమె తనలో తానే గొణిగికొనుచు దొంగతనము బయటపెట్టుకొన్నదట. అందుమీద, మనస్సుయొక్క స్వభావము సత్యమునందే బద్ధదీక్షమగుననియు, దానిని ఆత్మ అన్యథా త్రిప్పినపు డాతని యాజ్ఞచొప్పున బ్రవర్తించియును బిదపఁ దన స్వభావమును వదలుకొనక లోలో విచారించుచుండుననియు తోచి, వెంటనే ఈ గ్రంథరచనమునకు గడంగిరట.

తండ్రికి అన్నము పెట్టక ఇంటినుండి లేవగొట్టినట్లు రామకృష్ణమహాభారతమున వ్రాసిన విషయము శ్రీశాస్త్రులవారు బందరులో నున్నప్పటి కాలమునకు సంబంధించినదగుటచే నందలి సత్యము నస్మదాదులకు నిచటివారెందఱో యెఱింగినదియే కావున విస్తరింపబనిలేదు.

ఆ యీ యసత్యకల్పనములచే శ్రీశాస్త్రులవారి కొడలు మండినప్పటి ఆవేశమున నప్రయత్నముగా వెడలిన యీ గిరత కవితాధార శ్రీ తి॥ వెం॥ కవుల రచనముల యందు విలక్షణతాస్పదమై, ఆంధ్రభారతికి నపూర్వాలంకారము గూర్చుచున్నది. గుంటూరిసీమ కూడ నిట్టి యుత్కృష్టగ్రంథమే. తాత్కాలికములగు నా యీ వివాదములలో పాల్గొనిన ప్రధాన పాత్రలు అంతరించిన పిమ్మట కూడ భావికాలపుటాంధ్రులు చదివికొని ఆనందింపదగిన శాశ్వత రసపదార్థ మీ గ్రంథములలో ప్రతిపదమును నిండియున్నది. రసికజన హృదయంగమములగు నిట్టిరచనలు పాశ్చాత్యభాషలయందెన్నియేని గలవు.

ఇందలి 'రంతుల్ మానవుడు తిర్పతిద్విజుడు' లోనగు పద్యములు మరల కలగూరగంపలో చేరుట ప్రమాదము.

కాటూరి వేంకటేశ్వరరావు,
ప్రచురణకార్యదర్శి.

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# గీరతము

4 వ భాగము

## లోకాభిరామాయణము



ఉ. శ్రీపతి వేంకటేశకవిశిష్యుఁడు వెంకటరాముఁ డొజ్జలన్
బాపము లాడి యాడి, కడుఁ బ్రల్లదుఁడై యది కారణమ్ముగా
నేపఱుతాల్మితో నొకట నింటనె పండుచుఁ గాలయాపనం
బోపికఁ జేయుచున్ మదికి నూఱటగల్గమి నిట్లు పొక్కెడున్. 1

మ. అరరే ! యేమి మహాద్భుతం బిది మనోవ్యాపార మాపంగ నే
దురహంకారి వలంతి ? వన్నిది "గురుద్రోహమ్ముగావించి, తె
క్కరణిన్ దీనిఁ దరింతువోరి ?'' యనుచున్ గర్జించుఁ దర్జించు నేఁ
దరణోపాయము చెప్పఁగాఁగలనె యోదైవంబ ! యోజింపుమా. 2

శా. నా మాటట్టులెయుంచు, మానవపశు న్నన్నేరు ప్రశ్నింతు? రీ
వేమో సర్వ మెఱుంగు నేతవని నిన్నేరేసిఁ బ్రశ్నించుచో
నేమాడ్కిన్ బ్రతిచెప్ప నెంచితివొ నా కింతేని వాక్రుచ్చ మో
స్వామీ ! నీమహిమం బెదేని యొకత్రోవన్ జూపి కాపాడదే. 3

చ. గురు వల వేంకటేశ్వరుఁడు కూరిమిబిడ్డనిగా గణించి వ్యా
కరణమొసంగెఁ, దచ్చరణకంజరజమ్ముగ నుంటి, నెన్నియో
పరమరహస్యముల్ కవితపట్టున నెట్టనఁ దెల్పెఁ, గన్నులం
దెఱచితి నక్కటాన, నెటు దేవుఁడ ! నీకడఁ బొంకనేరుతున్. 4

ఉ. ఆతఁడు వెట్టె దీపమిది, యన్నమునొద్దను గూరుచుంటినా,
యాతని చేరె జ్ఞప్తికి రయమ్మున వచ్చును బూటపూట; కే
మీ, తగదే? కృపాళుఁ డతఁ డిచ్చిన విద్దియ చేతఁగాదె యీ
జీతపురాళ్ళు నాకు నృపసింహుకతాన లభించు టెమ్మెయిన్. 5

చ. మఱపుఘటిల్ల వగ్గురుఁడు మన్నినమన్నలు, తోడివాఁడు ద
బ్బఱలకు దింపఁగా డిగితిఁ, బాపములాడితి, నాడుచుంటి, ను
ర్వర నెవఁడో యొకానొకఁ డపాత్రుఁడు 'వహ్వరె' యన్న నేమి, యె
ల్లరును 'గృతఘ్నుఁ డీతఁ' డనులాగున కగ్గముగాఁగ నేర్చితిన్. 6

ఉ. నా తెలమోమువ్రాఁతలకు, నా చెడుచేఁతలకుం బదింబదిం
జేతమునందు నొచ్చికొని "సీ" యనువారలె యెల్లవారు; నా
రోఁతల కేరు సంతసిలిరో, యలవారల "వేంకటేశ్వరా
రాతు" లటంచు నామదిఁ గరమ్ము నెఱుంగు సహేతుకమ్ముగన్. 7

ఉ. కొప్పరపుంగవీశులకుఁ గోరిరి గొప్పకుఁగాఁగ నాసనం,
'బెప్పుడు నేరు గోరఁదగ' దిట్లని ప్రాజ్ఞులు నవ్వఁ గొంద; రా
తప్పున కొప్పఁ డగ్గురుఁడు, దానికిఁగాఁ గలహించి యోడి యే
తప్పుడుఁగూఁతలో వదరి తజ్ఞు గురు న్నిరసించి రాఘనుల్. 8

చ. గురుఁడు సహాసనం బిడఁడ కొప్రపువారికి; నేఁడు కారణాం
తరమున నెట్లు బొంకినను దారసమానెడ నేనుగూడ వి
ష్టరమున కొప్పఁబోనని కటా! ప్రకటంబుగ నేరెఱుంగ? ర
క్కరములు రాని కైతలకు గౌరవ మెవ్వఁడు సేయనొప్పెడున్? 9

ఉ. సీమకుసీమ యేకమయి చేయు దురుద్యమమెల్ల వమ్ముగా
నామెయిఁ దాను బల్కెనుడు వాగమవాక్యముగాఁగఁ బాండితీ
ధాముఁడు మద్గురూత్తముఁడు తద్గఁ బ్రశస్తికి నెక్కెనాఁ డిటన్
నామదిఁ బొంగు మోదమది నమ్మనొ లోకము, నమ్మనో కదా? 10

మ. శివరామాదిసతీర్థ్యులం గలసి యాసీమన్ గురుస్వామితోఁ
గవితాసత్సభలన్ మెలంగఁదగు సత్కల్యాణమున్ నోఁచుకో
నెవరిన్ జూడఁగలేని హేతువునఁ; బోనీ, దానికే పెట్లో త
త్సవిధం బాత్మమదంబు తెల్పఁగల పత్రిం బంపినన్ జాలదే. 11

ఉ. అంతకుఁగూడ నోఁచికొననట్టి దురుద్యమపాతకమ్మునన్
సంతతమున్ మునింగి, పయి స్వాంతము చోరునిభాతి దాఁచి, శ్రీ
మంతు గురూత్తమున్ దెగడు మార్తురు కత్తృణమాత్రలేని 'వా
రెంతకుఁ జాలువారె' యని యేఁ బ్రకటించితి వ్యర్థవాక్కులన్. 12

ఉ. చేసితి మెన్నియో గడుసుచేఁతలు వారలు నేముఁగూడి, పైఁ
గూసితి మెన్నియో దురుసుఁగూఁతలు; సర్వము గాలిఁబోయె, "సే
బా" సన మద్గురూత్తముని బ్రహ్మరథమ్ములుపట్టఁజొచ్చి, రీ
చేసినతప్పుచేష్ట లవి సిగ్గులచేటయి మమ్ముఁ బీల్చెడిన్. 13

ఉ. వారికి దబ్బఱల్ గిలుకువారికిఁ గొప్రఫువారి కెవ్వగో
ధీరవిచారుఁ డొక్కయెడఁ జిక్కి దిగన్ దగుబుద్ధిచెప్ప దు
ర్ధోగణి కట్టిపెట్టిరఁట! తొల్లి కడుం జెడుత్రోవఁ బోయియున్
వారలు నేఁడు నెమ్మదికి వచ్చిరి; మాగతి యిట్లె పొక్కెడిన్. 14

ఉ. తజ్ఞుఁ డొకండు తాదృశుఁడు తారసమై, ననుఁ బాపిఁజేయు దు
ష్ప్రజ్ఞుని వేదులాన్వయజు భగ్నమనోరథు దుష్ప్రగల్భతా
భిజ్ఞుఁ జివాట్లువైచి యవివేకము వాపిన, నేను దత్కృతా
ప్రాజ్ఞత రోసి కొప్పరమునై ఖరి మిన్నకయుండుదుంగదా. 15

మ. అటుపై నిప్పుడు రోయు లోకులె 'సెబా' సంచు న్ననున్ మెత్తు, రం
తట మద్దేశికుఁ డాగ్రహమ్ము విడి ఛాత్రశ్రేణితోపాటు వి
స్ఫుటకారుణ్యము నాపయిన్ జిలుకు, ధీశూన్యత్వజన్యైనస
చ్ఛట నానాఁటికి లోఁగఁజేయుటకుఁ బశ్చాత్తాపమే చాలెడిన్. 16

ఉ. అట్టిగురూత్తమున్ దెగడునట్టి కృతఘ్నుఁడ, నాదుజీవితం
బెట్టిది? యేరు మెచ్చిన, "దిసీ" యని యెల్లరు రోయ నూరకే
పొట్టకుఁ గాఁగఁ గృష్ణుఁ డెటుపొమ్మన నట్టులె పోవుచుంటి; న
ట్టిట్టనఁజాల, వాని కదియేమొ ఋతోక్తులు రావు నోటికిన్. 17

క. కష్టించి వాఁడు "విగ్రహ, పుష్టియు నైవేద్యనష్టి" పొంపిరివోఁగా
శిష్టులు "సీ" యను కూఁతలు, సృష్టించు న్నాకు వణఁకుఁ జే యప్పట్లన్.

మ. పరలోక మ్మొకఁడున్నదం చెఱుఁగఁ డప్రాజ్ఞుండు వాఁ, డందుచే
దురితంబన్నను వెన్కదీయఁ, డిట నే దుఃఖించియేమాఁ? బర

స్వరముల్ జంటగఁ గైతఁ జెప్పుటకు నిచ్చల్ పూనియుంటన్ బర
స్వరదోషమ్ము పరస్పరమ్ముఁ గుడువన్ బాధించు నెట్లో యిఁకన్. 19

చ. తిరుపతి వేంకటేశ్వరుల తీరునఁ బేరులు కల్పి కైతముల్
గరము రచింపఁబూనుటను గాదె యిటుల్ ఘటియించె ముప్పు, త
ద్గురుతి యనేకులన్ సుఖముగూర్చియుఁ గష్టము మాకొసంగెడిన్
బరిణతి కేమియౌనొకద? పాతకినై యిటు నందికుందెదన్. 20

చ. అని కనుఁగొల్కులన్ దొరలు నశ్రువు లాపఁగలేక, కొంత నె
మ్మనమునఁ దన్మయత్వమున మ్రాన్పడి, వెంటనె రూక్షవీక్షణ
మ్మున నవలమ్ము గ్రుక్కుచును సుందర వేదుల కృష్ణుఁ డున్నమా
డ్కిని గని, పండ్లు గీటుచు నొగిం బలుకున్ నరసింహరూపుఁడై. 21

శా. ఓరీ! కష్ట! నికృష్ట! కృష్ణ! గురువైరోచ్చైర్మహాపాతక
ప్రారంభార్ణవకర్ణధార! వితతాపత్కారినిత్యానృతా
సారాలాపకలాప! నారకమహాసంసారబీజాంకుర
కారాగార! చెడంగఁదీసితివిరా! గుర్వంఘ్రిరక్తున్ ననున్. 22

మ. కడుయోగ్యుల్ తలిదండ్రు, లెక్కుతనఁ దద్గర్భమ్మునం దీవిటుల్
పొడమన్నేర్చితివో! యశమ్మునినఁ బప్పంబెల్లముల్ నీకు, * నీ
కడ కేతెంచిన చిన్నవెంకన 'ననుం గారించె నాయన్న గా
ర్గదుదుర్మార్గుఁ' డటన్న మాట నిజమౌఁగా? కష్టముష్టింపచా! 23

---

* గీ. ఆంధ్రకవితాపరీక్షార్థియై యఱుగొల
కబ్బమొక్కటి గైకొని కడెమునుండి
సందియమునందుచును వచ్చె చళ్లపిళ్ల
చిన్నవెంకటశాస్త్రి మా యన్న బసకు.

క. వచ్చి,... యెవరడుగకయే ... వేంకటేశ్వరు కుచ్చితములఁ బల్కెఁ బూస
గ్రుచ్చినరీతిన్.

ఉ. నన్ను విభీషణుండనుచు నవ్వెన నవ్వుదురేమొకాని, మా
యన్నవిధంబు న్యాయమున కగ్గముగా; దతఁ డొడ్ల శ్రీయమేన్
గన్నులఁ జూడలేఁడు; మముఁగాంచియు నీసువహించు; నింక నే
మన్నది! నాకు నాతనికి మల్లములన్ సరిపోదొకింతయున్.

మ. చిననాఁ డాతని తండ్రి స్వర్గతుఁడుగా, శిష్యుండుగాఁ జేర్చి, వి
ద్యనొగిం జెప్పి, వివాహముం సలిపి, తద్దన్ ముద్దుగాఁ జూచి నం
దనుఁగా మన్చిన యన్నమీఁద నటు వాతప్పుల్ ప్రసంగింపన
య్యనఘుం డీవును, నేను గాఁడుసుమి నీచాచార ! వాచాటకా ! 24

క. తనతండ్రి యతనితండ్రియు, మును పెప్పుడో విభక్తులైరి, మొగి నాతని కీ
తని కేమిజోలి యున్నది? యనఘుఁడు నాగురుఁడు పెండ్లి యతనికిఁ జేసెన్.

చ. నగలిడు సొమ్ము వెంకన ఋణమ్ముగఁ దెచ్చికొనెన్, వివాహ మె
ప్పగుగతి నైదురోజులు మహావిభవం బలరారఁజేసె నా
దగురుఁడు చేతిసొమ్ము కడుఁదోరముగా వ్యయపెట్టె; యట్టిచోఁ
బగతునిగా గణించున టె! ప్రాజ్ఞుఁడు వెంకన మద్గురూత్తమున్. 26

చ. అనఘులు 'మేలు ! మే !' లనఁగ నందు సదస్యమునాఁడు పాండితీ
ధనులకుఁ దక్కువిప్రులకు ద్రవ్యము హెచ్చుగ నిచ్చెఁ బెట్టె, గో
వనితలు వచ్చి మేళము వివాహము నైదుదినమ్ము లాడి, రా
వనితల కిచ్చుసొమ్ము గురువర్యుఁడె తా భరియించె సర్వమున్. 27

మ. "అనుఁగున్ వేశ్యలఁ బిల్చి పెండ్లికి ధనం బవ్వారి వెచ్చించి నా
యనగార్కు ఋణమ్ముగట్టె'నని నీయగ్రిమ్ముసం జెప్పి వెం
కన దుఃఖించినయట్లు గిల్కితివి; వెంకన్నన్ గడున్ యోగ్యుఁ డం
చు నెఱుంగున్ జగ మొప్పికోదుసుమి నీచున్ జేయ నీవెంచినన్. 28

ఉ. ఇంతకుఁ జిన్న వెంకనమనీషి గతించినమీఁద నీవు దు
శ్చింత నిటుల్ లిఖించుటది చెడ్డమహాదురితంబు, చచ్చి స్వ
ర్గాంతరమందు నున్న యనఘాత్ముఁ గృతఘ్నునిగా నొనర్చి నా
యంతటివానిఁ జేసి, సుకృతాత్మునిజేయుదె నన్ను నీవిఁకన్ ? 29

---

ఉ. ఒండ్లన నేను బాల్యమున నుండుటఁజేసి తనంతఁదానె నా
పెండ్లికిఁ బెద్దయై తనకుఁ బ్రేముడిగల్గిన సానిమేళమున్,
గొండ్లికిఁ బిల్చి యప్పునొడఁగూరిచె నా; కటుమీఁద నెన్నియో
యేండ్లు శ్రమించి యాఋణము నీఁగితి దైవ మెఱుంగు నాగతిన్.

(రామకృష్ణమహాభారతము, విజయదశమీపర్వము చూ)

ఉ. ఇప్పటి కాఱువత్సరము లీకలహమ్ము జనించి యాఱొ; నీ
వెప్పుడు వెంకనన్ గలిసి తీకలహమ్మున కాదియం టకా,
యిప్పటిదాఁక దాఁచి యతఁ డేగిన వత్సరయుగ్మ మప్పుడా
చెప్పెద? వాతఁ డున్నపుడు చెప్పినఁ జెప్పనఁ గొట్టితీరఁడే? 30

మ. అతఁ డున్నప్పుడు నీవిటుల్ గిలుకుచో నాశ్వోతరు ల్నిన్ను సూ
నృతమూరున్ దగుశిక్ష సేయుననియే యిన్నాళ్లు కీమాట గ
ల్పితమున్ జేసితి; రెప్పుడే నఘము నిన్ బీడింపకేపోదు; సూ
నృతవైరుల్ చనఁ తోఁపఁ బోవునపుడేని న్నిరుఁ దారుణమా. 31

ఉ. 'పెండిలి తద్దినమ్ముగతిఁ బెట్టుఁడు, తద్దిన మాచరింపుఁడీ
పెండిలిగా' నటంచుఁ జినవెంకన చెప్పఁడు, చెప్పదేబెలం
దుండఁడు; తాదృశం బెటు "నిరోపయుమమ్మున సానిమేళమున్
మిండఁడు భార్తి పెట్టె"నని మిత్రను నెకడ సుంత చెప్పమా. 32

ఉ. వెంకన సెప్పలేద యిటు, వేఱొకఁడేనియుఁ జెప్పలేడ, నీ
వింక నిటుల్ లిఖించుటకు హేతు వెఱింగితి విన్ముః పద్దురున్
వెంకటశాస్త్రి "మిండనిగ" నెల్లెడ సేయుట; కంతమాత్రనే
క్రుంకెనె తద్యశఃప్రసరకోమలశీతలసాంద్రచంద్రికల్! 33

* శా. 'చెల్లారెడ్డి' యటన్న పద్దె మెటులో చేఁజిక్కె మద్దేశికుం
డుల్లమ్మున్ బగులించె దానిఁ గొని యాఱొచ్చెమ్ము నెల్లెడఁగాఁ
జెల్లున్? "దత్కవనం బదేరిదొ" యనన్ జేజేలు శిక్షింతు; రే
కల్లల్ గూర్చిన లోక మెట్లొ యెఱుఁగుం; గాపట్యముల్ దాఁగునే. 34

మ. పరకీయాగమనేచ్ఛ త, ప్పదియు సంపాదింపఁగా నేర క
త్తరుణీరత్నముచేఁ జివాట్లుతిని కద్యాల్ సెప్పటో తప్పెకా
కరయన్నేర్చినఁ జావుకన్న నిరయంబందుంటకన్నన్ మహా
భర, మేతత్కృతి కగ్గమై గురు నదల్పన్ గొంప మునుంచుంజుమీ. 35

మ. పరకాంతామణులెల్లఁ దల్లులనుచున్ భావించువాఁ డెప్పుడున్
దురితం బన్న భయమ్ము చెందు, సుజనస్తోత్రార్హుఁ డట్టిండు నా
గురుఁ డెవ్వారికి హానిలేనిగతిఁ గోర్కుల్ మీఱ వర్తించుఁగా
కరరా! నైనతె నావలెన్ బర, మిహమ్మాలన్ బ్రవర్తించెనే. 36

* దీనిని గూర్చి విగ్రహారాధనము చూ.

చ. మనపలెఁ జేసినట్టిపని మాటఁగ మాటి కసత్యమాతఁ డా
డనుఁ బ్రయతింపఁ డొప్పుకొనుఁ డక్కరికూఁతలు కూసి మున్ను చే
సినదురితంబు పెంపుగనఁ జేతువు నీ వదియేమికర్మమో!
యనృతముకన్నఁ బాతకములంచు మఱొండు జగాన నున్న వే? 37

ఉ. మిండఁడొ, గండఁడో, యతఁడు మేటి కవిప్రకరమ్మునందు భు
క్కుండునిభాతి, 'కాదతఁడు కొంచెము నేరనివాఁడె' యన్నను, భూ
మండలి దిక్కులేకగద మన్నన నాతనిఁ జేరివేఁడి దే
వుండుగఁ గొల్చి నేఁడకట! పోకిరికూఁతలు గూయఁ బోయెనే! 38

చ. "గురు"వని యొప్పుకొంచతఁడు "కూళ" యనన్ ఫలమేమి? తల్లి దు
శ్చరితయటంచు వేశ్యతనుజాతుఁ డెఱింగియు గౌరవింపఁడే!
హర! హర! తల్లి పూజ్యయగు నందఱకున్ గురుఁ డట్టులే, వృథా
యఱచిన నేమిలాభమగు? నాతఁ డపాత్రుఁ డటంచు సాగకున్. 39

మ. మలినుండైనను జెట్టయైన నఘనిర్మగ్నుండెయైనన్ ముహు
స్స్ఖలదాచారుఁడెయైన నెట్టిఁడయినన్ ఛాత్రుల్ గురున్, స్వాత్మజా
తులు తండ్రిన్ విడనాడరాద; సుచరిత్రుం డౌటనే యేను సే
వలు గావించితినే మదీయపితకున్? వర్జింపనేలా గురున్? 40

మ. చెడె వక్త్రమ్మనృతోక్తులాడుకతనన్, జేతుల్ చెడెన్ సారెకున్
గడుగోఁతల్ లిఖియించుకారణమునన్ గట్టా! యిటేలాగు క
ట్టిఁడినై కాలముపుచ్చనేర్తు? నెటు నా డెందంపుఁ గుందాఱు? వీ
తిఁడినైతిన్, జెడితిన్, మహోఘ మెటు వారింపంగ నేఁజాలుదున్. 41

ఉ. అన్నయు దేశికుండునయి యాదటఁ బెండిలిచేసి తన్ను సం
పన్నగృహస్థుఁజేసిన కృపాళునిపై "దురితమ్ములాడె వెం
కన్న"యటంచుఁ గూసితివి గా యకృతాత్ముఁడ! నీదునాలుకన్
సున్నము వెట్టియే జలజసూతి యొనర్పఁగఁ బోలు బాలిశా! 42

చ. కల రల చిన్నవెంకనకు గాదిలిచుట్టము లెంద ఱేని య
య్యలఘులతోడఁ జెప్పికొన కందఱకన్నను మిన్నవంచు నిన్
దలఁచి భవత్సమక్షమునఁ దజ్ఞుఁడు వెంకన యేడ్చె నేమి! సీ
మలినమనస్క! నీమనసు మ్రానొకొ? లేక శిలావికారమో. 43

ఉ. వెంకనతల్లిగా గ్గలదు వేఁదుఱువాఁడ! భవద్దురాగతా
లంకృతదుర్వచోరచనలన్ వినె నేనియుఁ నిన్ శపించు నో
కుంకుడువేర! నీ యఱచుకూఁతలు రోఁతలు కట్టిపెట్టు, నీ
బొంకులు కాలిపోను దలపోటు జనించెడి నాఁడునాఁటికిన్. 44

ఉ. చచ్చినవానిమీఁదఁ బెలుచన్ గుఱుచ ల్లిఖియింతు, వాతఁడే
సచ్చరితుండుగానియెడఁ జచ్చి పిశాచముగాఁగ వచ్చి నీ
మచ్చనుమాపకున్నె? "నిను మన్ననచేసి వచించినట్టి యా
యచ్చరముల్ వెలింబఱచి" తంచు దురాగ్రహదుర్విషోగ్రుఁడై. 45

ఉ. కాఁ డటువంటివాఁ డతఁడు, కాఁడు కృతఘ్నుఁడు, కాఁడు తుల్యయున్
గాఁ డనృతప్రలాపియును, గాఁడు గురుద్విడపాత్రబుద్ధి, యా
పోఁడిద నెఱుంగు లోక; మెటుబొంకిన బొంకుము స్వార్థమై కటా!
పాడఱు నీవచోరచన, పాడఱ వాతనియోగ్యతాగతుల్. 46

క. కరటకదమనకులు భవ, త్స్వరూపమని చెప్పుటది స్వభావోక్తి చతు
శ్చరణము లయ్యావి నీవో, చరణద్వితయాభిమానచతురుఁడ వరరే! 47

చ. చదువున మిఱ్ఱుపల్లములు చాతురిపోల్చెడి శిల్పియున్, దుర
భ్యుదయము లవాస్తవమ్మనెడ నొండొక వాస్తవమున్ భ్రమపరిమా
స్పదులకుఁ దోఁచునట్లొనరు పంగల, రించుక చర్చసేయఁగా
నది, యిదియున్ మదిం దెలియ నద్దమునందలి మోముపోలికన్. 48

మ. శిరమున్ వంచుక యింటిలోన నొకటన్ జీనచ్ఛవపత్రిక్రియన్
"దురితం బియ్యది యెట్లువోవు" ననుచున్ దుఃఖించుచున్నాఁడ, నె
వ్వరియింటన్ శుభకార్యమైన నల వార్త్రాణాప్తులేయైన నే
నరుగన్ బిల్చినయేనిఁ, బోయినను బ్రమానైయుందు నేమూలనో. 49

శా. ఎవ రేమన్న జవాబుచెప్పుటకు లేదే! సుంత యాధార; మే
కవితాపత్రికయందుఁ జూచినను నిక్కంబింత లేదయ్యె, వా
స్తవవేత్తల్ గని యూరకుండరు, సమాధానంబు శూన్యంబు, నా
యవివేకమ్మున కెంత చింతిలుదు? నీయజ్ఞాన మెట్లాఁగుదున్? 50

ఉ. నాదురవస్థ యెంతని మనమ్మున దాఁపఁగనేర్తు, దాఁచినన్
బో, ధొకనాఁడు పెద్దతలి పుత్రుఁడు పుత్రిక పెండ్లిసేయఁగా

నా దెసకేగి యయ్యెడల నందఱు బంధులు దూయఁబట్టిరోఁ
గాఁ దగునుత్తరం బెదియుఁగన్పడ కేఁ దలవంచి క్రుగ్గితిన్. 51

ఆ. వె. ఆణివిశ్వకులజుఁడైన కామన్నగా, ర్నన్ను నడిగినట్టి వెన్నొ ప్రశ్న
లున్న; వొక్కదాని కున్నదే యుత్తరం, బేటివ్రాఁత వ్రాసి తోటివ్రాఁత.

చ. చదువఁగలే దటందునో? వెసన్ గుఱుఁ డాతఁడు గాఁ డటందునో?
పదరిన తప్పుఁగూఁతల, నబద్ధము, నాయవి గా వటందునో?
కదనమునందు దేశికుని గట్టిగ నే నెదిరింతు నందునో?
యెదియని నెగ్గవచ్చు? నటు లెల్లరు నన్నడికించుపట్టునన్. 53

ఉ. "చచ్చినచావు"గా బ్రదుకుసంగతి దెచ్చితి వెన్ని నాళ్లటుల్
పుచ్చుదుఁ? బ్రాజ్ఞు లెల్లరును బూతిన్గఁ బాతకి వీఁ డటందురు, నీ
గచ్చులు కొంపఁదీసెఁ, గడుఁ గాఱులు పేర్చెడి నీదు చెల్మి నా
మచ్చను మాపుచున్నది ప్రమాద మిదేగతి నేఁగఁజాలుదున్? 54

చ. అన్నము లేకయున్ బ్రదుకనౌ, వసనంబులు లేకయున్ గుణం
బున్నెడ నెట్టులో మనఁగనొప్పెడిఁ, గీరితిఁగోరి దుర్యశో
భ్యున్నతిలో మునింగి యనృతోక్తులు గూడుగ నెట్లు జీవనం
బు న్నడిపింపవచ్చు? నిజముం దెలియంగలవారిముందటన్. 55

చ. పురపురఁ గాగితమ్ముఁ గొని * పుత్రుఁడు తండ్రికి ద్రోహి యం చొక
ప్డఱుతువు, వేఱొక "ప్డనుజుఁ డన్నకు ద్రోహి" యటంచు మిక్కొ, దీ
యఱపులు దూరగుల్ తెలియరంచుఁ దలంతువు సంతసింతు;ద
గ్గఱఁగలవారి కన్ను లెటుగప్పెదు పెప్పెపె మెమ్మెమేలతోన్? 56

చ. గురువరుఁ డస్మదీయనృపకుంజరునొద్దకు నొందుకారణాం
తరమున రాఁడు గాక, మన తప్పుడుఁగూఁత లడంప వచ్చుచో

---

* ఆ. వె. వారి వారి మాట వచియింపఁగా నేల
కలుషమనక మూఁడుకాళ్ళముసలి
యైన తండ్రిమీఁద నాగ్రహముంబూని
యిల్లువెలిచెసంట యీఘనుండు. (రా॥ మ॥ భా॥)

పరా:— (ఈసందర్భమున నింకను గల పదరు వ్రాఁతలకు మాపురశ్చరణము జూడఁగోరెదము.)

ధరణిపుత్రులాల నీయనృతదంభవచోరచనాపరాధ మె
క్కరణి సమర్థనీయమగుఁ గ్రక్కున నాతఁడు నోయ నొక్కచోఁ. 57

ఉ. ఏనును నీవు మద్గురుని యొద్దల కేఁగలుగూడఁ గామి ల
శ్రీమన్నరసాపురంపుసభఁ జేరఁగలేక మహోనసంబులో
మానసమందుఁ జింతిలుచు మ్రగ్గుటచేత నెఱింగె లోక, మిం
కేనియు "గొప్పకైన. గొఱిగింపుడుఁ" గూఁతలు మాను టొప్పదే. 58

శా. "నంబీ ! యేమిసహాయ" మన్న, "నెదుటన్ రాకుంటె సాయం" బటం
చుం బల్కంగతిఁ 'జెల్లయాంబిక యశస్సు న్నిల్పి కాపాడఁ జి
త్తంబం దెంచి సభార్థ మేగ' మనుచోఁ దక్షుండు నమ్మం, డనా
లంబం బీనుడి సిగ్గులేమి నిటు బల్కంబూనినా మిత్రుఁడన్. 59

చ. మనసభ శుక్రవార మని, మామక దేశికమాళిసత్సభా
దినమది మందవార మని ధీరులు వేఱొకనాఁడుగాఁగఁ బం
చినది జగం బెఱుంగు, గురుశేఖరుఁడున్ మన మేల యొక్కచో
టను గలియన్ వలెన్ ? వసఁగడంగి కచాకచిగాఁ బెనంగఁగన్. 60

శా. ఔనిన్ వారలు దూఱుటెందులకు ? వారి న్నీవు వారింపఁగాఁ
బూనంగాఁ బనియేమి ? యట్టిపనియే పుట్టన్ బ్రసక్తించుచోఁ
నానిండోలగ మెట్టులొప్పికొనుఁ ? జెల్లాంబామనం బెట్టు ల
ద్దానిన్ సైఁచెడి? నూర కేమిటి కసత్యంబుల్ గడుం బ్రేలెదో! 61

ఉ. అంబకు వెక్క సంబయయి, యాదృతి ఔనిని మన్నినట్టి చె
ల్లాంబిక చేయుసత్సభ నె యాపెకుమారుని మాఱువాయ ని
క్కంబుగనున్నచో నదియుఁ "గాదనఁ దీతువుపిట్టరాయబా
రంబులతోఁ" బనేమి? యట రాజున కెందఱు గల్గ రాశ్రితుల్. 62

శా. ఈజన్మమ్మునఁ గాని వచ్చుభవమందే కాని మద్దేశికున్
రాజత్సత్సభ నీ కెదుర్పఁగలధైర్యం బబ్బఁగాఁబోదు; నీ
నైజం బిప్పటి కే నెఱింగితిని, శ్వానం బేమి సేయున్ ? మహా
రాజశ్రీ కిరనైన యేన్గుగని వైరం బెంత లోనుండినన్. 63

చ. మొఱఁగునుగాక దూరముగ మోరవడన్ శునకమ్ము లేన్గు ద
గ్గఱకరుగంగఁజాలునె, యొకానొకపట్టున నట్లొనర్చుచోఁ

గరిపదఘాతమున్ సయిపఁగాఁగలవే?, యెఱుఁగం డెవండు కు
క్కఱపులు, వాపదూకుల వృథార్భటులున్ మృగతృష్ణికాచ్ఛటల్? 64

ఉ. "కుక్కలు గూసిరోఁ జెడునొకో? మఱి జంగము ప" ర్వటన్నయ
వ్యాక్యల కీవు వాఁగుచెడువాఁగు డుదాహరణమ్ము సుమ్ము, నీ
వెక్కడ! యొజ్జ యెక్కడ! జయింమటయెక్కడ! చాలుఁజాలు, "న
క్కక్కడ? దేవలోకమది యెక్కడ? దూరవిచార మక్కటా! 65

శా. "వేఁడంబోద" మటన్న నొప్పవు, సభన్ వేరంబు సాధింపఁగాఁ
గూడంబోడ మటన్న నెక్క డిఁక నీకుం దప్పదుంగూఁతలన్
గాడంగూయుట తప్ప సత్కవివరగ్రామంబు మెచ్చించు నా
జాడల్ దోఁపవు, శ్వానముట్లఱచుటే శౌర్యంబగున్ మానికిన్! 66

మ. తెగి విద్వత్సభలోన దేశికుని గద్దింపన్ వలెన్, దాన గె
ల్పగు, నోడేనియు సంభవించు నెటులే నాఁగాక లాభంబె యం
దగుపట్టున్ ధ్రువ, మెట్లటన్న, గురుతో నాలమ్ములో నోడినన్
సొగసే, గెల్చిన వేఱచెప్పవలెనే! శూరత్వపర్యాప్తతల్. 67

ఉ. అంతియకాని "వెంకనకు నక్కర మొక్కటికూడ రాదు, మే
మెంతయు గొప్పవార"మని యేడ్చిన లాభములేదు, దీనిచే
గొంతుక బొంగువోవుటయుఁ, గోవిదు లెల్లరు 'సీ' యటంటయున్
గాంతుమకాని గౌరవము గాంచము నిక్క మెఱింగి చెప్పితిన్. 68

చ. గురుఁడు స్వశిష్యవర్గమును గూడుక చెల్లమతల్లిగారి య
న్నరసపురమ్ము నేగునెడ నాకును నీకును భీతిగొల్పఁ జె
చ్చెర మన మల్లయార్యగృహసీమకు వచ్చినయప్పు డోజమో
మర్షసి తటాల్న నీరయిన యాస్థితి దైవ మెఱుంగఁడే సఖా. 69

మ. అకలంకుండు పురాణపండవరమల్లయ్యార్య వీథీవిత
ర్దిక శిష్యాన్వితుఁడై గురుప్రవరుఁ డర్థిన్ దంతముల్ దోమికొం
చెకసక్కెమ్మునకో యనంగ మనపై వీక్షించుచున్ గద్దెఁ గొం
డొకసే; పెందులకో యెఱుంగుదువె యార్యుం డట్టు లేతెంచుటల్?

ఉ. 'పేలుచునున్నవా' రరక పెగ్గెలు, బొగ్గులొనర్ప నేఁడిదే
వీలుదయించె, వచ్చితిని వే చనుదెండు సభాంగణమ్మునన్

గూలుటో కూల్చుటో యగుటకుం బ్రయతింపుఁడు, మీకు నైచుఁడీ
యాలలిఁ బట్టిపీల్చు జ్వర మించుక యెంచక యేగుదెంచుటల్. 71

ఉ. కూయుచునున్న వా రరక కూఁతలు గోఁతలు మూల మగ్గి నేఁ
డాయితమై పదందు సభ; కాయమ చెల్లమదేవి మిమ్మునున్
"ధీయుతు"లంచు రాఁబిలిచెఁ, దేలెడి రో జరుదెంచె, నే జ్వరం
బీయది లెక్కవెట్ట కిట కిందులకే చనుదెంచితిన్ జూఁడీ! 72

చ. అఱచుచునున్న వారు గృహమందున డాఁగి దురుక్తు; లన్నియున్
విఱిచెడిరోజు వచ్చె, నిటు వీలగునం చెదలోఁ దలంచి నే
నెఱుఁగఁజూఁడీ! ఘటించె మనయేలిక చెల్లమదేవిగారు వ
ల్వరు గల సత్సభన్ దెలియుఁబో! గురుశిష్యుల తారతమ్యముల్. 73

చ. వదరుచునున్న వా రరర కవాకుచవాకులు; నోరునొక్కఁగా
నద నుదయించె తేనిపినయంబిక చెల్లమదేవి కల్కి; మీ
కెద బిదు గుండదేని, యిదె యేఁ జనుదెంచుచునుంటి రండు, మీ
కిది కడుఁజక్కనైన తఱి, యే జ్వరితుండ జయింపవీలగున్. 74

చ. వదరుచునున్న వార లపవాదలు నోరికొలంది, నేఁడు మీ
వదనముకంపు సొంపు జనవల్లభునగ్రమునన్ బయల్పడున్
బదఁడు సదస్సుజేర, నిదె వచ్చితి నే జ్వరితుండనయ్యు మీ
మదమది చక్కఁజేసి మతిమంతులుగా నొనరించుపూన్కితో.' 75

శా. ఈయంశమ్మును దోఁపఁజేయుటకె సుమ్మీ! దేశికుండట్లు చె
ల్లాయమ్మన్ గననేగుచున్, మన మొగా లార్తిన్ బ్రవర్తింపఁగా
డాయన్ వచ్చిన, దాతఁ డేమెఱుఁగుఁ గట్టా? "పిండుగ్రిరా"యంచు,'లో
భీ యెంతుండిన, పత్తురం చతఁ డెదన్ బేరాసఁజెందెం జుమీ. 76

చ. స్వయముగఁ జూచియుంటిమి విశాలతరజ్వరయుక్తుఁడయ్యుఁ జె
ల్లయజననీనిదేశమున నయ్యెడ కేగెడియొజ్జ, నట్లు చూ
చియు 'జ్వరితుండుగాఁ' డనుచుఁ జెప్పఁగ నోరెటువచ్చె? వ్రాయఁగాఁ
జెయి యెటులాడె? నీకకట! శిష్టకులమ్మున నెట్లుపుట్టితో? 77

చ. 'అనృతములాడుపట్టున అవంతయు వీఁడు భయంపడండ, యిం
దునకు నిమిత్తమేమియని దుర్జయు నిన్నుఁగుటెంచి చర్చచే

సినఁ దుద కొక్క హేతువది చేకుఱు నో నయశూన్య! నీవు దే
వుని యసమర్థతన్ దెలిసి బొంకెదు సత్క్రియము పూర్తిగాఁ జెడన్. 78

చ. అనృతములాడ నెల్లరు భయంపడువా, రది నీకు లేశమున్
గనుపడ, దిందుకేర్పడిన కట్టిడిజాతులు వేలు, వారిలో
జననమునంద వీవు, వెలుచన్ మతిసారెకు బొంకనేర్తు, దే
వునియసమర్థతాగరిమ పూర్తిగ నెమది కెంత యెక్కెనో. 79

చ. జను లనృతంబుపల్కుటది "చచ్చినచావు"గఁ గొంకుచుందు, రీ
వును మనుజుండవేయగుచుఁ బుట్టియు దబ్బఱలాడ లేశమున్
మనమున నెన్నదీయు, వొకమాత్రవు రాయివి గావు నీవు, దే
వుని యసమర్థతాగరిమ పూర్తిగ నెమది నెక్కెనో గదే! 80

చ. ఘనుల గణింపనేల? కడుఁ గశ్మలజాతులయందుఁగూడ నీ
యనృతమునందుఁ గాలిడు దురాగతుమోమును జూచినంతఁ "జీ"
యనని జనుండుగల్గఁ, డిదియంతయు నీవు నెఱుంగుదైన దే
వునియసమర్థతన్ గనియె బొంకెదు సత్క్రియము సక్రమైచెడన్. 81

మ. అదియే నాలుక, దేనియం దనృతవాచారంభముల్ పుట్టు; న
య్యదియే మానస, మేది దీనియెడ నిత్యద్వేషముం బూను; న
ల్లదియే జన్మము, దేని పోషణ కసత్యాలాపముల్ ప్రాపుగా;
నిది నీకున్ దగి చెప్పుచుంటి నిటుపై నేమైన నాకేమిఁకన్. 82

మ. అనృతంబాడి భుజించునన్నమది తా నన్నంబుగా, దట్టు లం
దిన బల్పయ్యది బల్పుగా, దనృతవక్తృత్వమ్మునం జేయు జీ
వనమున్ జీవనమొందుఁగా, దనృతవాక్ప్రాగ్భారమున్ గోయకుం
డిన యేప్రాణియుఁ బ్రాణిగా దెలుఁగుమీ! నీకేను వాక్రుచ్చితిన్.

సీ. అనృతకల్పనలు సారెనొనర్చు ఖలుకన్నఁ బ్రాణమేలేని శవంబు మేలు
రస నసత్యాలాపరసికుకన్నను "బఱ్ఱు"మని మ్రోఁగు గర్దభంబైన మేలు
సత్యవాఙ్మధురసజ్ఞతలేని జడుకన్నఁ "గీ" యంచుఱచు కీచురాయి మేలు
సూనృతేతరవాగధీనువక్త్రముకన్నఁ గశ్మలంబగు తూముకాల్వ మేలు

తే. గీ. ఎప్పుడు ననృతోక్తు లాడెడి కృపణుకన్న
శ్వపచుఁడే మేలు, వర్ణపరిస్థితియేల

ఇంతయెఱుఁగని నీకు నే నేమిచెప్పి
యేమిసార్థక మోయనృతామయాత్మ! 84

సీ. ఎఱిఁగి యసత్యదుర్దురితపారావారపంకమ్మునం దిగఁబడకు బావ!
తెలిసి యనృతవచఃకలుషనారకకూపపర్యంతమున నిద్రఁబడకు బావ!
అరసి తథ్యేతరవ్యాహారనీహారపటలమ్ములోఁ జొరఁబడకు బావ!
చూచి సూనృతవచశ్చ్యుతిమయామయసన్నిపాతమ్మునఁ బుఱింగఁబడకు బావ!

తే. గీ. నీకొఱకుఁ జెప్పుచుంటి మన్నింపు బావ!
ఆత్మ వంచింపనెంచకుమయ్య బావ!
క్రిందుమీఁదు లెఱింగి వర్తింపు బావ!
అనృతగతి వీడి వర్ధిల్లుమయ్య బావ! 85

శా. నీదుర్మార్గపుఁగూఁతలన్ గురుఁడు వన్నెందక్కునం జేసిటుల్
వాదింపంజుమి, యూరకే యనృతముల్ వాపోవు నీదుర్మద
ప్రాదుర్భావ మొకింత దింపుటకునై వాకుత్తు; నింకేని మ
ర్యాదాపద్ధతిఁ బట్టి పోయి యఘపారావారమున్ దాఁటుమా. 86

మ. మన మిట్లే తెగ గిల్కుచుంటిమి; గురు న్మన్నించువా రెక్కుడై
పనిగాఁ బిల్వఁగనంపి యుత్సవములన్ బల్మాఱుఁ గావించి య
ర్చన లవ్వారిగ సల్పుచుండిరి హతాశాపాశబంధంబు నీ
జననంబున్ వృథసేయుచున్నది; పగన్ సాధింపలే మిమ్మెయిన్. 87

శా. త్రాగుంబోతువిధానఁ బూర్వపరసందర్భమ్ములే కెట్టులో
వాఁగన్ దాన యశమ్ముగల్గునె? వృథోపాలంభముల్ నోటిచే
ఛేగా కన్యులగౌరవమ్మున కొకింతే వంకముంగూర్ప; వే
లాగో సత్సభలో నెదుర్చుటకునై లావింత యార్జింపుమా. 88

ఉ. 'తీతువుపిట్ట' యంచతనిఁ దిట్టితి, భావిఫలం బొకింత నీ
చేతమునం దెఱింగితివె? చెచ్చెర నోటికి వచ్చినట్లుగాఁ
గూఁతువు, కొంపఁ గూలు ననుకో, విది యొక్కఁడి కర్మ, మాతనిన్
బూతులు దిట్టెనాఁడ నని పొంగె, దెఱుంగవు వచ్చుదుర్గతుల్. 89

ఉ. చూడుము కొప్రపుఁగవ్వుల, శూరుల ప్రేరణఁ జేసి తప్పదుం
జాడలఁ బోయి పోయి పయి జాడ్యమువీడి కృతాపరాధమున్

వ్రీడయె పాపఁగా నొకట వెన్కటి తుంబురుకెల్లఁదగ్గి మో
మోడుచు నుండి యిప్డిపు డయోగ్యుఁ వీడఁదొడంగి రెమ్మెయిన్. 90

చ. మనల ననుగ్రహించుటకు మచ్చరపున్ దురితంపుఁ గూఁతలన్
బ్రణయముకల్మిఁ బంపుగతిఁ బంపెడివారలు లేకకాదునూ !
గొనకొని కొపరిపుంగవులు కుర్రింగిన హేతువు, వార లిష్టు లే
చిన మన కొక్కయుత్తరము చేరదు సర్వము వారికే చనున్. 91

చ. 'తిరుపతివేంకటేశ్వరులు దేశెలు, కూళలు, పెూరికుల్, కవి
త్వరచనవే యెఱుంగరు వృథాయశమున్ గడియించినారు వా
రిరువురు నద్ధముం' అని యీవును నేనును మిణ్కుపోల్కిఁ బ
ల్వురు లిఖియించి తుంటుకులు పుచ్చిరి కోప్రము వారియొద్దకున్. 92

ఉ. అన్నియు శాఖలోనిజను లాసనచర్చను నాగ్రహించుచున్
బన్నుచు వారి కొనవుచుఁ బన్నినవే యవి; సిద్ధవస్తుసం
పన్నత యిట్టి ముష్కరులవాఁరెలచేఁ జెడవంచు నెంచి యు
త్పన్నవివేకులై యిపుడు వాఁగరు కొపరియువారు సీనలేన్. 93

మ. మన కాబాపతు నుత్తరమ్ము లెకదా మాన్యేతరుంగాఁగ నో
జ్జను సాధించుట కూఁతమయ్యెడి, దురాశ నీ్నవు గుర్తింప వ
జ్జననిందోక్తులు కోప్రమున్ గెటిచె; నీచందమ్ము నల్లోఁజామీ !
యనృతాహంకృతిదుష్కృతాశ్రయుఁడవై యాతోఁ్రవకే పోయెదే? 94

ఉ. ఎందుల కట్టియుత్తరము లీవు లిఖించిన "శృంగభంగపుం"
దండనకన్న మిన్నదె? వృథా యది మన్నయి నిన్నుఁ బూతిగాఁ
బందనుజేసి, యిరొ్యడలఁ బందలుగాపెడ తప్పుఁగూతలున్
జింములఁ జేర్చికొన్న మటి చేకుఱునే? మన కున్నతస్థితుల్. 95

ఉ. కాఁకరపతిన్ మద్గురుఁడు కార్యవశమ్మున వచ్చినప్డు నీ
వాకరుణార్ద్రితోఁ గలిసి యంఘ్రుల వ్రాలిన నప్డె తీఱుఁబో
యీకలహంబు; నే నచటనే యపు డుండిన నిన్నుఁ బోలెఁ బ
ల్పోకలు వోయి యిక్కరణి మూలముడుంగు నవస్థ దెత్తునే. 96

చ. ఎదుటికి నేగవైతివి, మఱేమియు నేరని మామతమ్మునిన్
గదనముసేయు నంపితివి, కాఱు లతండఱిచెన్ గ్రిమమ్ము గా

ముదిరెను గయ్యా మాపయిని ముష్కరతాస్పదులైన శిష్యులన్
గుదులుగుదుల్గ నంపితివి కోఁతులదండు బలెన్ జయాశమై. 97

ఉ. అంతియకాని యెప్పుడును నాతని యగ్రిమునందు నిల్చి 'నీ
వెంత? త్వదీయపాండితి యదెంత? భవత్కవనం బదెంత? నా
పాంత' నటంచుఁ బల్కుటకుఁ బోవఁగ జంకితి, వూరకే యశః
కాంతకు దేవులాడెడవు కంపము నెమ్మది నిండియుండియున్. 98

ఉ. 'వేంకటరాముకన్నను వివేకిని నేను జయింతు సత్సభన్
వేంకటశాస్త్రి' నంచు నవివేకపుఁగూఁతలు గూతువాఁగదా
జంకఁగనేల నీకడకుఁ జయ్యన నాతఁడు వచ్చినప్పుడే
బొంకులు వ్రాసి కయ్యమును బూర్తిగఁ బెంచఁగనేల యోలిమై. 99

ఉ. ఆతఁడు నీదు దండునకు నాత్మను బూర్తిగ జంకినప్పుడే
నీ తగుకీతి నీ వెదుటి కేగిన నిన్నతఁ డేమిసేయు? నిం
కాతరుణమ్ము రాదుగద? యంత భయమ్మన ముగ్గు నీ వొగిన్
గోతువు కోఁత లూరకయ, కోసినకోఁతగఁ గైత నిండఁగన్. 100

చ. మనవిధ మెల్ల బైలఁబడె, మన్చు నృపాలకు మోమెకాక యే
యనఘునిఁగూడఁ జూచుటకు నర్హత లేమి ఘటస్థమయ్యె; నొ
క్కనిముసమైన నెమ్మది సుఖమ్ముగ నుండఁగనేరమయ్యె నిం
కనయినఁ దప్పుఁగల్పనలు గట్టిన లగ్గగు నెంచిచూడుమా. 101

శా. నీతప్పుం జెడుఁగూఁతలన్ గొని నినున్ నిర్నిద్రనీతిప్రథా
స్ఫీతుంజేయఁగ నెంచి దేశికుఁడు సుశ్రీనించి కల్పించు వి
ఖ్యాతగ్రంథములెల్లఁ గామగవులై కవ్యగ్రణీనిత్యసం
ధ్యాతంత్రోచితమంత్రరాజములునై వ్యాపించె వీక్షించితే. 102

శా. ఎన్నా ళ్ళీగతి మిణ్కనేముగు? వృథా యీ వేసనుంగూడి; యా
వన్నెల్ చిన్నెలు నీకు నాకు నెటు రావచ్చున్? యతిప్రాసనం
పన్నంబయ్యు బుజార్తిమారమగు కావ్యం బెన్న సాక్షాచ్ఛవం
బున్నట్లుండి క్రిమమ్ముగా సుకుఁగు మాయోపాయముల్ వాయఁగన్.

చ. అకట! శతఘ్నియంచు నొకఁడల్లితి, వయ్యది పొల్లువోయెఁ ద
త్ప్రకటన నీకు నాకుఁ బరిభావము గూర్చెడికాక సాయమై

న కతన వ్యాసముఖ్యుల మనంబులఁ గొండొకసిగ్గు గూర్చె; నీ
వొకటియు నేని నిల్పఁగల దున్నది యందలి వెక్కిరింపులన్ ? 104

చ. అక్షలఁ బరాస్త్రపాశుపతమంచు లిఖించితి సిగ్గుమాలి పై
దిఫ్రుడలపైఁ "బురశ్చరణ" తాడన మక్కతనన్ ఘటిల్లె, నా
యవమతికూడఁ జాల కిపు డాయనతమ్ముని జిన్నవెంకనన్
బ్రివిమలచిత్తు దింపితివి పాడుకృతఘ్నగణమ్ములోనికిన్. 105

మ. జనకద్రోహియటంచుఁ బేరిలితివి వాచాలత్వమేపార నెం
టనె యాతండనృతమ్ముగకూడ* దది సంధానించు దౌర్గత్యమం
చని చెం బద్దెము; లంతతో భయముమై నాస్యమ్ము మూగయ్యె, నెం
దునకో తప్పదుఁగూఁతలన్ గిలికె దీత్రోవల్ ముదంబిచ్చునే. 106

---

ఉ. *కట్టుచునున్నవారు గృహకాండము నాటకమందు; నన్నుమున్
బెట్టకతండ్రి నిల్ వెడలనెట్టినవాండ్రకునై, గురున్ దగన్
దిట్టినవాండ్రకై; యొకటనే మన ముండపలెన్ దురాగతం
బుట్టిపడంగఁ గూయు భవదుక్తులు సత్యములేని యర్భకా. 1

ఉ. తీసిరె యుంచినారలఁట! తీఱనిగోతులు తండ్రినాత్మయా
వాసమునుండి గెంటునలవాండ్రకునై; గురుఁ దప్పుగూఁతలన్
గూసెడివాండ్రకై; యొకటఁ గూలవలెన్ మన వీవు వ్రాయునా
దోసమునిక్కమేని; యెటు ద్రోహము లూరక పోవు నర్భకా. 2

ఉ. చెక్కయయుంచినారలఁట! చిక్కనిమేకులు; నీకు నాకుఁ బె
న్మ్రక్కువ నంటఁగొట్టుటకు; మానరు మానుఁడటన్నఁ దండ్రికిం
దొక్కఁడు ద్రోహి, వేఱొకరుఁడో గురుపట్టున ద్రోహియౌఁగదా!
నిక్కము వారికిం దెలియునే నవి నన్ను స్పృశింప నర్భకా. 8

ఉ. నూటిరెయుంచినారలఁట! నున్ననికత్తులు ముక్కముక్కలౌ
తీరునఁ గోతురంట! వెనుదీయక సత్యములాడువాండ్రయా,
దూరసనన్ నిజం బపుడు తోఁపక మానదు, తండ్రి నింటికిన్
జేరఁగనీమియున్ గురునిఁ జెట్టలుగూయుటయున్ బయల్పడున్. 4

చ. తెఱచిరె పెట్టినారలఁట! తీవ్రదవానలభీకరమ్ములౌ
నరకములెల్లఁ దండ్రి భవనమ్మున నుండఁగ నీక ద్రోయు సం

శా. శ్రీ సూర్యప్రభుఁడిచ్చు బత్తెములతో సిగ్గేది జీవింపఁగా
వ్రాసెం దేవుఁడు నీకు నాకు నొసటన్, ప్రారబ్ధ మిట్లుండె నా
యీ సాన్నిధ్యము వీడినన్, మనకు నేయే పాచితంబేని యే
మోసంబేని స్వయంకృతాఘములచే మూఁడున్ మఱెందేగినన్. 107

చ. నరకమటన్న నాయెద వణం కుదయించెడి, నందుఁ "గ్రొత్త వే
ర్పఱచుచున్నవా" రనుచు వ్రాసె గురుం డనృతప్రలాపికిన్

---

కరులను, దేశికుల్ దెగడుకట్టెఁడులన్ బడఁద్రోతురంట! యె
వ్వర మట కేగమో తెలియువాఁడు పరాత్పరుఁ డొక్కఁడర్భకా. 5

చ. నిలిపియ యుంచినారలఁట! నిస్తులశస్త్రపరంపరల్ దురా
త్ములకయి; తండ్రి నిల్వెడలద్రొబ్బుట, దేశపు బూతుఁగూఁతల
బలుకుట, నేర్చికొన్న కవిపండితులయ్యెడ ముఖ్యులంట! త
త్ఫల మనుభూతమానెడలఁ దథ్యము తేలఁగవచ్చునర్భకా. 6

చ. కలిపియ యుంచినారలఁట! కల్పెడివస్తువు దానితోడ, నే
యలఁతి పితన్ గృహాంగణము నాపలికిన్ బడద్రొబ్బ, నింక నే
యలఁతి గురూత్తమున్ దెగడు నాయువవాగునకై; తపంబువుల్
తలఁ బడునట్టి వేళఁగద! తథ్యము కానఁగవచ్చు నర్భకా. 7

చ. ఇహమున నెంద తేనిఁగల రిద్దఱదోస మెఱుంగు సాకియల్
నహి పరమం; దెవండు చని నారకముం గని వచ్చి చెప్పు ధీ
మహితుల; కిక్కతాన మనమంచియుఁ జెడ్డయు నిందె తేలుటల్
బహుజనసమ్మతం బగు సభాస్థలమందుకుఁ జాలునర్భకా. 8

ఉ. సూనృత ముజ్జగించి పెళుమందనమున్ గడియించి పేర్చుదు
ర్మానమునన్ దురాగతపువ్రాఁతలు వ్రాసినయంత నేమగున్?
ధీనిధు లెందు లేరె! గుణితింపరె నిక్కము! నోరు నొక్కరే!
హైనవరే యపాత్రులని! వర్ధనముల్ వదరంగఁ బోయెనే. 9

శా. బహ్వాలాపములేల? కల్లనిజముల్ పాలించువాఁ డున్నచో
నాహ్వానించి స్వకీయలోకమున నీయాచర్చ గావింపఁడే?
కహ్వాచారులు డాఁగనేర్తురె? యటన్ గాపట్యముల్ నిల్చునే?
జిహ్వాచ్ఛేదము సిద్ధమా కెటిఁగి భాషింపన్ బ్రియత్నింపుమా 10

దురితము నిక్కమేని యెటు దుర్దశ నీకును నాకుఁ దప్పునో
మొఱక ! వృథాగ నేమిటికి మో మరుగన్ దెగఁజేసితెదో గదా? 108

మ. ఎపుడో నారక మేగుదెంచునని నే నేడ్వంగఁ బో, నద్ది నా
కిపుడే సిద్ధమదెట్లటన్న, విను మాయీ దేశికద్రోహపున్
విపరీతస్థితిఁ జేసి నాయెడఁద కావేగంబు పెల్లయ్యె నె
ల్లపుడున్ వేసిలాడి మత్కృతఘ్నత మదాస్యం బంటి పీడించుచున్. 109

మ. గురుతన్ ద్రోయఁగఁ జాలినాఁడవె యవాకుల్ బల్చవాకుల్ శతం
బఱపన్ జాలితిగాని, యక్లేసుమిదాపై పైపయిన్ వచ్చు నా
నరకం బాఁగుటకూడ, నిప్పుడయినన్ నన్నా మహాభాగు పా
దరజమ్మున్ దలఁ దాల్పఁ జేసి యెటులో ధన్యత్వముం గూర్పుమా. 110

చ. విటుఁ, డవివేకి, కాకవి, యవిజ్ఞుఁ, డనార్యుఁ, డనర్హుఁ, డల్లవెం
కటకవి వానిఁ బూజ్యునిగఁ గైకొనకుండని నీవు సర్వదా
రటన మొనర్చుచుంటివి కరంబు శ్రమంపడుచుంటి వక్కట
క్కట! యతఁ డట్టిఁడైన నగుఁగాక జగం బతనిన్ భజించెడిన్. 111

ఉ. "దీనిఁ బఠింపు" డం చొకఁడు, "దీనిఁ బఠింపకుఁ" డంచు నొక్కఁడున్
మానుగ శీర్షికల్ నిలిపి మందులపట్టిక లంపుచుందు; రె
ద్దానినిఁ జూడవల్దనిన దానినె చూచుట లోకధర్మమౌఁ
గాన నిషిద్ధవస్తువునె కాంతు రెఱుంగుదువో, యెఱుంగవో ? 112

మ. ఉపకారార్థము పెండ్లిచేసె గురుఁ డోహో! నాఁగ వెంకన్న, కీ
వపకారమ్ముగ దానిఁ జొల్పెదవు ధైర్యం బెంత నీకున్నదో !
కపటస్వాంతుఁడ! "పెత్తనమ్మను మిషన్ గాఁజేసె దసిస్యం" బటం
చపలాపించితి నీదు నాల్కకు వరం బావంతయున్ లేదొకో! 113

చ అతఁడు మహోపకర్తయగు నన్నపయిన్ దురితమ్ములాడె నం
చతికిన నీదురాగతికి నంతును బొంతును గల్గఁబోదు, నీ
బ్రతుకిటు తప్పఁగల్పనలు పన్నుట కేర్పడఁబోలు; నీకు దు
ర్గతియెడ భీతిలేదు బహుకష్టము నిన్నిఁక విశ్వసించుటల్. 114

చ. "అనృతము కష్ట మిచ్చు, ఋత మన్నిట సౌఖ్యమునిచ్చు, దేవుఁడం
చు నొకరుఁ డుండె సర్వమును జూడఁగలాఁ డతఁ" డంచు నమ్మనా

జనుఁ జను విశ్వసింప, నిఁక 'సర్వము కల్ల' యటంచు స్వార్థముం
బనిఁగొని సంగ్రహించు నలపాతకి నమ్మినవాఁడు పాడగున్. 115

(అఱవ మేకు)

చ. భయము జనించె నాయెద భవత్సహవాసమునందు; ధైర్యమే
మియుఁ గనుపట్టద "య్యఱవమేకు" స్మృతింబడె, నట్టి నన్ను ని
శ్చయముగ నీవు చేయునెడ శక్యమె దాఁటికొనంగ, నో దురా
శయ! విను మక్కథావిధము సర్వము దెల్పెద నీకు బుద్ధికై. 116

చ. అఱవయు నొండు విప్రుఁడు ధనార్జనకై చనిరంట! దేశముం
దిరిగి ధనమ్ము మిక్కిలిగఁ దెచ్చినవారఁట! మార్గమధ్యమం
దఱవకు జబ్బుచేసి తుద కాశ సడల్కొనునంతదన్క రా
నెఱిఁగి యతండు లోన నిటు లెంతయుఁ జింతిలసాగె నంటొగిన్. 117

మ. 'ధనమార్జించితి మెంతొ కష్టపడి యీద్రవ్యంబు దారాసుతుల్
దినుయోగం బది లేకపోయె నిది యీ దీనుండె సర్వమ్ము కై
కొను నావారలతోడఁ జెప్పఁ డెటులో క్కో? వీని వంచించి నా
ధనమున్ వీనిధనమ్మునుం గలిపి మద్ధామంబునం జేర్చుటల్.' 118

చ. అని మదినెంచి యంతకభటావళి సన్నిధి కింకఁ గొంతసే
పున కరుదెంచునన్ సమయముం గనిపెట్టి స్వసన్నిధిన్ గనుం
గొనలను నీరు జాఱఁ దనకున్ వగఁజెందెడి మిత్రుఁ బిల్చి "యో
యనఘ! యికేల చింతిలెద వాయువు శాశ్వతమానె యేరికిన్. 119

ఉ. ఎప్పటికేని దప్పనిదియేసుమి మృత్యువు దీని దాఁటువా
రెప్పుడుఁ బుట్టలేదు, మఱి యీపయిఁ బుట్టరు, పుట్టుజంతువుల్
తప్పక చచ్చుఁ, జచ్చినవి తప్పక పుట్టు, విచారమేల యీ
తిప్పలు బ్రహ్మముఖ్యులగు దేవతలేనియు దాఁటలేరుగా. 120

ఉ. కావున నన్నుఁ గూర్చి యిటుగా విలపింపఁగనేల? నేనిదే
పోవుచునుంట నాకునయి పుష్పకమల్లదె వచ్చుచుండె, నా
పై విడు మింకఁ బ్రేమ, ఋణబంధ మిదే తెగుచున్న దెంతయో
నావిషయమ్మునన్ శ్రమమునన్ బనిచేసితి వీవు కూరిమిన్. 121

ఉ. పారెస వైద్యునిం బిలిచి చక్కనిమందుల నీయఁజేసి, తిం
పారఁగఁ బథ్యమైనగతి నన్నముఁ గూరలు వండిపెట్టి, తె
వ్వారొనరింతు రింత సదుపాయము? నేను నిజమ్ముగా జమీం
దారుఁడ, రోగిఁ గాను, గుణధాముని నిన్నొకనిన్ గడించుటన్. 122

శా. దారాపుత్రులు దవ్యమున్ దినుటకే, దారిద్ర్యమో, రోగమో,
ప్రారంభించినయప్డు చూడరు సుమీ! ప్రాణుండ వీ వన్నియు
న్నేరంబోలుదు, నీకతాన సుఖినై నేఁ బోవుచున్నాఁడ, సం
సారభ్రాంతుఁడఁగామి నిన్నొకటి ప్రస్తావింతు నాలింపుమా. 123

ఉ. నా కుపచారమున్ సలిపినాఁడవు మిత్రుఁడ వంతెకాక స
ద్ధీరుఁడ విట్టి నీ ఋణము దీర్పకపోతినయేని నాకు నా
నాకమునందు రాఁగల మహాపదవుల్ క్షణభంగురంబులౌఁ
గాక తిరమ్ము లెట్టులగుఁ ? గర్జము చెప్పెద సల్లొనర్పుమా. 124

చ. ధన మొకకొంత యిప్పురము దాఁచిన దున్నది యందులో సగ
మ్మున కధినేత నేను, జనిపోవుచునుండిన నాకు భాగమెం
దున? కది నీవ కైకొనుము, దుఃఖము నొందకు, మిందు లేశమున్
బనుపకుమీ మదీయులకు; భార్యయు బిడ్డలు నీకు నెక్కుడే! 125

ఉ. ఇందుల కొప్పవేనిఁ బయి నెన్ని భవమ్ములొ యుక్తికాని సం
క్రిందనలోక మేను జనఁగా ఘటియింపదు; వచ్చు పుష్పకం
బుం దుదముట్ట రామి కిది ముఖ్యనిమిత్తము; మాఱుచెప్ప కా
క్రిందన మాఁగి యింక నొకకామము నాయది తీర్పఁగాఁ దలెన్. 126

చ. అది యెది యందువే, నిది రహస్యము మెల్లఁగ విన్ము: హంస లు
న్నదియును లేనిదిం దెలిసి యావిషయంబు వినిశ్చితమ్ముగా
నెదఁ గదియించి మేకొకటి యింతకుఁ బూర్వమె తెచ్చియుంచి నా
కది దిగవేయు మాసనమునందు మఱెవ్వరు చూడకుండఁగన్. 127

చ. అఱలకర్మ మియ్యది, కులాచరణం బదె, మానరాదు నీ
వెఱుఁగ విఁకెన్నియో కలవ యిట్టివి దాక్షిణులందుఁ జిత్రముల్
గఱులు సమ్మతించినవత్రికారము మానఁగనేల? కొంచుకే
ర్పఱచిరొ వారు, నీ విటుకృపన్ సలుపన్ వలె మానకెమ్మెయిన్ 128

ఉ. తప్పనుకోకు మిప్పని, పదంపడి నాకిది కారణమ్ముగా
నెప్పటియట్ల జన్మమొక టేర్పడునో మఱియేమొ! యూరకే
చెప్పరు పెద్దలెయ్యవియు, శేముషిచాలక వారివాక్యముల్
తప్పదు రొక్కఁగొంద, అది ధర్మము కాదని నీవెఱుంగవే? 129

ఉ. కావున నామనోరథము కాదన కాదృతి సంగ్రహింపు మిం
కీవు పౌనర్భవఁగాఁదగిన దింతకు మించి మఱొండు గల్ల, దీ
సేవను బూర్తిఁ జావెఱిఁగి చేయవలెంజుమి, యట్లు కానిచోఁ
జావునకే నిమిత్త మిది, సద్గతి కాపయి నంతరాయమా.” 130

చ. అని కడు మిత్రభావమది యంతయు నట్టిపడంగ నా కుక
ల్పనకుఁడు బోధసేయఁగ స్వభావవినమ్రుఁడు మాయకుండు నా
ననఘుఁడు తోఁడివిప్రుఁ డది యట్టిదకాఁ దలపోసి చేసెఁ జె
ప్పినపని తప్పకుండఁ దన ప్రేమడికాని ముదమ్ము దీర్పఁగన్. 131

ఉ. పిమ్మటఁ గొంతసేపునకుఁ బ్రేతనివాసభూమి కాశవం
బిమ్ముగఁ దీసికొంచరిగి, రీతఁడు నింకొక కొంద అంతఁ గా
ష్ఠమ్మునఁ బెట్టునప్పుడు తటాలున మే కొకరుండు చూచెఁ బ్ర
ష్ఠమ్మన; వెంటనే ప్రకృతిసంస్కరణం బది యాపికోపియై. 132

ఉ. దగ్గఱనున్నవారలపుఁ దద్గతశంకువు చూప నందఱున్
బగ్గున మండి ‘యో చెనఁటి! పాతకి!’ యం చొకపెట్ట లేచి ‘యీ
యొగ్గతఁడే యొనర్చె’ నని యేపడఁగం దెగఁగొట్టి న్యాయపుం
బ్రగ్గడతోడఁ జెప్పి రల పాఱులు వారని కాఱు లూరఁగన్. 133

చ. అతఁ డెటు సేయఁగానలయు నంతయు నట్లొనరించి ‘యోరి దు
ర్మతి! యిటు లేలచేసితివి మర్మము మాని పచింపు’ మన్న, నా
హతవిధి! యున్న దున్నయటు లంతయుఁ జెప్పెను బూసగ్రుచ్చిన,
‘ట్లితుకపు సి కుకల్పనము’ లం చధికారి తిరస్కరింపఁగన్. 134

ఉ. కాఁడు కుకల్పకుం డతఁడు, కాఁ డపకారియుఁ, గాఁడు లోభియున్
గాఁడు దురాశయుండు, కొఱగాని దురాగతు మాయమాటలన్
గాడుఁగ నమ్మి యక్కరణిఁ గస్తికి నగ్గముగాఁగనై యసుల్
పీడె సమస్తయోగ్యులును ‘వీని వధించుట యుక్తమే’ యనన్. 135

---

ఉ. కానఁ గుకల్పనాపటిమ గల్గిన నీయెడ విశ్వసించునో
వానికి నగ్గమౌదు వని యాత్మ వణంకు వదయించుచున్న, దే
మైనను మంచిదే విడుతు నాదృతి నీపయి నింకఁ; బాముతో
నేనయఁ డేని స్నేహమున కీకొని మోసము నందకుండునే. 136

ఉ. తప్పుఁగుకల్పనల్ సలుపుదారియె తారఁగరాదు కాని యం
దెప్పుడు నిల్చునో, 'హితుఁడు నింకొకఁ' డన్న వివేక మేమి? యొ
క్కప్పుడు స్నేహమున్న యతఁడౌ, మఱియొక్కొకచో నరాతి; నీ
వప్పుడు నన్ను మాత్రము దురాశయ! యొప్పరికింప నేర్తువే. 137

చ. 'ఎఱుఁగమె కాలనేమి, నతఁ డెన్ని కుకల్పనలం బొనర్చి పా
డఱె! నటులే యడంగు నని యంపఱ కల్పన లెన్న రావ; యీ
యఱచ దురాశయుండయి, దురాశ హితున్ మృతుఁ జేసి ద్రవ్యపుం
బరణి సమస్తసుఖున్ దనమ భార్యకుఁ జేర్పఁగఁ జూచెనేకదా. 138

చ. మృతి వృథగా నతం 'డఱవమేకు' కతమ్మునఁ గాంచెఁ గాన సా
మెత యిది లోకమం 'దఱవమే' కని యెల్లరుఁ జెప్పికొందు, రా
కత నఱ వొక్కఁడే, యిచటఁగా దటు, లిర్వుర మర్వవారమే
కృతి కొనసాఁగనీయఁ జుమి! కృతిప్రియుఫక్కిని నెవ్వ రొప్పికొనన్. 139

చ. అఱవ యొనర్చు హేతువున నట్లపకీర్తికి జాతి సర్వమున్
గుఱియగుటయ్యెఁ గాని యిటు కొండొకశాఖయెఁ జేయవచ్చు; ము
ష్కరుఁ డల కాలనేమియుఁ గుకల్పకుఁ డేకద! వాఁడుఁ గూడఁ గా
నఱవ యనంగ వీలగునె? యందఱియందును నుండ్రు దుష్కృతుల్. 140

ఉ. కానఁ గుకల్పనాపటిమ గల్గినవానిని జేరరాద, య
వ్వానిని జేర్పరాద యని వాకొను టేయనుచితంబు; నీపలె
న్నేనొక యర్వనయ్యు జననింద్యపుఁ ద్రోవలు ద్రొక్కనేర; నీ
చే నెటువంటి తప్పయినఁ 'జీ' యనఁ రచియింపఁగాఁబడున్. 141

శా. ఎన్నో కూశిరి తప్పుఁగూఁతల, గురుం డెన్నేని సైరించు; నా
పన్నుల్ నోరి లందు లాడుటయు సంపన్నుల్ మదిం బెట్టమిన్
మున్నెందుం గలయట్టిదే, యఘ మొగిన్ బూర్ణంబు గావచ్చె, నే
బన్నం బున్ననొ? యిప్పుడేని గురునిం బ్రార్థింప గా జెల్లదే. 142

తే గీ. "విష్ణుదేవునిఁ దిట్టిన వెంకటేశుఁ
దిట్టినట్లగు" నని సుంత తెలియు నీకు
వేంకటేశునిఁ దిట్టిన విష్ణుదేవుఁ
దిట్టినట్లగునని కూడఁ దెలియవలదె? 143

మ. అటు లొక్కించుక నీవెఱుంగునెడ దుర్వ్యాహారముల్ తొల్లి వెం
కటనేతన్ గుఱిసేసి ప్రేలి, వది యజ్ఞానప్రయుక్తంబ; యం
తట వస్త్వైక్యము దేశికుండు తెలిపెన్ దానన్ గనుల్ విప్పి చె
ప్పట కొం డుత్తర మబ్బమిన్ వృథగ వాపోవన్ ఫలంబున్నదే. 144

శా. విష్ణుం డెవ్వఁడొ వేంకటేశుఁ డతఁడే, వేయేల? రాముండునున్
గృష్ణుండున్ మఱి వానిలేశములె, నీ కీజ్ఞానమే యున్నచో
జిష్ణున్ వెంకటనేతఁ దిట్టెదవె, సీ! సీ! పండితమ్మన్య! నీ
తృష్ణాతంతువు పూర్తిగాఁ దెగుట కాతిల్లె నిమిత్తమ్ములౌ. 145

ఉ. వెంకటనేతపై నకట! వేరము నీవువహించి తిట్టు నా
పంకము చూచి నాయొడలు బగ్గున మండెడి, దేవుగూడ నా
వెంకటనామధారి నని వీడెఁడివై తలపోయనైతి నీ
బొంకులు సర్వమున్ జెలిచెఁబో! గురుఁ, డింకెటు నోరు విప్పెదో? 146

తే. గీ. విగ్రహారాధనమునందు వెలయుపద్య
మొక్కఁడేనియుఁ ద్రిప్పలే కుఱక "వాజ
కూఁత" లని నీవు మిణికినఁ గూఁతలగునె,
"గీత" లని వాని వైదుషీనేత లనరె! 147

ఉ. నీవల వెంకటేశు నెటు నేరక తిట్టితి వట్లు కృష్ణునిన్
వానిదువంటు దేశికుఁ, డుపాస్తనయి న్నిను మేలుకొల్పఁగాఁ
ద్రోవ యొకింత చూపి "యిటు దూఱిన దూఱఁగవచ్చు" నంచుఁ గా
దే వెఱవున్ గనంబఱచెఁ దేఁకువ నీవలె నొజ్జ వీడునే? 148

ఉ. ఆతని తేఁకు వేమి, మఱి యయ్యవఘాత్మ నుపాయమేమి, వా
క్చాతురియేమి, నామనము సర్వ మెఱుంగు నెఱుంగ వీవు, నీ
చేతము మాత్రి మాతఁడు గ్రసించును గంత మటంచు సారెకున్
భీతినిగొల్పు నక్కట తనఁ బ్రేలెదు దూరమునందు డాఁగుచున్. 143

శా. ఎన్నో కొన్నిదినాల శిష్యుఁడవు నీ కెట్లేల్ గురుస్వామి యు
ద్యన్నైపుణ్యము వోల్చు వాగ్గరిమ చిత్తమ్మెక్కు? నా కెప్పుడున్
దన్నైపుణ్యమె జ్ఞప్తిలో మెలఁగు, సంతర్వాణిమాన్యంబు కా
కున్నన్ లోకము మెచ్చునే యరరె నీ "హాహాహా" లతోఁ బోయెనే!

మ. ఎవనిన్ దేవుని దిట్టఁగాఁ బొగడుటంచే బోధగావించె నో
యవివేకీ! యల "విగ్రహార్చనమునం"; దంధత్వము న్వీడు, మ
య్యవి పద్దెమ్ములొ? లేకరత్నములొ ? నీవజ్ఞుండవై పోక త
త్కృపనమ్మం గని బుద్ధిగల్గి మనుమీ గర్వంబు చాలింపుమీ. 151

శా. నీ తండ్రిన్ మదినెంచు మమ్మహితుఁ డీనిన్నెట్లు సైరించుఁ ద
చ్చేత మ్మెప్పుడు దేవతార్చనపయిం జెన్నారు, నప్పూజలే
కే తా నెన్నఁడు భుక్తిగైకొనఁడు "నీ వీలాటిదుర్మానివై
పో" తంచున్ మదినెంతగాఁ బొగులు నా భూదేవవర్యుం డరే! 152

ఉ. నీ తలిదండ్రులే మదిని నీదు దురాగతి రోయుచున్నచో
లాఁతులు నిన్ను మెత్తురె? తలంపు మెదన్; జలమున్ గుదింపు, మ
య్యో! తగుమానిసింబలెనె యూరక "భారత" మంచు వ్రాఁతు; నీ
కూఁతలు కోఁతలై బుధులకున్ వెగటయ్యెడి నేమిసేయుదుఁ? 153

శా. స్నానంబున్ బచరింప వెన్నఁడును సంధ్యన్ వార్చ వేనాఁడునున్
ధ్యానుం జూడక దంతముల్ గడుగ వప్రాజ్ఞత్వపర్యాప్తదు
ర్మానిన్ గాఁకరపత్రిలోన నిను సమ్మానించువాఁ డొక్కరుం
డేనిన్ గల్గిన వాని పేరు సెపుమా? యే నేగి ప్రశ్నించెదన్. 154

ఉ. అక్కట! వేదులాన్వయమునం దుదయించిన నీవు ప్రొద్దు జా
మెక్కినమీఁద 'బ్రి' షాకటి యొంగిలిచే కరమందు నూని మి
న్నెక్కి మొగంబుఁ గడ్గుటకు నేవముపొందినవార లెందఱో
యక్కటికమ్ముమై నుడివినట్టినుడుల్ విని యేడ్తు నీకునై. 155

శా. నీదుశ్చేష్టల నాఁగ నేరక భవన్నిశ్శ్రేయసాకాంక్షిదా
యాదపేర్మిను నీదుతండ్రి మదుపాధ్యాయున్ సదా కోరు 'మీ
కీదుశ్శీలు క్షమింపఁగావలయు వన్నీక్షించి' యం చీవు నీ
వాదార్థంబు నమేరుశాస్త్రి నడుగన్ వ్రాకుచ్చుఁ బెల్లమ్ముగన్. 156

శా. లేదా, తండ్రినె పోయి యడ్గు మతఁ డేలీలన్ బ్రసంగించునో?
చే దెవ్వారికిఁ గాఁడు పుత్రికుఁడు తచ్ఛ్రేయోర్థులై వార లే
యేదైన్యమ్మునకేని పాల్పడుటలేదే? చూడమే? యట్టిచో
నీదౌర్గత్యము వాప నీపిత ప్రయత్నింపన్ దొసంగుండునే. 157

ఉ. పొట్టకుఁగా నపాత్రమతముం గొని దేవుని దిట్టు పాపపుం
గుట్టవు నీవు గావుటకుఁ గోవిదుఁడౌ జనకుండు మోద మె
ప్పట్టునఁ బొందు? "వీఁడు కులపద్ధతిఁ గర్మ మొనర్చునంచుఁ దా
నెట్టులు నమ్మె నౌర! భవదేకతనూజు నిటుల్ పొనర్తువే. 158

మ. పరమాపాత్రుఁడనైతి నీకతన నాప్రారబ్ధ మిట్లుండె, భూ
వరుఁ డేని న్నిను మందలించునన నీవాక్రితల్ గనం డాతఁ డ
గ్గురువర్యుం డొనరించు గీరతములోఁ గొంతేనియుం జూడ నీ
దురితమ్ము న్నృపుఁ డాఁగుఁగాని యదియున్ దూరంబ యాతేనికిన్.

ఉ. "వేంకటరామకృష్ణు" లను పేర్వినవచ్చినమాత్రనే కృత
ఘ్నాంకము జ్ఞప్తిలోఁ దవిలి యందఱు నీ యనిరోయుచుండి రీ
పంకము నీఁగఁగాదగు నుపాయము శ్రీగురుపాదసేవ గా
కింక మఱొండు లేదునుమి యెన్నివిధమ్ముల నెంచిచూచినన్. 160

చ. గురు నలవారు "తిట్టి" రని "కొట్టిరి" యంచని యేవొ కొన్ని తుం
టరు లెదొ కారణాంతరమునన్ సృజియించిన తప్పుఁగూఁతలన్
దురిమిన పత్రిక న్నడిపి ద్రోహము నీఁగఁగఁజాల; మంతనే
గురుత దొలంగనే? యఘము గుడ్పి బెగడ్పడఁజేయకుండునే? 161

శా. సిగ్గొక్కించుక నీకు లేదుగద ? "సీ! సీ!" యంచు లోకుల్ సదా
యెగ్గుల్ పల్కిన లక్ష్యపెట్ట వరరే! యేనీచులో యీసుమై
దగ్గుల్ దగ్గిన వాని నూఁతగొని యీఁదన్ బోదు సందర్భంబు, నా
కగ్గిక మ్రగ్గినయట్లు, బొందఁబడినట్లై డెంద మల్లాడెడిన్. 162

మ. ఎవరో కొందఱు నిన్ను మెచ్చి గురు నెంతే దూఱిరం చేవియో
యవివేకోక్తులు చూపె, దే శకునిలో యట్లన్నమాత్రిన్ బహు
స్తవనీయంబయి చెల్లెనే కురుకూలాధఃపాతమూలమ్ము దు
ర్వ్యసనాయమ్ము దురోదరమ్ము బహుళాపత్కారి కాదయ్యెనే. 163

మ. జగదేక స్తవనీయు నందతనయున్ శస్త్రాస్త్రవిద్యాబ్ధిపా
రగు గాంగేయు, దురాగ్రహమ్మునఁ దృణప్రాయమ్ముగాఁ జూచి బల్
పొగరుం గూఁతలు గూయలేదె శిశుపాలుం; డందు శే ఓఁడులో
"తగు" నం చాడరె? వాని శీర్ష మటుపైఁ దక్కించి యీఁగల్గిరే? 164

ఉ. ఖండతనమ్మునన్ మన మహాపదవాకులుఁ గూసి దాన "బ్ర
హ్మాండము మున్గిపోవు" నని యార్చుచుఁ బేర్చుచు "వంటయింటిలోఁ
గుండలలోన గుఱ్ఱములఁ గొట్టిన" మీసమె కాదు, వారివే
లొండునుఁ గూడ నూడ దయయో! మతిమాలు ప్రసంగ మేటికిన్. 165

చ. కొలఁది యెఱుంగకే "మురికిగుంట" గలంచిన వారు వార, ల
వ్వల నది చిమ్మ క్రిమ్మికొనె వాసన "లోసరిలుం" డటంచు, నీ
తెలివికి నెంతయేడ్తు నది తెచ్చుక నెత్తిని రుద్దికొందు, వి
ప్పలు కలవారు పల్కిన "సెబా" సను లోకము, నిన్ను 'సీ'యనున్ 166

చ. మొదట "రిజిస్ట"రుత్తర మమోఘము వంపిన వారెవా? రదే
కదపుటయానుగా కిఁక నొకం డెటులో? నదిగాక వారలన్
గదపుట కున్నదే మన కొకానొకబీజము? వారికుండెఁ గా
కిది పసిబాలుఁడే నెఱుఁగు నేటికి సామెత నెత్తితోకదా. 167

ఉ. కాలను బోవుదాని నెసకమ్మున నెత్తిని రుద్దికొంటకే
గోలతనాన నమ్మురికిగుంటను ద్రుంగితి, విట్టి నీ వచో
బాలిశతావిలాస మది భావిగతిన్ దలపించెదున్, జెడుం
గూళల కెందునున్ "మురికిగుంటలె" కా పరమందు గమ్యముల్. 168

చ. కదపిరి వారలే మనలఁ గశ్మలచిత్తుల దుష్ప్రమత్తులన్
బదపడి "రెండునున్ విడిచి" వారికి నుత్తర మిచ్చి యుంటి, మా
మద మది రోసి వెంబడిసె మద్గురుమూర్తులు పూర్తిగా వృథా
వదరు లడంపఁగా "సభకు వత్సలు రండ"ని పిల్చి రేడ్తుఁగన్. 169

ఉ. అందుకుఁ జాలలేమి జగమంత యెఱింగె, భవద్హృదంతరం
బందును నాహృదంతరమునందును గల్గిన భీతి తోఁ డెఱుం
గుం, దన పిన్నతల్లి మనకుం గబురంపిన నొజ్జ వచ్చునం
చుం దలఁకిందిగాదె యొకచో మన మిర్వుర మప్డు గ్రుగ్గుటల్? 170

ఉ. ఎప్పుడు దేశికుం డచటి కేగుసుడుల్ వినవచ్చె నప్పుడే
తప్పె మొగమ్ములన్ దెలివి తల్పులు మూసుక లోనఁబ్రుంగుటల్
చొప్పడె, దీనికై మదిని శోకమునంతగఁ బొంద నేను; నీ
విప్పుడుగూడ వారలకు "నీశ్వరవేర్లమె" యంట కేడ్చెదన్. 171

ఉ. ఎవ్వరొ యేల నీకొమరుఁడే యనుకొ 'మ్మటకెందు కేగరే
దవ్వ కృపాఢ్య చెల్లమ సభార్థము పిల్చెఁగదా' యటన్నచో
గవ్వల మేనుడి న్నొడువఁగాఁగలవో? వచియింపు మారకే
చివ్వను బెంపఁగా నుడుకుఁ జెన్నఁటి కూఁతలు గూయఁ బోయనే. 172

శా. "ఆరామద్రివిడాన్వవాయవనదావాగ్నిస్ఫులింగ" మ్మటం
చా రాజార్చితుఁ దిట్టఁబూనితివి నీయజ్ఞాన మేమందు? నా
ధీరుం డక్కతనన్ జెడందలసుమి, యా తిట్టేర్చు నిన్ను న్ననున్
నో రెట్లో తెగజార్చె దారయవు క్రిందున్మీదు సుంతేనియున్. 173

మ పరమప్రీతిగ నొప్పునట్టి యల శ్రీపాదాన్వయాంబోధిశీ
తరుచిన్ గృష్ణకవీంద్రు వెంకటకవీంద్రద్వేషిగా నెట్టులో
యలవన్ బూనితి వంతమాత్రమునసే యాయిర్వురున్ లోఁ బర
స్పర శత్రుత్వము దాల్తురేమి యవురా! చాతుర్యపర్యాప్తతల్. 174

ఉ. ఎంతటి పేర్మియున్ మఱియు నెంతటి గౌరవముండకున్న ధీ
మంతుని మద్గురూత్తముని మన్ననమైఁ గని "శిష్యుఁ" డంచు స
త్స్వాంతుఁడు కృష్ణమూర్తికవి భారత మాత్మకృతంబు నంపి "నీ
స్వాంతము వ్రాయుమీ" యనునె? శత్రుత యేగతి నిర్వచించెదో.

మ. మనకర్మమ్మిటుకాలి దేశికునిపై మాన్యేతరాలాపముల్
పనిగా నేర్చెడెఁగాక లోకమున నేపాపాత్ముఁడున్ జేయఁడీ
పని, దుర్మార్గతకున్ గడంగితి మపభ్రంశమ్ములంగిల్కి వా
రని దుర్నారకఘోరకూపమును జేరంబోవుచున్నా మహో. 176

చ. "అల భుజగేంద్రుతోఁ జెలిమి యాతనికిన్ జెడె" నంచుగిల్కి, త
య్యలఘునకున్ గురూత్తమున కర్మిలి మెండుగ నున్నవార్త వ్యా
సులఁ గనుఁగొమ్ము తెల్పెదరు చూచినవా రట వారు సర్వ; మెం
దులను వృథాయసత్యములు నోటికివచ్చినయట్లు ప్రేలెదో! 177

చ. అల భుజగేంద్రుసన్నిధికి వ్యాసమనీషియు మద్గురూత్తముం
డెలమిని బిల్వనంపఁబడి యేగిరి యప్పురి నొక్కనాఁడు ప్రా
జ్ఞులుగల సత్సభాస్థలిని సూరులు మెచ్చ నుపన్యసించి ర
వ్వల నదిపతిక్రికన్ గని యపారముదమ్మును గంటి నే నొగిన్. 178

శా. ఈ నెవ్వారికిఁ గొమ్ము లున్నవని యిం కేవారికిన్ లేవటం
చేవో తప్పుడుఁగూఁత లార్చితివొ యీయీగజ్జు లాపత్రికా
భావం బూడ్చెడి, నోరునొక్కెడి, వృథాప్రాగల్భ్యముల్ చచ్చు వి
ద్యావైశద్యము హెచ్చుఁ, గస్తురి నెటుల్ దాఁపంగ గూపెట్టెదో. 178

మ. పగ సాధించునుగాక దేశికుఁడు విద్వత్తాపరిసంగమ్మెటో
దిగఁద్రోయన్ గమకించి యేవిషయమో తేఁ; డీవొ యేతప్పుడుం
బొగరుంగూఁతలొ కూఁతు వయ్యవి వృథా పో కెమ్మెయి న్మాలమా
దిగలున్ రోయు కృతఘ్నతాఘమున నన్ దేలించి తూలించెడిన్. 179

చ. మన గురుతో నెదుర్కొనుట మాన్యతగాంచెను గొప్పరమ్ము శా
ఖను గలవారిచేనయినఁ; గర్మము కాలుటతప్ప లేకపో
యెను మన కెందు గౌరవ; మహీనుఁడు ఱేఁడిడుడీత మెట్టులో
తిని భరణమ్ము గొన్ సుదతి తీరున నుండఁగ ధాత వ్రాయుటన్. 180

మ. గురుఁ డూరేగిన నేగి రొండొకయెడన్ గొప్పింపువా;రొజ్జ బ్రి
హ్మరథస్థుండుగ నెందొ బ్రహ్మరథముం దవ్వారు నూరేగి; రె
వ్వరికింగాని యఘమ్మునంబడి వృథా వాపోవుచున్ బొట్టకే
భరణమ్మొ గొను టొండుదక్క నొక సౌభాగ్యమ్ము నీకబ్బెనే? 181

మ. నృపుఁడేని న్మన కట్టియుత్సవములన్ జేయింపఁ, డేమన్న, దు
ష్కపటంపు న్మనవర్తనం బఖిలముం గాకున్నఁ గొంతేని భూ
వి ఫుచిత్తమ్ము స్పృశించియుండెడి నెటో మేపించుఁ గా కిట్టిపా
వపురుశ్శిలుర కేమటం చితరసౌభాగ్యమ్ములన్ గూర్చెడిన్ ? 182

మ. వః కేలాభము లేకయున్నను జగన్మాన్యంబు శ్రీదేశికా
గ్రణివాగ్ధోరణి వెంటనంటి మనవక్రింపున్నదుల్ గోపుపా
లను గల్పింబడు గేదెపాలగతి వాలాయమ్ము గ్రాహ్యంబులై
చను, నీలాభము చాలుఁ బ్రాజ్ఞు లిటులే శంకింతు రస్మద్గురున్. 183

## సింహము, ఎలుక.

ఉ. అలచెద వూరకే గురునియంతరమున్ గనలేక, యెట్లు నీ
యలవు లతం డడంపఁగలఁ? డాతని కంకవు మూల డాఁగె, దం
డలు "తగ" దన్ననున్ వినవు, దంభవచోరచనావిశేషముల్
గురిసెద వెన్నియేని; యనుఁగున్ గుఱుఁ డేమియొనర్ప నేర్చెడిన్. 184

తే. గీ. క్షుద్రుఁడగు శత్రు వొక పెద్దశూరునకుఁ ద
టస్థమగు నేని యది దురవస్థ వాని
కపు డుపాయమ్ము క్షుద్రున కట్టిక్షుద్రు
నప్పగించుటె యని పెద్ద లనఁగ వినవె. 185

చ. కలదొక సింగ, మయ్యది యొకానొక యద్రిగుహన్ వసించు, నం
దలి యొక లాఁగఁ జేరి సతతంబును సింగపుజూలు మెల్లఁగా
నెలుక యొకండు పీఁకికొని యీమృగరాజున కంకకుండ న
క్కెలనఁగలట్టి లాఁగకు నొగిన్ జనుఁ జిక్క దదెన్నిభంగులన్. 186

శా. హర్యక్షమ్ము లదానిఁ బట్టుటకు నిత్యమ్మున్ బ్రయత్నించుఁ ద
ద్ధైర్యస్థైర్యములున్ బ్రతాపమును గర్తస్థాయి యాయెల్కపైఁ
గార్యం బింతయుఁ జేయవయ్యె; నలసింగం బింతకన్మ్రాయ దు
శ్చర్యల్ సల్పఁగడంగు నాయెలుక నిచ్చల్ బొచ్చొగిన్ బీఁకుచున్.

ఉ. ఎంతయు జాగరూకతమెయిన్ మృగరా జలపాటునెల్కకై
వంతముఁబట్టి మేలుకొని పట్టుదమంచుఁ దలంచి పొంచుఁ; ద
త్స్వాంతము గుర్తెఱింగి యది యల్లన గన్నమునంద యుండు, నొ
క్కింత కనుల్ మొగుడ్ప నలయెల్క వెసన్ గృతకృత్యమై చనున్. 188

ఉ. పిమ్మట నొక్కనాఁడు గుహ వీడి మృగాధిపుఁ డొక్కవృక్షమూ
లమ్మునఁ గూరుచుండి తనలావు సమస్తము చింతఁజేసి "నా
గమ్ములఁ గూల్చుకన్నఁ, దురగమ్ములఁ జీల్చుటకన్న, నక్కరం
గమ్ములఁ బీల్చుకన్న, నెలుకం గని పట్టుట చాలఁగష్టమా." 189

చ. అని "యిది యేటిమాట, తనయంఘ్రితలమ్మున ముల్లు గుచ్చుకో
గునపము వెట్టి తీయ టొనఁగూడునె, నూదినెకాక, నీచ శ

తుఱిన కొకనీచు నేర్పఱిచి తుఱిళ్లడఁగించుట యుక్త" మంచు గ్రి
క్కునఁ దెలిపొంది యొక్కయి కొండొకపిల్లిని దేఁదలంచుచున్. 190

చ. అది యెచటన్ లభించుననునంతఁ గనంబడె వృక్షకోటరా
స్పదమగు పిల్లియొక్కటి, కృపన్ మృగరాజము దానిఁ గాంచి "నీ
వెద ననుఁ జూచి భీతిగొన నేటికి? వృక్షము డిగ్గి రమ్ము నే
మదగజభక్షకుండ నవమాన మెఱుంగనె? నిన్నుఁ దిందునే! 191

శా. నీతో నొండొకకార్య మున్నయది యంతేవాసివై మద్గుహన్
జేతోమోదము మై వసింపుము భవచ్చిత్తానుసారమ్ముగా
నాతో నుండఁగవచ్చు భుక్తి సతము న్నాపంక్తి బోసేతుగా
కీతంటా లిఁక నీకు నెందులకు సర్వైశ్వర్యమ్ము నీ కిచ్చుటన్. 192

చ. పని యది యెట్టిదన్న విను పర్వతపున్ గుహ నానివాస, మం
దున నొక కన్నమందు నొక దుండగపున్ జెదునెల్క వాసమున్
గొని నడిరేయి నే నిదురఁగూరిన యప్పుడు మెల్ల వచ్చి గ్రి
క్కున మెడబొచ్చు నోటనిడికొంచుఁ జనున్ దన లాఁగలోనికిన్. 193

ఉ. పట్టుదమంచు యత్నము నపారముగా నొనరించినాఁడఁ, గ
న్పట్టదు, లాఁగలోన నొకపట్టున నెట్టన డాఁగియుండుఁ బై
తట్టున కేగుదెంచియును దబ్బున లాఁగకుఁ బోవు; నంతలోఁ
బట్టుట కీవు నేర్పరి వుపాయము నీయది నే నెఱుంగుదున్". 194

చ. ఇటు నుతియించి పిల్లి నెటులేఁ దన లెంకగ సంగ్రహించి య
క్కటికముమీఁదఁ బెంచు చలకన్నము దాపునఁ గాపుపెట్టి వె
క్కటివలెఁ గాక సౌఖ్యముగఁ గన్నులనిండను నిద్రగొంచు న
య్యటవిచరాధిపప్రవర మాగుహఁ గాలముపుచ్చునంతటన్. 195

మ. తనదుర్దర్పమడంచు పిల్లి యచటన్ దానుంట గుర్తించియున్
దిన నాహారముఁ దాఁగి నీ రొదవమిన్ దేహమ్ముశుష్కించి నె
ట్టన నెల్లో చననెంచి యాయెలుక బైటన్ రా వెసన్ బిల్లి చ
ట్టనఁ బట్టెన్ దిగమ్రింగె; సింగమది వేడ్కన్ గాంచి యగ్గించఁగన్. 196

ఉ. కావున నీచశత్రునకుఁ గావలె నీచుఁ డొకండు, సింగపున్
లావది యేమిచేసె నలలాఁగవసించెడి యెల్కమీఁద? న

ట్లై విను నీపయిఁ గురునియేర్తాఁ బయి కాఁ బనిసేయు లేద, నీ
పేవిరు తప్పుఁగూఁత లోకమునఁ గ్రాలదు నెగ్గెయుంగమిఁ. 197

శా. "గంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు నీరంధ్రావివేకాన్విత
స్వాంతుం డిన్నన్నను నన్ను సత్సభకు నుద్వృత్తిఁ జేసి యుస్మత్కృపా
గ్ర్యాంతుల్ మాన్పి కరగ్రహింపఁ బిలిపి పై వాత్సల్యముఁ జూపి ధీ
మంతుల్ మెచ్చ ననుగ్రహింపుమనుఁటు! యీమర్యాద లాలించితే. 198

శా. రంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు నీరంధ్రావివేకాన్విత
స్వాంతభ్రాంతనిరంతరానృతవచఃపద్క్రాంతదుష్కల్పనా
ధ్వాంతకాంతకుకావ్యనవ్యరవిదీవ్యద్భవ్యతేజోంచితా
హంతాదంతురవాక్ప్రకాశికల నీహమ్మార్ప కేనాఁటికిఁ. 199

శా. రంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు ధీరమ్మన్యతావుద్ధత
స్వాంతాత్యంతదురాగతప్రవణనీచాచారవాచాటకా
చాంతానంతకృతఘ్నతాభరసురాసర్వస్వనిర్వాపణ
ధ్వాంతుల్ కొండొక వృద్ధిచేసి మొగముల్ వాడింప కేనాఁటికిన్. 200

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు వికాంతాఖిలాశాంతనై
రంతర్యప్రతిభాసమగ్రకవితారాజ్యంబు పాలించు ధీ
మంతుఁ దేశికు దూఱనాడిన కృతఘ్నంతుస్థితుల్ వోవఁ ద
త్కాంతాంఘ్రిద్వయి మీఁశిరంబు లిరవొందఁ జేయ కేనాఁటికిఁ.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సారగ్రాహివిద్వన్మన
శ్శాంతాధాయితధాకృతానుకృతరాశీభూతవాగ్జాతను
ద్ధాంతాలంకరణైకతానకవితాధార్ష్ట్యంబునంజేసి గు
ర్వంతస్తాప మొనర్చు నీచరిత మేదఁ జేయ కేనాఁటికిఁ.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁ డనర్ఘగ్రావభూమీనట
త్కాంతుద్వేషిశిరస్సరాసురసరిత్కల్లోలలోలార్భక
సంతానోపమచారుధారకవితాసంతోషితాశేషభూ
కాంతాస్థానచరుస్ గురుస్ జెనఁకుపాపం బాప కేనాఁటికిన్.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు రారాజద్యశఃకన్యకా
సంతానాయితభూమిపాలకసదాస్థానంబునం దుండియుఁ

జింతాకంతయు లేక పౌరుషముతో సిగ్గున్ విసర్జించి యు
త్యంతాసభ్యములాడు కాకవుల క్రౌర్యం బార్ప కేనాఁటికిన్. 204

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సర్వజ్ఞామ్రభృదాస్థానస
ద్ధాంతస్థానచిరప్రసాదితయశస్సన్నీసదోపాసనా
క్రాంతశ్రాంతయశఃప్రభూతకవితాసామ్రాజ్యసింహాసనా
క్రాంతుల్ దేశికు దూఱు మోఱకుల పొంకం బార్ప కేనాఁటికిన్ 205

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు పర్యాయాదృతానేకసా
ధ్వంతేవాసికృతావధానసమయవ్యాఖ్యానవిఖ్యాపితా
శాంతస్థాయియశఃప్రసూనకవితాసౌందర్యరాజద్గళో
పాంతుల్ దేశికుఁ దిట్టు కట్టెఁడుల గర్వంబార్ప కేనాఁటికిన్. 206

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు నిర్యన్మాత్రధురీహాలాత స
ర్వాంతర్వాణివరేణ్యపూతరసనాధారాదరోదాహృతా
నంతశ్లోకరసోరుపద్యరసపానాప్లాయిసాధుస్తుతో
దంతుల్ దేశికుఁ గూర్చి వ్రాసిన యసత్యాల్ మాన్ప కేనాఁటికిన్. 207

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు పారంపర్యసంప్రాపితా
చాంతామేయరసప్రసిద్ధకవితాసౌకర్యసాఫల్యకృ
ద్వాంతాసంఖ్యనవప్రబంధపఠనవ్యాప్తత్రిలింగాభిధా
నంతుల్ దేశికు నొంచుపంచకుల పొంగార్పింప కేనాఁటికిన్. 208

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు నిర్లజ్జావలేపుల్ వృథా
హంతాదంతురితాంతరాత్మకు లసత్యాలాపమూలాతురుల్
భ్రాంతుల్ దుష్కవితారసజ్ఞులగు మూర్ఖశ్రేణి ప్రత్యర్థులై
గంతుల్ వైవఁగ వారిగంతు లణఁగాఁగం జేయ కేనాఁటికిన్. 209

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు మార్జారాభియానాదృత
స్వాంతంబా గజమట్లు కత్తృణము గాల్పం బూను కాలాగ్నియ
ట్లంతేవాసికృతాపరాధజనితాహంకారుఁడై పోరు ది
గ్దంతిన్ దేశికు వేఁడఁబోని ఖలకృత్యం బార్ప కేనాఁటికిన్. 210

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు ప్రాగ్ధాతిరేకమ్మునన్
గొంతేరమ్ములు మెండు కయ్యమునకున్ గూకట్లు జాడించి శా
సంతైషం దరిపలేక పాటుదురుగా కవ్వారిఁ బాకాలయా
త్మాంతస్థాయుల బైట కీడ్చి పదరుల్ మాయింప కేనాఁటికిన్. 211

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు దుర్గర్వప్రకోపమ్మునన్
క్షంతవ్యమ్ములు గాని నేరములు లక్షల్ సేసి యాపిమ్మటన్
గంతవ్యంబు నెఱుంగలేక మనమున్ గంపంబు వేధింపఁగా
గ్రంతల్ దూఱియుఁ బేరులువాండ్రి పస గంగంగల్ప నేనాఁటికిన్. 212

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁ డనిర్వాచ్యప్రభావోల్లస
ద్ధాంతానేకళతావధానకసపాండిత్యవేళాకృతా
త్యంతస్తోత్రసముత్సముత్క్రహిమపత్క్రన్యాదయాగణ్యక్ళ
ప్త్యంతున్ దేశికు నల్పఁ గొల్వని యకృత్యంబాల్ప నేనాఁటికిన్. 213

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సాగస్వజ్ఞుచే గ్రంథమున్
సాంతంబున్ జదివించి యందలి యసత్యాలాపముల్ చించి మీ
చెంతన్ వికృతులందు గోమయపయస్సేకంబు చేయించి భూ
కాంతాస్థానములందుఁ దద్యశము ప్రాఁకం జేయ నేనాఁటికిన్. 214

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు స్వారాజేనియుం బౌరుషా
క్రాంతంబైన మనమ్ముతో సతతముం గాల్ద్రవ్వ మాతోడ స్వో
పాంతంబందొ మఱెందొ యొక్కసభఁజేయంజేయు మీ మా కవి
త్వాంతర్యమ్ములుచూపి మీపొగరు మాయన్ జేయ నేనాఁటికిన్. 215

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సంరంభమ్ముతో నర్థితా
హంతావేగముతో వధానభృతవిద్యాచాతురీధాటితోఁ
బంతంబొప్పఁగ వచ్చి పండితకవీట్ప్రాంతమ్మునం బాండితీ
కుంతాగ్రమ్మున గొంతునొక్కి చపలోక్తుల్ మాప నేనాఁటికిన్. 216

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు మర్యాదావిదున్ భూపతిన్
దాంతున్ దాతృశిరోవతంసు నయవిద్యాజన్యసౌజన్యసి
ద్ధాంతుం గొల్చియు నుంతయేని యభిమానాహంయువుల్ గాక వి
క్రాంతాలాపము లాడువాండ్ర తలభారం బూడ్ప నేనాఁటికిన్. 217

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు వైరంబున్నచోఁ బౌరుషం
బెంతేఁ జూపెడి వెల్మరాజ్యమున "మేమే" యంచుఁ గైవమ్మునన్
గంతుల్ వేయుచు వ్రాఁతవ్రాయుచుఁ గ్రియాకాలమ్మునన్ భీతి నా
పొంతం బోని మోసగాండ్ర కలరూపుం దేల్ప నేనాఁటికిన్. 218

శా. "అలంతన్ జెందకు" మంచు మిక్కొడవు ని న్నంతేవసద్ధర్మసం
చలితుల్ దుర్లలితుల్ దురాగతు దురాచారప్రచారుల్ సభా
స్థలి కెక్కించి స్థలద్వచస్కుఁ, గళదుద్యత్స్వేదుఁ గావించి లో
కులకుల్ జూపి శిరోనతుల్ గొని కృపాంకూరచ్ఛటల్ నించి ని
చ్చలు రక్షించి యనుగ్రహించునఁట! యీచ్చాతుర్యముల్ గంటివే? 219

మ. "అలంతన్ జెందఁడు వేంకటాచల"మపాత్రాంతేవసద్దుర్మదా
విలనిర్భీకకృతఘ్నతాజ్వరభరోద్వేగప్రభావప్రభా
స్ఖలదాచారవచఃప్రచారవిలయాఖండౌషధప్రాయని
ర్మలనీహారమనోహరాత్మకృతిఁ బర్వంజేయ కేనాఁటికిన్. 220

శా. 'రాపుల్ పీడు' మటంచు మిక్కొడవు ధీరమ్మన్యుని న్నిన్న దు
ర్వ్యాపారుల్ సభలోని కీడ్చి భవదారబ్ధాపవాదానృతా
లాపంబు ల్మొదలంటఁ గాల్చి పయి వాలాయంబు శిక్షించి నీ
పాపంబూడ్చి సతుల్ గ్రహించునఁట! తత్ప్రాగల్భ్య మూహించితే! 221

శా. 'రాపుల్ వీడఁడు వేంకటాచల' మసారస్ఫారఘోరానృతా
లాపాంతేవసదాస్యకర్కటవిశాలశ్వభ్రదుర్ద్వార్బహిః
ప్రాపత్త్రారతరావిలాంబుపృషదాపత్ప్రాపకాత్మీయవా
గ్రీపాసారపరంపరావిభవముల్ గుప్పింప కేనాఁటికిన్. 222

శా. 'డంబాల్ మానఁడు' మటంచు మిక్కొడవు ప్రౌఢమ్మన్యతాదోషమూ
ఢంబైవట్టి భవన్మనంబునకు వ్రీడన్ బుట్టఁగాఁజేయ ని
న్నుం బాండిత్యనిధాను లుండు సభయందున్ బట్టి రెట్టించి గ
ర్వంబు న్మాన్చి యనుగ్రహించునఁట! తద్వాత్సల్యమూహించితే? 223

శా. 'డంబాల్ మానఁడు తిర్పతిద్విజుఁడు' వ్రీడాశూన్యధన్యేతరా
లంబాలంబితగర్వధూర్వహదురాలాపానులాపస్వన
చ్ఛంబూకాయితనష్టధీకవికృతచ్ఛాత్రప్రచారస్వరూ
పంబుల్ బూర్తిగ రూపుమాపి దెసలం బ్రాఁకింప కేనాఁటికిన్. 224

ఉ. దవ్వులనుండి ప్రేలుటను త, ప్పెదిరించి వచింత మందులో
నవ్వులో పువ్వులో? జగమునన్ మనకబ్బెడి, నందుకై మది
న్నెవ్వగ గూరనేని విను నీచతకున్ గుదురా ప్రసంగముం
దప్పకు శిక్ష మిప్పటికి తద్దయు బొప్పెలుగట్టఁజూచితే. 225

మ. అవమానంబన వేఱెయున్నదిరా! కట్టా? చాలుమూలమ్ములన్
దవులంబోని యవాచ్యవాచకములన్ దద్దన్ బ్రసంగించుచున్
భువిసెందుం దలవంపుగల్గు సరణిన్ బోనెంచుకన్నన్ హరీ!,
శివ! రామా! కరుణించి నాసఖునెటో చీవాట్లు వైవంగదే. 226

మ. భగవంతుండవు నీవు, నీకొరులు చెప్పంగాఁ బనేమయ్యా? నే
నగుదున్ శిష్యుఁడ వేంకటేశ్వరున కీయన్నంబు తచ్ఛిష్యతా
ధిగతంబే; యటులయ్యు నగ్గురువరున్ దిట్టంగనుంకించు నా
తెగువ న్నీ వఖిలమ్మునున్ సయిచి వర్ధిల్లంగఁజేయంగదే! 227

మ. చెలి యొక్కండు పురాకృతంబు కలిమిన్ సిద్ధించె; నవ్వాఁడు రోఁ
తలకున్ దింపె నధోగతింబడితి డెందంబూఱటం గాంచ ది
క్కులి యేరీతిఁ బొకాలు నీకరుణ చేఁ గా కో మహాభాగ! యీ
తులువన్ దప్పులు సర్వమున్ సయిచి నిర్దుష్టాత్ముఁగాఁ జేయవే. 228

మ. పగఁజూపం డిపుడేని దేశికుఁడు; తత్పాదద్వయిన్ జూడఁబో
వఁగఁ బ్రీతింగని ప్రోచుఁగాని, యెటులో వాపోయి వాపోయి యే
మొగమున్ బెట్టుక దేశికోత్తముపదమ్ముల్ చూడఁగాఁబోదు నో
భగవంతుండ! యుపాయమున్న నెఱిఁగింప న్నిన్నుఁ బ్రార్థించెదన్. 229

శా. అన్నం బేరు భుజింపరే! యనృతవాగాలంబనప్రాప్తమా
నన్నం బన్నమె, సున్నమే మెఱుఁగుగాదా, దానికన్నన్ శివా!
బన్నంబందు మునింగితిన్ జెడితి నాపన్నున్ గురుద్వేషసం
పన్నున్ నన్నెటులో కృపాంబునిధవై మన్నించి రక్షింపుమీ. 230

శా. నాకన్నన్ గలుషాత్ము లెంచఁగలరో నిన్ ధ్యానించి పాపమ్ములన్
వీకన్ ద్రుంచి యధోగతుల్ గొనక నీవిఖ్యాతికిన్ సాక్షులై
శ్రీకిం దక్కక యీయిలన్ మెలఁగి పైఁజెన్నొందు లోకమ్ములన్
బ్రాఁకన్ గల్గి రటంచు వింటి; నటు నన్ బ్రార్థింతుఁ గాపాడవే. 231

మ. ఎఱుఁగన్నేరక తప్పుత్రోవలకు నన్నవ్వాఁడు పోఁద్రోచె న
మ్మొఱకుంగూడ సహించి యిప్పుడయినన్ మంచైన సద్బుద్ధికిన్
దెరువుంగా నొనరించి దుర్గతుల నందింపన్ బ్రియత్నింప కే
డ్తెఱ రక్షింపఁగదయ్య నీకరుణ మ్రందించున్ సమస్తాఘముల్. 232

శా. ఐదావేఁడులు పోవుచుండెఁ గలహం బారబ్ధమై; కృష్ణుఁడే
సోదో గెల్చునె కాని శాంతికొఱకై చూడండు; నే నింట నా
మోద మ్మింతుక లేని మోమున నసుమ్ముల్ ప్రే[illegible] నిట్లుంటి, నా
కేదరీతిని గోడు పాపఁగదె లోకేశా! కృపాశాలివై. 239

మ. అని యెంతేనియుఁ వేఁడి వేఁడి మది కాయాసమ్ము రా నిద్రకై
కొని స్వప్నమ్మున నెవ్వరో యొకరు "నీకున్ దేశికాంఘ్రిద్వయా
ర్చనచేఁదక్క సుఖంబుగల్గ దుర కాశా పాశబంధమ్ము చే
వనిశంబున్ శివు వేఁడి యేమి ఫలి? మయ్యాచార్యు సేవింపుమా! 240

మ. ఎవరిన్ ధిక్కృతి చేసి నీచముచే నిల్లైతివో, వారినే
యవివేకం బటుఁజేసి వేఁడికొను మల్లంతన్ సుఖంబబ్బు మో
ము వికాసమ్ముగఁ గొల్చుఁ బాతకశతమ్ముం బోవు లోకమ్ములో
నెవరు న్నిన్నని దూఱఁబోవరు మనోభీష్టంబు సిద్ధించెడిన్. 241

మ. "ఒకచో నొప్పియు నొంట రక్షయు" నెటుల్ యోగింతు? నీచేయు పా
తకమెల్లన్ గురుదూషణాత్మకమ కాదా? దానికిన్ దేశిక
ప్రకటాంఘ్రిద్వయసేవ మారకమగున్, ప్రాల్మాలఁ గాఁబోకు నీ
కకలంకత్వమె కామ్యమైనయెడ నాయాలోచనం బట్టుమా. 242

మ. "గురుపీడన్ జనుఁగా. కయోగ్యుఁడయినన్ గూటించి తిట్టంబనే
మిర? యోగీ! యనృతాత్మ!" యంచు నిను నమ్మృత్యుంజయుండన్నను
త్తర మెందున్నదొ? యేల యిట్లు నిరతమున్ ద్రవ్వన్, శివున్ వేఁడఁగాఁ
గరుణింపం డటఁ; వేగి వేఁడుము గురున్ గారుణ్యమున్ జూపెడిన్. 243

మ. హరుకోపమ్ము గురుండు దీర్చు, గురుకోపాటోపమున్ దీర్చ శం
కరుఁ డేమాత్రముఁ జాలఁ డీనుడి నెఱుంగన్ జెప్పె నీదేశికుం
డరరే! యాపింత మెల్లఁ బోవిడిచి "దేవా! నన్నుఁ బ్రోవంగదే!
పరమాత్మా!" యనినంతనే శివుఁడు నిన్ బాలింప నేతెంచునే. 244

మ. శివుఁడేమీ! యవివేకియే, యతనికిన్ "నా" న్నింతయున్ లేద? "మె
చ్చి వరంబాతఁడు కూళరక్కసుల కిచ్చె న్నన్ను రక్షింపఁడే?
యవివేకాత్మ" యటంచు నెంచితివొ? గుర్వాక్షేపకుం డెవ్వఁ డా
శివుచేఁ బ్రోవఁబడెన్? వధింపు మొకనిన్ జేయెత్తి యున్మత్తుఁడా. 245

శా. 'కాకం' బేమిటి? 'తీతు' వేమిటి? వృథాకాలంబుల్ బ్రలాపించి యీ
శోకం బేటికి నేఁడు? పేర్చితి వెదో శోకించి యుప్పేమగున్?
వాకుల్ జాఱితి వేడ్కెఱన్ దుదకు "దేవా! బ్రోవు" మన్నన్ శివుం
డాఁకొట్టన్ వెతవాఁడె? యింత యవివేకోద్రేకముల్ సైఁచునే. 246

మ. గురుఁడే తండ్రి, గురుండె మాత, గురుఁడే కూర్మిరాజ్యసంహర్త, దే
వరయున్ శ్రీగురుఁడే, గురున్ జగతి దేవళ్ల న్నుతింపన్ వృథా
యఱపుల్ వారు గణింపఁబోరు; చను మయ్యాచార్య సేవింపు
ర్వర పత్త్రింపుము శీర్షమెత్తికొని పాపంబెల్ల గూల్చెట్టఁగన్. 247

శా. ఈలీలన్ జనటోప్పు లేనియెడ మున్నె ట్టట్టులే దబ్బఱల్
వాలాయమ్ముగ నిల్కడన్ శిర మధోభాగమ్ము వాంఛింపఁగాఁ
నోలిన్ గాలము సర్వముం గడపి శాస్త్రోక్తప్రకారమ్ముగాఁ
బాలింపన్ జనుమీ! యమంబొ? సుకృతప్రాగ్భారమో? యన్యమో? 248

శా. నాకుం దోఁచినరీతి శాస్త్రగతికిన్ భంగమ్ము లేకుండ, ధ
ర్మైకాయత్తులు మెచ్చురీతి నకపీయాంతర్గతిన్ బట్టి నీ
శోకం బాఁగు సుపాయము న్నడివితిన్ శోధించి; నెమ్మితో ను
ద్ధికున్ బట్టక వేగ బాగుపడుమీ? దేబయ్యవై పోకుమీ!" 249

మ. ఇటు బోధించినయట్టులై నిదురమ ట్రెంకేఁజనన్ మీఁద దృ
క్పుటముల్ విచ్చి దెసల్ గనుంగొని తనున్ బోధించు నప్పూరుషుం
డట నెందున్ గనరామి "స్వప్న" మని తానద్దాని భావించి య
ప్పటి కాయోజనతోడ నుండె గురుదేవద్వేషదోషార్తుఁడై. 250

శా. లోఁ "దప్పం"దు నెఱింగి, పై కనుపు జల్లుల్ వీఁక పర్షించును
న్మాదిన్ శిష్యునెఱుంగుఁ గాక జగ, మంతస్తాపముం బట్టియే
పోఁదోలియన్ బ్రియతంత్రిగా కనుమ శంభుండాదియౌ దేవతల్
వాదం బియ్యది శిష్యశాసకముగా వర్ధిల్లఁగా కల్లెడన్. 251

ఇది శ్రీ కింకవీంద్ర.........
తిరుపతి వేంకటేశ్వర కవి ప్రణీతమ్మగు
గీరతమ్మున లోకాభిరామాయణము
సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 25 | పోంపిరివోఁగా | పొంపిరివోఁగా |
| 4 | 9 | ముందగ | ముందఱ |
| 18 | 4 | ట్టిడి | కట్టిఁడి |
| 18 | 10 | ూతుఁగూఁతల | బూతుఁగూఁతలం |
| 22 | 20 | బ్రగ్గడ | ప్రెగ్గడ |
| ,, | ,, | పాఱులు | విప్రులు |
| 26 | 27 | కురుకూలా | కురుకులా |
| 29 | 11 | కూఁతు | కూతు |
| 36 | 22 | వీకణ | వీఁకణ |
| 37 | 10 | సైపకే | సైఁపకే |

మఱియు 35 వ పుటలో మొదటి పద్యమున మూఁడవ పంక్తి చివరనున్న ‘లో’ యను నక్షరమును ‘ని’ గాఁ బఠించి నాల్గవ పంక్తి వదలివేయఁ గోరెదము.

లోకా.

# ఉపోద్ఘాతము

( ప్రథమ ముద్రణము )

---

"సుణ్యాం కష్టం గతవతి జనే పాప మభ్యాయతీతి"

'కాళీసహస్రము'

చదువరులారా !

"పుణ్యానకుఁ బోయినఁ బాప మెదురయ్యె" ననుసామెత నెఱుఁగనివారే లేరుగదా ! ప్రస్తుత మీ గుంటూరి సీమలోని చరిత్ర మంతయు నీసామెత కుదాహరణమై యుండునని తుట్టతుదకు మీరే గ్రహియింతురని మా నమ్మకము. శ్రీకొప్పరపు సోదరులు గంటకు కొన్ని వందలు చెప్పిరి, ఎన్నో వందలు చెప్పిరి, కడుఁ జూరుకుగాఁ జెప్పెదరు, లోకమున సంశయము లు పత్రికాముఖమునను, ఆప్తులద్వారమునను విని ప్రథమమున నా కాధారావిషయమున నా కొక విధమైన యక్కజమును, అవిశ్వాసమును జనించి యెక్కుడుపరి ప్రత్యక్షములోఁ జూడ వేడుక పుట్టినది. ఈ వేడుకకుఁ గారణము, నేను గూడ నాశుకవుల మగుటయు, ఐనను వీరిని గురించి వ్రాసెడి వార్తలలోఁ నెవ్వరైన సన్నివందలు చెప్పియుండకపోవుటయు, నిజముగా సోదరు లట్లు చెప్పుదురా? చెప్పుదురుగాక, అది కవన మను పదమునకుఁ దగియుండునా? అను సంశయము కలుగుటయునని యెఱుఁగునది. 'సంశయ మున్నప్పుడు మిన్నకుండక బందరుకు రప్పించి వారిని ప్రత్యక్షములోఁ జూడనెంచవలె' యని శంకింపవచ్చును. నా శంక యుక్తమైనదియే కాని నాయంశమును మాకు వ్రాసినవారిలో నొకరిద్దఱిట్టివారుగా నున్నారు. పత్రికలలో నాయూ యీ పెద్దమనుష్యులు నటించి చెప్పిన పద్యములు 'పరగుణ పరమాణూన్ పర్వతీకృత్య' అను భర్తృహరి వచనమున కుదాహరణములు కానచ్చుననుకొన్నను బరమాప్తులగువారు మాకు వ్రాయు నుత్తరము లట్టివనుకొనుటకు మన మొప్పుకొన్నది కాదు. ఆ వ్రాసినవారిలో నొకరు బందరునివాసులును సంస్కృతాంధ్రహిందీభాషావిశేషజ్ఞులును నగు, మ॥ రా॥ రా॥ కానుకొలను త్రివిక్రమరామారావుగారు. వీరు బి. యే. పరీక్షప్యాసుచేసి బందరు

నోబిల్ కాలేజిలోఁ గొన్ని వత్సరము లుపాధ్యాయపదవిలో నుండి పదపడి బి. యల్. చదువుకొనుటకు గాఁ జెన్నపురికి వెళ్లియున్నకాలమున శ్రీకొప్పరపు సోదరు లక్కడకు దయచేసియుండిరి. వీరి యాశుధారను వారు ప్రత్యక్షముగా జూచి యుత్తరమును వ్రాసిరి. వేటూరి ప్రభాకరశాస్త్రి వీరికన్న ముందే శ్రీకొప్పరపుఁగవులనుగూర్చి నుతించుచు...

"మున్నమా, తిరుపతి వెంకటేశ్వరులఁ దల్పెదఁ జిమ్మట మిమ్ముఁ దల్పెదన్"

అని వ్రాసుచ్చిన సంగతిని శశిలేఖలోఁ జదువుచుంటిమి. దీనిచేఁ గొంత విశ్వసించుటచేతనే 5 వ పుటలో నుదాహరించిన పద్యములను జెప్పితిమనియు వారిని సగౌరవముగ నాహ్వానించితి మనియుఁ బాహ్యులెల్ల నెఱుఁగుదురుగాక. ఈయాహ్వానానంతరము శ్రీరామారావుగారి యుత్తరము వచ్చినది. ఆయుత్తరమును మేము కృష్ణాపత్రికకిచ్చి ప్రకటింపఁ జేసితిమి. ప్రకటించునప్పుడా పత్రికవారు తుట్టతుద నున్న కొన్ని పంక్తులను దీసివేసిరి. ఆపంక్తులలోని యర్థము మాత్రమే మాకు జ్ఞప్తియం దున్నది గాని సరిగా నక్షరములు జ్ఞప్తియందు లేవు. శ్రీరామారావుగారు శ్రీసోదరులనుగూర్చి వ్రాసి వ్రాసి యెందులోఁ గాని 'హనుమంతునిముందఱ కుప్పిగంతులు' అను సామెత నుదాహరించి 'ఈవిషయము తమ కొక లెక్కలోనిది కాదు. జనను వారియానందమును విన్నవించినందు కన్యథా తలంపకుందురుగాక' అనునర్థము వచ్చునట్లు వ్రాసి యున్నారు. ఆయుత్తరముగూడ నిందుదాహరింపఁదగినభాగము పైవిూఁద నున్నను ఇక్కడిచే గ్రంథ విస్తరమగుటచేఁ బ్రకటింప లేకపోతిమి. కావలయువారు 1910, 1911 సం|| కృష్ణాపత్రికలు చూడఁగోరెదము. ఇటీవల రామారావుగారొకపరి చెన్నపురమునుండి వచ్చినప్పుడు కార్యవశమున మేము వారిని కృష్ణాకార్యస్థానమున కేగితిమి. అప్పుడాయన తమ యుత్తరములోని తుదియంశమును దీసివేయుటను గూర్చి చాల నిష్కర్షగాఁ బ్రసంగించిరి. అది యంతయావశ్యకమని మేము భావింపలేదు. ఏమంటిరా? ఆయుత్తరము శ్రీసోదరులయౌన్నత్యమును దెల్పుట కేర్పడినది. వారియందలి దయయో అభిమానమో యేదో యాయుత్తరమును మాచేఁ బత్రిక కెక్కించినది, అందులో మాయౌన్నత్యము కూడ నేల ప్రకటింపఁబడవలెను, తీసివేసినవారే సదాశయముతో దీసివేసినను మాకదిసమ్మతమే యయ్యెను. ఆమాటలున్నచో సోదరులు చాల గొప్పవారనియు, తి|| వెం|| కవు

లంతకన్నను గొప్పవారనియు లోకులకుఁ దోఁచు నని యే కదా! మేమభిలషింప వలసినది ఆయభిలాష మా కప్పుడే కాదు, ఇప్పుడును లేదు, దాని నటుండనిచ్చి శ్రీ మాకొప్పరపు సోదరులకును మాకును గల యనురాగసంపత్తిని గూర్చియే కొంత ముచ్చటింతము. శ్రీసోదరులను మేము ప్రీతిపూర్వకముగా నాహ్వానించిన పిమ్మటఁ గొంతకాలమునకుఁ బత్రికాముఖముగా మమ్మును గొంత భూషించుచు ననఁగా నిప్పు డెంత తీవ్రముగా దూషించుచున్నారో అంతకు ముమ్మడుఁ గధికముగా భూషించుచుఁ బెద్ద సమాసములను బెట్టిన పద్యములను వ్రాసి తుట్టతుదను వచ్చుటను సూచించిరి. వచ్చినప్పుడు వారికి గాఁదగిన సమ్మానాదికమునుగూర్చి బ్ర॥ శ్రీ॥ రావుబహద్దరు పురాణం వెంకటప్పయ్య పంతులుగారు, శ్రీ గౌరీనాథశాస్త్రులవారు, లోనగు పెద్దలును హిందూ హైస్కూలు విద్యార్థులగు పిల్లలును సాక్షులే. కాన విస్తరింపఁ బని లేదు. ఒక మనవి; జరుగని విషయము నింతమాత్రము వ్రాయుటయు నప్రయోజనమే యని మీకుఁ దోఁపవచ్చును. అట్లు తోఁచుట యుక్తమే కాని యీసమ్మానము సోదరు లిక్కడకు దయచేసినచో నిప్పుడేని జరుగఁగలదు. ఎఱిఁగియో, యెఱుఁగకో మొదటి యాహ్వానములో వారిని శతావధానమందుఁ గూడ సమర్థులని మేము వ్రాసియుంటిమి నిజ మిటీవలఁ దెలిసినది. దానింగూర్చి యీ క్రింది పద్యములు విస్పష్టముగాఁ జెప్పఁగలవు.

( 1912 సం॥ మార్చి యేప్రిల్ 3-4 సంచికల అభినవసరస్వతి నుండి. )

బ్ర॥ శ్రీ॥ జానపాటి పట్టాభిరామశాస్త్రులవారికి — తిరుపతి వేంకటేశ్వరులు నమస్కారపురస్సరముగా వ్రాసికొను విజ్ఞాపనము.

1912 ఫిబ్రవరి సంచిక యగు మీ అభినవసరస్వతిలో మ॥ రా॥ రా॥ కొప్పరపు సోదరకవులు మీ పేర వ్రాసిన యుత్తరమును బ్రకటించి యున్నారు. అందు సుంతయేని మా ప్రసక్తితో నవసరము లేకున్నను పే. "తిరుపతి వేంకటేశ్వరు లట్లు మముఁ దిట్టి" అని యొక తుట్ట మాపై మోపియున్నారు అందు మీఁద నీ క్రింది పద్యములు వారినిగూర్చి వ్రాయవలసి వచ్చినవి. వీనిని మీ పత్రికయందుఁ బ్రకటింప వేఁడెదము.

ది 5-4-12 తిరుపతి వేంకటేశ్వరులు.

# హితోపదేశము

---

మ. అకటా! 'మమ్మును దిట్టి చెప్పె'రని నేఁ డాత్మన్ విచారించు మీ
వికలత్వంబది మా మనంబు మిగులన్ వేధించెడిఁ; న్యాఁడు తీ
రికదా! చక్కఁగ నుండలేక యొకరో పేర్చేప మీయంత మీ
రెకసక్కెమ్ములకుం గడంగితిరి; మేలే కొప్పరంపుం గవుల్! 1

శా. పశ్చాత్తాపముఁ జెల్మిసంగులకు మీ భావంబు నొప్పంగనా;
దుశ్చిత్తత్వముఁ దోఁచి, రప్పు డియమున్ దోఁపంగఁ బోదయ్యె; సం
తర్కాంచల్యము బైట వేసితిరి చింత ల్వేయ సేమియ్యెడన్?
నిశ్చింతంబుగ నుండ కిప్పు డిది చన్నే కొప్పరంపుం గవుల్! 2

మ. కలదేమో కలపించుఁ దృష్టిపడ కెక్కాలమ్మునన్ లేని కొ
త్తలకున్ యత్న మొనర్చి యిప్పు డిటు చింతామగ్నులై సాటె మ
మ్ముల దూషించిన నేమి లాభ? మెటు తప్పున్ బమ్మెరావారి? లేరు మి
మ్ములఁ బేర్కొనిరో నారి నే యనుగు డిప్పుం గొప్పరంపుం గవుల్! 3

శా. మాకుం గావలెనేమి మీ గొడవయున్ మాన్యంబు మీ కైతయున్?
లోకుల్ లౌకికులు, సత్య మెట్టో యఱుబుకున్ లోలోన నేనాఁర లే
వాకు లౌకిక లేని శక్తి గను నెవ్వాఁ? డెందు నిర్హేతు వీ
చీకున్ జింతయుఁ దెచ్చుకొంటి రిటు లేస్సే! కొప్పరంపుం గవుల్! 4

మ. మొగమేనిన్ గనకుండఁ బత్రికను మము న్మున్నెమ్ము విఱకంపి పే
ర్మిగ నన్ జేసితి మంతలో నిముడ కేరేఁ బేర్కొనం జేయ నే
తగవో యెల్ల రసీ యవందగిన దంతం దెచ్చికొన్నారు పూ
ర్తిగ మీలోపమె మీకు నష్టి నొడఁగూర్చెం గొప్పరంపుంగవుల్!

శా. మీవారందఱుఁ మమ్ముఁ దిట్టినను నెమ్మి న్మిమ్ము భూషించినన్
మావారందఱుఁ మిమ్ముఁ దిట్టినను గర్విన్ మమ్ము భూషించినన్ 6
జేవ ల్లేనివి వచ్చునే యకట! సుశ్రీ మించు సామర్థ్య మే
మీ, వాసిన్ జెడు టేమి? వేసాకరి బల్మిన్ గొప్పరంపుంగవుల్!

మ. దిగుమంచున్ బలువంచి జెప్పుదురు 'జిద్దీ' యంచుఁ దాళమ్ములన్
దగ వాయింతురు, లాభమేమి? చెడువా ర్దారేరునుంగాను మీ

పరిపాటుల్పని సేయ వూర కెవరో వాయించు తాళమ్ములా
స్థిరకీర్తిన్ ఘటియించు? నార్తి యది గాదే కొప్పరంపుంగవుల్. ౧౪

శా. మామాటల్భపదంతరంగమది సంభావించు శాఖాస్థులే
మేమో "వ్రాయుఁడు వ్రాయుఁ" డంచు రటుగాదే నేటికో వ్రాసినా
రామై * "విన్నప" మంచుఁ బద్దెముల నాహా! దానికేమింకఁ బై
మీమాటల్ నెఱవేర్చుకొం డెపుడొ నెమ్మిన్ గొప్పరంపుంగవుల్.

శా. బీరంబున్ వహియింపఁ బోరక మదిన్ బీడించు దైన్యంబు పైఁ
బాఱం ద్రోయుకుఁ డన్ని లోపములు 'పర్వా రే' సమర్థించు; లో
నారాధింపుఁడు దానివ్యాసములు మీ కార్యత్వముం గూర్చు మీ
సారం బయ్యది హెచ్చు సేయు నిఁక నిచ్చల్ గొప్పరంపుంగవుల్.

మ. కవితాపత్రికవారు సాయపడు పోకల్ద్రోఁపఁగా వచ్చె మీ
రవలోకించితిరో, మతేమొ, యిపి రెం డవ్వారిగా మమ్ముఁ ది
ట్టి విశేషంబుగ మీకుఁ గీర్తి యిడు; వాటింపుం డు ధైర్యమ్ము మి
మ్మృవురా! తిట్టితి మేమి? యెట్లనెద రయ్యా! కొప్పరంపుంగవుల్.

సీ. పడఁదిట్టి యెల్లెట్లొ పత్రికల్నించు ధీరవరేణ్యుఁడగు పోచిరాజుగారు
జంకుఁ గొంకును వీడి కొంకిరివ్రాఁతలు వ్రాయఁగల్గిన కూచిరాజుగారు
కలనిజం బెఱిఁగియుఁ గల్ల వ్రాఁతలు వ్రాసి ప్రకటించు నలమాచిరాజుగారు
తాటాకుపడియున్న మాటలో నెఱిఁగి బీరమ్ము వ్రాసెడి వేచిరాజుగారు

తే గీ. మఱియు శర్మలు లోనగు మాన్యులు మిముఁ
బూజ్యులను జేయుటకె సుఁడీ పూనినారు
చింతపడకుఁడు వెసఁ గార్యసిద్ధి గలుగు
మమ్ముఁ దలపెట్టి మొఱలింక మాను టొప్పు. ౧౫

మ. అల శ్రీరాముని శ్రీనివాసుని నితాంతానాథనాథున్ మహో
జ్జ్వలు లక్ష్మీరమణున్ సదా మదిని సంభావింపుఁడా మూర్తి మి
మ్మల రక్షించుఁ బొనర్చు లోపపువిధమ్ముల్ దెల్పు మాన్యత్వ మి
మ్మల నిప్పించెడి నే మెఱుంగుదుమె యే పున్నెమ్మొ నే పాపముల్.

---

* ఇందునుగూర్చి ఉత్తరరంగము చూడఁదగు

ఉ. ముచ్చట దీరఁగా బిరుదముల్ ప్రకటించుట కేమిగాని, యే
రచ్చనొ నూఱుమందికి భరం బనుకో కవధానపుంగ్రతిక్
బొచ్చెము లేక సల్పి పయిఁ బూనుఁడు; లేక "శతావధాను" లం
చచ్చరము ల్లిఖించికొన నందుఁజూఁడీ! ఘృతకోశసామ్యముల్.

ఉ. పేరున నున్న గౌరవము పిప్పి యొనర్పకుఁ డయ్యలార! మీ
రూన్నజనిపించి కైకొనుఁడు; నూటికి నొక్కఁడ నేనిఁ జెప్ప కా
పేరుధరించు టొప్పగునె? పెద్దలఁ గన్గొనుఁ డేరుగాని బీ
యే, రహిఁ బ్యాసుగాక బిరుదంబును బొందిరె మీరెఱుంగరే! ౨౧

క. కవిసింహులు లోనగునవి, యెవరో మనయందుఁ బ్రీతి నిడవచ్చు; నెటు
ల్గవిత శతానకులేక "శతవధాను" లటన్న బిరుదు హాల్పితిరొక్కో!

క. నిజమాడిన నిష్ఠురమని, ప్రజలాడుట యొఱిగి వ్రాయుచలసెను మాపై
రజముం గుప్పక పేర్మిఁ దగు జవాబుం జెప్పఁడయ్య! కొప్రంపుఁగవుల్.

ఇట్లు,

తిరుపతి వేంకటేశ్వరులు.

దీనిపై సోదరు లిచ్చిన 'జ్ఞానోపదేశము' అను ప్రత్యుత్తరము కడు నీచముగానున్నది. నీచత కేమి, కోపవశమున వ్రాఁతయందు కొండఱకు క్షీరకంఠులకు చొరలుచుండును. ప్రధానాంశమున కుత్తరము కూడ నందు లేదు. దానినుండి కొన్ని నికృష్టోక్తులను, 95-96 వ పుటలలో నుదాహరించి యుంటిమి, చూడఁదగు. శ్రీ సోదరులయొక్క నికృష్టోక్తిపూరితములగు పద్యముల నేమి తత్పక్షీయుల నికృష్టోక్తులను దెల్పు "పండితబ్రువలక్షణాదికము" నేమి యిందుఁబూర్తిగా నుదాహరింప నేరని మమ్ము వారును వారును గొండొక క్షమించి మా గుంటూరి సీమకుఁ బ్రత్యుత్తరముగా వ్రాయ నెంచితి మని సోదరులు 15 ఫిబ్రవరి 1913 సం॥ కృష్ణలోఁ బ్రకటించిన (1) "జల్లిసీమయందొండె (2) నారాయణాస్త్రమందొండె నలంకరించికొని యశ మార్జింపఁ గోరెదము. మే మీ గ్రంథమున వ్రాసిన యంశములలో నేవేని ఖండింపఁ దగిన వున్నచో నందే సహేతుకముగా ఖండించి చూపినచో నవి సరియైనవియే యైనయెడల రెండవకూర్పులోఁ దప్పక కృతజ్ఞతాపూర్వకాభివందనములతో దిద్దికొంచున్నారము. మఱియు నీసోదరుల జ్ఞానోపదేశమునందలి నికృష్టసంభాషణమునకుఁ బలువు రేవఁబడి మా పేర వ్రాసియుండిరి. అందొక బి. యే. సీనియర్ వ్రాసినదిమాత్ర ముదాహరించుచున్నారము.

(1)... "కొన్నిరోజులక్రిందట "దర్బారు" పత్రికయందు జ్ఞానోపదేశము అను పేర సోదరులు 15 పద్దెములను వ్రాసిరి. తాము వానిని చిత్తగించియే యుందురు. పిచ్చికూతలు తప్ప వేరు లేవు. రాజసముఖమున జెప్పిన పద్దెములనుండి "బొంగు బజాన" యనుదానిని గైకొని వారి పద్దములో నిమిడ్చినారు. చెన్నపట్టణములోను గుడివాడ తాలూకాలోని ప్రతి గ్రామమందును ... సాష్టాని ఏవ శేపది రూప్యములనిచ్చిన గ్రహించిన విషయము వారలకు జ్ఞప్తికి వచ్చినదికాబోలు. వారి... చెంబు ఇప్పటికి నిండకపోగా ఇతరుల దూషించుట వారి యహంభావమును వెల్లడించుచున్నది ... బ్ర॥ మానాయనగారు శం॥ లక్ష్మీనారాయణ శాస్త్రిలగార్లు గూడ దానిని చూచినారు చాలా రుడుకుగా నున్నది... కడపటి పద్యము గూడ పిచ్చివ్రాత. ఏమకాలమున వీరియంత పండితకవులు గాని శతావధానులు లేరుగాబోలు. దేవులపల్లివారు, తాతాచార్యులు, శ్రీనివాసాచార్యులు వీరి యంత గొప్పవారు కారు కాబోలు ఆహా! ఏమి— వీరివీరి కవనతత్వము (ఆశు) బాగుగ వెల్లడింపవలెను. స్టాంపులో, నన్న పురవర్ణనలు సభావర్ణనలు విచారత్రయందుగూడ పఠించుటగదా. నేడు గౌరీకళ్యాణము, రేపు సీతాకళ్యాణము మరునాడు రుక్మిణీ కళ్యాణము, ఏమి కవి యాశుధార......"

---

(2) "...తరువాయి పేపర్లుగూడ తెప్పించి చూచినాను. అవి మిక్కిలి రుడుకుగానున్నవి. దానిలోనె "సత్యనిరూపణము" క్రింద చాలా ప్రల్లదము లున్నవి. తాము సెలవిచ్చినట్లు వీరికి జవాబులు సీమగ్రంథములో లోకము చూచుగాక..." (సత్యనిరూపణము 51 వ పుట 4 పేం, అధస్థానదేవతది)"

---

ఇట్లే యీపద్యములలోని నీచోక్తులకు నేపపడి యస్మచ్ఛిష్యులలో నిరువురు బాలకవులు కొన్నిపద్యములు పత్రికకంపి మఱికొన్నినాళ్ళకు మావద్దకు వచ్చి "మేమిట్లు చేసితి"మని చెప్పిరి. దానిపై నది మన మెఱుగకున్నను జగమట్లు భావింప దని తలంచి వారి నట్లు చేయదగదని మందలించుచు వెంటనే యాపద్యములు ప్రకటింప వలదనియు నాపిల్లవాండ్రు కేవలామాయికులనియు నిప్పుడు జరుగుచున్న వాదము నియోగిత్వవైదికత్వప్రయుక్తముగాఁ దుదకు బరిణమించి యున్నదనియు నట్టిస్థితిలో! నీమాశిష్యులు నియోగిబాలకులై స్వశాఖవారు పట్టినపట్టు బాగు లేదని వ్రాసిన వ్రాఁతలవలన నియోగులలోఁ గొందఱకు భారముగాఁదోఁచ వచ్చు ననియు వీరిప్పుడు బాలురగుటచేత మాయందలి గురు-

భక్తినే ప్రధానముగాఁ జేసికొని మమ్మును వెనుకవేసికొని యేవో పద్యములు వ్రాసియున్నారు వానింబట్టి వీరిని స్వబంధువులు కొందఱు మిక్కిలిగ దూషింపవచ్చునని మాకుఁ దోఁచుచున్నది గాన నయ్యవి ప్రకటింప వలదనియు మేము వ్రాయునవసరమున నా బాలకవులు 'తా మిప్పు డిట్లు వారించినలాభము లే' దనియు 'మే మీ పద్యములప్రతి నొకదానిని శ్రీ కొప్పరపుసోదరులకుఁ గూడ నంపి యుంటి' మనియు వచించిరి. పిమ్మటఁ జేయునది లేక మిన్నకుండవలసి వచ్చినది. మాతో నేసంబంధమును లేని సుదర్శనిపత్రికాధిపతులవంటి నియోగిశిఖామణులు మమ్మును బురస్కరించుకొని వ్రాసినను నయ్యది మమ్ము ఘటింపదు. గాని మాశిష్యులలోఁ జేరిన నియోగిబాలకులు మమ్ముఁ బురస్కరించి వ్రాయు వ్రాఁత లెంతన్యాయ్యములైనను నయ్యవి మాకుఁ బ్రతిష్ఠాకరము లగుటలోఁ బూర్తిగా సంశయింప వలసిన వగు టట్లుండఁ బైపెచ్చపకీర్తికిఁ గారకములగు నని మేము బాగుగా నెఱుఁగుదుము. ఈవిషయ ముత్తరతరంగమున విశేషించి చర్చింపఁబడెడి, ప్రకృతమీ చిన్నినియోగిశిష్యులు మాసోదరులను మందలించుటకై చెప్పిన పద్యములు చదువరులకై యుదాహరించుచున్నారము.

(1912 సం॥ జూలై 7 వ సంచిక అభినవసరస్వతీపత్రికనుండి)

మ. అకటా! కొప్పరపుంగవీశులు! వృథాయాసంబు మీ కేటి కా
శుకవిత్వంబునఁ బ్రజ్ఞయే గలుగ వచ్చుఁ గాక, యద్దానికే
సుకవుల్ తిర్పతివేంకటేశ్వరులు పూజ్యుల్ పండితుల్; వారి నూ
రక దూషించుట కీర్తిదంబె? కవులారా! సుంత యోజింపుఁడీ!

సీ. తిరుపతివేంకటేశ్వరులు సభకుఁ బిల్వ నోరమిమై మిన్నకుండుకతన
శివరామశాస్త్రి వ్రాసినయట్టి యుత్తరమ్మునకు జవాబు నీయనికతమున
నేనువ్రాసిన లేఖకేనిఁ బ్రత్యుత్తరం బొసఁగకయె మీరలున్నకతన
బూతుకవిత్వ మెప్పుడు పత్రికనింపి ప్రకటించునట్టి లోపమ్ముకతనఁ

గీ. కొప్పరంపుఁ గవీశ్వరుల్ గొప్పవెల్ల
మృష యటంచును మాకందఱికిని దోఁచె
నిజము కాదేని గెల్చి నిర్నిద్రకీర్తిఁ
గొనుఁడు మీకీర్తిఁ జాటించుకొనుఁడు వినుఁడు.

శా. మీకుం గల్గిన పాండితీగరిమయున్ మీప్రజ్ఞ సర్వంబునున్
లోకాతీతము, చెప్ప నేటికి? కేఁకఁ జాలున్ గాని యార్భాటముల్

మీకుం జెల్లునె? యేరు విన్న నగరే? మీబోంట్లు కవ్వారి వి
ద్యాకౌశల్యమునందు గెల్చుటకు శక్యం బౌనె? యేనాఁటికిన్.

మ. ఒకడై వాచాటపుఁబత్రికన్ నిలిపి యేమో నోటికిం దోఁచిన
ట్లకటా! వ్రాయుచునుండ్రు బూతులను, విద్యాకౌశలంబున్న వా
రికిఁ జేయందగుకీర్తియే? బుధులు గర్హింపం బ్రయత్నింపరే?
కుకవుల్ వోయెడి దారిఁ బోయినను మీకున్ దుర్యశం బబ్బదే!

చ. అనృతమటంచు సుంత మనమందున నెంచక, పత్రికన్ లిఖిం
ప నెటులు చేతులాడె విను మానిసు లెల్లరు నవ్వ 'వాక్ పలా
యనులయి' రంచు, మేము వినినట్టినిజంబునె యిట్లు వ్రాసినన్
విననివి కల్ల వ్రాయుటొకవింతయె? యక్కట! కొప్రపుంగవుల్.

చ. తెలుఁగున సంస్కృతంబున నతిప్రతిభామహిమమ్ముఁ జూపి యి
మ్ముల సుకవీశ్వరుల్ సతతముం బొగడన్ గనమ్ము నెప్పి కీ
ర్తిలతను నాటినట్టి కవిధీరులఁ దిర్పతివేంకటేశులన్
గెలిచెద రంచుఁ జెప్ప ధరణిన్ మిము నమ్మెడి నెట్టు లుందురే?

శా. ఔరా సాహస! "మెండుగండికవులారా" యంచు శంకింప క
వ్వారిం దిర్పతివేంకటేశ్వరులఁ బిల్వం బాడియే మీకు? ని
స్సారంపుం బదముల్ రసంబు చెడఁ గూర్చన్ మాత్రమే నేర్చు మీక
వారిం దెప్పెద రేమి యాగడము? ధీరమ్మన్యపంశాగ్రిణుల్.

ఉ. "మీరు శతావధానమును మేలనఁ బండితులెల్లఁ జేసియు
న్నారలె పూర్తిగా గురుజనంబుల మ్రోల" నటంచు మిమ్ములన్
వారడుగంగ దానికి జవాబిడుటల్ పడఁదిట్టుటొక్కొ? యే
వారలు విన్నఁగాని నగుబాటగుఁగాదొకో? కొపత్రిపుంగవుల్.

చ. ఇలఁగల సత్కవీశులు మఱెందఱొ తిర్పతివేంకటేశులన్
గెలువ యతించి, వారలను గెల్చుట శక్యము కాదటంచునన్
దెలిసి తదాది వారికి నతి ప్రకరం బొనరించుచుందు రా
తెలువులకన్న మీ తెలివితేటలు మిన్నలె? కొప్రపుంగవుల్.

ఆ. వె. "ఊరిపీడవచ్చి దారిఁబోయెడివారి మీఁదఁ బడిన" దనెడిమాదిరిగను
దిట్టె బానపాటి పట్టాభిరామకా, స్త్రులనుగూడఁ దిట్టఁదొడఁగినారె!

మ. సుకవుల్ తిర్పతివేంకటేశ్వరులు హెచ్చుం బ్రజ్ఞఁ జూపించి వారి
యు కవిత్వంబున నొక్క పద్యమునకున్ యోజింపఁగాఁ బోలఁ జా
లక పోవుంగద మీకవిత్వ మదియెల్లన్; దీనికూర్పుండి యూ
రక శ్రీతిర్పతి వేంకటేశులను దూఱన్ జేటు వాటిల్లదే!

మ. 'కవిచూడామణు' లంచు వారలను లోకంబెల్లఁ బూజింప వా
రి పధానమ్ముఁ గవిత్వవైఖరియు మీరే చూచియున్ మిన్నకుం
డి విశేషంబుగ 'మేము సాయమును సంధింపంగ మీకే పరా
భవముల్ జేకురవయ్యె' నంచు లిఖియింపం జెల్లునే పత్రికన్?

మ. కలరే, వీరలకన్నఁ బ్రస్తుతము సద్గ్రంథంబులన్ బేర్ప్రతి
ష్ఠలు పైకొన్న కవీంద్రు లొండొరులు? నిచ్చల్ మీకుఁబూజింప న
ర్హులుగారే? యిది మీకెఱుంగనిదె? యేకం జెప్పరే? మంచిచె
డ్డల యోజింపక యిట్లు వ్రాయుదురె? కట్టా! కొప్పరంపుంగవుల్.

సీ. తిరుపతివేంకటేశ్వరుల గెల్చుట ముఖ్యమేయని చెప్పు రామేశ్వరుండు
తగనియోగమును నిల్పఁగ యతింతమటంచు నేకీభవించు కోటీశ్వరుండు
న్యాయవాదినటంచు నన్నికల్లలను వ్రాయించినయట్టి లక్ష్మీశ్వరుండు
మిమ్ముఁ గెల్పింప యత్నమ్ముఁ గావించి యెంతెంతొ కష్టించు నేకేశ్వరుండు

గీ. నిందలును గూడి సాహాయ్య మిచ్చుటకును
సిద్ధమై యుండ గెల్వ ప్రసిద్ధ మనుచు
నెంచఁ బోకుఁడు మీయాట లింక సాఁగి
రావు ముమ్మాటికిని సాగి రావు రావు.

ఉ. చాలుదురేని మీరలు వెసన్ జనుదెంచి వివాదమంతయున్
దేలుచుకొండు పెద్దలు సుధీమణులెల్లరు మధ్యవర్తులై
గ్రాలఁగ; లేనిచో గెలువరా దలవారల, నంచు నండుఁ దే
మూలనొ, పైకవచ్చి చెడుపోకలఁబోయిన ముప్పుమూఁడెడున్

ఇట్లు బుధజనవిధేయులు

వడ్లమన్నాటి నృసింహశర్మ

పింగళి లక్ష్మీకాంతము.

ఈ పద్యములతో సోదరులు పూర్తిగా వెనుకతగ్గినవారైరి గాని సోదర కవులకుఁ జాలదగ్గఱబాంధవ్యముండుటయే కాక యాంతరంగికత్వస్నేహసంబంధమున్న యొక యష్టావధానినామధారి మాశిష్యులఁ బడఁద్రిట్టుచుఁ గొన్ని పద్యములు దర్బారులోఁ బ్రకటించెను, ఆపద్యములు వ్రాసినతఁడు ప్రకృతము లక్ష్మీవిశిష్టుఁడని చేవ్రాలువలన గ్రహింప వలసియున్నను కొంత కాలము క్రిందట నితఁడు హనుమద్విశిష్టుఁడుగా మాకుఁ బ్రత్యక్షమయి యున్నాఁడు. ఇట్లు ప్రత్యక్షమై చిరకాలమైనను దైవవశమున నీయంశము స్మృతికి రాఁగా నితనిపద్యములుకూడ శతావధానసారములోఁ గనఁబడియెను, పిమ్మట నీతఁడు వేమవరాగ్రహారావధానసభలో నగుపడెను. ఫలానా, అని మాలో నొకరికిఁ దెలిసినపిమ్మట నష్టావధానిగారిని సమీపించి, "నాయనా! హనుమత్కవిగారు క్షేమముగానున్నారా?" అని ప్రశ్నింపఁగాఁ బాపమాతఁడు వెలవెల పోవలసినవాఁడయ్యెను, మేము గుర్తింపఁజాలమను నమ్మకముతోఁ బేరుమార్చుకొనినట్లభినయించి వ్రాసినవ్రాఁత బయలగుటచే నతనికట్టి యవస్థ తటస్థించియుండును. ఇందేమి యక్కజమును గనరాదు. అతఁడనుకొన్నట్లుగాక యీ గుట్టు దైవవశమున మాకెఱుక పడినతోడనే "మర్మజ్ఞం న ప్రకోపయేత్" అనునార్యోక్తికుదాహరణమై యాయవధాన సమయమున నక్కడనుండియు నుండనివాని తెలుఁగున నెట్లోయడఁగి మడఁగి కాలక్షేపమొనర్చెను, మధ్యమధ్య వీలైనప్పుడెల్ల నితనితో నతిప్రీతిగా మేముసంధించుచునే యుంటిమి కాని యితని మోము వెలవెలవాఱుటతప్పఁ దొంటిరీతిని బ్రకాశింపఁ జాలదయ్యెను, ఈపకుఁ బశ్చాత్తాపసూచకమగు సంభాషణ కొంత వెల్లఁబుచ్చుటచే నెట్టివ్రాఁత వ్రాసినను నితఁడుగూడ యోగ్యుఁడే యని మామనస్సాక్షికి వచ్చుచున్నది. రాక చేయవలసినదేమి? ఇంతకన్న యోగ్యులీ వివాదములోఁ గలుగఁజేసికొని వ్యవహరించు వారిలో మాకు దొరకుట దుర్లభము గానఁ దటస్థించినంతలో వారి వారిమంచిగుణమునే మేమింముఁ గైకొని మాకు దాపరించిన యీవిద్యాకలహము యోగ్యులతోడనే వచ్చిన దని చదువరులకుఁ దెల్పి సంతసించుచుందుము. మీరును మమ్ము ననుగ్రహించి యట్లే విశ్వసింపఁ బ్రార్థితులు. 51 వ పుటలో నుదాహరించిన వారిపేరులలో నీయన చేర లేదు. ఆభాగ మచ్చుపడునప్పటికీయన బయటికి రాలేదని యెఱుంగునది. బైట రాకుండుటకు హేతువు పూర్వమీయన మాయెడలఁ గనఁజేసిన యాచ్నాదైన్యదోషమే కాని వేఱు కాదు. యాచ్నా దారిద్ర్యమూలకము, ఆదారిద్ర్యము నిట్లు ప్రాచీనకవులు వర్ణించియున్నారు.

(మృచ్ఛకటికప్రథమాంకమునుండి)

శ్లో॥ దారిద్ర్యాద్ధ్రియ మేతి హ్రీపరిచితః ప్రభ్రశ్యతే తేజసో
నిస్తేజాః పరిభూయతే పరిభవాన్నిర్వేద మాపద్యతే
నిర్విణ్ణ శ్శుచ మేతి శోకపిహితో బుద్ధ్యా పరిత్యజ్యతే
నిర్బుద్ధిః క్షయ మేత్యహో! నిధనతా సర్వాపదా మాస్పదం॥

ఇప్పటికే యీ యష్టావధానిగారిని గూర్చి విస్తరించి వ్రాసినట్లు చదువరులు తలంతురు గాని యింకను వ్రాయవలసిన యంశములు కొన్ని మిగిలియున్నవి వీరిని గలసికొని తుట్టతుదకు వేమవరములో మాలో నొకరు మాటలాడునప్పటి యంశములను జాల మంది పెద్దమనుష్యులు వినియున్నారు. అప్పు డీయన చెప్పిన ప్రత్యుత్తరాదికమును వారి వలన నెఱుఁగఁగోరెదము బ్రహ్మశ్రీ సోమాలూరి కోటయ్యగా రప్పుడా నికటమునఁ గలరు. ఈ యంశమునకు వారిని బరాతముచూపుచు నీయష్టావధానిగారు నలక్ష్మికవులు గాక పూర్వము చెప్పిన యాచ్ఛా పద్యములను శతావధానసారము (ప్రథమ ముద్రణము) 125-126 వ పుటలలోఁ జూడఁదగు నని చెప్పుచు నలక్ష్మికత్వ మప్పటిపిమ్మట రచన నొండొక చూపుచున్నారము.

(16 అక్టోబరు 1912 సం॥ దర్బారు పత్రికనుండి)

చ. జరపిరె కొప్పరపుఁగవులు సత్సభయందు శతావధానముం
చరుదుగ వ్రాసినారలుగదా? మును జేసితిమంచుఁ బొత్తముల్
గరువముతోడఁ ద్రిప్పుటయెకాని భవత్ప్రియు లాత్మశక్తి యం
దఱుఁ గనఁ బూర్ణమైన యవధానముఁ జేసిరె ప్రస్తుతస్థితిన్. 17

గీ. "తా మునింగినయదె గంగ తాను వలచి
నదియె రంభయటంచ" నునట్టి మాట
ధరణిఁ దిరుపతి వేంకటేశ్వరుల కన్నఁ
గవులు లేరను మీయందె గాంచనయ్యె. 25

గీ. తగని యోగంబునిల్ప యత్నంబొనర్చి
ననుమఁ గోటీశుఁ దెగడి నిజాన్వయంబు
దూఱువారలలోపలఁ జేరి సుకవి
వరుల నిందించు టేల మీవంటివారు? 27

ఉ. శ్వానము, కోడి, పేడి, వ్యభిచారి, ననామకు, నూరపంది, ము
ష్టైనపతిన్, సురాపుని, నిజాన్వయదూరు, నశౌచు, సూతకున్
బీనుఁగు, మాల, గార్దభము, పిల్లిని, నూసరి, నంటి యెవ్వఁడే
స్నానముసేయఁ డాఖులుని సత్యము త్రోయఁగలేదు, వహ్నిలోన్.

రుక్మాంగదచరిత్ర

సజ్జనవిధేయుఁడు
పోతరాజు లక్ష్మీనృసింహకవి, అష్టావధాని

స్థాలీపులాక న్యాయముగాఁ జూపిన యీపద్యములలో 17 వ సంఖ్య గలపద్యము వలన శ్రీసోదరు లవధానము నెఱుఁగ రని యొప్పికొన్నట్టు తేలుచున్నదిగదా! వారితోపాటు మేము గూడ నెఱుఁగనివారమే యని లిఖించినాఁడు, లిఖించుఁగాక, అందులకు మేము వేఱుగ శ్రమచేయ నక్కఱలేదు; 'సహృదయాః ప్రమాణం'. ఇఁక నీ లక్ష్మీవిశిష్టుని వ్రాఁతపై మాశిష్యులు మా యెఱుకమీఁదనే యిచ్చిన ప్రత్యుత్తరపుఁ బద్యములన్నియు నుదాహరించుచున్నారము.

(నవంబరు 16 వ తేదీ 1912 వ సం॥ దర్బారు పత్రికనుండి)

ప్రత్యుత్తర లఘు ఖండన

మ॥ రా॥ రాజశ్రీ పోచిరాజు లక్ష్మీనరసింహాష్టావధానిగారికి.

ఆర్యా!

తమరు దర్బారు పత్రికాముఖముగాఁ బ్రకటించిన వ్యాసమును జూచితిమి. కవితా రసాభ్యున్నతికి మిగుల సంతసించితిమి. కాని మీ వ్రాఁతలో న్యాయవాదులు గర్హించు నంశములు స్ఫుటముగాఁ గలవు. అవి ప్రకృతము మాత్ర ముపేక్షించి తక్కిన వానిలోఁ గొన్ని ముఖ్యాంశములకు మాత్రము జవాబు నొసఁగెదము:—

మీరు మమ్ము "నిజాన్వయదూరుల" నుగాఁ బరిగణించి కొన్ని నికృష్టోక్తుల నాడియున్నారు. ఇందలి సత్యా సత్యముల నొక్కించత చర్చింతముగాక మేము మనయన్వయమును దాఁటితిమనుటకు మీరిచ్చిన యాధారము "తగని యోగమును నిల్పఁగ యతింతమటంచు నేకీభవించుఁ గోటీశ్వరుండు" అను వాక్యమేకదా! ఇందు మీరు యోగమును నియోగముగాఁ జేసినారు. అది

మాకభిప్రేతమగుఁ గాక, కాకపోవుఁ గాక, అంతమాత్రమునకే నిందయేమున్నది? ఇంతలో మేము నిజాన్వయదూషకుల మగుదుమా? ఇఁక మమ్ము రుక్మాంగద చరిత్రములోని పద్యము నుదాహరించి నికృష్టతమమగు తిట్టులను దిట్టు తాము నిజాన్వయభూషకులా? చక్కనిబుద్ధితోఁ దిలకింపుఁడు. ఏదో విధమున నియోగపదము మావచ్చియు రాని కవిత్వమునందు విఱిగినంతనే మేము దూషకుల మగు నెడల బుద్ధిపూర్వకముగా వేరొకయర్థములేని "పీనుఁగు" లోనగు నికృష్టోక్తులను నియోగులమైన మాయెడల నుపయోగించు మీరు నియోగభూషణులై యుద్ధరించువారా? కానిండు. మీకట్లు భగవంతుఁడు తోఁపించినప్పుడు మేమేమి చేయఁగలము? మీరనిన మాటలను బట్టియే మీరు వృథాభిమానులని తెలియుచున్నది.

చ. మఱియొకటాలకింపుఁడు ప్రమాదపుమాటలు గట్టి పెట్టుఁ డ
త్తఱి సభ సేతుమంచును వృథాగఁ బ్రగల్భములేరు వ్రాసి పె
వ్వరు వెనుదీసి "రాజ" యని వ్రాయఁగఁ జేసిరి, మీకె యుంగరే!
"గరుపపువీస" మన్న నుడిగ్రుచ్చిన పద్యము తప్పు లేవొకో!

క. మిమ్మిటకుఁ 'మీకవులఁ, దెమ్మని వ్రాయంగ' వ్రాసితిరొకో మీరుఁ
మమ్మును మాగురువర్యుల రమ్మని; యౌరౌర! యేటి వ్రాతలు చెపుఁడీ?

మ. చరణంబుల్ విడనాడి కొన్నిటను బ్రాసస్థానముల్ గొన్ని తొం
దరలోఁ బాడొనరించి కొన్నిట యతిస్థానమ్ములన్ మార్చి య
క్షరముల్ గొన్నిటిమధ్యమన్య దిగమింగఁ నేర్చియున్నట్టి కొ
ప్పరపుఁ వారల యాశుధారకవితా వ్యాపార మేపాటిదో ?

ఉ. గంటకు రెండునూర్ల కధికంబుగఁ జెప్పిన నేమి లాభ! మ
న్నింట నొకానొకందును గణింపఁ బ్రశస్తరసాతిహృద్యమై
యుంట నభస్సుమంబు, మఱియొక్కెడ గంటకు నూటెఱ చెప్ప నూ
ఱింటఁ బరీక్ష సేయఁగ మఱిన్ విరసంబులు దోఁప వంతగన్.

ఉ. మమ్మును గొప్పరంపు కవిమాన్యులనుఁ బిలిపించి మావధా
నమ్ముల మాకవిత్వపు గుణమ్ములనుఁ దిలకించి; తారత
మ్యమ్ముల నిర్ణయింపఁగల యట్టిరసజ్ఞుల ప్రోలనున్న స
త్యమ్మును వెల్లడింపు మవధానవిధానకుశీలవాగ్రణీ!

శా. అంతో యింతయొ దేశికోత్తముల పాదాబ్జమ్ములన్ గొల్చి మే
మంతేవాసులమై మెలంగుటను మా కబ్బెన్ గవిత్వమ్ము; మే
మాంతర్యమ్ములలో నవధానములఁ జేయంగోరుటే కాని యొ
క్కింతేనిన్ బడదయ్యెఁ గోరికను మీరేఁ దీర్పుఁడయ్యా! యికన్.

చ. తిరుపతి వేంకటేశకవిధీరులు మీరలు కోరుచున్న మీ
పురమున కేగుదెంచెదరు పో! రయమొప్పఁగఁ; గాని యక్కటా!
పొరిఁబొరి వచ్చి మీపురికిఁ "బుల్లయ వేమవరంబు" పోలికన్
మరలిన నేమిలాభ మని మాకును మీకును సందియం బటన్.

క. తిరుపతి వేంకటకవిధీ, వరు లరుదెంతురు తమపురవరమునకును మీ
ర్జరిగించినసభ; జరిగింపరేని మీయూరు వచ్చువారలె వీరల్!

ఉ. రమ్మనినారు మీపురవరమ్మునకున్ మము మా గురూత్తముల్
సమ్మతి చూపవచ్చుఁ గొనసాఁగినచో సభ మంచిదే కదా!
మమ్మును బిల్చి మీరు సభ మానక చేసెదరన్న మాకు మీ
నమ్మక మేమి? కానఁ దగునమ్మక మిం డరుదెంతు మెయ్యెడన్.

క. వీరినిడీకొనఁ గొప్రిపు, వారికి శక్యంబె? యకట! పంచాననమున్
బోరికిఁ జీరు నెహరిణ మయారే! యిదియేమిచిత్రమయ్యా! చెప్పుఁడీ.

ఉ. సున్నయె సంస్కృతంబు, పరిశోధనసేయఁగఁ దెల్గుభాషలో
నున్న ప్రవేశ మయ్యదియు నొక్కరవంతయె; సత్కవిత్వమం
దున్న రసప్రసార మదియున్ లవమే, యిటువంటివారు పే
రెన్నిక గన్న సత్కవుల నేటికి నేఁటికి దూఱుచుందురో!

శా. పాండిత్యమ్మదియుండఁగావలెఁ గవిత్వప్రౌఢవోద్దండుఁడై
యుండన్ గావలె నాశుధార కవితావ్యూహమ్ము ఛేదింప శ
క్తుండై యుండవలెన్ వధానమున నెంతో ప్రజ్ఞచూపన్ వలెన్
లెండీ! యేగతిఁ గొప్రిపుంగవుల గెల్పింపన్ బ్రయత్నింతురో.

ఉ. వారవధానమున్ జలుపువారలు కారనుమాట కుత్తరం
బీరు లిఖించుచో సరిగనే లిఖియించిరి; "దొంగజందమే"
వారును వీరుఁబూని రనువైఖరి తేల్చితి రంతె చాలు ను
న్నా రెది దొంగజందెమొ వినన్ వచియించెడి ప్రొడలెందఱో.

క. వ్రాయవలసివచ్చిన నె, న్నే యుక్తులుగలవు; నాఁచు నీళ్లకుఁ దిగులా
చాయ మఱిమాట మాటకుఁ, బాయక తెగులౌటమానవలసెఁ జుండీ.

ఇట్లు బుధజన విధేయులు,

పట్టమన్నాటి నరసింహశాస్త్రి.

పింగళి లక్ష్మీకాంతం.

ఈపద్య ప్రకటనానంతరము సభంగుఁజేచి ప్రతిపక్షు లేవిధమైన యుత్తరమును నొసంగలేదు. పిదప నీ యిద్దఱిలో నొకకవికి బెజవాడ వెళ్లినప్పుడు మ॥ రా॥ రా॥ పాటిబండ వెంకటరమణయ్యపంతులవారియింట శ్రీజెల్లంకొండ రామారావుగారు కనుపట్టిరఁట! అక్కడిప్రసంగమును దెల్పు నతని యుత్తరముదాహరించుచున్నారము.

"... తరువాత మఱికొన్ని పద్యములు చెప్పితిని అపునప్పటికి 3 గంటలైనది. రమారమి 190 లేక 200 పద్యములవఱకు నైననఁట. ఎల్లవారును మిగుల నానందించిరి. తరువాత నేను శ్రీ పాటిబండవారి యింటికి మ॥ రామారావుగారిని జూచుటకుఁ బోతిని. వారి యింటిలో నొప్పగిప్పవారి యొక్కయు మన యొక్కయు స్మరణయే తప్ప మఱియేమియు లేదు. నే నేగునప్పటికి రామారావుగారు ... పాఠముచెప్పుచుండిరి. నేను కవిత్వము చెప్పగా చూచినవారు నొకరో యిద్దరో యుండిరి. మఱియొక చిన్నవాఁడు "గీరతమేగుదెంచెఁ దమకీరితిఁ బూరితిజేసె" నను పద్యమును పత్రికనుండి చదువుచుండిరి. మఱి యొకరు గీతము చదువుచుండిరి అప్పుడు నేను రామారావుగారికి నమస్కారము పెట్టితిని. అది వారు గ్రహించినట్లు తోచదు, కూర్చుండుమని కూడననలేదు. నేనే కూర్చుంటిని, తరువాత నొక వృద్ధు నా పేరును నింటిపేరును నడిగి తెలిసికొని మీ రేమి చదువుకొనినారని యడిగెను. కాలేజీలో చదువుచున్నానని చెప్పితిని. సంస్కృతమేమి చదివితిరని రామారావుగారడిగిరి. ఏమియు చదువలేదని చెప్పితిని. మీరు వ్రాసిన పద్యములు సంస్కృతపదభూయిష్ఠములుగ నున్నవే కారణమేమి యని యడిగిరి అందులకు నేను మిన్నకుంటిని. ఆపద్యములు మీరు వ్రాసినట్లుగా నభిప్రాయపడినారు. గుంటూరుసీమ తయారైనదా యని రామారావుగారు నన్నడిగిరి. అగుచున్నదని చెప్పితిని. మీ రాశుకవిత్వము గంట కెన్నిపందలు చెప్పెదరని యడిగిరి. నాది వందల బేరము, గంటలబేరము గాదని చెప్పితిని. రామారావు

గారు చాల యసూయాగ్రస్తులై యున్నట్లు నాకు పొడకట్టినది ... నాదర్బారు పద్యముల మీద నేమైన జవాబు వచ్చినదా? వచ్చినట్లైన నాకు తెలియ జేయుడు"

......" బెజవాడ (చేవ్రాలు)

ఉత్తరములో వ్రాయలేదు గాని శ్రీ వెంకటరమణయ్య పంతులవారి పిల్లవానితోఁ జేసిన ప్రసంగము మఱికొంత యున్నది. అది "న్యాయమైనను స్వశాఖావ్యతిరిక్తముగా నెన్నఁడును వ్రాయఁగూడ"దను నంశమును మాత్రము తెల్పెడిని. అది యీ చిన్నశిష్యుఁడు చెప్పఁగావింటిమి. శ్రీ రమణయ్యపంతులు వారిప్పుడేని యథార్థముకన్న బంధుత్వాదిక మెక్కువ కాదనియు దానినిబట్టి చరించి వారి కొకప్పుడు చిక్కు వచ్చినను శాశ్వతకీర్తి గలుగవచ్చుననియు నెఱిఁగి విద్యకును శాఖకును సంబంధమే లేదని బోధించువారుగాఁ బరిణమించినచో నెక్కుడు లోకోపకార మొనర్చినవారగుదురని హెచ్చరించుచున్నారము. ఇంత పరిశ్రమ పడి మేమీ గ్రంథమును రచించుటకు ముఖ్యఫలము నియోగివైదికులు సహోదరులు గాన వీరి కీవైషమ్యములును శాఖాపవాదప్రసంగములును దగవని తీర్మానించుటకే కదా? మా పరిశ్రమలో నెన్నవ వంతుగాని శ్రీ పంతులవారొనర్చినచో నది కోటిగుణితమై యీ గోలను ఎగ్గించఁగల దని మా నమ్మకము. ఇట్టితరుణమున వైదికులలోనున్న కుమార్గులను వైదికులును నియోగులలోనున్న కుమార్గులను నియోగులును మందలింపవలయునే కాని వారిని వీరును, వీరిని వారును మందలించినచో నది ప్రయోజనకారి కాదని శ్రీ పంతులవారి హృదయమునకు రాక యుండు నని మేము తలఁపము. వారు పెద్దలు, విశేషజ్ఞులు. అయినను దమకన్న ననేకవిధములఁ జిన్నలగు మ॥ రా॥ రా॥ కృత్తివెంటి గంగరాజుగారీవిషయమున నొనర్చుచున్నయంత గాని శ్రీ సుదర్శనీ పత్రికాధిపతిగారును, కార్లేలియన్ పత్రికాధిపతిగారును లోనగువారొనర్చుచున్నంత గాని తుదకు పడ్లమన్నాటి నరసింహము లోనగు నియోగి బాలకవు లొనర్చుచున్నంత గాని ప్రయత్నము చేసి యొనర్పకుండుట మిగుల శోచనీయము. ఇఁకనేని మాయుద్యమమునకు శ్రీ పంతులవారు చేయూఁత నొసఁగి నియోగివైదికులకుఁగల పరస్పర వైషమ్యములను వారించి పుణ్యము గట్టికొందురని నమ్ముచున్నారము. చదువరులారా! ఇందులకు సంబంధించునవియే యైనను బ్రసంగాంతరములచే మీకు విసుగు పుట్టించుచుంటి మేమో యని సంశయించుచున్నారము. శ్రీ పంతులవారిని గూర్చి వ్రాసిన ప్రసంగము

వారు పెద్దలగుటచే నీగ్రంథమునకు మంగళదాయకమని మా యభిప్రాయము. "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని" అను మహాభాష్యము సహృదయు లెఱుఁగనిది కాదు. మరల శ్రీ సోదరులకును మాకును సంబంధించిన యను రాగ సంగ్రహములోనికిఁ జిత్తముంతురు గాక. సానురాగముగ మా చేఁ బ్రార్థింపఁ బడియు సోదరు లెందుకో బంపరు గాలేదు. తీరిక ననుసరించి రా దలఁచిరని మేము తలఁచుచుంటిమి. కాని లోకులలో వేఱుగాన భిప్రాయములు బయలు వెడలఁ జొచ్చినవి. ఒకరిద్దఱు ప్రాజ్ఞులు మాతో నన్న మాటలుకలవు. అవి యటులుండుఁగాక. గుంటూరిలో సోదరులను బ్రత్యక్షముగాఁ జూచు పర్యంతమును లోకుల యాశయమును మేము విశ్వసింపకుంటిమి గాని, చూచినపిమ్మట విధి లేక విశ్వసింపవలసినవారమైతిమి. మే మింకను గుంటూరికి నెలదినములకే గుదు మను నప్పటికి వీరిప్రతిజ్ఞనుగూర్చి వేఱొక తెలుఁగు వ్యాసమొకటి యభినవసర స్వతిలోఁ బ్రచురింపఁబడినది. కాని యయ్యది కూడ మేము మొదట విశ్వసిం పనివారిలోనివారమే, ఆవ్యాసమునకు మున్నొక పెద్దయుత్తరము మాకు వచ్చినది. అందుఁ జేవ్రాలు లేదు. శ్రీసోదరుల యాశుకవితావిధానమునుగూర్చి వ్రాయుచు 'సెట్టివారికిఁ దామెట్లు ప్రశంసాపద్యములు పంపిరి' యను నభిప్రాయమును వ్యంగ్యముగాఁ దేల్పఁజొచ్చినది. ఆయుత్తరమునుగూడ మేము విశ్వసింప నేలేదు. మాకుఁ బ్రత్యక్షములోఁ జూచినపిమ్మట మాత్రము వీ రేదో విధముగఁ బద్యము లల్లినను బ్రాజ్ఞులగువారిచే నంగీకరింపఁ దగినస్థితిలో లేరనియు నదృష్ట వంతులు గాన నచిరమ్మున యశమందగనియు నిప్పుడే గొలఁదికాలము గురు శుశ్రూష చేసినచో వీరికి సహజముగనో యభ్యాసవశముననో యలవడిన యీ ధార మంచిస్థితికి రావచ్చునేమో యనియును దోఁచనై యీయంశము బందరులో వారికి మనము చేయఁదలఁచుకొన్న సన్మానము జరిగినపిమ్మట మనయందు వారికి తగినంత విశ్వాసము గలిగినయనంతరము వారి యంతరంగమున కెక్కునట్లు బోధింపవలయు నని యనుకొంటిమి. కాని యది యంతపట్టును నాఁగక మ॥ రా॥ రా॥ యేకా రామయ్యపంతులవారి విందుప్రసంగములో మాలో నొకరి నుండి వెలువడవలసిన దయ్యెను. అప్పుడటనున్న పెద్దమనుష్యులలోఁ గొందఱి పేళ్ళను (9) వ పుటలో నుదాహరించితిమి. కాని యుదాహరింపఁదగినవారు పలువురుగలరు. అందులో నొకరు తద్గృహాధిపతులు శిష్టాహనుమచ్ఛాస్త్రిగారు వేఱొకరు జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు, ఇంకను నెండఱో విద్యార్థు లగు పెద్ద లక్కడఁగలరు, వారిపేళ్ళను మే మెఱుఁగని హేతువున నందుఁ జేర్పకైన

మైతిమి. ఈ ప్రసంగమునుగూర్చి వ్రాసిన గ్రంథభాగములో శ్రీకొప్పరపు సోదరులకు గురువరులగు బ్ర॥ శ్రీ॥ రామడుగుల రామకృష్ణశాస్త్రులవారిని వ్రాయ మఱచితిమి. ఇటీవల వేమవరము వెళ్ళివచ్చినప్పుడు శాస్త్రులవారు ప్రసంగవశమునఁ దా మా సమయమున నున్నట్లు చెప్పిరి. శ్రీశాస్త్రులవారూరక సోదరకవులు మాపైఁ బ్రయోగించుచున్న ప్రల్లదములకు మిగులఁ జింతించువారిలో నొకరు. వీరు శిష్యులను బ్రతిపక్షమునఁ బూర్తిగా మందలించిరి. అందుకువారు వ్యతిరేకులు గాలేదఁట! కాని మే మిప్పుడు పరవశులము కాన నిట్లునటింపక తీరదని గురువుల కుత్తరము నిచ్చిరఁట! ఈయంశము నింతకు మున్నుదాహరించిన మాహితోపదేశము 13 వ పద్యములో నొకింతుక సూచించితిమి. దీని మీఁదనే వారి జ్ఞానోపదేశములో నీక్రింది పద్యములు పుట్టినవి.

"శా. ఏకోవంచనఁ జేసి దింపి కలహం బేర్పాటు గావించి రం
చూరుం జేరనులేని యాగుఱున కోహో! మే మెఱింగింపుటల్
భీరుం డాతఁడు మీ చెవిం గొడుమటల్, ధీరత్వముం బూని మీ
రీకీతిం దెగియించి వల్కుటలు నెంతే నవ్వు పుట్టింపవే!

శా. తప్పంబల్కితినంచు రేపితివిగాదాయంచు దుర్వారమా
ముప్పం దెచ్చితి వంచు వేమరలుపం బుత్తెంతురే యంచు మా
యొప్పున్నెమ్మది నెంచి యొండొరులు లోలో గ్రుద్దుకోఁబోరె తాఁ
జెప్పండే! భవదీయజీవసముడౌ శిష్యుండు మీచందముం".

వారిగురువులను మేము సాక్షులుగాఁ జూపిన సోదరులు మాశిష్యులను సాక్షులుగాఁ జూపిరి. ఇది మాటకుమాటవంటిదో నిక్కమో విజ్ఞులే గుఱితింపవలసియున్నది. శ్రీరామకృష్ణశాస్త్రులవారు మాకన్న సర్వవిధములఁ బెద్దలు. ఐనను వారేకారణముననో చిరకాలమునుండి నమ్ము మిక్కిలిగాఁ బ్రేమించుచుందురు. మాపద్యములలో ననేకములు మాకు రానివికూడ వారికిఁ గంఠపాఠముగా వచ్చును. ఇట్టి శాస్త్రులవారు తమ శిష్యపరమాణువులు మమ్ము మిక్కిలిగా దూషించునప్పుడు చేయవలసినదేమి? పాపము! అశక్యవిషయ మగుటచే వారూరక విచారింపవలసినవారైరి. వారివిచార మిప్పటికేని మాసోదరుల హృదయమునకు రాకపోదు గాని యీ మా సోదరులు కారణాంతరమునఁ బ్రకృతోపయుక్తమగు రామకృష్ణమత మను నొక క్రొత్తమతమును సమ్మానింపవలసిన

వారైరి. ఆమతము నామసామ్యమునుబట్టి గురుమతముగాఁ దోఁచుచున్నను నిజమునకు గురువుల కించుకయు సమ్మతమైనదికాదు. ఈనూతనగురుసిద్ధాంతములో గురువును దిట్టుట లోనగునవి ముఖ్యాంశములు, అవి వీరు పూర్తిగా నవలంబించి నచో నెట్లుండునో కాని యిప్పటి కంతగా నవలంబింపమి స్తోదగులేకాక మేము గూడ ధన్యులము. ఏమందురా ? మాతో వివాహ కొని తెచ్చుకొనుటచేఁ గదా ! రామకృష్ణుల శృంగభంగాదికమును వీరు గురుపదముగాఁ బట్టకొనివచ్చినది. ఆపట్టుట పూర్తిగాఁ బట్టస్థిరముచో వీరికి గురుమాహాత్మ్యముకూడ నలవడవలసినదే కాని యింతవఱకు నది విశేషించి తటస్థించినట్లు కానరాదు. స్వల్పము గణింపఁ దగదుగదా ! శ్రీసోదరు లసత్యము బెల్లముగానో లేక యుప్పుగానో వాడుక చేయుచున్నారు. ఇది చాలఁ దప్పిదమును బెద్దదోషము గాదనువా రుండరు. ఈయంశము వేమవరపుసభలోని పేరో యసత్యగము సంఘటితమని చెపబోంకుచు నిటీవలఁ గృష్ణలోఁ బ్రచురించిన యుత్తరములవలనే తెలిసికోవచ్చును. దీనిం గూర్చినవిస్తరము వేమవరపు శతావధానపీఠికలవలన నెఱుఁగఁదగు. నాటి యసత్యము నాత్మగౌరవమును నిల్పుకొనుటకును బంధుప్రీతికిని వహించుచుంటచే దానివలని దోషము నంతగా బొందవలసియుండదు. మాయాపచ్ఛక్తిని వినియోగించి శ్రీసోదరులు సర్వవిధముల ధన్యులే యని సమర్థింప యత్నింతుముగాక ! పరప్రత్యయనేయబుద్ధులగుటచే వీరివిషయమున మాసమర్థనమును లోకమును విశ్వసించుఁగాక. ఇఁక వీరి కవితాప్రాశస్త్యమును గూర్చి కొండొక వ్రాసెదము.

శ్లో. ద్విజ బాలః కరీరశ్చ యంత్రితోఽయంత్రితః క్రమాత్,
నరేంద్రమౌళిమానంచ నర్తకీపద్ధతిం వహేత్.

ఈశ్లోకము సత్క్షత్రియులును శ్రీ పెద్దాపురపు సంస్థానాధిపకుటుంబము లోనివారును నిరంకుశసంస్కృతభాషాసాహితీధురంధరులు నగు శ్రీరాయ జగపతిరాజుగారు రచించిరి. వీరిచరిత్రము నట్లుండనిచ్చి శ్లోకతాత్పర్యమును విచారింతము. వస్తువెట్టిదైనను శిక్షలేనిచో నది యపహాస్యాస్పదమగు ననునది యిందలి ముఖ్యాంశము. శ్రీసోదరుల కవితాధారయు నశిక్షితమగుటచేఁ బైనుదాహరించిన వెదురుబొంగువలె నంబరమార్గము నంటఁజూచినను దానికి శిక్షితుల కవనమునకుఁ గల గౌరవమును బ్రాజ్ఞులీయనేరరు. శిక్షితమగు కవితా

ధారయో, కొండొక వక్రప్రసారియైనను బల్లకీఁ బొంగువంటి సన్మానమునకుఁ బాత్ర మగు ననుట నిర్వివాదాంశము. ఇట్టిస్థితిలో వారు పోవునట్లు విద్వత్కవి ప్రపతిఁ బొందుట కెన్నఁడుగాని యొప్పికొనునా ? ఈయంశము ఆయా యీ పుటలలో దిఙ్మాత్రము తెల్పియే యుంటిమి; మఱియు నుత్తరార్ధములో దీని నింకను విస్తరించి తెల్పితిమి. కావునఁ జర్వితచర్వణ మొనర్పక ముఖ్యాంశము మాత్ర మిటఁ దెల్పుచున్నారము. ఈ సోదరకవులను బహిష్కరించుకొని వ్రాయు శ్రీయుతులు మమ్ము నెన్నియో నికృష్టోక్తులతో దూఱుటయే కాక "ఆశుధారా శూన్యులగుట లేదా ?" అనికూడ వ్రాయుచుందురు. ఆవ్రాఁతలకేమి, వారిలో ననేకులకుఁ దలుపును ద్వారబంధమును లేకయే వ్రాయుపాటుక కలదు. కాని కాలాంతరమున బైటికి రాఁజాలని శాఖాభిమాని శాస్త్రిగా రొకరు వీరికిఁ బద్దెములు వ్రాసి యిచ్చియుండుటచే నిందుఁ జాలమందికి ధారశుద్ధముగనే యున్నట్లుగూడఁ గన్పట్టెడిని గాని, అసత్యములు దుండగములును మాత్రము మితిమీఱియుండును. అవి దిఙ్మాత్ర మచ్చటచ్చటఁ జూపఁబడుచునే యుండును. దానినట్టుంతము, ఏకర్మము నెఱుఁగని సోదరులతో పాటుగా మే మిప్పుడు క్రొత్తగాఁ బరుగిడుదుమని యేల చెప్పవలెను ? పరుగిడఁగలుగుదుమా, లేదా ? యనునది విషయాంతరము, ఆతప్పులకును ఆదోసములకును నొప్పికొన్నచోఁ బరుగిడవచ్చును. ఇది పఱికె చిరకాలాభ్యాసవశమున నిది దోషము, ఇది గుణము, అను సంశయము మనమున నాటికొని పోయినది. ఆసంస్కార మీజన్మమునఁ గాదుగదా, వచ్చు జన్మమునకుఁ గూడ నశింపదు. అట్టిచోఁ దప్పొప్పు లని యెంచక తిరుపతి వెంకటేశ్వరులు పరుగిడవలె నని యనుకొన్నచో నిట్లు జరుగవలెను. ఎట్లనఁగా ? ఏలేని ప్రవకాణమున వారి కిప్పుడున్న గుణదోషవిచారణమును శాస్త్రజన్యజ్ఞానమును బూర్తిగా నశించి కవితాధార యనునది నామమాత్రావశేషముగా మిగిలి వీరు తిరుపతివేంకటేశ్వరులు కారు, యెవరో, అను తెఱఁగునకు వచ్చి

"సోఽప్యన్య ఏవ భవతీతి విచిత్ర మేతత్"

అను శ్లోకపాదమున కుదాహరణము కాఁగలిగినయుత్తరక్షణమే వారనిమించి పరుగిడఁ గలరు. ఉన్నశక్తులలో నూటికిఁ దొంబదివంతులు తగ్గించుకొనుటకు యత్నింపవలసినదే కాని యాపరుగునకై యిప్పుడభ్యసింపవలసినది లనమును నుండఁబోదని ప్రాజ్ఞులెల్ల నెఱిఁగినదియే కాన విస్తరింపవలసిన యావశ్యకత లేదు

కాని యీపరువు ప్రాజ్ఞమహాకవిసమ్మతము కాదు. కావుననే భట్టుమూర్త్యాదు లెంతవఱకుఁ బరుగిడుట యుక్తమో యంతవఱకే యవధి నేర్పఱిచికొని "ఘటికాశత గ్రంథకరణధుర్యత" దనుకనే యంగీకరించియున్నారు. ఇందలి గ్రంథ శబ్దము పారిభాషికమని తెలియఁదగు ఈసంకేతము పండితు లెఱుఁగుదురు. మఱియు వేఱొకవేళ్య "ఘటికార్ధనిర్మితశతశ్లోకీ" అని వ్రాసుకొనియున్నది. కాని దానిపోకడకూడ మన సోదరులపోకడ కప్పయో చెల్లెలో కాక తప్ప దని మాయాశయము. ఆశుత్వముకూడ ఘటత్వాదికమువలెనే యేదో కొంతలోఁ బర్యాప్తము కాఁదగినదియే కాని ధారావిశ్రాంతిశూన్యముగాఁ బ్రవర్తింపఁ దగినది కాదు.

శ్రు॥ దశాఽస్యాం పుత్రాన్నాధేహి

అను శ్రుతికి, దశపుత్రులు, దశపుత్రికలు, అనునర్థము చెప్పి యిరువది మందివఱకు నాజ్ఞను గనుపఱిచినవారు ప్రస్తావశ్యకఘోషాసంప్రదాయము ననుసరించి పండలకొలఁదిగ నాజ్ఞ నేల యీలేదో నిజ్ఞులకుఁ దక్క నితరులకుఁ దెలియదు. ఆశుగశబ్దవాచ్యత్వము మలయమారుతమునకును రుష్యమూఁగరలఁ గల్పించి పుల్లాకుల లోలోపల నిడికొనిపోవు తలనొప్పి గాలికిని నవిశేషముగఁ జెల్లినదియే యైనను మలయమారుతమువలెఁ దలనొప్పి గాలి వర్ణ్య మగుట కవిసమయసిద్ధము కాదు. మితి మీఱినచో నాశుధార యాశుఘోష యని చెప్పఁదగి యుండును. వేయేల? వీరిపరుగు న్యాయ్యమైనది కాదనుట కెన్నియేని యుదాహరణము లీయ చ్చును. ఇది కవితాపదమార మగుట కే సందేహమును లేదు. ఏకర్మము నెఱుఁగని గాయకాభాసుని స్వరకల్పనకును సుశిక్షితుని స్వరకల్పనకును భేద మెంత యుండునో ప్రాజ్ఞు లెఱుఁగరా? గుంటూరిలో వీరు స్వశక్తి పరశక్తి శూన్యముగఁ గాలుద్రివ్విన తత్తఱపా టంతతోనే వెనుదీయఁ బడినదిగాని, లేనిచో నీయంశము లెల్ల సభ్యులకు వాక్రుచ్చి వీరి పరువును గూడ ననుకరించి చూపి యిది తప్పుడు మార్గమని ప్రాజ్ఞులచే నొప్పించియే తీరుదుముగాని తజ్జ్ఞులు వీరికిని మాకును సభ యనుటకే యంగీకరింపకున్నారు. అది యీ క్రింది యక్షరములవలన విస్పష్టమగును.

(చావలి వెంకటకృష్ణయ్య బి. యే. సీనియర్ గారి వ్యాసమునుండి.)

"సభావిషయమున మేమన్నమాట లప్పటికి ఇప్పటికి జన్మాంతమువఱకును నిల్పుకొనవెంచి యొక రిరువురు పండితులకడకు కవులకడకు నేగితిమి. సావధాన

లై వినుఁడు ... అయ్యా! తమరు జడ్జీలుగా నుందురా అంటిమి. దానికి వారు తిరుపతి వెంకటకవులేడ! కొప్పరపువారేడ! కొప్పరపువారికి కవిశబ్దమే వర్తించదు... కలక్టరు, బిల్ కలక్టరులకు నెంత తారతమ్యము కలదో' ... అటులనే తిరుపతివేంకటేశ్వరులకును కొప్పరపువారికిని భేదము కలదు. ... అని యేకరువెట్టి ఆ సంగతి మాకడ నెత్తవలదని మమ్మును బంపిరి. అయ్యా! సభ చేయించ నెంచికొనినందులకిట్టి మర్యాద జరిగినది. ఎట్లయినను మీ విరోధము మాపుట మాకు ముఖ్యావసరము కనుక మరల నేరకడకైన బోయి మొఱ పెట్టుకొందుము గాని......"

వైపంక్తులు శ్రీ సోదరులు వేమవరాపధానానంతరము తోలిన పాపపుబండి యుత్తరములలోని యంశములలో సభనగూర్చిన ప్రసంగమునకు వారి నాహ్వానింప నేగినమాగురులలో నొకరు కృష్ణాపత్రికాధిపతులకంపిన "రోషావేశసాంత్వన" వ్యాసమునుండి కైకొనఁబడినవి. విస్తరమన్యత్ర చూడఁదగు. ప్రాజ్ఞశిరోమణులిట్లు నిరసించుచున్నను నపత్రపాశూన్యులుగ మా సోదరులు "మావైరులు, మా శత్రువులు" అని సారెసారె మమ్మును జేర్కొనుచుందురు.

శ్లో॥ వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే"

అట్లల నేల? వీరిశత్రుత్వ మిట్లు సమర్థింతము గాక 'అదృష్టపిశాచన్యాయమున' మాకు వారు మిత్రులు మేము వారికి శత్రువులమును గాఁగూడదా? లేక యీ పంచతంత్రవాక్యములవలన నేని కాఁగూడదా?

"శ్రోత్రియభ్రష్టక్రియాణాం (మూర్ఖపండితానాం) సజ్జనదుర్జనానాం

దీనింబట్టి యిది సహజవైర మనుకొన్నను దప్పు లేదు. తప్పులేకేమి, వీరిశత్రుత్వమిత్రత్వముల కించిత్కరములగుటచే నివి రెండును బరిత్యాజ్యములేయని శిష్టులనకమానరు. ఇది యిటులుంతము, సోదరుల యేహ్రీతకును నర్థముండదు.

(ఫిబ్రవరి 15 వ తేది 1913 సం॥ కృష్ణాపత్రికనుండి)

"...మఱియు మా శత్రువులు (గుంటూరుసీమ) అను నొక పుస్తకమును రచియించుచుండిరఁట. అందు మా వివాదాంశముండునఁట! అది బయలు వెడలుటకుఁ బూర్వమే యీ సభ జరుగవలయును. అది బయలువెడలుటకుఁ బూర్వమే సమకూర్పలేనియెడల మేము వ్రాయుచున్న (1) జల్లిసీమ (2) నారాయణాస్త్రము అను రెండుగ్రంథములును బ్రకటింపఁబడిన పిదప సమకూర్పవలయును. ఆ మధ్యకాలములో సభయగుటకు వీలుపడదు. అని చెప్పితిమికదా!..."

ఈవ్రాఁత కర్థమేమైనఁ గలదా? గుంటూరిసీమ ప్రకటనము సభ కేమి యపకృతి చేయునో కదా! జిల్లిసీమవ్రాతఁకు సభ యేల ప్రతిబంధింపవలయు నో? "కొబ్బరిచెట్టు, మాడగడ్డి," ఇంతకన్నఁ బై వాక్యముల కర్థముకన్పట్టదు. కన్పట్టనేమి? గుంటూరిసీమ గుట్టు బైటఁబెట్టును గదా, పైనిసభయెట్లు ? ఏమి గతి?

(ఫిబ్రవరి 15 వ తేది 1913 సం॥ కృష్ణాపత్రికనుండి)

"...ఈక్షణముననైనను, ఈదినముననైనను, లేక ఈజన్మాంతమువఱ కెప్పుడైనను సరియె, వచ్చి మాశత్రువుల మీసములను దీయింతుము..."

ఈపంక్తులను కృష్ణ యవిచారితరమణీయములుగాఁ బ్రకటించినది. గాని యాంధ్రపత్రిక పత్రిత్రిపాటి కామేశ్వర వ్యాసపు దెబ్బను దిని యుంటచేఁ గొంకి జంకినట్లు నటించి నిరసించినది. ఈవిషయము, వేమపరపు శతావధాన పీఠికలో విస్తరించి చూడఁదగు. ఎంతటి తెల్వియో చూడుఁడు, వివాహమునకు రమ్మనఁ బునస్సంధానమునకే సిద్ధపడు మోటు పెద్దపెండ్లికొమరుని దలపించు నీవాక్యము లెవ్వరు రోయకుందురో గదా? సభకు వచ్చినతోడనే జరుగఁదగినది మీసములు గొఱిగికొని పోవుటయే గాఁబోలు ? 'గారెల బూరెల' సామెతగా, నెంత తంతు జరుగవలెనో కదా ! అప్పుడు యీయక్షరజ్ఞానమాన్యులకు జరుగఁ దగిన తంతేమి యున్నది? వచ్చి, వచ్చినవెంబడినే మీసములు పట్టికొని వీలైనంత వఱకు వచ్చినంతవఱకు సంగ్రహించుకొనుటయె కర్తవ్యము. ఔరా ! మీసపు రోమములు ! మాసోదరులు వీనికెంత మాహాత్మ్యమును గల్గించిరి. మతకర్త యగు మహమ్మదుగారి మీసపురోమములను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవే! దీని సంప్రదాయము తజ్జ్ఞులవలన నెఱుఁగఁదగు. ఈయుపభ్రంశపుఁ బ్రల్లదముల నీభారత మడఁచివైచుఁగాక.

"ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగరాదు"

(విరాటోద్యోగములు చూ) భీష్మాచార్యునివంటి జగజ్జేత కీ తెల్వితేటలు తగుఁగాని మనక్షీరకంఠుల కెట్లు తగును ? అక్షరజ్ఞాన మిట్లుండఁగాఁ గొందఱు తలతిప్పులమారులు తగుదు మని యేవో వ్రాయుచు సోదరుల పరువు సహజమైనది కాన తెచ్చిపెట్టుకొన్న ధార గల తి॥ వెం॥ కవుల కనుకరించఁ దగినది

కాదని శాఖాభిమానమును వెల్లడించుట చూచి మాకెంతో యక్కజము గలుగుచుండెడిని. అవురా! పనిపడినను రథము దిగి పాఱు నుత్తరుని పరువు విజయునకశక్యమే యగునేమో కదా? అతఁడు శత్రువులకు వీఁపు చూపక కదా పరువిడవలసివచ్చును. పైవారు "మెయిల్ రన్నరు" వలెఁ బనిపడి నేర్చుకొన్నను వానిపైనుండు నధికారులు పరుగెత్త నేరరనియు నందుచే వారికి వీరు లోచ్చనియుంగూడఁ జెప్ప సాహసింతురోటు! ఏమీ! తారతమ్యజ్ఞానవిలసనము? ఇట్లు వ్రాయువారి వ్రాఁత కొంత వెలగలవైనను వీనినిగూడఁ బాటించి మాశిష్యులలో గొందఱు ప్రాజ్ఞు లనిపించుకొనుచున్నవారే తమ పాండిత్యము నొక్కరకు దిగద్రావి మాయాప్రవరాఖ్యులవలె నటించుచు నీయాశుఘోష కలవాటు వడిరి. అందుఁ బలకాదుల నందిరి. ఈయుపవడినవారిలో మొదటివాఁ డవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి. ఇతఁడు, నితనికొక వ్రేలువిడిచిన మేనల్లుడును, మా కేకలవ్యప్రాయశిష్యుఁడును నగు నింక నొక సుకవియును నిండులకు సభ లొనర్చుచున్నారు. ఆయంశ మీక్రింది యుత్తరముల వలనఁ దెలియ నగ్యెడిని.

నెల్లూరు　　నమోగురుభ్యః　　30-10-12

(1) అవ్వారి సుబ్రహ్మణ్యనామ్నశ్శిష్యస్య శిపతాతిర్వ్యజ్ఞప్తిః శ్రీరాయప్రోలు సుబ్బరాయేణ మమభాగినేయనేన సాకమహం కావలి పట్టణ మాగత్య తత్రాష్టావధానం ఏకస్మిన్నహని ఆశుకవితామన్యస్మింశ్చ ప్రచాలయామిస్మ, పౌరా భృశంతోషితాః; యైః కొప్పరపుకవ్యోరాశుకవితా శ్రుతా, నష్టావహిత్వాగిదం పురం ప్రావిశావ అత్రచ ప్రథమ మాశుకవితా తతోఽష్టావధానమితి ద్వేమిలితే పరశ్వదో, భవిష్యతిచైకా, ఆశుగచనయా ఘంటాత్రిశతీ నిర్వాహ్యా, ఏవమత్రపంచషేషు ప్రదేశేషు ప్రవర్త్యయితుకామా చరావః సర్వథా గురూణా మాశీః ప్రమాణం.

బుచ్చిరెడ్డిపాలెం　　8-11-12

(2) మేము నెల్లూరిలో రెండు సభలు జరిగించి యీబుచ్చిరెడ్డిపాలెములో కొప్పరపుకవులను పెద్దగా గౌరవించి గంటలువేసిన పట్టాభిరామరెడ్డి యను దాతయున్నాడని విని యిచ్చటకు వచ్చినాము. ఇక్కడకువచ్చి ఆరురోజులైనది. నిన్న నిచ్చట సభ జరిగినని ఆశుకవన మల్లబడుచున్నది. ప్రతిపాద్యము ద్రౌపదీవస్త్రాపహరణముఘంటాత్రిశతినియమముగాఁ జెప్పుచున్నాము. యిట్టిస్థితిలో"...

ఈ సుబ్రహ్మణ్యశాస్త్రి వేమవరములో నాశువును జెప్పి యున్నాఁడు. సభ్యు లానందించిరి. ఇతఁ డితరపత్నిజులు కలవాఁడు. కాన నప్పుడు కొండొక దొసఁగులు పొసఁగినను సమర్థించుకొనఁగలఁడు. ఏకర్మము నెఱుఁగని సోదరుల కీకాలుద్రవ్వు ప్రసంగము లెందులకో? ఒప్పు తప్పన్న నేరికిని నశక్యమే. వీరి ఒప్పు తప్పన్నను సమస్యేతరమగు గతి గానరాదుగా? పాపము! సోదరు లమాయికులు. పూర్వస్మృతిమాత్రులు. ఏకో మోమోటపడి వీరియాశ్రయణమునకును,

సీ. "బళిబళీ మీతాత బల్లెమ్ము చేఁబూని పుల్లాకుతూటుగాఁ బొడిచినాఁడు"

వంటిబట్టుకైనాంధ్రపుఁ బద్యములను లోఁగి కొందఱు ప్రాజ్ఞులు కొన్ని సమ్మతిపద్యములను వ్రాసి యిచ్చిరే అనుకొందము అంతతోఁ దృప్తిపడి—

"జాగా రెడేఁగి లైటోగా"

సంచరించినచో వారివరము లింతలో నుపసంహరింపఁ బడవు. వెంటనే గర్వపర్వత శృంగాధిరోహణ మొనర్చి తారతమ్యజ్ఞాన మచలముఁ ద్రోసికతన నాటువారు నిజాభిప్రాయములను భంగ్యంతరముగా వెలఁ బుచ్చిరి. అందు మొదటివారు శ్రీ కవిరాజుగారు, వీరి భంగ్యంతరపుఁ ద్రోవ గ్రంథము వచ్చటచ్చటఁ జూపఁబడియున్నది. ఇట్లు మార్చికొనుటకూడ న్యాయ్యమే. దేవతలు తామిడిన వరములను మరలఁ గైకొనలేదా? భూదేవతలట్లొనర్చుటలోఁ దప్పేమి? ప్రకృతి ననుసరింతముఁ, పాపము! ఆవ్వారియతఁ డనుకరణార్థ మీ యాశుఘోషకు దిగియుఁ నిందల కెంతయు సిగ్గుపడుచుండును. వేమవరమునుండి వచ్చినచో నర్సారావుపేటలో నీతనియాశుధారకుఁగా నొక సభ జరిగినది, దానికి డిస్ట్రిక్టు లెక్చరు పదవిలోఁ బ్రకృతి మాపురము నలంకరించియున్న బ్ర॥ శ్రీ॥ విష్ణుభట్ల రామకృష్ణయ్యగారు సభాధిపత్యమును వహించిరి. గంటకు 350 వంతున నతఁడు పద్యములు చెప్పెను. ఇతనికి దానియందు దొరలు తప్పులను దెలిసికొనఁ గల్గు తెల్వితేటలు భగవంతుఁ డిచ్చి యుంటచేఁ గాఁబోలును, తనలోఁ దానే * లజ్జించుచుండును. ఇట్టి కవనములను గూర్చి శ్రీజగన్నాథ పండితరాయ లిట్లు పలికెను.

---

* ఉ. సిగ్గును వీడి చెప్పితివి శిష్యుఁడ! మానసమందుఁ జాల నీ
పగ్గకు సంతసించితిని బాగును నోగును జూడ కెట్టులో

"నోచే ద్దుష్కృతమాత్మనాకృతమివ స్వాంతాద్బహిర్మా కృథాః"

(పండిరాజశతము చూ) ఇట్లు మాశిష్యుఁడు చెప్పినయాశువును బూర్తిగా వినియు నాయాశువునకు సభ్యులక్కజముగ నానందించుట గనియుం గూడ నేమికర్మమో మాకుఁ గొప్పరపుసోదరులకే యీసామ్రాజ్యపట్టాభిషేకమును గట్టవలయునని తోఁచెడిని, గాని మేమెుండె మాశిష్యులొండెఁ గొంతకాకున్నఁ గొంతరైన నీయేలంపాట యాశుఘోషలో భాగమును గల్పించుకొనుటకు రుచింపదని వ్రాసిన వ్రాఁత యందలి పరమార్థమును గ్రహింపఁ గలుగువారు కొంద ఱేని యుండకపోరని తలఁచెదము. ఉండకుందురుగాక 'కించిన్నమే తాపతా' ఈక్రింది భవభూతివాక్యమే మాకు శరణ మగుఁగాక.

"ఉత్పత్స్యతే మమతు కోఽపి సమానధర్మా కాలోహ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ" (మాలతీమాధవము చూ)

మఱియు నీయవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి నూజవీటి సంస్థానాధిపతులలో నొకరును శ్రీరామచంద్రాప్పరావువారి పుత్రులును నగు శ్రీనారయప్పారావు సింహాద్ర్యప్పారావు బహదరులచేఁ నియోగింపఁబడి యీయాశువు సనుకరించెను. అచ్చటివారందఱును సంతసించిరి. కాని శ్రీజమీందారులు తమ సంతోషమును బైకి వెల్లడించినను ఇయ్యది వృథా పరిశ్రమ మనియు నిట్టిఘోషకు బురికొల్పి వారి వాక్కు నేల వ్యర్థపుచ్చవలయుననియు లోనగు వాక్యములు నొడువ మొదలిడిరి. ఇద్దానింబట్టి చూడ నిది ప్రాజ్ఞులగు కవులకేకాక తాదృశ

---

గొగ్గిగఁ బాడుపాటలకె కొందఱు మెచ్చులు చూపుచుండ నీ
వాగ్గరిమంబు మెచ్చుటకుఁ బండితమండలి వెన్కదీయునే!

ఈపద్యము మాశిష్యుని యాశువును విని నాఁటిసభలో మాలో నొకరు చెప్పినది. ఉత్తరార్థముమాత్రము కారణాంతరమునఁ గొండొక మార్చితిమి. మనఃపూర్తిగాఁ గాకున్నను. హాస్యప్రాయముగా నాఁడు మాచే నీఘోష యనుకరింపఁబడినది. దాని శైలి యెటులుండెనో, వాక్రుచ్చుభారము సభ్యులును సభాధిపతియును వహింపఁదగువారు. ఎవరో కొందఱు సంతసించినను మేమిద్దానికి సమ్మతించువారము కామనియు సహేతుకముగ ఖండించి తీరువారమే యనియుఁ బ్రాజ్ఞలోకమెల్ల నెఱుఁగుఁగాక. (కో వేత్తి కవితాతత్త్వ మీశ్వరో వేత్తివా నవా)

లగు జమీందారులకుఁ గూడ రుచింపదని మేము చెప్పక తప్పని దగుచున్నది. ఒకవేళ నిది సోదరకవులు చెప్పినప్పుడుమాత్రము శ్రవణపేయముగా నుండి యితరులు చెప్పినప్పు డట్టు లుండదేమో యనుకొందమన్నఁ బ్రాజ్ఞులు వారు చెప్పినదానినిగూడ సహేతుకముగా నేవగించి ఖండించియే యుండుటచేతను వారికిగూడా వృథాఘోషించుట దక్క శ్రవణసుఖమును గల్గించు గాత్రమాధుర్యము మిక్కిలి సామాన్యమని ప్రత్యక్షములోఁ గనిపెట్టుటచేతను మేము వీరిని బ్రిక్కృతము మతించువారు కేవలాభిమానికోటిలోనివా రనియు నీగుంటూరు వివాదకు మున్ను సుతించినవారు 'పరగుణ పరమాణు పర్వతీకరణచణ' కోటి లోనివారుగాని, యాశ్రయణమునకు లోఁగి యేదో వ్రాసియిచ్చు తెలుఁగువారి లోనివారుగాని యగుదురని స్థిరపఱచుచు నెట్టిదైనను నొకప్రజ్ఞను సంపాదించి దానిచేఁ గొంతవఱకు లోకమున వ్యాపించినవారెల్ల సంతో యింతో భగవదంశము కలవారే కావున మాసోదరులను మేము సభలో సహాసనదానముచే గౌరవించి వారొనర్చు కల్లిబొల్లిపద్యపు సమ్మానమ్ముల నందఁ జూడకున్నను మాకుఁ గవితామిత్రులును వారికి శాఖాసంబంధులును నగు మఱికొందఱు కవులచేత నేని సహాసనము నొసఁగించుచుఁ గొంత సంతోషపెట్టఁ దలఁచితిమి కాని సోదరులపాకమిటేవల మిక్కిలిగా మీఱినట్లు వారి వ్రాఁతలవలన నెఱుఁగఁ బడుచుండుటచే వారివారి యాసనదానము లిందుదాహరింప వలయుచున్నారము. అయినను జదువరుల వినోదార్థ ముదాహరింతము గాక.

(అబ్బరాజు హనుమంతరావుగారి సుగ్రీవ పట్టాభిషేకమునుండి.)

(1) తే. గీ. వరుసఁ దిరుపతి వేంకటేశ్వరులఁ గొలిచి
కొప్పరపు సోదరకవులఁ గోర్కె దలఁచి..."

ఈయనఘుఁడు స్తుత్యర్థమై మమ్మిరువుర నొక్కచోఁ గూలనైచెను.

(2)"...ఇక్కాలమ్మునఁ బగటివేషములువేసికొని కవిహంసల మని కవిచక్రవర్తుల మనియు మిట్టిపడుచు ... కవిఘటాపంచాననుల మని మాకు సమానులు లేరని మీసములు దువ్వుచు ... చేయి యాపక కవిత వ్రాయుచుమని విఱ్ఱవీఁగుచు..."
("టిప్పు" నుండి)

(2) వ నెంబరు 'టిప్పు'. గ్రంథకర్త మా యిరువురను వెక్కిరించుటకై యొక పంక్తిని గూల వేసెను. ఈ వెక్కిరింపులోఁ గూడ శాఖాభిమానముచే సోదరులకే మొదటిపీఠము నిచ్చినందులకు సంతసింప వలసి యున్నను నితనివ్రాఁత—

XXX

"గూడుపుఠాణీవ్రాఁత."

యగుటచే నితఁడు సోదరులయెడ దయకలవాఁడయ్యుఁ బైకి నిట్లభినయించు నని యు, మొదటికవివలె నితఁడమాయిక శాఖాభిమాని కాఁడనియుఁ గేవల మనాత్మజ్ఞశాఖాభిమానిశిరోమణికోటిలోని వాఁడనియు నిర్ణయించుచు విలువగల యిచ్చో నిరసనవ్రాఁత కింతకన్నఁ దావొసంగక దూరముగా విడుచుచున్నారము.

"స్యాచ్ఛేద్బ్రహ్మగణోఽయమాకృతిగణ స్తత్రేష్యతే చేద్భవాన్"

ఈ మురారింబట్టియే సోదరులను గవిగణములోఁ జేర్చుటకు వీలుండదని యెఱిఁగిన మాలో నొకరు సహాసనమున కనర్హులనుగా బల్కియున్నారు. పిదప వార కాలుదగ్ధప్రసంగమునకుఁగూడ నిట్లే యుత్తరమిచ్చుటకు సిద్ధపడియుండి నను రెండవవారు సోదరుల నభిమానించి పెద్దమానిసుల కొండొక మోమోట పడుటచేత నట్లు జరుగదయ్యె. అందుచేతనే వీ రిప్పటికిని నుత్తరకుమార ప్రజ్ఞలను బ్రకటించుచు మీసమును దఱుచు దులపెట్టుచుందురు. తుట్టతుదకా పెద్ద మనుష్యులు పన్నిన

"నీకంటిలో వ్రేలు నానోటిలో వ్రేలు"

అనురీతి రాజ్కై 27 అక్టోబరు 1911 సం॥ కృష్ణాపత్రికలో మా యిచ్చిన ప్రత్యుత్తరము లోకులు చదివియే యున్నారు. అందలిదే యీ క్రిందివాక్యము

గీ. ఘనులు పండితరాయాది కవులు చూపు, త్రోవలం బట్టి పోదుము దేవునైన, లక్ష్య పెట్టము మాకు వల్లభులు లేరు"

సోదరులకలెఁ గాకున్నను శ్రీ పండితరాయలపైఁ గొందఱు కవిపదవాచ్యులే కాలుదగ్ధ్వ యుండు రనియు వారికిని దనకును గలవారనుబట్టి యాతఁడేవగించు కొనువాఁడనియు నతని ప్రాస్తావికశ్లోకములలోఁ గొన్నిటివలనఁ దెలియ నయ్యెడిని. అందుఁ గొండొక ప్రధానశ్లోకము లుదాహరించెదము గాక,

"శ్లో॥ మాద్యత్కుంజరకుమ్భ కోటిదళన ప్రోద్యత్కరః కేసరీ
దైవాత్కుధగ్రి ఫుళిన్ద సున్దరదరీ మాధోకతాం వార్ధకే
తత్రాఽసహ్య మిదం హి జమ్బుకభయా ద్భాగర్త సంవర్ధితైః
ప్రోత్ఫుల్లైరపి సారమేయశిశుభి ర్యోద్ధుం సమాహూయతే.

శ్లో॥ ఆబద్ధకృత్రిమసటాజటిలాంస భిత్తి
రారోపితో మృగపతేః పదవీం యది శ్వా,
మత్తేభకుమ్భతటపాటన లమ్పటస్య
నాదం కరిష్యతి కథం హరిణాధిపస్య.

శ్లో॥ అయి డమ్బర మారకూట ధత్సే
కనకస్యాఽపి యదన్యతో నికామం.
నికషానికషం పితత్తథాచే
దనుమన్యే సుదృశా మలఙ్క్రియార్హం

శ్లో॥ కుసుమాని లిఖన్తు నామ చిత్రే, కతిచిత్కాలవిశేషరూఢశిక్షాః
సురభిత్వ మమూని కిం లభన్తే, కథమేతేషు రసం పిబన్తి భృఙ్గాః.

శ్లో॥ హారం వక్షసి కేనాఽపి, దత్తమజ్ఞేన మర్కటః
లేఢి జిఘ్రతి సంక్షిప్య కరోత్యున్నత మాసనం.

దీనింబట్టి అపండితులు పండితులపైఁ గాలుద్రువ్వినప్పు డౌదాసీన్యము కన్న నన్యము శరణము లేదని స్ఫుట మగుచున్నది. ఈయంశము నింతకు మున్నే 'పశ్యా పశ్య' సమస్యాపూరణమున కుత్తర మొసంగుటకుఁ జేతఁ గాక బూతులు ప్రకటించు శాఖాభిమానుల నుద్దేశించి వ్రాయఁబడిన 'పండితాయతే' లోనే తెల్పియుంటిమి. అయ్యది యుత్తరరంగమునఁ జూడఁగలరు. ఇప్పుడేని మేమితరులను లక్షింప మనుట కర్థమేమో విజ్ఞుల మదికి వచ్చియుండెడిని. ఈరీతిగా శ్రీపండితరాయలవారికి మా సహానుభూతిని దెల్పుచు నీపూర్వరంగమెల్ల నుపోద్ఘాతప్రాయముగనే యుంచుటం జేసి విరమింప నుంకించుచుఁ గొండొక ముఖ్యాంశముల నుదాహరించుచున్నారము. (51) వ పుటలోఁ దిట్టుఁబోతు వ్రాయసకాండ్ర జాబితా కనుపఱచియుంటిమి. అందు (4) వ సంఖ్య కధిదేవత యగునతఁడు విస్తరించి పద్యములు వ్రాసియున్నాఁడు. అతనినోటికిఁ దలుపును ద్వారబంధమును నున్నట్లు చదువరులు నిర్ణయింపరు, కాని యతనిం గూర్చి వినుటలో నతఁ డెందుఁ బండితుఁడో మా యంతరాత్మకుఁ బూర్తిగా వచ్చియున్నది. అట్టివానిధారలోఁ గొన్ని పాండిత్యద్యోతకము లగు ప్రయోగములు "గంజాయి తోఁటలోని తులసిమొక్కలవలెఁ" గాన వచ్చుచున్నవి. దీనికిఁ గారణ మిటీవల స్ఫురితమైనది. కారణాంతరమునఁ బైకి రా వీలులేని యొక శాఖాభిమానిశాస్త్రిగారు వీరికిఁ బాసటయై వీరువ్రాయు చుఱుచు ప్రల్లదములనెల్లఁ బద్యములుగఁ జేసి యిచ్చుచుందురఁట! ఇంతియ కాక వీరు గొన్ని ప్రగల్భములాడుచున్నట్లు కూడ వింటిమి. పైకి వచ్చినప్పుడా యన స్వహస్తలిఖితములను జూపి తగుసమాధానము నీ నెంచి యిప్పు డిం

దుపేక్షించుచున్నారము. (84) వ పుట మొదలు (94) వ పుట వఱకును నుదాహరించిన మా సోదరుల ప్రత్యుత్తరములోని యంశము లాఘుట్టమందే సంగ్రహముగా విచారించఁబడినవి. మఱియు గంజామువారింటి యొద్ద వివాహ మగునపుడు తి॥ శాస్త్రి, కాకినాడలో లేదనియుఁ ముక్త్యాలములో నామహాత్మునకే జరుగుచున్న శ్రీయుత జయంతి రామయ్యపంతులవార భవనమందలి వివాహమం దుండెననియు మాచదువరు లెఱుంగుదురుగాక. ఆతప్పు ప్రల్లదపు టుత్తరమును శ్రీమాసోదరు లెవరివేరి వ్రాసిరో యాయనఘుఁడొకగ్రామణీమాత్రుఁడే యయ్యుఁ జాల సమర్థుఁడని విని యతని ప్రావీణ్యమున కక్కజపడుచుందుము.

"శ్లో॥ ఘటం భింద్యా త్పటం ఛింద్యా త్కుర్యాద్వా గార్ధభస్వరం
యేన కేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్॥"

ఈపుణ్యాజనుని పావనచరిత్ర మొక యెనుబదేండ్లకవిచే సమగ్రముగా నెఱిఁగితిమి. పూర్వకాలమున గ్రామఘంగరణములలోఁ గడుసమర్థు లుండిరని వింటిము కాని యీకాలమున నింత చల్లని యీబ్రిటిషుప్రభుత్వమున నింతవారుండుటకు మిక్కిలిగ నక్కజపడవలసి యున్నది. సత్యనిర్ధారణార్థమై మాకు నవ్యాజముగా నప్రయత్నముగాఁ దోడ్పడిన యమాయికుల కీయపరపాలస్త్యుని కతన నేవిధమగు నీతిబాధలును రాకుండ సకలలోకనాథుఁడగు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక. ఏపరమేశ్వరుఁ డాకరణముగారిచే బ్రౌరేపి సభలో నీప్రల్లదపుటుత్తరమును జదివింపఁ జేసెనో, ఏలోకనాథుఁ డాకరణముగారి హృదయపీఠము నధిష్ఠించి వారివారిని నకళ్లు వ్రాసికొనుటకు సమ్మతింపఁజేసెనో యాసర్వమయుని కనేకవందనము లొనర్చుచున్నారము, ప్రకృతి మనుసరామః, ఈపృథా శాఖాభిమానులెల్లరు లోలోనఁ గుటర్గిలుచున్నటకే కాని యెవరేని తగు మనుష్యులు వీరు తీరి కూర్చుండి కల్పించిన యాసనచర్చాదికమునుగూర్చి యడుగ నుద్యమించినచో "మే మెఱుఁగము మే మెఱుఁగ" మని తప్పుకొనువారె యని తెలియవచ్చుచున్నది. ఒక పెద్దమానిసిని వేటొక మహోద్యోగి యాసనచర్చనుగూర్చి యడిగి మందలింపఁబోఁగా నా సంపన్న గృహస్థశిరోమణి నిస్సంశయముగాఁ దానా సభలోనే లే నని బొంకి తప్పించుకొనియెనఁట! చదువరులారా! ఈమాటయే నిజమైనచో నీయాసనచర్చ పెట్టిన పెద్దలుగూడఁ దమ

పట్టినపట్టువంటిదెంత విలువ కల దను నమ్మకముకలవారలో తెలుచున్నదిగదా ? ఈవిషయ 'మాప్తవాక్యం ప్రమాణం' అను శాస్త్రాధారమున వ్రాసినది. ఇంకను బత్రికాధారమున వ్రాయవలసిన యంశము లనేకములు గలవు. ఆ పత్రికలుగూడ మాకన్నియుఁ జేరనేలేదు.

శ్రుతి॥ భరద్వాజోహ త్రిభి రాయుర్భి ర్బ్రహ్మచర్య మువాస"

అను శ్రుతిలో నుదాహరింపఁబడిన తపస్వి మాలో నొకరికి గోత్రకర్త. అయ్యనఘుఁడు వేదము నార్జింప నెంత యత్నముచేసెనో మే మీ వృథాశాఖాభిమానుల తో మ్మిదపయత్నముల నార్జింప నంత తపమొనర్చితిమి. అతనింబలెనే మాకును గడు స్వల్పముగాఁ జిక్కినవి. సంభవమైనంతలోఁగూడ గ్రంథవిస్తర భీతిచే ననేకాంశములు వదలుకొనుచున్నారము. ఎంత వ్రాసినను సారమింతే.

(1) పండితాపండితులకు వివాదము సమంజసము కాదు.

(2) నిజము నిడివిమీఁదఁ దేలక మానదు.

(3) శాఖాభిమానమును బురస్కరించికొని పెద్దపెద్దలనుచితపుఁగార్యములను సహింపఁ గూడదు. అది పెద్దతప్పు.

(4) కవులకుఁగల స్వాతంత్ర్యమును మనముగాని మనయుద్యోగములుగాని యాఁగఁజాలవు. చాలనే చాలవు.

(5) కవియనఁగా నెట్టిఁడో ప్రాజ్ఞులకుఁగాని ప్రతి మనుజునికిఁ దెలియవలసి యుండదు "సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్"

ఆ యీ యంశములను దెల్పుటతక్క నీ గ్రంథమునకు వేఱొండు ప్రయోజనము లేదు. ఉత్తరరంగమందు మఱికొండఱకు మా కృతజ్ఞతను దెలుపుకొందుము. ఈ గుంటూరి ప్రయాణములో మాకుఁ దటస్థించిన యసహ్యపు గోల కొంతేని చింతింప వలసి యున్నను దానికిఁ గొండొక పరిమళము గల్పించినవారు మ॥ రా॥ బెల్లంకొండ రామారావుగారు. వీరి సాహిత్య సౌహిత్యములు కడు మంచివఁట!

శ్లో॥ కృతేతు ప్రతికర్తవ్య మేష ధర్మ స్సనాతనః

అను నభియుక్తోక్తికతన రావుగారి లీలాతరంగిణి కథోగతిత్వము నాపాదించి యుంటిమి. కాని యంతమాత్రమున రావుగారియందు మా గౌరవము వడలదు.

"శ్లో॥ శత్రోరపి గుణా వాచ్యా దోషా వాచ్యా గురోరపి"

5

వీరి గుణాధిక్యము నుత్తరరంగమున విస్తరించి తెల్పుదుము. "పళ్య"-శబ్దమునుగూర్చి మహామహోపాధ్యాయులుఁగూడ దిగి యిప్పటికిని బనిచేయుచున్నారు. కాని యింతదనుక మాయాదృచ్ఛికోక్తియే మేలు చేయు యగుచున్నది. శ్రీరావుగారు కొందఱ ప్రేరణచే మా సభకు వచ్చినప్పుడే దీని వాదము తేలవలసినది. కాలకర్మవశమున నట్టిబుద్ధి వారికిఁ గలుగక శాఖాభిమానుల వలలోఁ బడవలసినవారైరి. దానిచేఁ బళ్యవాద మింతవఱకు వచ్చుటయు లీలాతరంగిణి యధోగతికి దిగుటయుఁ బోచిరాజాదులు బయలుదేరుటయు గొగ్గివారితలలును బ్రాప్తించినవి.

"సీ॥ అగ్రహారత్రితయాధిపుం డనఁడు వారక దేవురింపు యాచకులువీరు"

రావుగారిట్టి ప్రల్లదపుధోరణులకు హర్షింపఁ దగ్గవారుకారు. మా యాచకత్వ మెట్టిదో వినికివలన నేని యెఱుఁగని వారును గారు.

"వసిష్ఠ ఇవ విశ్వామిత్ర ఇవ స్వస్తివాచనికో బ్రాహ్మణ స్త్రేపరశురామ"

అను మురారినాటక పంక్తిని బఠింపని వారును గారు.

"సీ॥ భృత్యానుభృత్యులై ప్రేమించు రాజుల యాస్థానముల కేగ యాచ్ఞ యగునె?, యాహ్వానములు సేయుననఘుల యాళ్ళకు నవధానములకేగ యాచ్ఞ యగునె?, కృతులుగైకొనినట్టి మతిమంతు లిడెడి వేయాఱులు కొననేగ యాచ్ఞ యగునె?, నిజపాండితీ తుష్టసుజనపర్యులయిండ్ల నర్చనల్ గొననేగ యాచ్ఞయగునె?, తే॥ యుభయభాషాభివృద్ధికై యుద్భవించి, తిరుగుతిరుపతి వేంకటేశ్వరకవులను "దేవురించుచుయాచ్ఞకై తిరుగుచుండు" రనుచు నీరీతి దూషణం బాచరింప. (అభినవసరస్వతి)

పైనుదాహరించిన యుభయకవిమిత్రుఁడు పట్టాభిరామ శాస్త్రిలవారి యుపదేశమును మన్నింపని వారును గారు కాని యీ మా పాడుగోల కొకింత విలువ నిచ్చుటకై యిందు దిగవలసివచ్చిన దని తలంచుచున్నారము. విస్తర ముత్తరరంగమునఁ జూడఁదగు; పుణ్యపురుషు లని ప్రఖ్యాతికెక్కిన మ.రా.రా ఏకా రామయ్యా పంతులవారు ప్రీతిపూర్వముగా మా కొనర్చిన విందును గూర్చి కూడ నుత్తరరంగమే వాక్రుచ్చును. ఆసనచర్చానంతరముగూడ వీరు మమ్మెంత ప్రేమతో నాదరించుట యెంతయేని శ్లాఘ్యము. 'యశఃకన్యకా పరిణయాదిక' మెల్లను ఉత్తరరంగమునందే కలదు. శాంకరీ అను మకుటము గల పద్యములును

నందేయున్నవి. వేయేల? దీనికిఁ బ్రధానభూతవిషయ మంతయు నుత్తరరంగ మందేయుండును. ఇది యెంత విస్తరించి యున్నను నుపోద్ఘాతమువంటిదే, కపటవర్తనుల తత్త్వమును దెలుప నేర్పడిన యీ నాటకమున కియ్యది ప్రస్తావన వంటిది. కావుననే పూర్వరంగ మని పిలువఁ బడుచున్నది. శ్లో॥ పూర్వరంగః ప్రసంగాయ నాటకీయస్య వస్తునః॥

విస్తరిమువలనఁ బ్రయోజన మేమి? ఇఁకఁ జాలును, మిక్కిలి దూరపు జ్ఞాతు లనఁ దగు నోక్కొప్పరపు సోదరులారా! మీ బిరుదులలో (కుండిన కవి హంసలు) అనునది గుంటూరిలో నెవరైననేమి మీ కిచ్చియున్నారు. ఇచ్చిన వారి మర్యాదకొఱకేని మీరు హంసల గమనమును నేర్చి కొనక తప్పదు. కాకవిగతికిని దానికిని గడు భేద ముండును. నిజమైన యూశువునకు హంసల గతియే యనుకార్య మని యెఱుఁగుఁడు, అందులకు మాయుపదేశముకన్న భారతము మీకుఁ జక్కఁగఁ దోడ్పడఁ గలదు. దానిలో కర్ణపర్వము ౨వ ఆశ్వాసమునందలి హంసకాకోపాఖ్యానము జదివికొనుడు.

మా లోకానుభవమును బట్టి మే మీక్రిందిపద్యము ననుకరించి వర్తింతుము.

చ. వెనుబడి కాకవుల్ తనదు వీఁపుపయిన్ జరణమ్ము లుంచి తాఁ
చిన నది లెక్కసేయకయ చివ్వకుఁ బూనక వైనతేయుఁ డే
మనక శిరమ్ము వంచుకొని యల్లనఁ బోవఁడె? శక్తిమంతు లెం
దును నలఁతుల్ పొనర్చు నలతుంపుడుకున్ గణియింప రంతగన్.

తారతమ్య జ్ఞానహీనుల యుపదేశములను జెవిఁ బెట్టకుఁడు. ఇట్టివారే కదా మన కీ కయ్యమును బెట్టినవారు. చూడుఁడు.

క. కు కృతిత్వముపై నెక్కిన, వికృతపు సంతోసమందు నిపుణులు కవులం
దెక్కువ తక్కువ లరయుదు, రొకో? యిది విన్న నవ్వరొకో! విబుధుల్.

పై రెండుపద్యములును నుత్తరరంగములో రాఁ దగునవియైనను జవి చూపుట కిం దుదాహరించితిమి. మీరును మీపక్షమువారును దిట్టు తిట్లు మేము లక్షింపము.

శ్లో. శరీరం యే వినిందంతి తే సహాయా జనా మమ,
ఆత్మానం యే వినిందంతి స్వాత్మానం స్వయమేవహి"

సోదరకవులారా! మీరును మీకు సంబంధించిన మహాభాగులును నైరంతర్యముగాఁ బ్రచురించు నసత్యములు లోకులకవి సైఁప వీలుగాక యశోరక్ష

ణార్థమై మా యొనర్చిన యీపరిశ్రమమును మావలనఁ బ్రత్యక్షముగాఁ బ్రత్యక్షరమును వినియుఁ జెప్పించుకొని కనియుఁ దమతమ యభిప్రాయములను గొంద ఱంపియున్నారు. అందుఁ గడుఁ గొంచెముగఁ జూపుచున్నారము. ఇంతను గూర్చి యుత్తరరంగము విశేషించి తెల్పఁగలదు. రక్తమాంసములు క్షీణించు నంతపరిశ్రమ చేసి రచించిన యీ చేటభారతమెల్ల నిట్టి యోగ్యులకొఱకే కాక మఱెందుకు.

నాగులుప్పలపాడు, చదలవాడపోష్టు; ఒంగోలుతాలూకా 7-1-1913 చిల్లుకుల శ్రీరాములు నమస్కారములు.

"అయ్యా:— మీరున్ను శ్రీ తిరుపతిశాస్త్రిగారున్ను వేమవరాగ్రహారములో శ్రీ భాగి చెన్నయ్యగారింటిలో రెండు దినములు జేసిన యవధానము సాంతముగా నవలోకించి మూడవదినమందు మీరు సభకు వినిపించిన "గుంటూరి సీమ" యను గ్రంథ ముదయాము 8 గంటలు మొదలు మధ్యాహ్నము 3 గంటల వరకు కాలవేగము తెలియకుండా వినుచున్నవారిలో నేనొకరుండ. గుంటూరిలో నాసనపుచర్చ యుత్తరప్రత్యుత్తరముల కాలములో నే నచ్చట యున్నాను. తమరు వినిపించిన సంగతులన్నియును వాస్తవమని చెప్పగలను.........

క. "గుంటూరిసీమ" ముగిసిన, వెంటనె యొకపుస్తకంబు వీ. పి. గనుమా
యింటికిఁబంపగ మిము శత, ఘంటకవీ! వేఁడువాఁడఁ గడుభక్తిమెయిన్."

---

"... నెలరోజులక్రిందట వేమవరపుసభలో "సీమను" తాము చదివి వున్నారఁట ? విన్న నామిత్రులందరు యథార్థము తెలుపుటలో 'సీమ' వంటిది లేదనియు, దానిని చదివినచో శక్తిలేని పసుగుబెత్తరాదు, అసత్యప్రచారి త్రొక్కరాదు, సత్యబలము సర్వబలములకంటె గొప్పది" అను అంశము దీనివలన తెలిసితీరును. అని చెప్పిరి... 'సీమను' వి. పి. గా వెంటనే దయచేసి చిత్తగింపుడు కందాళ నరసింహాచార్యులు, వైకుంఠపురం, 19-2-13."

---

ఆర్యా, 1-3-13.

"ఈకార్డు తమ సన్నిధికిఁ జేరిన వెంటనే 'గుంటూరిసీమ' అను తమ పుస్తకము నొకటి వీ. పీ. గాఁ బంపగోరెదను. ఆలస్యము సేయవలదు. ఎప్పుడెప్పుడా

అని చంద్రచకోరన్యాయముగాఁ గనిపెట్టుకొని యున్నాను......పోతరాజు వరదయ్యవార్లు. ఏర్చూరుగ్రామము, సంతమాగులూరుపోస్టు, గుంటూరుసీమ”

---

“గీ. శ్రీకరోభయభాషాసాగరిష్ఠకవిత
మృదుమధురధారచే నిష్ఠ మిమ్మెయెసఁగె
గాన కవిసింహబిరుదవిఖ్యాతులైన
తమకు సాష్టాంగము లొనర్తు దయను గొనుఁడు.

ఉ. వేమవరాగ్రహారమున వీనులవిందుగఁ దాము సత్కవి
స్తోమము గోరు కోర్కెపయి శోధితకామును సీమ నెత్తి ని
స్సీమకవిప్రభం జనవి చెప్పి తదగ్రము లచ్చటచ్చటన్
స్వామి! యఖండమోదము నొసంగితి రందఱకున్ దిగుద్ధికన్.

గీ. అట్టి గుంటూరిసీమ నేఁ డచ్చునుండి
బయలు వెడలినదని విని నాగ్రహముమంటె
వీ. పి గా నొక్కప్రతి నాకు వేంకటకవి
చంపరె? దయచేయుఁడని భవత్సుముఖునకు
గుండెపూడి శంకరనారాయణ, కొత్తపేట, గుంటూరు. 3-3-13

---

“నేను వేమవరం శతావధానమునకు వచ్చినప్పుడు తమరు చేయుచున్న గుంటూరిసీమలో పద్యములను విని సంతసించితిని... తయారుకాగానే నాకొక బొక్కు వి. పీగా పంప ప్రార్థించుచున్నాను.”

3-3-13 Malladi Ramakristnayya, Teacher,
Marripudi, Bapatla Post.

---

“నేను వేమవరమందు చేసిన శతావధానమునకు వచ్చి యామూడునాళ్ళు కడు సంతసమవునటుల చక్కగా చూచి యుంటిని. అప్పుడే మీరు చదివి వినిపించిన గుంటూరిసీమ చర్యయంతయు విన్నానుగాని యథావిధిగా పుస్తకము చూడవలయునని కోరిక కలిగినది. నాయందు దయవుంచి ఒకపుస్తకము గుంటూరిసీమ ముగిసిన వెంటనే V. P. Post గా పంపమని ప్రార్థించుచూ యున్నాను” గొల్లపూడి నరసింహారావు, బ్రాహ్మణనిడుమానూరు.

---

"...పంపిన సీమగ్రంథములోని భాగము చూచి పరమానందభరితుడనైతి. 25 పేజీని గల ఆసనచర్చకు పూర్వము మీరు వివరించిన కొన్ని విషయములు నాకు తెలియకుండెను. ఇతరులకు తెలియకుండుటకు ఆశ్చర్యము గాదు. ఆ ముఖ్య విషయములను తాము చక్కగ విశదీకరించినారు. అవి చదివినవారు తమయందు లేశమైన దుడుకులేదనిన్ని తమరిని అవమానింపదలంచి, చేసిన ప్రయత్నములను పడగొట్టిరనిన్ని ఎట్టివానికైనను తెలియకమానదు. ఈవిషయములను చదివిన తరువాత నా మనమునకు ఎక్కువతృప్తి గలిగినది. ఇదివరకు యీవిషయములు నాకు తెలియవయ్యె. ఆరంభమందు మీకును వారికి గలిగిన సమావేశమున బ్ర॥ తి॥ శా॥ గారు ఆశుకవిత్వమును గూర్చి చెప్పినవిషయము దానిపై వారికి కోపము వచ్చుటయు ఆ పూర్వరంగము పక్కకుగా జరుగకపోవుటవల్లను అది లోకమెఱుంగదయ్యె. ఈవిషయములు తెలియనివారు తమపై నిందవేయవచ్చును. ఇవి తా మత్యద్భుతముగా పరిశీలించినారు. మీ పుస్తకమును జూచిన తరువాత నాకు తెలిసిన విషయమిద్దియె. ఇది చాలా ముఖ్యమని తోచెడిని. 34-41 పద్యముల సందర్భము చాలా బాగుగ నున్నది. ఆశుకవితాతత్త్వమును సందర్భపూర్వకముగా బోధించినారు. దీనికి తోడు మీరు ఫుట్‌నోట్లలో చేసిన ఆర్యమతబోధిని, టంగుటూరి శ్రీరాములు, శ్రీనివాసరావుగార్ల వ్యాసములు స్థిరపరచుచున్నవి. మొత్తము మీరు లోకముకన్నులువిప్పినారు... కవిత్వములోనేమి గ్రంథ విషయములలోనేమి తమ నూతనపద్ధతుల నిట్లు మెచ్చుకొనని మూర్ఖులు చాల తక్కువ... క్రొత్తమార్గము తమ సీమగ్రంథము చూపుచున్నది. మనభాషయందు చరిత్ర సత్యము ప్రధానముగా వ్రాయుట యింతవఱకు లేదు అందులో యిటులు వ్రాసిన దాఖిలాలను తీసుకొని సత్యమును వెల్లడిచేయుట అంతకుమున్నే లేదు. ఇంగ్లీషున దీనినే డాక్యుమెంటరీ ఎవిడెన్సు (Documentary evidence) అని అందురు. ఆంగ్లేయుల చరిత్రముల ఈవిధముగా వ్రాసియున్నారు. Documents of English History or English History from original sources) తము రింగ్లీషు పఠింపనివారయ్యు, తమ రీపద్ధతిని చరిత్ర వ్రాయుట తమ ప్రజ్ఞావిశేషమును తెల్పుచున్నది ...చా॥ వెం॥ కృ॥ 26-7-12."

———

ఉ. శక్యము గానికోర్కి గొన సాగమి నందవమానమంది సా
ర్థక్యము లేని దబ్బఱలు తద్దయు నింపఁ దొడంగు దుర్మనో

వాక్యపరంపరల్ నిలిపి వైవఁగఁ దిర్పతి వేంకటేశ చా
ణక్యులు దీని వ్రాసిరి ఘనప్రతిభల్ నిజముగ్ గ్రహింపఁగన్.

ఈ పద్యము మేము రచియించినదే యైనను నిందలి చాణక్యపదము శ్రీ కొడ్డంపేట జమిందారుగారగు శ్రీరావు విశ్వసుందరరావు గారు మా 'సీమ' గ్రంథమునఁ గొన్ని భాగములను మావలన విని ప్రశంసించు ప్రసంగములోనిదని తెల్పుచున్నారము. మాగ్రంథమును మెచ్చువారిలో వైదికమహాశయు లెందఱైనను నొకనియోగి మహాశయునికి సరిగా మేము గ్రహింపనేరము. అందులో నిట్టివారినో వేయిమందికి సాటుగా భావించుచుందుము. కావున వారిమాటను మే మింత విలువగలదానిగా గణించి పద్యమం దొకపఁజముగా గూర్చి యాదరించుచున్నారము. ఇదిగాక వీరువయస్సుచేఁ జిన్నలయ్యును విద్యాబుద్ధులలో నెందఱకన్ననో కూడ మిన్నలని చెప్పఁదగినవారు. ఇట్టివారి మెచ్చుకన్న నా పరిశ్రమకు సాఫల్యమేమి కావలెను? "కృతార్ధాగయం"

ఇట్టివారికలిమి నాధారముగఁ జేసికొనియే భర్తృహరి యీమాట పలికెను.

శ్లో॥ జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయం॥

మత్తకోకిల

మంగళం జయమంగళం శుభమంగళం జగదీశ్వరీ!
మంగళంబగు నీకు మాకును మమ్ముఁ దిట్టెడివాండ్రకున్
మంగళంబగు నాశుఘోష సమాఖ్యకుర్కురపుచ్ఛమున్
గంగ నీడఁగ నూఁతగాఁ గొను కాకవిద్విజపాళికిన్.

ఇట్లు
తిరుపతి వెంకటేశ్వరులు.



ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# గుంటూరు సీమ

## పూర్వరంగము

—: గుంటూరు :—

శ్లో. "స్వాధీనో రసనాంచలః, పరిచితాశ్శబ్దాః కియంతః, క్వచి
త్క్షోణీంద్రో ననియామకః, పరిషద శ్శాంతా, స్స్వతంత్రం జగత్,
త ద్యూయం కవయో, వయంవయ, మితిప్రస్తావనా హుంకృతి
స్స్వచ్ఛందం ప్రతిసద్మ గర్జత, వయం మౌనవ్రతాలంబినః"

(సాహిత్యదర్పణపీఠిక)

I ఉ. మామయు నల్లుఁడే వెనుక మాటకు నత్తయుఁ గోడలే, యటుల్
భూమి నియోగులెల్లరును బూర్వము వైదికు లయ్యె నెందు కీ
సాములు సాము చేసెద రసత్యము నూఁతగ నూని వైదిక
స్వాములమీఁద, నేఁ డిది విచారణసేయఁగదమ్మ శాంకరీ!

---

(1911 సం॥ నవంబరు 8 వ తేదీ ఆంధ్రపత్రికనుండి)

### నియోగ వైదిక కక్షలు.

I తిరుపతి వేంకటేశ్వరులవారికిని కొప్పరకవిసోదరులకును జరుగుచున్న వివాదముల ఫలితము, యీగుంటూరుజిల్లాలో వైదికనియోగకక్షలమితముగా బెరుగుటయయియున్నది. రెండువైపులను నారదమహామునులు యీకలహము లను అమితముగ వృద్ధిచేయుచున్నారు. బి. ఎ. బి. ఎల్. పరీక్షలలో ప్యాసయి ఇట్టిభేదములవలన దేశమున కనర్థము వాటిల్లుచున్నదని ఎఱింగియు వీటిని వృద్ధి చేయుచున్న మహాజనుల నేమనవలయును! బ్రిటిషుప్రభుత్వమే లేకపోయిన యెడల ఒకరొకరి గొంతుకలను పరపర తెగగోసికొని యుందురని వ్రాయు టలో నతిశయోక్తిలేదు. ఈ భేదములవలన జనించుచున్న ద్వేషాగ్ని ప్రతిపట్ట ణములోను గ్రామములోను మూలమూలలను వ్యాపించుచున్నది. బడులలో జదువుకొనుచున్న పసిబాలురును బాలికలును యీ వైదిక నియోగభేదములకు

మ. కవులున్ బందితులై నృపాలకులు గాన్కల్ వెట్టఁగా వైదిక
ప్రవరుల్ వోలె నియోగు లుండిరి, ధరాపాలుర్ నియోగించుకా

చర్చించుచు నొకరితో నొకరు దగవులాడుచున్నారు... వేయేల? యీగుంటూరు జిల్లాలోని స్త్రీపురుషులు బాలికా బాలకులందరును యీ విషజ్వరముచేత నే బాధపడుచున్నారు. ఈ కార్చిచ్చు నార్పుటకు 10, 15 సంవత్సరములయినను కావలసియున్నది విద్యాధికులమని విఱ్ఱవీగునట్టి పెద్దమనుష్యు లీసందర్భమున చేయవలసినట్టి కర్తవ్యములేదా?

......గుంటూరు ఒక ఆంధ్రుఁడు.

(1911 సం॥ నవంబరు 15 వ తేదీ ఆంధ్రపత్రికనుండి.)

ఒక మాసముక్రింద బ్రహ్మశ్రీ తిరుపతివేంకటకవుల శిష్యులగు వేలూరి శివరామశాస్త్రిగారు మా కాలేజీ బాలురు చేయించుటవలన శతావధానముసల్పిరి. వారికి 28 వ తారీఖున బంగారు పతకము కాలేజీహాలులో యిచ్చిరి వారినిమర్యాదచేయుటకు "గుంటూరు ఎమెచ్యూర్సు" అను నాటక కంపెనీవారు చా, చా, నాటకమాడిరి. ఆరాత్రియే వేంకటకవిగారిని, శివరామశాస్త్రిగారిని, ప్రెసిడెంటుగారిని గుఱ్ఱపుబండిమీదెక్కించి యూరేగింపించిరి. 29 వ తారీఖు రాత్రి వారికెదురు పార్టీ వారైన నియోగులు నియోగివంటబ్రాహ్మణుని గుఱ్ఱముమీద నెక్కించి యూరేగించిరి ఆహా! లోకమెట్లు మారినదో చూడుడు. ఇరువది సంవత్సరముల ప్రాయముగల బాలుడు శతావధానమొనరించెనన నేరకైనను తలవంచవలెగదా! ఇదెంతయు నరసిచూడ యేమియు బాగుండలేదని నాతాత్పర్యము. ఇదంతయు పులినిచూచి నక్క వాతపెట్టుకొన్నట్లాయెను. మాపురమందు కక్షలధికమగుచుండె. ఇవన్నియు బాపుకొనుడని నేను ప్రార్థించుచున్నాడను.

గుంటూరు ఒక కాలేజివిద్యార్థి.

(1911 సం॥ నవంబరు 6 వ తేదీ దేశాభిమాని నుండి.)

శివరామశాస్త్రిగారిని యూరేగించిన మరుదినము, ఒక వంటలవానికి జగన్మోహనకవి యని పేరిడి గుఱ్ఱముమీద నెక్కించి, ఆవిరిదీపములు - బేండువాయిద్యములతో నూరేగించుటయేకాక, దారివెంటను కొందరు వైదికుల యిండ్లముంచరను గలభా చేసిరి.

ర్యవిధుల్ దీర్చుచు సేవచేయుచు నియోగ్యాగ్రేసరుల్ వోలె నేఁ
డవనిన్ వైదికులుండి, రేటిపని కంబా! * వీరి కీభేదముల్.

(మ॥ రా॥ రా॥ కార్వేర్ల శ్రీనివాసరావుగారి
"కొప్పరపుకవులు, ఆశుకవిత్వము," అను చిన్ని పొత్తమునుండి.)

ఇప్పుడు జరుగుచున్న సంగతులన్నిటిని బాగుగాఁబరికించి చూచిన కత్తు నియోగులకుఁ గలదుకాని వైదికులకు లేదని తోఁచుచున్నది.........కానఁగత్తు నియోగులకు మాత్రమే కలదు. 2 వైదికులగు శ్రీ తిరుపతివేంకటేశ్వరకవులు శతావధానమును మిగుల శ్లాఘాపాత్రముగా నొనరించుచుండుటచే వారికవిత కొప్పరనియోగికవిగారి కవితకంటె వేయిమడుఁగులధికముగాఁ బ్రకాశించు చుండుటచే నోర్వజాలక నియోగిప్రముఖులు సభలో నేదోయొక యల్లరి పెట్టి రని బుద్ధిమంతుల కందరికిని దీనిమూలముగాఁ దోఁచక పోదనితలఁచెదను...... ...కాన నియోగులే కత్తునువహించుచున్నారని దీనివలనను దేలుచున్నది...... శివరామశాస్త్రిగారు ......... శతావధానమును మిక్కిలి జయప్రదముగా నొనరించిరి. సభవారానందించుటయేకాక సంతోషాతిశయముచే నవధానిగారిని బురవీధుల నూరేగించిరి. అందుపై నియోగిప్రముఖులు నియోగిపుంగవుండగు వంటబ్రాహ్మణు నొక్కని దీసుకొనివచ్చి 'వంటలశతావధానికీ జే' యని కేకలు వేయుచు నూరంట నూరేగించిరి. ఇతరులు చక్కఁగాఁ గవిత్వమును చెప్పిన వీరిలకెంత కడుపుమంటఁగానుండునో యిదియే బోధింపఁగలదు. నియోగులగు కొప్పరకవుల నియోగులు కొన్నితావుల నూరేగించుచు వచ్చిరి. అప్పటి వైది కులు తమలోని వంటబ్రాహ్మణుల మరల నూరేగించిరా? అట్లు బుద్ధిమంతు లెవరును తలంపఁజాలరు. అసూయ లేని వారు కనుక నట్లు వైదికులు చేయ లేదు, లేకున్న నేలచేయరు?.........నేను వైదికినిగాను, నియోగినిగాను, ఉభయుల క్షేమమునుగోరు ద్విజేతరుఁడను. ఇవి నాయూహలు. దేశక్షేమ మును గోరి నేనిట్లు వ్రాసితిని.

* (జూను 15 వ తేదీ 1912 సం॥ దర్బారులోని, 'కే. వి. లక్ష్మణ రావు, ఎమ్. ఏ. గారి యుపన్యాసమునుండి)

......ఇందుచే వైదికులు తమశ్రోత్రియత్వమే కారణముగాఁగల యాధిక్య మును మఱవవలెను. ఇటులే నియోగులుకూడ తామధికులమని యనుకొనఁగూ

చ. తెలుఁగుకవిత్వముల్ సలిపి ధీవరమాన్యత గాంచినా ర్నియో
గులు మును పెంద ఱేనియును, గొందఱు సంస్కృతమందుఁ గూడఁ బ్రా
జ్ఞలు గలవార లుండి, రొకసంస్కృతమే తమ జీవనంబుగా
మెలఁగిరి వైదికుల్, తెలుఁగుమీఁదికి నంతగ రారు వా రొగిన్.

చ. తెలుఁ గలసంస్కృతమ్మునకుఁ దీయనిచుట్టము; సంస్కృతంబొ, యా
తెలుఁగునఁ గల్పకున్నయెడఁ దీపి జనింపదు చప్పనౌ; నటుల్
కలియవలెన్ నియోగులును గ్రందుగ వైదికు, లట్లు గానిచోఁ
గలిగెడునష్ట మెవ్వరిదొ గాంచఁగ లేదె ప్రపంచ మంబికా.

చ తెలుఁ గన ! నీవు, సంస్కృతము దేవర శుద్ధశివుండు, నీకునున్
గలుగవు మాయకున్ భిదలు, గన్గొనువారికి నీకు భర్తకున్
గలుగు నభేదమేర్పడదుఁ గాని యశక్తులు దీని నొప్ప రో
లలితరొ ! సార మియ్యది బలంబు సమస్తము నీకు భర్తయే.

చ. పరశివు వీడి నీ వొనరుపం గలకార్యము సుంత లేదు, ని
న్న ఱమర సేయుపై నతని కంతియె కాని స్వయంప్రకాశుఁ డా
స్మరహరుఁ, డిట్టిభేదముసుమా ! తెలుఁగున్ మఱి సంస్కృతంబు డం
బలరునియోగివైదికులు నందుచు నుందు రెఱుంగ నేర్చినన్.

---

డదు. వీరు తామధికులమనుకొనుటకుఁ గారణమేమి ? తాము లౌకికధూర్వ
హులమనియు రాజకీయాధికారముచే శోభితులమనియు రసికులమనియు వైదికు
లట్టివారు గాక యాచనయే జీవనాధారముగాఁ గలిగి లౌకికజ్ఞానము లేని యరసి
కులనియుఁగదా వీరితాత్పర్యము. ఈయంశములు పూర్వకాలమున నెంత నిజ
మయినను నేఁడు నిజములుకావని యందఱకుఁ దెలిసినవిషయమే. ప్రస్తుత మనేక
వైదికులు ఇంగ్లీషులో గొప్పపరీక్షలనిచ్చి తహస్సీలుదారు డిప్యూటీకలెక్టరు
మొదలయిన గొప్పయుద్యోగములను జేయుటయు వారి యింటిలో నియోగియగు
సింగన్నపంతులుగారు, పాకాధ్యక్షుఁడుగా నుండుటయు మనము ప్రత్యక్ష
ముగా నిప్పుడు చూచుచున్నాము. ఇట్టి సింగన్నపంతులుగారు నేను అమాత్య
పదవికి నర్హుఁడను కావున ఈవైదికికంటె శ్రేష్ఠుడనని చెప్పినయెడల హాస్యా
స్పదముగనుండదా ? కావున మనమిట్టి గర్వము విడువవలెను. ప్రస్తుతము వైది
కమునందేమి లౌకికమందేమి యందఱును సమానులయినారు...............

శా. మాయాస్థానము తెల్గు, సంస్కృతము సాంబస్థానమున్ జెందె; నం
బా! యీరెంటిని బ్రాహ్మణప్రవరులే పాలించుచున్నారు తా
రేయేయాశ్రయ మేరొనర్చెదరొ వారేర్పాటుగాఁ దద్గుణ
శ్రీయుక్తింగన కెట్లు మానుదురు, నీచే మాన్పఁగా శక్యమే.

గీ. ఉభయభాషాశ్రితులకబ్బు నుభయగుణము
లేకభాషాశ్రితులకబ్బు నేకగుణము
తత్తదను సారముగ వారిదారులుండు
నదియ యీకబ్బమందు నీవరయవలయు.

ఉ. ఎన్నఁటికేని మాయ యది యింకక మాన దటంచు శుద్ధస
త్త్వోన్నతి తత్త్వమున్ దెలియు యోగులు చెప్పెడిమాట నిక్కమే
యన్నయెడన్ నిజం బెటులొ యార్యులవ్రాతలె తెల్పఁగాక ప్ర
చ్ఛన్నులవ్రాఁతలంగల యసత్య మవశ్యము బైటఁ బెట్టుచున్. 9

ఉ. కొప్రపువారిపైఁ గలదు కూరిమి బోలెఁడు మాకు, వారి యా
శుప్రతిభావిలాస మది చూడఁగఁ బత్రిక నంపియుంటి మా

---

† (1911 జనవరి 17 తేది మంగళవారము శశిలేఖనుండి)

—: శ్రీ కొప్పరపు సుకవి ప్రశంసానవరత్నములు :—

శా. అయ్యా! కొప్పరపుం గవీశ్వరులు! మీయాస్యంబు మే మెప్పుడే
నొయ్యంజూడఁగలేదు శిష్యుఁడొకఁ డోహో! యంచు మెచ్చెన్ మిమున్
నెయ్యార్లియ్యఁగ శక్తిలేదు కొనుఁడీ వెయ్యారులే యంచు మే
మియ్యంబూనిన పద్దెముల్, మనుఁడి మీ రెచ్చో నిరాఘాటులై.

చ. "అరుదగు మీకవిత్వ" మని యాప్తుఁడు శిష్యుఁడునైన మా ప్రభా
కరము వచింపఁగా విని యఖండముదంబును బొందినాము బం
దరు దరి కేగుదెంచియును దా మటకున్ జను దేరకుంట మీ
దరిసెన మబ్బదయ్యె బరితాపకరం బిది మాకు నెంతయున్.

చ. "సరిగ శతావధానములు చక్కఁగఁ జేసెడివారు పూర్వమే
పఱిరి నేఁడు లే" రనెడి వార్తలు కల్లలు దివ్యవాగ్ఝరీ
భరిపరిపూరితాద్భుతసభాసదలంకరణప్రచారసుం
దరతరభావభావుకకనద్భవదీయవధానసంపదన్.

చ. "చనెడి శతావధాన మను జాహ్నవి సంద్రమునందు డిందఁగా"
నని జగమాడు నప్పలుకులన్నియు నేఁటి కబద్ధమయ్యెఁ ది
న్నని కవితాప్రవాహమున నాటకవేషము లట్లుగాక మీ
రొనరుచుచున్న దివ్యకవితోదయమన్ ప్రహద మడ్డువచ్చుటన్.

ఉ. ఏమొకకొంతకాల మెదియే నొకతీరు శతావధానముల్
గ్రామములందుఁ బల్లెలను రాట్సభలన్ మఱి రాజధానులన్
స్వామికృపావిశేషమున సల్పినవారము సల్పుచుంటి మిం
కేమగునో! మఱేమికొద వీరవధానుల రుద్భవించుటన్.

ఉ. బందిరుపచ్చి యచ్చటి సభాసదులన్ దనియించి వారిచేఁ
జందనమో! సుమంబొ! మఱి శక్తికినించని దేదిగాని మీ
రంది కృతార్థులన్ సలుపుఁడయ్య! మమున్, మిముఁ జూచుకోర్కె మా
డెందములందు మిక్కిలిఁ గడిందిగ సందడి చేసెడిన్ జుఁడీ.

చ. అనఘులు! కూపకూర్మముల యట్లొకచోటనె మగ్గిసగ్గి నూ
తనమగు పాడుత్రోవ నవధానము మానము గంగఁగల్పి తా
మనృతమె యూఁతగాఁ గొనెడి యర్భకపుంగవు లట్లుగాక మీ
రొనరుచుమార్గముల్ మది 'కహో' యని మెచ్చెదఁగూర్చెదున్ జుఁడీ

క. మీ నామంబులు మీ యవ
ధానమువిని మాయకవులు తలలెత్తక లో
లోన నిఁకనేని సిగ్గును
బూని యొకట నుండ్రుగాక బొమ్మలపోల్కిన్.

క. శశిలేఖలోనఁ జదివితి
విశదంబయ్యెన్ భవత్ప్రవీణత మీకున్
యశమబ్బుఁగాక భగవ
ద్వశమై యాయువును సిరియు వఱలెడుఁగాతన్.

ఇట్లు, తిరుపతి వేంకటేశ్వరులు.

క్షితి బ్రకవుల్ మిఱేమి దయసేయరు పిమ్మట వారికీమకే
‡ సుపరీక్షితానురాగమది చొప్పడి మమ్మును బిల్చెఁ బెల్చనన్.

* చ. అచట నియోగివైదికుల కంతకుఁ బూర్వమె కక్ష లంట! త
త్ప్రచురత సుంతయుఁగ్ దెలియ వచ్చినవారము గామిఁ జేర్మి మే

(12-8-11 గుంటూరు.)

‡ బ్రహ్మశ్రీ... గారికి, ... మున్నగు పెద్దలచేత ... తిరుపతి శాస్త్రులుగారును తామును ... శతావధాన మొనర్చునట్లు సభ ... ధ్రువపఱుపఁబడినది... పై పెద్దలు చేవ్రాళ్లుగల యాహ్వాన పత్రిక రేపు తమకును, తిరుపతి శాస్త్రిలవారికిని జేరితీరును. తాముభయులును గలసివచ్చునట్టి వీలును దామేర్పరప నలయును. తమ సభం దిలకింపఁ బెక్కు గ్రామములనుండి పల్వురు తటస్థులు రా నుత్సాహ పడియున్నారు. తమవర్ణనమె తరణోపాయమన్నంత యొన్నికయిటఁ గల్గియున్నది. తాము వచ్చినప్పుడె యిచ్చట ఘస్టుకంపెనీవారు తమ పాండవవిజయముఁ బ్రదర్శింపఁ గుతూహలులైయున్నారు, ... పెక్కురు సగసులు తమరాకకై నిరీక్షించియుండిరి, ... దేవుని వరమడిగినట్టు దేవరవారి నొక్కటి వేఁడికొనుచున్నాఁడను తాముభయులును బందరునుండి యేగోటైన నేటయమున నేబండికి నేటయమునకు గుంటూరున దిగుదురో వ్రాయించి తెల్పినచో నే నాబండిని గాచుకొని యుండెదను. అటుపై నాకుదేవనమున నా రెండుపూటలును నివసింపఁ బెక్కుసాష్టాంగము లాచరించెదను. అనేకజన్మార్జితపుణ్యఫల మిదియే యనుకొందును.

శిష్టా హనుమచ్ఛాస్త్రి, టవున్ హైస్కూల్ తెలుగుపండితుఁడు.

* (1911 సం॥ నవంబరు 5 వ తేదీ, దేశాభిమానినుండి.)

ఈ గ్రామమున నియోగి-వైదిక కక్షలు బాగుగ బ్రబలినవి-ప్రబలుచున్నవి. వీటి కంతకు గారణము యీ పత్రికయం దింకొకచో బ్రచురింపబడిన "నియోగి, వైదికశాఖలవారి కొకవిజ్ఞాపన" యనుదానియందు సూచింపబడిన, "ద్వైతాద్వైత" ఏర్పాటే కారణమని తలచెదము.

(ఫిబ్రవరి 2 వ తేదీ 1912 సం॥ కృష్ణాపత్రికనుండి
ఒకనియోగివద్దనుండి.)

... దీక్షితులుగారు చనిపోయిన తరువాత కొంతకాలమున కీగడబిడయణగెను. ... ఇట్టికాలమున ద్వైతాద్వైత మతస్థాపకులగు ... శర్మశాస్త్రిగారు బయలుదేరిరి. ఆదిశంకరాచార్యులువారు అద్వైతమతస్థాపకులు, ఆచార్యులవారికి

మచటికి నేఁగి వేంటిసభ్యాం దవధానము చేసియుంటి మ
ప్డచటికి వచ్చెఁ గొప్పరపుటాయన చూచు కుతూహలమ్ము నన్.

చ. తగుగతి మాట లాడితిమి తద్దయుఁ బ్రీతి జనింప లేశమే
నగువడదేరియుండుఁ గలహాంకుర, మాదిన మట్టులేగ నొ
ప్పగ మఱునాఁడు మా బసకుఁ బ్రొద్దుటవచ్చె, బహూకరించినా
మగణితమైన ప్రేమమున నయ్యయిగోష్ఠులఁ బొద్దుపుచ్చుచున్.

గీ. "తలఁచుమీపాదములె మాకుఁ దొరలుచుండుఁ గైతలో" నని కొప్రంపుఁగవి
వచించె, వయసు చేఁ బెద్దలముగానవచ్చునంచు, నతని మాటకు బదులుగానంటి మేము

చ. పిదప నెనో కవిత్వమును విన్కి యొనర్చెను వింటి మెంతయున్
ముదము నటించి యంటిమి సమున్నతు లెందఱొ యప్పు డయ్యెడన్
బొడలుచు నుండి రంతటను బుట్టెను సుంత వివాదబీజ మ
య్యది వివరింపఁగా వలదె యార్యులనెమ్మది కెక్కు నట్లుగన్.

ఉ. స్నేహమ్మకల్మిఁ దిర్పతి వచించె "నొకించుక మీరు శాస్త్ర స
న్నాహము కల్గియుండిన ఘనప్రతిభుల్ మిము నింతకన్న ను
త్సాహముతోడ మెచ్చెదరు సంస్కృతభాషకుఁ దెల్గుభాషకున్
స్నేహము మెండు" నాఁగ నొక శ్రీకరుఁ డాంధ్రనియోగి యిట్లనెన్.

ఉ. "బాగుగఁ జెప్పినార లిటు పల్కినవాఁడనె యేనుగూడ స
ద్యోగతిగాఁ గవిత్వ మది యుండిన నుండెడుఁ గాక మేటిసు
శ్రీగల కావ్యమున్ సలుపుచేఁతకుఁ బాండితి యుండుటొప్పు లే
దా! గణుతింప రెవ్వరును నార్యులు, గాలికిఁ బోవు నాశువుల్." 16

---

సమస్తశాస్త్రములు సాంగోపాంగముగా తెలియును. శర్మశాస్త్రిగారికి ఒక్క శాస్త్రమైనను రాదు. ఇంతే ఆచార్యులవారికిని శర్మశాస్త్రిగారికిని గలభేదము. వీరు నియోగ మతసిద్ధాంతమును పునర్జీవిగాజేసి నియోగులకు బంధుయాజనయును వైదిక పురోహితత్యాగమును నేర్పుచు శిష్యులను పోగుఁచేసికొని తమకు వచ్చినంతవరకు ............ తద్దిన మంత్రములను శుభాశుభకర్మలను ఇంకా ఇతరములను నేర్పుట నియోగులనుండి చందాలు పోగుచేయుచు ... దండము చేత ధరించియు దేశసంచారము చేయుచు ముఖ్యముగా గుంటూరుజిల్లాయందు పని చేయుచున్నారు.

గీ. ఇతఁడు జూపూడికులుఁడు సంస్కృతమునందుఁ
బ్రజ్ఞగలవాఁడు * సుకవి స్వభావనమ్ముఁ
దల్లసీమ నియోగులయందు రామ
రావు తరువాతనితఁడె కరంబు మేటి.

క. జూపూడి హనూమత్కృతి, యీపగిది౯ బలుక వెంటనే యానుడి సం
స్థాపించుచుఁ గోటీశ్వర, శాపాయుధుఁ "డౌను జదువఁజను వీర" లనె౯.

చ. ముగురును నిట్లు వల్కుటయు మోమున వెల్వెల దోఁచెఁ బాప మా
నుగుణికిఁ గొప్రపుంగవికిఁ; జూచి యి దొప్పని త్రోవయంచు వీ
రిఁగ నిటు లాడుచుండినను నిందుల కొప్పఁగ రా దటంచు నొ
ప్పిగఁ గని వేంకటేశ్వరుఁడు పేర్మి గనంబడ నిట్లు వల్కెడు౯.

ఉ. "ఏగతి నిట్టులాడెద రహీనుల రయ్యును విద్దె రానిలో
టే గణియింతు, రీయనఘుఁ డెంతయు దట్టుఁడు పూర్వ పుణ్యమే
సాగఁగఁ జేయు నీతనికి సత్కవితాగరిమం" బటంచుఁ దా
నాఁగఁగ, వార లిట్లనిరి యాతని కేకము గాఁగ మూగురు౯.

ఉ. "ఎందుల కిచ్చకంబు, లెవఁడేనిఁ గవిత్వము చెప్పనేని మె
ప్పందునయేని విద్యయెడ నంతయు యింతయు ప్రజ్ఞ యుండు టెం
దుం దగు లేక యున్నయెడ దోసము లుండకమాన"వంచు వా
రందఱు నేకవాక్యముగ నాడిరి యుక్తివిశేష మేర్పడ౯.

చ. అది నిజ మంచెఱింగియును నాప్తుఁడు కొప్రపుసోదరుండు నె
మ్మది నెటు లెంచునో యనుచు మాటికిఁ గొంకుచుఁ "బోతరాజుగా
రెది పఠియించె, నింక నొకఁ డేది పఠించెఁ! బఠింపకున్న నే
కొదయును రాదు నిక్క" మని కొప్పరపుంగవిపక్షు మానుచు౯.

---

బ్రః॥ శ్రీ॥...గారి పాదపద్మముల సన్నిధికి

* చ. నవకవితావిలాసినికి నాయకు లాంధ్రనృపాల సత్సభా। భవనము లందుఁ బూజ్యులు శుభంకరమూర్తులు మప్పురివర్తనో । ద్భవకుకవీంద్రగౌతము లుదారులు తిర్పతివేంకటేశ్వరుల్ । స్తవమున కర్హులౌకవులసన్నిధికి౯ విలిఖింతుఁ బత్రము౯. తే. గీ. శతవధానాది కవితాప్రశస్తులైన । మీకు నేఁబద్యముల్ వ్రాయమేలుగాదు । కొంచెమో గొప్పయో నేనుగూడ నట్టి । వాఁడననుటను దెలియక వ్రాసినాఁడ.

4-2-11

జూపూడి హనుమచ్ఛాస్త్రి,
శతావధాని, బండారుపల్లి.

క. వాదింపఁ దుదకు నెట్టులొ, వాద మెదుటివారు నెగ్గి "పాండితి కవికిన్
లేదేనిఁ గవిత యది కొఱఁ, గా" దని సిద్ధాంతపఱిచి కడుఁ జేర్మి మెయిన్.

క. బోధించిన విని యాతఁడు, సాధుత మెఱయంగఁ జదువుఁ జదువఁగనొప్పెన్
గాథ యిది వేంకటేశుఁడు, శోధించుచునుండె శంక చొప్పడుకతనన్.

ఉ. ఎందుల కీప్రసంగ, మితఁడెట్టిఁడయే నగుఁగాక, చూడ వ
చ్చెం దనవారుఁ దాను; నిటు శ్రీపతి యూడఁగరాద, ఆడెఁబో
బందుగులో నియోగులును బల్కుట యేటికి సంభవించె, నెం
దెందునొగాక యీపలుకు లిక్కడ వచ్చు టయుక్త మెంతయున్.

ఉ. చూడకమున్న మెచ్చితిని సోదరులన్, మఱి చూచినంతలోఁ
బోఁడిమి కొంత తేలె, నిఁకఁ బోలద వేఱొకమాట వల్క 'ము
క్కోఁడొ యొకండు గోసికొన నెల్లరుఁ గోసికొనంగ లేదె' యా
జాడయె యిప్డు పట్టవలె సత్యముతోఁ బని లేను సుంతయున్.

చ. తిరుపతి మెచ్చు లే దనియుఁ దీరిక నూరక మెచ్చె వేంకటే
శ్వరుఁ డొకరుండుమాత్ర, మని స్వాంతమునందు నెఱింగిరేని యె
వ్వరు పయి కాదువార "లని పంపిరి యిర్వురఁగూడ" నంచు రం
దరసినఁ గన్పడున్ దిరుపతయ్యయు వారికి సాక్షిభూతుఁడై.

తే. గీ. అట్టిచో నిప్పు డిటులాడు టంత మంచి
మాటగా దల్లవారికి మంచి గోరి
చెప్పినను నన్యథాబుద్ధి సేయు జగము
కాని యిందొక్కలాభంబు గలిగె నేఁడు.

క. తిరుపతితోఁ బాటుగఁ గొం, దఱు తద్బంధువులుగూడఁ బద్యావ్యక్యము నే
సరి యనుటె కాక మున్నే, తఱచుగ బోధించువిధముతగఁ జెప్పిరొగిన్.

చ. మనయెడఁ ‡ గొప్పరంపుఁగవి మన్ననయున్ గడుభక్తియుక్తి యుం
డి నడచుచున్న యట్టులు గడిందిగ సాక్ష్యము లుండె వీరలన్

‡ (1910 సం॥ డిశంబరు 10 వ తేదీ ఆంధ్రప్రకాశికనుండి.)
కొప్పరపువారి అష్టావధానములోని పద్యము

చ. అరుదుగనిచ్చు మెచ్చి విబుధావళియేతమశ్లోక మెన్నఁగా
హరువుగ శ్రీపమన్వితులునై విజయానుచరత్వమూని యా
తిరుపతి వేంకటేశ్వరుల తీరునఁ జెప్పఁగనొప్పినారిలన్
దిరుపతివేంకటేశ్వర సుధీరులె శ్రీకనుపర్తిపంకజా!

గనకయె మెచ్చియుంటిమి పగల్ మఱి యెవ్వియులేవు, వారికిన్
జనవున నేని యెందులకు సల్పవలెన్ హితబోధ బాధగన్.

---

(1911 ఫిబ్రవరి 1 తేది బుధవారం శశిరేఖ, నుండి)

శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరుల ప్రశంస.

చ. తిరుపతివేంకటేశ్వర సుధీశ్వరులార ! మహేశ్వరీకృపా
భరపరిలబ్ధభవ్యమతివల్లభతానతసర్వసత్క్రవీ
శ్వరధరణీశ్వరార్పితలసద్రసవత్పదపద్యమండనా
దరణగుణప్రభూతకవితావనితామహితానురాగసుం
దరతరమూర్తులార ! రచితాద్భుతకృత్ప్రథితప్రబంధబం
ధురతరహృద్యపద్యచయతోషితపండితమండలీసుదృ
క్సరసిజనిస్సరన్మధురసభ్రమకారిముదశ్రువారిశీ
కరపరిషిక్తహస్తపటకల్పితశీతలవాతపోతవి
స్ఫురితతనూసుఖాకలిత పుణ్యజనస్తుతివాగ్విరావసం
భరితసమస్తపట్టణనివాసజనాంచితమానసాంతరాం
కురితనవానుమోద రసగుంభితపద్యకవిత్వమల్లికా
పరిమళితాష్టదిక్క్రహరభాసురకేసరులార ! భూసురో
త్క్రమణులార ! మిత్రజనతామరసాకర మిత్రులార ! సు
స్థిరపరమోపకారగుణసింధువులార ! శతావధానధీ
పరిణతులార ! పూజ్యకవిబాంధవులార! విధేయులైన సో
దరకవులిచ్చు వందనశతంబులివే కరుణన్ గ్రహించుఁడీ.

చ. ప్రవిమలభవ్యసద్గుణవిభానురుఁడైన పరిభాకరాఖ్యస
త్క్రవివరుఁడిష్టా యస్మదవధానము గన్గొని తెల్పినంతనే
సువిలసితాఖిలార్థపదసుందరపద్యకదంబకంబు మా
కవునని మెచ్చిపంపిన దయాళుల మిమ్ము నుతింప శక్యమే.

క. ఒరులన్ మెచ్చినచోఁ దన । పరువుచెడుసటంచు నెంచుపద్ధతి నీశ్లా
ఘ్యకరమగునీకలివేళన్ । బరమామోద మిడె మీస్వభావంబు బళీ.

ఉ. యక్షుపసంపదం గనినయట్టి ధనాఢ్యులొసంగు వేయి నూ
ర్లాక్షణ ముండియేచనెడి నక్షరసంపద గన్న మిమ్ముఁబోల్
దక్షులుమెచ్చి యిచ్చు సుకళాంచిత మైతగు శ్లోక మెంత కే
నక్షరసంపదన్ మిగుల నందినశ్లోక మొసంగఁజాలెడిన్.

చ. అనిమనమందు వెంకన తనంతన సందియ మందుచుండి యా
తనియెడఁ బ్రీతి యెక్కుడుగఁ దద్దయుఁ జూపి బహూకరించుచు
న్నను మనమందు నాకుకవి "నాకిటుతిర్పతిశాస్త్రి బోధచే
యఁడె" యని కొంకుచున్నటులె యూహకువచ్చుచునుండె మెందుగన్.

ఉ. ఇంతకు ముస్నె చెప్పఁదగు నింకొక సంగతి; రామయాఖ్యుఁ డ
త్యంతము కీర్తిశాలి ఘనమై తగుపద్ధతిఁ బొల్చువాఁడు శ్రీ
మంతుఁడు మమ్మువిందునకు మన్ననఁబిల్వఁగ నేగుదెంచె స
త్స్వాంతులు బంధుగుల్ బలసి తన్నును వెంబడిఁ గొల్చుచుండఁగన్.

ఉ. వచ్చినతోడనే పలికె నారక యాతఁడు "మిమ్ము నేఁడు మే
మిచ్చటఁ గోరకోర్కులివి, యెయ్యవి యందురయేని! విందుకై
వచ్చుట యొండు, నాపుత్రుఁ బాముకులన్ గరఁ గించుటొండు, వి
ద్వచ్చయమాన్యతల్ మునుపె తద్దయుఁగాంచితి రీరు నావుడున్.

చ. జనసుతులార ! మీపురమునన్నిధిప్రాభవ గొప్పవోలులన్
గని యవధానముల్ జరుపుకాలమునం దటకేగుదెంచి ద
ర్శన మొనరింపఁగా మదిని జాలఁగఁగోరితి మప్పుడింటఁ ద
ప్పని పనిగల్గుటన్ జనుట పాల్పడెఁగావున నాఁటికోర్కె దీ
రని పెనుచింత యింత యని వ్రాయఁగ శక్యముకాదు లేఖినిన్.

శా. లాఁతింబోని రసజ్ఞశేఖరుల కుల్లాసంబుగల్పించి వి
ఖ్యాతింజెందిన మీకుఁ బద్యముల నీఁ గాంక్షించినా మివ్వి మీ
చేతఃప్రీతిఘటింప నేర వయినన్ జేకొండ్రుగా కాప్తులై
"శీతాంశో రమృతార్పణం" బను నుడిం జింతించి ధీరోత్తముల్!

ఉ. సత్కవితావిలాసము ప్రసంగఁగ నీమదరాసులో సుధీ
రోత్కరమాదరింప నిపు డుండియు బందరుచేరి మిమ్ము సం
పత్కరులం గనుంగొనెడు భాగ్యము గోరుచునుంటి మింక వి
ద్వత్కవివర్యులార ! భగవంతుఁడు మాకది సంఘటించుతన్.

క. అరనిముస మయినఁ దీరికఁ బొరయుమిచే నిన్నినాళ్లు బోయెను బ్రత్యు
త్తరమున్ వ్రాయఁగ గావునఁ గరుణక్షమింపవలె నిది జగన్నుతచరితుల్.

ఇట్లువిధేయులు, కొప్పరపు వెంకటసుబ్బరాయ, - వెంకటరమణయ్య.

ఉ. పలికెను వేంకటేశ్వరుఁడు భావ మెఱింగి "పధాన మైనయ
వ్వల నది యట్లు చేయుదము పండితులొప్పని ఫక్కియేల! వా
రలు మఱియన్యు లొప్పికొనురాణనె పోవుద" మంచుఁ బల్కిన
ప్పలుకులు వించుఁ దిర్పతియుఁ బల్కె సమంచితఫక్కి నీగతిన్.

ఉ. కోరినకోర్కెలం దొకటి గొప్పదిగాదు, మఱొక్కటో, మహా
భారము, పామరుల్ గరఁగుపద్ధతిగాఁ గవనంబు చెప్పనా,
దారులు మున్నెఱుంగ మది దప్పని దందుఁగయేని వ్రీడసం
హారము కాక యెట్లొదవు నట్టికవిత్వము నేఁడు మా కొగిన్

ఉ. "వ్రీడ" యటన్న పల్కతఁడు వేయక వేయుతెఱంగుఁ జూపె నా
ప్రోడ వచించుమాట యది పూర్తిగ వ్యంగ్యపురంగు లీనుచున్
"మాడలతోఁ గవిత్వ మది తుందుడుకొప్పఁగఁ జెప్పకంటె సి
గ్గేడను లేదు దానికిఁ గవీంద్రులు పూనరు వేయునేటికిన్.

ఉ. కొప్పరపాశుధార యది గొప్పగ మీమది నెంచి మీరు మ
మ్మప్పగిదిన్ దడాబిడిగ నల్లుట కోరుచునున్నవార లా
తప్పదు కైత చెప్పినపదంపడి * పండితులెల్ల నవ్వ నా
యొప్పమి కేరు పాల్పడుదు రూరక వాఁగుటయున్ గవిత్వమే!

చ. చదువనివాని పోలికిని "జర్చర చర్చర" విద్య నేర్చువాఁ
డది వచియింపఁగాఁ గలఁడె! యెందును 'లా' యెఱుఁగంగ లేనివా
ర్వదరెడిపోల్కి 'లా' తెలియువారు వచింపఁ గలారె! శాస్త్రసం
పద యడఁచున్ వదావదత, పామరమాన్యత కైత కేటికిన్.

---

(4-8-11 వ తేదీన వేటూరి ప్రభాకరశాస్త్రి పేర కొప్పరపువారు
వ్రాసినలేఖనుండి.)

" ... మరుసటిదినము ఉదయమున వారు (తిరుపతి వెంకటేశ్వరులు) రంగావఝ్ఝుల హనుమయ్యగారు అను ప్లీడరుగారియింట్లో నుండఁగా దర్శనము చేసికొనుటకు వెళ్ళినాను, వెళ్ళి వారినిగుఱించి నాకుండుసంతోషమును భక్తి భావమును వెల్లడించుచుఁ గొన్నిపద్యములను చదివి 11 గంటలకు మరల భోజనవేళయగుటచే శ్రీఏకా రామయ్యపంతులుగారింటికి వచ్చినాను,...

(శ్రీజయంతి రామయ్యపంతులవారి యుత్తరమునుండి)

......ఈకలహమునకుఁ బూర్వము వారికి మీయందు గౌరవముండెనని నే నెఱుఁగుదును, వారికి మీరు సాదరముగాఁ బద్యములంపినారు, మీకీ భేదము నితరులు కలుగఁజేసినారు....

* శ్లో. నాఽకవిత్వ మధర్మాయ, మృతయే దండనాయవా, కుకవిత్వం
పున స్సాక్షాన్మృతి మాహుర్మనీషిణః. (మహాకవి దండి)

ఉ. “ప్లీడరు బల్ల గ్రుడ్డ” యని వేమరుఁ జెప్పుచు మెప్పు చూపు నా
జాడకవిత్వమున్ సలుపు శైలికి సత్కవి పోఁడు చక్కఁగా
దూడలు రాకయుండుగతి దూఁకుడుగాఁ గవనంబుఁ జెప్పినా
ప్రౌఢలె పెద్దనాదు, లిటు పోయిన వారికిఁ బేరు నిల్చునే

ఉ. బొబ్బిలిపాట మెచ్చఁ దగుపూజ్యులు గొందఱు, బొమ్మలాటపెన్
బొబ్బలు మెచ్చఁగాఁ దగిన పుణ్యులు గొందఱు, వీరిమెచ్చుకై
సిబ్బితి వీడి యే సుకవి చెన్నఁటికైతకుఁ బూన నేర్చు! ‘మే!
లబ్బెను మ్లేచ్ఛభాష తుద’ యన్న బుధోక్తికిఁ దా వొసంగుచున్.

చ. రయముగఁ బండుధాన్యము కరం బహితం, బది కూలినాలికిన్
వ్యయ మొనరించి యించుక యనంతర మేయవి పండు వానినే
కయికొని గాదెఁ బోసికొనఁగా ఘననాగరికుల్ దలంతు ర
ట్లయితిగఁ జెప్పునాశువును నాశువు నప్రియమున్ బ్రియంబు నా.”

ఉ. ఇంతటివ్యంగ్య మిచ్చుగతి యేర్పడఁ దిర్పతి పల్కె దానిపైఁ
గొంత మనమ్ములో వగపుఁ గొప్పరపుంగవి దాల్చె; దానికిన్
జింతగలట్టి వెంకనయుఁ జేయునుపాయము లేక యెట్టులో
సంతసమున్ ఘటించుటకుఁ జల్లఁగ నీగతిఁ బల్కె నొప్పుగన్.

మ “వినుఁడీ రామయగారు! మాహృదయమున్, వేయేల! ఘంటాశతం
బును జెప్పం బ్రయతించువాఁడె* కలుపున్ బూర్వోక్తముల్ పద్యముల్
మనవా రెట్టులు కల్పకుందు! రిది సామాన్యంబు, పూర్వోక్తవ
ర్ణనముల్ చేరని యట్టి దేకథయు నుండన్ బోదు లోకమ్మునన్.

ఉ. అప్పుడె కైత చెప్పినను నజ్ఞుఁడు నమ్మనుగాని, ప్రాజ్ఞుఁడో!
చెప్పిన విందుఁ దూర్చెనని చిత్తములోఁ దలపోయు ‘నాశుగాఁ

---

* (జూలై 1912 సం॥ ఆంధ్రభారతిలోని శ్రీకవిరాజు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలవారి వ్యాసమునుండి.)

......మఱియు నీయాశుకవులు:— “గీ. జల్లిపదములు నాలుగు సంతరించి। గురువులిడుచోట లఘువులు కొన్నిగూర్చి। విరతిగూడక మీఁదులు వెదకికొనుచు। నచ్చుపొల్లుల పైనుంచు నతఁడు కవియె.” అనుసీపద్యాభిప్రాయమునకుం బాత్రులై దేశాటనము చేయుచుం బ్రార్థించి సభలు చేయించుకొని సభలలో నేదే నొకవిషయమియ్య దానిఁగూర్చి పద్యములు నోటికివచ్చినట్లు చెప్పుదురు, ఆచెప్పుటలో నదివఱకుఁ బెక్కు చోట్లఁ జెప్పినవియు నుండును.........

—

జెప్పెడివారిపట్ల నిది చెల్ల' దటందురొ ! * కొన్ని యాశుగాఁ
జెప్పను వచ్చుఁ గొన్ని మును చెప్పియుఁ దూర్చను వచ్చుఁ గొల్లగన్.

చ. వలసినఁ జూపువార మిది వాస్తవ; మిట్లొనరింపకుండ నా
నలువయు నాఁపనేరఁడిది నమ్మరయేనియుఁ గొప్పరంపువా
రల నడుగుండు భిన్నమగురాణను జెప్పుదు రేమొ" యంచు న
వ్వల నల కొప్పరంపుఁగవివంకకుఁ గాంచి సుహృత్త్వమేర్పడన్.

మ. "కలదే మాదగుప్రశ్న కుత్తరము వక్కాణింపుఁ, డీ రట్టివా
రలు గా, రాశువునందె చెప్పుదురు సర్వంబున్ మఱేరేని యి
ట్టులు వాదించిన వారి కుత్తర మదెట్టుల్ ! పూర్వప్రబద్ధముల్
గలియన్ మానెడువెట్టులుందు రని వక్కాణింపఁగా నేర్తుమే.

---

(* 1911 సం॥ జూలై, అభినవసరస్వతిలోని ఆచార్యశిష్యవ్యాసమునుండి.)

( సోదరకవులు )

......నిర్దుష్టములగు వృత్తములు నూటికి 45 కి పైగా వల్లించిన పద్యములైయుం డునని రెండు మూడు సారులు వీరి యాశు కవితను వినియేమాత్రమైనధారణగల్గు ప్రతిబాలునకును దోఁచకపోదు దీనికి దార్కాణముగ "సరసిజ వైరివైరి నెక సక్కెములాడెడు మన్యమంబుతో సరసిజవైరివైరినగఁ జాలెడుమేలగు కప్పు కొప్పుతో, సరసిజవైరివైరులపసం దులఁ మాఁగు కుచద్వయంబుతో సరసిజగం ధివచ్చె నలుసన్నిధికిన్ మదనాశుగంబనన్" అనుపద్యము మున్నగుకొన్ని పద్య ములు పట్నములో నలచరిత్ర యాశుధారగఁ జెప్పినపుడు చదివితిమని మాగురువు గారికి వినిపించిరి. ఆపై పద్యములనే గుంటూరిలో జరిగిన రెండపసభలో సావి త్ర్యుపాఖ్యానములో "నలుసన్నిధికిన్" అనుచోట "నృపసన్నిధికిన్" అని మార్చి చదివిరి. ఇటులనే "నిష్కపటస్వభావమున" ఇత్యాద్యనేకపద్యములు శ్రుతపూర్వములే విననయ్యెను. ... ... ... ...

(1912 సం॥ ఆర్యమతబోధిని 8 వ సం పుటమునుండి)

...... వీరు (కొప్పరపువారు) చేసికొనియున్న పద్యములు చదువుదురనుట సత్య మునుగాదు; అసత్యమునుగాదు. అదివఱకుఁ జేసికొనియున్న పద్దెములొకింత సారము కలిగియుండును. అప్పటికప్పు డల్లునవి చాల పేలవముగానుండును. వీరు చెప్పిన పద్యములే మరల మరల చదువుచుందురనువాదుక పూర్తిగా నసత్యము కాదు. ఒక్కసారియే విన్నవారి కీవిశేషము తెలియదు గాని రెండుమూడు సభ లకుఁ బోయి విన్నవారికి సందియము తీరిపోవును. గంజామువారియింటను, గళా శాలలోను జదివిన పద్యములు కొన్ని పోతాప్రగ్గడ వారియింటను వచ్చినవి...

గీ. 'అమ్మతో'డని 'బాబుతో'డని వచించి
జందెములు పట్టికొని సరస్వతిని సాక్షి
భావమున నిల్పి నమ్మింపవలయు నంత
కర్మ మేమిటి కత్యాశకవనమేల.

మ. అవధానాదుల భిన్నభిన్నముగ నాయావృత్తముల్ గోరఁ జె
ప్పువిధానం బది యాశుగాదె ! యచటన్ బూర్వోక్తముల్ చేరు వం
చెవఁడున్ బల్కఁడు పల్కనేనిఁ ద్రుటిలోనే వానినమ్మింపనా
నెవఁడున్నమ్మనిపూన్కి యేల యని మే మీక్షింప మాయాశువున్.

గీ. భిన్నభిన్న విషయంబులు పెట్టిచెప్పి
నమ్మఁగాఁజేయవచ్చు నిక్కమ్ము బుధుల;
నంతియేకాని కథలఁగళ్యాణములను
జెప్పినమ్మింప లేమింత సిద్ధ"మనుడు.

గీ. ఉత్తరము లేనియట్టియీయుక్తిమీఁద
నన్య మేమియుఁబలుకక "యౌను నిజమె
నమ్మవలె నమ్మకున్నను నమ్మఁజేయఁ
దగినయాధార మది లేమి తథ్య"మనియె.

వ. పిదప "నిది యితరవిషయము, సదమలమగుమీదుపూన్కి సత్యమ యగు" నం
చెద నతనికొంకు దీర్చిన, పదపడి వారెల్లఁ జనిరి భవనంబులకున్.

గీ. వెడలునపుడు కొప్రంపుఁగవి యొకయింత
తనదు మదినొచ్చిన తెఱంగు కనఁబడంగఁ
"దమకు సాధ్యముగానియద్దాని నొరులు
ఖండనము సేయు టెందునుగలదె"యనియె.

క. అనుమాటకు మార్పలుకక, చన నిచ్చి యనంతరంబు చర్చించిరి యా
తనితుదిపలుకునఁ గలదు, ధ్వనియును నాతనికిఁ గలుగుదర్పోద్ధతియున్.

చ. తిరుపతి యిట్లుపల్కు "వెనుదీయపు పత్రిక యొందు కంపి తీ
వరయక యక్కటా ! సుకవితాచరణంబు లఁంబు లేదు త
త్పరిచితి కించుకేనియును బాండితి గన్పడ దట్లొ యూరకే
పరుఁగిడువారిపై నెటులు పర్వె భవత్కరుణాకటాక్షముల్ !

తే. గీ. వెట్టివెల్లాఁటి గాన వివేకియయ్యు
నాశ్రయణమునకోడి నీకలప్రభాక

ఱుం డొనర్చె ‘సిఫారసు’ వొందుదు నీదు
తెలివి యేమయ్యెఁ! బద్దెముల్ గిలుక నేల?

ఉ. ఆగ్రహ మేగుదెంచి వనునట్లె యనుగ్రహమైన నట్లెనీ
యుగ్రత, నీదయోదయము నొక్కని దించు మఱొక్కనిన్ యశో
వ్యగ్రు నొనర్చు నీకివి కళాకళ, లట్టులె కాదయేని నీ
వాగ్రచనావిశేష మెటు పర్వెను గొప్పవారిమీఁదికిన్.

క. నిన్నటిసభలో నెదో చె,ప్పెన్నారాయణ ! యదియుఁ గవిత్వమె యకటా!
నిన్నేమనందుఁ గనుమీఁ, దన్నెతి మెచ్చంగ రాదె తత్తఱమేలా.

చ. పురపురఁ బంపినందులకు బుద్ధిని జెప్పెద రింకఁ జూడు వా
ర్పరపర చెప్పుపద్ధతిని బాడఁ గలాఁడవె నీవు? లేనిచో
గరువమెకాని యాశుకవి గాఁ డలవెంకన యంద్రు సూచనా
స్ఫురణము గొప్పరంపుఁగవి పోవుచుఁ గన్పడఁ జేసెఁ జూచితే"

చ. అనవుడు వేంకటేశుఁడను "నంతకు వచ్చుట నిక్కమేని నేఁ
బనిగొనువాఁడ నప్పనికిఁ, బన్పన నాశువె చెప్పలేనె! యం
దునకుఁ బ్రయత్నమేల! యిదె తుందుడుకుం గవితన్ వచింతుఁ గ
న్గొను"మని చెప్పఁగాఁ దొడఁగెఁ గొక్కిరి బిక్కిరిపద్యపుంజముల్.

చ. తిరుపతి యిట్లు పల్కె, నిడిదెప్పరమే, "తుద కెట్టులబ్బె నీ
తురకలబాస" యంచు నిను దూఱుదు రక్కట ! పండితుల్, యశ
స్కరపుఁ గవిత్వమున్ సలుపు * సత్కవి కియ్యది త్రోవ గాదు, కా
దరయఁగ నాశు వియ్యది; రయంబునఁ బాడినయంత నాశువే?

* (శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారి వ్యాసమునుండి.)
......మఱియు నీయాశుకవిత్వమందు గంట కిన్నివందల పద్యములు కావలయుననియేకాని యిట్టి యిట్టిపద్యములుండవలయును, అన్వయము సరిగనుండవలయును గణములు, యతులు, ప్రాసములు, ఛందము, వ్యాకరణము, శబ్దము, అర్థముసరిగ నుండ వలయునని నియమములేదు. ఉన్నదన్నను లాభములేదు. ఆపిచ్చిధోరణిలో నొక ప్రాసమునకు మఱియొక ప్రాసము,నొకపద్యమునకుమఱియొక పద్యము, మూఁడు చరణములు రెండుచరణములు, రెండున్నరచరణములు,నొక్కచరణము గలపద్యములు పుట్టుచుండును. మఱియు ననేక మహాదోషములిందు నిండియుండును. అట్టియాశుధారా కవిత్వము వినునప్పుడు మదికింపు సంపాదింపదు. ఓటితాటియాకు చేద వాయించుచున్నప్పు డెట్లుండునో యట్లు వెగటుగానుండును

చ. నిజమగు నాశుధారయన! నెన్నని తెత్తెతె పెప్పె పేలు లే
కజతరుణీ కృపన్ గలము వాఁగక చెప్పటొ గుప్పటో యగున్.

అని నిశ్చయముగాఁ జెప్పఁగలను. ఇది పద్య మెఱుఁగని పామరులకుఁ దక్క దక్కిన వారికందఱకు నిట్లే యుండుననియుం జెప్పఁగలను. ఇట్టి కవిత్వము చెప్పుటకుఁ బ్రయత్నించువారు గురులఘుజ్ఞాన మించుకంత సంపాదించుకొని యిప్పుడిప్పుడే ప్రపంచమునఁ దలయెత్తుచున్నవారని నిశ్చయించుకొనునది. అట్టివారికి నహంకర్తృత్వాభిమానము మెండు. వీరే గ్రాగుచున్న పాలు. ... (ఆంధ్రభారతి)

(23 వ జూలై 1912 సం॥ సువర్ణ లేఖలోని, టంగుటూరి శ్రీరాములు, ప్లీడరు, బి. యే. కార్లిలియన్ ఎడిటరుగారి వ్యాసమునుండి)

సు క వు లా - శు క ము లా.

...... కవిత్వమన నేమో కవులనగా నేమో చక్కగ తెలిసియుండవలసిన సదభిప్రాయులగు కొందఱు విద్యాధికులుగూడ ఇద్దరు కవిమాత్రులను లేక యేవో పద్దెము లల్లగ నేర్చినవారిని దైవసములుగ పూజించుచున్నారు. వారిని కొప్పరపు కవులని పిలచెదరు. మరికొందరు సరస్వతీ అవతారములనియు కవిచక్రవర్తులనియును భావించుచున్నారు. అక్కడక్కడ వారికి స్వర్ణపతకములు నగలు బహుమానములు,కవిసింహులు, కవిచంద్రులు, కవిభాస్కరులు మొదలగు బిరుదనామములు నెన్నియో యొసంగబడుచున్నవి నపయోవనులును విద్యాధికులునగు శ్రీపిఠాపురము రాజాగారు గూడ వీరి చిత్తజల్లుమాటల కవనమున మోసపోయి ఈ రెండపరకముపద్యనిర్మాతలకుగా రూ 1116 లు పాడుచేసిరి. ఏది మంచికవిత్వమో, ఏదికాదో యనుసంశము నింతమంది విద్యాధికులు సైతం మెరుగపండుట మిక్కిలి వింతగనున్నది. వింత వింతధ్వనులు గలమాటల కవిత్వమునకు పశువులుమ, బాలురును, ఆటవికులును, సంతసింపదగినది. విద్యాధికులన్న నట్టికవిత్వముగాక కొంత సత్కవనమును కోరదగినది. అవాచకములనో సువాచకములనో ఛందోబద్ధముగ వ్రాయుటగాని నుడువుటగాని కవిత్వముకాజాలదు. ... ఆంధ్రకవిత్వము యొక్కయు ఆంధ్రవాఙ్మయము యొక్కయు నభివృద్ధిని కోరుపట్ల ప్రజ్ఞారహితమును అనర్థదాయకమునగు కవనమనబడుచున్న కొప్పరపు సోదరుల యాశువును నిరసించుటకు బదులు ఎందరో అనాలోచనముగ వారికి ప్రోత్సాహము గలిగించుచున్నారు. ఆంధ్రకవిత్వమును ఆంధ్రవాఙ్మయమును నభివృద్ధి నొనరించు మార్గమిదియేనా? ఆంధ్రవాఙ్మయమున స్వతంత్రగ్రంథ రచనకు ప్రోత్సాహముకలిగించు మార్గమిదియేనా! సుకవనమందు సదనురాగము గలవారందరు ఇట్టి కవన మనెడి

గజిబిజి పద్యబిత్యుములు గాఁ బచరించుట నిన్నుబోఁటి యా
రజపుఁగవుల్ గొనందగదు రంకుగతిఁ బరుగెత్తు * టాకువే!

యాశువును నిరసించుట విధాయకమగునా, కాదా? పిఠాపురమురాజుగారి వంటి ధీయుతులుగూడ ఈరీతిగల కవిత్వమునకుగూడ 1116 లు ఎందుకు పాడుచేయవలెను....

(1912 సం॥ 19 జూన్, దేశమాత నుండి)

...... అయితే నేను వారివీరిమాటలను విని వ్రాయువాడనో కానో నన్ను ఎరిగినవారందరు ఎరుగుదురు. నాతో ఎదురుగా వాదించిన వారి నందరను కొప్పరపువారి కవిత్వము నిజమైన కవిత్వము కాదని ఒప్పించియున్నాను. మీపత్రికలో వీరి కవిత్వమును గురించి నాకు తీరుబడిగావున్నప్పుడు ముందు ముందు విశదముగా తేటతెల్లముగా వ్రాయు నుద్దేశముతో నే మీగత సంచికలో ప్రచురించిన చిన్న ఉత్తరమును నేను వ్రాసియున్నాను. చర్చలకు వాదములకు కొన్నికొన్ని నీతి పద్ధతులున్నవి. ఆ పద్ధతులకు లోబడి చర్చించు వారితో చర్చించుటకు నేను సిద్ధముగానున్నాను. వారు పొగడినారు వీరు పొగడినారు కాబట్టి మీరుపొగడవలెనంటె నేను ఒప్పుకొనువాడనుకాను. కవనమనగాఏమిటో,కవులనగానెవరో,కొప్పరపువారి కవనము ఎట్టికవనమో ఈ అంశములునిమ్మళముగా చర్చించి నన్ను ఒప్పించినయెడల నేను వారికవనము పొగడుటకు సిద్ధముగానువ్నాను. చర్చించవలసిన అంశములను గంగలోకలిపి పచ్చిబూతులపంచాగములువిప్పి దెబ్బలాడ తలచుకొన్న గొప్పగొప్ప పండితులతో సమానముగా దెబ్బలాడ శక్తిలేనివాడను కనుక, వారితో నేను చర్చించ తలచుకోలేదు. తిరుపతి వెంకటేశ్వరకవులని పిలువబడు వారికిన్ని కొప్పరపుకవులని పిలువబడు వీరికిన్ని గుంటూరులో జరగిన కాట్లాటవంటి కాట్లాటకు నేను శక్తిగలవాడనుగాను. 18-6-12 టంగుటూరి శ్రీరాములు.

* (అభినవసరస్వతి, ఆచార్యశిష్యవ్యాసమునుండి.)

......కావున సరస విద్వత్కవివరేణ్యుల కవిచ్ఛిన్నమును నిర్దుష్టమును దాత్కాలికమును నగు పద్యధారయే యాశుధారగాని పలుతెఱంగుల బాదనియమములేని తోడుపదము కొనదాఁక పెట్టుకొని గంటకిన్ని యన్ని యనులెక్కలో నవసరము లేదని నా యభిప్రాయము.

(సువర్ణలేఖలోని టంగుటూరి శ్రీరాములు గారి వ్యాసమునుండి)

......స్వతంత్రములును మానవమనోభావములను వెదచల్లునట్టివియును నిర్దుష్టములును, నూతనములును, జీవయుతములును, ఉత్సాహకరములును నగు పద్యము

తే. గీ. * ఆశుకవిత యనఁగ నదివేలు శ్రీశిష్టు
కృష్ణమూర్తి జగతి కెఱుఁగఁజేసె
నంచువిందు మట్టి యసమానవిద్వాంసుఁ
డేడ! యిట్టి కుకవులేడ! "యనుఁడు.

ఉ. "ఆకవితావిశేష మది యక్కఱ లే దిట, వేగ మొక్కలే
చేకొనిపోవ నీజనులచిత్తము మెచ్చెడి, సిగ్గు వీడి నే
నాకవితన్ రచించి దురహంకృతి మాపెద, నింక నెందు నా
పై కతఁ డేగుదేఁ డని ప్రపంచక మీవు నెఱింగినట్టిదే.

---

అది యటుండనిండు. చిలుకపలుకులు పలుకువారిని మహాకవులని మిన్ను ముట్ట కొనియాడువారు కవిత్వమును గూర్చియును కవులనుగూర్చియును తమకు గల యల్పపరిచయమును లోకమునకు వెల్లడిచేసుకొనువారగు చున్నారు.

(శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారి వ్యాసమునుండి)

......ఆశువునం దభ్యాసము చేసినవారు తమకవిత్వము (గంట కిన్నివందలను లెక్కగలది) వాగ్రూపముగాఁగాక లిఖితరూపముగాఁ జేసినప్పుడుగదా మెప్పునకుఁ బాత్రమగును. వాగ్రూప పద్యసంఖ్యలో నిప్పుడు కొన్ని పాళ్లు తగ్గినను దృగ్గోచరమై విమర్శపాత్రమై యుపనిబద్ధమనుటకుం దగియుండును. ఇట్టి లిఖితరూపమగు నాశుకవిత్వము నవసరముపడినేని మొదలంటం దీసిపోకుండ నేనిప్పటికిని జెప్పుటకు సిద్ధముగా నున్నాఁడను. (ఆంధ్రభారతి)

(* 1912 సం॥ ఆర్యమతబోధిని 8 వ సంపుటమునుండి)

......ఇటీవల శిష్టు కృష్ణమూర్తికవి, మాడభూషి వేంకటాచార్యకవి లోనగు ప్రబంధకర్తలును నాశువునందుఁ బనిచేసిరి. ఇప్పుడు పనిచేయుచున్నవారును బల్వురుకలరు. సర్వవిషయములఁ బ్రౌఢులు రసవత్ప్రబంధకర్తలు నగు మహాకవులు కొందఱు వినోదముకొరకై యాశుకవిత్వమునుగూడఁ జెప్పుచు రాఁగా రసవంతమగు ప్రౌఢకవిత్వము చెప్పఁజాలనివారు నాశుకవిత్వము చెప్పుటకై బయలువెడలి రసహీనమైనను వృత్తనియమాపాయము కలిగినను భావశూన్యమైనను నెట్లో పద్యములల్లుటయే ప్రధానముచేసికొని నీరసపద్యముల వ్రాయుటకుఁ బ్రారంభించిరి ఆకవిత్వమునకు రసభావాదులు ప్రధానములను దలంపుపోయి త్వరగాఁ బద్యములల్లుటయే యుత్తమగుణముగా నెంచుకొనువారును గంటకు నూఱులకొలఁది పద్యములల్లువారును బల్వురు బయలువెడలిరి. నిక్కమగుకవిత్వముయొక్క విలువ రసజ్ఞులగువారికిఁ దెలియునుగాని జన సామాన్యమునకుం దెలియదు. లోకములో రసజ్ఞులు తక్కువగను దక్కినవారు హెచ్చుగను నుందురు... ...

శా. ‡ వీరిరువురు నీరసగతి, గా రచియింపంగలారు కవనము, రఘువం
శారంభతంద్రులవధా, * నారామోదారజాత కాష్టమచంద్రుల్.

---

‡ (కార్చెర్ల శ్రీనివాసరావుగారి పొత్తమునుండి.)

......వైదికులు సత్యమునుమీరి నిందించుచున్నది లేదుగాని కొప్పరకవులు నియోగులనుశాఖాభిమానము నొక్క దానిని బెట్టుకొని కొందఱు నియోగిపుంగవులతిమాత్రముగా వారిని ముఖస్తుతిచేసి వారికొక విధమైన నష్టమును గలిగించుచున్నారు. వీరి సభలకు నేనుజని చూచియున్నాను. వీరికిఁ బుట్టకీటుతక్కువ, కవిత్వము శైలవముగా నుండును సహజమైన కవితాధారకలదు. వీరు కొంత కాలమింకను గురుకులవాసముచేసి బాగుగా గ్రంథపరిశోధనముచేసి యాపైఁ గవిత్వము చెప్పుటకు మొదలుపెట్టిన బాగుగానుండును. ... ...

---

(1912 సం॥ ఆర్యమతబోధిని 8 వ సంపుటమునుండి.)

ఇఁకం గొప్పరకవుల యాశువుంగూర్చి ముచ్చటించుకొందము. వీరికి సహజముగా గవితాధారకలదు. బాల్యమునుండియును వీరుపద్దెముల నల్లుట కలనాటుపడియున్నారు. కాని సంస్కృతమురాదు తెలుగునందున నైనను మంచిపాండిత్యము సంపాదించుకొని యుండలేదు. గ్రంథపరిశోధన నంతగాలేదు పిండికొలఁదిరొట్టె యని కోవిదులకు వేఱుగఁ జెప్పనక్కఅలేదుకదా - వీరు వడిగఁ గవిత్వము చెప్పుదురనుటకు సందియములేదుగాని యది శైలవమై బహుదోషములు కలిగి మూడువంతు లర్థశూన్యముగా నుండును. ... ... ... ...

---

(12-9-11 (Marutur) పురవాసుల యుత్తరమునుండి)

......కొప్పరపు వారు... తెలుగునందు బాల వ్యాకరణమైనను చదివినట్లు కనుపడదు. నోటికి వచ్చినట్లు తప్పులొప్పులు తెలియక రసజ్ఞానమంతకు మున్నె తెలియక చెప్పువారి ఆశుకవిత్వమనకే... ... ...

---

* (ఆర్యమతబోధిని. 8 సంపుటము. 3, 4, 5, 6 సంచికలనుండి)

కొప్పరకవుల యవధానము.

కొప్పరకవు లాశువుగాఁ బద్యములల్లుటమాటయటుండ వీరు సభ్యులుకోరినరీతిగాఁ బద్యములఁజెప్పుచు శతావధానాదుల సరిగఁ జేయఁగలరాలేదా యను సంశయము లోకమునకుఁగలదు. ఏమన వీరట్లు చేయఁజాలరని వాడుక పుట్టిన తరువాత గుంటూరులో శతావధానము చెప్పఁబోయిరి గాని యది చెడినది. కవిగారవధానమధ్యమునఁ దలనొప్పివచ్చి పడిపోవుటచేత నదియాగిపోయినది చెన్నపురిలో శ్రీ రెంటాలవేంకటసుబ్బారావుగారొకకథనిచ్చియొకకొన్ని నియమములు

ఉ. ఆశువు చెప్పువారలకు నందఱకున్ సులభంబ నిక్కమ
త్యాశువు దానితాత పరమాశువు సైతము, నీద్వయంబు నే
కోశమునందు లజ్జయును గొంకును * వీడిన యుత్తరక్షణం
బే శరణాగతంబగు; జయిం త్రవి పీడినవారు లోకముల్.

కోరి యట్లు చెప్పఁడనినప్పుడును వీరికి జబ్బుచేయుటచే నాఁటిసభ యాగిపోయినదఁట. అది దైవవశము కావచ్చును అయినను బల్వురకు సందేహము మాత్రము బాధించుచున్నది రవిపత్రికలో వ్రాయబడియున్నట్లుగా శతావధానులు, అష్టావధానులు పెక్కండ్రుకల యీపురియందు వీరొక సభలోనైన శతావధానము చేసియుండిన బాగుగానుండును. అట్లు చేసియుండలేదు. "ఆంధ్రభాషావధూటికి నివాసమగు నీపురమున శతావధానులు, అష్టావధానులు, పెక్కండ్రు కలరు. అట్టి పండితులందఱు కలసి యీసోదరుల కొకబిరుదము నిచట కూడ నిచ్చుట యుచితము" అని రవిలో వ్రాయబడియున్నది. సోదరకవులు కాకినాడపురమునంగల శతావధానులు అష్టావధానులును మెచ్చఁదగు రీతిగా నవధానములఁ గావింతురేని వారు బిరుదుల నిచ్చుటకును సందియములేదు. పురజనులు కోరలేదు గనుక చేయలేదనుటకు వలనుపడదు. శ్రీవల్లూరిరాణిగారు తా మొక సభచేయింపఁదలంచి యున్నామనియు నిదివఱకు నాశువుగా నాకాశపురాణములు రెండుమూడు చెప్పియున్నారు గాన మేము శతావధానము చేయింతుము మీకిష్టమేని తెలుపుఁడు అని కొప్పరకవులకు వ్రాయించియుండఁగా మేము వెళ్ళిపోవుచున్నాము. గాన నిప్పుడు చేయలేమని సమాధానమిచ్చిరి. అట్లు సమాధానమిచ్చిన తరువాత నాలుగు దినములవఱకును నిచ్చట నేయుండిరి. ఒక సంపన్నులును సభ చేయింతుమనియుఁ దగురీతిని సన్మానింతుమనియు వ్రాసినను గూడ శతావధాన మొనరింపకయే యీపురమునుండి వెడలిపోయిరి. అట్లు చేయక శతావధానముచేసి పిమ్మటఁ జనిన బాగుగా నుండును.

* (శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలవారి వ్యాసమునుండి)

... ... ... ... నాకుఁ దొంటి నుండియు నాశుకవిత్వమందభ్యాసముకలదు. మఱియభ్యాసమును గ్రమక్రమముగాఁ దగ్గించుటకుఁ జాలప్రయత్నముచేసి. శ్రమపడి కొంతవఱకుఁ గృతకృత్యుఁడనయితినని విన్నవించుచున్నాఁడను. ఈవదరుఁ బోతుఁగవిత్వ మభ్యాసము చేయవలయునని ప్రయత్నించువారు కనుపడినదానినెల్ల (పుల్లియాకు)— "గీ. పుల్లియాకుఁజూడఁ బిల్లలు దినివేయ। రోడ్లయందుఁ దిరుగ నడ్లుపడుచు। బాటసారి గమికి బాటుగూర్చెఁడుగానఁ। జక్కఁబెట్ట వలయు జనవరేణ్య॥" వెండ్రుక:— క॥ వెండ్రుకఁ బీకినమేనికి। వేంద్రమ్మను గలుగఁజేసి వెసనెత్తురులన్। గుండ్రముగఁ బుట్టఁజేయుచు। నాండ్రను మగల

చ. పలికెడివేళ మధ్య భగవంతునినామము సారెకున్ యతి
స్థలమునఁ దూర్చి కొందఱు ప్రసంగమొనర్తురెఱుంగుదే! యటే
యలవడి రీకవుల్, సులభమాగతి నందఱు నేర్వవచ్చు నా
పలుకులు నీకవిత్వము; నపత్రప రెంటికిఁ గూడఁ ద్యాజ్యమా.

చ అతితరమైన యాశువు మహాకవి చెప్పును గాక, కాకవి
ప్రతతి వచించుఁ గాక యొకపద్ధతివే దొసఁగుల్ పొసంగు, నా
చ్యుతి మతికెక్కు సూరులకు, శుంఠకు "సర్వము తోఁటకూర సం
గతిఁ" గనుపట్టు భేదమిది, గాక సమస్తము తుల్యమే యిఁకన్.

చ. నిలిచినయప్డు నాదము జనింపనిజీవము లుండుఁ గొన్ని, య
ట్టులె యొక కొంతమందికిఁ గడుంగడుఁ బర్విడుచోటఁ దప్పఁ దా
నలవడదంట! కైత, యది యట్టిదయే యగునేని దానికిం
గలుగు రసంబె దీనికిని గల్గు నటంచు వచించు టొప్పదే.

క. బ్రతికెడి నాడియు 'వాచియు' బ్రతికెడి కవితయును దగిన పడిగల్గి యథో
చితగతి నడుచుట యుక్త "మ్మతి సర్వత్ర" యని పెద్దలాడుట వినమే.

శా. 'ఆలోచించి రచించువారలకు లేవా! దోసముల్, మాకు నే
లా లేకుండెడి!' నండ్రు గొంద, అది వీలా! యట్టులేనిన్ ధరా
పాలుండున్ మనమొక్కయన్నమె కదా! భక్షింతు, మప్పట్టునన్
వాలాయంబుగ భేద మే మనిన, నెవ్వారేని సైరింతురే.

ఉ. పద్దెములల్లు మంచనెదొ! పంబలపాటలు పాడుమందువో!
సుద్దులు చెప్పుమంచనెదొ! మాతువుగాని మదీయధార, యే
హద్దును బద్దు లేనియెడ నాశువుచెప్పు టదేమిలెక్క! యీ
విద్దెయుఁ విద్దెయే! యిది కవిత్వమె! దీనికి నింతయేటికిన్.

మ. మును శ్రీనాథుఁడు గొల్లసుద్దు లొకటన్ మూర్ఖావనీశుల్ తనున్
ఘనవిద్వత్కవి మెచ్చ లేనితఱినే కట్టెన్ గదా! యంతక
న్నను నుత్కృష్టకవుల్ గలారె! మనమున్ గైకొందమామార్గ; మీ
ఘనులన్ మెచ్చఁగఁ జేయ వచ్చి యిఁకఁగొంకన్ లాభమేముండెడిన్?

---

కును సుఖమునకును నరేంద్రా॥ ఇత్యాదులు సర్వదా చెప్పుచు నభ్యాసముచేయ వలయును. ఇట్లు చేసినచో గంటకు 4, 5, 6 నూఱులపఱకుం బద్దెములు చెప్పు మహాశక్తి 2-3 నెలలలో బరిపూర్ణముగాఁ గుదురునని దృఢముగాఁ జెప్పఁగలను.

(ఆంధ్రభారతి)

క. పద్యములకన్న నాశువు, సుద్దులలో నెక్కువేగుఁ జూపించెద నా
సుద్దియుఁ జాతువు నాకీ, విద్దెలలోఁగలదుసూ! ప్రవేశంబుసఖా.

క. రయమే ముఖ్యమువీరికి, భయమేసు! యదే యిటుల సభన్ జూపింతున్.
నయవిదుఁడు కాళిదాసుఁ డ, నియె * గ్రామ్యసభన్ గుఱించి నీవదివినన్

క. కల రెండతెఱని యిటుఁ బ్రా, జ్ఞులు వారికి వీరికవిత సుంతయుఁ బడ దే
కలయు నెఱుంగని తలత్రి, ప్పలమూరులె వీరి కిడిరి మును బిరుదు లిటన్.

క. వారలె వీరిని మనపై, కారోహింపంగఁ జేయ నాలోచనమున్
వారక చేతురు తుదకున్, సారాసార ప్రసంగచర్చయు వచ్చున్.

గీ. ఏమివచ్చిన వచ్చుఁగా కెంతమనకుఁ
దోఁపఁగాఁజేయు నాత్మ నాత్రోవఁదక్క
నిచ్చకపు మార్గమునఁ బోవుటిది హుళిక్కి,
ప్రాజ్ఞలోకంబు మెచ్చనిఫక్కియేల."

క. అనివాదించి పిదపఁ గ్ర, న్నన భోజన మాచరించి నాఁటిసభకుఁ బో
యినపై జరిగినకథ చె, ప్ప నవసరం బంత లేదు పత్రికలుంటన్.

ఉ. ఊరును బేరు మార్చికొని యూరక వ్రాసినపిచ్చివ్రాఁతలన్
గౌరవ మెవ్వఁడున్ ఘనుఁడు గైకొనఁ, డెవ్వఁడొ యట్టివాఁడె త
త్సార మెఱుంగియుండియును దానిన యూఁతగఁ జేసి యేవియో
కాఱులు గిల్కుచుండు నవి ఖండిత మైనను వాఁడు కైకొనున్.

ఆ. వె. ముఖ్యమైన యంశముల కుదాహరణంబు,
తగిన వారి వ్రాఁతదక్కఁ గొనము
చరితమాత్రిఁ దెల్పుసంగతి కెవ్వరి
వేని గొందు మింత యెఱుఁగు మంబ.

శా. ఏకారామయగారు లోనయినవా రే కారణంబైన నే
మీ! కొపరింపుఁగవిన్ సహాసనముపై నెక్కింప నుంకించి; రే
సాకో సభ్యులు చూపి యాఁగి, రది చర్చన్ బెంచె, నామీఁద నే
యేకల్లోలములేని గల్గె; నటుపై నేమందు మావ్రాఁతలన్!

---

* "బుధజనఇవ గ్రామ్యసదసి" (కాళిదాసు)

మ. సభలో విద్వదుదారసత్కవివరస్థానోన్నతిన్ బొందరా
మి భరంబున్ గని తత్క్షణంబ చని బల్మిన్ బంధుకుల్ సూచి బల్
రభసప్రక్రియఁ బంపెఁ బత్రిమును ధీరమ్మన్యపున్ వారితో
సభయుండై యలకొప్పరంపుఁగవి మా కానాఁటనే రాతిరిన్.

ఉ. ఇంచుక విస్తరించి వచియించెద మానవచర్చలోని యా
మంచియుఁ జెడ్డయున్ విబుధమండలియున్ భవదంతరంగమున్
గాంచుమనుగాక;కూకలిడఁ గాఁదగువారిని మందలించుఁగా;
కించితులైనవారలకు నబ్బుఁగఁ జేసెడిఁగాక కీర్తులన్.

చ. ఒగి సభకేగు ముందఱఁ జలోక్తికి వెంకటశాస్త్రి తిర్పతిన్
దగఁగని "నేఁడు నీశతవధానము కొప్రవువార లాశుధా
రఁ గురియఁ జేసి మెచ్చెదరు రచ్చనుగూడ "నిదేటిధార" యం
చగడుగఁ బ్రొద్దుటంబలెనె యాడునొ! యేమొ!"యనంగ నాతఁడున్

ఉ. హాయిగ నుండెనేని "వహవా! యని మెచ్చి బహూకరింతు, లే
దా! యది నిన్నఁబోలె విని యాదరము న్నటియింప నేర,"నా
రాయణ! ఓమ్ హరో"మనుచు నాడుట నిక్కమ, యింకనైన వా
రీయలవాటు మానికొని యిం పగుఫక్కికి వత్తురొప్పుగన్.

క. * హరిదేవర సుబ్రాయని, తెలుఁగునఁ జనువారి మెచ్చితివి వారలు నీ
మరియాద కలరి దానికె, గరువముగొని బాగుపడెడిగతిగన రకటా.

శా. సంగీతం బన రాగపల్లవులు నిచ్చల్ సత్స్వరోద్రేకపున్
భంగుల్ గాని; యదస్వరాపలయదాంపత్యంబు దైవార నే
రంగో నించెడి గూని రాగములనన్ రా,దట్టులే చిత్తము
ప్పొంగన్ జేయునదే కవిత్వ; మితరంబో! పో! కపిత్వంబె యౌ.

చ. డివిడివిడివ్విడివ్వి గరిడీలు రుచించునె యన్న, నిక్కమే
యపమతి నేసి నట్లుగుఁగదా! యపు డిట్లనుచో ననంగ, నే
నవమతి సేయ,నక్కవులయం దభిమానమె నాకుఁగూడ, నే
చవియునులేని పద్దెములు సైఁపవు నాచెవి కేమిసేయుదున్!

(* 1912 సం॥ 8 వ సంపుటము, ఆర్యమతబోధినినుండి)

...... ఈదినములలో నాశువునందే కాలము గడపిన వారునుగలరు. కీర్తిశేషులైన హరిదేవర సుబ్బరాయ కవిగారిట్టివారే. ఈ సుబ్బరాయకవిగారు మనకొప్పరపుకవులవలెనే పద్యములతోడనే వడిగాఁ బ్రసంగించెడివారు. తుద కాయన కవిత్వమంతయు గాలిపాలే యయినట్లున్నది. ... ...

క. వారవె యన నేటికి ని, స్సారంబులు నీవియేని సైఁపవు, నీపై
గౌరవములేద నాకు ? వ్వ, ఘారటనమ్మనకు నలరు తజ్ఞుఁడు కలఁడే ?

ఉ. ఆడుదు నేను బ్రల్లదము లాడినదాడకయుండ నట్లు నీ
వాడఁ గలాఁడవే యనిన నార్యుఁడు దానికి సిద్ధమైనయ
ట్లీ డివిడివ్విపాట కెటు లీవు గడంగెదు చెప్పుమయ్య ! నీ
పోఁడిమి దానఁ జేసి చెడిపోద ! బుధుల్ హసియింపకుందురే !

మ. మనకున్ సాధ్యము గాదఁ టాకవనసామర్థ్యంబు ! కొపర్తింబు దా
ననియెన్ బ్రొద్దుట వింటివే ! యది నితాంతాహంకృతింబట్టి వ
చ్చినవ, లెక్కట్లును దప్ప వీ దినము 'కుస్త్రీపట్టు' లీ విఘ్న శాం
తిని బోధించెద వూరకుండెదవె యేదీ ! చూత మప్పట్టునన్.

క. నాకెందు కూరకుండెద, నీకున్ శివ మెక్కునేని నేఁ గాదుగదా,
లోకమ్మెల్లను నొకలై, తాఁకియు వారింపలేమి తథ్య మెఱుఁగుదున్."

క. నావుడు "మనకెందుకు వా, రేవో పద్దెములు చెప్పిరేని వినుము, లే
దా ! వినక యూరకుండుము, నీవలెఁ బ్రతివాఁడుఁ జెప్ప నేర్చునె కవితల్ !

క. పనివడుచోఁ గయ్యంబది, చనుఁగాక వృథాగ నేల, సత్యమనుచుఁ బ
ల్కిన నది సత్యమెయైనను, మనమున నవ్వారి కొదవు మాత్సర్యంబుల్."

క. అనుచు భవిష్యత్సూచన, కనుగుణముగ నాడికొంచు నరిగిరి సభ కే
మనవచ్చు దైవఘటనం, బును ! సభలో బీజమొకఁడు మున్నే మొలిచెన్.

(ఆ స న చ ర్చ)

* ఉ ఆసనమొండువేసి, రదియక్కఱలేదని కొంద, ఱున్నచో
దోసమె ! యంచుఁ గొందఱును దోఁచినయట్లు వివాద మెంతయున్
జేసిరి కొంతసేపు, పయిఁజెప్పిరి కొప్రపువారికోసమై
వేసితిమంచు వేసిన వివేకులు గుట్టని బైటి కెక్కఁగన్.

ఉ. "కొపర్తిపువారి కాసనము కూడదు నేఁ"డని కొంద, "ఱౌర ! యే
మపర్తిథితాత్మలే ! యటుల నాడుట కం"చొకకొంద, "ఱెంతయున్
నుప్రథితుల్, తథాపి యది చొప్పడ" దంచును గొంద, ఱీగతిన్
బ్రిపర్తిథమంబు వాదమును బాముకొనన్ బొనరించి రెచ్చగన్.

---

* (1911 సం॥ 7వ సంపుటము, ఆర్యమతబోధినినుండి)

—: రెండవదినపు చర్య. :—

.........మొదటిదినము మిక్కిలి వర్ణనీయముగా నడచుటచే నాకీర్తి పురం

మ. "ఘనులౌ సత్కవులున్ బుధుల్ శత మిటన్ గన్పట్టుచున్నారు వా
రిని గాదంచును గొప్పరంపుఁగవిగారిన్ దెచ్చి యర్చించు టొ
ప్పనొకో!" యంచొక కొందఱాడ, "నదియొప్పౌ దుల్యుఁడీతండు త
క్కినవార్గా" రని కొంద ఱందునొకయుక్తిన్ జెప్పిరొప్పారఁగన్.

ఋనందంతటను వ్యాపించి రెండవనాడు పురజనులు చాల హెచ్చుగా సభకు విచ్చేసిరి. సభాభవనము చాలినదికాదు. రంగస్థలమున మొదటిదినమున నిద్దరు కవులకును సభాధ్యక్షునకును వేసిన మూడుకుర్చీలును గాక నేడెవరిచేతనో నాలవకుర్చీకూడ రంగస్థలమున నుంచఁబడినది అప్పుడు సభలో నీక్రింది ప్రశ్నోత్తరములు జరిగినవి. (ప్రశ్న) పైఁగా నీ కుర్చీయెందుకు? ఎవరువేసిరి? (ఉత్తరువు) ప్రయోజనముండియే వేసిరి. (ప్ర) అదియేమి? (ఉ) కొప్పరపు కవులు కూర్చుండుటకు (ప్ర) నేఁడాయన యవధానము చేయుటలేదు. వారి పని నేడులేదు. వారును నిన్నటివలెనే మనతో గూర్చుండవలెను గాని నేఁ డవధానము చేయువారితోఁ గలసి కూర్చుండుట యెందుకు? (ఉ) వారును శతావధానులే కావున. (ప్ర) శతావధానుల కందఱికిని గుర్చీపెట్టవలయునా? (ఉ) పెట్టవలెను. మనము "Satavadhanies welcome" అని వ్రాసి నాము గాన నీశతావధానిగారికిని గుర్చి యీయవలెను. (ప్ర) మనము "The Satavadhanies welcome" (ఈ శతావధానులకు స్వాగతము) అని వ్రాసినాము కావున మనము నిర్దేశించినవారు నేడు శతావధాన మొనరించు చున్న తిరుపతి వేంకటేశ్వరకవులే యగుచున్నారు. వారికి స్వాగతమనినాము. వారికి స్వాగతమిచ్చువారము మనమందఱమునునై యున్నాము మనలోనివారే కొప్పరపువారును నగుదురు. కావున మనమందఱమును నెచ్చట కూర్చుంటిమో యచ్చటనే వారును కూర్చుండవలెను... ... ...

(1911 సం॥ సెప్టెంబరు, 3 వ తేదీ దేశాభిమానినుండి)

......తిరుపతి వేంకటేశ్వరుల శతావధానము హిందూనాటకశాలలో ముందుగ జరుగుట దటస్థించినపుడు ప్రథమదినమున కొప్పరపు సోదరులలో నొకరగుకొప్ప రపు వెంకటసుబ్బారాయశర్మ యనువారు మొదటితరగతి చూపరులు గూర్చొను గోతిలో వేయబడిన కుర్చీపైగూర్చుండిరి. మరుదినమునగూడ నట్లేజరిగియున్న బాగుగా నుండియుండెడిది. పై సూచించిన ప్రకారము తలతలపెత్తనాలగుటచే నవాలోచనపరులగు నెవరో యొకరు మరుదినమున నింకను గతదినపు విషయ మును బూర్తిపరచు బాధ్యతగల తిరుపతి వేంకటేశ్వరులతోపాటు కొప్పరపు సోదరునికిగూడ రంగస్థలమున గుర్చీ యిడవలయునని మూడవకుర్చీ నొక దానిని వేసియుంచిరి. దానినెవరువేసిరో యింతవరకు దేలలేదు......

చ. సభ వినుచుండె వల్లె తెరచాటునఁ గొప్రపు సోదరుంకు నీ
శుభశుభ లెల్లనుం గనుచుఁ గోరికతో నొకచోట నుండె, నా
రభసము చూచితీరవలె రాఁజఁదొడంగెఁ బరస్పరంబు నా
సభికులకున్ వివాదశిఖి, శాంతముగాదది యెన్ని భంగులన్.

ఉ. ఎవ్వరు తెచ్చిపెట్టిరొకో ! యెందులకుం గొఱగాని పీఠపుం
జివ్వ, మహాగ్రహ గ్రహవశీకృతులై నటియించు చొండురుల్
ప్రువ్వఁగ నాడికొంచు నొగిఁ బోరిరి యెంతని వ్రాయువార మీ
నవ్వు ప్రసంగ మెల్లెడఁ గనంబడుఁ బత్రికలందుఁ జూచినన్.

* ఉ. అంతట నెవ్వరో యనిరి "యగ్రిపుఁ బీఠ మలంకరించె నే
శాంతుఁ డతండ యాసనపుఁ జర్చను దీర్పఁగ నొప్పు" నంచు, "మే
లంతియ" యంచు వా గడుగ, నాయన "కొప్రపు వారి కిప్పు డీ
చెంతను నాసనం బడుగఁ జెల్ల" దటం చనియెన్ ద్విశుద్ధిగన్.

---

* (1911 సం॥ సెప్టెంబరు, 3 వ తేదీ దేశాభిమానినుండి.)

......అభిమాన మనునది యొకటి పట్టి భాధించుటచే నట్లు చేసియుండురనియు నాయభిమానావేశము చేతనే, యాకుర్చీని తీసివేయవలయునని గొందరును, ఆ కుర్చీ నట్లెయుంచి కొప్పరపుసోదరు నందు గూర్చుండ జేయవలయునని మరి గొందరును పోరాడుచు నాసభకగ్రాసనాధిపతులుగ నున్నవారు మూడవ కుర్చీని వేయవగదని తీర్మానించినను ఇనక కలహము పెరుగుటకు దగు ప్రయత్నముల జేయుటయు దటస్థించినదని తెలిసికొనుటకు మిగుల విచారము నొందుచున్నాము. ఆనాటిసభలోనివారు పాశ్చాత్యవిద్యావివేకసంపన్నత కలవారె హెచ్చుగ నుండియు, నగ్రాసనాధిపతిగారి యాజ్ఞోల్లంఘనజరిపినది చూడ మనమిక బాగుపడుటయు నైకమత్యాభివృద్ధి నొందించుకొనుటయు నెట్లో తోచకున్నది. అభిమానమనునది వదలి యన్నివిషయముల నిష్పక్షపాతబుద్ధితో జూచు కాలము వెంటనే కొలది కాలములోనైన దటస్థింపకున్నచో, మనమిక యధోగతిపాలు కావలసి వచ్చును. ... ... ...

---

(కొప్పరపు వారు. వే. ప్రి. శాస్త్రికి వ్రాసిన యుత్తరమునుండి)

......కుర్చీ అచ్చటవేయుఁడనగా కొందరిదివద్దనియు కొందరిదియుండవలెనని యనుకొనుచుండివారు......... నేను వారితో "నిన్నటిదినము దిగువ కుర్చీ మీద గూరుచుండలేదా, వారు సభచేయుచుండగా నేను వారి ప్రక్కను గూరుచుండుట మాత్రము గౌరవమా,.........నా కిప్పటి చోటనే కుర్చీ వేయించిన యెడల గూరుచుండెదను, సభజూచుటకువచ్చి యేమేమో అభిప్రాయ మెందుల"

ఉ. తార్కికుఁ డమ్మహాకవి యతండుగ్రుఁడు హేతువు లెన్నొ చూపి తీ
వ్రార్కనిచంద్రమైన నిఁక నాయనకుం బ్రతి చెప్పలేక దు
స్తర్కపుఁద్రోవఁబట్టి "యెటు తప్పదు యాసన" మంచు గోల యా
కర్కశు లాచరించి రధికారితిరస్కరణంబు చూపుమ౯.

---

కని నేను వారలతో జెప్పినను "మొదటవేయుట యెందులకు! తరువాతతీయుట యెందుల" కని నడుమగలవారు వాగ్వాదము జరుపుకొనుచుండిరి. అప్పుడు నేనే వెళ్ళి క్రిందవేయఁబడిన కుర్చీమీద గూరుచుండ దలంచుచుంటిని యీవాగ్వాదము అవధానము జరిగించు సభాప్రదేశమునగాక ఆ ప్రదేశమునకు వేరుగా నుండు మరియొక చోట జరిగినది............ఇంతటిలో నగ్రాసనాధిపతిగారు...... ...యీ సంగతిని విచారించి కొంత ప్రసంగము జరిపిరి. ఆప్రసంగము...... యుక్తియుక్తముగా నుండినది. ... 2000 మంది మహాజనులు కూడిన ఆ సభలో వెంకటశాస్త్రిగారు లేచి "ఆ ఆశుకవిత్వము మాకవిత్వము వంటిదికాదు. ఆశతావధానము మాఅవధానమువంటిదికాదు, కావున ఆ శతావధాని మాప్రక్కను గూరుచుండుటకు మాసరసను నిల్చి యుండుటకుదగ"డని...అందుచే వారికిని మాకును ఆశు కవితావధానముల విషయమయి కొంచము కలహము ప్రాప్తమయినది ఇందు కొంతభాగము నడుమ నున్నవారి మహాత్మ్యము.........ధర్మపథవర్తులును మిత్రవరేణ్యులును న్యాయప్రియులునగు తమకు యథార్థమును విన్నపించుకొనినాము,

ఉ. వారిని మేము మమ్ము మరివారును జూడక యుండినప్డు వి
స్తారము గాగ స్నేహము నెసంగగ జేసిన బుద్ధిశాలివో
ధీరవరేణ్య నీవయువిధి౯ గణుతింపగ ! మాకు శక్యమే
కూరిమి బాపి యీ నడుమ గొందరు జేరి మనోవికారముల్
కూరిచి యల్లరి౯ జరప ఘోరముగా దలపెట్టియుండి రీ
వైర మసాధ్యమై ప్రబలఁజొచ్చునటంచును దోచుచుండె లో
నీరస మింతలేక మది నెంతయు న్యాయ్యమె కోరుచున్న వి
ద్యారసికుండవంచును హితాగ్రణివంచును విన్నవించి నా
మీరస మెట్లుమారునో గ్రహింపుమి కీర్తికరా ! ప్రభాకరా !

గుంటూరు, వీకా. రామయ్య గారియింటిలో } ఇట్లు విధేయులు, కొప్పరపు వెంకటసుబ్బారాయ, వెంకట రమణులు. 4-9-11

క. "తిరుపతి వెంకటకవులకు, * సరి కొప్రపువారు, వారిసరసను మఱి వి
ష్టరముండి తీరవలెన, క్కఱలేదన్యులకు వారు గారు సమానుల్."

మ. అని బింబప్రతిబింబభావ మిడి యధ్యక్షున్ రవంతేనిఁ గై
కొనకే పట్టినపట్టు నెగ్గుటకునై కోలాహలమ్మున్ దమం
తనెటో సల్పెడి దంటలన్ గని నితాంతక్రోధబాధాభరం
బునఁ జిత్తంబు పశంబు దప్పుటయు నాపాంగార్చి యల్లల్లనన్.

(* 1911 సం॥ ఆర్యమతబోధిని 7 వ సంపుటమునుండి.)

ప్రశ్న... అట్టి సమయములో నేడుపనిలేని కొప్పరపు కవిగారికిఁగూడ నిందుఁ గుర్చియేల పెట్టవలెను? ఉ॥ శతావధానులుకనుక. ప్ర॥ అట్లయిన నిచ్చటనున్న శతావధానుల కందఱికిని గుర్చీలువేయక యొక్క కొప్పరపు కవిగారికిమాత్రమే కుర్చీ వేయుటకుఁ గారణమేమి? ఇటనింకను బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభి రామశాస్త్రులవారు కలరు. బ్రహ్మశ్రీ ములుకుట్ల వేంకటకృష్ణశాస్త్రులవారుగలరు. ఇంకను బల్వురుగలరు వీరెల్లరు శతావధానులుకదా? వీరికందరికిని గుర్చీలు పెట్టవలయునుకదా? ఉ॥ తిరుపతివేంకటేశ్వర కవులతో సమానముగాఁ గవిత్వము చెప్పగలమని వచ్చువారందరికిని గుర్చీలు వేయవలసినదే. ప్ర॥ ఇతర శతావధానులకుఁ గుర్చీలు వేయవలసివచ్చినవారినిఁ బరీక్షించి మఱియీయ వలెనా! కొప్పరపువారినిమాత్రము మన యిష్టప్రకారము కూర్చుండఁ బెట్ట వలయునా? ఉ॥ కొప్పరపుగవులు తిరుపతి వేంకటేశ్వరకవులతో సమానులు గానఁ గూర్చుండఁబెట్టవలెను. ప్ర॥ ఇతరులుకారా? ఉ॥ సమానులమని రమ్మనుఁడు. ప్ర॥ కొప్పరపువారికేల యీప్రశ్న లేకపోవలె? ఉ. వారు సమానులు కనుక. ప్ర॥ మనమా ? యీనిర్ధారణము చేయువారము. అయినను సభాధ్యక్షులయుత్తరువును దీసికొందము, అని సభాధ్యక్షుల యుత్తరువును గోరిరి వారిక్రిందతీర్పును జేసిరి:— "నేడీకుర్చీలు ఇచ్చటనున్నవారి తారతమ్యము నెంచుటకై వేయఁబడినవికావు. అవధాన మొనర్చువారు నిరాతంకముగా సభ్యులకు దృగ్గోచరులగుటకై వేయబడినవి. వీరికి మించి మఱియొక శతావధానికిఁ గుర్చీనిత్తుమేని మిగిలిన శతావధానులకందఱికిని గూడ నీయవలసి యుండును. అట్లిచ్చిన మన యుద్దేశమే చెడును. నేడవధానము చేయువారి యందుఁ బ్రత్యేకముగా లక్ష్యముండుటకుఁగదా మనము వీరుభయులకును గుర్చీలు పెట్టినాము, శతావధానులమని వచ్చువారికెల్ల కుర్చీలఁ బెట్టుదుమేని మనయూహకు భంగమురాదా? వారు వీరితో సమానులగుదురా! కారా! యను వాదము పెట్టుకొందుమేని అది సంవత్సరమునకైనను దేలదు........ అగ్రా

చ. మనమున వేంకటేశ్వరుఁడు "మాటికి నక్కటా! వీర లిట్టులే
గొనగొనలాడుచుండెదరు కోవిదమార్గ మెఱుంగలేరు ధీ
ఘని యగు నీసభాధిపతిఁ గాదని గోల యొనర్తురింక నే
వినిచి యథార్థమున్, సభను వీడఁ గడంగుట కొంత మేలగున్.

క. తెగదీవాదము నేఁడు వృ, థగఁ జెట్టిరి బందరేగఁ దగు శీఘ్రముగా
నగుబాటుసభకు వచ్చితి, మిగదా! స్కూల్ విడిచి, సెలవు మేకొను టెట్లో.

చ. అవియటులుండుఁగాక "సమ"లంచును గొప్పవారి నూరకే
పదిఁబదిఁజెప్పవీరి యపవాదము లీసభసైఁచుఁ గాక యీ
యదనునఁ గొప్పరంపుఁగవి "యట్లనఁ గూడదు త"ప్పటంచుఁ దా
నెద సకలం బెఱింగియు నిసీ! తెరవెల్వడఁ డెట్టి ప్రాజ్ఞుఁడో!

చ. తనకును నస్మదాదులకుఁ దజ్ఞతలోఁ గలవార మూర్ఖుఁ డౌ
జనుఁ డెఱుఁగండుగాక తనస్వాంత మెఱుంగఁడె, "యెందు కీసహా
సన" మని యాఁ పరాదె! తెరచాటది వెల్వడివచ్చి, దానఁ ద
న్నును జగమెల్ల మెచ్చదె యనుంగులు మెచ్చిన మెచ్చుకుండినన్.

గీ. భారయొక్కటి మాత్రమే తనకుఁగలదు
దానికెన్నియుండిన మీఁదఁదజ్ఞుఁడొప్పు
తండ్రులమ్ములుమాత్రమే యుండి యెవఁడు
షడ్రసోపేతముగ భుక్తిఁపలుప నేర్చు.

క. 'అన్నమ్మే యవాగువునే, మున్నది లవణంబు తినఁగదోయీ!' యన నా
పన్నుండుదక్కనే సం, పన్నుం డప్పట్ల సిద్ధపడి సాపడెడిన్?

గీ. ఇంతయెఱుఁగఁడె! తా నింక నెన్నియేండ్లు
చదువుపైఁ దుల్యుఁడగు ? నేరొజడులు తుల్యుఁ
డన్నయంతన యదివిని "యనుముమినుము"
ననక చాటునఁ గూర్చుండె నక్కటకట!

---

స నాధిపతులు చేసిన యీతీర్పు న్యాయముగానే యుండినను రోగపీడితునకు పథ్యము రుచింపనియటులు పక్షపాతపీడితు లగుకొప్పవరకవిపక్షము వారికి నది రుచించినదికాదు. అందుపై నావలకుఁ బోయి యేమేమోయాలోచించుకొని మరలవచ్చికొప్పవరపుకవికిఁ గుర్చియీయక తప్పదనియు నాతఁడు తిరుపతివేంక టేశ్వరులతో సమానుడనియు నుడివిరి. ... ... ...

చ. సభయెటులున్ జెడెన్ దుదకు సాగమి నిక్కువ, మంతరాతుఫుం
గుభగుభ లేర్పడెన్ ; * వృథగఁ 'గొప్రపువారను పేరుఁదుల్యు' లన్.
రభసము నెత్తిపైఁ బడిరి; రాఁదగు నెద్దియొ వచ్చుఁగాక యే
మిభయము ! నిక్కముం బలికి మేలనిపించెదఁగాక ధీరులన్.

క. తగుసమయంబిది యిప్పుడు, మొగ మోడఁగరాద, సుంత మొగ మోడినచో
నగుదురు పండితు లిపు డిది, వెగటయ్యెను విదప సారవిత్సమ్మతమా.

గీ. ఇంటిపేరుమాత్ర మేకమైనంతనే
తగినజ్ఞాతియగునె తనకు ! దాని
కెన్నియెన్నియట్టి వేకమ్ము గావలెఁ
గవియటన్న మాత్రఁ గలదె ఫలము!

క. తనకాణాచిని దూరగుఁ, డని యెఱఁగియు నెవఁడు జ్ఞాతి కర్పించెడిఁ బా
లును, గొప్రపుసోదరుఁ డీ, ధనమునకుం దగఁడు మిగుల దవ్వగు కతనన్.

సీ. చరిగొండధర్మఁ డార్జన చేసె నీపీఠ మేలె దేవేంద్రుఁడై యెన్నినాళ్ళొ,
అవలఁ బట్టాపల్లమై భట్టునకు వచ్చె నెల్లూరి రాఘవుని కది చేర
మాడభూషికి నది తోడివేదంబయ్యెఁ దిరుపతి వెంకటేశ్వరుల కబ్బ
తగిన వారికి వారు దఖలుసేయక యున్న నాక్షేపణకుఁ బాత్రులగుట ధ్రువము

గీ. కొప్పరపువారలియ్యెడఁ గూరుచుండి
నిర్వహించుట సున్న ; యఖర్వధార
ణాబలములేక నుంతేని నడువనట్టి
పనికిఁ బుట్టిన దీపీఠధనము ఘనము.

మ. వినమే భోజుని యంతవాఁడు ఘనదోర్వీర్యుండు శ్రీవిక్రమా
ర్కునిపీఠమ్మునఁ గూరుచుండుటకునై కోర్కుల్ పిసాళింపఁ బో
వునెడన్ బంగరుసాలభంజికలు "పో! పో! దీనఁగూర్చుండు నా
ఘనయోగంబదినీకు లే"దనవె? చక్కంబోఁడె యాధీరుఁడున్.

క. కావున నున్నయథార్థం, భాషిపకృతమాట యొప్పు నటు పూర్వంపుం
గోవిదులసరణిగన్నడు, నేవెడఁగులొ పలుకుమాట లెవఁడు గణించున్."

చ. అని కృతనిశ్చయుండయి హృదంతరమందలివాణి యూఁతగా
వినయము తోడుఁగా నిలిచి వెంకన కొంకొకయింతలేక జం

* శ్లో. హేమ్నః ఛేదేన దాహేన చ్ఛేదేన కషణేనచ, ఏతదేవ పరం దుఃఖం
యద్గుంజాసమతోలనం. (పండిత రాజశతకము)

కనుకది ధూర్వహ్నే చదు జ్వరా ర్తికి నూత్న కృశించియుండియున్
ఘనతర సుప్రసన్న తెలుగు గా నిట్టు వత్సా సుయుక్తి కమ్మెరగన్.

చ. "గురుకులవాసమున్ సలిపి కూరిమి మాధుకరంబు వారముల్
జరుపుచు నమ్మ గాని యొకసాధ్విని "అమ్మ" యటంచు "బా" బటం
చొరులను గొల్చి నేర్చితిమి యొండొకశాస్త్రము, పండితుల్ 'సెబా
సుర !' యని మెచ్చఁ బద్దెములు శ్లోకములున్ రచియింతు మాశుగన్.

ఉ. కొప్పరపువారనుంగవ్వలె, కొప్పరిపువారికి మాకు విద్దెలో
సుప్రథితంబువార, యది స్సాదు లెఱుంగుదు రల్లవారలే
ప్రప్రథమత్వమందినను బాల్యపుడ దిర్యోడ నాసనంబు న్యా
య్యప్రతిభన్ జెలంగెడి మహాత్ము లెఱుంగరె ధర్మ బద్ధతుల్.

క. అల సుబ్రహ్మణ్యుఁడు తా, నెలమిన్ బాడునెడ నారకేయుండును స
భ్యులలోన వైద్యనాథుఁడు లలి నీతఁడు పాడుపట్టులను నతఁడట్లే.

క. సము లైనను లేకమహో, త్తము లైనను నొకని పెండ్లితతి వందలమం
దిముడఁ దలంపరు వేఱొక, రమలినహృదయులకు సర్వ మవగతమెకదా!

ఉ. వాదముకోస మొప్పదము వారలె హెచ్చని, యట్టులేని యొ
ట్లేఁదగు మాకు నేర్పడిన యీసభ మాసరిగౌరవంబు మీ
రేదెసఁ జూడలేదె ! పురమేగెడిచోఁ దమశిష్యు పెండ్లిలోఁ,
బాదచరిత్వ మూను గురువర్యుల, నట్టులె యట్టితంద్రులన్.

గీ. అట్టిచో సామ్యమేలేని యప్పు డిట్టి
చర్చయేటికి "విద్యలో సము" లటంచు
నాసనము వేయుటది గూడ; దన్యథా యొ
సంగి రే నాసనము మాకు సమ్మతంబె.

క. * తగదు తగదు తగద"ంచును, మొగమోటము దక్కియిట్లు ముమ్మాటికిఁ బ
ల్కఁగ నేమని చెప్పుదు! మా, గఁగరా దాసభ్యజనుల కలకలమవలన్.

క. "హరిలే దచ్యుత లే"దను, తెలుఁగునఁ దిరుపతియుఁ దెలిసి తెలియనియటు లా
తిరుపతి భూధరశృంగము, స్మరణకుఁ దగిలించుచుండె సభ్యులకెల్లన్.

---

*...అప్పుడు బ్రహ్మశ్రీ వేంకటశాస్త్రిగారు లేచి "ఇదివఱకును మీలో మీరు చేసికొను సంభాషణము మీలో మిమ్మును గూర్చి గాన మేమూరకుంటిమి. ఇప్పుడు కొప్పరపుకవులు మాతో సమానులని పదేపదే తత్పక్షావలంబులు చెప్పుచున్నారు. గాన మేము మాటలాడవలసివచ్చినది. కొప్పరపుకవులు

ఉ. "ప్రొద్దుటికీతిఁ జూడఁ బొరపొచ్చెము తిర్పతిశాస్త్రిగారి యం
దెద్దియొ తోఁచె, వేంకట కవీంద్రునియందది గాన రాద, యే
మిద్ది? క్షణమ్ములో ననల మేగతి శీతలమయ్యె! నీరమె
ట్లిద్దిర! వేంద్రమయ్యె!"నని యారసి చూచిరి కొంద ఱయ్యెడన్.

చ. "అనవసరంబు గాన నపుడంతనె పోవఁగ నిచ్చె నిప్పుడో,
పనివడెఁ గొంతువట్టికొనెఁ బట్టుక తిట్టుట తప్పు నిప్పుడిం
క నొక యుపాయ మేదియును గానఁగరా దటు సేయఁ గొంద ఱా
య్యనఁ బ్రయతింత్రు చూడు"మనియాడెఘనుండొకఁడొక్క మిత్రుతో.

క. ఇటు ఘనమతు లగు కొందఱు, తటకాపడిచూచుచుండఁ దగుఁదగదంచున్
బటుమతులు గొంద ఱనుకొనఁ, జటులతరం బగుకలం బెసంగెన్ సభలో.

చ. విలయపయోధిలోని పటువీచికల ట్లొగిలేచి వీఁక స
భ్యులు "సరిగావచించె నిది పోలును" "పోలదు, శక్తి యుండుఁగా
కలఁతిగ నొండొరుల్ బలుకుటారయఁ దప్పగు" "తప్పుకాదు ని
ష్కలుషులవంద మిట్టి" దని సారెకు వాద మొనర్చుచున్నెడన్.

చ. అది తనుఁగూర్చి కానిమాట లన్నియు విం చొకకొంతసేపు నె
మ్మదిగను గూరుచుండె మఱుమాట వచింపక వేంకటేశుఁ, డ
య్యదనునఁ గొప్పిపుంగవుల యాప్తులచూపులు కొన్ని వహ్నికిం
గుడుములు గాఁ గనంబడియు గొప్పకు నంతగఁ దప్ప వొయ్యెనన్.

క. ఒకపాటిబండతన మిం, చుక లౌకికవిద్యగలుగు శూరులు మఱి వై
దికవిధిమూఢులు దుస్మృత, వికలితు లొకయిర్వ రట్టివేళఁ గడంకన్.

ఉ. లేచి మహాగ్రహాగ్నిహుతలీమసులై కవి వేంకటేశునిన్
నీచముగా నదల్చి "విను నీవెపు డొండొకరున్ సహింప విం
తే, చదు వెంతయున్న నది యెందుల!"కం చొకకొంత గొణ్గి సం
కోచముతోడ నయ్యెడనె కొంకుచుజంకుచునుండి రొక్కెడన్.

ఉ. నీచత గ్రిక్కువారిని మనీషివిదూరులుగా నెఱింగి తా
నాచపలుల్ వచించు నుడు లంత గణింపఁడు వేంకటేశుఁ, డా

---

మాతో సమానులు కారు. కాన వారు మాతో సమానముగా గూర్చుండుటకు మీరొప్పినను మేమొప్పము. అని చెప్పిరి......(ఆ॥ బో॥ 7వ సం॥ 1911 సం॥)

నీచుల త్రోవఁ బట్టక వినీతిఁ గొందఱు కొవ్రిపుణ్ హితుల్
లేచి యథోచితంబుగ లలిన్ * జని రుగ్రమహాగ్రహాగ్నులై.

క. వారలలోపలఁ గల రధి, కారులు మఱికొంద ఱనధికారులును గడే
కారులు యత్కించిత్స్వం, స్కారులు నానావిధ ప్రకారులు తలఁపన్.

గీ. అట్టు లధికారు లధికారులగుచు నేఁగఁ
గ్రొత్త యించుకయును లేశుఁగొలువునందు
నేరికి విచారమది యుదయింపదయ్యె
నిఁక గడేకార్లపోకకు నెవఁడు పొగులు.

ఉ. "సోలెఁడుపాలె చాలు" ననుచున్ వచియింతురుకాదె పెద్దలా
లీల ననంతరంబు లవలేశము దోసము లేక యొప్పె స
చ్ఛీలసమంచితంబయి యశేషమనీషిమనఃప్రమోదమై
గోలయడంగి యాసభ సుగోష్ఠికిఁ దావయి పేర్మిప్రోవునై.

చ. జరిగె వధాన మాపయిఁ బ్రశస్తసమస్త మహాకవీశ్వరో
త్కరహృదయాంబుజాతసతతప్రమదావహహృద్యపద్యవి

---

* (కార్చర్ల శ్రీనివాసరావుగారి పొత్తమునుండి.)

...సర్వవిధముల మధ్యవర్తులు ఘనపండితప్రకాండులు నగు సభాధ్యక్షులు "కొప్పరనియోగికవు లవధాన మొనరించువారితోడిపాటుగాఁ గూర్చుండఁ దగ" దని తీర్మానించిన వెంటనే యేదో యొక సాకును గల్పించుకొని నియోగి ప్రముఖులెల్లరును లేచిపోయిరి. వీరికి వైదిక కవుల కవిత్వముపై ననూయ పుట్టినదనుట కింతకంటెఁ బ్రమాణమేమి కావలెను. వీరుసభనుండి లేచిపోవుటయు వీరు నియోగివైదికకక్షప్రధానముగాఁ గలవారని వేవిధములఁ జాటుచున్నది నియోగికవులసభలు జరుగుచుండినప్పుడు వైదికులిట్లు మిషలు గల్పించుకొని లేచి పోయిరా? లేదు... ... ... ...

(ఆర్యమతబోధిని 1911 సం॥ 7 వ సంపుటనుండి.)

...అగ్రాసనాధిపతులు తమకు వ్యతిరేకముగాఁ దీర్పు చెప్పుటచే కొప్పరకవిపక్షపాతులు సభనుండి లేచిపోవనెంచి సందును వెదకుచుండిరి. ఇంతలో వేంకటశాస్త్రులవారు పైవాక్యములను బలికియుండుటచే నది మిషచేసికొని సభనుండి లేచిపోయిరి. ఇంతవరకును బైట నిలువఁబడియున్న కొప్పరపు కవియు సభనుండి లేచిపోయినవారును గలసి యుండ్లకుఁజనిరి. కలహమునకు బీజమిది ......

స్తరసరసప్రచారవిరతశ్రుతిశేఖరసత్క్రియాకరంబర
ధురతరసాధుగోష్ఠిపరితోషితదివ్యసభాసుభూతియై.

ఉ. ఎంతయు మబ్బు పట్టి కని యొత్తయిటియో * చెడునంచు నెంచుచు
న్నంతఁ బటుత్వదుద్రవ మనంతముగా సుడిగాలి వచ్చి యే
చెంతకొ దుమ్ము దూళిగ నశింపఁగ మబ్బును బాఱఁద్రోబ్బిన
ట్లంతట నా సభాస్థలము నందలివారికిఁ దోఁచెఁ బూర్తిగన్.

సీ. మును మెచ్చి యిప్పుడీయన యింత చుల్కఁ జేసిన నేమిలాభమంచ నెడివారు
మెచ్చినయంత నే వచ్చి నెత్తిని గూరుచుందురే యని కోప మొందువారు
"ఎచట బావా! యన్న నేమది పంగతోఁటకడ సాగ" దటం చనుకొనువారు
లౌకికులయ్యు నేలా కోరి రీకోర్కె? యంచొక్కరొకరిఁ బ్రశ్నించువారు
తే. గీ. చర్చలకు నేమి సభ చక్కఁ జరిగెఁదుదకు
నపరిమితమోదమబ్బెఁగా యనెడువారు
సభ జరుగకేమి, యీనాఁటి † ఛాందసత్వ
మెల్లను నియోగులదటంచు నెంచువారు.

సీ: తా నెంచుకొనవలెఁ దగుమనుష్యులు లేరె యంచు వెంకటకవి నెంచువారు
అధ్యక్షుమాటపై నాఁగిన వేంకటేశ్వరుఁ డిట్టు లనఁడంచుఁ బలుకువారు
అతఁ డూరకున్నచో నావాద మీపాటికైనఁ దేల దటంచు ననెడువారు
"నీపునీ" వనిపల్కరే వారొ యవ్వారి నెఱుఁగుదే యని చెవిఁగఱచువారు

---

* తిరుపతి వేంకటేశ్వరుల గుంటూరి శతావధానపు పీఠిక నుండి.

...... మరల మఱునాఁడు సభ 3 గంటలకు సమకూర్పఁబడెను. కాని కొన్ని యనివార్యములగు నంత రాయములచే సభ మానుకోవలసినంత దుర్యోగము జరిగినను, గుంటూరివాస్తవ్యుల సుకృతముచేతనో, సిద్ధసంకల్పులైన తిరుపతి వేంకటేశ్వరుల మహిమచేతనో సభ జయప్రదముగా జరిగెను.......

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, ప్రొప్రైటరు, చంద్రికా ముద్రాక్షరశాల.

† (1911 సం॥ ఆర్యమతబోధిని 7 వ సంపుటమునుండి)

......పైదానినంతయుఁ బట్టిచూచిన గుంటూరుపోరునకు బీజమును నాటి రక్షపోషణముచేసి దాని పెంచినవారు కొప్పరపుకవి పక్షపాతులని బాలునికైనను దెలియఁగలదు. ఒకరికార్యము జరుగుచుండగా వారితోఁగూడ సమయోగాఁ

తే. గీ. ఏమనిన నేమి? తుదకు జయింపఁగలిగి
రే వృథావాక్కు లయ్యవి పోవుఁగాలి
కనెడువారు "నిల్లలికినయంతఁబండు
వగునె" యిఁకఁజూడుఁడేమౌనో యనెడువారు.

---

గూర్చుండఁగోరుకొనువారు బాలురుకాని ప్రాజ్ఞులు కారుగదా. ఒకడు పెండ్లిలోఁ బల్లకినెక్కి నందుగూర్చుండఁ గలహమాడువారు బాలురు కాకమఱెవరగుదురు. అట్లనే యొక్కరు శతావధానము చేయుచుండఁగా నడుమ నింకొకరువచ్చి వారితో సరిగాఁ గూర్చుండఁ బ్రయత్నము చేయుటయును నొప్పుచుండును. నమ్మిట్లు గౌరవింపుఁ డట్లుగౌరవింపుఁడని కోరుకొనుట వెంగలితనమగును గాని పాండిత్యము కానేరదు. అనేక పండితప్రకాండులు కవివర్యులు విశేషించి శతావధానులు క్రిందఁగూర్చుండుట కంగీకరించి యవధానమొనరించువారికి నున్నతాసనము లిచ్చియుండఁగా నా యున్నతాసనము తమకుఁగూడ నిచ్చినంగాని లోపలికి రామనుట పిచ్చిపనిగాని మంచిపనికాదనుట కంగీకరింపనివారిలో న్యాయదృష్టి కలవా రెవరుందురు? తిరుపతివేంకటేశ్వర కవుల సరసను గూర్చుండుటకుఁ గొప్పరపుకవులు ప్రయత్నించిరన నదియే మొదటివారి యాధిక్యతను వేనోళ్ళ జాటుచున్నది. రెండవవారికది వాసినిదేఁ జాలదు. ఇఁక నీప్రయత్నము పరిహాసపాత్రముకాదా? మొదటిదినమున వచ్చి సభ్యులందఱును గూర్చుండినతావునఁ గూర్చుండిన కొప్పరపుకవిగారు రెండవనాఁడు మఱియొక ప్రయత్నమేల చేయవలసి వచ్చెనో? తామవధానము చేయునప్పుడు తా మున్నతాసనములఁ గూర్చుండియుండఁగా శ్రీకృష్ణమాచార్యులవారు మున్నగు శతావధానులు క్రిందఁ గూర్చుండిరిగాని తమతో సమానముగాఁ గూర్చుండఁ బ్రయత్నింపలేదని కొప్పరపుకవిగారెఱుంగరా? "లక్కన్నమాదన్న గార్లందలమెక్కిన సాటికి సర్వప్ప చెలువుగ బైటెక్కె" నన్నట్లు తిరుపతి వేంకటేశ్వరకవు లెంత యున్నతాసనమునఁ గూర్చుండిన మనమును నంతయున్నతాసనము వేయించుకొని కూర్చుండినమాత్రముననే మనము వారితో సమానులమగుదుమా? మనయందు నిక్కముగుప్రజ్ఞకలదేని అది యెచ్చటగూర్చుండినను బ్రకాశించుచునే యుండునుకదా... అప్పలలో పంకమధ్యమునఁబడి యున్న పద్మమునకున్న ఖ్యాతి ఆకాశమునోరయ బూరుగుకొనయందున్న పూవులకు వచ్చునా? కావునఁ గొప్పరపుకవిగారును దత్పక్షపాతులును నాడు చేసిన

గీ. ఏమియగుఁ ! దెల్పితక్కుపయెందు నపజ
యమ్మునకుఁగారణం బవి యాచరించు
పక్షమెన్నఁటికేనియుఁ బడుట ధ్రువము
వెఱ్ఱివేసముల్ సాఁగవు విద్దెపట్ల.

ఉ. తక్కినవానికేమి యవధాన విధాన మదట్టులుంత మిం
పెక్కిన * గీరత శ్రవణ మెంత నుతించినఁగాని తీర దా
చక్కని పాక మెట్లొదవు ! సార మదెంతయు లేక యున్న న
మ్మక్క ! నిజంబుగాఁగవనమన్న ! నదే యగు వేయు నేటికిన్.

చ. అనుచు ననేకమార్గముల నయ్యయి వారు ప్రశంస చేసికొం
చును ముదమందుచున్ జనిరి చూడఁగవచ్చినవా, రసూయలో
మునిఁగినవారు కొందఱు ప్రబుద్ధులు "తప్పదు వారిఁత్రవాసి పే
రును జెడఁదీయలేమె" యని రోఁజుచు నేగిరి యేదొ గొణ్గుచున్.

---

వని పిచ్చిపని. కొప్పరపుకవులు తిరుపతి వేంకటేశ్వరకవులతో సమాను లనిపించుకొన నెంచుచో వారివలెఁ దాము హృద్యానవద్య పద్యకావ్యముల విరచింపవలె. వారివలెఁ దాము సరసజనవేద్యంబులగు గద్యకావ్యంబుల నిర్మింపవలె. వారివలె దాము నేత్రశ్రోత్రపేశ్యంబులగు పాటినాటకం బులఁ గల్పింపవలె. వారివలెఁ దాము సులక్షణలక్షితంబులగు లక్షణగ్రంథ ముల గూర్పవలె. వారివలె దాము నుభయభాషలందును రసపోషితంబగు కవిత్వము చెప్పవలె వారివలెఁ దాము శత్రుమధ్యముననైనను నిరాతంకముగా నవధాన మొనరింపవలె. వారిదేహము లే యున్నతస్థితియందున్నవో యాయున్న తస్థితియందే తమదేహములను బెట్టినఁ గార్యములేదు. వారి జ్ఞాన మెట్టి యా న్నత్యమునందియున్నదో అట్టి యౌన్నత్యమును దమ జ్ఞానమును నందియుండు నట్లు చేసికొనవలయును. అంతియేకాని తమవారిలో బలవంతులెవరోఁ దమ్మను దీసికొనిపోయి బలాత్కారముగా తిరుపతి వేంకటేశ్వరుల సరసను గూర్చుండఁ బెట్టినను, అంతకంటెను నొకమెట్టుదాటి యాతిరుపతివేంకటేశ్వరకవులఁ బడ ద్రోసి వారుకూర్చుండిన యాసనములందే వీరిని గూర్చుండఁబెట్టినను దానఁ దమకు లాభముండనేరదు

* ఇందులకు సంబంధించిన యుత్తరములు గీరతపీఠికలోఁ జూడఁదగు-

క. "పంచశుభం పంచాశుభ" మంచున్ బుధులాడుమాట యచ్చుపడఁగ దీ
వించుచుఁ దిట్టుచు మెచ్చుచుఁ, గుంచించుచు నరిగి రంతకున్ సభముగిసెన్.

ఉ. ఇంతకుఁ బూర్వమే స్వజనమెల్లరు స్త్రీపురుషాదు లాత్మలోఁ
బంతము పుట్టి "శాఖ కిది పర్వ నణంచె" నటంచు నెంచి "వి
క్రాంతి నియోగులం గలుగుఁగాక యెటుల్ మఱి దాని వైదికుల్
గాంతు" రటంచు నక్కవికి గాటముగాఁ బురి నెక్కఁజేయుచున్.

ఉ. "ఒక్కరొ, యిర్వరో! జనము లుండిరి వేలకువేలు, తాదృశం
బక్కట! యాసభాస్థలమునం దొక వైదికమాత్రుఁ డేనియు
న్నిక్కఁ గనంబడన్ బలుకునే! నిను నింతటిమాట, విద్దెలో
నెక్కుడతక్కువల్ గలుగునే యను మంతనె యింతగర్వమే.

ఉ. గర్వముదేమొ చూచెదముగా కిది గుంటురిసీమ, యిర్వురన్
పూర్వపు లెండలో గలరు తొల్లిటినుండి నియోగు, లిందెటుల్
దుర్వినయంపు వైదికుల త్రోవలు సాఁగెడి! నన్నయాదు లం
దర్వినఁ "బక్క నిల్వఁగ నితెంతు డగం" డనుమాటఁ బల్కునే!

* ఉ. మీసము "రెండు బాసలకు మేమె కవీంద్రుల" మంచుఁ దాల్చునా
వాసిని గోలుపుచ్చి మన వైపునియోగులచేతఁ జూపి "మీ
దాసుఁడ" నంచుఁ బల్కెడి విధమ్ముర నక్కవిఁ జేకయున్న నీ
వేసము లేల! పాగలును వింతలకోటులు బర్వకోసమే.

ఉ. "తిన్నను బాంఛితీగరిమ మెండొక వైదికులందు యోజనల్
సున్న" యటంచుఁ ‡ పెద్దనతిఱిశుద్ధిగఁ జెప్పెనుగాదె, యేదియో
పన్నిక పన్ని యిక్కవులపంత మడంతముగాక, ఛాందస
త్వోన్నతు లేమి సేయఁగలరో! కనుఁగొందముగాక వైదికుల్.

---

* ఉ. దోసమటంచెఱింగియును ముందుడు గొప్పఁగఁ బెంచినార మీ
మీసము "రెండుభాషలకు మేమె కవీంద్రుల" మంచుఁ దెల్పఁగా
రోసముకల్గినన్ గవివరుల్ మము గెల్వుఁడు గెల్చిరేని యీ
మీసముదీసి మీపదసమీపములన్ దలుఁచి మ్రొక్కమే.
(నానారాజసందర్శనము చూడుడు)

‡ "బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్" (మనుచరిత్ర)

మ. ఇది గోదావరితీరమంచు మదిలో నేమేమొ యూహించెనో
విదితం బందు బలమ్ము వైదికుల, కావేశమ్ము లిప్పట్టునం
గుదురంబోమి యొకింగఁ జేయవలయున్; 'గుర్చి సమానంబుగా
నొదవన్ రా' దనుమాట కర్థమది యేమో! చూత" మంచుద్ధతిన్.

ఉ. కొప్పరపుంగవీశుఁ బురికొల్పుచుఁ "బత్రిక వ్రాయు మిప్పుడే
చప్పున, వారు రేపకడఁ జన్నపయిన్ మన మేమి చేసినం
దప్పనుబోక, మీనిసిని దక్కువియగ్రము నాటకంబునం
దొప్పెడిఁ బత్రమక్కడనె యొప్పఁబఠించి యొసంగి వచ్చుటల్.

క. వినిపించి యొసఁగ నయ్యెడ, ఘను లందఱు విందు రంత గర్వ మడఁగు నె
త్తిని దీనిఁ జెట్టికొని వార్, చనునట్లొనరింపకున్న శౌర్యము గలదే!

క. 'ఆలస్యాదమృతం విష' మీలాగున వ్రాయు" మంచు నేర్పతిచి తనున్
గోలగ నెపకొల్పిన మది, డోలాందోళనకు దిగి కదున్ వడఁకుటయున్.

ఉ. పాపము! కొప్రపుంగవికిఁ బద్యము వ్రాయఁగఁ జేయిరాదు; లో
లోపలఁ బూర్తిగా దిగులు లోఁతగిలింపఁగ సాఁగె; సారె దా
దాపుననుండి బందుగులు ధార్ష్ట్యము నేర్పఁగడంగి రేదియుం
దోఁపదు పాప! మాతనికి "నూయియు గోయియుఁగాఁ" గనంబడున్.

ఉ. 'కాలెటు త్రవ్వువాఁడ సభ గావుటయే ధ్రువమైనచో, నెటుల్
చాలుదు గచ్చు విచ్చుమెయిఁ జర్చరగొంటెడి యాశుఘోష చేఁ
దూలుదురే, వధానులు బుధుల్ కవు లాశుకవిత్వ తత్త్వవి
త్ఫాలవిలోచనుల్! చెడుఁగదా! మును పుండినకీర్తి దీనితో.

ఆ వె. క్రొత్తనీరువచ్చి కూలమ్ముఁ బెకలింపఁ
బ్రాఁతనీరు కూడఁ బైకిఁబోవు
నేమిసేయువాఁడ నిది వీరెటింగియు
దిగుమటందు' రనుచు వగచుటయును.

ఉ. ఆముఖవైఖరిన్ దెలిసి యాప్తులు బందులు పల్కిరంట! "నీ
కేమి భయంబు వైదికుల కియ్యెడ నాటలు సాగ వెందు నీ
సీమ నియోగిసీమ, సభ చేయనె చేయము చేయుచో నెటో
నీమహిమంబె మెత్తుము మనీషుల జంకుచు రొండు పల్కఁగన్.

తే. గీ. తెల్లవాఱినదాది యేదేని పనికి
వచ్చి లౌకికులను జూడవలయు నట్టి
పండితులు మాకు వ్యతిరేక ఫణితిఁ బోరు
ఎల్లబుధులు తిర్పతివేంకటేశులొక్కొ!

చ. ఇది యిటులుండుఁగాక; సభయెట్లగు? స్కూలునఁ ''దెల్గుటీచ''రన్
పదమున నుండె నందొకఁడు, వాదముకోసము స్కూలువారు ''పా
పద''మని యిత్తురే సెలవు? పల్కులు వేయును నేల! రేపె పో
యెద రలవారు నీకు జయ మేర్పడు, నోర్పడి యుండ్రు వైదికుల్.

ఉ. పంతము పుట్టి వారొకట వాదముకోసము నిల్చిరేని య
ల్లంతన జీవనార్థమగు నాపని యూడెడి, మీఁద దానితోఁ
గొంత యడంగు గర్వ; మది ''కుంచెడువోయెను సోలకేగ'' నం
చెంతురు లోకు, లెట్లయిన నేమి పరాభవమైన యట్లగున్.

ఉ. వ్రాయుము 'మీదు మీసమును వాదములో గొఱిగింతు'నంచు వా
ర్చ్యయఁగలట్టి దెట్టిదియొ చేతురు, మాతము గాక; నీకు మా
సాయము గల్గ నిట్టి దొక సందియమేటికిఁ 'గేసు' దెచ్చుచో
మాయదియే సమస్తము; ప్రమాదము లేశము లేదు దీనిలో.

శా. మేమే వ్రాతుము గాని మాకుఁ గవితోన్మేషంబు ముఖ్యంబు గా
దేమో కొంచెము వ్రాయనేర్చినను మే మీవృత్తిలో లేము; మ
మ్మామోదింపదు లోక మట్లగుట నిన్నర్థించుచున్నాము మా!
మామా వ్రాళ్ళిట నున్నయట్టులుగ సంభావింపు నిశ్శంకగన్.''

చ. అని పలుమాఱు చెప్పినను నాత్మకు నన్యులకున్న యంతరం
బు నెఱుఁగు కొప్పరంపుఁగవి పూర్తిగ సందియమున్ విడండ, యా
తనిగతి గాంచియంతట నతండ్రుఁ డొకానొకవృద్ధు పల్కె 'ని
న్ననఁ బని లేదు, నీకు బిరుదాదు లొసంగిన తప్పు మాదియే.

ఉ. ఐనది యయ్యె నీ కిడిన యాబిరుదమ్ములు నూఱులాఱులున్
మానుగఁ జెట్టిపొమ్ము మఱుమాట వచింపక యట్లు గానిచో
దీనత మాని పత్రికను దేఁకువమై లిఖియింపు మొందుచం
దానకు నొప్పుకో' మన నతం డిది యెట్లును దప్పదంచొగిన్.

చ. మనమునఁ జింతనొందుచు నమాత్యులు చెప్పినయట్టి యంశముల్
గొని తన నేర్పు చందమునఁ గొండొకకైత రచించి వ్రాలొన
ర్చిన నది కేలఁబూని దయచేసిరి మాకడ కొక్కయిర్వు రిం
తని వచియింప రాని * వినయం బనయంబు మొగమ్ము గ్రమ్మఁగన్,

క. వీ రిరువురు మఱికొందఱుఁ, గాటులు ప్రకటించి పత్రికలు నింపిరి దు
ర్వారుల నివార్యరల నా, చేరువవా రెఱుఁగుదురు ప్రసిద్ధులె వీరల్.

చ. ఒకఁడు 'యథార్థవాది' యగు నొక్కఁడు దా నగు 'సత్యవాది' వే
ఱొకయెడ రెండు వేసములు నొక్కఁడె తాల్చి పరాక్రమించు ము
న్నొక మహిషాసురుండె కద! యొక్కతుటిన్ శతశస్సహస్రశః
ప్రకటితరూపుఁ డయ్యె నని భాగవతంబు వచించు నంబరో!

ఆ. వె. పలుకులేల! 'సత్యవాది' 'యథార్థవా
ది' యనుపదయుగమ్ము లిట్టుగాఁగ
మార్చినట్టి వీరి మహిమను నుతియింప
శేషఫణికినైనఁ జెల్ల దంబ!

క. పనిలోఁ బని యివ్వారల, పెను దుండగముల నొకింత వినిచి పిదపఁ ద
క్కినకథ నుడివెద మింతటి, యనృతాత్ములఁ జూచియెఱుఁగ మంబరో యెందున్.

చ. ఇదివఱకే మొనర్చినటులే యవధానము నాఁడునున్ * సభా
సదు లలరన్ బొనర్చితి, మసంగతమైనను వారు పట్టు వ
ట్టిది తుద నెగ్గనిచ్చెద నొదుము వీరికి మంచివార మ
య్యది బుధగర్హితం బగుట నందుల కొప్పకపోతి మంబికా!

* "అతివినయం ధూర్తలక్షణం"

*......19 వ తేదీ పగలు 2 గంటలకు హిందూ నాటక సమాజము వారి నాటకశాలయందు సభ సమకూర్పఁబడెను. గుంటూరునందలి పౌరులేకాక చుట్టుపట్లనున్న పల్లెలవారును నవధానసభాదర్శనకుతూహలులై వచ్చుటచే నినుముచల్లినను రాలకుండునట్లు నాటకభవన మంతయు నసంఖ్యాకములగు జనములచే నిండి నిబిడీకృతంబైయుండె, 2 1/2 గంటలకు నవధానము ప్రారంభింపఁబడెను. ఒకరిరువురేమి తక్కువయోకాని పృచ్ఛకులు నూర్గురు గూరుచుండిరి. వారును నూర్గురికి చెప్పుటకు సంసిద్ధులైయుండిరి. కాని అవధానులొక్కొక్కరికొక్క

♦ చ. ప్రతిఘటియించుచోట నలుపద్మభవుండుదుఁ గాక శేష భ
త్పతి యగుఁ గాక పోదు బుధి తప్పద న్యాయముకోస, మిట్లె తి
ర్పతికిని వేంకటేశునకు రాఁ దగు శేరది వచ్చె; నేఁడు వీ
ర్కొతికిన మూర్తిఁ బోవు నధికా దని యెవ్వరెఱుంగ రంబికా!

క. గాడిదగత్తరప్రాంతలు, బూడిద బుస్సన్న లెవరొ పొల్పునఁ గీర్తుల్
పాడఁబ్బనెడ "దగ్గినచో, నూడెడిము క్కొండు నేమొకో! తుమ్మనెడన్"

---

కొక్క పాదముచొప్పున నలుబదిమందికి పద్యములు చెప్పునప్పటికి మ. రా. రా ఏకా రామయ్యపంతులుగారును, కొండా వెంకటప్పయ్య పంతులుగారును బ్రహ్మశ్రీ రంగావఝ్ఝుల హనుమయ్యగారును మొదలగు పెద్దలు, 'నలువదిమంది చాలరా! ఏల యాయాసము, కాలముచాలపట్టు' నని వక్కాణించుటచే నాఁడు 7 గంటలగువఱకు, నప్పుడప్పుడడిగిన శ్లైల్లతామిది వఱకు నాయారాజులపై రచించిన పద్యముల సభ్యకర్ణపేయముగాఁ జదువుచు నలువదిమందిలో నిరువదిమందికిపూర్తిగా నాలుగు చరణములు చెప్పి, చదివివేసి మిగిలిన యిరువదిమందికి రెండురెండు చరణంబులచొప్పునఁ జెప్పివేసిరి......బ్రహ్మశ్రీ వేంకటశాస్త్రిగారప్పటికి జ్వరపీడితులైయున్నను వారు తమయుద్యమమును నెఱవేర్చి సభ్యులకుఁ గలుగఁజేసిన బ్రహ్మానందమనితరసాధ్యమని వక్కాణించుట తక్క విశేషించి వర్ణించుట నాబోంట్లకు శక్యముకాదు ఇంక నారోగ్యస్థితిలో వారొనరించు నవధానమెంత యానందకరమై యుండునో యెవరుచెప్పగలరు! నాఁటిరోజున మిగిలిన రెండుపాదములు చెప్పి మరలఁ జదువుటకుఁ గొంచెము కాలమేపట్టినను రాత్రి 8 గంటలవరకు వారి యసమానకవితాసుధాధారలచే సభయంతయు నిస్తరంగంబైన సముద్రము వలె నుండెను. పిదప "జయజ" యేతిధ్వానములతో సభ ముగింపంబడెను. నాటి రాత్రి హిందూనాటకసమాజమువారి పాండవవిజయప్రదర్శనమున కంతరాయము కలుగుననికాని లేనిచో సభ యెప్పటికిముగిసియుండునో తెలియదు. అవధానాంతమున నాయాయి పండితులు తమయానందమును వెల్లడించుచు చంపకోత్పలాది మాలికలచే నవధానుల నలంకరించిరి... ... ఇట్లు,

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, చంద్రికాప్రెస్సు, గుంటూరు 29-8-11

♦ ప్రతిఘటించిన నెంతవాఁడైన లక్షింపము (నానారాజసందర్శనము 39 వ పుటయందు చూడుడు)

ఉ. తప్పదు వ్రాఁత వ్రాసెడి పరిహారకులేనియు నొక్క త్రోవ నొ
క్కప్పుడుఁ బోవరైరొక యుదాహరణం బిట నిత్తు నంబ! యీ
కప్పుల కూఁత లారయుము * 'కాచుమమున్ శివరాముఁ' డంచుఁ దాఁ
జెప్ప నొకండు వేరొకఁడు ‡ 'శిష్యుఁడు మూర్ఖుఁ' డటంచు వాఁగెడున్.'

క. అవధానమె యెఱుఁగనికొ, ప్పవరపుసోదరుల వేయి పాళ్లధికులుగా
నెవఁడో యొకండు వ్రాయును, శివ! శివ! యవ్వానికెట్లు చేయినడుచునో!

క. ఒక్కటిగా దరయుంగా, దక్కట! పదిగాద యిరువదైనను గాదే!
ఒక్కపతి ♦ వేయిరెట్లే, యెక్కిరి కొప్పరపువార లితని వ్రాఁతన్.

తే. గీ. శాఖలోఁగొంద ఱాకాశ సౌధ మొకటి
గట్టిపెట్టిరి కొప్రపుఁ గవులకొఱకు
'ఎక్కలేము మెట్లో' యన నెక్కతీఱ
వలయునని త్రోయుచున్నారు బలముకొలఁది.

శా. అంబా! యీజగమెల్ల నీవలనఁగాదా! పుట్టి వర్ధిల్లు ని
క్కంబున్ దెల్పు మసత్యపుంబటిమచేఁ గల్పాంతము న్నిల్చుకీ

---

(పండిత బ్రువలక్షణము అను బండతిట్ల పొత్తము నుండి.)

*.........మఱపుకురాదు దెబ్బ, పొడిమాటలు డాబినఁ బోదు నొప్పి; నన్నరసి యొవండు గామనిఁక హా! శివరాముఁడ, స్వామి! యంచు.........

(22 వ సెప్టెంబరు 1911 సం॥ ఆంధ్ర కేసరినుండి.)

......తరువాత నయ్యో యదియట్లయ్యె నే యనువ్యసనముచే గాబోలు వారి శిష్యుడగు వేలూరు "శివరాము" డను చిన్నవానిని పిలిపించి విద్యార్థులద్వారా కాలేజీహాలులో నేటికి నాల్గురోజులకిందట నొక సభగావించిరి... (సత్యవాది)

‡ (22 వ సెప్టెంబరు 1911 సం॥ ఆంధ్రకేసరినుండి)

......సమరంబున కర్ణు డీల్గినట్లు యీ శతావధానము పూర్తియైన దని చెప్పట కెంతమాత్రము సంశయము లేదు......(సత్యవాది)

(డిటో ఆంధ్రకేసరి.)

♦ ......వాడు తిరుపతి వెంకటకవులుచేసిన యవధానముకంటె కొప్పరపు కవులు చేసిన యవధానము వేయిరెట్లెక్కువగా నున్నదనుట కెంతమాత్రము సందేహము లేదు.........(సత్యవాది)

రిత్రంబుట్టించు ననామత్ప్రజల కెందేఁ గంటివే నొక్కల
క్ష్యంబుఁ జూపుము వేదశాస్త్రముల, లేదన్నన్ బురాణమ్ములన్.

ఉ. కొండొక యీసుచే నెవఁడొ కొంటెతనమ్మున మాఱు పేరితో
నండి యొదో లిఖింప నది యొండొక యూఁతగ లేచి మాకృత
జ్ఞుం డొకరుండు దబ్బఱలు గొన్నిటి వ్రాయఁగఁ జొచ్చె నద్దిరా!
"తొండకు వెల్లిసాక్షి" యనుతొల్లిటిమాట స్మరింపఁ జేయుచున్.

చ. ఇరువదిరెండు వత్సరము లేగెను పీ రవధానభారమున్
శిరమున నూని, యొక్కపుడు చెట్టె లిఖించినవాఁడు లేఁడు నేఁ
డుఱక యెవండొ కొంటె యెదియో లిఖియించిన నమ్మి పెట్లటం
చెఱిఁగియు మాకృతజ్ఞుఁడరరే! యది పట్టుక యోలలాడెడిన్.

ఉ. వేయికి నొండె లేక యరవేయికి, నందు సగాన కొండెఁ, గా
దే, యొకనూటికొండె, మఱి యేబదికొండెను గాదు, * నల్వ, దిం
తే! యెటు తప్పిరయ్యెడ సుధీశులు తిర్పతివెంకటేశు లం
చీయనవ్రాఁత ఛీ! యనకయే గ్రహియించెను మాకృతజ్ఞుఁడున్.

ఉ. తప్పదు వ్రాఁత కొప్పరపుఁ దజ్ఞులకై లిఖియించె నెవ్వఁడో
మొప్పె స్వశాఖకై; యతఁడు పోయినపోకడ లొప్పఁగాక "వా
తప్పు ప్రసంగ" మంచితనిదారిని దజ్ఞులు దూఱుచుండ మా
యప్పకు 'నట్టహాస' కవి కానుడు లెక్కవడేటి తెల్వియో!

‡ ఉ. అప్పుడు "సత్యవాది" యను "యథార్థపు వాది" యను నన్న పేళ్లతోఁ
దప్పులు వ్రాయు వారల విదగ్ధత మాపెడునట్టి యూహయే

---

(1911 సం॥ ౯-10 సంచికలు, అభినవ సరస్వతినుండి)

*... శతావధానమే ప్రారంభించి యేయుద్దేశముతోనో కొందఱిచే 40 మందికే చాలునని యొత్తిపలుకఁబడినమీఁద నంతకే ముగింపనెంచి చెప్పుచున్న వానిలోని యవశిష్టాంశమును నుడువసాఁగిరి-పూర్వదినము 40 మంది కన్న పేరేకాని యవధాన మధ్యమున నితర ప్రసక్తి యుండఁట. ......

‡ J. GURUNADHAM, B. A., RAJAHMUNDRY
Editor, Andhrakesari. Dated 13th Oct. 1911

Sir,

Re—Your registered card dated 11th Oct. 1911 you are requested to refer to the Andhrakesari.

యుప్పతిలెక్క గ్రమ్మమ్ముగ రుష్టోదయ మధ్యాది తగ్గి వారిపై
నిప్పుడు ప్రేమ పుట్టెడి నదేమిటికన్న! పఠింతుమంబరో!

చ. అనృతము వ్రాయఁగాక యది యాత్మకుమంబలె నొడ్లమక్ సుఖం
బున ననృతంబుగాఁ దెలియఁ బోల్చని వ్రాసెను 'సత్యవాది'; వీ
నిని భరమోపకారి యని నిక్కము చెప్పఁదగుక్ "యథార్థవా
దిని" మఱి యట్లె చెప్పవలెఁ దిట్టి రసేరులు వీరికెందుకో

చ. తనలిఖియించు వార్తలకుఁ దద్దయు మోసము చెంది పత్రికా
జను లపరాధిగా మఱి యసత్యవచస్కునిగాఁగఁ దన్నుఁ దె
ల్పిన నొకమూలఁ గిమ్మనక పేర్చినభీతిని డాఁగినట్టి వాఁ
డనృతము వ్రాసియు న్నిజము నావలఁ దెల్పినవాఁడె యౌఁగదా!

తే. గీ. * దిద్దుబాటును బత్రికాధిపతి వ్రాసి
"సత్యవాది" యపరాధమ్ము నెంచి డాఁచి
నట్టిసంగతి నెఱిఁగియు నదియె పట్టి వ్రేలఁ
బడు మాకృతజ్ఞుఁడు వెఱ్ఱివాఁడు.

---

dated 29th September 1911, page 6 column 3, when a 'correction' was published regarding the matter you have written to me about

I am advised to add that nothing more can be done.

I am, Yours faithfully,
J. Gurunadham, Editor.

M. R. Ry.
R. HANUMAYYA PANTULU GARU, B. A.,
First Grade Pleader, Guntur

(* 29 సెప్టెంబరు 1911 సం॥ ఆంధ్రకేసరి నుండి)

దిద్దుబాటు.

గుంటూరు అవధానము.

"గుంటూరు అవధానములు" అను పేరట "సత్యవాది" యను ఉపవిలేఖరి మాకు వ్రాసినలేఖను వెనుకటి పత్రికలో ప్రచురించియున్నాము. అందు వేలూరి శివరామశాస్త్రిగారిచే చేయబడిన శతావధానము సరిగా చేయబడలేదని సత్యవాదిగారు వ్రాసెను. ఇది అసత్యమగు లేఖగా మాకు తరువాత తెలియ

ఆ. వె. "ఇంతివాఁడు గొడ్డుదది యనఁ బోరుగున
వాఁడు పాడి"యంచుఁ బలుకురీతి,
మెలఁగు మా కృతజ్ఞు మెచ్చు వాలుక రాజ,
యెవని నేని మెచ్చు నిచ్చగించు.

ఉ. చచ్చిన వార్తఁ బట్టికొని సాఁకుచు ముద్దిడుకొంచు నచ్చునన్,
గ్రుచ్చుచు నక్కునందు నిడి కుల్కుచుఁ గన్నుల నద్దికొంచు ని
ప్పచ్చరమైన సామెతకుఁ బాల్పడు మా కుహనావధాని కే
మిచ్చిన నీయవచ్చు నిటు లేవము దా నోడిగట్టి నందునన్.

---

వచ్చినది. మఱియు శివరామశాస్త్రిగారిని శివరాముడనియు సత్యవాదిగారు వ్రాసిరి. మేము ఈ పేరు కవిత్వము చెప్పుటయందు తమ నమ్రత (Modesty) ను జూపుటకు వహించిన నామమని దలంచి దిద్దుబాటు చేయకుండ ప్రకటించినారము. వీరినిగూర్చి మేము ఎప్పుడును వినియుండకపోవుటచే ఇట్టిపొరబాటు తటస్థించినది. మరియు సత్యవాదిగారు విద్యాధికులనియు లేఖల వ్రాయుటందు తమ జవాబుదారి గ్రహించిన వారనియు మేము భావించుటవలన వారిలేఖను ప్రచురము జేసినారము. ఇట్టి పొరబాటు గల్గినందుకు చింతిల్లుచున్నారము.

పరా:— ఈదిద్దుబాటునకు మఱియొకలాగునఁ దాత్పర్యమును కల్పించుచున్న కవితాపత్రికలోని వ్రాఁత కీక్రింద నుదాహరించుచున్నారము. ఆవ్రాఁతలోని దురాశయమును, దెల్వితక్కువయును, అకృతార్థతయు లోనగు సుగుణములు చదువరులే నిర్ణయించుకొందురుగాక.

"కృష్ణా— కేసరీ! ఈసంగతి పొరపాటని చెప్పితివఁటగాదా? ఆంధ్ర కేసరి—(నవ్వుచు) అవి గాదమ్మా! ఆయనపేరు శివరామశాస్త్రియనుటకు శివరాముడనుట పొరపాటని చెప్పితినిగాని తక్కినవిషయమును గుఱించి నేనేమియు ననత్యమాడలేదు. ... ... (1912 సం॥ కవితాపత్రిక 2 వ సం॥ చూ)

రాజమండ్రి 13—10—11

చిలకమర్తి లక్ష్మీనరసింహము నమస్కారములు, అయ్యా! దేశమాత కార్యదర్శిగారి పేర మీరు వ్రాసిన జాబు చూచితిని. పత్రికానిర్వాహపు భారమును నేను యితరులపైఁ బెట్టితిని. వచ్చిన యుపవిలేఖకుల జాబులను నేను చూచుటలేదు. పత్రికానిర్వాహముఁ జేయువారు గూడ పొరబాటున వానినిఁ బ్రకటించియుందురు కాని యుద్దేశపూర్వకముగా మిమ్ముగాని తిరుపతిశాస్త్రులుగారినిగాని తిరస్కరింపరు. కావున మన్నింపవలయునని కోరుచున్నాను.

చ. ఇది యిటులుండుఁగాక "వది నీఁద శ్వపుచ్ఛము నూఁత గొన్న," కో
విదులఁ గృతజ్ఞులన్ గడువివేకుల గీరతమందుఁ జూచుకో
కది యిచటేల! వారిబులు పయ్యెదఁ దీర్ఘముగాక, అంబరో!
పదపటిగాథకున్ హృదయపద్మ మొకించుక త్రిప్పు మెప్పగన్.

సీ. వినయార్థముగ మేము వినుచుపల్కులనెల్ల నసమర్థతను గుర్తులని లిఖించె
* ఘనుఁడైన కాశికృష్ణుని ఒట్టికో మాకునై యేదో నూచించెననిలిఖించె

---

(1-11-1911 తేదీ ఆంధ్రపత్రికనుండి)

ఈశతావధానములను గురించి వ్రాయువారికముందు దమపేరులను వ్యాసాంతమున ముద్రించుట కంగీకరింతురేని వారి వ్యాసములను స్థలమున్నయెడల ముద్రించుట కంగీకరించెదము. సత్యవాది, హితవాది, పృచ్ఛకుడు, అని వ్రాసినయెడల ముద్రించుటకు వీలుపడదు. (ఆ॥ ప॥ సం॥)

(ఈక్రిందియుత్తరము కృష్ణాఫీసునుండి వచ్చినది)

*...మీయవధానము బాగుగ జరిగినదని పత్రికలో వ్రాయుటకంటెయథార్థవాదియొక్క వ్యాసమే మీప్రఖ్యాతిని మఱింతస్థిరముగ స్థాపించినదనియు, ప్రజలయభిమానముకూడమీపట్లచూపుటకుకారణమైనదనియుఁనమ్ముచున్నాను...

అవటపల్లి నారాయణరావు.

(1911 సం॥ సెప్టెంబరు 1 వ తేదీ కృష్ణాపత్రికనుండి.)

* ...వీరవధానముచేయుఁనపు డగ్రాసనాధిపతి యేదియోవ్రాయుచుండిరి. ఈ వ్రాఁతపైకవీశ్వరులు తమవీక్షణములు ప్రసరింపఁచేయుచువచ్చిరి. (యథార్థవాది)

(అక్టోబరు 6 వ తేది 1911 సం॥ కృష్ణాపత్రికనుండి.)

.........అయ్యా, తాము తమపత్రికలో మాగుంటూరు శతావధానము (తిరుపతి వేంకటేయము) ను గూర్చి యథార్థవాదిగారి వ్రాఁతఁబ్రకటించియున్నారు అందునేక విరుద్ధాంశములును నసత్యాంశములును గలవు అవియన్నియు నాకు సంబంధించినవికావు. కావున వానివదలి "కాశీకృష్ణమాచార్యులు (అగ్రాసనాధిపతి) తన చేతిలోవ్రాసి, ప్రసిద్ధరావృత్తమనియవధానులకు నూచించె" నను నంశము, నేనవధానపద్యములు వ్రాయుచు గూర్చుండుటయు వారవిచూచుచుండుటయు, కేవలమసత్యమని దెల్పుచు నా "యథార్థవాది" యెవరో దయచేసి తాము తెల్పునెడల మీయెడ మిగులఁగృతజ్ఞుఁడనై యుందునని వ్రాకుచ్చుచున్నాడను.

గుంటూరు } ఇట్లు, కాశీకృష్ణమాచార్యులు,
25-9-11. } బాలసరస్వతి, శతావధాని.

‡ మమ్ము మన్ననసేయు నమ్మహాత్ముల నెల్లఁబక్షపాతులటంచుఁ బదలిఖించె
నది యిది యనసేల! యఖిలమ్ము వ్యతిరేక మెటులౌనొ యెంచి తానటులిఖించె

గీ. "అ" యనఁగ నపశబ్దమా "ఊ"యన నుప
శబ్దమాను "నారాయణస్మరణసేయ
బూతగు" నటన్న సామెత పూర్తిగాఁ గృ
తార్థ మగునట్లు నడిచె "యథార్థవాది."

* తే. గీ. "చేసియో చేయకో మేముచిన్ననాఁట
'శతవధాను' లటన్న మచ్చనొకదాని
గొంటి మది నేఁడు పోఁగొట్టికొందమన్న
'బాలబాపరోగపు' మచ్చ వగిదిఁబోదు."

క. అని వినయంబున మాకుక్, మనమున నవధానమందు మసలినవినువుక్
ఘనమతులూ మెచ్చ నొడివిన, ననయుండు"యథార్థవాది"కది విషమయ్యెక్.

♦ క. "మందఃకవి" యను శ్లోకము, నందుక్ శ్రీకాళిదాసునంతటివాఁడే
నిందించుకొనియెఁ దన్రప, జ్ఞం దానికి నేవవడిన జడులుం గలరే. 193

క. అతఁడే మందుఁడు ననికొనె, మతిహీనుఁడు కాళిదాసు మఱి యీతనిఁ బం
డితులు నుతించుట వితయను, వితముగద! "యథార్థవాది"వేఁదుఱు వ్రాఁతల్.

---

‡ (సెప్టెంబరు 1 వ తేదీ 1911 సం॥ కృష్ణాపత్రికనుండి)

......పూర్వపుసంగతి యెట్లున్నను ప్రస్తుతము మాయూరియందు వారుచేసిన యవధానమునకు సన్మానించుట కభిమానమే కారణమని నిశ్చయముగా జెప్పగలము.........(యథార్థవాది)

* (సెప్టెంబరు 1 వ తేదీ 1911 సం॥ కృష్ణాపత్రికనుండి)

...మొన్నను వారు (తిరుపతివెంకటేశ్వరులు) స్వవిషయమై చెప్పికొను సందర్భములో పసితనంబున చిన్నబిడ్డచేష్టవచ్చినప్పుడు కాల్చిన రక్షయొక్క మచ్చ ఆజన్మాంతముండునట్లు వారు చిన్నప్పు డార్జించిన "శతావధాను"లను మచ్చ యిప్పటివఱకు నిల్చియుండినదని వచించిరి ఆహా! ఏమి వీరియుపమానము! కింక వీందరిఘటాపంచాననులనోటనుండి రావలసిదేనా! వారికీర్తినివారే మచ్చతోఁ బోల్చుకొనుచుండ మేము వేఱుగఁ జెప్పవలయునా!......(యథార్థవాది)

♦ శ్లో. మందఃకవియశఃప్రార్థీ, గమిష్యామ్యుపహాస్యతాం"(మందః,నిర్భాగ్యుఁడు,
శ్లో. "మూఢాల్పాపటునిర్భాగ్యామందాః" అని నిఘంటు చెప్పుచున్నది.

ఆ. వె. దీనికేమి తెల్వితేటలు లేని జో
ల్మలకుఁ దగినయట్టి పొడము లెట్లు
అనియుఁగాక కేవలానృతమ్ములు వ్రాయు
వారి వ్రాఁత కొక్క వరుస గలదె! 195

క. "మాదిగమంచమునకుఁ దల, యేదెస?" 'కాళ్ళకడ,' యనఁగ నేదెస? యట్లే
పో! దుర్విదగ్ధు లెదియొ, సోదెగ వ్రాయుదురు దానిఁ జూతుర ప్రాజ్ఞుల్.

చ. ఇకఁ డిటు వ్రాసినట్టి సుజనుఁడే యనుకొందము దేవి! యింత కు
వ్రతులు గలారునూ! జగమునన్ మతి కొందఱు; వారు సుప్రసి
ద్ధత గలవారిపైఁ దలుచు దప్పుడు వార్తలు వేయుచుంద్రు "స్వ
ర్గతు లయి" రంచుఁ గూడ వృథగాఁ బ్రకటింతురు దుర్విదగ్ధులై.

* చ. (1) "తిరుపతి వేంకటేశ్వరులు తీఱి" రనన్ మతి తీఱ లేద (2) 'వేఁ
దుఱు గొని' రన్న వేఁదుఱునఁ దూఁగఁగ లే (3) 'దవధానమందుఁ ప

---

* షరా:— ఈ పద్యమున నున్న (1) మొదటి యంశ మిదివఱకనేకులు విని యున్నదియే, దీనికి సంబంధించిన లేఖలు ప్రకృత మిట లేమిం జేసి యుదాహరింపఁ బడనయ్యె. ఇఁక (2) రెండవ యంశమునకు సంబంధించిన లేఖ, గీరతములో నుదాహరింపఁబడి యుంటచే నిందు మరల నుదాహరింపలేదు. సెప్టెంబరు 16 వ తేదీ 1912 సం దర్బారులోని చట్టి నరసింహారావుగారి వ్రాఁతకూడ నీయపవాదమునకుఁ దోడ్పడుచున్నది. (ఎవరో యొక వెట్టి వెంకయటూపలనఁ బ్రేరేపింపఁబడి వ్రాసినతలంపు) ఇది శ్రీకవిరాజు త్రిపాదికృష్ణమూర్తి శాస్త్రిలవారు నీసాశుకవనమును గూర్చి వారికిఁ దోఁచినయభిప్రాయము నాంధ్రభారతిలోఁ బ్రకటింపఁగా నది కూడ మా ప్రేరణవలననే జరిగినదని యీ చట్టి నరసింహారావుగారు వారిని, మమ్మును, దూషించుపట్టులోని వాక్యరత్నములలోనిది! ఈయన సత్యవాదిత్వ మీక్రింద నుదాహరింపబడు దర్బారులోని శ్రీ కవిరాజుగారి వాక్యములవలనఁ దేలఁగలదు.

(అక్టోబరు 1 వ తేదీ 1912 సం॥ దర్బారునుండి)

......"ఆ నా వ్యాస మొకరి నుద్దేశించి వ్రాయుంబడినది కాదు. ఏ వెట్టి వెంకటాయ" ప్రేరణయు నట లేదు. నేనొరుల దాక్షిణ్యమునకుఁ గట్టుపడియుండు వాఁడఁగాను. ప్రస్తుత మింటింటికిని బయలుదేరు నవధానులు నాశుకవులు బయలుదేరుట చేతను; వారివలన లోకమున కుపకారము, లాభము, లేవని నామనకిం

ప్పి" రనినఁ దప్పు లేద; రిపుభీకరులై తమ పేరుమీఁదఁ †బ
ల్వురు బ్రతుకన్ భవత్కరుణ పొంపిరిపో సుఖముండి రంబికా. 128

* ఉ. మోసపు రావభాసురుల మ్రోఁతలు నీకడఁ జెప్ప నేల ? రా
కాసుల చైదముల్ దెలియుఁగా ! భవదీయ హృదంతరంబు, మా

---

దోఁచుట చేతను నిడదవోలు సభలో నించుక చదివిన విషయమునే విపులముగ వ్రాసియుంటిని. దానివలనఁ దమ కింత కినుక వచ్చుటకుఁ గారణము లేదు......

(శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి),

వరా :— ఇది యిటులుంచి యీ రావుగారి "వెట్టి వెంకటాయ" ప్రయోగసారస్యమును బట్టి మన కొప్పరపుసోదరుల పక్షమును నిర్వహింపఁ బూనిన గుంటూరుసీమలోని సనామకు లెట్టివారో లోకులు గ్రహించి వీరింబట్టియే యనామకుల వ్రాఁతలయందలి గౌరవములను గూడఁ దెలిసికొని "యింత విద్దె చూపిన" మా రావుగారిని మిగుల గౌరవింతురుగాక. ఇదే తీరుగా మమ్ము దూషించు బుద్ధిమంతులు మఱికొందఱు గలరు. చదువరులకుఁ దెలియుటకై వారి పేళ్లుమాత్రి మిట నుదాహరించుచున్నారము, (1) పాటిబండ సూర్యనారాయణరావుగారు, (2) బందా సూర్యనారాయణగారు, (3) మున్నంగి నృసింహశర్మగారు, (4) పోచిరాజు సీతారామయ్యగారు, (5) మన్నవ నరసింహముగారు, (6) తురుమెళ్ళ వెంకటసుబ్బశర్మగారు, (7) కాళ్ళకూరి నారాయణరావుగారు, ఈ మొదలగువారి వ్రాఁతలు పెక్కులు, గ్రంథ విస్తర భీతిచే వాని నుదాహరింపని మమ్ము నవ్వారు మన్నింతురుగాక. అవకాశము న్నచో ముందు ముందుదాహరించుటయే కాక యుపోద్ఘాతమున దిఙ్మాత్రముదాహరింపఁగలము. వలసినవారు దర్బారు, మనోరంజని, అను పత్రికలలోఁ జూడఁగోరెదము.

† (వేలూరి శివరామశాస్త్రి తెనాలి శతావధానమునుండి)

శ్లో. కేచిచ్ఛ్రీపతి వేంకటేశ్వర కవీ దృష్ట్వాఽథ శుశ్రూషయా, కేచిత్కేచి దమిత్రతామ పగతాః కేచిత్ప్రతి త్వాఽంతికే, అభ్యస్యంతిశతావధాన కలనాం కీర్తిం లభంతే ధనం, తస్మా దాధునికావధానిగురుతా హేతూ కవీ సంశ్రియే.

మలుకుట్ల వెంకట కృష్ణశాస్త్రి శతావధాని.

* (ఫిబ్రవరి 24 వ తేదీ 1911 సం॥ కృష్ణాపత్రికనుండి)

వేలూకచో కైతవశతావధానులను శీర్షికక్రింద బ్రచురించిన వ్యాస

వేసముఁ బూని పట్టుపడి వెళ్ళెలమై నొకరుండు ముక్కరసా
భాసయి పోయె నంట! యెటువంటి ప్రబుద్ధులు లేరు! శాంకరీ. 198

మును మాచదువరులను శ్రద్ధగా జూడగోరుచున్నాము. ఇట్టిమోసమును దెల్పు నుత్తరములు మాకును, బ్రహ్మశ్రీ శతావధానులు వేంకటశాస్త్రిగారికిని రెండు మూడు నెలలనుండియు విశేషముగా వచ్చుచున్నవి శతావధానులు తిరుపతి వేంకటేశ్వరులమని భిక్షాటనమునకు బయలుదేరుచున్న కృత్రిమపురుషులనుబట్టి ముందుగ బుద్ధివచ్చునట్లు సత్కరించి యనంతరము పోలీసువారి స్వాధీనము చేయగోరుచున్నారము. లేనియడల దేశమంతటను విచ్చలవిడిగా తిరుగుచు జనులను మోసముచేయుచున్న యీయపాత్రులపనులు తుదముట్టజాలవు.

## కైతవశతావధానులు.

జనవరినెల 27 వ తేది సాయంకాలము సుమారు (5 గంటల సమయమున ఎట్టుపాలెములో నివసించుచున్న మద్బాంధవుడును మిత్రుడును నగు మాడపాటి తిరుమలరావుగారి గృహమునకు బోయియుంటిని. అచ్చటనున్న యాస్తరణము (కురిచీ)లలోనొకదానిపైన నొక క్రొత్తపురుషుడు కూర్చుండియుండెను. ఆయన వయస్సు 30 సంవత్సరములుండును. మిగుల బొడగరిగాని పొట్టికాని కాక మధ్యస్థముగు నెత్తును, గిరదాతోగూడిన పెద్దజుట్టును, సామాన్యములుగ నుండిన మీసములును (ముఖమున మచ్చయున్నట్టు నాకు జ్ఞప్తి) గలిగి కొంతవఱకు సుందరపురుషు డనదగియుండెను. ఆయన ధరించియుండిన ఆకుపచ్చరంగుగల శాలువతోగూడ గులాబిరంగుగల పట్టుధుమాలు వల్లెవాటుగనుండి వారివేషమునకు లౌకిక వైదికమిశ్రముగు కళనొసంగుచుండినది. పెద్దలు బొడగన్నప్పుడు వారికి నమస్కృతు లొసగు నాకేకారణముననో వారియందట్టి భక్తిభావము కలుగలేదు. అది యట్లుండె నేనును నొక్కచో నచ్చట గూర్చుండిన పిదప వారికిని నాకును నీక్రిందిసంభాషణ జరిగెను. (నేను) అయ్యా! తమవాసస్థలమేది? (నూతన పురుషుడు) 'మాకాపురము బందరు' (నేను) 'తమపేరు?' (నూత) (నిరసనభావము నభినయించుచు) ఏదోపుల్లయ్య (నేను) 'తమగృహనామము' (నూత) 'చెళ్లపిళ్లవారు' (నేను) (కొంచెమాలోచించి) ప్రసిద్ధపండితులగు శతావధాని వేంకటశాస్త్రిగారితో తమకేమయిన బరిచయముగాని బాంధవ్యముగాని కలదా? (నూత) (ముసిముసినగవుతో) మీరాయన — మీరతని నెక్కడజూచితిరి? (నేను) వారిదర్శనము ప్రత్యేకముగ జేయలేదు కాని వారివలన వ్రాయబడిన గ్రంథముల బఠించితిని (నూత) ఏయేగ్రంథములు, (నేను) పలుగ్రంథ

ములు అప్పుడచ్చటనుండిన గృహమేధియగు తిరుమలరావుగారును మరియు నా గ్రామస్థులగు మరికొందరును నచ్చట వాదుక ప్రకారము కూడియుండగా నాక్రొత్తపురుషుడు తన పాండిత్యమును గొప్పతనమును వెల్లడింప నుద్దేశించి పూర్వకవికృతములగు నవికొన్నియు శతావధాన శ్రేష్ఠులగు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులచే రచింపబడిన గ్రంథములలోనివి కొన్నియు పద్యములను స్ఫుటముగా జదివి తాము గద్వాల మైసూరు మొదలగు సంస్థానములలో బిరుదముల నందితిమనియు, నానారాజసందర్శనము మొదలగు గ్రంథముల వ్రాసితిమనియు నాంధ్రపత్రికయొక్క సంవత్సరాది సంచికయందు తమ పటములు వెలువడినవనియు బలికి తుదకు నేనే యావేంకటశాస్త్రినని ధైర్యముగ జెప్పిరి. విఖ్యాతచరిత్రులగు శతావధానుల ఛాయాపటముల ననేక గ్రంథములలో నంతకుమున్నే చూచియుండిన నాకు వారు చెప్పుమాటలనుగూర్చి సందేహము కలిగె. నందున వారినిగురించి నాకన్న నెక్కువగా నెరింగియుండిన తిరుమలరావుగారి వంకజూడ వారియొక్కయు తదితర సభికులయొక్కయు దృక్కులు నాయభిప్రాయమునే బలపరచెను. ఇదియంతయు నాక్రొత్తపురుషునకు దెలియకుండునట్లే జరిగెను. అంతట మాగ్రామమందిప్పుడున్న బ్ర॥ శ్రీ॥ భాగవతుల లక్ష్మీప్రపతిశాస్త్రిలుగారును కొన్ని కారణములవలన మాయూరియందు వైద్యులుగవచ్చియున్న బ్ర॥ శ్రీ॥ మండా సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారును (వీరిరువురును శతావధాని శ్రీవేంకటశాస్త్రిలవారి శుశ్రూషాగౌరవము నందినవారు) క్రొత్తశతావధానిగారి కభిముఖులైరి. వారిలో లక్ష్మీప్రపతిశాస్త్రిగారికి క్రొత్తశతావధానిగారికిని చక్కని వివాదము జరిగి పిదప సదుత్తరము లీయజాలని యాపండితంమన్యుడు తనగుట్టు బయలుపడుననికాబోలు మూర్ఖవాదమునకు దిగెను. లక్ష్మీప్రపతిగారు తుదకు వీరు బూటకులుకాని వేంకటశాస్త్రిగారు కారని ముమ్మాటికి నొక్కిచెప్పిరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు దానిని బలపరచిరి. అంత సభ ముగిసెను. క్రొత్త వేంకటశాస్త్రిలుగారు నాటిరాత్రి తిరుమలరావుగారి యింటనే భుజించిరి భోజనము లయినపిదప మరల మేమందరము సమావేశమై చూచువరకు కృత్రిమశతావధానిగారి ముఖము తొంటికాంతిని గోల్పోయి వెలవెలబారెను. చూపులు బెదరుపాటును బొందెను. అక్కడికి తెచ్చికోలు గాంభీర్యము సహాయముగ గొని యేదియో వ్రాయుచు సభికుల ముఖము జూడజాలక గూర్చుండియుండెను. అది సమయము కాదని మేమందరము వెళ్ళితిమి. మరునాడుదయమున వారితో బ్రసంగించు నుద్దేశముతో

ఉ. మోసము తుల్యమైనను "నమోనమ" యందుము వేసగాని, కే
కానునొ తెచ్చుకోఁ దలఁచి గౌరవమ్మున బ్రకటించె వాఁడు నీ
దాసుఁడు; సత్యవాదులు 'యథార్థపువాదులు' చేర్చుమోసముల్
దోసపుఁ దప్పువ్రాఁత లివి ద్రోహపుటూహ వెలార్చు నంబికా.

ఉ. దగ్గఱనున్నవార 'లిది తప్పుడువ్రాఁత' యటంచు మోరపై
బొగ్గులు వోతు రంచెఱిఁగి పూర్తిగ నామము డాఁచె దూరగుల్
నిగ్గది తేలునంతకు ననేక విధమ్ముల శంకితాత్ములై
మగ్గిరి * సంశయాంబునిధి మాయలమారి 'యథార్థవాది' చే. 201

---

మేమువచ్చువరకు వారు పలాయన మాత్రమును బఠించిరని తెలిసెను. పిమ్మట మరునాడు (౨వ జనవరి) మా తాలూకా తహశ్శీలుదారుగారు మ- రా- జీవనరావుగారు మదుపిల్లెయను గ్రామమందుండఁగా నావేషధారి యచ్చటికిబోయి వెనుకటిదినమున నప్పగించిన పాఠమునే వారియెదుటజదివి చిల్లరగా రు 50 లు పొందుటకు వాగ్దత్తమును బడసి దానిలో గొంత పైకమును హస్తగతముజేసికొనిరి. అంతలో మా సపాటి తిరుమలరావుగారు మధురకు వెళ్ళుట సంభవించి యాసమయమున తహస్సీలుదారుగారిని, నరసింహారావు పంతులుగారను, మరియొక న్యాయవాదిగారిని, దర్శించి నప్పుడు కృత్రిమ శతావధానిగారిని గూర్చినప్రసంగము వచ్చినపుడు తిరుమలరావుగారు వారివృత్తాంతము నామూలాగ్రము నెఱింగించిరి. అంత నావిపరీత శతావధానిని రప్పించి వారినిగూర్చి అశ్రోత్రియమైన చర్య యేల జరపబడగూడదని ప్రశ్నింపగా నావేషధారి తాను పొందిన రొక్కమును మరల నిచ్చివేసి పాదాక్రాంతుడై వేడగా దయదలచి వారినంతటితో వదలిరి. పాపమా విద్వాంసమ్మన్యునకు అంతకు మునుపు దొరకిన రొక్కముతప్ప వాగ్దత్తమైన రు 35 లు చెందలేదు. ఈకపట వేషధారి ముందెచ్చటికి బోవునో తెలియదు. కాని యీయనకు జయముకన్న పరాభవమే యెక్కువకలుగునేమో యని తలంపవలసియున్నది.

జములాపురపు వేంకటకిషన్ రావు

* ...తమకు యెక్కడికి వెళ్ళినను దిగ్విజయమే కలుగుననిన్ని మిమ్మును జయించువారుగాని తుదకు తమకు తుల్యులు గాని ప్రస్తుతము యెక్కడను లేరన్న సంగతి నాకు బాగా తెలిసివున్నప్పటికి యిప్పుడు వుండే కల్లోలములనుబట్టి తమవల్లజరిగిన నిజస్థితి తెల్సుకొనువరకు మనస్సుకు నెమ్మదిలేకయున్నది గనుక అవధానము గురించి సవిస్తరముగా వ్రాయకోరెదను.........

K. GANGARAJU.

గీ. ఘనమతులు వల్కుదురు "నూఱుకల్లలాడి
యొకగృహము నిల్పు" మంచుఁ దదుక్తి నెఱిఁగి
కొప్పరము నిల్ప యత్నించెఁ దప్పువ్రాఁత
లఘు మనక వ్రాసివ్రాసి 'యథార్థవాది.' 202

తే. గీ. ఆడె నీతఁ డపార్థమ్ము లాడుఁ గాక
స్వార్థమును గోరి కాదు దేశార్థముంబ!
ఇల్లు నిల్ప నూటికి నాజ్ఞ యిచ్చువారు
కొప్పరము నిల్ప నీరొక్క కోటికాజ్ఞ!

చ. ప్రతిసభలోన వీఁడొకఁడు వంచకుఁ డుండు నెఱింగి యెవ్వరో
నతి యొనరించి * "వ్రాయకుఁడు నాయన! తప్పుడు వ్రాఁత, లార్య స

---

* (నరసారావుపేట శతావధాన పీఠికనుండి.)

......ఇట్లు నిర్విఘ్నముగ నవధానము పూర్తియైనపిదప నగ్రాసనాధిపతి మొదలగు పలుమంది పండితులు పలువిధముల వారి పాండిత్యాతిశయముం గొని యాడిరి. నాఁటిదినము డిప్యూటీకలెక్టరులగు మహారాజశ్రీ విష్ణుభట్ల రామకృష్ణయ్యగారు, తహశీలుదారులగు మహారాజశ్రీ రావులపాటి చెలపతిరావుగారు మొదలగు పలుమంది యుద్యోగస్థులును, ప్లీడర్లును, ననేక మహాజనులును సభ నలంకరించియుండిరి. అప్పట్ల బ్ర॥ రావిప్రోలు సుబ్బారావుగారు లేచి "వీరిపై ననూయచేఁ గొందఱు సత్యవాదులను పేరుతో నసత్యప్రకటనలు చేయుచుండిరి. కావున నేఁడు జరిగిన యంశములకు భిన్నమైనవ్రాఁత బయలు దేరునప్పు డీ సభ్యులెల్లరును సాక్షులుగా నుండ వలసివచ్చునని చెప్పిరి.........

చావలి వెంకట కృష్ణయ్య.

షరా:— ఇంత కట్టుదిట్టముగాఁ బెద్దమనుష్యులను సాక్షులుగఁ జేసి రిజష్టరు చేసినట్లు కొందఱు యోగ్యులు శ్రమచేసినను పాడువ్రాఁత వ్రాయునాయు విరమింపనేలేదని యెఱుఁగునది. అందు మమ్మును అగ్రాసనాధిపతి కాశీ కృష్ణాచార్యులుగారిని కొంతవఱకు దూటి తుట్టతుద వ్రాసిన పంక్తులుమాత్ర మీక్రింద నుదాహరింపఁ బడుచున్నవి. ఆపంక్తులవలననే ఆవ్రాయసకాని కడుపుమంట విస్పష్టమగును.

(1-11-1911 తేదీ ఆంధ్రపత్రికనుండి)

......గ్రామస్థులు కవీశ్వరులు వచ్చినప్పుడు వాద్యములతో నూరేగించుచు

మ్మతిగ వధానమయ్యె నిటమాన్యులు మెచ్చిరి, శంక గల్గుచోఁ
బ్రతిఘటియించి యిష్టదుఁగ వచ్చు" నన నెబ్బ్రతి చెప్పఁ డొక్కఁడున్.

ఉ. దొంగ యెవండొ యుండెనని తోఁచి దయాళుఁ డెవండుగాని "యో
దొంగ! మహానుభావ! యిదె తోఁచిన వస్తువు పుచ్చుకొమ్ము రా
త్రిం గలగుండు నెట్టకుము దీపము లాఁకపి" యంచు వేఁడ నా
దొంగ యటుల్ పొనర్చి తనద్రోహము మానుట యెందుఁ గంటిమే.

ఉ. అట్టులె యార్యులైనజను లాతని వేఁడుటెకాని దబ్బఱల్
గట్టిగ వ్రాయు నాజనుఁడు గన్పడి మాటవచింపఁడెల్లరున్
"జెట్టలిఖించు వీఁడె" యని చెప్పుచు వ్రేలను దన్నుఁ జూపున
ప్పట్టునఁ దన్నుఁ గానిగతి భావగభీరత నుండు నొక్కఁడున్. 208

ఉ. ఎంతని వ్రాతు మీమహితు నెమ్మెలఁ గూఱిచి "సత్యవాది" య
న్నంతన 'నన్ను నట్లనకు'మంచును గుఱ్ఱలు సైత మెంతయున్,
గాంతురు కోప, మట్టులె మొగమ్మ ముడుంతురి "యథార్థవాది"య
న్నంత, నిటుల్ వృథా చెడుఁగదా! యొక కొన్ని సుశబ్దముల్ భువిన్.

సీ. అద్వైతశబ్ద మయ్యాది తిట్టుగా మాఱె బాహ్యశబ్దం బది పాడువాఱె
సంభావనాశబ్ద సౌష్ఠవం బడఁగంటె గంధర్వశబ్దంబు ఘనత దఱిగె
దామోదరాఖ్యకు దారిద్ర్యము ఘటించె ఛాందసశబ్దప్రశస్తి చెడియె
కరణిక మ్మను పేరు కడకు దుర్ధ్వని నిచ్చెఁ గైంకర్యపదము పాపాంకమయ్యె

---

మర్యాదతోఁ దీసికొనిపోయిరిగాని తిరిగి వారు వెళ్ళినప్పుడట్టి మర్యాదలేమియుఁ జేయనందులకుఁ జింతిల్లుచున్నాను. బహుశః కవీశ్వరులు తొందరమీఁద బైలు దేరుటచే నటుల జరిగియుండునని యూహించడమైనది. (సత్యవాది)

ప.రా:— పైపంక్తులుగల వ్యాసమును మాత్రము వేసి పత్రికా సంపాదకుఁడు మేలుకొని యింతకు మున్ను 48 వ పేజీలోనుదాహరించిన పంక్తులువ్రాసి నిరసించుటను సూచించెనని యెఱుంగునది, మఱియుఁ బ్రతి స్థలమునందును, ఎవనినో "శశ్శోచ్ఛేటి, గానిని బంపి కలహమేర్పఱిచి" ఆకలహమును శుద్ధచేసిదానిని "తిరుపతివేంకటేశ్వరులు కెట్టీ"రని పత్రికలకు వ్రాయఁ జొచ్చి"రని యెఱుఁగునది.

గీ. మంచిశబ్దమ్ము లెన్నియో మంటఁ గలిసి
తనకు లేని దురర్థమ్ముఁ దాల్చె నెల్ల
వాని ధరియించు నొకకొన్ని వస్తువుల స
హత్త్వమే కాని వేఱుగా దరయ నంబ.

ఉ. వీ రటులుండఁగాఁ దమవివేచన కొందఱు మూల డాఁచి శా
ఖారుచిరాంగికై వలచి కాసరకూసర లొక్కపెట్ట ని
చ్చారతి వ్రాయఁ జొచ్చిరి ప్రసక్తికిఁ గాని ప్రసక్తిగా జమీం
దారుల యట్టివారలును దత్త్వము డాఁచిన నేమనందగున్.

ఉ. వీర వివేకవంతులుఁ బ్రవీణులు నేర్పరు లంతె కాక మా
ధీరత గుర్తెఱుంగుమరు తేఁకువకు న్నిలయంబులయ్యు శా
ఖారుచిరాంగిపాలఁ బడి క్రన్ననఁ బ్రక్కకు వంగి తప్పు మా
పై రహిఁ బెట్టి తప్పుగలవారిని వీడుచు వ్రాసి రంబికా.

ఉ. ఊరును పేరు లేని యెవరో యెదియో లిఖియింప నంతగా
భారము దోఁచదయ్యెఁ గవిబాంధవుఁడైన భుజంగరావు వి
ద్యారసికుం డుదారగుణధాముఁడు శాఖకు లోఁగి వ్రాయు నా
ధోరణిఁ జూచి చిత్తము కుతూహలియయ్యె బదు ల్లిఖింపఁగన్. 211

సీ. * కొప్రంపు వారలఁ గొమరులకన్న నత్యధికమ్ముగా మన్నినట్టి మేటి
తప్పొనర్చిన వారి దండించు నధికారమునఁ బరమావధిఁ గనిన ఘనుఁడు
'అనల మందొకటి చందనమందొకటి' యన్న నుడికి దృష్టాంతమైనడచు సుజనుఁ
డవసరంబైనచో నాంగ్లేయులకుఁ గూడఁ దగవు దిద్దఁగఁ జాలు ధర్మమూర్తి

తే. గీ. భక్తబాణపరిత్రాణపరుని హరుని
ననుకరించుచు వ్రాసిన యట్టిజాబు

* "...కొప్పరకవులకును మీకును వాక్కలహము కలిగినట్లు తెలిసి వ్యసనపడినాను, ఉభయపక్షముల స్నేహసంబంధమున్న వాడనగుటచే నట్లయ్యె, మీ రవధాన మొనరించునప్పుడు వారి కున్న తాసనమియ్యవలెనని కొందరు పట్టు పట్టుటచే నీవివాద కలిగినది, ఆపట్టుపట్టినవారే కలహకారకులని చెప్పవలసి యున్నది. ... మీకు వారు వ్రాసిన మొదటి పద్యములలో మీ మీసపుపద్యము నుదాహరించుట యనుచితము, వీటెనన్నిటినిబట్టి క్రమముగాఁ గలహము పెరిగి

కన్నవన్యల వార్తలు మిన్నలగునె
నీకు నీభక్తులకుఁ ద్రిలోకైకజనని.

క. వీరెల్లరు వైదికులని, వైరులు వచియింపవచ్చు వాదునకై, క
స్తూరీపరిమళమాపై, వారించుత వైరిలశునవాసన లెల్లన్.

తే. గీ. ప్రకృతము భుజంగ రాయభూపాలవరుఁడు
లేనిపోని ప్రసక్తి మాపైని బొలిపి
నట్టివ్రాఁతకు మేమిడినట్టి యుత్త
రంబు వినుమంబ! ప్రత్యుత్తరంబు గాఁగ.

{ 1911 వ సం॥ నవంబరు 1 వ తేది ఆంధ్రపత్రికనుండి.
శ్రీరాజా భుజంగరావుగారి పద్యములపై విమర్శనము. }

ఈదిగువ వ్రాయబోవు పత్రికకు బీజభూతములయిన శ్రీరాజా మంత్రి ప్రగడ భుజంగరావు బహద్దరు జమీందారువారి పద్యములు, వానిపైవిమర్శనము.

సీ. "తిరుపతి వేంకటేశ్వరులు గద్వాలాది దేశములఁ బోరు దెచ్చికొనిరి
అదియుఁ జిరంతనంబయ్యెఁ ద్రవ్వఁగనేల యొకవంక రామకృష్ణకవియుగము
నొకవంకఁ గొప్పవరకవియుగమ్మమ్మను నెదిరించి బవరమ్ము వదలరైరి
వృథఁజేయుచుండిరీవిధి నవర్గళమైన కవిత నక్కటా! యేమిగల్గెదాన...

ఇందుఁ "దెచ్చికొనిరి" లోనగువాక్సరణి శ్రీవారిహృదయమును బూర్తిగా వెల్లడించుచున్నది.

చ. "తిరుపతి. వేంకటేశ్వరులు...................'వీరుమా
సరసను గూరుచుండుటకుఁ జాలరు, మాసరిగాఁ గవిత్వముఁ
విరచనఁ జేయుజాలినను వీరలనొప్పద' మంచుఁ గొందఱుఁ
'గురువులటంచు మమ్మనరు కూడదటంచు' వచింతురిగొందఱుఁ ."

ఇందలి తుదియంశము నాక్షేపించుటచే గురుశిష్యసంప్రదాయము నెఱుఁగమి సూచించుటయేకాక గురువననేమో, అతనికష్టమెట్టిదో, యతనిఋణమును శిష్యుడెట్లుతీర్చుకొనవలయునో, యిందులకు వేదములేమి, శాస్త్రములేమి, భార.

---

వది, సుప్రసిద్ధులగు మీకిప్పుడు జయము కలుగుట యొక విశేషముకాదు సాధ్యమైనంతవరకు వివాద పెరుగ కుండజేయఁగోరెదను, ... మీకీభేదము వితరులు కలుగఁజేసినారు...." జి. రామయ్య

తాములేమి యేతీరుగ మొఱ్ఱలిడుచున్నవో శ్రీవారు బొత్తిగాఁ బరిశీలింపక యేదోతీరున నేరము మోప నెంచిరని స్ఫుటమగుచున్నది. రెండవయంశము నెత్తికొనుట యుక్తముగాఁ దోఁచినను, అందులకుఁగల బీజమును బూర్తిగా నెఱిఁగి యుండియు దానినెత్తికొన్నచో నపరాధులు నియోగి మహాజనులే యగుదురని సంశయించుటచేఁ గాఁబోలు మెల్లఁగా జాఱవిడుచుటచే వీరెట్లో నియోగికవులను బైకిఁదెచ్చి వైదికకవుల నడుగంటఁ జేయవలయునను నుద్దేశముకలవారని విస్పష్టపడుచున్నది.

8. "గీ. ఒక్కకాలమునందు నహోబలుండు
వైదికుండని బ్రమసి సంపన్నుఁ డొకఁడు
పొగడె; నంత నియోగిగా నెగడెనంచు
నొక్కఁడు నిదర్శనముఁ జూపెఁజక్కఁగాను."

ఈపద్యమును జదివినవారికెల్ల నిది శ్రీవారు వ్రాయనున్న పత్రికకు బొత్తిగా సంబంధింపనిదనియు, శ్రీవారికిఁగల స్వశాఖాభిమానమును మాత్రము వెల్లడించుననియుఁ దోఁపకమానదు. కాన నుపేక్షింపఁబడియె.

సీ. 'కొప్పరపువారు గూర్తురు గంటలో ముద్దుగా నేనూఱుపద్యములను
తిరుపతివేంకటేశ్వరులతో నిరుబాస సాహిత్యమునఁదూఁగఁజాలకుంద్రు...'

ఇందులో శ్రీవారిరువురను సములనుగాఁ జూడవలెనన్నట్లు కొంత ప్రయత్నించిరికాని తుదకు వారిమనోరథము నెఱవేఱక శాఖాభిమానమే వెల్లడి యగుచున్నది. ఏమందురా? తిరుపతి వేంకటేశ్వరులకు సంస్కృతాంధ్ర సాహిత్యము మాత్రమే యున్నదనియుఁ గొప్పరపువారికి ముద్దైన యాశు కవిత యున్నదనియుఁ దెల్పిరి. ఈ 'ముద్దు' ప్రాసకోసము వాడినదని చెప్పక తప్పదు. అందులకు శ్రీవారింక మఱియొకచో వ్రాసిన "ముక్కుతిమ్మన తోడి ముద్దుపల్కులు" అను సీసపాద మొప్పించి తీరును. అది యటులుంతము. తిరుపతివేంకటేశ్వరులు కొప్పరపువారితో నాశుకవనముఁ జెప్పుదురో చెప్పరో, వారి యాశుకవిత యెట్టిదో, వీరియాశుకవన మెట్టిదో, యది సభాముఖమునఁ దేలవలసియున్నది అందుల కెవరి యసామర్థ్యమువలననో గుంటూరియందీసభ యాఁగిపోవుటచే నది విస్పష్టముగాఁ దేలలేదు. తేలని యంశమును శ్రీవారిందు నిర్ధారణముచేసి వ్రాయుట యెంతవఱకు సమంజసమో చదువరులే నిర్ధారణము చేసుకొందురుగాక-ఇదిగాక, కొప్పరపువారు సంస్కృతాంధ్ర సాహిత్యములోఁ దిరుపతి వేంకటేశ్వరులకుఁ దీసిపోవుదురను నంశము

కూడఁ దత్సాకము నే సూచించుచున్నది. రఘువంశమేని సంస్కృతములోఁ బారము చెప్పలేనివారనియుఁ దెల్గులో విజయవిలాసాదులలో సిద్ధాని నేనిఁ బాఠము చెప్పనేరనివారనియు శ్రీవారు పూర్తిగా నెఱిఁగియు నించుమించు భేదమున్నట్లు సూచించుటచేఁ గొప్పవరపువారు సంస్కృతాంధ్రములలో మంచిసాహిత్యము కలవారేగాని తిరుపతి వేంకటేశ్వరులకు నించుక తీసిపోదురనియుఁ గవిత్వములోఁ బూర్ణముగా హెచ్చుదురనియుఁ దేల్చినట్లు ధ్వనివేత్తలు నిర్ణయింపక మానరు. ఇందులకుత్తరము ముందు వ్రాసికొను పత్రికలో వ్రాసికొనఁదలఁచి యిచ్చట శ్రీవారి సహృదయత్వమును మాత్రము వర్ణించుటతోఁ దృప్తిఁజెందుచున్నారము.

ఆ. వె. "వీరికున్న విద్య వారికిలేకున్కి, హెచ్చుతగ్గులెన్న నెవరివశము
కాన వీరి వాదకలన నిరర్థము, హాసభాజనంబు నగుమనుండు."

ఈపద్యములోని యుత్తరార్థము చక్కని యర్థము కలయదియే కాని కొప్పవరపువారి నెవ్వరును నవ్వరు. ఈవివాదమువలన వారికి లాభము లేకపోలేదు. తిరుపతి వేంకటేశ్వరులనే ప్రాజ్ఞులందఱును నవ్వుదురు లేశమును వీరికీవివాదమువలన లాభములేదు; అను సంశయమిప్పుడేని శ్రీవారి మదికి వచ్చినచో నిట్లు వ్రాయ సాహసింపరని తలంచెదము. వలసినచో నీయంశమును సమర్థింపఁదగు నుత్తరములు కడుఁ బ్రాజ్ఞులచే వ్రాయఁబడినవి శ్రీవారి సన్నిధి కంపుకొనుచున్నారము. మఱియుఁ బూర్వార్థములో "ఒకరికున్నవిద్య మఱియొకరికి లే" దను సంశయముకూడ సత్యదూరమై యున్నది. వివేకానందసన్న్యాసికిఁగల ప్రజ్ఞ తిరుపతి వేంకటేశ్వరులకును, దిరుపతి వేంకటేశ్వరులకుఁగలప్రజ్ఞ "వివేకానందస్వామికిని" లేదని యన్వయించుకొమ్మనినచోఁ జెప్పనేరము కాని కొప్పవరపువారికున్న విద్య తిరుపతి వేంకటేశ్వరులకు లేదనుట కేవలము హాస్యాస్పదము. తిరుపతి వేంకటేశ్వరులకున్న విద్యలు కొప్పవరపువారికి లేవన్నచో నేబాలుఁడైనను సమర్థింపఁగలఁడు కాని దీనిని దేవుఁడేని సమర్థింపనేరఁడని మనవిచేసుకొనుచున్నారము. వలసినచో ముందు విపులముగా వ్రాసికొనఁదలఁచి యిప్పటికీ పండితరాయల శ్లోకమును జక్కఁగా నర్థముచేసికొండని శ్రీవారినిఁ బ్రార్థించుచున్నారము. (ఇందే 32 వ పుట చూ)

ఆ. వె. "కొప్పవరపువారి గుంటూరువారలు, బిరుదులిచ్చి చాలఁ బెద్దఁజేసి
రప్పుడెల్ల నీశతావధానులు గని, రంచువారు మదులనెంచలేదొ!"

ఈ పద్యమున కర్థమే తెలియపట్టదు. ఎక్కడనో జమీందారుఁడున్న వాఁడని చీదరానికిఁ బెండిలియే కాకపోవునా! 'ఢిల్లీకిఢిల్లే పల్లికిపల్లె' "ఒకని పెండిలిలో

మఱొక్కఁడా పల్లకీ నిఱుక నుంకించు టెంతేనిఁ దప్పు" అను సీసపద్యమును జదివికొనఁ బ్రార్థితులు. అది కృష్ణలో వచ్చుగుమన్నది అంకాలమ్మకు జాతర సేయువారు శివకేశవులు లేరనికాని, శివకేశవుల కుత్సవ మొనర్చువా రంకాలమ్మ లేదనికాని యూహింతురనుకొనుట యనుభవవిరుద్ధ మని మనవి చేసుకొనుచున్నారము.

చ. "వరపరవస్తురంగకృతివర్యుఁడు పండిత వేంకటార్యుఁడున్
దిరుపతి వేంకటేశులును ధీరతఁబూని శతావధానముల్
జరిపెడువాఁడు డీకొనఁదలంపరు, వారలపైకి శిష్యులన్
బురికొలుపం దలంప రిటు బుద్ధులు లేవొకొ వైష్ణవాళికిన్."

ఇందుఁ దిరుపతి వేంకటేశ్వరులు శిష్యులను గొప్పరపువారి మీఁదికిఁ బురి కొల్పిరనుట సత్యమునకు దూరము. వేలూరి శివరామశాస్త్రికి మేముత్తరమేమి వ్రాయలేదనియు, నతఁడెవ్వరో యెవ్వరికో వ్రాసినయుత్తరమును నవ్వారు వినిపింపఁగా విని దాని సత్యాసత్యములు దెలిసికొనఁదలఁచి హఠాత్తుగావచ్చి మేముత్తరములు విన్పించుచుండగా సభలో మమ్ముఁ గలిసికొనెననియు మాగురు పాదసాక్షిగ మనవిచేసుకొనుచున్నాము. 'యథార్థవాదులును', 'సత్యవాదులును' వ్రాసినట్లే దేవరకూడ వ్రాయఁబూనుట మిగుల సాహసము. శివరామశాస్త్రి కొప్పరపువారికన్న ననేకవిధముల మిన్నయని తమరే యెఱుంగుదురు. అయినను వివరించెదము. శివరామశాస్త్రికిఁ బాణినీయశాస్త్రమునందుఁ గౌముది పూర్తిగానైనది. పరిభాషేందుశేఖరము చదువుచున్నాఁడు. కావ్య నాటకాలంకారములయందుఁ జక్కని సాహితికలదు చదివినంతలో శిష్యులకుఁ జారము చెప్పు శక్తి గలదు. తగుమాత్రము సంగీతములోఁ బ్రవేశమున్నది. ఇంగ్లీషులోఁగూడఁ బరిచితి యనఁగా 'ఫోర్తుఫారము'వరకుఁ జదివియున్నాఁడు. మఱి కొప్పరపువారో! పైఁజెప్పిన యంశములలో లేశమును బ్రవేశములేని వారు. వలసినచో సభాముఖమునఁ దమరే నిర్ణయింపఁగలరు. శివరామశాస్త్రి సంస్కృతమున ధారాళముగాఁ గవిత్వమల్లును కొప్పరపువారికి దానిప్రసక్తియే తెలియదు. ఇఁక నిరువురకును గల ప్రజ్ఞలు:— 1. తెలుఁగులోఁ గవిత్వము చెప్పుట, 2. శతావధాన మొనర్చుట, 3. అష్టావధాన మొనరించుట, 4. ఆశు రచన. పైవిషయములలోఁ గూడ నుభయభాషలలో సంపూర్ణశతావధానము నొనర్చినవాఁడు శివరామశాస్త్రి. అసంపూర్ణ శతావధానమును ఒకభాషలో మాత్రము చేసినవారు కొప్పరపువారు ఇంకను నింద వెలిఁబుచ్చఁదగని వనేక

శహాస్యములు కలవు అవి యటులుండుఁగాక. వ్యస్తాక్షర్యాదులు గల యష్టావధానమును జేసినవాఁడు మొదటియాతఁడు. మసిపూసి నేరేడుకాయను జేసినవారు రెండవవారు. ఇఁక మనకు మిగిలినదొక యాశుధార. అందులో వారి యిచ్చవచ్చినట్లు చెప్పనిత్తురని అతనినే కాక యెవ్వరినేనిఁ గొప్పరపువా రతిక్రమింతురని తమకుంబోలె మాకును నమ్మకము కలదు; కాని ఆయాశుధారాకవిత్వమునఁగూర్చి మాకిన్ని సంశయములు కలవు. అష్టాదశ వర్ణనలను జేసి యుంచుకొని, వానిని సమయోచితములుగాఁ గల్పికొని తాత్కాలికముగా నేవో కొన్ని పద్యములుమాత్రము చెప్పఁగూడదా? అట్లు చేయకుండ భగవంతుఁడేని వారింపఁగలఁడా? ఇది యటులుండుఁ గాక. భిన్నభిన్నవస్తువర్ణనములలో వీరికిట్టియాశుధార ప్రసరించునా? అందు వీ రాశుకవులని పేరుగల యొవరినేని నతిక్రమింపఁగలరా? అతిశయింపనిచో శ్రీవారు పైనిజెప్పిన కాపట్యమును నమ్మరా? ఇఁక నొకటి, అవ్యాజరచనయే యనుకొందము. అందు లక్షణముతప్పకుండునా? సందర్భముండునా? ఇదియును నుండుఁగాక. వీరు నిజముగానే సలక్షణముగానే గంట కయిదునూఱులు పద్యములను రచియింతురుగాక! అప్పుడేని శివరామశాస్త్రి నతిక్రమించినవారగుదురా? శివరామశాస్త్రికిఁగల ప్రజ్ఞలలో నేకదేశమందు మాత్రమే యతిశయించు వీరు శివరామశాస్త్రికి గురువులమగు మామీఁదఁ గాలుద్రవ్వి మీసములు గొఱిగించెదమని వ్రాసినవ్రాఁతకు దేవరహృదయము సంతసించి, యద్దానికై పరితాపమందు శివరామశాస్త్రి తనకంటె ననేక విషయములలోఁ గేవలము తెలియనివారును నేదో విషయమున నేకదేశమున నతిశయించువారునునగు కవిసోదరులను విద్యావివాదమునకుఁ బిల్చుటకు మిగులఁ జింతిల్లుచున్నందులకు మావిచారము పట్టఁజాలకున్నారము. ఇంకను నీయాశుకవనమునుగూర్చి విశేషించి వ్రాయవలసియున్నను, అది యన్యత్ర విస్తరించియుండుటచే నిందుపేక్షించి, శివరామశాస్త్రి కొప్పరపువారిపై కేగుటగూడఁ గొప్పరపువారికే గౌరవప్రదమనియు శివరామశాస్త్రికి లేశమును గౌరవావహము కాదనియు, నతఁడు మా ప్రేరణచే రాకయున్నను దమవంటి సత్యసంధులు నిర్ణయించు విధానమునుబట్టి అదికూడ మానెత్తికే వచ్చుటచే నందులకు మేము విధిలేక సమ్మతించుచున్నారమనియు, మనవిచేసికొనుచున్నారము. ఎవరుగాని ఎవరితోనేనిఁగాని యుద్ధమునకో విద్యావివాదమునకో కడంగునప్పుడన్నివిషయములున్ను నుభయులకును సమములుగా నుండవలయును. కాని ఏదో యేకదేశముమాత్రమే యున్నవారొక్కరును, పెక్కురనేక విషయము లెఱింగినవారును నైనచో నాయెదిరింపుగాని, జయింపుగాని, హాస్యా

ప్పదమనియు విన్నవించుకొను చున్నారము. చతురంగబలములుగల లేనితో నొకపదాతివర్గము మాత్రమేయున్న మూఁడాదారు తనంతదానై యెదిరింప నెంచుచు మీరు మీకున్న గజాశ్వాది సైన్యమును దీసికొనిరావలదనియుఁ బదాతివర్గమును మాత్రమే తీసికొని రం"డనియుఁ గబురంపినచో దమవంటివారయ్యాది విశ్వసింప రని మానమ్మకము; తరువాతఁ దముచిత్తము.

ఇఁక వైష్ణవులు తిరుపతి వేంకటేశ్వరులపై డీకొనఁ దలంపరనుమాట కుత్తరము చిత్తగింతురుగాక. గద్వాలాదులలో విద్యావివాదము తటస్థించినదని శ్రీవారెత్తికొనియును మరల నీవిషయ మన్యథాగా వ్రాయుటచే గద్వాలలో జరిగిన యంశమును బరిశీలింపకయే వ్రాసిరనుకొనవలసివచ్చినది. గద్వాలలో నేమి, ఆత్మకూరిలో నేమి, మమ్మెదిరించినవారు శ్రీవైష్ణవులే, వారిప్పుడు సజీవులైయున్నవారు. ఆవివాదమునకు వైష్ణవత్వస్మార్తత్వములే ముఖ్యహేతువులు. వలసినచో నా సంస్థానాధిపతుల పేరఁ దాము వ్రాయించినచో వారు యథార్థమును దెలుపకపోరు. ఒక భేదముమాత్రము లేకపోలేదు మేము నియోగులము కాక అంతోయింతో ఆంధ్రకవనముగూడఁ జెప్పుచుండుటచేతను, ఈ గుంటూరిమండలములో విశేషించి నియోగి మహాజనులుండుటచేతను, గొప్పరపువారికినీ మలో నియోగిశిఖామణులగుటచేతను, వారితో సహాపనమును విద్యావిషయమున మేము సభ్యులతోపాటుగను, అగ్రాసనాధిపతితో పాటుగను నంగీకరింపని హేతువుచేతను వారికిని మాకును వాదిప్రతివాదిభావము గల్గుటయుఁ దమవంటి ప్రాజ్ఞు లుభయులను సరిచేయ నెంచుటయు, హెచ్చించుటయుఁ, గుంచించుటయుఁ దటస్థించినవి. కాని యే హేతువుచేతనో తారతమ్యవివేచనకై సభమాత్ర మీవిమనుగాలేదు. అక్కడ నట్లుగాక మామాభేదములను సభాముఖమున నా సంస్థానప్రభువులు తేల్చి సమ్మానింపఁదగురీతిని సమ్మానించిపంపిరి. అందులకుఁ గారణము మమ్మెదిర్చినవారు పండితులగుటచేతనని దేవరచిత్తమునకు రానివిషయము కాదు. కావ నిఁక విస్తరింపఁదలఁపక యింతటితో విరమించుచు నీక్రిందివిన్నపమును జిత్తగింపఁ బ్రార్థించుచున్నారము.

మ. రా. రా. శ్రీ, శ్రీరాజా మంత్రిప్రగ్గడ భుజంగరావు బహద్దరు జమీందారువారి దివ్యసముఖమునకు, తిరుపతి వేంకటేశ్వరులు వినయపూర్వకముగా వ్రాసికొను విజ్ఞాపనము.

ఆర్యవరా!

తమంతటఁదామే యేకో పరిసక్తిఁగల్గించుకొని "వివాహమహోత్సవాశీర్వచన పద్యరత్నావళి యందలి పీఠిక" యని యచ్చొత్తించి ప్రకటించిన పత్రికలో మాకును గొప్పరపు సోదరులకుఁగల తారతమ్యమును నిర్ణయింపఁబూ

నుటచే మేము మిగుల ధన్యులము. మాకును సోదరకవులకును విద్యావివాద మే సభలోఁ గల్గినదో యెందులకుఁ గల్గినదో యావివాదమునకుఁ గారకు లెవ్వరో యాయా యంశములను దామాసభలోనే దయచేసియుంటచేఁ బూర్తిగా నెఱుంగుదురు. 'యథార్థవాది' 'సత్యవాది' నామముల నవసరమును బట్టి ధరించిన సోదరులుఁగూడ నాసభలో నివారేరైనను వారు వ్రాసిన వ్రాఁతలయందలి విషయముల కేవిధమయిన ప్రత్యుత్తరము నొసంగఁజాలక "నిజ మెట్లు బయటికి వచ్చునురా! భగవంతుఁడా!" యని నిత్యమును బరితపించుచు, మాకుఁగల యావత్కార్యములను వదలుకొని, జీవనోపాధియగు నుపాధ్యాయపదవి, యాస్థాన విద్వత్తయనువానిని లక్షింపక సుమారు రెండుమాసములనుండి యీగుంటూరునఁ బడియున్న మాకు దేవరవారి పత్రిక యెంతో సాయ మొనర్చుచున్నది! * ఇట్టి తారతమ్యమునకు నిజముగా దమవంటి విద్వత్ప్రభువులే తగినవారు. మా వ్రాయు నంశము స్తుతి మాత్రము కాదనుటకు నీక్రిందిపద్యము నుదాహరించుకొనుచున్నారము.

సీ. అష్టావధానము నాచరించితి నేను సంస్కృతమ్మును గొంతఁ జదివియుంటి
  నాటకమ్ములు వచనములు ప్రబంధముల్ నవలలు మున్నుగా వివిధకావ్య

---

* ఆర్యులారా! గుంటూరుపురమునం దిదివఱకు రమారమి రెండుమాసములనుండి కింకవీంద్ర ఘటాపంచానవాది బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులకును, మ॥ రా॥ శ్రీ కుండిన కవి హంసేత్యాది బిరుదాంకితులగు కొప్పరపు సోదరకవులకును, జరుగుచున్న కలహము సర్వజనవిదితము. కాని, గుంటూరుపురవాసులు విద్వత్కవిసభ నొకటేర్పరచి దానియందున శ్రీ తిరుపతి వేంకటేశ్వరులను, శ్రీకొప్పరపువారిని రావించి విద్వజ్జన సమ్మతముగ వారవారి సామర్థ్యమును బరిశీలించి గౌరవించకపోవుటచే నాకవుల కలహము నానాఁటికి నభివృద్ధిగాంచుచున్నది. దీనితోపాటు హిత, సత్య, యథార్థ, వాదులసంఖ్యయు హెచ్చుచున్నది. మఱియు నిప్పుడిప్పు డసంబద్ధ ప్రసంగములుగూడఁ బెరుఁగుచున్నవి. ఈపైవిషయము లాంధ్రపత్రికా చదువరుల కెల్లరకు విశదమైయుండవచ్చును. ఈకవుల కలహమును మాన్పువారొకరును గన్పడరైరి. గాని, బొంబాయియందుఁ బ్రచురింపఁబడు నాంధ్రపత్రికా మూలమున బ్ర॥ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరులు శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దర్ జమిందారుగారిని "కవిపండితసభ నొకదానిని గావించి, యాసభకు మమ్మును, కొప్పరపు సోదరకవులను రావించి, మామా విద్యాసామర్థ్యముల విద్వత్కవి సమ్మతముగఁ బరీక్షించుటకుఁ దగినవా"రని 1-11-1911

విరచనఁ జేసితి నిరుపమానం బగు కవితారసాస్వాదకలనఁ గంటి
గ్రంథమ్ములను జెక్కఁ గాంచితిఁ బండితకవులతోఁ బలుమఱుఁ గలియుచుంటి"

పైపద్యమువలనఁ దాము మాయుభయుల తారతమ్యమును సభాముఖమున నిర్ణయింపఁ బూర్ణముగా నధికారము గలవారని మానమ్మకము. మేము వైదికుల మయినను దాము నియోగులైనను బక్షపాతముండదు. సూచనలు తమపత్రికలోని యంశములు చెప్పుచున్నను మేము తమసన్నిధి నీయంశమును సభాముఖమునఁ దేల్చుకొనఁ బ్రయత్నించుచున్నారము. కాని యీగీతము కొంత సందియము వాపాదించుచున్నది.

గీ. "కాని యీగతి వాదముల్ గానరైతి
విబుధవరులార! నాదొక్క విన్నపంబు
ఇచ్చ దీరంగఁ బోరుల గ్రచ్చుకొనుఁడు
దాని ఫల మెద్దియో దయఁబూని చెప్పుఁడు"

ఈరీతివివాదములు తాము కాంచలేదనుట యొప్పిదమేగాని 'పగులఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క' ఇత్యాదులు పూర్వపండితులకును నిట్టివాదములు కలవని ఘోషించుచున్నవి. ఒకవేళఁ దాము 'ఈరీతి వాదము'లనఁగా, ఇట్టి యసమానకక్ష్యలని వ్యాఖ్యానము చేసినచో

---

తాకీఖున కోరిరి. ఇది సమంజసమని ముమ్మాటికిఁ జెప్పితీరవలయును. శ్రీరాజాగారును విద్వత్కవికుంజరులగు తిరుపతి వేంకటేశ్వరుల విజ్ఞాపన నాలకించి యొక పండితసభ గావించి శ్రీకవిద్వయయుగళమును రావించి, వారిచే వీరిచే శతావధానాదుల జరపించి, విద్వత్తల్లజాభిప్రాయానుసారముగ నెవరు జయ మొందుదురో ఆజయము నాంధ్రపత్రికలద్వారా తెలియఁబఱచినయెడల నీకవుల కలహవిషయమై యనృతప్రతులై కవులకంటె రెండుపాళ్ళెక్కువగాఁ బ్రయాసపడుచున్న యీహిత, సత్య, యథార్థ వాదుల కొకింత విశ్రాంతినిచ్చినవారగుదురు. శ్రీతిరుపతి వేంకటేశ్వరుల మనవి నాలకించి యటులఁ జేయుటవలన వారికి నుతిపాత్రులగుదురు; మఱియు లోకమున కంతకును నిజము దెల్పినవారగుదురు. కావున శ్రీరాజాగారు త్వరితముగా నొక విద్వత్కవిసభ గావించి వారివారి సామర్థ్యములను లోకమునకుఁ దెలియఁబఱచి సంస్తవనీయులు కాఁగలరని కోరుచున్నాను. (చివుకుల అప్పయ్యశాస్త్రి, సికందరాబాదు.)

(1911 సం॥ 11 నవంబరు ఆంధ్రప్రకాశికనుండి.)

మేమొసఁగు నుత్తరములేదని విన్నవించుకొనుచున్నారము. ఈవిద్యావివాదమునకు ఫలమేమని సెలవిచ్చియున్నారు. పూర్ణమైన ఫలముకలదు. ఎట్లందురా, కవిత్వమన నెట్టిది? ఆశుకవనమన నెట్టిది? ప్రబంధకవనమన నెట్టిది? కవికిఁ గావలసిన సామగ్రియెట్టిది? సామగ్రి లేక కవిత్వము చెప్పఁబూనుట యెట్టిది? అతనిని గవి యనవలయునా? వేఱుపేరఁ బిలువవలయునా? అందులకుఁ బూర్వలాక్షణికు లెట్టిపరిష్కారములను జేసియున్నారు? ఎవరెవరి నెదిరించుట యుక్తము? ఎవరివాగ్ధాటి శుద్ధము? ఎవరిది కాదు? ఎవరిని బండితులొప్పుదురు? ఎవరి నొప్పరు? న్యాయమేది? అన్యాయమేది? అను సంశయములు వీనివలనఁ దేలును. దానిపై నింక నెవ్వరును నిట్టి కాలుద్రవ్వుటలును, ఇట్టి యనవసరపు టూసనచర్చలును సలుపకుందురు. ఇట్టి ఫలమున్నది గాన నిది యెందులకని విద్వత్ప్రభువులు నిరసించుట కవులదురదృష్ట మనుకోవలసి వచ్చుచున్నది. కేవల ముపనిషత్తులనుబట్టి తామే వివాదములకును సౌఖ్యమును గలిగింపఁదలఁపనిచో ననవసరముగా నీయంశము నెత్తికొని, మాలోమేమెట్లో సరిపెట్టుకొని మిన్నక యెవరియూరికి వారు పోఁదలఁచుచు నేవో కొన్ని గంటిభాగవతములాపల్లెను ఆపల్లెను జరుపుకొనుచు వారిచ్చిన ద్రవ్యమును సంపాదించుకొనుచున్న మమ్ము నిందుఁ బేర్కొని తారతమ్యనిర్ణయమునకుఁ గడంగుటయే యుక్తము కాదు. కలుగఁజేసికొనుటకొప్పితిరేని యనుగ్రహించి సభాముఖమున మా తారతమ్యములను బండితసమక్షమునఁ దేల్చి యీకాలమునకు విక్రమార్కులో భోజులో యనుసద్యశమును వహింపఁ బ్రార్థితులు. ఇది వైదికనియోగికక్షామూలకముగాఁ గల్గినట్లు తాము తమ పత్రికలో సూచించియున్నారు. అది సత్యమైయైనను (మేము నియోగులయెడలద్వేషభావము లేనివార మనునంశము మా పల్లెటూళ్లపట్టుదలలు దేవరవారి మంజువాణీపత్రికయే ప్రకటించియున్నది గాన నంచావిషయము తేలును. కనుకనిందు మేమది చర్చింపక వదలుకొంటిమి, ఎట్లో దేవరమమ్మనుగ్రహించి మామా తారతమ్యములను సభాముఖమునఁ దేల్పఁ బ్రార్థించుచు నిందలి తప్పులను మన్నింపవేఁడుకొనుచున్నారము.

గుంటూరు<br>18-10-1911

ఇట్లు తమవిధేయులు,<br>తిరుపతి వేంకటేశ్వరులు.

---

చ. అతని నుతింపఁగా వలదె యక్కట! శాఖను నిట్టు లెంచఁబో<br>వితగఁ బ్రయత్నముల్ సలుపువేళ యథార్థము పత్రికన్ సమం

చిత్రగతి వ్రాసి యిందఱకు సిగ్గు ఘటిల్లఁగఁ జేసి సర్వస
మ్మతమగు త్రోవఁ ద్రొక్కె బుధమాన్యత గన్న సుదర్శినీశ్వరుల్.

ఉ. సాహస మెంత చేసెనో!యసాధ్యుఁ డతండు,స్వశాఖవారు ని
ర్వాహకులై మహామహులు బ్రిమ్మని దిమ్మగ దిమ్మ బ్రమ్మగా
దోహద మాచరించునెడ "ద్రోహము కూడదు త" ప్పటంచు సం
దేహము వీడి వ్రాసెఁ దనతెంపు బుధుల్ వినుతింపుచుండఁగన్.

ఉ. పక్షముఁ బూని వ్రాయు తమ బంధుల వ్రాఁతల నెల్లఁ బూర్తిగా
శిక్షయొనర్పఁజాలెడి విశేషములం బ్రకటించి పత్రికా
ధ్యక్షత సార్థకంబుగ యథార్థముఁ బట్టి చరించినట్టి యీ
యక్షయసూనృతాత్మునకు నంజలిసేసిన నబ్బుఁ బుణ్యముల్.

ఉ. సత్యము వ్రాయఁ డొక్కరుఁడు శాఖకు లోఁగుటఁజేసి,పత్రికల్
దౌత్యము సేయఁగాఁ దొడఁగె దారిని దప్పి,యిదేమి ! యెంత దౌ
ర్గత్యము దాపరించెఁ గలి కాలమహత్త్వముఁబట్టి యంచొగిన్
నిత్యము చింత సేయునెడ నీతికి నీతఁడు నిల్చె నొక్కఁడున్.

క. కల రెందఱేని లోలో, పల "నిది యన్యాయ" మనుచుఁ బలుకు నియోగుల్
ఫలమేమి!పయికి రారొగిఁ, జెలఁగి పయికివచ్చె నొక్క శివశంకరుఁడే.

సీ. "కస్తూరి" యనుసమాఖ్యవహించినట్టి యీతనియింటికిఁ బ్రశస్తి తనరఁగా
"శివశంక" రాభిఖ్యచే నెసంగెడియీతఁ డనుపమప్రఖ్యాతి నందుఁ గాత
తనపేరు సార్థకత్వము దాల్ప నితనిపత్రిక "సుదర్శని" పేరు దెచ్చుఁగాక
త్రికరణశుద్ధిగా దేవుఁడుండుట యెఱింగిన యీతనిమనంబు మనెడుఁగాక

గీ. ఇతనివ్రాఁత యాచంద్రార్క మెల్లబుధుల
మెచ్చునకుఁ బాత్రమై పొరపొచ్చెములను
బెట్టి వ్రాయు వ్రాఁతల చెంపపెట్టుగా ను
దాహరించెద మంబ ! ప్రత్యక్షరంబు. 220

(సుదర్శినీ పత్రికనుండి)

తిరుపతి వేంకటేశ్వర కవులు.

ఆహా ! కష్టించి గురుకులవాసమొనర్చి పాణినీయవ్యాకృతిపవిత్రమయిన యున్నతవిద్య నభ్యసించి యుభయభాషానిరాఘాటసాహిత్యముతో

పాటు బహువిధ విచిత్రావధానసహితానవద్యహృద్యపద్యశ్శతఘంటకవనరచనా ధురంధరులై యనేక సలక్షణ ప్రబంధనాటకాది సద్గ్రంథనిర్మాతృశిరోమణు లయి వివిధవిద్వత్సభారంగాభంగవిజయసుభంగభావుకులయి యాంధ్రదేశంబున నేకవీరులై విరాజిల్లుచున్న శ్రీ తిరుపతి వేంకటేశ్వరులకును గొందఱిచే గర్వోపసంహారనీతిబోధలు ! వేదాంతోపదేశములు!! ఔరా!! ఏమి కాలకర్మము!

దైవమిచ్చినమాత్రపుజ్ఞానముతోఁ గొప్పవరపువారు శతావధానులమని బయలుదేరి వారితోవను వారుపోవుచుండఁగా మధ్యఁ గొందఱు గలహాశనులు వారిని, తిరుపతి వేంకటేశ్వరులను నొక్కచోఁజేర్చి యందు "పక్షపాత గౌరవ సూచనమునకో" యనునట్లు వారి సన్నిధని వీరి కాసనమిచ్చుటయు 'న్యాయమును బట్టి విద్యావిషయమున మాత్రము మాతో సమానముగా వారి కాసనము (సీటు) నీయఁగూడ' దని తిరుపతి వేంకటేశ్వరు లన్నందుపయిని వారును వీరును గలసి యా తిరుపతి వేంకటేశ్వరులను నానావిధముల ధర్షించుచుండుటయు, దానికిఁ దాళములువేయుచుఁ గొందఱు ప్రముఖుల మనిపించు కొనువారే తమ విద్యాతారతమ్యవివేకిత్వము నొకమూలఁ ద్రోసి కేవల గతానుగతిక సేవ్యము లయిన పక్షపాతాదులనే పురస్కరించుకొని "తిరుపతి వెంకటేశ్వరులు సభారంగమున వారి నట్లు తృణీకరింపరా" దనియు 'నెవరి యంతటివారు వారనియు' నిత్యాది నీతివాక్యములు వ్రాయుచుండుటయు నందున కాకవికుంజరు 'లట్టి సబబులు చెప్పుట యన్యాయమో' యని వారికి వారికి వంగివంగి సలాములుచేయుచు విన్నపము లంపుకొనుచుండుటయుఁ జూడ నీప్రాంతముల సత్పాండిత్యప్రాభవమునకు దిక్కులేకుండఁ బోయినదనుట కావంతయు సందేహము లేదు.

ఏపత్రికలోఁ జూచినను యథార్థవాదులే! న్యాయవాదులే! గర్వము కూడదనువారే! స్వాతిశయము వలదనువారే! నీతులవ్వారిగఁ గురిసిపోవుచున్నవి గదా! అబ్బ! ఈనీతు లెవ్వరికి రావు? ఇవి యొకరి కుపదేశించుపట్టుల లోక సామాన్యములే యయిపోయినవి! అయినను ఇంతటి మహాపరాధము వీరేమి చేసిరి చెప్పుమా! కొప్పవరపువారు విద్యాసభారంగమునఁ దమతో సమాన గౌరవమును బొందుట కర్హులు గారనుటయా? మేలు!

ఇదియొక తప్పాగా విద్యాస్వాతంత్ర్యాభిలాషు లెవ్వరును ఎంచఁ జాలరు. ఏమనఁగా? మల్లులెట్లు పరమల్లుల బలాధిక్యమున కంగీకరించరో

యట్లే విద్యామల్లులుగూడ వివాదవిషయము వచ్చినప్పుడు మాత్రము పరుల నిర్వ్యాఘ్రప్రజ్ఞలనే యంగీకరింపరు. అట్టియెడ సామాన్యప్రజ్ఞ నంగీకరింతురా! మధ్యస్థులగువారే వారివారి తారతమ్యములను గనిపెట్టి యర్హగౌరవము లీయవలసియుండెను. అట్లుజరుగనప్పుడు వారే కలుగఁ జేసికొని తమ తారతమ్యములను దెల్పుకొనవలెను. అట్లు గాక, వారు నూరకొని వీరునూరకున్నచో నిఁక సద్విద్యాపరిశ్రమయొక్క తారతమ్య మెట్లు గమనింపఁబడును?

ఈసాత్త్వికనీతు లుపదేశించు సాధువులు, ఇట్టి సంగతులలో నాత్మదృష్టాంతముల నిచ్చికొన్నచో లెస్సగఁ దెలియఁగలదు.

కష్టపడి గురుకులవాసముచేసి, యనశ్వయన బ్రహ్మచర్యము లాచరించి యఫ్. యే. బి యే. పరీక్షలనిచ్చి యనేకములయిన 'లా'గ్రంథములు చదివి యర్హాధాటితో ధర్మశాస్త్రచర్చానిబద్ధమయిన న్యాయవాదముచేయు నొక ప్లీడరుగారు, పొట్టచింపినను ఇంగ్లీషుముక్క లేక తెలుగైనను బూర్తిగా నెఱుఁగక 'లా' యన నేమియో తెలియక కాలకర్మవశమునఁ బట్టువడిన శ్రుతపాండిత్యమునుబట్టి గంటకు వందలకొలఁది యర్థములేని బండయుక్తులను బ్రయోగించి వాదించు నొక చెట్టుక్రింద వకీలు తనతో కోర్టులో సమముగా గౌరవింపఁబడునప్పుడాతనిఁ జూచి యెట్లుసహించగలఁడో యూహింతురుగాక.

ఎంతో చాతుర్యముగ, యుక్తియుక్తముగ, రసపోషణముగ, సలక్షణముగ, ద్వంద్వార్థముగ. నర్మవేగముతో, గర్వోపసంహారాదివ్యాసములు వ్రాయునొక పత్రికావిలేఖకుఁడుగారు, ఇవెవ్వియును చేతగాక ఊరక యేవో పోఁడిమాటలను అనేకాపభ్రంశములతో గంటకు దస్తాలకొలఁది బరుకఁ గలఁడను నంతమాత్రమున నొకనిందెచ్చి తనతో సమునిజేసి కూరుచుండఁ బెట్టినప్పుడెట్లు కొఱకొఱలాడునో యోజింతురుగాక.

ఒక భాగ్యశాలిగారు, వివాహాదులయందుఁగాని యన్యత్రగాని సామాన్యజనుల పంక్తియందుఁ దాము గూరుచుండక రాజబంధుపంక్తియని "కేటాయింపు" గా వేరొక్క పంక్తి తీర్పించుకొని తమతో సమానులయిన రాజబంధువులతోడనే కూరుచున్నప్పుడు సామాన్యజనుల నా పంక్తిలోఁ గూరుచుండఁ బెట్టిన నెంతయాగ్రహము వచ్చునో పరిశీలింతురుగాక.

ఇట్లే ప్రతివారును ఆత్మదృష్టాంతముల నిచ్చుకొందురేని సుశిక్షితవిద్యాబలధౌరేయులయిన తిరుపతివేంకటేశ్వరులకు శ్రుతపాండిత్యముచేఁ గేవలమును

పామరజనమాత్రరంజకంబయిన యాశుకవిత్వకవచం బొందు నొడిగికొనివచ్చిన యొకరు తమతో సమగౌరవము నొందునప్పుడు వారి తల యెంతకంటగించుకొనునో తెలియఁగలదు.

అనేకులు తమకుఁ దెలిసినది స్వల్పమయినను తమకన్న ననేకగుణముల మిన్నలయినవారినే గడ్డిపరకలవలెఁ దిరస్కరించుచుందురు. అట్టిసంగతిలో సంపూర్ణవిద్యాబలదర్పితులయి రెండువైపులను వాఁడిగల్గి చికిలిచేసిన కత్తులనఁ జెల్లు తిరుపతివేంకటేశ్వరులు తమకన్న ననేకగుణములఁ జిన్నలయిన కొప్పరపువారిని విద్యాసభారంగమునఁ దమతో సమానగౌరవమునఁ జూడఁదగదనుట తప్పయిదా? వారు కష్టించి చేసిన విద్యాపరిశ్రమ యంతమాత్రపు టధికారమునకైన నోఁచుకొనలేదా?

ఎవ్వరినేని తిరస్కరించఁగూడదనుట సామాన్యధర్మమే. కాని యొక్కొక్కప్పుడు విశేషధర్మము చొ॥ నట్లు తటస్థించక మానునా?

ఉద్యోగస్థులను జూడుఁడు. ఎవరికైనను ఉన్నతోద్యోగమిచ్చినప్పుడు అంతకంటె నెక్కువ (క్వాలిఫికేషన్సు) గుణములుగలవారు "ఆయుద్యోగమాతని కీయఁగూడదనియు నతనికన్నఁ దనకెక్కువ గుణములున్నవిగనుక, ఆగౌరవము తనకే యిప్పించవలె"ననియుఁ దగవులాడుదురు. అప్పుడీయుపనిషన్మత మవలంబింతురా? వేదాంత మవలంబించుటయే ప్రధానమగునెడల సభలును విద్వత్ప్రకటనలును గౌరవములును ఆశించక తపమాచరించుకొనుచుఁ గూరుచుండుట లెస్స. అవి కావలసివచ్చినప్పుడు తారతమ్యగౌరవములును వెంబడినే కావలసియుండెను. ఇప్పటి జమీందారులు కొందఱు విద్వత్సంభావనలిచ్చుపట్టుల నీయుపనిషన్మత మవలంబించి సమముగా సంభావన లిప్పించరాదా? ఒక్కరికి రు 111రిలు, మఱియొకరికి నట్టి రు 116 లు నీయనేల? కావునఁ దారతమ్యము గమనించితీరవలెను. తిరుపతి వేంకటేశ్వరులు సత్యము పల్కిరి. "మాకున్నన్ని ప్రజ్ఞలు వారికిలేవు గనుక వారిప్పట్టున మాతో సమముగాఁ బండితాసనమును స్వీకరింపఁదగ" దనిరి. ఆ సంగతి సత్యమొ కాదో విజ్ఞులు తాము ప్రత్యేకముగ సభఁజేయించి నిర్ధారణము చేయలేకపోయినారా? అట్టి తారతమ్యవిచారణసభ కెవ్వరురారో, వచ్చి యెవ్వరు డీల్పడుదురో, వారి నప్పుడే నిరసింపవచ్చునుగా! పత్రికలలో నీసడించి వ్రాయవచ్చునుగా!

గుంటూరుపురవాసు లెవ్వరి దౌర్బల్యమునకు రహస్యముగా వెలిచియో యీసభఁ జేయింపరైరి అట్లు జరిగినచో, ఇంతమందికీ వ్రాతలశ్రమ లేకుండ నప్పుడే తేలిపోవును. అట్టిభాగ్య మెప్పటికైనఁ గలుగునా? అదిగాక మన వారు కొందఱు చెప్పినట్లు గౌరవాభిమాననిర్వహణమే యక్కఱలేనియెడలఁ గొప్పరపుశర్మగారు సభవారందఱతోపాటు నేపక్కనో కూరుచుండక ప్రస్తుతావధానులతోపాటు సమానముగఁ గూరుచుండ నుంకించిన దెందుకొఱకు? స్వగౌరవప్రకటన కొఱకు తరువాత తిరుపతి వెంకటేశ్వరులట్లు వారిని గూరుచుండరాదనుట యెందుకొఱకు? తమ నిరుపమానవిద్వత్కవిపట్టగౌరవము నిల్పుకొనుటకొఱకు. తరువాత వీరిని వారు "మీసములు దీయించెద"మని రణోన్ముఖులగుట యెందుకొఱకు? స్వగౌరవము నిల్పుకొనుట కొఱకు. కొంత అప్పుడు కొప్పరపుశర్మగారిని ముందు గూరుచుండఁ బెట్టుటయును, ఇప్పటికిని ముందునను దేఁజూచుచుండుటయు నెందుకొఱకు? స్వజాతి గౌరవముకొఱకుం-వేయునేల? యుక్తిప్రయుక్తులను బ్రయోగించుచు నిట్లు గంభీరవ్యాసములు వ్రాయుచుండుట యెందుకొఱకు? ఒకరికన్న నొకరు మిన్నలన్న గౌరవము కొఱకే- కావున నట్టి గౌరవము శంకితమగుచున్నప్పుడు మన శాంతిమంత్రములు పాఱవు

కొప్పరపువారు స్వశాఖవారని గౌరవము మనకున్నప్పుడు మన యిండ్లకు వచ్చినప్పు డెగువపీఁటలును దిగువపీఁటలును వేయుదుముగాక. సంబంధబాంధవ్యములు నెఱపుకొందుముగాక. అంతియకాని యీ మమకారమును బురస్కరించుకొని విద్వత్ప్రకాండుల నీసడించవచ్చునా?

ఇంతవఱకు వ్రాసినంతలోఁ గొప్పరపువారి నెంతయు గణించుట లేనట్టుల కనఁబడుచున్నయది- కాని, సత్యముగా మాయభిప్రాయమదికాదు. విద్వత్ప్రకాండులగు తిరుపతి వెంకటేశ్వరుల ద్వారమున వీరినిటు తగ్గించవలసి వచ్చినదిగాని, లేనిచో దేనియందలి యసాధ్యతచే యతి కుదిరినఁ బ్రాస కుదురకయుఁ బ్రాసకుదిరిన గణము కుదురకయు, తొంబదితొమ్మిది నిఘంటువులు ముందువేసికొని పెద్దపెద్ద కవులమనిపించుకొనువారే యొక్క పద్యము వ్రాయునప్పటికి మూడుముంతలనీళ్లు ద్రాగి, గ్రుడ్లు మిణుకరించుచుందురో యట్టి పద్యకవిత్వము గంగాప్రవాహమట్లు అశ్రమముగా, నాశుధారను వర్షించునట్టి శ్రీకొప్పరపుకవిసోదరులు దేవతాసమానులనుట కావంతయు సందేహము లేదు. మనకందఱకును వారు పూజ్యాతిపూజ్యులే కాని, తిరుపతి వెంకటేశ్వ

తులకొక్క యడుగు వెనుకనే యుండక తప్పదు. ఏమనఁగా! వీరికున్న యాంధ్రాశుకవిత వారికిని అర్థాధాటితోఁ గలిగియుండుటగాక విశేషించి విద్వత్ప్రజ్ఞ యెక్కువైయున్నందున వారికి వీరిలక్ష్యములేదు. అదిగాక సత్కావ్యరచనము చేసినప్పుడే కవియనఁదగినది కొప్పరపువారొక్క గ్రంథమునైనఁ బ్రకటించలేదు. తిరుపతి వెంకటేశ్వరులు పంచమవేదమును దృశ్యప్రబంధమొనరించి యాంధ్రదేశమునకు మహోపకార మొనర్చిరి. మఱియు నెన్నేని సత్ప్రబంధములను రచించిరి. వారొకవేళ నొక్కొక్క శాస్త్రమునఁ బరిమావధి ప్రజ్ఞలుగల మహాపండితకుంజరముల కొక్కింతజంకిన జంకుదురేమోకాని తక్కిన వారికి దుర్నిరీక్ష్యులు మనము నాలుగు ముక్కలు వ్రాయఁగల్గుదుముగదా యని యేమేమో వ్రాసినంతమాత్రమున వారితేజము కొఱంత పడునదికాదు ఎంతవ్రాసినను ఇంతే. పరమార్థ మొక్కటి వినుండు.

చ. పనిగొని పంతగించి ఘనవాతపరంపర లొక్క పెట్టు మే
దిని వడివీసఁ దైలమయదీపిక లాఱిన వాఱుఁగాక! శో
భనఘనకాంతివిస్ఫురదభంగధగద్ధగధాళధళ్యస
న్మణిమయనిత్యనిర్వికృతిమంగళదీపిక లాఱిపోవునే.

పరా:— పత్రికాధిపతులందఱును దయయుంచి యీవ్యాసమును దమతమ పత్రికలలోఁ బ్రకటింపఁ గోరుచున్నారము. ప॥ అ॥

(1912 సం॥ అక్టోబరు 1 వ తేదీ సుదర్శని పత్రికనుండి.)

కవుల కయ్యములు.

మనోరంజనీ పత్రికాధిపతి గారికి విన్నపములు:—

మిత్రమా! లోకమండఱకును ఎవ్వరును హితులుగారు కొందరి కిష్టులును గొందఱి కనిష్టులు నగుట విధాయకము. లోకానందసంధాయకుఁడైన కళానాథుఁడే కొందరిచే బుఱ్ఱవ్రేఁటిట్టఁబడుచున్నాఁడు. చూడలేదే! ఇది విహితంబ కాని, మఃమండఱమును భాషాసేవ సేయుచున్నవారము. సరస్వతీ కటాక్షవీక్షణములకై సర్వదా ప్రతీక్షించుచున్నారము. కావున సారస్వత ద్రోహచింత మనకు స్వప్నమందును లేకుండునుగాక! చంపవచ్చిన వాఁడయ్యును నిక్కమగు విద్వాంసుఁడయ్యేనేని యాతఁడు విద్వాంసుఁడు గాఁడని యనకుందుముగాక! విద్వాంసులపాదరజస్సును శిరముల ధరింతుముగాక! ఎందువలన? "విద్యా సేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం, నహి వంధ్యా

విజానాతి గుర్వీం ప్రసవవేదనాం" అనునట్లు పండితుని పరిశ్రమము తెల్లాలముల కుఁగాక యితరుల కెట్లు తెలియును? దుర్భరమైన ప్రసవవేదనము,వంధ్య(పిల్లలు కలుగని యామె) కెట్లు తెలియును? తిరుపతి వేంకటేశ్వరులకును కొప్పరపు వారికిని జరుగుచుండెడు ఘర్షణములో నందఱమును గొలఁదియో గొప్పయో వ్రాసియున్నాము. ఈనడుమ తాము మనోరంజనిలో, తిరుపతి వేంకటేశ్వరులకు న్యూనత్వసూచకముగా, కొప్పరపువారినిఁ గూర్చి విశేషించి కొనియాడుటయు నందుపైని మీ పురమందలి కౌన్సిలర్ శ్రీవాసరావుగారు గాని లేక మీరు వ్రాయించినట్లు మఱియెవ్వరో బ్రహ్మరక్షస్సు కాని పెద్దకథ నొండు ప్రకటించుటయు నందఱు నెఱిఁగినదేకదా! మీరేమో యంతఃకలహములను రేంచుచున్నారని వారు వ్రాసినందున కాక్షేపించుచు నట్టి కలహబీజములు వారి వ్యాసములోనే పూర్తిగా నున్నవిగాని మీవ్యాసములో లేవని మీరు వ్రాసియున్నారు కాని, కలహబీజములు మనవ్యాసములోను స్ఫురించుచున్నవి. కొప్పరపువారినిఁ బొగడినవారు కవిపండితచక్రవర్తులనియుఁ దిరుపతి వెంకటేశ్వరులను బొగడినవారు సామాన్యులనియు, మీరు స్పష్టముగా వ్రాయుచున్నారు. పామరపక్షమునఁ జూచితిమేని నడుమ నిది యొక కలహబీజము కాదా? అది యటుండుఁడు; మీరు వ్రాసినట్లు వారు కవిపండితచక్రవర్తులే, వీరు సామాన్యులే. ఇందుఁ దగవుపెట్టిన ప్రయోజనములేదు. కాని, యింత మాత్రములో వివాదమున కొకట్టి యణుమాత్రము నుపయోగము కన్పించుటలేదు. ఈ కవుల తారతమ్యములను గూర్చి వ్రాసినవారికందఱు సామాన్యులే కావున వారి వ్రాఁతలు విశ్వాసపాత్రములు గావని మేము స్పష్టముగా జెప్పుచున్నారము. ఏమనఁగా, లోకములో ఘనులైనవారు తమయొద్దకు ఏగి యొకింత చదువుకొని పండిత సంపాదనమునకై ముందుగావచ్చి యాశ్రయించిన వారిని జేరదీసి తమమంచిగుణముచే నొండె లేక వారి విద్వత్తునుబట్టి యొండె వారిని గౌరవించి కొనియాడుట ధర్మమై యున్నది. అందునను మహదాశ్చర్యకరమైన యాశుకవితాప్రవాహము వెల్లివిరియఁజేసిన కొప్పరపు వారినిఁ గూర్చి పెద్దపొగడుట యొకవింతలోనిది కాదు. కాని వారిచే వారట్లు పొగడఁబడిన మాత్రమున లోకములో నికనందఱును గొలఁదివా రయినారని మన మనుకొనరాదు. వారప్పుడా కవులను సమయానుకూలముగా గొప్ప వారని పొగడియున్నారే కాని యాసందర్భమునఁ దిరుపతివేంకటేశ్వరులు

వారికంటె తక్కువవారని వారేమియు స్థిరపఱచినట్లు మన మెవ్వరమును వినియుండలేదు. ఆకవిపండితచక్రవర్తులు ఉభయులఁగూర్చియుఁ జర్చించి అందు తారతమ్య నిర్ధారణము జేసియున్నచో వారాంధ్రదేశమునఁ బెద్దలై యున్నారుగనుక "ఆపరితోషాద్విదుషాం నసాధు మన్యే ప్రయోగవిజ్ఞానం" అను న్యాయమును బట్టి వారి సిద్ధాంతమును మనము శిరసావహించుటకు సందియము లేదు, ఇదియిటు జరిగినదా? ఏకదేశ ప్రశంసవలన ఫలమేమి? మఱియొకప్పుడు తిరుపతి వేంకటేశ్వరులు వెళ్లి వారి నిరాఘాటోభయభాషాకూలంకషపాండిత్య ప్రవాహమును వెల్లివిరియించినచో నప్పుడు వారిని బ్రశంసింతురు ఇది పెద్దల ధర్మము. కావున సామాన్యవిధిచే వారు చేసిన ప్రశంసలు తారతమ్యచర్చలకుఁ బనికిరావు. విశేష విధిచే వారు ఉభయులనుగూర్చి చర్చించి తీర్పు చెప్పినచో నట్టితీర్పు అంగీకార్యమగును. ఏదీ? అట్టిభాగ్యము ఆంధ్రదేశమున లేదయ్యెను "సభ సభో" యని ప్రౌఢకవు లంగలార్చిరి. వినువారు లేకపోయిరి! తూష్ణీంభావమును వహించిరి. కారణ మూహింపలేము.

కవులందఱును గోడకట్టెడువారితోఁ బోల్పఁబడుదురు. కొప్పరపు వారతిలాఘవముగా గోడ పెట్టఁగలరు. కాని, అది యిసుక పాముపు పెట్టి కట్టెడుగోడ, వారికి యుక్తమైన రాళ్లు దొరకవు. ఫట్టుకేటు తక్కువ. తిరుపతి వేంకటేశ్వరులకుఁ దగిన సాధనసంపత్తి కలదు. వారియొద్ద శతఘ్నులకును బగులని గట్టిరాళ్లగని యున్నది. ఆగనియందుఁ గొరినరాళ్ళును రత్నములును సకృత్స్నముగ దొరుకును. వారి కూర్పుగూడ నీరంధ్రమయినది. ఆగోడ ప్రళయమువఱకును శిథిలముగానిది. లాఘవమునందుఁగూడ వారసాధారణులు. పిల్లలవినోదార్థమై యిసుకతోఁ బిచ్చుకగూండ్లను గట్టువారిని మహాసౌధనిర్మాతలతోఁ బోల్పఁ జూతురిది యేమి పాపము! వారుగూడ మహాసౌధములు నిర్మించనిండు. అప్పుడు చూతము.

మనము భాషాభిమానులము గామా! సరస్వతి మనలను దన భక్తులనుగా ననుగ్రహించవలదా? యెద్దియేని యనిష్టకారణమున నిట్లు సరస్వతీసంపూర్ణావతారపదులయినవారి నెల్లఁ ద్రోసివేయుచుందుమేని, యిక సరస్వతి మనలను బరమవిరోధిగణములోని వారినిఁగాఁ జూడదా! తిరుపతివేంకటేశ్వరుల తక్కువ విషయములు మాకుఁ దెలియవు. వారెట్టివారో కనులనైనఁ జూచి యుండలేదు. వారి గ్రంథరత్నములఁ బఠించిన పక్షపాతము మమ్ము దోషులను జేసినఁ జేయవచ్చును.

తాము మనోరంజనిలో నొకరుచెప్పిన కత్తెరపద్యమనుచు నొక పద్యమును, ఆకత్తెర మీఁదనే కొప్పరపువారు చెప్పినారనుచు మఱియొక పద్యమును ప్రకటించినది చూచినాము. నిజముగా కొప్పరపువారు చెప్పినదన్న పద్యమున కెంత విలువ యిచ్చినను ఈయవచ్చును. రెండవ పద్యముఁజూడ నిక్కముగా సిగ్గే వేయుచున్నది.

అప్పటికప్పుడాశుధారగా రచించిన పద్యమే యంత మనోహరముగా నున్నప్పుడు స్థిరచిత్తులై యూహాసహాయమున వీరేదిరచించినను నది యలోక సామాన్యమయి యుండుననుటలో నతిశయోక్తి లేదు. కాని * అదియే నిజమయ్యేనేని తమ శక్తియంతయుఁ గన్పఱచఁదగిన శ్రీజార్జిచక్రవర్తి వర్ణన పద్యములు 'సరస్వతి'లోఁ గొప్పరపువారు వ్రాసినవి అంతనీరసముగా నున్నవేమి చెపుమా ! ఏది స్థిరపఱచుటకును జేయాడను. ఇంతకును గొప్పరపువారేవయినఁ

---

* పరా:— సుదర్శనీపత్రికాధిపతిచే మిక్కిలి మృదువుగా మందలింపఁబడుచున్న యీ మనోరంజనీపత్రికాధిపతి యనఁగా ! యగు పృథాశాఖాభిమాని, కొండొక యతిప్రాసములకూర్పు నెఱిఁగినవాఁడును "శతావధాని" యను నొకవిఘ్నపు జందెపుఁబోఁచ తొడుగుకొనినవాఁడును నని యెఱుఁగునది. తన నాటకముపైఁ దాననుకొన్న తెఱఁగున నభిప్రాయమొసఁగనిది మొదలు మమ్మునితఁడు ద్వేషించుచుండును. నేటికిఁ గొప్పరపువారివంకదొరకి యిందులో మాకేదియో విష్ణుచక్రము చేయఁదలఁచి శరపరంపరగాఁ గొన్ని వ్రాతలు "కొమ్ములు తిరిగిన యవధానపుంగవులజత" లోనగు ప్రగల్భపుఁ బ్రల్లదములతో నింపఁ జొచ్చెను. అవి యసత్యబహుళములగుటచే నార్యమతబోధిని యీ క్రిందితీరున దుమ్ముదూళి చేసెను.

(1) "మనోరంజనిలోని వ్రాఁతలను చూచితిమి అందసత్యములు చాల కానిపించుచున్నవి. మనోరంజనీ సంపాదకుఁడుగారు గంజామువారియింట మున్న గుత్తావుల కొప్పరకవులు అవధానము చెప్పుచున్న సమయమున పద్యములను తాము వ్రాసికొనినట్లుగా ప్రకటించిరి. గంజామువారింట జరిగిన సభలో వీరి ప్రక్కనే మేము కూర్చుంటిమి. వీరప్పుడు వ్రాసికొనలేదు. మఱియును అప్పుడు

గొన్ని ప్రబంధములు రచించువఱకును వారిని దిరుపతి వెంకటేశ్వరుల ప్రచారములోఁ గలిపి ముద్రించవలదని పండితపక్షపాతులయిన మిమ్ము వేడుకొనుచున్నారము. ఈవ్రాయుటవలనఁ గొప్పరపువారిని సామాన్యులనుగా గణించుచున్నామని కొందఱు భ్రమపడుచున్నారు. తిరుపతి వేంకటేశ్వరులతోఁ బోల్చుట యను నొక్కటెట్టి భ్రమను విడనాడితిరేని యనంతరము మీచిత్తము. వారి నెంత మెచ్చినను దనివిపొందనక్కఱలేదు. అట్లు కాదేని,

చ. పనిగొని పంతగించి ఘన వాత పరంపర లొక్కటెట్టు మే
దిని నడిపీఁచ దైలమయ దీపికలాటిన నాఱుఁగాక శ్రీ

వారు చెప్పిన పద్యములకును మనోరంజనిలో ఇప్పుడు ప్రకటింపఁబడిన పద్యములకును చాల భేదము కానిపించుచున్నది. కొన్ని క్రొత్తపద్యములుకూడ కానిపించుచున్నవి. ఉదాహరణము:— సభలో "తిమ్మనిబమ్మిగా" అని అన్నగారును "పండినిపందిగా పందినిపండిగా" అని తమ్ముఁడును సీసపద్యము పెద్దపాదములు చెప్పగా మనోరంజనియందు గీతములో "బమ్మదిమ్మని దిమ్మబమ్మగాఁగ" అని వ్రాసిరి పండినిపందిని మొదలగునవి లేవు "చ కనుఁగవ శోణకాంతులెసఁగన్'' - అను పద్యము క్రొత్తదిగానున్నది." (1 కొత్తపల్లి సూర్యరావు. 2 నేత్రకంటి శేషగిరిరావు 3 మాచర్ల హనుమంతరావు 4 కోగంటి లక్ష్మీనరసింహాచార్యులు. 5 శ్రీసముద్రాల వెంకట అప్పలాచార్యులు )

(2) 'కొప్పరకవులను స్తుతించువారలలో నేను నొక్కఁడనైయున్నను, వారినిగురించి ప్రచురించిన వ్రాఁతలు చాలవఱకు సత్యేతరంబులుగా మనోరంజనిలోఁ గాన్పించుటచేత నిట్లు వ్రాయవలసివచ్చినది. ఆశుధార వారికి సహజముగా నున్నదని యంగీకరించియు, నందు ప్రచురించినప్రకారమున్నట్లు నాకుఁ గాన్పించుటలేదు. వారాశువుగాఁ జెప్పిన పద్దెములకును నిందలి పద్యములకును చాల వ్యత్యాసమున్నది. "తిమ్మని, బ్రహ్మని" యని విశ్వామిత్రుని వర్ణించునప్పుడు సీసపద్యపాదముగా వర్ణించినారు. ఇందది గీతపద్యపాదమైపోయినది. ఇది విశ్వామిత్రుని సృష్టినిగూడ మీఱియున్నది. ఇదిగాక, వారియాశువునందలి పద్దెముల వ్రాయుటకుఁగూడ వీలులేనట్లు చెప్పఁబడియుండఁగా వీరు వ్రాసి యెట్లు జాగ్రత్తపెట్టిరో తెలియకున్నది వారట్లక్కడక్కడనే కొన్ని కొన్ని పద్దెములు వ్రాసినట్లిప్పటివఱకెవ్వరు నెఱుంగరు. ఇది కడు శోచనీయము. ఇందలిపద్దెములకును వారుచెప్పిన పద్దెములకును శైలీభేదముగూడఁ గాన్పించుచున్నది'

కిడాంబి వేంకట వేదాంతాచార్యులు

భనఘనకాంతి విస్ఫురద భంగభగద్ధగధాళధళ్యస
స్మణిమయ నిత్యనిర్వికృతి మంగళదీపములాఱిపోవునే."

---

(3) 'మనోరంజని పత్రికయందు కొప్పరపుగవుల నుతించుచు గంజాము వారియింట నల్లఁబడిన పద్దెములని కొన్ని మచ్చుచూపఁబడినవి గంజాము వారి యింట రచింపఁబడిన పద్దెములకును నిందలి పద్దెములకును జాలభేదము కలదు. శైలి భేదము మాత్రమే కాక యచ్చటచ్చటఁ జెప్పఁబడిన యూహల నేర్చి యొక్క పద్దముగా వ్రాయుటయు నందుఁ జెప్పఁబడని పద్దెములు నూతనముగా నిందుఁ జేర్చుటయుఁ జరుగుటచే స్తోత్రము చేయుటయే ప్రధానముగాఁ జేసికొనిన యీలేఖకులు సత్యేతరములగు వ్రాతలు వ్రాసిరి.

Ch. L Narasimhacharyulu,
Math Asst.
Mc. Laurin High School.

(4) "నేను మనోరంజనీపత్రికలోఁ గొప్పరపు సోదరకవుల కవిత్వముగాఁ బ్రచురింపఁబడిన పద్యములను జూచితిని. వారొనర్చిన సభలకన్నింటికి నేనుబోయియుంటిని. వారాయా సభలలోఁ జెప్పిన వానికిని నేఁడిందుఁ బ్రకటింపఁబడిన వానికిని నందందు చాలభేదములున్నవి."

ఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రి.

(5) "కాకినాడ కళాశాలం జరిగిన కొప్పరపుకవుల కవితాగోష్ఠికిం జనితి. వారి యనర్గళధోరణి వింటి కాని యిటీవల ప్రకటింపఁబడిన మనోరంజనిలోఁ గొప్పరకవుల కవిత్వమని ప్రకటించిన పద్యములుమాత్ర మవికావు. ఆపద్యములు పేలవముగానున్నవి- ఇందు గొన్నికొన్నిపాదము లిటీవల కల్పింపఁబడియుండవచ్చును- ఏమన వారి ధోరణి వ్రాయుట కవకాశములేనిది-"

దయంతి భావనారాయణ-

(6) "మీరువ్రాసిన లేఖను చూచితిని, కాలేజిలో కొప్పరపుకవులు అనుధారగా కవిత్వము చెప్పినప్పుడు కొంతసేపుంటిని-' అప్పుడు ఎవరును పద్యములను వ్రాయలేదు. వ్రాయుటకుఁదగినంత సావకాశము వారు కవిత్వము చెప్పునప్పుడుండదు. జ్ఞాపకముంచుకొనుటకైనను ఏ యేకసంథాగ్రాహికిని వీలు పడదని నా తాత్పర్యము. మీరు పంపిన పద్దెములు వారే చెప్పిరని నేను వ్రాయ లేను. ఇటీవల వారు చెప్పిన నెవరైన వ్రాసియుందురు. ఆసమయములో వారు

తే. గీ. వైదికులును నియోగులు వాదులాడు
నపు డుభయపక్షములకు నన్యోన్యలేఖ
లుపకరించెడి నవియు నటుండనిమ్ము
జనని! బ్రాహ్మణేతరుల వాక్సరణివినుము.

---

చెప్పినవి యెవరును వ్రాయలేదు. ఆభావముగల పద్దెములుగా గన్పడుచున్నవి."

పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యం.

(7) "కొప్పరపుకవులు గంజాంవారి యింటియొద్ద చెప్పిన పద్యములకును మనోరంజనిలో ప్రచురపరచిన పద్యములకును భేదమున్నట్లు తోచుచున్నది. గంజాంవారి లోగిటియందు జదివినపద్యములను మాత్రమే నేనువినియుంటిని.";

తా॥ నారాయణమూర్తి.

వీనినిబట్టి సభలో గొప్పరకవులు చెప్పిన కవిత్వమునకును మనోరంజనిలో బ్రకటింపబడిన పద్దెములకును భేదమున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈభేదమునకు గారణమేమి? సభలో నాశువుగా జెప్పిన పద్దెములు నిస్సారములుగా నుండుటచే నింటికడ సావకాశముగా నున్నప్పుడు వానిని దిద్దివేసి మనోరంజనిలో బ్రచురించిరిగాన నీభేదమువచ్చినది, ఈదిద్దినవా రెవరగన? మనము కొప్పరకవులేదిద్దిరందము...... (31 జూలై 1912 ఆర్యమతబోధినుండి)

వరా :— పిడప, మ. రా. రా కార్చెర్ల శ్రీనివాసరావుగారుకూడ సత్యనివేదకులై తన వ్రాతకును తన పట్టిన పట్టునకును నొకింతబాధకులని తలచి యీయనను గూడ దూరుపాలు బట్టుచు గొంతవ్రాత వెళ్లబెట్టెను, కాని పూర్తిగా దనగుట్టు బైటబెట్టిన బోధనిని ఖండింప నాధారము చిక్కనందున నిట్టూర్పులు పుచ్చి రోజుట తప్ప నితనికి గత్యంతరము లేక పోయెను, ఇతడు తనతోపాటు మఱికొందఱను గూడ వెట్టితోవకు దింపుట కడుశోచనీయము, పాపము! పాడి వెంకటస్వామిగారితనికి గురువులో శిష్యులో కాదగువారు, ఈయన నెసకొల్పి కొప్పరపువారి నతిమాత్రస్తుతి చేయించుటలో దప్పులేదుగాని ఆస్తుతిమధ్యమున యావత్పండితమండలిని గాకులనుగా నపలాపించుట పూర్తిగా మంటలింపదగు దోసము, "పండిత కాకాయితదుష్ప్రలాపములు" (15 జూలై 1912 సం॥ మనోరంజని చూ) ఈవెంకటస్వామిగారమాయికులు. ఏ దొంగ జండాపు శతావధానియో వ్రాసి యీయన చేవ్రాలుచేయించినట్లు పద్యముల శైలి చెప్పుచున్నది, నిజము భగవంతునికే యెఱుక, దీనింబట్టి యీ శాఖాభిమాని "తాజెడ్డ కోతివనమెల్ల జెఱచె"నను సామెత కుదాహరణమగునేమో

క. కార్వేర్ల శ్రీనివాసుఁడ, మర్చిన పాత్రమ్మటుండ ‡మఱియొకయఁడు క
వ్యర్చకుఁ డతితరవృద్ధుఁడో, వర్చిన చర్చయును గొంత నాటింతు మిటన్.

---

విజ్ఞులు పరికింతురుగాక. ఇతరవిషయములలోఁ గేవలము భిన్నాభిప్రాయములతోఁ గొండాడు బోధినీ సుదర్శను లీయన "యసత్యవాది" యనుటలో నేకీభవించు టయిందులకుఁ బ్రబలాధారము ఇత్యాది సర్వ విధముల గురుశుక్ర సమాగమము వంటిది, దీనివలననే యితనివ్రాఁత సర్వాసహ్యముగానున్నది, యనిజగమెఱుఁగునని యెంచి గ్రంథవిస్తర మొనర్పక విరమించితిమి,

(1911 సం॥ నవంబరునెల 10 వ తేది శశిలేఖనుండి)

‡"చ. తిరుపతి వేంకటేశ్వర సుధీమణు లాదిని శబ్దశాస్త్రసా
గరమునుదాఁటి తర్కమును గల్పము ఖండము గొనఁగమాగమో
త్కరముఁ బ్రయిన్ గ్రహించి కవితాఝురి భూరిశతావధానముల్
ధరణిపు లెన్నఁ జేసిరి యథావిధ, వీరినినే నెఱుంగుదున్.

చ. తిరుపతి వేంకటేశ్వరసుధీయుగళాంచితసాహితీమహా
గరిమనుతింప నాతరము గాదని సెప్పిన నొప్పు కష్టణీ
శ్వరుఁబురికొల్ప నాతఁడును వాకొనఁజాలఁ డదేమనన్? జిహ్వా
భరమునఁ దూలుటన్ శ్రుతివిభాసుఁడెన్నఁడు గాకయుండుటన్.

చ. తిరుపతివేంకటేశ్వరసుధీమణియుగ్మము గూడి విస్మయా
కరముగ రాజరాజులును గావ్యరసజ్ఞులుమెచ్చి రచ్చలన్
నిరవధికావధానము లనేకములాశువుగాఁ బ్రబంధముల్
నెరపిరి శిష్యసంతతికి నేర్పిరి వీరిని నేనెఱుంగుదున్.

చ. తిరుపతివేంకటేశ్వరసుధీమణు లించుకజంకులేక భూ
వరు లరుదంద గొప్పగల వాదుల వైరుల విగ్రహించియే
బిరుదుల జంద్రహారములఁ జేటిక లాటనిహాటకోజ్జ్వలాం
బరములఁ దెచ్చిరెన్నిటినో బాగుగ వీరిని నేనెఱుంగుదున్.

చ. వెఱపుగలట్టి గుండెయును విక్రమమూరని పల్కుకండునున్
బిఱికితనంపుఁగండయు వివేకవిహీనులఁ గోరునండయున్
సరసము లాడకుండమియు సాహితిచాలనిగండెఱుంగ రీ
తిరుపతివేంకటేశ్వర సుధీమణు లిన్నియు నేనెఱుంగుదున్.

ఉ. ఏనుఁగునెక్కినారు కృతులెన్నియొ లీలగఁ జెప్పినారు దు
ర్మానవ వారముల్ గడిచి మాటికిమాటికి దూటినారు స
న్మానము లందినారు మునిమార్గములారసినారు వీరటం
చేనుదలంచి పద్యతతి నే మణిమాలగ నిచ్చితిఁ బ్రీతియన్.

ఉ. శ్రీమణిమణీవిమలచిత్తశరన్నళినాళిహేళి దే
వారివిదారిశౌరికరుణాంకలితేక్షణసిద్ధితార్థశృం
గారకవిత్వసత్త్వగుణకార్యుఁడు కార్యమపూడి రాజమ
న్నారు శతావధానకవి, న్యాయము నారసి వ్రాసె నీకృతిన్.

వివేకులకు, విద్వాంసులకు, విద్వత్పక్షమునకు నేనొక విన్నపము చేయుచున్నాను. అపరోద్ధియాన, శయ్యామునకు, నెయ్యమునకు, కయ్యమునకు, సమత గలయునవికదా సదా శబ్దములు పక్కాణించెదరు...................... తిరుపతి వేంకటేశ్వర కవుల పిరదపూసము దీయించెదమని వెనకొని గుంటూరి లోఁదారసించి వ్రాసినపద్యములాదిగఁ బరస్పర ప్రేషితోత్తర ప్రత్యుత్తరములు గల చిన్నపుస్తకమొకటి చిరంజీవులు వినిపింపఁగాఁ గంటిని, తత్తద్విషయములం దెలిసికొంటినిగాని, ఇదవిద్ధమని నిర్ణయించుటకు తగిన విద్యావివేకములు పరమ కారుణికుఁడగు భగవంతుండొసఁగియుండినను, దేశ కాలముల ననుసరించి యూరకుండవలసినవాఁడనైతిని. అది యేమనుఁడురా. మొదటినుండియు నియోగి బ్రాహ్మణులయందు గుణాగుణ నిరూపణ విచక్షణులు మెండుగనుండియే యున్నారు. ఇప్పటికాలమందంటివో? లెక్కింపనెక్కము గాక అంతట నిండిగనిండియున్నారు. ఇట్టివివేకనిధులె మక్కువపడి తగవును మిగుల తెగువతోఁ బెంపు సేయుచుండ బ్రాహ్మణేతరుఁడ నగు నేనేమి సేయఁగలను ... మాచీరాల పేరాల గ్రామములలో సోదరకవుల సభలు జరిగినవి. సభ్యులు గౌరవించిరి నేనును నావారును గొండాడితిమి. రెండియు, తిరుపతి వేంకటేశ్వరకవులును ఆమఱు నాఁడే దయచేసి మాగ్రామములం బావనము చేయుదురని నేనీ పద్యముల వ్రాసియుంచితిని. అట్లు పటస్థించనిచేఁ బత్రికలయందుఁ బ్రకటింప వలసి వచ్చినది. మాగ్రామములలోఁ దగపాటి ప్రస్యసంతతులును, చదువరులు, యోగ్యులు, శాస్త్రజ్ఞులు నగునైదిక బ్రాహ్మణులు కలరు. తగుప్రయత్నములు జరుగుచున్నవి. సభ కాఁగలదు. అప్పుడు వహామహులగువారి దర్శనమువలన అస్మదాదులము ధన్యులము కాఁగలము." కార్యమపూడి రాజమన్నారుకవి

శతావధాని, పేరాల.

క. న్యాయమ్ముకొఱకుఁ గాక వృ, థా యాశ్రమమేల? వృద్ధతముఁ జీతని కే
మాయోపాయము చేసెడి, ధీయుతుల కిదెంత చింత దెచ్చునొ యకటా!"

తే. గీ. ఇటు కరిమమ్ముగఁ బ్రాహ్మణుల యెలుక కలిమి
కూటవాదుల వ్రాఁతలు కూలఁబడఁగ
నెగడఁగాఁజొచ్చె సత్యంబు "నిజము నిడివి
మీఁద తేలు"ననియెడి సామెత ధ్రువంబు.

ఉ. సత్యపువిల్వ లోకమున సాఁకెడివారలు లేమిఁ జాల దౌ
ర్గత్యము చెందె, నించుక యొకానొకచో నది డాఁగియున్న దు
ష్కృత్యయుతౌ నరాధము లబద్ధపుసాక్ష్యము లిచ్చి దానికిన్
మృత్యువులు గాఁదొడంగి, రొక మేటి యొపండొ పెనంగ నేమగున్!

చ. పొరఁబడుఁగాక వెంబడిగఁ బొందిన మోసము తెల్పినట్టి'కే
సరి'కిఁ బురస్కృతుల్ మొదట సల్పి, పదంపడి 'దేశమాత'నం
తరమున మెచ్చి, 'కృష్ణ'కుఁ గృతజ్ఞత చూపుచు, 'నాంధ్రపత్రికన్'
గరము బహూకరించెదముగాక మనోవిశయంబు తెల్పుటన్.

ఉ. తుంటరి పోకఁబోయెడి విధుంతుదులన్ విలసద్యశస్సుధా
కంటకులన్ నిగూఢతరకర్మకులన్ విదళించి,పిండ్రి నె
ప్పంటికి సత్కళానిధుల పాలిటి శత్రులుగా గణించి, మి
న్నంటు యశమ్ముగొన్న యసురారి 'సుదర్శని' మ్రొక్కుటొప్పదే.!

సీ. అల బిడాలాదుల నాజిఁ గూల్చుటకన్నఁ గొండగొట్టిల బలిగొనుటకన్న
మహిషాసురుని బరిమార్చివైచుటకన్నఁ జండముండులఁ బట్టి చంపుకన్న
ధూమ్రిలోచను తల దూళి సేయుటకన్న రక్తబీజుని నేల రాయుకన్న
బండలలో నెల్ల బంటలు శుంభనిశుంభదైత్యుల వధించు పనికన్న

తే. గీ. నీకు నీసింగమునకును నేఁడు మిగులఁ
గష్టమగు పని పుట్టె నో కాళికాంబ!
అనృతము నడంపవలయుఁ, సత్యంబుఁ బెంప
వలయుఁ, గడు జాగరూకత వలయు జనని!

సీ. అదరిపాటున మీఁద మంటి కుంటిన కొప్పరంపుసంరంభంబు దింపినావు
గుంటూరిపురిలోని కొంటెవారలు పన్ను పద్ధతు లడవిపాల్పఱచినావు
అవధానమధ్యమ్మునందు లేచిన దుర్వాదుల గోల లంతలో నిలిపినావు
బ్రాహ్మణకోడూరఁ బరమోత్సవమ్ము గల్పించి మేనాల నెక్కించినావు

తే. గీ. అద్వితీయద్వితీయపార్థాభియాన
విక్రమోపక్రమము దలపింపఁ జేయు
నీకరుణ కేమి నిష్కృతి నేర్తుమమ్మ!
సరసతిరుపతివేంకటేశ్వరనియంత్రి!

సీ. దోమ యేనుఁగుఁ బట్టి దొరించె, నొకనక్క సింగంబు నెల్గెత్తి చీరి యెదిరె
పిల్లిజో డెదిరించి పెద్దపులిని జంపె, గొడ్రాలి కుదయించెఁ గొడుకుఁ గుఱ్ఱ
చెవులపిల్లికిఁ గొమ్ముకవపుట్టె,నాకాశమం దెన్నియేని హర్మ్యములు వెలసె
నంది యయ్యెను బంది,పందియయ్యెనునంది,యప్పాలుకప్పలై యాడఁదొడఁగె

తే. గీ. ననుచు వ్రాసెడి వ్రాఁతల నాదరించి
మంచి యిది చెట్ట యంచు నొకించుకేని
చర్చ సేయక ప్రకటించు చతురమతుల
నేమియన నేమియగు భవానీ! మదంబ!

చ. "అదె కనె దున్న దూడ" ననినంతన "గొట్టములోనఁగట్టు"మ
న్నది ధ్రువ మంచు నేఁటి మన యాంధ్రుల పత్రికలందుఁ దోఁచు, నే
రెది లిఖియించిరేనియు సరే యని పత్రిక నింపుకొందు, రొ
ప్పెది యెది తప్పటంచు గణియింప రొకింత యదేమి పాపమో! 231

ఉ. పత్రికలందు నేవిధము యవాకుచవాకులు వ్రాయు వాని సో
భారిత్రము నమ్మి పండితులుఁ బామరులుం గడు మోసపోదు, రీ
పత్రిక లెందుకో? నిజము పాడఁబు కాలము వచ్చెగాక; దు
ర్గాత్రము లివ్వి, వీనినకల్ కడు వక్రము లక్రమార్భటుల్.

ఉ. రాజులు చారచక్షులయి ప్రాణము లెంపటివేని దీసి, రా
యోజనె పత్రికాధిపతు లొక్కరి వ్రాఁతల విశ్వసించి య
వ్యాజయశస్కులన్ దొసఁగు లంటఁగఁజేయుదురీ హిమాని పా
థోజహితున్ దనంతఁ బిహితుం బొనరించినఁ జూత మంబికా!

ఉ. గవ్వను రత్నమున్ సలుపఁగాఁ గల రెవ్వరు! కొంగ హంసయై
నివ్వటిలంగఁ జేయుటకు నేర్పరు లెవ్వరు! కుక్క గోవుగా
నెవ్వ రొనర్ప నేర్తురు! యథేచ్ఛగ వ్రాతురుగాక, యక్కటా!
అవ్వకు జవ్వనం బొదవునా! ముసలయ్యకుఁబండ్లు వచ్చునా!

గీ. కవులమై పొందగా నెంత గలదో యంత
గౌరవమ్ము మును మున్న గాంచివార;

మిపుడు మా పేరఁ గల యర్థ మెల్లగతుల
సార్థకంబయ్యె నీసీమయందు జనని!

గీ. అక్క జంపు* గౌరవములు పిక్కటిల్ల
నచట మే ముండుతఱిఁ బత్రికాధిపతులు
పొరఁబడుచుఁ బ్రకటించునప్పు డొకకొన్ని
వ్రాఁతలంగూర్చి యిటు కించ పడఁగవలసె.

సీ. కలనైన సత్యపుఁగం పెఱుంగని పక్షపాతులెల్ల యథార్థవాదులైరి,
పూర్వపండితమార్గముల నెఱుంగని యసద్వాదులెల్ల యథార్థవాదులైరి,
పరమున్న దనెడి భావమె యెఱుంగని కూటవాదులెల్లరు సత్యవాదులైరి
యెఱిఁగియు నిదిగించు పరమకృత్రిమసార్వభౌములెల్లరు సత్యవాదులైరి,

గీ. మీకతమ్మున, మిమ్ము నమ్మితిమయేని
ఆఱు మూఁడగు మూఁడాఱు నగు ధ్రువముగ,
మిమ్ము నడిపించువారి లోపమ్ము మిమ్ము
గ్రమ్ముచుండెడిఁ బత్రికాకాంతలార!

---

(* 1911 సం॥ అభినవసరస్వతి 9-10 సంచికలనుండి)

గుంటూరు సమాచారము.

గుంటూరులోఁ గొందఱు పెద్దమనుష్యులు శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల నాహ్వానము చేసిరనియు అగష్టు 19-20 తేదీలలో సంపూర్ణ శతావధానము జరుగఁగలదనియు నా కొకస్నేహితుఁడు విలిఖించె. అందుపై 19వ తేదీకే పోవునట్టి ప్రాప్తిలేక 20 వ తేది గుంటూరుప్రవేశించి శ్రవణానందాద్యనేక గ్రంథపఠనముచే వారి విద్వత్కవిత్వాతిశయ మెఱింగియున్న వాఁడ నగుట ట్టి మహానుభావుల దర్శన మెప్పుడు చేయుదునా యను తత్తఱపాటుతో వారి బసకుఁ జేరుసరికి నాయింటిముందట బైస్కిలును గుఱ్ఱపుబండ్లును మూఁగియుండి యంతఃప్రవిష్టుఁడనగుటకే యతిశ్రమ పడవలసివచ్చి యెట్టకేలకు బ్రవేశించియుఁ గొంతకాల మీవలనే పడియుంటిని. అందుకుఁ గారణము వారిదర్శనమునకు వచ్చిన మహాజనుల సందష్టమే......మరల తిరుపతి వేంకటకవుల శతావధానములు బ్రాహ్మణకోడూరులోను దెనాలి, నరసరావుపేటలలోను జరిగి యీ ప్రాంతములఁ బలుమందిని నవధానసభలు సలిపింపఁ బురికొల్పుచున్నయవి. తథాస్తు, సర్వేజనా స్సుఖినో భవంతు.

గీ. అప్రయోజకుఁడగు పుత్త్రునందుఁ బత్తు
పాతమూనుట యది స్వభావంబె జనని,
కలుఁగుదురు నీదువాత్సల్య మెల్లవారు;
దేశమాతరో! నిన్ను నిందించు నెవఁడు.!

మ. ఘనతం బొల్చెడివారి నూరక శిలాకారమ్ములో గొంత లె
ట్టని పంకమ్మునఁ బోల్చి నీదరికిఁ జేర్పన్ నీవు గుర్తింప కెం
దును వారిన్ గుటిలస్థితిన్ సరసులంగున్ జేర్ప నీగుట్టు పె
ల్చనఁ దత్పంక మడంచి తేల్చుఁజుమి కృష్ణా! వారి యాథార్థ్యముల్.

ఉ. పత్రిక లేమి సేయు, నవి వ్రాయఁగ నేరవు; లోకులందు సౌ
భ్రాత్రము నుంచి వా రనుపువ్రాఁతలు సంగ్రహణంబొనర్చి స
ర్వత్ర చరించుచుండు, నల వారలు మోసము చేసిరేని త
త్కృత్రిమతావిశేషము నొగిన్ గన లే వరయున్ గ్రమమ్ముగన్.

గీ. మొదటఁ బొరఁబడి పత్రికల్ పిదపఁ గన్న
దెలిసి వచ్చినవ్రాఁతల తెఱఁ గెఱింగి
'బుట్టదాఖలు' సేయుదుఁ బుట్టె నంత
లోన "దర్బారు" మముఁ దిట్ట బూని జనని!

చ. ఇతరులవ్రాఁతలంగుఱిచి యించుక తెల్పితి మింతవట్టుఁ ద
ద్గతమగు మంచిచెడ్డలను గాంచితి సంబరో! యింకఁ గొప్పరపుం
జతురుల తప్పుఁ * బ్రల్లదపుఁ జాతురి కొండొకచూపి వార్ పలా
యితులగుటన్ గుఱించినది యింకొకచో వివరింతు మంబికా! 242

---

## కొప్పరపువారి తప్పువ్రాఁతలు.

* శ్రీరాములు.

కొప్పరము- సంతమాగులూరిపోస్టు,

**24-7-12.**

సుహృద్వర్యులును సకలగుణగణాలంకారులును విద్యాభిమానులును బ్రహ్మశ్రీ...శర్మగారిసన్నిధికి - నమస్కారపురస్సరముగా చేయువిజ్ఞాపనము

మేధానిధీ,

తమరు వ్రాయించిన యుత్తరమును పద్యములనుజూచి పరమాహ్లాదము నొందితిమి. మేము కాకినాడనుండియే బ్రహ్మశ్రీ కోన వెంకటరావుగారికి

చ. జవరము లై లిఖించియు సభాస్థలికిన్ జను దేరలేమి ము
న్నవమతి కగ్గమై యది స్వయంకృత దోషముగా నెంచింగి, బం
ధువులది గప్పిపుచ్చుటకుఁ దోఁచినసాయ మొనర్చుచుండ, నో
రు విడువఁజొచ్చెఁ గొప్రియు వరుల్ తనదబ్బఱ లేవగింపఁగన్.

క. 'రాజీ' యను చోఁక రాకడ, గాఁ జనుదెంచుటయు, మేము గాదనుటయు వా
రాజికి రాఁజాలమిని బ, రాజితు లగుటయును దబ్బఱలకుం బ్రదిప్పెన్. 244

చ. ఇదె మొద లెంత తప్పులిపికేనియుఁ గొప్రియు సిద్ధమయ్యెఁ గొ
న్నిదినము లేగుమీఁదఁ దమ నెయ్యపుబంధులతోడఁ బెండ్లికిన్
గదలియుఁ గాకినాడ చని 'కాళ్లకు' రాతనిఁ గూడి వారు ప్ర
ల్లదములా! రామకృష్ణకవులన్ గడుయోగ్యులఁ జేసి పుచ్చెడిన్.

---

జాబు వ్రాసినప్పుడే తమకుగూడ యొకటి వ్రాసితిమి. అది యేకారణముననో చేరలేదని తమ జాబువలన గ్రహించితిమి.

మన కోన వెంకటరావుగారి సభానంతరము మణికొండసంస్థానాధిపతిగారు తమ కుమార్తెకళ్యాణమునకు సమాహ్వాన మొనర్పగా వెళ్ళితిమి. అచ్చటి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కవిరాజుగారగ్రాసనాధిపత్యము వహించిరి. ఆసభలో రాజాగారు 232 రూ బహుమానముగా నంపిరి కవిరాజుగారు పద్యగౌరవ మొనరించిరి అచ్చటనుండి నిడదవోలుకు - పండితసభకు వెళ్ళితిమి. అచ్చట చిలకమర్తి లక్ష్మీనరశింహ్వంగారగ్రాసనాధిపత్యము వహించిరి. చంద్రారెడ్డిగారు రు 116 లు బహుమతి యొసంగిరి. అచ్చటినుంచి కాకినాడకు గంజాం వెంకటరత్నం పంతులుగారి యింటికి వివాహకార్య (చర్చికా) హూతులమై వెళ్ళితిమి.

ఆ వివాహగృహంబున బ్రహ్మశ్రీ దురిసేటి శేషగిరిరావుపంతులుగారి యొక్కయు బ్రహ్మశ్రీ కస్తూరి శివశంకరశాస్త్రిగారియొక్క (అ) గ్రాసనాధిపత్యము క్రింద సభజరిగినది.

ఆసభకు శ్రీపోలవరపు రాజాగారు వచ్చిరి, జడ్జీలు మొదలు సమస్త ఉద్యోగస్థులును సభను నిండిరి.

ఆసభకు తిరుపతిశాస్త్రి నెందరు పిలిచినను రాలేదు. ఆ తిరుపతిశాస్త్రి గుంటూరులో రంగావ (ధ్య) ల హనుమయ్యగారి యింటియొద్ద ప్రాణమిత్రులు పోగైయుండగా కొప్పరపుకవులు గోదావరి (తః) దాటివచ్చినట్లయితే బుఱ్ఱ

క. ఆటఁ దవబోళ్ళలి పాటకు, నఁట! పేమిఁదుపురము వెళ్లమఁట! తమకుం జం
కుటచేతనఁట! యిట్లని, కటువుగ ఁటనఁబు నింపఁగాఁదొడఁగి రొగిన్.

క. తిరుపతినఁట! సభలోనఁట!, దురుక్తులను జెట్టి కిట్టు దూఱిరఁట! యతం
డరయఁగ నేటికిరాఁడని, తిరస్కృతిన్ జూపిరంట! తెలియు నిఁదల్లన్.

---

గౌరిగించెద" నని చెప్పెనట. ఆమాట వినిన వారమగుటచే ఆసభలో జ్ఞప్తికివచ్చి అతడు సభకు రాకుండుటను విచారించి,

గీ. బుఱ్ఱ గౌరిగించెద నటంచు బొఱ్ఱబలిసి
యెవ్వడో పల్కెనట తొల్లి హీనుడగుచు
కంచుదివిటీని వెదకిన గానరాడు
ప్రాణముండెనొ లే, దొక్కొ! పశువొ, నరుడొ!

అని చెప్పితిమి. అప్పుడు తిరుపతిశాస్త్రి యొక్కడే కాని వెంకట శాస్త్రి లేడు. ఎండకాలపు సెలవులగుటచే బందరునుంచి ఇంజరము నతని స్వగ్రామమును వెళ్ళినాడు; వెళ్ళి తిరుపతిశాస్త్రికి, కొప్పరపువారు కాకినాడకు వచ్చి సభలుచేయుచు సభలలో నెట్లు ప్రసంగించినను, నేనులేనిది-సభకు నీవు వెళ్లవద్దు అని జాబు వ్రాసినాడట. అందుచేత తిరుపతిశాస్త్రి సభకు రాడయ్యెను.

2 వ సభ శ్రీ పోలవరపు రాజాగారును అనగా తిరుపతిశాస్త్రిని యుంచుకొనినవారు, దివాన్ బహద్దరు దురిసేటి శేషగిరిరావుగారును రావు బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి గారును కలసి ఆ పిఠాపురంరాజాగారి కాలేజిలో చేయించిరి. ఆసభకు 2 వేల మందికి పైగా సభ్యులు చేరిరి. జడ్జీలు కలెక్టర్లు, తహశ్శీలుదార్లు, ప్లీడరులును మఱియుితరులైన యుద్యోగీయులనునిండిరి. ఆసభ కగ్రాసనాధిపత్యము పోలవరపు రాజాగారే పొందిరి. (ఆ) గ్రాసనాధిపత్యము బ్రహ్మశ్రీ వంకా వెంకటరత్నశాస్త్రిగారను పెద్దపండితుడుగారు బొందిరి. ఆసభకు ముందు రాజాగారు తిరుపతిశాస్త్రిగారును తమ దివాణములోనుండ సభకు తిరుపతిశాగారిని రాజాగారు రమ్మని కోరితే ఆయన ప్రత్యుత్తరము.

రాజా—ఏమండీ తిరుపతిశాస్త్రిగారూ! సభకుబయలుదే (రమా)?

తిరు—సభ యెవరిదండీ?

రాజా—కొప్పరపు సోదరకవులది.

తిరు—అటులైతే వారిసభకు నేనురాను.

ఉ. ఇంతటి గొప్పఁ జేసితిమి యే మని చాటుగ వీరలొక్క ధీ
మంతునికిన్ లిఖించి రది మాకెటులో లభియించె నిక్క మిం
దెంతయు కల్పితం బదియు నెంతయు పోలవరప్రభుండు ధీ
మంతులు తక్కసభ్యులును మాటికిఁ జర్చ యొనర్పఁగావలెన్.

క. నిక్కముగ వీరియుత్తర, మక్కట! నీచాతి నీచమై యున్నది యా
వాక్కులకు సైఁచు గౌరవ, భాక్కులు సభ నుండరంచుఁ బలికెద మంబా!

---

రాజా:- ఎందువల్ల రారు?

తిరు:- నేను రాఁదలఁచుకొనలేదు.

రాజా:- శాస్త్రిగారూ! మొన్న కవీశ్వరులను మాయింటికి నేను విందునకు పిలచితినిగదా! ఎల్లప్పుడును నాయింటిలోనే భోజనము చేయుచుండే తమరు భోజనమునకు సపంక్తికిరాక "భోజనమున కీపూట యెందుకురా లేదండి" యని నే నడిగితే, "నిన్న జ్వరమువచ్చినది, యీదిన ముదయమున పత్యపుమెతుకులు తిని నా" నని యేదో సమాధానము చెప్పితిరి గంజామువారింటిసభ కెందరు వచ్చి పిలిచినను రాకపోతిరి. ఈ సభకు 'రమ్మ'ని నేను పిలుచుచుండగా రాదలంచుకోలే దనుచుంటిరి. ఇది యేమి సరసముగా లేదే.

తిరు:- సరసముగా లేకేమిలెండి.

రాజా:- శాస్త్రిగారూ! తమరు గుంటూరులో కొప్పరపు కవులు గోదావరి దాటి వచ్చినయెడల బుఱ్ఱగొరిగించెదనని అనినారట నిజమేనా, మీరట్లా అనవచ్చునా?

తిరు:- సరి, సరి, బాగావున్నది. ఆమాట గుంటూరులో ఏగాడిదన్నాడు. నేననలేదు.

రాజా:- మీరన్నారో అనలేదో, గంజాంవారింట సభలో వేయిమంది వినుచుండగా,

సీ. "బుఱ్ఱగొరిగించెదనటంచుబొఱ్ఱబలిసి, యెవ్వడో పల్కెనట తొల్లిహీనుడగుచు
కంచుదివిటీనివెదకిన కానరాడు, ప్రాణముండెనో లేదొక్కపశువొ నరుడొ"

అని పద్యముచెప్పి కొప్పరకవులు సింహగర్జన చేసినారు. పద్యము చెప్పినట్లు మీరు విన్నారా, లేదా?

తిరు:- విన్నానులెండి.

క. ఈపదము వ్రాంత తమకే, కాపురుషత గలుగఁ జేయుఁ గాని పద్యుకి రా
నోపదనుచు లిఖియించిరి, పాపము! పాపంబు డాఁప బ్రహ్మవశంబే!

---

రాజా:- మీరు గుంటూరులో చాటుగా అంటే, కాకినాడకు వచ్చి నిర్భయముగా వారు సభలో పరితాపమును సాటించిరి. ఆపద్యమును వింటే మాపంటివారికే కఠినముగా దోచినది. ఇక మీ కెట్లు యుండవలెను.

తిరు:- తమరు మరల ఆప్రసంగమే యెత్తితే యెట్లు! అన్నవాడు గాడిద అని అంతవట్టు వేసికొంటినిగదా! ఇకనైన నమ్మరా?

రాజా:- దానికేమి, పోనివ్వండి; ఈసభకు మీరు రాకపోతే బాగాయుండదు.

తిరు:- బాగుండకేమి, యీసభకు రాకపోతే మనకేమితక్కువ?

రాజా:- ఈమాట చాలా సంతోషమే. ఈసభ యెవరిది? మనది కాదా! మేము చేయించే సభలో మా ఆస్థానములో నున్న మీరురాకపోతే సభ్యులిదివరకే అనుకొన్నదానికి నిదర్శనముగా నున్నదని వివ్వుల నెట్లు అంటారో మీరెఱుగుదురా?

తిరు:- ఇదివర కేమనుకున్నారు?

రాజు:- "కొప్పరపుకవులే సమర్థులు కావున రంకెలువేయుచున్నట్లు సభలో నిర్భయముగా నిట్లు చెప్పుచున్నారు; పెద్దవారు కనుకను, కవితాసామర్థ్యము మేధాసామర్థ్యము తప్పిపోవుటచేత, తిరుపతిశాస్త్రిగారు అసమర్థులవలె సభకు రాలేదు" అనుకున్నారు. ఈ మా సభకు గూడ రాకపోయిన తప్పక అసమర్థులని అనరా?

పరు:- ఎవ రేమనుకుంటే మన కేమిలెండి.

రాజు:- అసూయగా మొండివేస్తే రాజకూడదు, అన్నట్లు భయగ్రస్తులైన బలహీనులంతే అనేది. ఎందు కింత భయము?

తిరు:- భయములేదు కాని, మా వెంకటశాస్త్రి 'పోవద్దు' అనిజాబు వ్రాసినాడు.

రాజు:- జాబేది?

తిరు:- (జాబుతెచ్చి చదివి వినిపించును)

రాజు:- వెంకటశాస్త్రిగారు సభలో కలహమగునని వద్దనెను కాని వేరుకారణము కాదు. నేనున్నాను, మీకుపనివాలేదు. రాండి.

తిరు:- రాను లెండీ.

రాజు:- రాకపోతే మీరు భయపడినారు. ఓడిపోయినారు.

మ. సభకున్ దిర్పతి పోని మాటనిజమే; శత్రుత్వమున్నప్పుడా
సభకున్ బోవఁగ నేల? యింతకుఁ బరీక్షాసంగతింబట్టి యా-
సభ యేర్పడ్డది యొక్కొ? మున్నువృథగా "చాలంజి" తూలించి పా
ఱు భయభ్రాంతులు పాడు పాటలు వినన్ రోఁ తొఁగదా! శాంకరీ!

---

తిరు:- మీరేమన్నా అనుకోండీ.

రాజు:- ఇక మేము వెళ్ళవలసినదే (నా) యీదినము 5 గంటలకు సభ అని నోటీసులలో అచ్చుపరిచితిమి, 6 గంటలైనది.

తిరు:- నేనొక కథ ఇచ్చెదను. దానిమీద గంటకు 50 పద్యముల చొప్పున చెప్పితే నా జందెములు తీసివేసుకొంటాను.

రాజు:- ఏమి కథ?

తిరు:- భీష్మజననము.

రాజు:- దీనిలో నేమి కష్టము?

తిరు:- అట్లా అనకుడు. గంజాము వారింటిలో సీతాకళ్యాణము శ్రీరవ (ర్గ) (పురవర్ణన వనవర్ణనలు) ఇదివరకు వారువర్ణించుకొన్నవే చదివిరి. భీష్మ జననములో మాటకులేదు కాబట్టి దీనిమీద 50 పద్యములు చెప్పలేరు చెప్పితే జందెములు తీసుకుంటాను.

రాజు:- పందెమునకేమి, వద్దు. రండీ!

తిరు:- నేనురానుకాని అది అడుగండీ!

రాజు:- ఇంతమాత్రానికింత బింకమెందుకు అని 6 గంటలకు సభకువచ్చిరి వారే (ఆ) గ్రాసనాధిపతులు. ఉపాగ్రాసనాధిపతులు వంకా వెంకటరత్నప్పశాస్త్రి భీష్మజననమే కోరిరి, దానిమీద గంటకు 3, 4, 5 వంద చొప్పున చెప్పితిమి. సభ్యులందరు పరమానందాశ్చర్యము నొందిరి. పలువు రుపన్యసించిరి. కవులనేకులు పద్యములు చెప్పిరి ఆకవులలో తిరుపతి వెంకట కవులకు తెలుగునకు గురువుగల్గె. ఆంధ్రపాణినీ (య) ధ్వ బిరుదాంకితులైన బ్రహ్మశ్రీ పాటి వెంకటస్వామినాధగారును ఉత్క (న) దేశబ్రాహ్మణుడు గూడ మిగుల స్తుతించెను. వారి పద్యములలో నొకటి ఇందుదహరించితి.

మ. యతియే యుండదు ప్రాసమే గదియ దేయంశంబునం దన్వయ
స్థితియే లేదు సమాస మిల్ల యని విద్వేషంబుతో బల్కు పం
డిత కాకంబుల దుష్ప్రలాపములు శాంతింబొందెడున్ సభ్యులై
ప్రతతాశూక్తులఁ గొప్రపుంగవుల కావ్యంబింత యాలించినన్. 258

ఉ. పోలవరంపు ఱేఁ డరిగి ప్రొద్దుట మెచ్చిన మెచ్చు విన్నచోఁ
జాలదె? యాతఁ డే మనెనొ; సత్యము నీహృదయం బెఱుంగు; నా
శీలవదగ్రగణ్యు కడఁ జెన్నలరాడెదు వా రెఱుంగుదు
ర్గ్గోలయుఁ గూడఁ గైత యను కోవిదుఁ డాతఁడు గాఁడు శాంకరీ!

---

ఇట్లు పేకులు చదివిరి ఈలాటి పద్యములు శత్రువుల హృదయములకు బిడుగులుగదా!

వికృ (రు) సమాపమునియు అసూయాగ్రస్తుల మాటలు పాటింపరాదనియు మిగుల శ్లాఘించిరి. వెంకట రత్నప్పశాస్త్రిగారు సరస్వతీస్వరూపులే యని స్తుతించిరి తరువాత సభ్యచిత్తానుసారము గారు 2 నూటపదులు 2 బంగారపు బతకములు యివ్వంబడెను.

సభాంతము మేము చెప్పినపద్యములు.

సీ. జండెంపు బందెంబు సంధించువారల జాడింపమే సభాస్థలికిజేర
తొడదట్టి కడు మిట్టిపడునట్టి వారల జాడింపమే సభాస్థలికిజేర
మీసాలపందెంబు వేసి దూకెడి వారి జాడింపమే సభాస్థలికిజేర
గోడచాటునజేరి గోళ్ళు గిల్లెడి వారి జాడింపమే సభాస్థలికిజేర

గీ. అరయ పదియవనాటి ముత్తైదు వలన జాటు మాటున జేర వాచాటులగుచు
వాఁగు టిదిమేల సత్సభాభవనమునకు వాడిమైచేర (ని) గ్గిపోపలయు గాత.

ఉ. ఆతడు మూతిమీసముగలట్టి మగన్నయె యయ్యోనేని తా
నీతతి వచ్చి సత్సభ నహీనగతిన్ జయమందవచ్చుగా
(1)కోతివిధాన నెంచు సొరకో తలు కోసినలాభమేమి, యీ
భీతియె తొల్లియున్న నిటు పెప్పప కొమ్మెకొ యంట గల్గునే.

అనియిట్లు పలుపద్యంబులు చెప్పి ద్వైపాయన (హ్ర) దము నందు (2) దుర్యోధనుడు (లే) చిడాగగా ధర్మరాజాదులెట్లు పలికిరో అట్లే పలికితిమి, కాని ఆదుర్యోధనుడు మానధనుడగుటచే హ్రదమును వదలి యుద్ధమునకు వచ్చెను. తిరుపతి శాస్త్రి తద్వ్యతిరిక్తుడగుటచే సభలో నెన్ని యనినను యెవరెట్లు పలికినను ఒకమాటైనను మాటాడక నింటిలో యుండెను. ఆసభ ఆప్రకారముగా జయజయేతి శబ్దంబులతో ముగిసెను.

పిదప వెంకటశాస్త్రి ఇంజరమునుండి తిరుపతి శాస్త్రిచే బిలువనంప బడివచ్చెను. అతను వచ్చిన తరువాత శ్రీపోతాప్రగ్గడ బ్రహ్మానందరావుగారింటిలో మరియొక సభ.

చ. ఘనులగువారి లక్షణ, మొకానొకఁ డేదియొ విద్దె చూప నె
మ్మనమది రోయుచుండినను "మంచిగ నున్న" దటంచుఁ బైకి మె
చ్చును గనఁ జేయుటేగద ; యశోభరితుం డగు కృష్ణరాయధీ
ఘని మనవారియాశువును గాదనునే సభలోన శాంకరీ ! 254

ఆసభకు తిరుపతికిని వెంకటశాస్త్రికిని అందరికి బంపినట్లే ఆహ్వాన పత్రికలు బంపిరి. ఆఆహ్వానపత్రికలు తీసుకొని వెళ్ళినవారితో మేము రామని చెప్పిరి.

ఆసంగతిని విని బ్రహ్మానందము గా (నే) వెళ్ళిపిలిచిరి. పిలిచిన రామనిరి. అంతట శ్రీవేంకటస్వామిపాఠీగారును మరికొందరును కలిసి వెళ్ళి పిలిచిరి మేము రామనిరి. అప్పుడు వెంకట స్వామిగారికిని వారిలో వెంకట శాస్త్రికిని జరిగిన సంభాషణ

వెంకటస్వామిగారు:- వెంకటశాస్త్రిగారూ ! మీ రెందుకు సభకు రాకండి?

వెంకటశాస్త్రి:- మేము రాము.

వేం॥ స్వా:- తిరుపతిశాస్త్రిగారు వెంకటశాస్త్రిగారు పోవద్దని యుత్తరము వ్రాసిరి కనుక నేను రానని కాలేజిలో జరిగిన సభ నా దని నాయకద! యీదినము మీరిరువురును ఉండి రామని యనుటకు కారణమేమి?

వెం॥ శాస్త్రి:- ఎందుకో రామన్నాము, అది మీకెందుకు?

వెం॥ స్వా:- మీరు మాకు మిత్రులగుటచే మిమ్ములను యీబాలగోపాలము "కొప్ప రకవులను చూచి తిరుపతి వెంకటకవులు భయపడినారు. కనుక నే రెండు సభలలో వారు వీరిని ప్రతాపోక్తులబలికి సభకు రమ్మనియు దానిలో పడియఁ నాటి ముత్తయిదువలనియు నతికఠోరముగా బలి్కినను రాలేదు. యింతటి అసమర్థులగు తిరుపతి వెంకటకవులు కొప్పరకవులమీదికి కాలు ద్రవ్వుట ఎందుకు" అని ఎచట చూచిన మిమ్మును దూషించుచుండుటచే మేము విని సహింపలేక మేము పిలుచుచున్నారము.

వెం॥ శాస్త్రి:- ఎవరెట్లు అనుకున్న మాకేమిగాని నేను ఒక ప్రశ్న యిచ్చెదను అది ఆనాటిసభలో గంటకు పదిపద్యములచొప్పున చెప్పినయెడల నేను చెవిని కోయించుకొనెదను.

వెం॥ స్వా:- ఆహా, మీతిరుపతిశాస్త్రిగారు జంటెంబులపందెంబులు వేసుకొనిరే! అంతే, మీ చెవుల పందెము.

ఉ. ఆయనగూడ సభ్యుఁడయి యందఱిలోఁ దల యూఁచెనంట! యా
రేయి మొదల్ సదా హృదయరీతి వెలార్చుచునుండు శాఖ;కై
సాయము సేయ నెంచుచు వసత్యపు మెచ్చులు మెచ్చువారిలో
వాయనఘుండు చేరఁడు యథార్థము పల్కఁగ వింటి మంబికా! 255

వెం॥ శా:- అట్లాగా - మా తిరుపతిశాస్త్రి పిచ్చివాడు గనుక సకలవర్ణనములు గల కథ కోరెను. నేనుకోరునది అటువంటిది కాదు.

వెం॥స్వా:- అది యేకథ చెప్పండి.

వెం॥ శా:- అభిమన్యు వధ.

వెం॥స్వా:- ఇదికష్టమే, అయిన వారి కొక లక్ష్యముగాదు.

తిరుపతి:- ఏమండో వెంకటస్వామిగారు, యీకథ భీష్మజననము వంటిదికాదు. మావెంకటశాస్త్రి కోరినది, అభిమన్యుకథ అండో.

వెం॥స్వా:- యేది యెట్లయినను తమరు రండీ.

తి॥వెం:- మేమిద్దరము రాము.

వెం॥స్వా:- రాకపోతేమీరు వోడిపోయినట్లే

తిరుపతిశాస్త్రి:- అంతేకాని మీరుపొండి

వెం॥స్వా:- పోతే తప్పదు చెవులు వూరుతుందిలెండి, అని వచ్చిరి. ఆసభలో గంటకు 500 లైన చొప్పున పద్యములు చెప్పితిమి బహుమానము జరిగిన పిదప

గీ. ఘోరసింహం (బు) లట్టుల కొప్పరంపు
కవులు చనుదెంచి నాటి (రీ) కాకినాడ
యందు కవితో (న్న) తిని విజయ (3) ధ్వజంబు
మి (న్న) యై దీని పేరు మగ (న్న) యొకడొ.

క. కట్టితిమి విజయఘంటిక, మొట్టితి మదివరకు (ను) కవిమూ (ర్థ) ము లగలఙా
బట్టితిమి కాకపురి జను, మట్టిప్పవరాని మీవ (యా) శక్తి శివా !

గీ. కొండవీటి మహాగుహా కూ (ర్మ) జెందు
సింహములు రాగ నీగ్రామ సింహములకు
బ్రతుకుఁ దెరువును వర్తన పరిధవిలునె!
చాటుమాటున మొఱుగుటే జరుగుగాక.

ఇట్లనేక పద్యములు చెప్పితిమి. యీసంగతినివిని మరునటి దినమునం దెవ్వరితో చెప్పక నె తిరుపతియు వెంకటశాస్త్రియు ఇంజరమను గ్రామమునకు వెళ్లిరి. ఆగ్రామము కాకినాడకు కొంచెము దూరము.

ఉ. ఆయనయాజ్ఞ మీఁద నిటు లంబరొ! వ్రాయ; మసత్యమైనచోఁ
'జీ' యనుఁ గాక మమ్మను సుశీలుఁ డతం; డిది నిక్కమేని యా
ధీయుతుఁ డూరకుండుతఁ; గుశీలుర గోల లడంప సాక్షిగా
వ్రాయు మముక్ మదిక్ విమలవంశజుఁ డా యనఘుండు సైఁచుతక్.

---

పిదప, పైడా అయ్యన్న శ్రేష్ఠిగారు తమగృహమున నొక సభజేయిం పగా నచ్చటి కింజరమునుండి వెంకటశాస్త్రి తనమిత్రులను కొందరిని పంపిం చెను. ఆ సభాధిపతి "తిరుపతిశాస్త్రి మిమ్మన్నమాటకు మీరుబదులు ఏమిచెప్పి తని"విని యడుగగా,

గీ. బుఱ్ఱగొరిగించి సున్నపు బొట్లు పెట్టి
ఖరము నెక్కించి యూరేగగానొనర్చి
మాలదాసులు'ఛీ'యని గేలిగొట్ట
తిరుపతిని వెంకటన్నను త్రిప్పినా (ము.)

పిదప, కాకినాడపురలక్ష్మిచేత సెలవునొంది, నిడదవోలు వచ్చుసరికి తణుకు, నర్సాపురము, భీమవరము కరణములు జమాబందికిరాగా అచ్చటి డిస్ట్రిక కలెక్టరుగారు తమవలెనే వివిధోత్సవములతో మిగుల గౌరవించెను. పిదప ఇంటికి వచ్చి కుశలముగానుండి నారము. మేము ఇంటికి వచ్చి తమజాబును పద్యసముదయమును జూచి పరమానందము జెందితిమి. తమరు కవిత్వపరిశ్రమ జేయుటగూడ మాకు చాలా ఆనందముకలిగించినది.

గీ. షట్సహస్రి నియోగి వంశజులయందు
శ్రేష్ఠపదవి వహించి ప్రసిద్ధికెక్కి
తనరు మీ క్షేమలేఖ మోదంబుగూర్చె
నయుదయా కర్మ శ్రీ......శర్మ.

చ. నరుఁడయి ధాత్రియందు జననంబయినాడని యన్నమాత్రి సం
బరమగునే, నయోన్నతియు భాగ్యము సాహసముక్ వదాన్యతా
పరిణతియుక్ బొసంగవలె వంశము వృద్ధినొనర్ప గావలెక్
హరువుగ........యివియన్నియు గల్గెను నీకు మేల్ బళీ!

క. మెచ్చితిమి మీదు కవనము, మెచ్చితిమెద నీనయంబు మెచ్చితిమింతే
హెచ్చగు నీయభిమానము, నచ్చినవేమకను:.................సుధీరా!

ఉ. ఆరతి వీరికైత విని యాతఁడు చెందిన యేవ మంతయుఁగ్
వ్రాఁతుమటన్నఁ దోలవలె బండ్లను గాగితముల్; వివేకితా
ఖ్యాతుఁ డతండు వీరి నడుగం దగుమాటలు పృచ్ఛ చేసె, వీ
రాతని కేమి చెప్పిరొ రహస్యము తల్లిరో! నీ వెఱుంగవే! 257

---

ఈవార్తను ప్రాజ్ఞులును బంధువులును యనవద్యులును నైన బ్రహ్మశ్రీ రామబ్రహ్మముగారికిని, బ్రహ్మశ్రీ ఉలిమి పిచ్చయ్యగారికిని, బ్రహ్మశ్రీ మునిపల్లె వెంకటసుబ్బయ్యగారికిని, శ్రీ లింగయ్యగారికిని, శ్రీ వేంకటేశ్వర్లుగారికిని, స్కూలుమాష్టరులకును వన సర్వమిత్రవర్యులకును వినిపింపగోరెదను.

మీ అల్లుడుగారును నయశీలురునైన శ్రీ........గారియొక్కయు పుత్రికా పుత్రకులయొక్కయు మన బంధుమిత్రుల కుటుంబవృద్ధి యొక్కయు కుశలము వ్రాయించగోరెదను. చిరం॥ మా తమ్ముడు వెంకటరమణశర్మ ఒక అవసరముచే చెన్నపురికి వెళ్ళినాడు. ప్రస్తుత మనావశ్యమని తోచి యచ్చటనే యుంచితిని. తాము కవితావృద్ధి నొనరించి సంతోష మొసంగుడు, మేమందరము కుశలము. కొన్ని యాహ్వానములు వచ్చుచున్నవి ఇప్పుడు వెళ్ళము.

చిత్తగించవలెను

కొ॥ వెంకట సుబ్బారాయశర్మ,

(అనియున్నది)

వర:— ఇట్లు తిరికూర్చుండి తమయొక్కయు సత్ప్రభులగు కొండలు శాఖాభిమానుల యొక్కయు మనస్తుష్టికై కల్లబొల్లి వ్రాఁతలను నింపుటయేకాక అంచితరులను బూర్తిగా దూషించుచు నుత్తరకుమార ప్రజ్ఞలను నెల్లఁ గక్కుడి యీ మా సోదరుల వ్రాఁతలను విమర్శించుభారము ను లోకమునకే వదలుచున్నారము. ఇందు "పాడి వెంకటస్వామిగారు చెప్పిన" దని వ్రాసినపద్యములో "పండిత కాకంబుల" అనుమాట మనోరంజని పాఠముకన్న భిన్నముగాఁ గన్పట్టుచున్నది. దీనింబట్టి మొదటి పాఠ మిదియే యనియుఁ బిదపఁ బత్రికా సంపాదకుఁడు గారు 'కాకాయిత' అని దిద్దియుందురనియుఁ దెలియనయ్యెడిని, మఱియు వీరు రహస్యముగా వ్రాసిన యీయుత్తరము నందలి సదుద్దేశములను వీరు దర్బారులోఁ బ్రచురించిన జ్ఞానోపదేశమునందలి ముద్దుఁబలుకుల నుండియు, మఱియుఁ గాకినాడ సభలోఁ జెప్పినట్లు మనోరంజనిలోఁ బ్రచురింపఁబడిన పద్దెము నుండియు మఱియుఁ గాకినాడనుండి వీరు బయలుదేరి వచ్చునప్పుడు రచించిన సీసగీతపాదమునుండియు నెత్తిచూపుచున్నారము.

చ. అటు కడు దైన్య మయ్యానఘు నగ్రమునన్ బచరించి యాత! పి
మ్మటఁ దకటొంకు లాడు నల మానినులన్ సమయంబు వచ్చుచోఁ
బటుమతి కృష్ణరాయనరపాలుఁడు బైటికిఁ బెట్టెఁడొక్కొ! త
క్కటి ప్రజ యాతఁ డెన్నఁటికిఁ గాఁడని వ్రాసితిమంబ! యింతయున్.

ఉ. వ్రాయక మానుటే మెఱుఁగు, వ్రాసిన లాభ మొకింత లేద, యా
ధీయుతుఁడే వచింపవలెఁ దెల్వి జనింపవలెన్ మొగాల, కీ
వ్రాయుట యెంత? యిం దెదియు వ్రాయఁగలేక యొపోతి మాతఁడే
సేయవలెన్ ప్రసంగ, మటు చేసినచో విని తీరఁగావలెన్. 259

---

(1)॥...ముష్టి చెం। బుంగొని పెట్టుమం చడుగఁ బోతిరొ తిర్పతివేంకటేశ్వరుల్.
(2)ఉ॥...వెట్టిచేష్టలన్। జేసితి రిద్దివానిఁ గలశేషము తిర్పతివేంకటేశ్వరుల్.
(3)ఉ॥ మీకొఱగాని కృత్యములు మీ చెడుపోకలు నెంచలేద! మీ
కాకులగూడు పొత్తములగాను ఘటింపఁగఁ బూనలేద, మీ
చీకులుఁ జింతలున్ బయలు చేర్పఁగ నూకొన లేద యెందుకీ
కాకరుతంబు లేటికి నగన్ గొన దిర్పతి వెంకటేశ్వరుల్.
(4)చ॥...చంకదుడ్డు శరణార్థులు తిర్పతి వేంకటేశ్వరుల్,
(5)చ॥............................కాకరపత్రిని శృంగభంగమై
పసావును మాపటో నిజముఁ బల్కుఁడు తిర్పతి వేంకటేశ్వరుల్.
(6)చ॥...రావణ కుంభకర్ణుల, న్యుల యభివృద్ధి కించుకయు నోర్వక...యే,
యొలమిని గాంచి రద్దిగ్రహీయించుఁడె తిర్పతివేంకటేశ్వరుల్॥
(7)చ॥...అ, జ్ఞత చెడ నిక్కుసురిక్కితిరి గాకట! తిర్పతివేంకటేశ్వరుల్
(8)చ॥ సి, గ్గును గనకేల డంబమును గొట్టెదరు...తిర్పతివెంకటేశ్వరుల్
(9)చ॥...కొరవు లేనియైరొకో తెలియుఁడు ... తిర్పతి వేంకటేశ్వరుల్
(10)ఉ॥...నాటిసభ నెల్లరు మిమ్మ్ఁ బరాభవింప మా, చేసిన సాయమున్
మఱవఁ జెల్లునె జన్మశతాలకేనియున్.
(11)ఉ॥...నేఁడిటుల పేర్లిఁగ నెవ్వరి యూఁత దెల్పుఁడీ!
(12)ఉ॥ ప్రాసములున్ విరామములు పాడొనరించుచు బూతుపద్దెముల్
వ్రాసిరి నాటకంబులుఁ ప్రబంధములంచని పేరుఁ బెట్టి యు
ద్వాసన మాచరించి రలప్రాక్కవి మార్గము లట్టి వీరి కీ
రోసములేల యటంచు మిము రోయరె తిర్పతి వెంకటేశ్వరుల్!
(13)ఉ॥ కాఁకగపత్రియే సలిపె గర్వము మానిపి శృంగభంగమున్
కాకులయట్లు బాఱఁగఁ జికాకొనరించెను బైడిపాడు పై

క. తామేమో తమపాట్లకు, నై మాటికిఁ బడెడిపాటు లవి చెడగొట్టం
గా మేమరుగుదుమె సభ, కేమీ ధ్వజమింతమాత్రకే నాటెరిగా !

క. విజయధ్వజ మెత్తితి మని, బుజము లెగరవేసికొంచుఁ బొడిమాటలతో
గుజగుజలు వోవుచుంతనె, నిజ మెట్లో పయికివచ్చి నెగడకయున్నే !

---

యాకులపాటుఁ దెచ్చి బలమంతయుఁ బాపెను గొప్పరం బొఁకన్
గూకలు మాని యెందొ తలఁ గ్రుక్కుడు తిర్పతి వేంకటేశ్వరుల్ !

(14)మ॥...ఎందుగండి కవులారా !

(15)మ॥...మీ, యసమర్థత్వము దుర్జనత్వమిఁకఁ గట్టా ! సేగిసంధింపదే.

(16)సీ॥...మిమ్మ బొమ్మలఁజేసి (1) తిమ్మాటలాడించి పోరుఁ బెంచిన...
(ఈప్రల్లదములకు, 1912 సం॥ జూను 18-19 సంచికలు దర్బారు చూడుడు)

(17)ద॥...తిరిపపుఁ (1) దిమ్మపోతరముదింపిజయంబిడుమమ్మ శాంభవీ" (15 వ జూలై 1912 సం॥ 8 వ సంచిక మనోరంజని )

(18)సీ. గీ. "మహిమ నీకాకినాడ నస్మద్విజయపు। (3) ధ్వజము నాటించి తీవె శ్రీవాగ్భవాని" (చేగంటి బాపిరాజుగారు ప్రకటించినపుస్తకము.)

(19) " గీ. రోస మున్న నిజంబైనమీసమున్నఁ, బాఱపోవుటగూడదు పందవగుచు
ద్వైతవనమునఁబాండవోత్తములచేత, సింధుపతిపడ్డపాట్లుగాంచెదవురమ్మ.

(20) ఉ॥ ఆశలడంగి- నీగురులయంతటివారెదిరింపలేకయా, వేశముదక్కియుండిరి
కఁ బిన్నవు, కాఁగలవాఁడ విప్పుడే, యాశుకవీంద్రసింహముల కాగ్రహముఁ గ్
గలిగింపఁబోక వత్సశివరామశాస్త్రి! సుగుణాఢ్యుఁడవై యశముఁ గడింపుమా !

పైనుదాహరించిన 19-20, సంఖ్యలు గుర్తుగాఁగల పద్యములు శివరామశాస్త్రి యెదుట లేకున్నప్పుడు గన్నవరంలో గొప్పరపువారు నోరుచేసికొన్నవి. (1913 సం॥ 15 డిశంబరు. జనేవరు 12-13 సంచికలు మనోరంజనిచూడుడు )ఆయీ సోదరుల ప్రల్లదములు పిదప వారు తప్పుకొన నెంచెడివికావు. వారి యుత్తరములోని యంశము లీప్రల్లదముల కించుక దాఁటినను మొత్తము సారాంశ మొకటే, ఇదిగాక ఆయుత్తరములోని పాట వీరు చెన్నపురి మొదలుకొని కొప్పరము వఱకును గనుపడినవారితో నెల్లఁ బాడుచునేయున్నారని యిటీవల వేమవరాగ్రహారమున కవధానార్థ మరిగినప్పు డనేకులవలన వింటిమి వీరికిట్టి పరిసంగమున కధికారమిచ్చిన భగవంతునికి వందనములు. మనోరంజనీ పత్రికాధిపతి యెట్టివాఁడో ఆర్యమతబోధిని తేల్చినదికదా ! అసత్యవేదములో నతఁడు గొప్పవాఁడో సోదరులే గొప్పవారో అని చర్చించఁగా వీరే గొప్పవారని సహేతుకముగాఁ దేలినది. పోతాప్రగ్గడవారింటిసభలో గంటకు 500 చొ॥ చెప్పినట్లు వీరి ప్రల్లదపు టుత్తరమునఁ గలదు. 15 వ జూన్ 1912 సం॥ మనోరంజని 200 వందలచొ॥ అని మాత్రమే

చ. "ధ్వజమును నాటి నార"మని దబ్బఱ లాడుట కేము రోయ మా
విజయముమాత్ర వ్రాసికొని వెట్టినడుల్ లిఖియింపకున్నచో
నిజమగు నేని నిక్కమగు నిక్కము గానియెడన్ మఱొండగున్
గజిబిజి లేని కల్పనలఁ గాగితముల్ పెడఁగొట్ట నేటికిన్.

వ్రాసినది దీనిం బట్టి మే మాయీ తారతమ్యమును గని పెట్టితిమి. దీని నిటుంతము ఈమనోరంజని మాశిష్యునిగూర్చి పృథగాఁ దనయానూయనెల్ల వెల్లడించినది. విలువగల యిచ్చో నావాగ్వ్యయమునకుఁ దావొసఁగము. మఱియు నిది మేమాంధ్రభాషా పరిష్పత్రిక కొసఁగిన "ఆంధ్రమహాకవి ప్రశంస"నుగూర్చి కొంత తెలివితక్కువగా వెక్కిరించినది. ఆవెక్కిరింపులోని యొకపంక్తి నుదాహరించెదము.

"భాగవతమును దెనిగించిన పోతనామాత్యుని శ్రీనాథునకుఁ జాల నీవలివానిగఁ దరువాతఁ జెప్పిరి." (15 డిశంబరు జనేవరు 1913 సం॥ మనోరంజని)

చూచితిరా ? తెలివి, శ్రీనాథుఁడును బోతన్నయు బావమఱఁదులని కూడ మాకుఁదెలియదని యీపత్రిక యభిప్రాయము. మఱియు నీ మనోరంజని శివరామశాస్త్రిని బడఁదిట్టిన కొప్పరపువారి నోటిదుడుకు ప్రసంగపుసభ నిట్లు నొక్కినొక్కి నుతించుచున్నది.

"...సోదరకవులకుఁ బ్రతిపక్షులగు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులకుఁ బ్రాముఖ్యులగు బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు సబంధుమిత్రముగా నీసభకు విచ్చేయుటంజేసి లోఁగడ జరిగిన సోదరకవుల సభ లన్నిటికంటె నిది యగ్రగణ్యమై వారి జీవచారిత్రమునందలి ప్రధానవిషయములలో నొక్కటి యగుచున్నది."

షరా:— దీనిస్వభావము దెల్పుటకివి చాలినను నుదాహరింపవలసినవి పోలెఁడు కలవు. సోదరకవులు సశిష్యముగా నప్రసక్తముగా ననాలోచనముగా మఁమ్మ బడఁదిట్టుటను సర్వమును గోడమీఁది పిల్లివాటముగాఁ దానే ప్రకటించుచు నిది యెట్లు సాహసించి చెడ బొంకుచున్నదో!

"...మావెనుకఁ బద్యములఁ జదివినవారిలో నొకరు తిరుపతి వేంకటేశ్వర కవులయెడ నిరసనభావముగల యొకపద్యమును జదువఁబోఁగా సోదరకవులు వెంటనే లేచి యట్టిపద్యములం జదువరాదని వారించుచు నీక్రింది పద్యముం జదివిరి........."

శా. పోతాప్రగ్గడగారు జాబొకటి మమ్ముంగూర్చి పంపించె "మే
మేతేరఁ గల" మంచు మీకవులతో నేర్పాటుగాఁ జెప్పి పై
"నేతెం" డంచు లిఖింపుఁ డన్న నతఁ డాయీమాటపై నేమిగా
మాతో నాడెనొ యిప్డు చెప్పఁడొకొ! యామాన్యుండు సత్యంబుగన్.

---

షరా:— సోదరకవులఁట! మమ్మనఁట! యితరులఁట! వారికొంకఁట! నిందింపఁబూనిరఁట! అనిందకఁట! సమ్మతింపలేదఁట! ఈవాగ్రీత "బిచ్చగానిని బొమ్మన్న కోడలి కలిగి యత్త చేసినపనికి" స్మారకమగుచున్నది. మేలు మేలు! మనోరంజనీ! మంచివానిచేతఁ బడితివి! ఇదియే సోదరులను దుష్పథమునకుఁ గొండొక ద్రిప్పిన దని చదువరు లెఱుంగుదురుగాక. దీని యశక్తి దుర్జనతకై యీయిచ్చిన యుదాహరణములు చాలును, పనిలోఁ బని పేరు దెచ్చికొందమని యిది యత్నించుచున్నది. సోదరుల ప్రల్లదములకు మొట్టమొదట ప్రత్యుత్తర మిచ్చినందులకే సిగ్గుపడుచున్న మే మీతనికిఁ గూడఁ బ్రత్యుత్తర మీయనెంచము. సోదరుల ప్రల్లదపు టుత్తరమును "మక్కీకిమక్కీ"గాఁ బ్రచురించితిమి. సందియములున్నచోఁ గుండలీకరించితిమి. సోదరుల యభిప్రాయము చొ॥ వారికి యశస్కరమును మాకు లజ్జాకరమును నని తలఁపవలసిన యీ యుత్తరమును వారికై సహించి శాశ్వతపుగ్రంథమునఁ జరిత్రకార సంప్రదాయము ననుసరించినవారమగుటచే ముద్రించినందులకు వారు కృతజ్ఞులై తాము ప్రకటింపఁ బోవు "జల్లిసీమ, నారాయణాస్త్రము" లోనగు చరిత్రగ్రంథములలోఁ దత్సూచకముగాఁ బ్రవర్తించి సత్యము విలువ నెఱిఁగి ముందేగుదురు గాక. నకలు మాకుఁ జేరిన విధమును జూపుచున్నారము.

1...కొప్పరకవులు జాబులిఖించిపంపిరి. అందంతయు తమ్ముల నిందించుటయే తప్ప వేరేమియు లేదు, మీయుభయులను పోలవరపు జమీందారుగారైన శ్రీకృష్ణారావుగారు వారుచేయించిన కాకినాడకాలేజిసభకు రమ్మనమని వారెంత వేడినను తమరు దానికియ్యకొనలేదట, ఆదిగాగల సంగతులతో ఎదుట నుండి గమనించినవానిరీతిగా సంభాషణ యంతయు వింతగా వ్రాసిరి...దాని యథార్థమంతయు మాకు దెల్పిరి. ఆజాబునందలి మాటలు చాలా కర్ణకఠోరముగా నున్నవి అందంతయు వారి యౌన్నత్యమును, మీ—ప్రకటించుమాటలే కాని వేరేమియులేవు. దానియొక్క నకలు నావద్ద కలదు. తమరు పంపుమన్నచోఁ పంపెదను. తమరు ఆగృహస్థుని పేరుమాత్రము మీయచ్చుగ్రంథముల యం దెచ్చుటను ప్రకటింపవద్దని నాప్రార్థన...దానినుండి యీక్రిందిదానిని

ఉ. ఆయన యుత్తరం బొకటి యంపుట సత్యము, అంతెకాని మ
మ్మాయన వచ్చి పిల్వఁడ,యనంతర మాయన 'ప్రస్సు' పద్దికే
పోయి వచించినార మటు; బుద్ధిమదగ్రిణి యాతఁ డట్టిచో
ప్పీయకొనండ, యి స్దతఁ డహీనుఁడు వేటొకలాగు చెప్పునే!

ఉ. "వెంకటసామిపల్కె" నని వీరలు డాబినడాబు సర్వముక్
బొంకుప్రసంగ, మాతఁడును బొంకఁడు యోగ్యుఁడు, బొంకుమంచు ని
శ్శంకుఁ డొకండు చెప్పఁగల సాహసుఁ డుండెడుఁగాక నీకుఁ దా
జంకఁడె యంబరో! కడు నసత్యము సత్య మనంగ నేర్చునే! 264

---

రొుత్తివ్రాయుచున్నాను.—ఏమి యీ సాహసము,...వీరు శాఖాభిమానమే చేయూతగా చేసికొనియున్నారు...వెంటనే జాబువ్రాయ ప్రార్థితులు.

2...వారు వ్రాసిన అసలుత్తరమునకు నకలు పంపుచున్నాను,...యిది దానికి సరియైన నకలని తమరు నమ్మవచ్చును. యీయుత్తరమును ... గారికి వ్రాసిరి....మీకును వారికిని సరిపడకపోయినను వారి కౌన్నత్యమున్నచో దానిని స్థాపించుకొను విధము లనేకము లుండగా దూషణచేత జయింప నుంకించుట నాకు చాలా కష్టముగా నుండి నే మీకిది పంపుచుంటిని...చూచి తమరు దీనిని మీయిచ్చవచ్చినట్లు వాడుకొనవచ్చును, నాకు తమయందు గౌరవపూర్వకమైన భక్తియె యిట్లుచేయ నన్ను పురికొల్పినది. (చేల్లాలు)

3...అప్పుడు యీజాబు చూపెను. యీజాబు నీకెట్లుదొరికినదని... అడుగగా అతనిట్లనెను,..."అందువలన ఆవుత్తరమును వీరికి చూపుమని...గారికి వ్రాసిరి. వారట్లుచేసిరి. దానిని నేను చూచి ...సరియైననకలు తీసుకొంటిని" అని...చెప్పినాడు యిదియె నా కది దొరికినవిధము. నిన్ననే మీకుపంపుటకు ఆ...వద్దనుంచి యీసంగతులకు జవాబుతెప్పించుకొని వ్రాయుదమని యనుకొని యతనికి వ్రాసితిని. అతను వెంటనే జవాబు పంపనందున నేడే మీకిట్లు వ్రాయుచున్నాను. మీకతను వ్రాస్తే వ్రాయవచ్చును. అది సరియైన నకలేను.

(చేహ్రోలు)

4...శ్రీకొప్పరపుకవీశ్వరులు కాకినాడాది గ్రామములకు వచ్చినపుడు అక్కడ జరిగిన సభలలో మిమ్మును దిరుపతి శాస్త్రిగారిని ఆహ్వానముచేయగా రా మని మీరు చెప్పినట్లును అందుమీద కొన్ని ప్రశంసలు జరిగినట్లును, ఇంకా మొదలైన కొన్నిసంగతులతో శ్రీకొప్పరపుకవీశ్వరులు తమ మిత్రు

ఉ. వేరొకరుండు తోడగుట వెంకటసామినిగూర్చి సందియం
బీరహిఁ దోఁపఁజేసె, నతఁ డెంతయు యోగ్యుఁడె యైన; నింక వీ
రెరిని బేరు గుర్చిచ్చిరో యొకింతయు వారలఁ గూర్చి శంక చె
న్నారద, సూర్యుఁ డింకొకదిగంతరమం దుదయించెనేనియున్.

మ. "సహవాసమ్మున నబ్బుఁగాదె గుణదోషంబుల్" మహాపండితుల్
బహుమానించెద రీవిశేషమును, సంబంధంబు తత్తాదృశం
బహమున్ రేయియు నుండు హేతువున యోగ్యత్వంబు చెన్నారు ధీ
మహితున్ వెంకటసామిఁగూర్చి మదిలో మాకబ్బె సందేహముల్. 268

ఉ. వెంకటసామి కుండెనొకొ వేలకు వేలుగ గుండియల్! వృథా
కొంకక యట్టివాదమునకుందిగునే శివ! యెప్పుడో నిరా
తంకునిగూడి 'కాకు' లని తజ్జ్ఞుల దూటిన దూఱుఁగాక, యీ
పంకము నీఁగుటెట్లనిన వాక్కిఁక నాతనికిన్ జనించునే!

ఉ. వెంకటశాస్త్రితో నటులు వెంకటసామి వృథా ప్రసంగమున్
శంక యొకింత లేకయును సల్పఁగఁ గారణమేమొ? యైనచో
నింకొకమాఱు చేయుటకు నేటికి సందియ మింత యేల? యీ
బొంకుల కాతఁ డొప్పునెడఁ బోవలె నాతని మీఁది కయ్యెడన్.

---

లయిన... వారికి వ్రాతమూలకముగా తెలిపినారు... ఆ అంశములన్నియు విశదముగా... వల్ల తమకు విశదమైనట్లు నాకు ... వద్దనుంచి ఉత్తరము వచ్చినది. తమకు పంపిన నకలు శ్రీకొప్పవరపువారు వ్రాసిన లేఖకు సరియైన నకలైయున్నది... అచ్చటచ్చట అక్షరములలో కొన్ని పొరపాటులు పడియుండవచ్చును... శ్రీకొప్పరపుకవులు పంపినదాని నకలు నావద్దచూచి నిజము తెలిసికోవలెనని నావద్దనుంచి తీసుకవెళ్ళినారు. తిరిగి తమవద్దనుంచి తనకు ఉత్తరం వచ్చినట్లు యీరోజు వుత్తరం వ్రాసినాడు. అందువల్ల దీనిని తమకు విశదం నిమిత్తం వ్రాసుకున్నాను. శ్రీకొప్పరపువారు వ్రాసిన వాటిలో యథార్థమును మాకుగూడ తెలుప ప్రార్థించుచున్నాడను. చిత్తగించవలెను. (చేవ్రాలు)

వరా:— పైయుత్తరమ్ములన్నియు వారివారి వ్రాళ్ళతో నుండినను శాఖాభిమానులవలన వారి కేయపకారమేని జరుగునని యెంచి వ్రాళ్ళను కొన్ని సందర్భములును విడువఁబడియె.

ఉ. ఊరక వ్రాఁయు వ్రాఁతలకు యోగ్యుని నాతనిగూర్చి వ్రాయుటల్
సారవిమర్శ గణింప, రెకసక్కెపు వ్రాఁతపుఁ బూని యేరినో
దూఱఁగ నెంచి పండితుల దూషణ చేసిన దానఁ జేసి యీ
కాఱులు సైఁపరామి నిటుగా వచియించితి మింత యొప్పదే!

ఉ. "పాడి" యనంగ నీతి యగుఁ, బండితులం బడఁదిట్టఁ బూనుచోఁ
బాడికి నేమి యర్థ మగుఁ? బండితు లేమి యొనర్చి రీతనిన్?
వేడుక యయ్యెనే? యకట! వెంకటసామికిఁగూడ; నేరి నో
నాడనివాఁడు పండితుల నాడునె కాకులు గాఁగ నక్కటా!

ఉ. "కా దతఁ డట్లు వ్రాయఁ" డనఁ గన్పడుచుండెను వ్రాఁత యింతగాఁ
జేదయిరొక్కొ పండితులు! చెన్నఁటి యెవ్వఁడో వ్రాయుమన్నచోఁ
బో దల తెల్గు పాణిని స్వబుద్ధిగఁ బోసలె మున్నిటుల్ చనన్
లే దలమేటి పాణిని; బలే బలె! పాణినిగారు పుట్టిరే!

చ. "బిరు దిడినాఁడు నా" కనుచుఁ జగ్గకు నేదియొ వ్రాయఁబోయి సం
స్కరణ మొకింత కల్గియును జక్కనిధార విదూరమాట న
క్కరణిని జెప్పెఁ గాని బుధకాండము సర్వము దూఱఁబోవఁ డే
వ్వరినొకొ దూఱియుండు నన వాస్తవమేయగు, దిద్దికోఁదగున్.

ఉ. ఒక్కరి గొప్పఁ జేయుటకు నొక్కరిఁ దిట్టినఁ గాని గాదె! యే
మక్కట, పండితప్రవరు లందఱు కాకులె! యెంతవాఁడు తా
నొక్కనిఁ బోలఁగాఁ గలుగునో! యిఁక నేనియు నిట్టిత్రోవలన్
ద్రొక్కక చక్కఁగాఁ దెలిసి దూఁకుడు వాకులు గట్టిపెట్టుతన్.

ఉ. కాకపురంబు వాస మను కారణ మీనుడి తెచ్చిపెట్టెనో!
కాకవి తోడునీడ యగుకారణ మీనడిలోన దింపెనో!
లేక యశమ్ము కైకొనెడి లీలయొ! పాకపు సొంపా! కంపా! యూ
రా! కడు మేరమీఱెఁగదరా! నవపాణినిగారి ధోరణుల్.

తే. గీ. అరిగె భీముండు, సోముండు నరిఁగె నకట!
జరిగె సర్వజ్ఞదీక్షితసార్వభౌముఁ
డేమి! పేరూరి దౌర్భాగ్య మిపుడు వచ్చు
శంకరుండఁట! వ్యాఖ్యాతృచక్రవర్తి!

ఉ. ఇంజరమేము నిర్వరము నేగుటగూడ నసత్య; మొక్కఁడే
గెం జనుమీఁద నయ్యెడఁ గేవలభక్తిని జేసి *యుత్సవ
బుం జరిగింప నెల్లరును బూనిరి యప్పుడు వారు వచ్చి పి
ల్వం జను దెంచెఁ దిర్పతి సభల్ బొనరించితి మంత నయ్యెడల్.

ఉ. పోలవరంపుఁ బోడదరుగఁ బోవుచు నాసభ కట్లు తిర్పతిల్
జాల బలాత్కరించెడి ప్రసంగముగూడ ‡ నసత్యమే మనల్
శ్రీలలితుల్ జయంతి కులశేఖరు రామయగారిఁ జూడఁగా
నోలి "మొటారు" బండిపయి నూరికిఁ దిర్పతియేగె నయ్యెడల్.

ఉ. రామయగారు కోటిఫలి రా వల వారిని దోడుకొంచు రాఁ
గా మఱి బోఁడు బండిని దగల్ బనిచెల్, జనెఁ దానిమీఁద నా
శ్రీమహితుల్ గనుంగొనఁగ శ్రీపతి; వచ్చెడువేళ వాన దా
నామెయి మార్గరోధిగఁ బ్రయాణము మందత చెందె నంబికా! 378

చ. తిరుపతి యేడుగంట లగు దెంచుడు రామయగారు తాను ధీ
వరుఁడగు మల్లయార్యుఁడును వచ్చిరి, యేగిన దొంటిగంట; కే
కరణిని నైదుగంటలకుఁ గాఁదగు నిట్టి ప్రసంగ మంబ! సా
కిరు లిట రామయార్యుఁడును గేవలధీరుఁడు మల్లయార్యుఁడుల్.

చ. పదపడి ప్రొద్దుపోవుపయి బండిపురమ్మున కేగుదెంచె, న
య్యదనున దానఁ జేసియె మహాత్ముఁడు రామయగారు గూడ "పీ
రిది సభ" యం చెఱింగియును నేగఁగ లేదఁట! దీని తత్త్వ మి
య్యది, సభ కేగునప్పు డెటు లౌ నటువంటి ప్రసంగ మంబికా! 280

చ. మఱియొకయప్పుడేని యొకమాట వచించుట, దాని కుత్తరం
బరసి వచించు, టాపయిని "నా" ననుకొంటయుఁ, గాక యట్లుగా

---

(* 1912 సం॥ జూలై 10 వ తేది ఆంధ్రపత్రికనుండి.)

జూను 18 తేదేని శ్రీతిరుపతి వేంకటేశ్వరకవులు ఇంజరముగ్రామమునందు శతావధానంబు నొనరించిరి ఉమ్రా అలీషాకవిగారును నూకల అమ్మన్న శాస్త్రిగారును కవిత్వమునుగురించియును అవధానమునుగురించియును చక్కని యుపన్యాసములనిచ్చిరి. అవధానానంతరము శ్రీవేంకటేశ్వరకవులు సత్కరింపబడి జనులచే నూరేగింపబడిరి. నందికోళ్ళ గోపాలరావు.

‡ 104 పుటలోని శ్రీవారి జాబుచూడుడు.

జరుగునె యంబ! వాద; మది సత్యమెయౌనెడ నిప్పు "డింతయున్
జరిగె" నటంచు మాన్యుఁడు సాక్ష్య మొసంగుట కేమి శంకయా!

ఉ. పోలవరప్రభుండు తనపొంతను దర్పతి యుంటఁజేసి యీ
గోలకుఁ బూనుకొన్న నది కొందఱు వేఱుగ నెంతు రంచు స
చ్ఛీలుఁడు జంకునేమొ! యని సాక్షుల నన్యులఁ జూపినార మా
శ్రీలలితుండె చాలు నిది చెచ్చెరఁ దీర్పఁగ, నింద కేటికిన్?

ఉ. వీరలు, కాకినాడయును, వీరలిఖించిన వేళ్ళు నిక్కమే;
యారయఁ దక్కసంగతుల యందొక లేశము సత్యముండిన\న్
వీరు లిఖించుపోకడలు వీసము సత్యము గా; వసత్యపుం
ధోరణికేమి; ప్రల్లదపు దూఁకుడు కేమి వచింతు వంబికా! 383

చ. "తిరుపతి వెంకటేశ్వరుల ధీరుల మేము జయించినార" మం
చొరులకుఁ దెల్పి సంతసము నొందుట కింతయు నల్లి, రట్లు సం
బరపడ రాదె? అట్టులను వ్రాయఁగ నేటికి? చేతిచేటె? యం
బరో! యిది డాఁగనేర్చునెటు, "వ్రాఁత బలింగొను" నం టెఱుంగవే!

క. ఇదిగాక పెద్ద లేమని, రది నీ వెఱుఁగనిదె? యజ్ఞు లాకర్మంబున్
మది నెఱుఁగ రక్కటా! "శతం వద, ఏకం మాలిఖ" యనువా రలఁతులొకో!

చ. ఎవరికి వ్రాయ నేమియగు? నేగతి నయ్యది పైకిఁ బోవునో
శివ శివ! చేయునట్టిపని చెడ్డది యైనపు డించుకంత జం
క వలదె? యంతదాఁక మది గట్టిగఁ బట్టుక యేగి సన్నిధిన్
బవరపుగెల్పు దెల్పికొన వచ్చుఁగదా! తమయిచ్చ చొప్పనన్. ౩౮౫

ఉ. అదియును *బైకివచ్చుఁ జుమి యంబరో! సాజపు బొంకు పొండితిన్
బదఱఁగవచ్చు "లే"దనుచు; వ్రాఁతకు నయ్యది వీలు గాదు, కొ
ట్టదిదియుఁ గొంతమందిని, గడంగుదు రియ్యెడఁగూడఁ బొంకఁగా
నద నగుచోటఁ గొందఱు మహాత్ములు; చెప్పఁగనేల యిక్కలిన్.

---

*శ్రీహయగ్రీవాయ నమః

హాల్ మకాం, పొన్నూరు.

బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రివారికి, నమస్కారములు,

ఇదివఱలో మా దేశవాసులగు కొప్పరపు సోదరులు కాకినాడలో నాకు
న్ విద్యము చెప్పినపిదప గుంటూరులో కొందరు పెద్దమనుష్యుల ముందు "మిమ్ము

ఉ. "వ్రాయనె లేదు మే" మనుచు వచ్చెడి. వాదము దక్క దీనిపై
నేయఖిలాంబ! వాద మిఁక నుండదు, సాహసు లెందుకేనియుక్
రేయరు రేయకుండుతఁ, బరోక్షము నీ కొకఁడున్నె! నీదుకం
దోయిని గప్పు నేర్పరులు తొల్లి వినంబడ రిప్పు డుండురే! —౨౭౫

---

సభలోనికిఁ బిలిపించిన రారైతిరనియు రాజావారిద్వారా పిలిపింప నిదె వచ్చెద మని పరాఙ్ముఖులై తిరనియు పిదప మీరు వెరచి రానందులకు సభ్యులయెదుట "అకట! పదియవనాఁటి ముత్తైదు బోలె, డాఁగి యున్నారె" అనియు, "గురుత లభించ దంచు నళుకుక్ బెళుకుక్ బలుగాకి కూసి సో, దరు లగు రామకృష్ణులను దద్దయుదూషణ చేసి నంతనే, జరిగెను శృంగభంగము" అని కంస వధ సందర్భమున శ్లేషగ చెప్పితిమనియు, మఱియొక కర్ణకఠోరమగు పద్యమును బ్రచురించి విజయముగొంటి"మని చెప్పిరి. ఇందలి సత్యాసత్యముల విచక్షణ సేయు పెద్ద లిక్కలికాలంబున గానరారు, గాన తామైన సత్యమును బత్రికా మూలమునఁ బ్రచురించి చదువరుల సందేహనివృత్తి యొనర్పుఁడు. బలవద్విరోధమునకు జంకి యథార్థవాదినామమున నిటువ్రాసితి, వలయుచో నేను చిరునామ తెలుపుటయే కాక సాక్షిని గూడ కాగలను. (యథార్థవాది)

యేర్పూరు.

24-2-12.

......సోదరకవుల యొక్క మాతామహస్థానము మాగ్రామమే అవుటవల్లనున్ను, శాఖాభిమానమును జూపక న్యాయపక్షముగా తత్కవులతో మాట్లాడుటవల్లనున్ను, యీగ్రంథము విశేష అవసరమైయున్నది. తరుచు యీగ్రామములోనేయుంటూ దగ్గరలేని యెనుము దున్నను యీనిన చందముగా యీగ్రామము వచ్చినప్పుడెల్ల మాట్లాడుచుండగా మేము తద్విరోధముగా మాట్లాడుచుందుమని మాయం దసూయులై యుందురు.

(చేబ్రోలు.)

కాకినాడనుండి మ॥రా॥రా॥ అనరబిల్ కె. ఆర్. వి. కృష్ణారావు బహదరు బి. ఏ. గారు పంపించిన యుత్తరము నీక్రింద పొందుపఱచుచున్నారము.

శ్రీకొప్పరపు కవులు కాకినాడ పురమునకువచ్చి సభ యొనర్చినపుడు తిరుపతి వేంకటేశ్వరు లాసభలో వారిచేఁ బరాభూతులైరని శ్రీకొప్పరపు కవులు అక్కడక్కడ ప్రసంగించుకొనుచున్నట్లు మామిత్రుల కొకరు వ్రాసిన యుత్తరమువలన దెలియవచ్చినందున నిజముగ నీపురమున జరిగిన సభావిశేషము నీక్రింద వివరించుచున్నారము.

ఉ. తప్పికొనంగఁ జూచినను దప్పదు కంటకబడున్ గవిత్వశ్రం
జొప్పు వేలార్చు పద్దెములు చొప్పకలాకలఁ బోలువట్టి వీ
తప్పడు వ్రాఁతలోఁ గలవు, తక్కిన వానిని వీనిఁ బోల్చుకొ
న్నప్పుడె "గుప్పు గుప్పు" మని యజ్ఞులకేనియుఁ గొట్టు వాసనల్.

ఉ. గుంటపురమ్ము నందు ననుఁగుల్ తమచుట్టును జేరి "రొట్టులో
గెంటుఁడు నల్వదింటికిఁ దెగింపుఁడు ధారణలోఁ బనేమి? మే

---

శ్రీ గంజామువారియింట వివాహమున కాహూతులై శ్రీకొప్పరపు కవులీపురమునకు వచ్చిరి. వివాహ సందర్భమున కేర్పడిన సభ ముగియంబడిన తరువాత పురవాస్తవ్యులు శ్రీకొప్పరపు కవులచే గోరబడి యొక సభ గావించిరి. ఆసభ కాలేజిలో జరుపఁబడినది. అందునకు శ్రీ తిరుపతిశాస్త్రిగా రాహూతులయ్యును కారణాంతరమున రారైరి. వారందులకు రాకపోవుట శ్రీకొప్పరపు కవుల క్షేమము కొరకేయని తలచి వారిని బలవంత పరచమైతిమి. పై సభ జరిగిననాడు శ్రీతిరుపతిశాస్త్రిగారు మావద్దనే యున్నవారు. వారు భీతిజెంది పలాయనులైరని కొప్పరపువారు చెప్పకొనుమాట లసత్యములును నిరాకరింపదగినవియును అగును. శ్రీకొప్పరపు కవులకొరకీయూరజరిగిన సభలలో నెందును వారికిని వీరికిని సమావేశప్రసంగము జరుగనేలేదు. కాలేజీలో జరిగిన సభ విషయమై శ్రీ తిరుపతిశాస్త్రిగారి ప్రోత్సాహ నిరుత్సాహము లేమియును లేవు. శ్రీ కొప్పరపు కవులకును తిరుపతిశాస్త్రిగారికిని సమావేశ మీయూరనెచ్చటను గలుగలేదు. మా యొద్దను గలుగలేదు. శ్రీ కొప్పరపు కవుల మూలమున శ్రీ తిరుపతి వెంకట కవులయం దుండు గౌరవ ప్రపత్తు లెవ్వరికి దగ్గిపోగలవి కావని మానమ్మకము. ఇచ్చట శ్రీకొప్పరకవుల నిమిత్తమేర్పడిన సభలోని విశేషము లింతకన్న నిట వ్రాయ ననవసరము. ఇచ్చట జరుపబడిన వనుకొను గజారోహణాదు లీసభతో సంబంధించినవి కావు. వానిగాథ వేరు.

కాకినాడ, 27-11-12. **K. R. V. Kristna Rao.**

(ఇట్టియుత్తరమునే రాయ బహద్దరు కె. సూర్యనారాయణమూర్తినాయడుగారును పంపినారు.)

**గుం. పీ. 14**

ముంటి" మటంచుఁ దోల నది యూని * బడల్పడునప్పు డేము లే
కుంటిమె చుట్టుపట్లఁ, జనియుంటిమె యాసభ కోమహేశ్వరీ! 290

(*1911 వ సం॥ నవంబరు 15 తేది దేశమాతనుండి )

గుం టూ రు జా బు

"...క్రిందటినెల 1 వ తేదీ మధ్యాహ్నం బం(డెండుగంటలకు అవధాన మహోత్సవము జరుగ బోవు గుంటూరునందలి ద్వితీయనాటకశాల సర్వసుహృత్పదంబై యన్నిట నద్వితీయంబయి వెలింగె. నాడు విచ్చేసినవారిలో సర్కారుద్యోగస్థులు ప్లీడర్లు మొదలగువారుండెరి. సర్కారుద్యోగస్థులలో మ. రా. శ్రీ పెమ్మరాజు కామరాజు పంతులుగారు (డిప్యూటి కలెక్టరు గుంటూరు) మ. రా. శ్రీ మందపాటి లక్ష్మీనారాయణ పంతులుగారు (తహశీలుదారు) మ. రా. గిరిరావు పంతులుగారు, (టవును మేజస్ట్రీటు)మ.రా. చిరుమామిళ్ళ లక్ష్మీనారాయణప్రసాదనాయుడుగారు (ప్రొ. డి. త ) పోలీసు యినస్పెక్టరు (ముసల్మానులు) సబ్ ఇనస్పెక్టరు కానిస్టేబిలును, ప్లీడర్లలో మ రా ఏకా రామయ్య పంతులుగారు వు. రంగారావు పంతులుగారు మొదలగువారును విచ్చేసియుండిరి డిప్యూటికలెక్టరుగారి సరసను మ రా. వింజమూరి భావనాచార్యులువారు దయచేసియుండిరి...... అంతట బృచ్ఛకులలో నొకరగు మ॥ వు రంగారావుపంతులుగారు సరిగ నూరుమందికి నవధానము సేయ జూడ కుతూహలము కలదని యగ్రాసనాధిపతికి విన్నవించిరి.అట్లు చేయుటకు... వీలు లేదని చెప్పిరి.... తరువాత నవధానము నొక్క రొక్కరుగ విశదలలో బాపట్లలో జేసిరిగాన నిచ్చటసోదరు లిర్వురును గలసి యవధానము చేసిన బాగుండునని వు. రంగారావు పంతులుగారు తమ యభిమతంబును దెలిపిరి. అదియు నయ్యగ్రాసనాధిపుఁడు వారించెను, కాని సహేతుకంబుగ గాదు ... ఇద్దఱుపిల్లకాయలు...పిల్లజగడము జెట్టికొని కర్ణాశ్వత్థామలకథ జక్కగజ్ఞప్తికిదెచ్చిరి. సబ్ ఇనస్పెక్టరుగారు రంగంబులోనికి వచ్చి యాపిల్లకాయల విడదీసి యొక సభికుని నెట్టుచుండ "అయ్యో అతను మనవాడండి'' యని యొక నియోగి సబ్ మేజస్ట్రీటుగారితోననిరి. యీయవసరంబున రంగంబునలంకరించిన పృచ్ఛకులు లేచి నిలిచిరి ...నాడు నలువదియొక్కమంది పృచ్ఛకులు గూర్చుండిరి. ... పృచ్ఛకుడు నేను వృత్తమడిగితిగాని గీతముకాదనియు, కవీశ్వరులలో ననుజుండు గీతమును వృత్తమే యనిరి. పృచ్ఛకులలో నొకరగు మ॥ వు. రంగారావుపంతులుగారు గీతము వృత్తము కాదనియు వృత్త జాత్యుపజాతులలో వృత్తములు వేఱనియు వారికి నుడివిరి. అగ్రాసనాధిపతిగా రుపజాతులలో

మ. శివరాముం డొనరించె గాదె విబుధుల్ సేబా సనఁ బూర్ణమా
నవధానం బపు డప్పురిం గలదుగాదా కొప్పరం; బేల తా
నవలోకింపఁగ రాదొ! నీవెఱుఁగవా? యప్పట్ల నీతీరుగా
శివరాముండు ప్రగల్భముల్ పలికెనే 'సీసీ' లకుం బాత్రమై.

చ. తగుదుమటంచుఁ గాలెటులొ త్రవ్వి పరింపక మెల్ల "దోమ యే
నుఁగులకుఁ బోరు సాఁగె" నని నూటికి నొక్కఁడు తప్పఁ జెప్పకో
నగడున కాస్పదం బయి పలాయనమంత్రము స్వస్తిచెప్పి యే
మొగమున మాసహోదరులు ముచ్చట లచ్చుగ నిట్లు వ్రాఁతురో! 292

క. మానతిరితయుం బటు మా, మీసము తలపెట్టు తమకు మేము వృథాగాఁ
జేసితిమి గర్త పురమున, వాస మ్మొదిరింతు మన్న వాసి యడంపన్.

---

వృత్తములు లేవా యనియు మఱియు బృచ్ఛకులు సమవృత్తమో విషమవృత్తమో చెప్పరైరనిరి. అంతట రంగారావు పంతులుగారు గీతములకు నుపజాతివృత్తములకు సంబంధములేదనిరి సరియే యని యొప్పుకొని యవధాని యంతట వృత్తము జెప్పిరి. ... ఈ పద్యముల కన్నింటికి ప్రథమపాదమగువఱకు సాయంకాలము 4 గంటలు అయెను ... అవధానపద్యముల బూర్ణముగ వ్రాయువారిలో మ॥ ఏ. లక్ష్మీనరసింహంపంతులుగా రవధానిగారి ప్రక్క నెఱ్ఱపెన్సలుతో దాళఫల ప్రమాణంబులగు నక్కరములతోను, మ॥ పాటిబండ సూర్యనారాయణ రావు పంతులుగారు నల్ల పెన్సలితో నవధానిగారి తమ్ములదెసను గూర్చుండిరి. పద్యంబుల రెండవపాదంబులు జెప్పుసమయ మాసన్నమాయె. ఈయెడ ధారణాపటిమ యంత యెక్కుడై కనపడలేదు. 3 వ పద్యముయొక్క 2 వ పాదము చెప్పుచు అవధానిగారు దాహముకొరకు, కాదు క్షీరమునకని తరువాత దెలిసినది, యవనిక మఱుగున కరిగినతోడనే వారి యనుజులును మ॥ సూర్యనారాయణరావుగారును లోనికరిగిరి. కొంచము సేపటికి సోదరులిద్దరును సభలోనికి దిరిగివచ్చిరి అంతట నవధానిగారు 11 పద్యములవరకు జక్కగ జెప్పిరి; 12 వ పద్యము రెండవ పాదము చెప్పుతఱికి నవధానిగారికి దైవవశంబున సభ్యుల కానందము మందముగా శిరోవేదన సంభవించెను ...... కొంతతడవల్లే బాధపడుచునైన బూర్తిగావింపనెంచిరి ... మఱల శ్రీ సుబ్బారాయావధానిగారును సూర్యనారాయణరావుగారును ధూళిపాటి లక్ష్మీనారాయణగారును (లేఖకులలో నొకరు) మఱలలోనికివెళ్ళిరి, పిమ్మట గవీశ్వరులు మఱి కొందరుం దక్షిణపు బంచాదిలోనికి వెళ్ళిరి. అచట గొంచెము గాలి గొట్టుచున్నందున నచట గుర్చీ వేయించుకొని కవిగారు కొంచెము విశ్రమించిరి....

ఉ. అప్పుడు పాతిపోయినవయి నాత్రులఁ దామున జేయుచున్న యా
చప్పుడులుఁ బడాయినుడి చాయలు దబ్బలు లెల్లవారికిం
జెప్పక చెప్ప గర్తపురిసీమయు, గర్తపురమ్మునందు మ
మ్మెప్పుడుఁ దిట్టిపోయ జనియించిన పత్రికయుఁ మహేశ్వరీ!

ఉ. చెడేఁగద! మూఁడు మాసములు చెన్నఁటిపోరు ఘటిల్లుటన్ వృథా
గడచినతోడ గర్తపురిఁ గాలము; కాక స్వశాఖ తోడుగా
నడరెడునప్పు డెంచుకని యక్కట! వారలవంకఁ బోక యే
బెడఁదయు లేకయుండ, నెటు వేఁదుఱు వ్రాఁతలు వ్రాసిరో కదే! 295

చ. కడియమునుండి వెంకన యొకానొక నాఁ డలయించరంబుఁ బోఁ
గడఁగి స్వమార్గమాటఁగద! కాకపురమ్మున ?గ, నాఁడె య
క్కడ సభ యయ్యె, నిక్క మగుఁగా; కెవరో స్వయ మేగుదెంచి పి
ల్చుడుఁ జనఁ, డేమి? యిట్టులనుచున్ లిఖియించునె యంబ! తిట్టుచున్

---

అంతదిరిగి యవధానిగారు రంగమునకు వచ్చి కూర్చుండిరి... ఇంతలో నవధాని గారికి శిరోభారంబు తగ్గదయ్యె. సభికులందఱు వారిశ్రమ జూచి నాటిరేయి మఱింత శ్రమపెట్టఁజనదనియు మెదడుతోఁగూడిన పని గనుక నింకను శ్రమ జేయునెడల ముప్పు సంభవింపవచ్చునని తలంచి యెట్లయినను నాటిరాతిరే యవధానము బూర్తి చేయవలయునని సర్వథా జతనము సేయుచున్న వారిని వారించి సభచాలించి తమతమ నివేశనంబులకరిగిరి ...ఇంక రెండవనాటి చరిత్రము క్లుప్తముగ వ్రాసెదను. నేటిదినము మ॥ శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులుగా రాధిపత్యము వహించిరి నాఁడును (2-10-11) సభ యొంటిగంటకు బ్రారంభమాయె నాఁడు మొదటినాటికంటె బదిమంది నెక్కువగ నేర్పరచి వారికియు నవధానము సేయఁబూనిరి ... మ॥ ఏకా రామయ్య పంతులుగారు "సరే యిక నిన్నటి 12వ పద్యము నెత్తికోం" డనిరి...అంత గొందఱు పృచ్ఛకులు "వరుసగా గాక యెక్కడనడిగిన నక్కడ చెప్పుమరా" యన నట్టినియమము తాము పెట్టుకొనమనియు వరుసగానె చెప్పెదమనియు నవధానిగా రనిరి. ప్రెసిడెంటుగారు "మీరట్టినేమము పెట్టుకొనినచో బృచ్ఛకు లిష్టానుసారము నడుగ వీలుండ' దనిరి. లేఖకులగు మ॥ ఏ. లక్ష్మీనరసింహము పంతులుగారు పా. సూర్యనారాయణపంతులుగారు నిన్నటివలెనే కూర్చుండిరి ... అన్నిటికిని రెండుపాదములు చెప్పినతరువాత మ॥ విం భావనాచార్యులుగారు మిగిలిన రెండుపాదముల నొక్కసారిగ జెప్పిన చాలబాగుండునని యన్న నవధానిగా

ఉ. ఇంతటి పాటుఁబోటు లని యెల్ల నెఱింగియుఁ గాలుద్రివ్వి ధీ
మంతులు నవ్య గర్తపురి మాయెదుటన్ బడ కేల మానిరో!
హంత! సమస్తముల్ గడచునా పయి నెవ్వరు నమ్మ వార లం
చింత బడాయి వ్రాఁతలకు నేమనిపూనిరొ! మాసహోదరుల్.

ఉ. ఎందుకు వీరితోఁ గలహ? మేదియొ పూర్వము వచ్చెఁ బోయె, వీ
రెందు సమర్థు? లీకవుల యెమ్మెలతో మనకేమి, వీరు తా
మెందుల కేగ నచ్చుటికి నేమును సిద్ధముగావు టొప్ప దం
చుం దలపోసి మానుటది శూరులఁ జేసెనె? పాటుఁబోటులన్.

ఉ. 'వచ్చినవాఁడె చాలు బలవంతులు బందుగులున్నవారితో
బిచ్చపువైదికుల్ సరిగఁ బెన్గఁగలారె? స్వశాఖవార లే
పొచ్చెము చేయుచుందు రది పోకడపన్ గడుఁ గష్ట' మంచు మే
మిచ్చఁ దలంచి వారిఁ ద్యజియించుట యొండొక దోస మయ్యెఁగా!

క. "రాటకి నొప్ప వలవటు, యోజించుకొనుండు మదిఁ గుయుక్తులివి మహా
రాజశ్రీ కొప్పరము వృథా జయములు సెప్పి కొనఁగఁ దలఁచెను గుండీ!"

---

గందుల కిష్టపడరైరి నాల్గవపాదము చెప్పువేళ నాల్గవపాదము వరుసగా చెప్పుటయు వెంటనే యాపద్యమెల్ల చదువుటయు దటస్థించినది. ఇట్లు 11 పద్యములగువరకు జాల ప్రొద్దుపోయె అందువలన మిగిలిన పద్యముల జరుప బనిలేదని సభవారనిరి. ఎట్లయిన రాత్రి 11-40 గంటలకవధానము ముగిసెను. పిమ్మట స్తుతిపద్యములు నగ్రాసనాధిపతిగారి యుపన్యాసమగువఱకు రాత్రి 12 గంటలాయె. అంతట సభికులిండ్ల కేగిరి. కాన పంచాశదవధానమునకు 16½ గంటలు పట్టినవి. ఈసంగతినొకటి గమనింపవలయు. ప్రతిపద్యముయొక్క 2వ పాదము చెప్పకముందే యాపద్య ప్రథమపాదము రెండుమూడు మారులును 3వ పాదము చెప్పునెడ మొదటి రెండుపాదములు రెండుమూడుమారులును నాల్గవపాదము చెప్పుతఱి మొదటి మూడుపాదములు రెండుమూడుమారులును నవధానిగారు చదువుచువచ్చి కావలసినపాదముల వేయుచుండిరి. ఇట్లుండ మ॥ కొం. వెంకటప్పయ్యగారవధానిగారితో పదేపదే మీరు మొదటినుండి పద్యముచదువుట యేల? యేపాదము చెప్పవలయునో దానినే చెప్పుడు. కాలము చాలయగుచున్నదనిరి. అంతట నవధానిగారు వెలుపలికి జదువక తమలో దాము జదువుకొనుచువచ్చిరి. వెంకటప్పయ్యపంతులుగారద్దాని జూచి లోపల లోపల జదివిన వెలుపలికి జదివిన నొకటే, వెలుపలికే చదువుడనిరి ... అవధానసమయమున నేనేనియు గొన్నిపద్యములు చదువుం డంచు రంగారావుపంతులుగారవ నగ్రాస

క. అని * కొంతమంది మాకై. పనిగొని వ్రాసి రఘు, డేము పరికింపక స
ధిని విశ్వసించుచో వీరిని బట్టఁగఁ బగ్గములు ధరిత్రిం గలవే! 30౹

చ॥ తమసభ కేగకున్న నిటు తచ్చనలన్ లిఖియించి, రేగి య
క్రమములఁ దప్పులన్ వెదకి కంఠము నొక్క యతింతుమేని లో
కము మము నేమనున్ "మునుపుగాక మఱిక్కడఁగూడ నేల యు
ద్ధము? వెనుకంజ వేసినను దా ర్వెడ"రంచును మమ్ము దూఱదే!

శా. "నాగన్నా! పడకయ్య మాయెదుట నెన్నండున్ మఱెన్నండు మే
మేగంబోము భవద్గృగంతికము, నీవింకేగు" మన్నట్లు మే
మీగోష్ఠిన్ విడనాడి, తిట్టినను మా టీకుండ నున్నప్పు డీ
లాగున్ వ్రాతురె! భానుమూర్తి కృతి యేలా దీని లో నెంచునో?

మ. అతిరోగ్యుండగు భానుమూర్తి విబుధారాధ్యుండు లోకైకస
మ్మతుఁ డీవ్రాఁతకు నేమిగాఁ దలఁచునో! మామానసం బమ్మహా
మతి దివ్యాశయమున్ వినన్ దలఁచెడిన్ మాన్యాత్ముఁ డాతండు మున్
వితగా మమ్ము ‡ మరల్ప నెంచుకతనన్ వేడ్కయ్యెడున్ దెల్పఁగన్.

---

నాధిపతి వారిని వారించిరి. శతావధానులనుట కొకసారయిన సంపూర్ణశతావధానము జేసినగాని యొప్పరు. సభానిర్ణేత లట్టి యవధానము చేయించుట కీయకొనక యెప్పుడో ముందు చేయింతుమనిరి. కానిండు, ముందైన నీకవీశ్వరుల వలన నిర్ణయమైనట్టి దానిఁ జేయించి వారిబిరుదములకు సార్థక్యము గల్పింతురు గాక.

నాళ్ళచెర్వు రంగారావు.

* 12-9-11 (Marutur) పురవాసుల యుత్తరమునుండి.

...తాము వారితో రాజీకి వప్పితిరేని మీరు వారికి ఓడినట్లు ముద్రణ యంత్రములలో ముద్రించుటకు సిద్ధముగానున్నారు. 'మహాగజాః పలాయంతే మశకానాంతు కా కథా' యన్నట్లు వీరా మిమ్ములను గెల్చునది! వారియావజ్జీవము సాధించినను మిమ్ముల గెల్వజాలరు, జాలనేజాలరు కింకవీంద్ర ఘంటాపంచాననలను ఓరుచు వీరియందే సార్థకముకావలెను ... గ్రంథవిస్తరభీతిచే నింతటతో ముగించితిమి. లేకున్న నొకరీముకాగితములు పట్టును.

ఇట్లు పురవాసులు.

‡ బ్రహ్మశ్రీ శతావధాని తిరుపతి వెంకటేశ్వర కవివరుల సముఖమునకు.

సే॥ చెన్నాప్రగడ భానుమూర్తి యనేక నమస్కారములు చేసి చేసికొను విన్నపము.

తమకును కొప్పరపు కవిద్వయమునకు పొసగిన వివాదలను బత్రికాముఖ

శా. ఎవ్వారు యోగ్యులో! కలహ మెవ్వారు కోరెడివారో! యెట్లుగాఁ
జివ్వ జనించెనో! యెవరు చెన్నఁటిఁ బ్రాఁతలు వ్రాయువారో! యీ
అవ్వయు ఇట్టు సర్వమును రాఁ గత మేమొ? సమస్త మిప్పు డే
నవ్విమలుండు స్పష్ట మగునట్టు లిఖించెదుఁగాక శాంకరీ!

---

మున విని విచారించుమంటినేకాని కొంతవరకు కింకర్తవ్యతామూఢతను మరి కొంతకాలము మీయున్కి నిశ్చయముగాఁ దెలిసి వ్రాయు కోరికను ఇంతవరకు విలంబమైనది. ...............కవిలోకమునకు రసజ్ఞులగు ప్రభువుల సమ్మాన మరుదగుటంజేసి ప్రాయికముగా భిన్నరుచులును, సాహిత్య శూన్యులును దుర్విదగ్ధులునగు పామరుల మెప్పుగాంచి యశము నొందవలసిన యవస్థ పట్టినది. గావున కవితా గౌరవము గ్రహించి రక్షించుకొనవలసిన భారము ముందు మీ మూపునను పిమ్మట పరప్రత్యయనేయబుద్ధులగు నితరులపైని నిలిచియున్నది. మరియును మీరు పెట్టినదారి ననుసరించునట్టి వారియెడ నొకవేళ లోపమున్నను సైరించి గౌరవించు భారమును మీదియేకదా! ..................మీరలు కలతపడి కలహమునకు దిగుట లోకానర్థహేతువగుటయే కాక యుభయపక్షములకు ప్రియమును హితమును గోరు మావంటి సుహృదులకు వ్యాకులకారణము, మిత్రుల చిత్తశాంతికైనను మీరు పొందుపొసగి యుండుట మీ కవశ్యకర్తవ్యము. "గజానాం పంకమగ్నానాం గజా ఏవ ధురంధరాః," అన్నట్లు సంధానోపాయమును మీర చింతింప దక్షులు, మాబోట్లు చేయదగిన దింతియకా వెంచి యింతటితో విరమించెదను.........

చిత్తగించవలెను.

2.........మాకేల? వారికిని నేనెరింగి నంతవరకు నేటికిని మీపట్టున ననేక కారణములచే గౌరవభావమేయని నా నమ్మిక. నడుమ కలహప్రియుల కుతంత్రములవలన నిది పొసగినదని నాయూహ ఏది యెట్లున్నను కొంతకాలమైనను మిత్రకోటిలో నున్నవారితో కలహము పొసంగినను కొంత సైరించుట ధర్మమని నా తాత్పర్యము. మీరు సైరించిన సర్వమును సమంజసమగును. మీ యుదారతయుఁ బ్రకటీకృతమగునేకాని పర్యవసానము వేరొండు గానేరదు. మీరు శాంతించుట మావంటి వారల ప్రార్థన నంగీకరించి చేసినను చేయుదురుగాని మీయందు భక్తి తాత్పర్య పరిపూర్ణులగు దూరము విచారింపని కొందర నాప మాతరముగాదు. కాన నాభారముకూడ మీపైనే నిలిపెదము............

చిత్తగించవలెను,

సే. చెన్నాప్రగడ భానుమూర్తి.

చ. తిరుపతి వెంకటేశ్వరులు తీరిక నూరక కూరుచుండి సం
గరములు పెట్టుకొందు రనిగా! మును వ్రాసిరి కొంతమంది; వా
రరసి లిఖింత్రుగాక తమ యాశయముల్, "పరికించి యిప్డు వ్రా
సిరి" యని లోక మొప్పుకొని చెప్పికొనన్ గమకించుఁ గావుతన్ 30౬

శా. తల్లా ప్రగ్గడవంశవారినిధిశీతజ్యోతి శాఖాభిమా
నోల్లాసం బొకకొంత కల్గియును నెంతో యుక్తియుక్తమ్ముగాఁ
జెల్లం బాగతి *శాంతి కూర్చు కవితాధీరుండు మాసోదరుల్
కల్లల్ నించుచుఁ దిట్టుచుండుటకు నేకారుణ్యముల్ జూపునో!

మ. ఒగిఁ దల్లాప్రగడాన్వవాయుఁ డిపుడే నొక్కింత శ్రీకొప్రపుం
జగడంపుందెఱఁ గూహసేయుత వృథాసందేహముల్ మాని వీ
రు గడున్ సాహసులం చెఱుంగుత మదిన్ రూఢిన్ విచారింప కే
మిగ మున్ వ్రాసెనొ "వీర్యభానులని" పేర్మిన్ దానిఁ దా దిద్దుతన్.

---

( నిందుకుండ తొణకరాదు. )

......తిరుపతి వేంకటేశ్వరులు నాకు పూర్వ పరిచితులు. ఆంధ్రలోకమున వారి పేరు దిగంత విశ్రాంతముగ వెలసినది. వారి విద్యా ప్రాగల్భ్యమును, కవిత్వవైదుష్యమును, నిరుపమానములని పేరువచ్చినది. వారు బయలుదేరు నాటి కిట్టి మాదిరి ఆశుధారా కవిత్వమును, అవధాన కవిత్వమును, నరుదుగా నుండెను అట్టి కాలమున వీరు దీని నుజ్జీవింపఁ జేసి దానియందే మహా యశస్సును సంపాదించినారు. వారికిప్పుడు వయసు తిరిగినది. భాషాసతి వారిస్థానమునఁ దగినవారిని మఱికొందఱిని నిలువంబెట్టి పురోవృద్ధికరులగు మఱికొందఱు పుత్రులం గాంచినది. ఇప్పుడు కవిద్వితయములును, అవధాన కవీశ్వరులును, చాలమంది బయలు దేరుచున్నారు. వారందఱును వీరి మీఁదికి కాలు ద్రవ్వుచున్నారు. తప్పనిండు. తవ్విన వీరికేమి కొదువ. అట్టిసమయమునఁ దిరుపతి వేంకటేశ్వరు లేమి చేయవలయు? వారు తక్కిన వారితోడ సములుకారె. వారు విద్వత్కవీశ్వరులు దిగంత ప్రతీతిఁ బడసినవారు. వారిక్రింద బయలుదేరిన శిష్యగణమె విశేషముగ నున్నది. వీరందఱునువచ్చి మేము మీకంటె గొప్పవారమని డీకొనిన "నీవెంతరా" యని వారితోడ వీరుఁదలపడుట దగవగునా? శిష్యుఁడు గురువునకంటె యెక్కువవాఁడయిన గురునకు గాక గౌరవము మఱి యెవ్వరికి? ఈ అవధాన కవిత్వమును బయలుదేరఁదీసినది వీరుగాక

ఉ. చూడని యప్డు మావలెనె చొప్పడియుండును భ్రాంతి; యాశువుం
బాడుట తక్క వీరలకుఁ బట్టమ ధారణయందుఁ బూర్తిగా
నేఁడెటు మే మెఱింగితిమొ నిక్కము వీరటులే యెఱింగి యీ
యీడునఁగూడ వారిధృతి కేము తలంక మటం చెఱుంగుతన్.

ఉ. వారిని జూడకున్నపుడు వ్రాసిన వ్రాఁతలకేమి యెట్టులో
దూరపుఁ గొండలన్నగతి దోఁపఁగవచ్చు "వధాను" లంచు మే

---

మఱి యెవ్వరు ? ఒక్కవేళ వయసు దిరిగిన వారిప్పుడు నూతనముగ బయలు దేరు పిన్నవయసు వాండ్రతో వడినిఁ దీసిపోయినఁ దీసి పోవచ్చును. ధారణా శక్తి యొక్కింత తగ్గవచ్చును. అంతమాత్రమున వారి కొక లోటు వచ్చునా? కొప్పరకవులకును నాకును పత్రికాముఖపరిచయము దక్క మఱియొండు లేదు. ...... తిరుపతి వేంకటేశ్వరులారా ! మీ విద్యావివేకములు వీరయెడ నేమియుఁ బనికివచ్చినవి కావు. విద్య వినయమునకు మూలము. మీరు తలపడుట పిన్న వాండ్రతోడనా? వారి వయ సెక్కడ ! మీ వయ సెక్కడ ! ఆంధ్రలోకం బునకెల్ల భాషాపరిజ్ఞానమున గురువులుగాఁ బరిగణింపఁబడుచున్న మీ కిట్టి వాద ప్రతివాదములు తగవు. మిమ్మెవ్వ రేమనిన మీకీర్తికేమి కొదువ ? ఈ మీ కయ్యములు భాషాచారిత్రమున శాశ్వతముగ నిలిచిపోవును. ఈయుపయశస్సు రాకుండఁ గాపాడుట కయినను, మీమీ వినాదములను వదలు కొనుడు.

ఓ కొప్పరపుకవులారా ! మీకీర్తి యచిర కాలమున దిగంత విశ్రాంత మయినది. ఈ వచ్చినకీర్తి స్పర్ధచే వచ్చినదా ? మీకేల అనవసరపు గలహము? అవసరమే కలిగిన దనుకొనుఁడు. ఎవరివలన లోటున్నదో ప్రపంచము గనిపెట్ట లేదా ? ప్రాజ్ఞులెఱింగిన చాలదా ? మీ రెదుర్కొనినంత మాత్రమున మీ కెక్కువకీర్తి వచ్చునా ? మీరిప్పుడు వయసునఁ జిన్నవాండ్రు. "ప్రమాదో ధీమతామపి" అనునట్లు పెద్దలొకవేళ మదిఁదప్పి వర్తించినను మీరు తొందర పడరాదు......మీ, ఆశుధాటి పెద్దనాదుల ధాటినికూడ మించిన దని చెప్పు కొనుచున్నారు. అంతమాత్రముచేత మిమ్ము పెద్దనాదుల కంటె ఘనులని యందురా ? అట్టి తలఁపు మీమనస్సునసైన జనింపవచ్చునా ? ......పెద్దల యెడ నెట్టి కొదువ లున్నను వారు మీకు వందనీయులు. (1911 వ సం॥ సెప్టెం బరు 27 వ తేదీ దేశమాతనుండి.)

తల్లాప్రగ్గడ సూర్యనారాయణరావు.

మూరక వ్రాసి మీఁద భ్రమనొందితిమం చనుకోమె? సోదరుల్
కాఱులు వ్రాసి * తిట్టుటకుఁగా గమకింపరె మమ్ము దానికై. 310

చ. ఎఱుఁగనియప్డు వ్రాసియు నిటీవల దిద్దికొనంగవచ్చు నిం
దరయఁగ శంక యేమి? యిటు లాంధ్రిపుఁబాణినిగారి శిష్యుఁడొ
క్కరుఁ † డొకచోట వ్రాసె, నదిగా మఱి వేదము నేఁటికాలమం
దఱికిని; దానిఁబట్టి యయినన్ బొరపాటును దిద్దికోఁదగున్.

మ. తల్లాప్రగ్గడరావుగారు మము వార్ధక్యమ్మునన్ ధారణా
చిల్లిలన్ గవి సోదరుల్ వృధగఁ గించిత్తేని యోడింతు రం
చెల్లన్ మున్ను లిఖించువ్రాఁత విత, వా రీకర్మమే నేర; రే
కల్లల్ నేరని రావుగారికి వృథాగా భ్రాంతి కల్గెన్ గదా! 312

క. ఉభయాయనుండు సూర్యుని, యభిఖ్యాధరియించు మిత్రుఁడఖిలమెఱిఁగి తా
నుభయహిత మభినయించుచు, నభిమానము వెల్లడించుటది యొప్పుఁగదా!

ఉ. వీరలు వారి నాశువునఁ "పెద్దనకన్నను మిన్న"లన్న యా
ధోరణి, మమ్ము "సర్వకవిధూర్వహు" లంచని కొంత నుంచు నా
ధోరణి, రెండుఁగూడ దయతోఁ గడు "నిండినకుండ" కించిదా
ధారవశమ్మునన్ దొణికి తద్రిస మిట్టటు చిమ్ముచేయుగున్.

ఉ. ఏదియొ వ్రాసె మున్నొకఁడు వృద్ధుఁడు కల్లలుఁ బ్రల్లదంబులున్
బాఁదుచుఁ బండితుం డయిన బంధుసముద్రున; కేది గాంచి "యీ
మాదిరి వ్రాయునే యకట! మాన్యుఁడుఁ గూడ" నటంచు నెంచి దా
యాదుఁడు చింత నొందెనో; మహాత్ముఁ డతం డిపు డేమి వ్రాయునో!

---

* (దర్బారులోని కొప్పరపువారి జ్ఞానోపదేశమునుండి.)

మ. "అనుమోదంబున వేలనియ్యఁదగమన్నా? పద్యముల్ గొండటం
చును మమ్మన్నవచించి యీర్ష్య నిపుడిచ్చో సామ్యమున్ గూర్ప రా
దనుచున్ రెండువిధాలఁ ద్రిప్పనిది నాల్కా? తాటిపట్టా?"

‡ (మనోరంజని 15 వ జూన్ 1912 సం॥)

......తాను స్వయముగఁ జూడనివిషయమును బరుల మాటలనుబట్టి నిర్ణయింపఁ బూనుట యంతకంటెను బొరపాటు ఏవిషయమందైన నిజము తెలియకముం దేమనుకొనినను, దెలిసిన వెనుకఁ దన యభిప్రాయము మార్చుకొనకుండుట యన్నిటికంటెను బొరపాటు.........

చ. ఎవఁ డలనూజివీట మము నించుక చూచినయంత భీతిమై
నవసెనొ "గుట్టు మే మెఱిఁగినా"మని; నున్నలపన్నమున్ దగం
గ వినిన బ్రహ్మరాక్షసునికైవడి మానుడి కిప్పఁడేనిఁ బె
ల్లవకరమున్ వెలార్చుచు భయంబడె నాతఁ డిఁకేమి వ్రాయునో!

గీ. ఎవఁడు "హితవాది" పేరున నేదొ సోద
స్వలిపితోడన వ్రాసి యెచ్చటికొ యనిచి
తుట్టతుద నేదియో తనపొట్ట నున్న
తుట్టఁ గ్రక్కెనొ యతఁ డిప్పుడెట్టు లనునొ!

ఉ. ఆలిపియందు నొక్కెడ హంసపదం బిడి దిద్ది స్వీయమా
వ్రాలునఁ గొంత వ్రాయు నొకపండితుఁ డిప్పుడు "కొప్పరంపువా
రేల వృథాగఁ బ్రల్లదము లిన్ని లిఖించిరొ తెల్పు" మన్న నే
మూలను డాఁగునో జనని! మ్రోఁగునొ, వేఱొకత్రోవ కేగునో?

ఉ. వృద్ధునివ్రాఁత గూర్చినది, పేరిట లేమిని గొంతమందికిన్
శ్రద్ధగఁ జూచినప్పటికిఁ జాల దురూహము గాఁగఁ దోఁచు లే
సిద్ధము, వీరియుత్తరము చేతికి రామిని నిట్లు వ్రాసినా
మిద్ధరణీసురుండును నికృష్టుఁడు గాఁడు ప్రసిద్ధుఁడెంతయున్.

ఆ. వె. ఊరిపేరు వ్రాయ నున్నగుట్టంతయుఁ
బైటికెక్కు నితని వ్రాఁత నొకటఁ
"బ్రాడ్వివాకు"లాది పలుమంది చూచి 'సీ'
యని రటంచు వింటి మంబ! యేము.

శా. చాలన్ వృద్ధత గూరియుండియును వాచాదోషముల్ వ్రాసి తా
నే "లా"చూపి యమున్ జయింప మదిలో నీతండు తా నెంచెనో?
కాలం బెట్టిది! యిప్పుడేని దనకుం గాఁబట్టదే సత్యపుం
జా, లౌరా! యితఁ డింతగా మునుఁగునే శాఖాభిమానాంబుధిన్.

గీ. చాటువ్రాఁతల కేమి వాచాటులగుచుఁ
బైకిఁ బత్రికలందున * బరుసు వ్రాఁత

* చ॥...హరు నిటలాక్షదృష్టి నివహంబులపాలయి స్వస్థ్యులయ్యెడిన్.
...మే దక్షులమంచు నిక్కెదరు విద్వద్ద్వేషమున్బ్రాని!

లెట్టులున్నవో యెఱుఁగవా ? చెట్టలకును
వ్రాయరాని వ్రాఁతలుగూడ వ్రాలునోకొ.

ఉ తొలిపల్కినచొప్పున ముష్టిచెంబు గే, లంగోని బిచ్చమెత్తుటయె లాభమటంచు నెఱుంగ రాదొకో ! చ॥...పడఁబోలు నె బూతుల...

(15 అగస్టు 1912 సం॥ మనోరంజని)

(దర్బారు పత్రికలనుండి)

.........బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరులకు— చి॥ చక్రవర్తుల సుబ్బారాయశాస్త్రికి... మ॥ అరుగంజాలరు క్రోశమాత్ర మొకనిన్ హర్షమ్ముపై జూడలేరు రుజగ్రస్తులరై తలల్ నెరయగా రూపంపు సొంపెల్ల చెదరిపో వార్ధకమందె...శా॥ ఆసన్ద్రుంపుము,......మదమ్మంత్యమ్ము నొందింపు...చ॥ కుజ్జ! మాటల నహీనత హీనత దోచుచుండుటల్, తిరుపతి వేంకటేశ్వరులు దేశికులా! యిక జెప్ప నేటికిన్॥

17—1—12.

"(పశ్యా పశ్యో నపశ్యతః విమర్శనశేషము.)"

......యః ఎవఁడు తప్పఁద్రాగుటచేత (ఇది ప్రకరణముబట్టి తెచ్చుకోవలెను) నపశ్యతి ఏమియు కనజాలఁడో,యః మఱియొకఁడు పశ్యతి జగత్సర్వం అర్థాత్ కావాసుందరీ మేదృష్టిపథమియాదితి, (ఇదం సాహచర్యనియమలభ్యం) చక్కని దివతె కంటఁబడునా యని జగమెల్ల కలయజూచునో, తావుభౌ అపశ్యౌ ఆచదివిన యపండితు లిరువురును పరం ఆత్మానం పరుఁడగు నాత్ముని నపశ్యతః కనఁజాలరు. పశ్య (మిత్రమా) చూడుమా......

బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులకు.

......ఛీ యనకుందురే జనుల్...పూర్వసువాసినీ గౌరసంబు॥...
......కొంగా ! హంస నెదిర్చి భంగపడకే కోల్పోకె నీమానమున్।...
...తే. గీ. మేటికవులనితోచిన మీరెవారి, చరణములధూళి శిరముపై జల్లికొనుఁడు, ఇంక నేమేని యొనరింపుఁ డింతెకాని, కలుపకుఁడు మమ్ముమాత్ర మికార్యమందు;...... మీసింబోతు గాంభీర్యము నింకెంతకాలము వఱకు ప్రజలకుఁ జూపెదరు. తటాలున యొకరినని "పండితబ్రువము మొదలగు గ్రంథములకు కథానాయకులగుటతో నైనఁ దమకు తనివితీరలేదా?......... మీపాండిత్యమునకుఁ దోడు సభకూడ జేయవలయునా...... సీ. అగ్రహారత్రితయాధిపుం డకేఁడు వారక దేవిరించు యాచకులు మీరు......... సీ.అల్లి

క. ఆయీ వ్రాఁతలఁ గన్గొని, కోయుచు నొక వృద్ధసుకవి రూక్షేక్షణుఁడై
'ఛీ' యనియంతటవిడువక, ధీయుతుఁ * డెటువ్రాసెనొక్కొ! తెలియదబవనీ!

ఔల్లిగ నాల్గు కల్ల లల్లి లిఖించి కడిమి జూపెడు దివాకర్ల భట్టు, వెఱ్ఱిభంగిని తొఱ్ఱి మొఱ్ఱి వ్రాతలు వ్రాసి వేరుగాంచెడు చెళ్లపిళ్లభట్టు...

(ఇట్టివ్రాఁతలకు మితియే లేదు)

షరా:— ఆయీ వ్రాతలు, గొండఱ వ్రాళ్ళుగల చేటభాగతపు వ్యాసముల నుండి స్థాలీపులాక న్యాయమున నెత్తిచూపఁబడియె, విస్తర మాయీ దర్బారు పత్రికలయందే చూడఁదగు ఏతిట్టుతిట్టినను శిరసావహించి "దర్బారు" ప్రకటించుచున్న దనుటకు విస్తరించి యుదాహరణము లవసరములేదు. జగమే సాక్ష్య మీఁగలదు. విస్తరించి యుదాహరింపఁ బూనుదుమేని దర్బారు సంచికలలో మూడువంతు లుదాహరింపవలసియుండును. అట్లు చేసినచో గబ్బము విస్తరిల్లుటయే కాక తిట్లమయము కావలసివచ్చును. ప్రాజ్ఞు లింతటితోడనే తృప్తినందుదురు గాక.

(* 1912 సం॥ డిశంబరు అభినవసరస్వతినుండి)

ఈక్రిందఁ బ్రకటింపఁబోవు పద్యములను బ్రహ్మశ్రీ అమరవాది రామకవిగారు మాకుఁ జాల దినములక్రిందట నంపిరి. ఇమ్మహామహుఁడు కడు వృద్ధు. ఈయనఘునికవిత్వము వసుచరిత్రపాకము ననుసరించి యుండును. ఇప్పటి కాలమున నాంధ్రకవిత్వ మీకట్టుదిట్టముగాఁ జెప్పు మహాకవులు మాసీమ యందే కాక యితరత్రఁగూడఁ గడు నరుదు. తిక్కనాదుల కాలము నుండి మా కొండవీటిసీమ మహాకవులకు నివాసమై యశము నందుటయు నేఁటి కట్టిసీమను కుకవులు తండోపతండముగా బయలువెడలి కుకవిసంరక్షణముగా సుకవి నిందన మొనర్చుచుఁ గడు నజ్ఞానులై వర్తించుచుండుటకుఁ గొంకి దీనివలన సీమ కెల్ల నప్రతిష్ఠ వచ్చునని తలంచి యీవృద్ధమహాకవి యీపద్యములు వ్రాసి పంపిన ట్లూహింపనయ్యెడిని—

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః

సీ. అలమేలు మంగలాభాప్తిప్రవర్తిలు నొక్కఁ డలమేలు మంగలాభాఢ్యులొకరు
విబుధసపర్య శోభిలుచుండు నొక్కండు విబుధసపర్య శోభిలుదు రొకరు
శ్రీమత్కళావృద్ధిజీవనుం డొక్కండు శ్రీమత్కళావృద్ధి జీవు లొకరు
రాజితాహీనగోత్రస్థితుం డొక్కండు రాజితాహీనగోత్రస్థు లొకరు
తే. గీ. నామమాత్రానఁ గాక గుణక్రమమున
సములు తిర్పతి వెంకటేశ్వరుల కట్టి

క. ఈయమరవాది వంశజుఁ, డీయనఘుం డీమహాకవీశ్వరుఁ డకటా!
రోయునె రామసుకవి యొరు, లే యవివేకమును జూపరేని భవానీ!

---

సరసతిరుపతి వేంకటేశ్వరులఁ దెగడు
వారు విబుధాపకారులు గారె తలఁప.

సీ. గద్వాలనృపతి రంగ ద్వాలఖిల్యాభమతు లంచు విత్తసమ్మతులఁ జేసె
నాత్మకూరున ముదంబాత్మ కూర ఘటిల్లె రోహణోపమగజారోహణంబు
వేంకటగిరిరాజు వేంకటగిరిరూప ఫణితుల్యులని ధనార్పణ మొనర్చె
విజయనగరి, వాద విజయనగరిపుదేశికు లంచు రాజకాశికులు మెచ్చి
తే. గీ. రందు నిందన నేటికి? నఖిలలోక
మస్తకన్యస్తకీర్తి ప్రశస్తులగుచు
వఱలు తిరుపతి వేంకటేశ్వరసుకవుల
నీర్ష్యఁ రిపు లేవగించిన నేమి తఱుఁగు.

సీ. కావింతు రెవ్వారి గాఢోత్సవుల సుధీదుర్లభబహుపారితోషికముల
భావింతు రెవ్వారిఁ బరిచితగ్రంథశబ్దపరిష్కృయార్థవైదగ్ధ్యసరణి
సేవింతు రెవ్వారిఁ గోవిదప్రావృతధాబస్వద్గుణాంశముల్ పట్టువడఁగ
రావింతు రెవ్వారిఁ బ్రాజ్ఞగోష్ఠీ చర్చికల కగ్రగణ్యులఁ గావరించి
తే. గీ. సకలదిగ్దేశధీరరాజన్యు లట్టి
సరస తిరుపతి వేంకటేశ్వర సుకవుల
ఖలు లసూయాపిశాచసంగ్రస్తు లగుచుఁ
బదఱుటయు వారలకు నొక్క ప్రాభవంబె!

సీ. ఆత్మయశోవర్ధనాసక్తియే కాని పరకీర్తికి నసహ్యపడుట లేదు
వైదర్భిరీతిఁ గావ్యము ల్లుటయె కాని పటిమకై గౌడిఁ జూపుటయు లేదు
పరకావ్యముల గుణస్ఫురణ మెన్నుటె కాని తప్పు లన్వేషించు తలఁపు లేదు
పామరునైన సంభావించుటయె కాని యొగి గర్వమతిఁ జూడకుంట లేదు
తే. గీ. కలరె యిటువంటి బుధులని కవులు మెచ్చ
వఱలు తిరుపతి వేంకటేశ్వరుల నీర్ష్య
నింద సల్పిన వాఁడగ్రికే నిందగాక
వారి కీర్తికి సుంత లోపంబు గలదె.

సీ. కోవిదామోదంబుఁ గుమతిదుర్వాదంబుఁ బూన్పరే మాన్పరే భూరిసభల
సంస్థానములయందు సరసాసనములందుఁ బఱపరే నెఱపరే పద్యబహుళ
చటులశబ్దపథంబు శతవధానవిధంబుఁ బాపరే చూపరే స్వకవనముల
సాహిత్యజనసముల్ సాహిత్యకవనముల్ చేర్పరె నేర్పరే శిష్యతతికిఁ

సీ. "వెంకన్న"* యని వ్రాసి వెక్కిరించితి బాగుగా నంచు నొక్కండు మేను మఱచు
"వెంకటే" సని వ్రాసి జంకు నాకేమని యొక్కండు సంతోస మొందుచుండు
"వెంకప్ప" యని వ్రాసి వేళాకశం డాత్మలో నానందపారవశ్యమును జెందు
"వెంకం"డనుచు వ్రాసియింకేమి కావలె ననుచు ముఖ్యొక్కండు గను ముదంబు

గీ. అరి యొకండు "వెట్టివెంకటాయ" యని వ్రాసి
పరమసంతోషవారిధిఁ దిరుగులాడు
నేమనఁగవచ్చుఁ గొప్పింబు నోమఁదలఁచి
పడెడి పాటులు తత్ప్రతిపాతు లకట !

---

గీ. దాదృశోదారశీలసందర్భులగు మ
హఱలు తిరుపతి వేంకటేశ్వరసుకవుల
నీర్ష్య నిందింప వారల కేమికొఱఁత?
కొఱఁతఁ బలికినవారికే కొఱఁత గాక.

సీ. ఆరూఢ సాహితీవ్యాకరణభ్రాజదదితికళ్యపుఱయుం డవతరించి
చర్చితార్యసభా ప్రసంగవాక్ప్రౌఢిదంభాదితి స్తన్యపానాప్తిఁ బ్రబలి
సంస్కృతాంధ్రికవిత్వచాతురీకైతవదౌలోపనయన సంస్కారణ మొంది
వరకావ్యమోదితనరపాలబహుమతివ్యాజనానాకళ లభ్యసించి

గీ. బహుళితశతావధానాదిపాటవాఖ్య
బలిసవనయుక్తిఁ బెరిఁగి విశ్వమయుఁడయ్యె
సరసతిరుపతి వేంకటేశ్వరయశస్త్రి
విక్రముం డయారె ! వారి భావింప వశమె !

* (16 వ ఆగస్టు 1912 సం॥ దర్బారు పత్రిక నుండి )

...... ఓ ఏడుకొండలవాడా! ఓ తిరుపతి వెంకన్నా ! ఓ మహాప్రభో ! నీవు చాటువనుండి యమాయకులను ప్రేరేపించి వారిని యావహించి యపవాదముల నేల పలికించెదవు ? నీవు వారికిని వీరికిని పూనుటకంటె ప్రత్యక్షమయి యేమి కావలెనో యేల కోరరాదు ? నెయ్యి కొబ్బరికాయలు పడపప్పు పానకము చేసి విన్ను శాంతిపరచెదము. మాయందు దయయుంచి నియోగి నైదికులకు వైషమ్యములను జంప వరమియ్యుము. అప్పుడు నీ పేరు సార్థకమగును. కోపించి యపవాదములను వెల్లడించిన ఈ యిరువదవ శతాబ్దములో నమ్మువారెవరు? కావున శాంతింపుము శాంతింపుము. 'నియోగి'

షరా: — ఇట్లు స్వయంకృతాపరాధమును మాపైఁబెట్టి వ్రాసినను, ఈ యన తిట్లుతిట్టని హేతువునఁ గడుయోగ్యుఁ డనుకోవలసియున్నది. వెంకన్న అనునదియే యొకతిట్టుగా నాయన తలఁచి యుండును గాని మాకంతమాత్రమునఁ

ఉ. ఇంకొకఁ డెవ్వరో తెలియ దేవపుఁ "బండితపుంత్రబువంబు" నే
కొంతును లేక వ్రాసె మఱిఁ * గూర్చియె యంచును బత్రికాధిపుల్
జంకక తేల్చి, రయ్యదియు సత్యమె; బండయుఁ గూడ నట్లుగా
బొంకులుఁ దిట్లు వ్రాయఁ డని పూర్తిగఁ దోఁచెడి నంబ, శాంకరీ!

శా. ఆదుశ్శ్లోష్టకు రోగ్యులెల్లరును 'వాహా' యంచు 'సీ' యంచు "నే
మీ! దౌర్మార్గ్య" మటంచు నొచ్చుకొనఁగా మిన్నంది "మేల్ మేల్ బళీ"
నాదంబుల్ పచరించుచుణ 'గవిత' విజ్ఞానంబు చూపించె నోఁ
గా! "దుత్తూ రది భంగులోఁ" గలియుచో నాశ్చర్య మే ముండెడిణ!

క. ఈపాటు లీయసత్యము
లీపోకడలెల్ల "వారికే మానసముణ
బ్రాపింప" మనుచు మాపైఁ
గోపించుటఁజేసి పుట్టె కొస కిట్లయ్యెణ.

ఆ. వె. ఆసనమ్ము కొఱకు ననుఁగుం గవులు విద్ద
లభ్యసించు నొక యుపాయ మేది
యేని జూడవలయు నిస్సిరో! యీతిట్టు
లేమిసేయు నింత రొయుఁగ రంబ!

---

బోయిన దేదియులేదు. నిజమగు మా పేరదియే యగుటచే సంతసించుచున్నా
రము. ఈ కక్షను బెట్టినవారెవరో యీ కబ్బములోని ప్రాజ్ఞుల లేఖలవలన
విస్పష్టపడును గాన నిఁక నేని యీయన నిజ మెఱిఁగి తన మ్రొక్కు-ను జెల్లించి
కొనుఁగాక.

* (22 డిశంబరు 1911 సంll ఆంధ్రకేసరినుండి)

"రామేశ్వరీయము" అను పండిత బ్రువలక్షణము :— ఈ చిన్న పద్యగ్రంథము
రామేశ్వరకవి గారిచే రచియింపబడినది. వెల ఒక అణా. ఇది తిరుపతి
వేంకటేశ్వరులకును కొప్పరపు కవులకును జరుగుచున్న కలహము విషయమై
రచియింప బడినట్లు కనబడుచున్నది "..........

పరా:— ఈ కేసరిపంక్తులవలన "పండితబ్రువము, అనునది ప్రకృతకల
హామునకు సంబంధించినదేయని తెలునఁగదా! ఇంతకుమున్న దర్బారు పత్రిక
దానిని మానెత్తిని బెట్టినదనుట విస్పష్టము. మఱియు నీయంశమునే కవితా

శా. * మున్నే తెల్పితి మేల తిట్టెదరు మీమూర్ఖత్వముల్ సారెకున్
వన్నెల్ వాలెడిఁ గాని దాన జనియింపక్ బోదు లాభం బటం

పత్రిక కూడ తేల్చినది దానింగూర్చి గీరత పీఠిక చూడఁదగు, పండితబ్రువమును గూర్చి యెవరో పండితకవి యేవగించుచుఁ బద్యములు వ్రాసి పండితబ్రువ మను పుస్తకమునందే అంటించి పంపియున్నాఁడు. ఆపద్యము లీక్రింద నుదాహరింపఁ బడుచున్నవి.

మ॥ తమపాదమ్ములు పట్టి తొల్త దమనిందన్ బిమ్మటన్ జేయుమా, ర్గము గైకొన్నమహాత్ములల్లె యిపు డీరక్షోగణంబెంచి...... నీచశ్లాఘ్యు మీగిత్తమున్ ఛద్మమదీరంగ లిఖించె దీనిఁ దమ రుగ్రప్రజ్ఞ వారింపరే. ఉ॥ ఊరును బేరు లేక గొబయోరఁ జరించెడి కొండబట్టె లీ, తీరున విట్టవీఁగుటకుఁ దేలెను గొం డబెమ్ము హేతువం, చేరు పెకల్పలేరనుచు నెంతురు కొండను కొండప్రక్కనా, రారయ మీరు కన్ దెఱచునంత ఫెడీలునఁ గొండఁ గూలదే. శా॥ నోటన్ గీటము లుప్పతిల్లునటు కన్నున్ మిన్నునుం గాన కే, చేటోమూఁడి నవాటుఁ డెవ్వఁడో కొనించెం దిట్ల డబ్బీలు ది, వ్యాటోపస్ఫుర దాశుధారకవితాత్యా నందసద్గ్రంథవా, ర్ఘాటిన్ బాటిలు మిమ్ము నిందలదురాస్థన్ ముంచితేల్చన్ వెసన్. శా॥ చెంపన్ గొట్టినయ ట్లసాధుతను బెంచెం గాదె యాకాశి యా, పెంపుం బెంపొనరించి కొన్నిట బుధప్రీతిన్ బొసంగించు ప, శ్యాంపుశ్యాం ప్రకటింపఁ గావలయుఁ గొండా! కూలు, బండా! పడున్, గంపన్ మేసెడి కొండబట్టె లకు వైక్లబ్యంబు గల్గుంజుఁడీ. ఆ॥ వె॥ కొండబలము బండకుండె దానిబలమ్ము, కొండబట్టియలకునుండె నార! బండ, కొండ, కొండబట్టియల్ కుయివెట్టఁ, జేయు బిగువు తమకె చెల్లియుండె॥

* (శాఖాభిమానప్రవర్తకులగు లౌకికశిరోమణుల కొక హెచ్చరిక.)

ఉ॥ తిట్టిన లాభమేమి! కసిదీఱఁగ వీలగునేని యెప్పుడో
కొట్టిన లాభమేమి! యది కోవిదమార్గముగాదు, ముద్దు చే
పట్టితి రెట్టులో విఱుగ బాడిత కొమ్ములు రెండు, వానిచే
నెట్టఁ దలంచినా ర్కమము వినీతికిఁ దక్కు భుజాబలమ్మునన్.

చ॥ పయినొక చింతకొమ్మ కెగఁ బ్రాకితి, రందలి పండ్లు పుల్లఁగా
నయి వెగటై యసహ్యమయి యందఱకున్ దలవంపునించె, నే
మియు నొనరింపలేక పయిమిక్కిలిమీఁదికి దూఁకుచుంటి, ర
య్యయొ! జగతీతలం బెఱుఁగదా! నగదా! పగదాఁగనేర్చునే!

చు, న్నానాఁటికి బుద్ధి గల్గెడి నటంచున్ మేము భావింప నే
మన్నన్ లే దభివృద్ధి చెందె నకటా ! మాంద్యంబు సాంద్రంబుగన్.

శా. మేమే కా దిటు లెంతమందియొ, సదా మిన్నంది దూషింప ను
ద్దాముల్ వీరిని మందలించి రెవరిన్ దా మింత లెక్కింప కే
మేమో తిట్టుచు వ్రాయుచుందు రకటా ! యీవేని యవ్వారికిన్
ధీమత్త్వంబు నొసంగు మంబ ! యటుపై ధీజాడ్యముల్ వోయెడిన్. 328

శా. చల్లా పిచ్చయశాస్త్రి నీతి గఱఁపెన్ జాజ్జ్వల్యమానప్రభా
కల్లోలాకులమైన పద్యతతితో గాఢాగ్రహోదగ్రుఁడై

---

ఉ॥ రాజును బట్టుకొన్న పయి రాష్ట్రిజనుల్ చెలరేఁగితిట్టు నా
యోజను మీయొనర్చు పనులున్నవి శాఖుకుఁ గీర్తిదెచ్చు టీ
యీజతనంబులం గలుగునే ! పయి పెచ్చుపకీర్తిఁ దక్క నా
హా ! జగమెల్ల గుడ్డిదనియా ? సకలమ్ముననుం దగించుటల్.

(విస్తరము "పశ్యాం పుశ్యాం" లో చూడుడు)

తిరుపతి వేంకటేశ్వర స్తవము

(1912 వ సం॥ సెప్టెంబరు 9వ సంచిక అభినవసరస్వతినుండి.)

శా॥ "వెంకన్నా !" యనునంత లోటగునె నీవిఖ్యాతి విద్వచ్చమూ
సంకాశస్ఫుటవైదుష్యీభరితవాచాచాతురీ శ్రీవిరా
తంకప్రోత్థమహాకుసంఘటితపద్యజ్వాలసద్ఘంటికా
టంకారమ్ముల నాలకించి చనుబండల్ వేంకటేశప్రభూ!

మ॥ తలవాంచి కరమ్ముల న్మొగిచి పాదద్వంద్వముం బట్టి త
ప్పుల సైరింపుఁడు మీకు దాసులముగా మో యంచుఁ గాల్చెప్ప దె
బ్బలకాసించెడి వారిఁ జూడకయె గప్పాల్గొట్టి ని"న్నేడుకొం
డలవాఁడా !" యన నీ యశోరమకు లోటా ? వేంకటేశప్రభూ !

శా॥ ఱంకెల్వేసిన లాభమా ? మిగుల బారల్సాచినన్ లాభమా
బింకాల్గొట్టిన లాభమా ? వెడనుడుల్ వ్రేలంగనే లాభమా ?
జంకున్వీడి ముఖాముఖిన్ గనవలెన్ సామర్థ్య మామీఁదటం
జంకల్గొట్టనలెన్ 'బళీ !' యన బుధేశా ! వేంకటేశప్రభూ !

శా. జంకుల్గల్గఁగ నొక్కవే, కడలినిచ్చల్ దాఁటుచో రెండు వే
ల్లంకం జేర్చిన మూఁడువేలని కపుల్లాంగూలముల్ సాచి ని

పిల్లుల్వోలెఁ దదీయధాటి కొకటన్ బెంపేది వాచాటకుల్
చల్లంగా నొదుగంగఁ జొచ్చిరి వచసార్స్నంబు దూరంబుగన్.

---

శ్శంకఁద్రొక్కిడి యాలువేలయిన నీసౌమ్యత్వముంజూపి వే
టెంకాయల ల్బలివెట్టువారలఁట వింటే! వేంకటేశప్రభూ!

శా॥ అంకమ్మన్భజియింతురో, యటులుగా కొండమంగొల్తురో
కంకాళింగనఁబోదురో, మఱియు మేఁక ద్రుంగుదేవర్లకుం
కైంకర్యమ్ములఁ జేతురో! హరిహరీ! కాకున్న లోకత్రయిం
బంకాఁజేసిన నీకెటుల్ శివములప్పా! వేంకటేశప్రభూ!

మ॥ ఎటనో మూలనుగూరుచుండి తనపే రేమూలనో దోపి ప
ట్పటఁ బండ్లూరక పిండిఁజేసికొని కంఠస్థాభిమానమ్ముతో
గుటక ల్మ్రింగుచుఁ దొంటి వారిఁతలకు సంకోచింపకే లేచి చ
ప్పటులంగొట్టఁగ నీకు లోటగునె యప్పా! వేంకటేశప్రభూ!

ఉ॥ ఏడనొ కొండనుంటివని యెంతురుగాదె కపీంద్రులెల్ల న
ట్లాడెదు కొండలన్ని తునియల్వొనరించు టెఱుంగరైరి మో
మోడి భజించువారలను బ్రోతువటందురు కాని నెత్తిబో
చ్చాడఁగఁ గొట్టుచుందు వని యూహ యొనర్పరు వేంకటేశ్వరా!

చ. తెలియఁగలారె యెల్లరును దిర్పతితో వసియించియున్ జగం
బులఁ గలజీవరాసులనుబొంది జగానిగలీను కీలుబొ
మ్మలవలె నాడఁజేతువని మాటికిమాటికి నోటితీటచే
గలబిలసేయుచున్ శివముగాఁ దలపోతురు వేంకటేశ్వరా!

మ. పెసలే చౌకగనున్నవో! యకట యాబెల్లంబె బల్చౌకయో
వెసఁ దమ్ముం గడతేర్చి యెల్లపుడు దోర్వీర్యంబు సంధించుచోఁ
బొసఁగం జాలినయంత నీకు వడపప్పున్ పానకాల్సేతురం
ట! సెబా సెంతటిమాట వింటిమయ కట్టా! వేంకటేశప్రభూ!

మ. కరముల్దొప్పలు సేతురంట! మదిలో గర్వంబు లేదంట! గు
ర్గురలేమూలను లేనెలేవఁట! పరాకుల్ తెల్పువారంట! త్వ
చ్చరణాంభోరుహచంచరీకులఁట! మీసాత్తీయలేరంట! యా
వరముల్ కావలెనంట యేమనెదు? దేవా! వేంకటేశప్రభూ!

ఇట్లు, చల్లా పిచ్చయ్యశాస్త్రి.

క. * సుమనోఽ వతంసకృతిక, ర్త మహాభాగుండు సుగుణరాశి యితఁడు స
ర్వము నెఱిఁగి మండలించిన, క్రమ మంబరా! సర్వసుజనగణ్యముకాదే.

ఉ. వంగిపురాన్వవాయు నటువంటి మహాత్ముని గూడ సుంత పే
ర్మిం గన రీప్రబుద్ధులు సమిద్ధపరాక్రము లంబరంపువీ
ధిం గడు దూఁకులాడుదురు తేఁకువ కొండొకయున్నఁ గాదె చె
ప్పం గలవారు చెప్పుటయు వారక వింటయు సోమహేశ్వరీ! 331

(* శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులు. బి. యే. యల్. టి. గుంటూరు కాలేజీసహోపాధ్యాయ విరచిత "సుమనోఽ వతంసము" నుండి.)

క. శ్రీనాథుం డిల సత్యము, నేనాఁడును బ్రోచు మండ నింపుదలిర్పన్, ధీనిధి సత్యవిమర్శన, చే నెగడుచు నుండుఁగాత శిక్షితమతియై॥......చ॥......గుం, టురిపుర వాసులార! నెగటుం బడ కీసు వినుండు సాధు స, చ్చరణసరోజ సేవనల సత్సుమనస్సులు కింకవీంద్ర సిం, ధురపృథు దేహనిస్సరదనూనమదాపహృతి ప్రభూత సు, స్థిరనిగవద్యదిగ్వితతిదివ్యవిభూషణసద్యశస్స్ఫురి, త్తిరు పతి వేంకటేశ కవిధీరమృగేంద్రుల చెంతఁ జేరి సా, దరమతి విద్యనొంది కవితా పరికల్పనచాతురీ ధురం, ధరుఁడయి... వే, లురి శివరామశాస్త్రి బుధలోలు పమానసపద్మఁ డట్టె గుం, టురిపురికాలెజీ కవివినోదనపూరుషసంఘమందు దు, ష్కరనిజధీవిలాసకృతిచండము లెల్లను జూపి శారదా, పరమపవిత్ర విగ్రహవిభాసితకాంచనముద్రి నందుడున్, సరతతి మోదవర్ధనని నాదసముచ్చయ పూర్వకంబుగా, వరశకటాంతరంబున విధాసిలఁ గూరిమినుంచి యాబుధున్ బురి రమణీయవీథులను బొల్పుగ నుత్సవమొప్పఁ గాలెజీ, సరసకళార్థు లెల్లరు ప్రసన్నముఖుల్ విహరింపఁజేసి చే, రిచి నిజమందిరాళి 'భళిరే' యని పెద్దలు మెచ్చుమంచ; న, ద్దిర! మఱునాఁటి రాతిరి హృదిం బురికొల్ప కుతూహలంబు మై, సగునఁ బాకశాస్త్రవిదు సౌమ్యముఖాశ్వవరాధిరూఢు సుం, దరముగ నూరఁదిప్పిరి వృథా వ్యయమెంతయొ చేసి కొంద ఱై, వ్వరో; సుమనశ్శ్రవః కుహరపాటనమాఁ గద దీని విన్న; న, వ్వరో బుధసంతతుల్, శ్రుతికిఁ బర్వ మెకా యని మెత్తురొక్కొ! చే, సిరో లఘుతాలఘుత్వ పరిశీలన సన్మతు లిట్టు లెప్పుడేన్? సరసతఁ బాకముల్ నవరసంబుల నొప్పఁ గవీంద్రపాచకుల్ వరఁగఁ గృతుల్ రచింతు రని వారల సామ్యము చాటియుంద్రొ! యే కరణి నలంకృతుల్ గుణనికాయము శ్రావ్యమనోహరధ్వనుల్, విరివిగఁ గల్గియుండి కవిబృందమనోహరరై చెలంగు నా, వరకవితాతనూజఁ గను భాగ్యము పొచ

శా. కార్యాకార్యవిదుండు సూనృతవచఃకైవల్యపాథోధిసం
సార్యగ్రేసరుఁ డాంధ్రహూణముఖభాషాశేషుఁ డీకృష్ణమా
చార్యుం డారక పాత్ర మొందు విరచించన్ దీని కూర్చుండె నే
ఆర్యుం డెన్నటికిన్ సహింపఁడుకదా ! అన్యాయధన్యాత్ములన్.

---

కుఁ డంద నేర్చు? ని, ట్లరయక లోకగర్హ్యాకృతి హర్షముతోఁ దిలకింప న్యాయమా?, అరుదగు శేముషీమహిమ కక్కజమందుచు విద్వదర్హ స, త్కారణము సేయ దోషమె? బుధప్రవరాళినికారసక్తులన్, విరసమనస్కులన్ గురువివేకరమాఢ్యులు "కూడ విట్టి తుం, టరిపను లంచు గొబ్బున జనంబులు మెచ్చ నివారణంబు సా, కిరులయి చేయకుండ రది కేళి విలాసముగాఁ దలంచి...... విమర్శనేయుచో నొరులని యస్మదీయులని యొప్పనిభేదము లెన్న బుద్ధి స, త్వరమయి న్యాయదృక్పటిమ వాయుచు స్వీయజనాళికృత్య మం, దరసియుఁ గాన దొక్కనెర నైనను; జూపిన ధర్మ మంచనున్, బరకృతియం దనేక గుణవారము దోషవితాన మంచొగిన్, దురుసుఁదనంబుతోఁ బలికి దోసపు లేశము గొప్పఁజేయుఁ; నీ, పురి విపరీతవార్త వినఁబోలును; దాన నెఱింగి మద్వచ, స్సరసత సద్విమర్శనము సల్పుము మిత్రమ! అద్ది యేది యం, చరయ నియోగివైదికుల కక్కట! పోరు సముద్భవిల్ల నొండొరులు ప్రభిన్నమార్గులయి యొప్పగఃగూడరు వైదికక్రియా, చరణము నందు; వాక్కలహచండత ద్వేషము పెద్దసేయ సా, గిరఁట; నియోగి యాశుకవికిం దగు కారణ మేమి లేకయే, పరు లవధానులిద్దఱు సభన్ దమ నైపుణి చూపుమండ, నా, సరసని షీరముంచి రది 'సత్సభ గూడను గూడ' దంచు ను, ద్ధుర కలహంబు హెచ్చడు "సభూవరులెక్కఁగఁ బల్లకీని నె, వ్వ రితరు లెక్కఁగోర" రనిపల్కెడి నిద్దఱిలోన నొక్కఁ డం, దఱు వినుచుండ; నైనను వృథాగఁ దదాసనచర్చ మానకుం, డిరి; మది నొవ్వఁగా నతఁ డనెన్ "ఒక చెంగటఁ బీఠమందు నె, ప్పరుసునఁ గూరుచుండఁ దగు పండితుఁ డయ్యెడి నీతఁ"డంచుఁ దీ, సరపడె; యాంతనంత శ్రుతిపాటనకారివచోహతాత్ములై, యతిగిరనంగఁ గొందఱు రయంబున నాశుకవీంద్రు తోడఁ జే, రిరి గృహముల్; నిజాతిశయరీతుల నాశుకవీంద్రుఁ డంత రా, తిరి ప్రకటించెఁ బత్రికలఁ దేఁకువ నాడెఁ దెలుంగుమీస మి, ర్వురు నిలుపుం డటంచు, నెగఁబోసిరి లేఖలపైని లేఖలన్ ; బురజను లెల్ల రుండఁగ నమోఘు

ఉ. ఈయనఘున్ వచించుపయి నింకొకనిన్ వచియింతు రప్పరిన్
ధీయెడ యోగ్యతాగరిమఁ దేఁకువ లోఁకువగాని శక్తి; గాం
గేయునికేని లోపము లగింపఁగఁ గొండొక వచ్చు, నీయుపా
ధ్యాయునికిన్ బి. యే. ఎలిటి. కంబరా! లేదు కళంక మెయ్యెడన్.

---

విదగ్ధవచశ్శరార్చులన్, మరలఁగఁ జేయువానివలె మాటలు సెప్పి యథార్థవాది మ, త్సరమును బెంచె; నిట్టి కవిసంగర మాఁపఁగ నెంతవారికేన్, దరమ! వివేకవంతులు వితాకుపడం గడు వృద్ధియయ్యె... స్థిరగురుపక్షపాతమొ విశేషవిరోధమొ కల్గియున్న హ్మ, త్సరసిజ మెట్లు కల్మషదళం గనఁగల్గు నిజానిజంబులన్... సరసతమీఱు కృష్ణఘనుసన్నిధినిం గ విహంస లొప్పి సు, స్థిరయశ మందుచుం బదగలిన్ భళి చూపిరి" యంచుఁ గొంద ఱం, దురు; "నిజ మిట్టు లుండునె? వినోదపదం బని హంసలెన్నఁడేన్, సరసతి మీఱు కృష్ణఘనుసన్నిధి సంస్కృతి పాదనృత్యచా, తురి నెటు చూపు? ...... పూర్వమందె త, ద్వీరచితమైన వర్ణన లతిత్వరఁ బాడి" రటంచుఁ గొంద ఱం, దురు; 'నలుదిక్కులన్ వెలయు దొడ్డయశస్సు గణించు ధీప్రభన్, వఱలు శతావధానులఁట బాపురె యంచు జగంబు మెచ్చఁ జూ, పిరి తమనేర్పు వీనులకు విందుగ' నన్న యథార్థవాది బా, గిరయక దోషతండమునె యల్లనఁ జూపును, సత్యవాది మా, యురె! గుణమెంచ కెంతయు మహోగ్రతతో శివరామపండితున్, ద్వరపడి దూఱ సాహసము తద్దయుఁ జేకొని మాటకారియై, "గురులు సహాయులౌచుఁ దన కొంకును మాన్పెడి భారమూన దు, స్తర మగు ప్రశ్నలన్నియు నెసన్ సభ పెద్ద నిరాకరింపఁ డెం, పరియయి సల్పెఁ జక్కఁగ నవారణలీల శతావధాన" మం, చొరులు నగంగ జాటెడి నయోగ్యపు దబ్బఱ లెన్నొ! .................శతావధానిధీవరకృతి వర్ణనీయ మని పండితు లిట్లన సత్యవాది, సాకిరియయి కాదటంచు బుధఖేదము వర్ధిలఁ జేసె...... అరయుచు దీని దుష్ఫలములాఁపఁగఁ గొందఱు సంధిసేయఁగో,రిరి యెటులైనఁ బండితవరేణ్యుల మాటలఁ ద్రిప్పలేమి వా, రెటేఁగి కృతార్థతం గనక యిమ్ముల నుండిరి......రసములొల్కఁ జిల్కయు నవంతర మిట్లని పాడె; "నక్కటా!, వెఱ పొకయింత లేకకడుఁ బిన్నతనంబునఁ గొందఱర్భకుల్, పఱచిన పాదకోత్సవ మపారముదావహమంచు, మన్మనో, హరగుణశాలులై నిరత మార్య విధేయత నొప్పుబాలు రుం, డిరి యని విన్న ముద్ధృదయనీరజ మట్టె విచారమగ్నమై, విరిసెను. సాధుమార్గమును వీడిన వీరలతోఁ బ్రసంగ, మెత్తెఱఁగునఁ జేయఁ దన్మతులు తిన్నని పద్ధతి నుండునో కదా!......ఎటుల

ఉ. బోలెఁడు ఖర్చు పెట్టి యిటు పొత్తము వ్రాయుట కేమిహేతు? వీ
కాలమునందునుం గలరుగా! గుణగణ్యులు, వారి మెచ్చి దు
శ్శీలురతోఁ బ్రసంగములు చేసి గణించినపాతకంబు ని
ర్మూలము చేసి మోదమున మున్గుటకే యనుకొమ్ము శాంకరీ! ౩౩౮

తే. గీ ఇట్లు మా పేరులను బెట్టి యేరిదెంత
తప్పు వ్రాసిరి కొందఱు తజ్ఞు లంబ!
మఱియుఁ గొందఱు మహితులో, మమ్ముఁ బేరు
పెట్ట కేదియొ వ్రాసి రెట్టెట్టొ బిట్టు.

---

జనింప బాలురకు నెట్టులనైన హితంబు సెప్పఁగా, గురులకు ధర్మ మంచు బలు కూరిమితో వచియింతు నిట్లు......యే, మరయూచు వంటవానిఁ బరిహాసకృతి ప్రవణాత్మ సంగతిన్, బురి నలువీధులం దమితమోదముతోఁ గడుఁద్రిప్పి సూరి సత్కారణము గేలిచేసితిరి, తప్పని మీమదిఁ దోఁచకున్నె? మా, యురె! బుధ మాన్యపూరుషమహోత్సవదర్శన మేవగింతురొ?.........వైదికార్భకులు, కట్టి! నియోగిగృహాళిచెంత న, ల్లరి గడుసేసి రంము నుడులన్ వినవయ్యెడి నెల్లవీథులన్!, హరి! శివరాముసుత్సవమునందున నాబుధకీర్తనంబు న, ల్లరియొకొ! యేమి చెప్పు! కనులం గన కల్ల పురాభిమాని ది, ట్టరితన మొప్పఁ జూపెఁ గట...... నిరుపమశేముషీమహిమనిష్ఠ మెయిన్ మన సంస్కృతాంధ్రవా, గ్గరిమను బెంచు వార్యుల నికారము న్యాయ్యమె? చక్కఁజూడుఁడీ, అరసి మహోద్భటోరుగుణ మార్యులు మెత్తురు గాన, మీమతుల్ నిరసనసేయ కెప్పుడు గుణి ప్రణుతిం జెలువొందనిండు ఛీ, తిరహితమార్గులౌచుఁ గుమతివ్యతిషంగము సల్పకుండుఁడీ; ప్రరబుధ వాగ్వివాదముల పొంతకుఁ జేరుట మానుఁడింక!, స, ద్వరమతి దూయమానయగుఁ దప్పదు చేష్టలు మీ రొనర్ప......భాస్కరుఁ గని మిత్రుఁ డంచు నలకంజము హాసముసేయు, వానినే, యరియని కల్వపూ వెదను హత్తినభీతిఁ గనంగలేక లో, నెఱియుచు వాడుచుండు......మధురగీరతు లీకథ సత్కరింతు రం, చెఱుగుచు సత్కవీంద్రులకు, నింతటితో విరమింతుఁగాక యీ, వర "సుమనోవతంస" సుఖవాసనపూతదిగంత కాఁగ, ని, ద్ధరఁ గుజనుల్ హసింతు రది తప్పదు పద్మజసృష్టిలోనఁ; గొ, ప్పరపుఁ గవీంద్రులుర్వి శ్రుతిపర్వద వాఙ్మధురాశుధారలన్, విరివిగఁ జల్లి యర్థమధుభృత్కృతికల్పన ఖ్యాతిగాంతురి; వే, లురి శివరామశాస్త్రి భువిలోపల మేటి శతావధానియై, సురుచిర మానసోద్గతవిశుద్ధరసాశ్రయకల్పనా సుమో, త్కరకృతకావ్యమాలిక, లఖండముగా రచియించి మించి సు, స్థిరయశమంది లోకవినుతిం గని భాసిలుచుండుఁగాక; అతిరుపతి

ఈ. (1) ఆశువుపేరుపెట్టి యొక రట్టులె బిట్టుగ గుట్టుతోడ (2) న
త్యాశువు పేరుపెట్టి యొక, రన్య లోకానొకరో (3) శతావధా
నాశువు పేరుపెట్టియును నాత్మకుఁ దోఁచిన రీతి వ్రాసి రో
యీశకుటెంబినీ! కలహ మేర్పడు హేతువుచేత స్వేచ్ఛగన్.

---

వేంకటేశకవిధీమణిసత్కృతుల న్వెలింగి క, వ్వాగపుఁ జవుల్ చెలంగమును పుణబలె మోదము వృద్ధిఁ జేయుఁ; ద త్తిరుపతివేంకటేశవినుతిం జెలువారుచు నెల్లవేళ, త్సూత్రం, తరగతస్పష్టవ స్త్వచిరతాకరణప్రవణోరుకాలభీ, కరపరిపంథిదుష్కృతినికర్తనదక్షము కావ్యసద్యశ, స్సురుపృథ్వీతలంబున జనోపకృతిన్ జెలుగొంది మించుతన్.

( 1912 సం॥ ఆగస్టు మానవసేవ పత్రికనుండి )

(1)...ఉ. ఆశుకవిత్వ మన్న నిపు డందఱకుం బరిహాసపాత్రమై, పేశలభావశూన్యమయి వృత్తుల కామడదూరమై గ్రహ, వేశము రీతిఁ బట్టి పలవింపఁగఁ జేయుచుఁ గొందఱన్ వృథా దేశము నెల్లఁ ద్రిప్పెదు క్షితిన్ నిరపత్రపవృత్తి నక్కటా!॥ గీ॥ యతులు గనిపెట్టిచూడ దుర్గతుల నొందెఁ, బ్రాసములు చూడఁ జూడ సన్యాసులయ్యె, ధర్మ ధర్మివిభేదంబు దగ్ధ మయ్యె, నార! నీ కెట్టి గతి పట్టె నాశుధార!॥ గీ॥ పదపటుత్వమ్ము నీకడఁ బనికిరాదు, సరసవాక్యమ్ము నానీకు విరసమగును, రస మనెడిపల్కు విన్న నీరసము గల్గు, నార! నీ కెట్టి గతి పట్టె నాశుధార!॥ గీ॥ పద్యమని చెప్పుటకు నిన్ను వలను పడదు, గద్య మని చెప్పుటకుఁగూడఁ గానరాదు, చరణములు లేమి సరసమౌ సరణి లేమి, నార! నీ కెట్టి గతి పట్టె నాశుధార॥ గీ॥ పుల్లియాకులు గాని చీపురులు గాని, చెప్పరా నట్టి యది గాని, సీ! యి దేమి, కాలమహిమమ్మొ! నీకు లక్ష్యమ్ములయ్యె! నార! నీ కెట్టి గతి పట్టె నాశుధార!॥...ఉ॥ ఎవ్వనిఁ బల్కరించిన "ని దేమి కవిత్వము? మూల నుండు మా యవ్వ వచింపలేదె? రసమా? పదసౌష్ఠవమా? మృదుత్వమా?, నవ్వనివార లుందురె వినంగనె దీని? నిఁ కెట్టి యాశువున్, బ్రువ్వ వచించి పామరులమో్రల గడించుఁడు ద్రవ్య" మం చనున్॥ గీ॥ రసము పాండితియుఁ బదమార్దవము భావ, హావహేలలు భాసిలునట్టి కయితఁ, జెప్పు సత్కవు లిట్టినిం జేర నీరు, హా! యిఁ కేఁటికి నీ బ్రదు కాశుధార!॥ మ॥ అవధానమ్ముల ధారణాపటిమ యత్యాశ్చర్య సంధాయకం, బవురీతిన్ బ్రకటించి పండితులు వహ్వా! యంచు శ్లోకింప నుం, డవలన్ లేనియెడన్ రసమ్ములుక గ్రంథమ్ముల్ రచింపన్ వలెన్, గవులౌవారికి రెండు పద్ధతుల యుక్కాలమ్మునం దర్హముల్. —శతావధాని, పిశుపాటి చిదంబరశాస్త్రి.

తే॥గీ॥ ఎంతకాలమ్మునుండియో యింత సరిగఁ
బనియొనర్చి మెప్పునుగన్న వారలుండ
వృథగ నస్మాదృశులఁ బట్టి విద్య నింద్య
మనెడివారల నేమన నగు మదంబ!

ఉ. కావున వారి వార్తలను గాదను వారమె కాని వారితో
నీవిషయమ్మునం గలియ; మెంతటి సత్కృవులేని వారు స
ద్భావముగల్గి వ్యాజము లవమ్మును గల్పక విద్వదీడ్యమౌ
త్రోవను బోవుచో నెదియుఁ ద్రోయక కైకొనువార మే మొగిన్.

---

( సర్వశూన్య శతకము నుండి )

(2) సీ. అష్టభాషలకు వాగనుశాసనుండైన నన్నయ్యకవి పెంచినాఁడు మున్ను
ప్రేమానుబంధంబుతో ముద్దుముచ్చటల్ తిక్కన్నకవి మున్ను దీర్చినాఁడు
పరువుగాఁ బల్లకీపై సర్వదేశముల్ శ్రీనాథకవి మున్ను దిప్పినాఁడు
లలితశయ్యారసాలంకారవస్తువుల్ పెద్దన్న మున్ను పంపించినాఁడు
గీ. నేమములు దాఁటనీకుండ నిలిపి నారు
సూరనాదులు తక్కిన ధీరులెల్ల
నేఁటి కేతెంచెఁ గవితకు మేటికీడు
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య॥

సీ. అబల సుగాత్రి విద్యావతి గడు సౌకుమార్యంబుగల చాన మందగమన
బల్మిమై బరబరఁ బడలాగుచున్నారు వేగంబు ముఖ్యంబుగాఁగఁ గొంద
ఱత్యాశుకవు లక్కటా! దాన నెమ్మేని యంగకంబులు డస్సె నవసె మనము
సంధులు విఱిగె విశ్రామంబు గఱవయ్యెఁ బదసౌష్ఠవంబెల్ల భగ్నమయ్యె
గీ. నీరసం బెక్కువయ్యెఁ గన్నీటఁ దడియఁ
బైఁటకొంగునఁ బెనుధూళి వడఁదొడంగె
సుకవితాకన్య యాపద చూడుమయ్య
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

సీ. అధమాశుకవన ముపాధిగాఁ గల్పించి కవుల జంగాలలోఁ గలిపినావు
పద్యాలు పాటగాఁ బాడించి కవుల బొబ్బిలిపాటగాండ్రఁ గావించినావు
పరువైన యత్యాశు పదమున కర్థంబుఁ జెఱిచి చెండాలంబుఁ జేసినావు
కవు లను పేరఁ దత్కార్యంబు గావించి తోలుబొమ్మలఁ బాఱదోలినావు

గుం. సీ. 17

తే. గీ. కవులనే కాని వారల కవితఁ గాని
తప్పులెన్నక యవ్వారిఁ దనుపు కల్ప
వృక్షములఁ గాని నిరసించు వెట్టివారి
నేమనుకొందుము మెచ్చుమం చెఱుఁగు మంబ!

ఉ. నన్నయ నాఁటనుండియును ఘనప్రతిభుల్ కడు గొప్పఁజేయఁ జే
రున్నతికెక్కి నేఁటికెవరో మనుబోఁటులు తత్త్వశూన్యతన్
జిన్నతనంబు దేఁగ నది శ్రీ తొలగించునె సత్కవిత్వపుం
గన్నియ? కేటికిట్టిగతిగా లిఖియింతురు కొంద ఱంబికా!

---

గీ. పండితులు మెచ్చు కవితానుభావమెల్ల
పామరుల మెచ్చులకుఁ బాలుపఱచినాఁడ
వీవు దలఁచిన నేమి చేయింపలేవు
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

సీ. కవితారసంబు చాకలిచేతఁగూడ మెప్పించుకాలంబుఁ దెప్పించినావు
ఆశుకవిత్వార్థ మంబష్ఠుచేతఁ జెప్పించుకాలంబుఁ రప్పించినావు
కవిసింహబిరుదంబు కసాయివారిను వర్ధించుకాలంబుఁ గల్పించినావు
చిరతరంబగుకీర్తి సిగ్గులేమికి సమర్పించుకాలము నిరూపించినావు
గీ. నీళ్ళలో దూదెబుంగ మున్గింపఁగలవు
రాళ్లు దేలింపఁగలవు నీరంబులోన
నఘటనాఘటనాపటీయః పరిభావ
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

సీ. బొబ్బిలికథ చెప్పి పొట్టను పోషింపుకొనెడు జంగాలతో నెనయు వేష
ములఁ దాల్చి చెవులకు ములుగంపులంబోలెఁ బీడఁగొల్పెడునట్టి పాడుధార
నూఁతగాఁగొని తప్పులో యొప్పులో చెప్పి సిగ్గుసమూలంబు మ్రగ్గఁజేసి
దగ్గో, కవిత్వమో, తాత్కాలికంబగు సన్నిపాతంపుఁ బ్రసారమొక్కొ
గీ. యనఁగఁ జూపట్టు కుకవిత నాత్మఁ దోసి,
పైకి మన్నించునట్టి సుధీకులను సృ
జించితివి నీవకానె ప్రసిద్ధతేజ
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

సీ. చెన్నంగిసుద్దులు చెప్పలేరను నపవాదఁబాపితి కవీశ్వరులకిప్డు
గొల్లసుద్దులు చెప్పుకోఁజాలరను దుర్యశంబుఁబాపితి కవీశ్వరులకిప్డు

ఉ. వీరల తోడనే యొకరి పేరిడి వ్రాసిన వారు గారు భా
షారుచిరాంగి కబ్బెడి దొసంగునకై పగఁజెందునట్టి సం
సారులు, పేరుపెట్టి మము సారెకు నాఱడిఁ జేయ వ్రాయు ని
స్సారుల దుష్కవిత్వపుఁ బసందున కేమనుదాన వంబికా!
గీ. సారెదర్బారులోన వాచాటకులు దు
రీహతో వ్రాయువ్రాఁత లెన్నేని మున్ను
సంగ్రహంబుగ నిందుఁ బ్రసంగవశతఁ
దెలిపితిమి వాని సారంబు దెలియు మింక.

---

తందనాల్పదముల యందంబు కవులకే దను నవప్రతిష్ఠను నణఁచితిప్డు
ఆలగాపరులట్లు వార్తురే కవులను గొప్ప కొఱంతఁ బోఁగొట్టి తిపుడు
గీ. పచ్చికయితంబునకునైనఁ బతకములను
నూటపదియాఱు లిప్పించు మేటికాల
మేగు దేఁజేసితివి దయాసాగరాత్మ
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

సీ. బూతుకైతకు మహాదాతయౌ నరపతి వేనూటపదియార్లు దాన మొసఁగు
టరయఁగా నదిదాతయద్భుతౌదార్యంబుఁ జాటును గాని యాచచ్చుకైత
గౌరవంబును జాట దారయ మేఘుండు పుల్లాకుగుంటలు పూర్తిఁజేయ
జెఱువులకున్న యౌచిత్యంబు దానికి గల్గునే? సజ్జనగణ్యమగునె?
గీ. సహజపాండిత్యగౌరవస్ఫారదశకు
బహుమతులు లేక పోయినఁ బటిమచెడునె
పతకములచేతఁ జెందునే పటిమ కుకవి
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

## (3) అ వ ధా న ము లు

(కప్పగంతు శ్రీరామశాస్త్రిగారి వ్యాసమునుండి)

......ఇంతలో నీభూరుహముల కొక యీతి బాధసంప్రాప్తమయ్యె, అయ్యది శతావధానాష్టావధానముల నహమహమికచే నొనరించుటయ. ఈయీతిబాధ యే దేశతాపాపనోద్ధార మదయించిన వృక్షముల కాటంకము కాఁగలదని చెప్పవచ్చును,... ఓశతావధాన నిపుణులారా! ఆశుకవిసింహులారా! మీ ప్రబల ప్రయత్నము నంతయు దేశహితాచరణమునం దుపయోగింపుడు;... ధనవంతులగు భారతీయులారా! మీరును వృథాగా మీద్రవ్యమును వెచ్చఁ బెట్టక...ప్రతిష్ఠాపనల నభివృద్ధి పఱతురుగాక! (21 జూన్ 1912 సం॥ కృష్ణ)

ఉ. లోపల వీరు మాయెడల లోకముపాటిగఁ బ్రేమ చూపు వా
రే పరమేశ్వరీ! * అదియు నించుక వీరలు తిట్టుపద్దెపున్
శాపము లందుఁ గన్పడెడు శాఖకుఁ గీర్తి ఘటింప నెంచి యే
పాపపుఁవ్రాఁత వ్రాసినను భక్తిబయల్పడ కెట్లు దాఁగెడిన్.

ఉ. డాఁగదు మానసం బెటులు డాఁచినఁ బైకది వచ్చుచుండుఁ దా
లోఁగదు లోఁగఁజేసినను లోఁగఁగఁ జేయ యతించుమానవుం
డోగొనరించుపట్లు; నది యొండొక లోఁగినయట్లె యుండి పై
కేగుఁ గనంగలేఁడ జనుఁ డిట్టి దురాగత మోమహేశ్వరీ!

చ. ఒగిఁ జదరంగపున్నడక లెక్కఁ ద్రుటిన్ గ్రహియింపవచ్చు న
ప్పగిదిఁ దెలుంగునన్ యతియుఁ బ్రాసయుఁ గూర్చెడి నేర్పుగూడ రా
నగుఁ ద్రుటిలోన; మీఁద నుభయంబును గష్టమె; కొంద ఱంతద
న్కఁ గనక యాట యాడుదురు కైతయుఁ జెప్పుదు రిచ్చకచ్చుగన్.

ఉ. ఈగతివారలే యిపు డనేకులు పద్దెము లల్లి మమ్ముఁ దా
మోగును బాగునుం గనక యూరక శాఖకుఁ గాఁగఁ దిట్టు ను
ద్యోగులు ; చెట్టుగొట్టికొని యూరక నెత్తిని వైచుకోఁగ నే
యాగడమో పొనర్చు సుగుణాఢ్యులఁ బ్రోవఁగదమ్మ యీశ్వరీ!

---

(*దర్బారులోని విశ్వేశ్వరప్రశంసనుండి)

......చ॥ తిరుపతి వేంకటేశ్వరు లుదీర్ణగుణాఢ్యులు సత్కవీశ్వరుల్ । వరమతు లార్యసంస్తుతు లవారితకావ్యకళావిలాసు, లే మెఱుగమె! వారి వారికళ లెల్లను మొన్నటి దన్క నీపురిం, దఱచుగఁ దాము నక్కటకటా! పలు మాఱును నెన్న నేటికిన్.

(దర్బారులోని బుధవిధేయుని పద్యములనుండి)

......సీ॥ పఱిబలగద్వాలభూపాల ధర్మధరాధరమ్మున భూరివజ్రమ్ముగొనుట, ఆత్మకూర్వారిజ్యరాజ్యమదేభముల నెక్కివీధులలో విఱ్ఱవీఁగిచనుట, గజపతి క్ష్మాపాలనిజకరార్పితకాంచనాదులఁగొని చింతలేదిచనుట, పోలవర క్షమాలో లాభ్యుదయకీర్తికాంత మన్ననలనే గాంచిమనుట గీ॥ సరసముకవిత్వసంధాన చాతురీణ, ధీవిశేషపాణింధమ శ్రీవిలాస, గరిమ నని యెంచుమంటి మక్కట! పురాణ, వాక్కులనఁగాని యన్యమ్ములనఁగాదు...

ఉ. వీరికి మమ్ముఁ దిట్టెడి కవిత్వపుఁవ్రాఁతయె విఘ్ననాథు పూ
జారచనంబు; మున్నెదియు శాంకరి ! పద్దెము వ్రాసి యుండ రీ
శూరులు; వీరి హేతువున సొంపు వహించెదుఁగాక శాఖ; నీ
కారుణికత్వముం గని సుఖంబు యశంబును వీరు గాంచుతన్.

ఉ. తిట్టిరటంచుఁ గొందఱు మదిన్ దురపిల్లుదు రేము సంతసం
బుట్టిపడంగఁ బొంగితిమి యొండొక హేతువులేక యూరకే
తిట్టుట స్తోత్రమే యగు నుతించునుడుల్ వినుకన్నఁ బ్రాజ్ఞు లీ
తిట్టులె హాయిగా విని మదిన్ సుఖమందెద రో మహేశ్వరీ!

ఉ. బండతనం బటంచు నిది పండితు లాడెద రేమొ ! "బండకున్
బండకుఁ జెల్లు వాద" మని బండతనంబునుగూడ నేర్చి యె
వ్వండెటు తిట్టినన్ మరల వానిని దిట్టక వానితిట్లయం
దుండిన మంచినే గొనెద మోజగదంబ ! ద్విరేఫముల్ బలెన్.

ఉ. అట్టి ద్విరేఫతాగరిమ యాత్మకు నీకృపఁజేసి పేరునం
బట్టిరె దానికిం బలెనె వచ్చెను దిర్పతి వేంకటేశ్వరుల్
తిట్టులు లెక్క సేయరు సుధీమణు లీవును నుండ నూరకే
కట్టెఁడు లెంత వాగినను గాలికిఁ బోయెడిఁగా ! మహేశ్వరీ!

క. ఎఱుఁగని మెఱుకులతిట్లును
నెఱుఁగని యూశకపనములు నెక్కటిగా రూ
పఱు గాలికిఁ బోయెడి యల
కొఱగాని పరాగ మట్లు కోవిదజననీ! 350

ఉ. కొప్పరపుంగవీశులు రగుల్కొను కోపము కల్మి మమ్మ నె
ల్లప్పుడుఁ దిట్టుచుండుటను సంతగ నక్కజమందఁబోము * మ
మ్మెప్పుడొ యెవ్వరో కడఁగి యేమొ పరాభవ మాచరింప వీ
రప్పుడు కాచిపుచ్చిరట! అందుల కంబరో! యక్కజంబగున్.

శా. కాఱుల్ వ్రాయుచు సోదరుల్ గడఁగి "నాల్కా తాటిపట్టా" యటం
చారంగా మును పాడిరౌఁగద ! యవే యస్మద్వృశుల్ పల్కు చో
ధీరుల్ మెచ్చరు దేవి! వీరెపుడు వర్ధిష్ణుల్ మమున్ గాచి? రే
కారామార్యుఁడు చెప్పఁగావలయు, లోకంబెల్ల మెచ్చన్ వలెన్.

* ( ఈ విషయమునకు 95 వ పుటలోని 23-24 పంక్తులు చూడుడు.)

క. ఏకా రామయ గా రది
సాకల్యముగా నెఱుంగుసాక్షు లగుదురో
లేక మఱొక్కరు వలయునొ
శ్రీకరు లలసోదరులు వచింపఁగ వలయున్.

ఆ. వె. 'ఏమిసాయ'మన్న 'నెదురుగా రాకుండె
సాయ' మన్ననుడి ప్రసక్తమయ్యె
కొంకు జంకు లేక కోఁతలు కోసెడి
ఘనులధాటి కడ్డు గలదె జనని!

క. వీరల కాశుకవిత్వపు
ధోరణితోఁ పాటసత్యధోరణి దొరలున్
సార మసారమనక 'ద
ర్బా' రదిప్రకటించు ముందు పరికింప దహో!

మ. తన జన్మించిన దిందుకోసమని యేతప్పైన 'దర్బారు' నై
కొను నామాత్రన లాభమేమి? కనినలోకుల్ మెత్తురో లేదొ లోఁ
గనఁగావల్వదె? యేమి భాగ్యము వృథాగాఁ దప్పులన్ గుప్పు నం
తన, నానాఁటికిఁ బ్రాజ్ఞ లోకమునకున్ దత్త్వంబు గన్పట్టదే.

మ. మఱి దర్బారది పుట్టకుండగనె తన్మార్గమ్ములున్ దాని సం
బరమున్ దాని జనించు హేతువును దత్త్వజ్ఞుల్ ‡ విచారించి పం
పిరి కైకొంటిమి దానిర్వాఁత లవి యొప్పే నస్మదుద్యద్యశ
స్ఫురణన్ హెచ్చొనరించు నిక్కమని నమ్మన్ మామనం బంబికా!

గీ. కుకవుల హళాహళులు లేక సుకవియశము
మిగులఁ జెలువార దనికదా మేటిసుకవు

---

( ‡ ఈ క్రింది పద్యము లొకానొకరు పంపిరి )

శా. దర్బార్ ... తెగి...గాదే! భవ, న్నిర్బాధప్రథితావధాన కవితా నిమ్నప్రభావాపగా, హిర్బద్ధస్థ్రథ సత్కవిప్రభుమనో హేలాలవాలోర్మికా వార్బిందూత్కరకర్బురద్యుతుల, వహ్వా! క్రిందుమీ దెంచదే॥౧॥క॥ ఉప్పాడ... తొప్పరపుం...... చెప్పిన యొప్పని టపా, లొప్పం దర్బారునందు నూహింపు తొకో॥౨॥

* లందు రది నిక్కమగునేని యంబ ! మాకుఁ
గరము నుపకారి 'దర్బారు' గాకపోదు.

క. తనవలెఁ దప్పడువ్రాఁతల
కనుమోదింపదని "కవిత" యభినవపదపూ
ర్వ నకట ! సరస్వతిని గై
కొన, దీ దర్బారు నెత్తికొని ముద్దాడున్. 360

గీ. ఎఱుఁగునో లేదో పాప! మిడ్డె ఱుఁగుఁ గాక
తనకు దర్బారె కాదు బాంధవ మొనర్చు
నల మనోరంజని యొకండు గలదు త్రితయ
†మొక్కటిగఁ జూచుచున్నారు యోగ్యతములు.

చ. వెనుకయు ముందునుం గనక వేఁయువ్రాఁతలు వ్రాసినంతనే
చనవు సుకీర్తు, లంతనె యశంబు గణింపరు మాయికుల్; నిజం
బును గనిపెట్టు నేర్పుగల బుద్ధిమదగ్రణు లక్కడక్కడం
దును గలరింక లోనెఱిఁగి ద్రోహులు పత్రిలు టొప్పు నీపయిన్.

తే. గీ. అభినవసరస్వతీమణి యన్నత మాడి
మమ్ము వినుతించు నఁట! యిట్టి మాట లకట!
మాకృతజ్ఞులు వ్రాసిరి,మఱియు మమ్ము
దూఱినంతన యశము దొరకు నొక్కొ!

---

*సీ. 'ఏమహాత్ములు గల్గ భూమీశసభలలోఁ గవులకు బహుళవిఖ్యాతి గల్గె,
(భట్టుమూర్తి)

† ...ఆర్యా ! సందర్భాసందర్భములను సమయాసమయములను తెలియక విందయే ప్రధానముగా నెంచి వాపోవు దర్బారు, కవిత, మనోరంజనీ, పత్రికలు మూడ మామనంబులకు నత్యంతకష్టముగానున్నది......మీరు ఇట్టి తరుణములో ఆశ్రద్ధచేసినయెడల......కొప్పర రామకృష్ణకవీశ్వరజయము మను నామముతో గాని లేక యింకొక నామముతో గాని గ్రంథమొకటి మీతదనంతరము బయలు దేరగలదు గాన తగుకీతిని పుట్టినవాదును పుట్టినట్లుగా చంపుటకు తగుప్రయత్నములలో యుండవలెను. ... ...

బెజవాడ — చిత్తగించవలెను

24-11-12 — వేలమూరి గోపాలకృష్ణయ్య.

క. తమగుట్టు గీరతము స
క్రమముగఁ బైటఁ బడవేసెఁ గా! యీపాత్రం
బమలము "దర్బార్" వ్రాఁతల
క్రమ మెల్లను బయటఁజెట్టి సంరక్షించుచున్.

తే. గీ. అభినవసరస్వతి * వచించునట్టి పలుకు
లే నిజంబులో! సారెకు నెపుడు నన్నృత
మాడు దర్బారుకవితల యఱపులే ని
జంబులో! రెుఱుంగు నిటుపైనిజగము జనని!

తే. గీ. తగుదు నంచును 'కవిత' యే తలకుఁ బాయు
♦ దబ్బఱలనో లిఖించెడిఁ దగ్గ దకట!
మందలించిరి యెందఱోమహితు, లైన
నేమి, దానికి జనియింప దింకబుద్ధి.

---

*(1912 సం॥ మార్చి యేప్రిలు అభినవసరస్వతిలోని మిత్రవిజ్ఞప్తి నుండి.)

......మిత్రులారా! మీవ్యాసములెన్ని చూచినను దిరుపతివెంకట కవులనిందతో నిండియున్నవి......మన బోటులు మహాకవుల కవిత్వమును విమర్శించుట కడు శోచనీయము. మనకు వారిపాదధూళి శిరమున ధరింపఁదగు యోగ్యతయేని లేదు......తిరుపతి వేంకటేశ్వరులకీర్తి దిగంతవ్యాప్తమైనది.మన దేశమందుఁ బ్రతి ప్రాజ్ఞునకును వారియందు గౌరవము విశేషించి కలదనుటకు వారికి జరిగిన సపర్యయే సాక్ష్యమిచ్చును......శాస్త్రేతరవిషయమును మీరేమి వ్రాసినను దిరుపతివేంకటేశ్వరులు వ్రాయరు. ఈయంశము మీవ్యాసములు వారి వ్యాసములు చూచిన వారే యెఱుఁగుదురు......ఈ సీమవారైనచోఁ దిరుపతి వేంకటేశ్వరులు మనకు జంకుదురేమోకాని యితర సీమవారులు వారిని శాస్త్రవాదముచే జయింపవలసినదే కాని దూషించియు నేమో చేసియు మనము జయింపఁ గలమా?......

♦(1912 సం॥ సెప్టెంబరు కవితలోని అట్టహాసము నుండి.)

...... అభినవసరస్వతి—(తొట్రుపాటుతో) తిరుపతివేంకటకవులే మాగొప్పవారు. (30-6-1912)దర్బారు—(చిఱునగవుతో) అవధానులెవ్వరును లేనితరుణమున శతావధానులమని నటించుటవలననో...యెట్లయిననేమి, తి॥ వెం॥ లకు గతకాలమునఁ గొంతవఱకు గౌరవ మున్నమాట సత్యమే. అభిన— (నివ్వెఱతో) నే నేమెఱుఁగుదును ? మాపట్టాభిరామశాస్త్రిగా రటు చెప్పినారు.

తే. గీ. తనదు పబ్బఱవ్రాఁతలు ఘనులు పూర్తి
గా నెఱింగిరి కావునఁ గష్టపడక
"కవిత" యిఁక నేని యనృతముల్ గట్టిపెట్టి
ద్రవ్యదాతకుఁ బేర్గూర్పఁ దలఁచుఁగాత.

ఉ. పాఱిరి యోడిరంచు "దరబారున" సారెకు వ్రాయునంతనే
చేరదు మీకుఁ గీర్తి, యల "శృంగపుభంగము" రామకృష్ణులన్
ధీరులఁ జేయఁగాఁగలిగెనే! నిజమున్ గని పెట్టు ధీరులు
న్నారుచుఁడీ! వృథాగఁ గవనం బనృతంబున నింపఁబోకుఁడీ!

తే. గీ. 'కవిత'వారి తో్రవను బోవు కారణమునఁ
దాదృశంబగు ఘనతయే తవులు మీకు

---

దర్బారు—ఔను. ఆయనతఱచు 'వింతవార్త'యనియు 'మిత్ర విజ్ఞప్తి'యనియుఁ బేర్లతోఁ దిll వేంll కవులను బురస్కరించుకొని వ్రాయుచుండును. అభినవ—(రోషముతో) వారి విషయమై యిట్టిమాటలు నీవనవలయుంగాని మఱెవ్వరు ననరు. దర్బారు—పోనీ! వారియందుఁ బ్రజకెట్టి యభిప్రాయమున్నదో దేశమాత నడుగుదము. దేశ—ఎందుల కూరక కలహించెదరు. ఆవిషయమై కవియు రాజునగు మంత్రిప్రగడ భుజంగరావు బహద్దరువారి నిష్కృష్టాభిప్రాయమొకటి చాలును, వినుడు. కృష్ణ—దర్బారీ! అభినవసరస్వతి మాటలకేమిలే, దాని కేదియైన వ్రాసియిత్తురని వారి నట్లూరక పొగడుచుండును......

ష రా:— ఈ 'కవిత' మాయశమును తగ్గించునూహతో నేయే వ్రాఁతలను ప్రమాణముగాఁ దన 'అట్టహాసములో' లిఖించెనో అందన్నియు మృతప్రాయములను వంశము 45 వ పుటలోని ఇంగ్లీషుత్తరము మొదలు 48వ పుట తుట్టతుద వఱకును గల దిద్దుబాటు లోనగు భాగముచే విస్పష్టమగును. శ్రీ శ్రీ భుజంగరావు బహద్దరు వారి శాఖాభిమానపుఁ బ్రసంగము 58వ పుట మొదలు 68వ పుట వఱకును జదివికొన్నచోఁ బూర్తిగా ఖండితమనియు, దానిపై వారు ప్రత్యుత్తరము నొసంగకుంటచే వారి యభిప్రాయము నిందెత్తికొనుట మఱియు ననవసరమనియు అభినవసరస్వతిని కృష్ణపక్షపాతినిగాఁ బలికినట్లువ్రాసినవ్రాఁత బొత్తిగాఁబనికిరాదనియు నందులకుఁ గవితలోని యీ బొంకు ప్రసంగమును జూచి యసహ్యమును విస్పష్టముగా వెలువరించిన శ్రీ కృష్ణాపత్రికా సంపాదకులే పరమ ప్రమాణమనియు నెఱుఁగఁదగు వలసినచో నిందునుగూర్చి బ్రll శ్రీll ముట్నూరి కృష్ణారావు, కృష్ణాప్రెస్ వారికి వ్రాసి తన సంశయమును గవిత తీర్చికొనఁదగు.

కొప్పరంపు సోదరులార ! తప్పుత్రోవ
లింక నేని మానుఁడు లిఖియింపకుండు.

తే. గీ ఆసనం బీయకున్నంత నంత శత్రు
భావమేటికి ? మము * గర్దభములు గాఁగ
వ్రాయు మీబందుగుల వ్రాఁతవైఖరులను
గనియు మా సహనమునఁ గాంక్షచను నె.

చ. శివ ! శివ ! ♦ "పండితబ్రువుల" చెంతను "గాడ్దల" చెంత మీకు గౌ
రవ మిడునే సహనము ! ప్రాజ్ఞులు సర్వ మెఱింగి నాఁడు బాం
ధవు లెటు పట్టుపట్టిరో కదా యది యబ్బకపోవుటేనుఁడీ
శివకర మయ్యె మీఁకు గవిసింహులు ! సంతసమందుఁ డీపయిన్.

క. విద్యావివాద మనునది
హృద్యం బనవద్య,మందు నెవ్వరు మను పీ
సద్యఃఫలముల నమృతపు
గద్యమ్ముల నాడ, రడుగఁ గాఁదగు బుధులన్.

క. తిట్టితిమి బాగు గా నని
యట్టె ముదంపడకుఁ డయ్య! ఆతిట్టులె మీ
రెట్టిరో తెలుపునుజుఁడీ యి
ట్టట్టనకుం డమృతములకు నలవడకుఁ డిఁకన్.

క. ఉత్తరరంగమ్మున మీ
యుత్తరముల తత్తఱములు నొగి రాజీకై

---

* (పండిత బ్రువలక్షణమను బండలిట్ల పొత్తమునుండి.)

చ......నా, సరసకు నీవు రాఁదగవు చాలును బొమ్మని కూయు నంతలో
వరుగునె తాను గాడిద నటంచు నెఱింగియు కూసెఁ గాని......గాడిద చెంత
నిల్వ నేసరి కది పోలునే......

♦ (పాటిబండ సూర్యనారాయణరావుగారి పండితలక్షణమునుండి.)

చ...నా, సరస నిలంగ నేరికిని శక్యము గా దనుచుం బ్రగల్భ వా, క్సర
ణి వచించుచుండుట ప్రశస్తతరం బనిపింపఁ జాలునే...మూర్ఖశేఖరుడు ...
దాంభిక పండితబ్రువుల్ (1911 సం॥ అక్టోబరు 18 వ తేదీ కృష్ణాపత్రికనుండి)

యె_త్తిన యెత్తులు యుష్మ
త్సత్తాసంప_త్తియును ప్రసంగింపఁబడుఁన్.

ఉ. వ్రాసినయింతలో నన్నృతవాక్కులు గల్గినఁ జూపుఁడీ! వృథా
యాసము తిట్టఁబోకుఁ, డిఁక నందఱకు న్నిజ మిద్ది తెల్పు మా
మీసము, మీదురోసమును మేలు గనున్,యశ మంద విద్దె ల
భ్యాసము సేయుఁ, డీనుడిని భావన సేయకుఁ డన్యథా మదిన్.

శా. అంబా! యార్యుల లేఖలున్ మఱి యనార్యవ్రాతముల్ వ్రాయు నం
శంబుల్ గొన్ని యిటన్ లిఖించితిమి,సత్సంఘుంబు నీవున్ యథా
ర్థంబుంగూర్చి విచారణల్ సలుప నాధారంబుగా; నింకఁ బ
త్రింబుం దెచ్చి యొసంగువారల వికారంబుల్ వినంగాఁ దగున్.

ఉ. తెచ్చిరి పత్ర మట్టులు విధేయుల పోల్కి నటించుచున్; జనం
బచ్చట నెందఱో గలర యప్పుడు మా ‘విజయంపు’ నాటకం
బెచ్చుగ నామనుండె,నట నెట్టులొ పత్రము విన్పి మాకు వీ
రిచ్చుటకున్ గడంగి రది యేగతి సాగనిదయ్యె నయ్యెడన్.

క. మొదటన్ మాకొసఁగిరి, యా
పదపడి యది వినికి సేయవలయు నటంచున్
బదిఁబది నడిగిరి, తిర్పతి
యదలింపఁగ యు_క్తి లేక యరిగి రనదలై.

ఉ. కూసెను కుక్కుటంబు లొగిఁ గొక్కురుకోయని, కాకవుల్ రొదల్
సేసె దివాకరుండు దయచేసెడిఁగా! యని, ఘూకవుల్ మదిన్
త్రాసముతోడఁ గొండగుహ దాఁగఁ దొడంగెను,నాటకంబు ము
న్నే సరిగా ముగింపఁబడె,నిండ్లకు నేగితి మంత నంబికా!

## గద్య

ఇది శ్రీ...తిరుపతి వెంకటేశ్వర రాశీకృతంబగు
‘గుంటూరుసీమ’ యందుఁ బత్రికా
కషాయాపర నామకమ్మును,
ఉపోద్ఘాతప్రాయమ్మును
నగు పూర్వరంగము.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 13 | 7 | దన్వ | దప్వ |
| 22 | 28 | మఆ | ఆ |
| 25 | 1 | రస్క | రసత్క |
| ,, | 12 | యేమె | యేమొ |
| 28 | 6 | చోండు | చోండో |
| 40 | 14 | లోఁతగి | లోఁతగ |
| 45 | 14 | ఛీ | చీ |
| 50 | 18 | యటా | టాయ |
| 70 | 9 | యిదా | యినదా |
| 76 | 16 | మాచర్ల | మోచర్ల |
| 78 | 27 | రంక | రంజ |
| 86 | 24 | శాగా | శాస్త్రిగా |
| 113 | 21 | దుక్గా | దుర్గా |

గుం. పూ.

# ఉపోద్ఘాతము

---

చదువరులారా !

విపులమగు పూర్వరంగపీఠికయు, వేమవరాగ్రహారశతావధానపీఠికయుఁ జదివియున్న మీకుఁ బ్రకృతవివాదమునకు సంబంధించిన సోదరులయుఁ దదభిమానులయుఁ గుకల్పనలు చాలవఱకు బోధించి యుండును. వ పుటలోని శ్రీసోదరుల తప్పుడు రిజిష్టరుత్తరముకూడఁ బైవిషయమును బలపఱచునట్టిదియే, అది యటులుండె, ఈ క్రిందియుత్తరమును దిలకింపుఁడు.

నెకరికల్లుపోష్టు, నర్సారావుపేటతాలూకా ౯-12-13 కుంకులగుంట.

...నేను ఏతగుపాటియో కావ్యపరిచితిగలవాఁడను సుకవిపాదపద్మవిధేయ పరమాణువును... నన్ను నేమహాలాభము నభిలషించియో యేయోగ్యతలేని యోగ్యులలో తమరాశిలోఁ జేర్చుకొనుటకు అక్టోబరు నెలలోఁ బ్రచురించిన సువర్ణలేఖలో తమ్మును దప, యవధాననిందను గూర్చి వ్రాసిన యవాచ్యోపన్యాసములో నన్ను దస్కతుదారునిగా జేర్చి "ఫోర్జరీ" యనియేని వెలువక ప్రకటించియున్నారు ఆసాహసచాకచక్యములు వారికేతగును. నిజమునకు నేనింతవరకు తమ పుస్తకములలోని ఫోటోలనుజూచిన భాగ్యవంతుఁడనే కాని తమ సాక్షాద్దర్శనము చేసిన ధన్యుఁడనుకాను. ఇట్టిస్థితిలో అవధాన మెప్పుడు చూచితినో యా యసత్యవాది యుపన్యాస మెప్పుడు వ్రాసితినో పరమాత్మునకెఱుక యగు, ఈ జాల్మప్రజ్ఞలు తాము యెఱింగియేయున్నను కాలౌచిత్యమునుబట్టి తమకు నేనిట్లనపరాధినని విశదపరచికొనుటయుక్తమని వ్రాసికొంటిని, తమ యనుగ్రహపూర్వక ప్రజాబు వచ్చువరకు నిరీక్షించుచుందును.

క. టక్కరులల్లెడి టక్కులు, టక్కున గ్రహియించు నాతఁడంకయుఁ దనుకే
చిక్కును వెంకటకవివర !. యిక్కలికాలంబునం దనేకవిధాలన్.

చిత్తగింపుఁడు.

[illegible]

**ఇట్టి తప్పుడు సృష్టిచేయఁగల మహానుభావులు చేతులోఁ గల సోదరులకు నెవరు దీటుగాఁగలరు? పైయుత్తరమువలన వారిపక్షమున నుండువారితత్త్వము నుంత దెలిసియుండును గాన ఁ దాదృశుల * ప్రల్లదములను నిత్యము మ ప్రకటిం**

---

(* హితకారిణి చేయు నధికప్రసంగము దిఙ్మాత్రము)

'మీలో వెంకటకవియా?, తిరుపతికవియా?, 'వెట్టివెంకటాయ' 'నిజము గా శ్రీతిరుపతి వేంకటేశ్వరుల ప్రజ్ఞావిశేషమునకుపమింపఁదగినది యొక్క- మేడిపండే, గంగిరెద్దులయాటలోఁ గోనంకిదాసుఁడు అను వేషధారి అమ్మల్లారా నాదీపెండ్లి, అయ్యల్లారా నాదీపెండ్లి, అన్నల్లారా నాదీపెండ్లి, అని కేకలు వేయునట్లుగా మేము శతావధానులమని ప్రకటించుకొనుట మిగులఁ బరిహాస పాత్రముగా నున్నది. "వారి పూర్వక్రియలఁదెలుపు గుంటూరిసీమ పూర్వరంగము...ఉత్తరక్రియల నెఱిఁగించు గుంటూరిసీమ, ఉత్తరరంగము, వీరీ చండాలపుబని సేలచేయవలెను. చివుకుల అప్పయ్యశాస్త్రుఁట ?...మనోరంజనిమీద మామిడికేడు,... తురకదాసరికి ఈతమజ్జిగన్నట్లు, అప్పయ్యశాస్త్రి తురక తెలుగుకు" వెర్రిప్పయ్యా,... తిరుపతివేంకటేశ్వర్ల మేళంలో యితడో హంగుదారుడు,- ఛీవాట్లు తినకు "వేశ్యవిధమున ... వీరు నింద్యులగుట చాల శోచనీయము గానున్నది నియోగిశిఖామణులనియు... యు... యుఁ దెగబొగడుచుండిరి...గంగిరెద్దులవాండ్రు...పైప..., యిచ్చిన ఎట్టియధముఁడైనను వానిని మహారాజు...అని పొగడుచుందురు అట్టి మతమునే తమరవలంబించుట చాల శోచనీయము" 'ప్రాతలంజలు వీరమాతలైరి' "తిరుపతివేంకటేశ్వరులు... వేశ్యమాత కప్పయో చెల్లెలోయైన ప్రజ్ఞచే నిరసించుచు... యనుకూలురైనవారిని బెద్దఁబొగడుచు 'గంజాయిపోకురా, సారాయిపోకురా, బాపనోండ్లందర్లో పెద్దోడుతాగలేద" అను పాటలుపాడుచున్నారు. "ఛీ, ఛీ, యని నిరసింపశోచ్యస్థితిలోనున్న యభినవసరస్వతిని" ఆయన (వీర్వారి సుబ్బయ్యగారు) తి॥ వెం॥ ల, నెక్కించి యనృతమహిషమ్ములంబూనిచి పాపపుబండిదోలుచున్న మహానుభావుఁడు, అయ్యో గంగరాజుగారు 2 గంగరాజుగారూ, ఓహోగంగరాజుగారూ??? మఱిగినకాలును మూసిపెట్టుకొని 'మీగుండూరుసీమ" సలాములు చేయుచున్నాను. క॥ మస్తానునామకుండ ... మహమదుసుతుఁడ౯" "గాని స్వయంపాకివాని సర్వశూన్యశతకము,"

ఘ్నము యుక్తాయుక్తజ్ఞానము నవలకు నెట్టి పాటుపడుచున్న 'హితకారిణి' 'మనోరంజను'ల యందలి పర్వతప్రాయములగు దబ్బఱల నిందుదాహరించి ఖండించుటకు మీరేసమ్మతింపరు. లోకులహృదయమునం దవి యేతీరున నెక్కియున్నవో సుంత తెల్పుటవలన నాపత్రికాద్వయమునకుఁ గొండొక వివేక మబ్బవచ్చునని యెంచి దిఙ్మాత్రమందులకు సాధకములగు నంశములు గొన్ని యుదాహరించెదము.

12th August 13.

(1)......మఱియు హితకారిణి, మనోరంజని యీ రెండుపత్రికలు మీ కపయశస్సును గలిగించుటకై కంకణముఁ గట్టికొన్నట్లు దోచుచున్నది. జూలై నెలలో

---

☞ ఇట్టి తప్పుడుకూఁతలు కుప్ప తెప్పలు, ఈ స్వయంపాకివాఁ, డెవరో యెఱుఁగుదురా ? స్వయంపాకుల లక్ష్మీనారాయణశాస్త్రికి వచ్చిన పాట్లివి.

(మనోరంజనిచేయు నధికప్రసంగము దిఙ్మాత్రము.)

ఓ యెండుగండి కవులారా, జైలులనరయుఁడయ్యా, భరణంబునకు దావవైవుఁడయ్యా, ఒడలెరుంగనిసివ మిప్పుడుండఁదగునె, ఛీఛీ? యనిప్రజ్ఞాతిశయము లేవగింపఁగ నేతావున సభయటన్న నికఁ నేగకుఁడీ 'వారు (తిరుపతి వెంకటకవులు) వ్యర్థముగా మాపై మిడుకుదురు, నీ యిజారులో నాపైజారన్నట్లు వారిపుస్తకములో వీరి పప్పేమెట్లో" "వారి (తిరుపతివేంకటేశ్వరుల) యీతలపంపు చైదముల" "అమ్మదగ్గఱఁగిరిందఁ దొంగున్న నేమి అయ్యదగ్గఱ నేలఁ దొంగున్న నేమి" "లేని మగతనము నాశించియెగడ? తమలో నొకరు మీసముంచికొనిరి" "హాగా, పంచా చూచి పాపరాజువనుకొన్నాను, పేర్రాజుపంటోయ్! యీ రాజ్జా, "ఛీ? వహ్వా? యెంతబిద్దె ఈబిద్దెనువీరు (తి॥ వెం॥ కవులు) మాయింటిపొరుగు బుచ్చమ్మ కడ నేర్చుకొని యుండవలెను మా చిన్ననాఁడు మా పొరుగున నొక సద్బ్రాహ్మణుఁడు నివసించెడివాఁడు' ఆయనభార్య బుచ్చెమ్మ కొంచెం పైయాటకత్తె..." "పండితరాయలు తిట్టెంగాని తమవలె బూతులు తిట్టి తన్నులు తిని........."

☞ ఇట్టి వెన్నోకలవు, పాకము ముదురుచున్నది. ఇంక మొదటివేవో కొన్ని తప్పుఁ దక్కినవి పత్రికాప్రవర్తకుని స్వహస్తలిఖితములు సుఁడీ, ఇతఁడుగూడ నొకసత్య నివేదకుఁడే, ఇతఁడును విమర్శనకర్తయే, ఇతఁడును మానిసియే???
ఔరా! కాలమహిమ, శాంతంపాపమ్.

[illegible]పడిన మనోరంజనిలో పత్రికాధిపతిగారు తమ గుంటూరుసీమ గ్రంథము సత్తను విమర్శింతుమని వ్రాసియున్నారు. చూచుకొనెదముగాక, ‘యతో ధర్మ స్తతో జయః!’ చూడఁజూడఁ గొందఱు మీ యమూల్యమగు కాలమును వ్యర్థపుచ్చఁ జేయుటకై పూనినట్లున్నది. ఇంతకు నిది కాలమహిమ...”

ఎ, యస్, రామకృష్ణులు.
5489 Regimental Bazaar
Secunderabad (Deccan)

---

అమరావతి 10-2-14.

“హితకారిణి” యను ఏలూరులో ప్రచురింపబడుచుండు వారపత్రికలో యిప్పటికి వారమునుంచి అనగా ది 14-12-13 తారీఖు పత్రికలోయున్నూ, ది 1-2-14 తారీఖు పత్రికలోయున్నూ ‘పాతగోడకు పూత చక్కన’ అను హెడ్డింగుపెట్టి వ్రాయుచుండు అవాచ్యపువ్రాతలను తమరు పత్రికాముఖమున చూచియే యుందురు. యిట్టి యప్రస్తుత ప్రసంగమును జరుపుచుండు ఘనుం డెవడో ‘సశేష’ మని వ్రాయుచుండుటచే దెలియకుండానున్నది. ఇంత మాత్రపు కారుకూతలు వ్రాసినంతనే... యిట్టి తప్పుడువ్రాతలు వ్రాయుచుండు మహానుభావుడెవడో తమకు తెలిసినయడల తెలుపవేడెద.

జానపాటి వెంకటప్పయ్యవ్రాలు.

---

యేలూరు, 6-8-13

...మనోరంజని దుడుకుగ వదరుచున్నది. చూచితిరా?

మై. కృష్ణమూర్తి.

---

జానపాడు 7-9-13.

...“హితకారిణి మీరు చూచుటలేదా, వాగుడెక్కువయినదే?

జా॥ పట్టాభిరామశాస్త్రి.

సలయభిప్రాయముల నటుంచి తోడిపత్రిక లగు సుదర్శని మొదలయి నవి వీరల పోకడల నెట్లు నిరసించుచున్నవో చూపుటకూడఁ బ్రస్తుతము కాకపోదు.

V

(1914 సం॥ జనేవరి 1 వ తేదీ సుదర్శనీ పత్రికనుండి)

# విజ్ఞప్తి

ఆర్యులారా! దేశము చేసికొన్న పాపము చొప్పున నిప్పు డెచ్చట జూచినను ఁమనోదండి, కవులు మిక్కుటమయి గురుకులవాసపాఠపఠనాది వృథా శ్రమము లక్కరలేకుండనే సులక్షణసారనామకగ్రంథమాత్రశరణ్యులయి తగుదుమని ముందునకు వచ్చుచున్నారు. తము రాసుకొను మాటలనే గణములను ప్రస్తరించుకొని యందిమిడ్చి పద్యముగా పాదుకొల్పిన వాఁడెల్ల కవియగుచున్నాఁడు. ఇందంతగాఁ దప్పులేదు కాని తానాస్థితిలోనే యుండి తనతోడి బాలకులతోడనే సల్లాపములాడికొనక విశేషించి పెద్దకుండల కెసరు పెట్టఁ జూచుచు భాషావ్యవసాయమున గడితేరిన నెట్టి పండితకవులనేనియుఁ బూచిక పుల్లలవలెఁ దీసివేయుచు నోడలెఱుంగని సివములాడుచున్నారు! ఇందుకుఁ గారణ మిప్పు డీతెగ యెక్కువగుటయు నాతెగ తక్కువగుటయే! వినీతవాణి కిప్పుడు కాలదోషము పట్టినది. ఈపత్రికలలో నప్పుడప్పుడు తిరుపతి వేంకటేశ్వరకవులంగూర్చి చర్చింపఁబడుచు వచ్చినది. తత్సందర్భమునఁ గొప్పరపు గవులను గూర్చి కూడ నొండు రెండు సారులు వ్రాయఁబడినది. ఈ పత్రిక యుద్దేశము పాండిత్యము నభిలషించుటయే కాని వేరుకాదు. ఈ తిరుపతివెంకట కవు లెట్టివారో కనులనైనఁ జూడలేదు కొప్పరపువారి సంతకమును పే చూడలేదు. పరిచయ మున్నప్పుడుగదా స్నేహవిరోధము లేర్పడుట, అదిలేనప్పు డవియు నుండవుగదా? ఇట్టివిషయములో డిశంబరు 14 వ తేదీ హితకారిణిలో "సుదర్శనీ పత్రికాధిపతి సోదరకవులను దిట్టినట్లుగా" అను నీమొదలయిన వాక్యములుకొన్ని సకేశవ్యాసములో నెవ్వరో వ్రాసిరి. ఇదేటి యన్యాయము? సోదరకవులను దిట్టినదెప్పుడు? తారతమ్యచర్చ చేయుటయెల్లఁ దిట్టుటయే వా? ఈ సోదరకవు లెవ్వరు? వీరి నెందుకుఁ దిట్టవలెను? ఎందుకు గౌరవించవలెను? గౌరవా గౌరవము లెప్పుడుపుట్టును? తదనుభవముమీఁదఁ బుట్టును. ఆయనుభవ మెట్టిది? తద్గ్రంథపఠనరూప మయినది తిరుపతి వేంకటకవులమీఁద గౌరవభావమేలగుదురవలెను? వారిగ్రంథములను బఠించుటవలన, ఆగ్రంథములలోఁ గవిత్వవస్తు వుండుటవలన. కవిత్వవస్తువన నేమో? ప్రత్యేక మొకగ్రంథము వ్రాసినఁగాని యిక్కడ స్ఫుటకఱుపఁజాలము. అట్లే కొప్పరపువారుఁగూడ పదిగ్రంథములు రచించి మన కనుగ్రహించనీఁడు అప్పుడు గౌరవాగౌరవములు

స్థిరఘటితము. రెండు బంగారు కణికలు, వన్నె గట్టవలసి వచ్చినప్పుడు నికషపలము (గీటురాయి) పైనొక్క రేఖయే కానవచ్చుచుండెను. రెండవది స్వరూపశూన్యమయి యుండెను. అప్పట్లఁ జేయవలసినదెద్ది? గీటురాతిపై రెండవ కణికగూడ నొకింతగీసి చూపరాదా? అప్పు డేతగవులు నుండవుగా! అది యేలొకో రహస్యముగ దాఁచిపెట్టి ఊరక "నా కణిక పదియార్వన్నెవచ్చును. తక్కినవన్నియు దీనికి దిగదుడుపు" అని బూకరించనేల? వారి కవిత్వము విన్నవారికిఁ జాలదా? యని చెప్పకత్తురేమో? "వారువిన్నారు వీరువిన్నా" రని యీమూజివానీ సాక్ష్యము లెందుకు? నాల్గుగ్రంథములీవలఁ బాఱవేయరాదా? అవియే పోరాడునుగా! కావున నోప్రాజ్ఞులారా! సుదర్శనీపత్రికాధిపతి తిరుపతి వెంకటకవులను ఆకాశమున కెత్తుచున్నాఁడనియుఁ గొప్పరపువారిని దిట్టుచున్నాఁడనియు, నిత్యాదులు వ్రాసి స్వచ్ఛపత్రములఁ గళంకపఱచవలదు. దైవసాక్షిగా నిం దెవ్వరును నాకు హితులుగాని అహితులుగాని కారు. ఇదిగాక వేనొక్కఁడను ఆకాశమున కెత్తినంతమాత్రమున నిస్తేజస్కులు ప్రకాశవంతులగుదురా? లేక తృణీకరించినంతమాత్రమునఁ బ్రకాశవంతులు నిస్తేజస్కులగుదురా? ప్రాజ్ఞలోకమున నేదియో స్థిరపడి యుండనేయుండినది. ఇంతకును లోకమంతయుఁ బక్షపాతమయమైయున్నది. తారతమ్యజ్ఞానము పోయినది. సత్పాండిత్యమునకుఁ గాలదోషము పట్టినది. నేతబీఱకాయలోని నేతితో సంతర్పణములు చేయుచున్నారు. అయిన నోయధునాతన కవినామకులారా! దైవపదార్థము తన విలాసమును దెలిసికొనఁ దగినప్రాజ్ఞులను మచ్చునకైన నచ్చటచ్చట దాఁచియుంచక పోలేదు. వాణి యొకరిసొమ్ముగాదు. ముఖేముఖే సరస్వతీ. కాని, విభక్తిప్రత్యయజ్ఞానమయినను లేక రామశబ్దమైనను దెలియక యొండురెండు తెలుఁగు పొత్తములు చూచి యందందలి ముక్కల నేరితెచ్చి యతుకుఁబెట్టుచునుండువారు, వ్రాయుటకుఁ బత్రిక లందుఁబాటుగా నున్నవి గదా యని ఉభయభాషా నిరాఘాట పాండిత్యమును సంపాదించి యావ్యవసాయములోఁ దలలు చితుఁగఁగొట్టుకొని వ్రణకిణాంకదేహులయి యున్న విద్యాకర్కశులను గ్రుడ్డిగవ్వలక్రిందఁ ఏసివేయుచున్నపుడు మానవసామాన్యశక్తికి నూఱట గలుగదు. కావున నవధారుఁడు! ఎంత చచ్చుకవిత్వముఁ జెప్పఁబూనినను అకారాకారసకారాంత భేదములు, ధర్మధర్మి భేదములు, మున్నగు సామాన్యవిషయము లయినను దెలియవలసి యుండెను. అందుకుఁ బంచకావ్యజ్ఞానమయిన నుండవలెను. అంతమాత్రపు శ్రమకైనను ఓర్వలేక తీరికూరుచుండి

యూరక తేరగా విద్యా ప్రాముఖ్యత సంపాదింపవలెననెడు దురాశచే వికటవాదములు చేయుచు బొల్లి కవిత్వములు చెప్పుచు వాణీప్రసన్నుల గడ్డి పఱకల వలెఁ దీసివేయుచుందురేని అట్టివారి ముక్కులు పిండి తద్రుధిరబిందువులచే భూదేవికి దర్పణము చేయుటకై సజ్జీకృతాంగుళిపుటులు కొందఱు అప్రమత్తులయి యున్నారని యిప్పటి యమిధునకృత్యప్రసపలాభాభిలాషు లెఱిఁగి యుందురుగాక. లజ్జ యనునది నిఘంటువులలోనైన దర్శన మిచ్చుఁగాక. "మహారాజసుతావాసి న సూతే— వినా" మహారాజసుతశ్చాఽపి సకవిః పాండితీంవినా.

(1914 సం॥ ఫిబ్రవరి అభినవ సరస్వతినుండి.)

# నీతిబోధ

మనోరంజనీ పత్రికాసంపాదకుఁడగు ......రావుగారు తమ మృషావచనంబులు గుంటూరుసీమ, ఆర్యమతబోధిని, సుదర్శని, పత్రికలలో సవిశేషముగఁ జర్చింపఁబడుటాఁడి, కసిపోక మసిఁబూసికొనినట్టుల సరసమగుమార్గమున విమర్శింపఁజాలక కడకు వాగ్వ్యయముఁ జేయుచున్నారు ........పత్రికలలో మూఁడుపాళ్ళు తిట్లుతప్ప మఱియేమి కానవచ్చుటలేదు ... ... వీరికి సద్బుద్ధి గఱపువా రనేకులు గలరు గాని. వారు కులాభిమాను లని యపలాపింతురేమో యని మతాంతరుల (వైష్ణవుల) మగు మేమే వీరి కీవిధమున నీతిగఱపుచున్నారము.........

క. మునుబ్రహ్మద్వేషంబునఁ, జనినాఁడవు కొన్నినాళ్ళు సత్యంబును గ
న్గొనఁజాలక నేఁడకటా, ఘనుఁ దిర్పతివెంకటేశు గర్హించెదవే!

ఉ. పత్రిక చేతనుండెనని వ్రాయఁగఁబోకు మసత్యముల్ సదా
పత్రపపీడి ధీవరులఁబైకొనఁబోకుము చేతిమీఁదుగాఁ
గృత్రిమముల్ లిఖింపకుము కింకవిమత్తగజేంద్రసింహు లో
కత్రయభాసమానవర గర్జితముల్ విని మిన్నకుండుమా!

చ. తెలిసియు నిద్రఁబోవకుము దేవుఁడొకండుఁగలాఁ డటం చెదన్
దలఁపుము పుణ్యపాపముల ధ్యానముఁజేయుము కూలికిన్ విసం
బెలమినిఁ గ్రోలఁబోకుము కవీశ్వర వైరముదాల్పఁ బోకు మీ
తెలివిడిఁగూర్చుమమ్ముఁ బడఁదిట్టకుమయ్య! గుణంబెఱుంగుమా.

శేషాద్రిరమణకవులు.

మునుపు 'దర్బారుపత్రిక' చాలవ్యక్తముగాఁ బ్రబలపించుచుండెడిది. కర్మ
వశమున నది యంతరించినది. పదపడి దానిభారమును వహించి నియతముగా
బ్రోఁగుచున్నవి 'హితకారిణీ' 'మనోరంజనులు' వీనియందలితప్పదుఁ బ్రసంగ
మునకు రోసి కొందఱుప్రాజ్ఞులు మందలింపులనువ్రాసి పత్రికర్తకుల పేరనే పంపు
చుండిరఁట. కాని వానినిగూడ స్వీకరింపవలసినభార మీపత్రికల కుండుట
న్యాయసిద్ధ మైనను నివి *స్వీకరించుట లేదఁట. సోదరపక్షీయులు దేనిని
తిః వెం॥ కవులపక్షపుఁబత్రికగా నపలపించుచున్నారో, ఆయభినవసరస్వతిగూడ
బ్రచురించుటలేదఁట? హితకారిణీమనోరఁజనులలో నేయే పేరులతోఁ దప్పుడు
ప్రసంగము వెలువడుచున్నదో, అందుఁ గొందఱయోగ్యతను నిర్ణయింపఁ దగునం
శములను లోకమునకుఁ దెల్పినచో వారివ్రాఁతలతత్త్వము తెలుపకయే బోధ
పడవచ్చునని యెంచి కొందఱట్టిసందర్భములను దెల్పుచుఁ గడు మృదులముగా
వ్రాసిపంపుచువచ్చిరఁట! వ్రాసినవిషయములు యథార్థము లనుటకు లవమును
సందియములేదఁట! అందుల కితరులసాక్ష్యము లక్కఱయేలేదఁట! ఎవరినిగూర్చి
వ్రాసిరో వారే యొప్పుకొనఁ దగియుండునఁట! ఆయాసంగతులు పదిమంది
పెద్దమనుష్యులు గలవివాహపుసభలు లోనగు ప్రదేశములకు సంబంధించినవి
కాని పరమరహస్యములు గావఁట. అట్టి బహిరంగ సందర్భములను గూడ నభి
నవ సరస్వతి ప్రచురించుటకుఁ గొంకి 'యేకత్ఱమునిష్పన్న నదియే కాలునని
యుపేక్షించుచున్నదఁట. వ్యాసప్రేషకులీతత్త్వము 'తెలుఁగక మా పేర వానిని
బ్రకటింపవలసిన' దని ప్రార్థనాపూర్వకముగాఁ బంపుచున్నారు. సత్యనిర్ధా
రణాతత్పరులగు నవ్వారికి మాకృతజ్ఞతాపూర్వక నమస్కారముల నర్పిం
చుచు గ్రంథవిస్తరభీతిచే నవ్వారివిపులవ్యాసములను వదలి యయ్యానఘుల
నామములలోఁ గొన్ని మాత్రమిట నుదాహరించుచున్నారము.

(1) చింతామణి రాజగోపాలకవి (2) చేపూరి లక్ష్మణకవి, లోనగువారు.
వీరిలోఁ గొంద ఱభినవసరస్వతియం దారోపించిన దోషమును దెలుపఁదగు

---

*'... దీనిని హిత కారిణికిఁ బంపించియుంటిని. కాని యది ప్రచుర
పడలేదు. తిరిగి వ్రాయలేక యీచిత్తునే తమకు పంపించితిని.

చివుకుల అప్పయ్య.

☞ ఈయన దేనిమాఁకడవం పెనో దానిని విస్తరభీతిచే వదలితిమి,

నుత్తరములలో నొకటి రెండిట నుదాహరించెదము.

“ యీ...రావు యిదివరకు తమ నోటీసులోనికి వచ్చినవాడే. యీతడు మా పల్లెటూళ్లలో మిగుల గప్పాలు గొట్టుచూ “వారనగ నెంత వీరనగ నెంత” యనుచుండును ఇట్టి వీనికి నేటికి తగిన ప్రాయశ్చిత్తము జరిగినది. యీ సంగతి పత్రికాముఖముగ నెల్లరకు నెఱిగించుట సర్వోత్తమమని నా యభిప్రాయము”...పట్టాభిరామశాస్త్రిగారు యిట్టి విషయములలో శ్రద్ధపుచ్చుకొనరు. అనేక పిచ్చి పత్రికలీ కాలమందు ఓంకారం గురవరాజు మొదలగువారి పిచ్చి వ్యాసములచే నిండుచున్నను...అభినవ సరస్వతి సాహసింపకున్నందులకు చింతిల్లుచున్నవారము. యీ గాథను...తమ గుంటూరు సీమయందుగాని ప్రచురింప ప్రార్థించుచున్నాను చేపూరి లక్ష్మణకవి 6-2-14.

———

“ చింతామణి రాజగోపాలం వ్రాసుకున్న విజ్ఞాపన.....ప్రస్తుత కాలమున గాకవు లెందరో తమ యశస్సునకు లోటు గలిగింప యత్నించి నోటికి వచ్చినయట్లు పత్రికలలో గీకుచున్నారు. అట్టి పిచ్చి వ్రాతలనేని పెరుగనిచ్చుటంత మంచిది గాదనుట జగద్విదితమే కదా! కాన నటువంటి తప్పుడు వ్రాతలకు మీరు జవాబు నొసంగుట సమంజసము కాదు గనుక నన్నుబోట్లందులకు తగియుందుముగదా ? యీ సంగతి నెరిగియో యెరుగకయో పట్టాభిరామశాస్త్రిగారేదేని వ్యాసమును గాని, పద్యములను గాని, సహేతుకముగ వ్రాసి పంపినను ప్రచురింపక మిన్నకొనుచున్నారు. అందుచే ‘హితకారిణి’ మొదలగు పిచ్చి పత్రికలకు జవాబులు రాక నిలవయున్నవి. యింతయేల యీమధ్య......గారికి...వలన కలిగిన పరాభవమును క్లుప్తముగా వ్రాసి పంపుకొని యున్నాను. అది యేమగునో తెలియదు ...”

చింతామణి రాజగోలం. 14-1-14.

———

పత్రిక యనఁగా వివేచనాజ్ఞానము కలదియే గాని యన్యము కానేరదు. ఆంధ్ర, కృష్ణ, సువర్ణలేఖ, లోనైనవి మొదట నీ శాఖాభిమానుల తత్త్వము నెఱుఁగకయో, అభిమానులలోని పురుషులలోఁ గొందఱు కార్యస్థానముల నుండుటంబట్టియో మోసపడి పదపడి కన్నుదెఱచి యిప్పుడిప్పుడీ గొడవనుండి విరమించినవి, కాని విరమించునప్పుడు పై పత్రికలలోఁ గొన్ని చాల సయుక్తికముగా విరమించినవని వ్రాయక తప్పదు. ఆయీ సందర్భము, వేమవరపు

పీఠికలో వారి వారి స్వహస్త లిఖితములగు జాబులవల్లనే తెలిసికొనవచ్చును. అది యటులుండె, సత్కృతము

క. ....మఱియెఱిఁగి యెఱుఁగనేరని, కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే. ( భార-ఆది-ర-ఆ )

అను తెలుఁగున వర్తించు పత్రికల రీతిం దెలుప నందలి వ్యాస మొకటియే యుదాహరింపక "నీటిలో గేదెను బెట్టి బేరము చెప్పుట యుక్తము" కాదని స్థాలీపులాకన్యాయమున నాయయుక్త ప్రసంగము కొంచె ముదాహరించి చూపుచున్నారము.

(1914 సం॥ 4-11 వ జనవరి తేదీల హితకారిణి నుండి.)

...మరి నాల్గు దినములకు కవుల కంకణముల సభ జరిగెను మతః సామ్య చందంబున "ఎక్కడో కొడితే ఎక్కడో రాలిన వన్నట్లు" ఎక్కడ వేమవరం? ఎక్కడ గుంటూరు? ఎట్టి అపధారం! ఆహా గుంటూరుసీమను పడ తిట్టిన దిట్టకవులకు తిర్గి గుంటూరునందు నిట్టి కంకణములు తగిలించుట చిత్రము. చివరకు బుట్టి గుంటూరేదిక్కయ్యోగా యీ కవులకు!......అనగా దీని కంతకు కారకులు గుంటూరు నైదికోత్తములు గొండలని యూహింపనగును. ఈ రోజులలో ఒక చిన్న పిల్లవాడైన ఒక పనిని చేస్తే 'థ్యాంకుయు' అన్నట్లు ఉ-ఊ అంటె మెడల్సు, కడియాలు, గాజులు, ఉంగరాలు, తాళిబొట్లు, మున్నగు బహుమానాలు. పూర్వకాలంలో యెంతో గొప్ప పండితుడైతే దుసాల్వులవలు బహుమానం యిచ్చే టప్పటికి యెక్కువ. నక్షత్రకుడు.

ఏ 'నక్షత్రకుఁడో' యేదియో వ్రాసె నే యనుఁడు ఇందేమి స్పృహణీయమగు నంశ మున్నది. ఇందు నక్షత్రకుఁ డింకను నెంతో *సోద వెళ్ళఁ

---

గుంటూరు గుబగుబలు. సానిపాట, కవులు.

* ఈ నెల 16 తేది రాత్రి 9-30 గంటలకు బెంగుళూరు నాగరత్నం పాటకచేరి జరిగి యుండెను...... ముందు కవులకు గంకణాలు తగిలించి తరువాత రాత్రి సానిపాట అని అనుకున్నారట. కాని యేకారణమువల్లనో ముందు పాట జరిగినది. 20 తేదీని కవులకు కంకణముల బహుమానము జరిగినది. రాత్రి సానిపాటకు కవులు హాజరైరి...... అదిగాక యొక చక్కని సిద్ధాంతమును వెలిబుచ్చిరి. సానులు వివాహమే చేసుకొనినచో జనులకిట్టే యానందమెట్లు

బెట్టెను. అది యటులుండె, ఏమైనను 'హితకారిణి' ప్రచురించు నితరవ్యాసములకన్న భాషావిషయమగు నికృష్టతలో నిది చాల మెఱుగు, ఎట్టి బూతుఁ గూఁతలేని యిది ప్రచురించెడి నను రహస్యము నీ 'నక్షత్రకుఁ' డెఱుఁగఁ డని తెలుఁపెదము, లేనిచో నితఁ డింత మృదువుగా వ్రాయఁడు, మఱియు నీవిచార గ్రస్తుని విచారమును బ్రచురించిననాఁటి "హితకారిణి"యే వేఱొకట నీక్రింది యక్షరములను బ్రచురించినది.

"ఈ నెల 18 వ తేదీ రాత్రి 3 న్నర గంటలకు శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దూర్‌వారి జ్యేష్ఠపుత్రికకు... పాణిగ్రహణ మహోత్సవము

---

కలుగుననియు అందున స్వాములు వివాహము జేసుకొనక యిట్లుండవలెననియు దీవించి మరీ కూర్చొనిరి. ఆహా! ఎంత నీతికోవిదులు...... ఇంతకు 'మాలాటి వారు లేరు' అనే గర్వం యున్నంత వరకు సత్యము (తి॥ వెం॥ ల) కనులకు గోచరముకాదు......"

☞ నక్షత్రకుని ప్రలాపము నజ్ఞాత్రము చూపఁబడినది ఈప్రలాపమునకు నాఁటి గానప్రశంసాపద్యములకును గల సంబంధమును వివేచకులు నిర్ణయించుకొందురుగాక యని నాఁడు మానొడివిన పద్యము లీక్రింద నుదాహరించుచున్నారము.

శా. గానంబుల్ విను నేర్పె కా కసదు నాగస్త్రీలకుం గాన వి
ద్యానైపుణ్య మటంచు జెప్పికొనువార్తల్ మాపఁగాఁ బుట్టె నే
నో నాగాంగన యంచు లోపలఁ దలంతు న్నన్ను; నీగానవి
ద్యానందామృతవార్ధిలో మునుఁగు నార్యశ్రేణి నాగాంగనా!

తే. గీ. స్వరము రాగమ్ము పురుషుల సరణిఁ దోఁచు
మధురిమము పూవుఁబోఁడులమాద్రి నొప్పు
చాటుగా నాగరత్నము పాటవిన్నఁ
బురుషుఁడో లేక కాంతయో యెఱుకపడదు.

ఉ. పాడుదు రెందఱో యెటులు పాడిననుం 'మగవానిగానముం
జేడెల సంస్కృతంబును రుచింప' నటంచు వచించె మున్ను నే
నాఁ డల శూద్రకుం డనృతవాదిగ నేఁటికిఁ దోఁచకున్నె! పూఁ
బోఁడులు నాగరత్నమును బోలెడువాం డ్రుదయింప కున్నచో.

జరిగెను...... సోదరకవులకు మణిఖచిత స్వర్ణపతకములు చెఱియొకటి శ్రీరాజా గారొసంగిరి... బిరుదము నిచ్చిరి''

'వక్తృత్రికుని' తుట్టతుదివిచారవిూ 'సోదరుల' బిరుదప్రదానాదులకుఁ దగులకుండుఁగాక. అది యటులుండె, నీహితకారిణి ననుసరించి మేము సవరింపవలసిన దొకటి కలదు. పూర్వరంగపీఠిక 2 వ పుటలో—

'తిరుపతివెంకటేశకవిధీరులఁ దెల్పెద మిమ్ముఁ దెల్పెదన్'

అని సవరించితిమి. ఇంతకన్న హితకారిణీమనోరంజనములలో గణింపఁదగన యంశ మించుకయుఁ గానరాదు, పూర్వరంగము 51 వ పుట 28 పంక్తిలో

వేమూరి నృసింహశాస్త్రి, శతావధానీ,

అని సవరింపవగుఁ, అందులకుఁగల బీజ మీక్రిందియుత్తరము తెల్పును.

"శ్లో॥ కేచిచ్ఛ్రీపతి వెంకటేశ్వరకవీ... గురుతాహితాకవీసంశ్రియే॥

శ్లో॥ తెనాలిపుర్యాం శివరామశాస్త్రి, ప్రవర్త్యతె సాధు శతావధానే। అకీరణం పద్యమిదం సభాయాం, పరిశస్తిపస్యే ష్వతిహృష్టచిత్తః॥

వేమూరి నృసింహశాస్త్రీ, శతావధానీ

---

శా. పెండ్లాడఁజాలె వేశ్యలందుఁగటా! పెక్కండ్రు; రీజాతికిన్
బెండ్లింద్లే యగుచో సుధామధురమ ప్రీడాకరంబౌనటుల్
చెండ్లంబోలు స్వరంబులన్ విసరుచాళిన్ రాగముల్ వాడుపూఁ
బోండ్లన్ జూచుట గల్గునే సభల నెప్డున్ నాగరత్నాంగులన్?

చ. అచలశరమ్ములున్ జలన మందఁ దొడంగెడి 'నాగరత్న' మన్
విచికిలగంధి గానపుఁ బ్రవీణత, కన్యనిమిత్తమై సదా
ప్రచలనమందు శీర్షములపాటులు వాకొనసేల? సద్వచో
రచనకు నట్టి గానపుభరమ్మునకున్ జగమెల్ల నూఁగెడిన్.

ఉ. "రాగము లేదు నా'' కను విరాగి మనమ్మునయందు సైతమున్
రాగము పుట్టఁ జేయునది రాగము; రాగిమనమ్మునం దెటో
రాగము పుట్టఁజేయునది రాగమె?'' యన్ వివరం బెఱింగి తా
నాగమణీగళంబు గలనాదము లీనె మనోహరమ్ముగన్.

తిరుపతి వెంకటేశ్వరులు.

‘హితకారిణి’ లో నంతమాత్రమేని గణింపఁ దగినయంశము లేదు గాని ‘మనోరంజని’ లో నపుడును గానఁ బడలేదు. దానిపోకడలు కేవల కుతంత్రములకుఁగాఁ బాటుపడుచున్నవి. ఆయంశ మీక్రిందిపంక్తులు తెలుపఁ గలవు.

(15 జూలై 1913 సం॥ మనోరంజనినుండి)

“...చూడలేదా - గుంటూరు సీమ మొదటనే నియోగు లందఱు స్త్రీలనియు, వైదికులందఱుఁ బురుషు లనియు, దమ వెఱ్ఱిభోరణిం గొంత బయటఁ బెట్టుకొనిరి...”

ఇది తనవలెఁ బెల్లితక్కువగా శాఖాభిమానమును వినియోగింపని సహృదయులగు నియోగిశిఖామణులకు ‘పుల్లింగములు’ పెట్టుతలఁపుతో వ్రాసినవ్రాఁత. భవతు, వ్రాయుఁగాక, నియోగివైదికుల యైకమత్యమును బోధించుచు సాత్త్వాత్పరదేవతనుగా నియోగులను సంభావించిన యుపమానకల్పమునం దేదో దుర్ధ్వని నాపాదించుచున్న యీపత్రికగాని వేఱొకటిగాని యీవిషయమున కంతకన్నఁ జక్కని యుపమానమును సేకరించి చూపవచ్చునేమో యద్దానిని శిరసావహించి దిద్దుకొనుచున్నారము. ‘అ’ అంటే అపశబ్దము ‘ఊ’ అంటే, ఉపశబ్దము, నారాయణా, అంటే, బూతుమాటయనుగాఁ బ్రసంగించు జ్ఞానలవదుర్విదగ్ధు నిశంకయగుటచే ‘ఘంటానురోధము’ నుత్తరింపఁబడియె, తగిన సహృదయు లెవరేని యడుగుచో * సాంఖ్యసూత్రానుసారముగఁగాని, ‡ దేవీభాగవతరీతిచేఁగాని, † ఆలంకారిక మతసందర్భమునఁ గాని యిర్వ్యేడ వ్రాయవలసిన ప్రమాణములు చాలఁ గలవని విజ్ఞులరయుదురుగాక. పనిలోఁ బని. మనోరంజనీ, హితకారిణు లించుక యుత్తర మీఁపగినవని తలఁపఁదగు వేఱొక విషయమును గూర్చి బుక్కించినవి. అది యీక్రింది సందర్భములనఁ దెలిసికొనఁదగు.

---

*(1) అజామేకాం లోహితశుక్ల కృష్ణాం బహ్వీంప్రజాం జనయంతీగ్ం సరూపామ్॥

‡ (2) శ్లో॥ బ్రహ్మాదయస్సురగణా నతుకిం యుపత్యాః... శ్లో॥ త్వంనాఽపుమాన్ నచ పుమాన్...... (దేవీ-౧- స్కం) శ్లో॥ నాఽహం స్త్రీ నపుమాంశ్చాహం నక్లీబం......(దేవీ-3 స్కం,)

† (3) తద్భిన్నత్వేసతి తద్గత భూయోధర్మవత్త్వం సాదృశ్యమ్।

(పరిషత్పత్రికనుండి)

పరిషత్పత్రికాపాఠకోత్తములారా!

2 సంపుటము 2 సంచిక చిట్టచివర నాపద్యములలో

(1) "అష్టభాషలకు" అను సీసములో గీతి తక్క, దక్కినది "సర్వశూన్యశతకము" నుండి యనుసరింపఁబడినదని యెఱుంగవలయు ..............

దివాకర్ల, తిరుపతిశాస్త్రి.

(1913 వ సం॥ నవంబరు నెల 1 వ తేదీ సుదర్శని పత్రికనుండి.)

"వీరా "రోజు మంచిదని- పట్టపగలే కన్నమా" అను స్థూలదృష్టి వ్యాసము జూచితిని. అందు మీరు "నాయీసంశయమును నివారించుదురుగాక" అని చదువరులను గోరుటయేగాక తుట్టతుద నన్నుద్దేశించి కొంత వ్రాసియున్నారు ..."అష్టభాషలకు" అను పద్యము సర్వశూన్య శతకములోనున్నను అది తిరుపతి శాస్త్రిగారికవిత్వమేను. ముమ్మాటికి వారిదేను ..."

ఇట్లు, (Sd) కృత్తివెంటి గంగరాజు.

ఇతరునిదిగాని, తనదిగాని, యన్యత్రక్లృప్తమైన దానిని వేఱొకచో గ్రహించుట * యనువాద మనఁబడును. ఇందులకు 'కాళిదాసు తిక్కన' లోనగు మహాకవుల ననేకులఁ బ్రమాణముగాఁ జెప్పనొప్పగు నదియటులుండె. ఇతరాధీనము చేసిన పద్యమును మరలనాత్మ సాత్కరించుటమాత్రము తప్పుగాదా, అని యందురేని, ఆక్షేపమునకు మే మిప్పటికిఁ జిరకాలము క్రిందటనే పరిహారమును వ్రాసియున్నారము చూడుడు

(1908 సం॥ లో నచ్చయిన నానారాజసందర్శన పీఠిక నుండి.)

(పండితుండనెడి) యనునది. 2 వ పేజీలో నస్మత్కృత మయ్యును నితరకవి కృతముగ విధిగామిమ్ము భ్రమింపఁజేయునది కలదు. దానింగూర్చి వ్రాసిన గ్రంథము విశేషించి పెరుఁగును. గాన నయ్యది యస్మత్కృతమే యనియును నితరకవికృతమైన గ్రంథములో మేమే పూర్వము దానిని సంస్కరించునప్పుడు కృతినాయకుఁ డందులకు నిందులకు నొకఁడేయగుటచేఁ జేర్చితి మనియుఁ జదువరులూహించి మాపద్యమును మేముతిరిగియుఁ బుచ్చికొన్నందు

---

* "సిద్ధస్య కథనమనువాదః"

లకుఁ దత్తద్రవ్యాపహరణ దోషమునే మాయందాపాదించి గ్రంథచౌర్యదోషము నాపాదింపకుండఁ బ్రార్థితులు.

ఈ పంక్తు లిప్పటికి 6 వత్సరముల క్రిందట వ్రాసినవి గాని నేఁటివి కావు. ఈ సంప్రదాయముంబట్టియే మా 'గురుదక్షిణ' లోని

సీ॥ మొదలంట నడుగంటి మూలమూలల నుండు వేదశాస్త్రమ్ములు వెలికివచ్చె

అను సీసపద్యము శ్రీకృష్ణాపత్రికవారి కవిత్వముకాక మాకవిత్వము కావలసియుండుట, 'అష్టభాషా' పద్యమువలెనే మొదలంటు, పద్యమునందును నిటీవల గీతి మార్పఁబడినది. ఆయీయంశమునకు 28 అక్టోబరు 1916 సం॥ తేదీ కృష్ణాపత్రిక చూడఁదగు, ఇంతవఱకుఁ దెలిసికొననంతటి తెల్వితేటలు భగవంతుఁడీయని యప్పుడా యాయీమానసు లెట్లు ప్రసంగించినను చెప్పలేదు గాని చుట్టివారల వ్రాఁతలకుఁ బ్రత్యుత్తర మిడుటమాత్రము మాది తప్పు కాక పోదు. ఆతప్పు సోదరులతోడి వారిప్రతివాదిభావముకన్న నెక్కుడుది కాదు, దాని కెవరు సమ్మతించుచున్నారు, ఎవర డింపకయున్నారు? ఏరు విచారించుట లేదు? చూడుఁడు

ఉ. "కొప్పరపుంగవీశ్వరులకుం గలపాండితి తెల్లమయ్యె మీ
రిప్పుడిఁ బూని వారల జయించెద మంచు రచించుటెంతయుం
గొప్పయుఁగాదు చేటుమున కోరుదురో కలహంబు నేసినం
దప్పని చెప్ప రేయునఁ ఘనం బగు నయ్యది వెంకటేశ్వరా!

ఓ కొప్పరపు సోదరకవులారా!

మ. అరరే! దుర్మదపూరపూరితమహాహంకారహుంకారని
ర్భరతుండాహతిపీడ్యమానసుజనవ్రాతక్షమాజాతనీ
చరటత్కారవిముక్తసామజశిరస్సంభేదనిర్నిద్రకే
సరులౌ తిర్పతివేంకటేశ్వరుల విూసాల్ పీక మీశక్యమే?

మ. కలరే! గర్హితకాకవిత్వకలనాకౌశల్యదుష్పాండితీ
చలదౌర్బల్యవిశీర్ణబాలతృణనీచగ్రాసదగ్రీవనా
స్తలఘుప్రాణకుమార్గగామికుకవిస్తోమత్కురంగాళికిం
బులులౌ తిర్పతివేంకటేశ్వరులతోఁ బోరాడువా రిద్ధరన్.

మ. అపురా! నిస్తులసత్ప్రశస్తిఘనవస్త్రాలంకృతా మోదని
త్యవిరాజత్కుకుబంగనావిశితధైర్యస్తోత్రపాత్రప్రథా

సవిధస్థాననిరర్గళప్రకటభాస్వత్సత్ప్రభాశోభిస
త్కవులౌ తిర్పతి వేంకటేశ్వరులతోఁ గాల్ ద్రవ్వువార్ మీరలే?

మ నిమిషానేకవిధప్రబంధరచనానిర్నిద్రవిద్వత్సమా
జమనీషాప్రియసద్రసప్రథితశశ్వచ్ఛందదత్యార్భటీ
ప్రముఖాలంకృతసత్కవిత్వవిలసత్పాండిత్యగాంభీర్యదు
ర్గములౌ తిర్పతి వేంకటేశ్వరు లసంగా దోమలై తోఁచిరే?

మ. సతతప్రస్ఫురదాంధ్రసంస్కృతకళాసందర్భవిస్తీర్ణస
త్ప్రతిభాశక్తి విమోహితప్రతిభటవ్రాతప్రభావాఢ్యలం
కృతవిద్వత్కవి మూర్ధరత్నసుతసత్కీర్తిస్ఫురన్మాన్యస
మ్మతులౌ తిర్పతి వేంకటేశ్వరులతో మారాడనోరాడునే?

శా. చండీసత్కరుణారసాప్తకవితాసామ్రాజ్యధౌరేయతా
ఖండైశ్వర్యయశోభిమండితదిశాకాండప్రచండార్భటీ
పాండిత్యాశనిపాతసాధనరిపువ్రాతాద్రినిర్భేదనో
ద్దండుల్ తిర్పతి వేంకటేశ్వరులు వాదం బేటికవ్వారితోన్.

కరవది }
ఒంగోలు }

పిసుపాటి చిదంబరశాస్త్రి,
శతావధాని

క. అను పద్యంబుల వేగన్, ఘనదీర్ఘలసత్సమాసకంబులతో నేఁ
బనిచితి వారలకడకున్, బనిబూని లిఖింపరైరి ప్రత్యుత్తరమున్.

చ. కవియన నెట్టిఁడో యతనికార్యమదేమొ యతండు దేనినిం
దవిలిపఠింపఁగా నగునొ తత్స్థితియేమొ పద్యవిశుద్ధి యెం
తవఱకు నుండఁగావలెనొ దాని నెఱుంగని యట్టివారలన్
గవులని చెప్పుచోఁ గవులు కానిజనుల్ జగమందునుందురే!

క. తెలిపితి మీకీసంగతి, నలఘుయశోభాసురా! యిదంతయు నీలో
కలకుం దలపెదరనియెం, చిలలిన్ గ్రహియింపుఁడీ విశేషములెంచన్.

పిసుపాటి చిదంబరశాస్త్రి.

(జనవరి 1914 సం॥ అభినవ సరస్వతినుండి)

సుకవిరిపుకపోలచపేటము.

ఇంచుమించు నాలుగు సంవత్సరములనుండి శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవుల
మీఁదికిఁ గొందఱు పండితంమన్యులొంటికాలిపైన లేచుచున్నారు. అంద్రగతాం

బూలపువారు గీరటకారయితలు, తరువాత వారు గుంటూరుసీమలోని కథానాయకులు, అటుపిమ్మట వారి పైవారల ననుకరించువారును,...... శ్రీ కవివరులపై నిపుడు మన్యులు కాలుద్రిప్పుటను గుఱించి పూర్వ మెన్నఁడో తాతలకాలమునఁ జేసిన వీరిదిగ్విజయసమయమున నంతపాటిగా చెప్పుకొను లేమిచే నెట్లో కనులు మూసి గంతకట్టి యశముపడసిరనియు నిపుడెంతెంతో మహానుభావులు విలసిల్లుటచే వీరిమాట లెంతమాత్రమును సాగిరాకున్నవనియుఁ గొందఱభిప్రాయపడుచున్నారు. కాని ప్రకృతపు మన మన్యులవలె శ్రీ కవివరుల దిగ్విజయసమయమునందలి పండిత కోండులు స్వశక్తి నెఱుఁగక "యేనకేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్" అను శ్లోకప్రమాణానుయాయిమండలితో గణింపఁబడి బుధజనపరిహాస యోగ్యత నిచ్చగింపక గౌరవపరిరక్షణము గావించుకొనిన సంగతి వారు (పైవిధముగ నభిప్రాయపడువారు) గమనింపలేకపోవుట శోచనీయమని వ్రాయవలసివచ్చినందుకుఁ గష్టముతోఁచుచున్నది......శ్రీ కవివరులవలని పరాభవము సహితము గ్రంథస్థమై శ్రీమోదాయకమగుటంబట్టి మన్యుల కెట్లుచూచినను లోటుగలుగదు......ప్రస్తుతపు మన పృథామత్సరగ్రస్తుల చారిత్ర మెంతవ్రాసినను లేఖకులకు పనువు ఘట్టవలసినదే కాని యెప్పటికిని దుదముట్టునట్లు తోఁపదు. కనుక నిఁకనొక పద్యమును మాత్రము వ్రాసి మాలేఖిని కొంతవిశ్రాంతిగలిగింతుము.

సీ. భట్టవర్యులలోన దిట్టయగు నన్నయభట్టారకుని కాదిఁ బుట్టువొంది
చాళుక్యవంశ సంజనితుఁడౌ రాజేంద్రుతోరంపు ముంగిట దోఁగియాడి
అలకృష్ణదేవరాయలవారి సభలోనఁ దకధింధిమంచు నృత్యం బొనర్చి
తంజాపురీశు నాస్థానమంటపమందు మంతుకెక్కఁగఁ జాల నంతుసల్పి

గీ. ఇప్పుడు వేంకటపదంతి మృగేంద్రులైన
సరస తిరుపతి వేంకటేశ్వరుల యింటఁ
బీఁట వెట్టుక కూర్చుండెఁ బృథులహావ
భావరస పేటి సత్కవితావధూటి.

సికింద్రాబాదు
8-7-1913

ఇట్లు,
చిప్పకుల వేంకటాచలశాస్త్రి.

---

మామా తారతమ్యము నెఱుఁగని వారెవరు? మాకుఁ దెలియకున్నను నితరులకుఁ దెలిసియే యున్నది. ఈ క్రింది వాక్యములు గూడఁ దిలకింపుఁడు.

## (1) హితోపదేశము.

"కొప్పరపుకవులు నియోగులైనందున్న శాఖాభిమానముచేఁ గొందరు కల్పించిన కారణమువల్ల యీ రెండవ కలహము కలిగినదని ప్రతిమనుజునకును తెలిసిన యంశమే... పండితకవులలో అద్వితీయులని ప్రఖ్యాతి గాంచి... బ్ర॥ తిరుపతి వేంకటకవులు సంపాదించిన విశాలమైన కీర్తియే యితరులకు కన్నెఱ్ఱజేసి యిట్టి కలహములకు కారణభూతమైనది. నియోగిశాఖాభిమానులు న్యాయవిచక్షతలేకనే సోదరకవులను పురికొల్పి అదివరకు వారికి బ్ర॥ తిరుపతివెంకటకవులయందున్న భక్తివిశ్వాసములను విడనాడజేసి దుఃఖభాజకములగు ఇట్టి కలహములు కలుగజేసినందుల కెంతయు చింతింపవలసియున్నది ...... లేనిపోని ద్వేషములను మనసునందుంచుకొని పండితతిరస్కారమునకు పురికొల్పుట మిగుల సాహసము. దేశానర్థదాయకము, పరిహాసాస్పదము... పండితులైనవారు వైదికులయిననేమి నియోగులయిననేమి మఱియొక శాఖవారయిననేమి... కావున ఓ నియోగి సోదరులారా! మీశక్తి యంతయు కేవలదుఃఖాస్పదమయిన యీనిష్ప్రయోజకపు కలహములయందు వ్యర్థపుచ్చక దేశహితార్థము వినియోగించగలందులకు త్రికరణశుద్ధిగా మిమ్ములను వేడుకొనుచున్నాను. కలహముల నుపసంహరింపుడు; నిష్కళంకమైన మనములతో విచారింపుడు దోసములున్న క్షమింపుడు"

జగ్గయ్యపేట. ఇట్లు, హితముగోరు, ములుగు సుబ్రహ్మణ్యం

"... అట్లుగాక తాఁదత్త్వవిచక్షణవిడనాడి శాఖాభిమానము మొదలగు కొన్ని వైషమ్యములను మనసునందుంచుకొని తిట్లకు మొదలిడి తమకేమో గొప్పసంఘబలమున్నదని భావించి తగవునకు సిద్ధముగా నున్నట్టియు పాండిత్యమునందు తగుపాటి సామగ్రిలేనట్టియు శ్రీ కొప్పరపు సోదరకవులతో జరుగుచున్న తిట్లతో కూడినచర్చవల్ల భాషకుకాని దేశమునకుగాని యెట్టిలాభమును లేదని నాతలంపు. యీకొప్పరపువారు గురుకులవాసముచేసి పాండిత్యము గడించియుండలేదను సంగతి యందఱకును విశదమె, కాని వారియందభిమానముగలవారు మాత్రము వారియం దెక్కుడుగణ్యతను తెచ్చిపెట్టుటకు తమశక్తికి మించిన ప్రయత్నము చేయుచున్నారు. యింతమాత్రమున వారికిలేని పాండిత్యమును గొనితెచ్చెదరా?... వారికున్న పాండిత్యమునకు తగు గౌరవము నిల్పిన సంతేచాలును. బ్రహ్మశ్రీ తిరుపతివెంకటకవులతో అకారణముగా తమస్థితి తామెఱుంగక కలహమునకు దిగుటచూడ కొండతో డీకొననెంచు గొఱ్ఱెపోతుచందము జ్ఞప్తికివచ్చు

చున్నది. సంఘబలముండిన నుండుగాక! యిదేమి యన్యాయము! యిందులకు కారణము శాఖాభిమానుల ప్రోత్సాహమే. వారు ప్రోత్సహింతురుగాక వీరేల సమ్మతింపవలెను......వారి పేరు లడుగువారెవ్వరు..."

జగ్గయ్యపేట
4-7-13

ఇట్లు,
శ్రీ॥ వీరభద్రయ్యశాస్త్రులు.

ప్రాజ్ఞులెఱుంగనిది లవమును నుండదు. వారి కాయా చరిత్ర గ్రంథములతోఁ బనియే లేదు. కాని కొన్ని కారణములవలన వారుగూడ నంతరంగవ్యతిరిక్తముగా నడువవలసివచ్చును. అట్టివారు మరలఁ దమయంతరంగముల నన్యథా వెలిపుచ్చుటను గూర్చి పూర్వరంగమున దిఙ్మాత్రప్రదర్శనము చేయఁబడినది. ఇట మఱికొందఱను గూర్చి పరిసంగింపఁబడుచున్నది. ఈ యుత్తరముం దిలకింపుఁడు.

..."అయ్యా! యిందుతో... సంగతులు కొన్ని...వ్రాసుకున్నాను... నేను వ్రాసినసంగతి ప్రమాణస్ఫూర్తిగా నిజమైనదిగాని... లలో కొందరివలె అభూతకల్పన కల్పించి వ్రాసినవిగావు. అవసరమగునేని యీప్రస్తావము జర్పిన శ్రీ శాస్త్రిగారివల్లనూ, వెంకటసుబ్బయ్యగారివల్లనూ వొప్పించెదను...కొప్పరపు సోదరులచే నిసపాటియందు జర్పబడిన సభయొక్క విషయములు కొందరివల్ల నాకు తెలియబడి వాటిలో నిజమని నమ్ముటకు...వీలులేని...యాస్తుతులలోని నిజానిజములు తెలియగోరియుండగా కారణాంతరముచే నాటిసభ కగ్రాసనాధిపతులున్నూ, అగ్రహారీకులున్నూ, ఆధునికాంధ్ర మహాకవులున్నూ, సుప్రసిద్ధులును నగు బ్రహ్మశ్రీ అమరవాది రామశాస్త్రిగారి నివాసగ్రామమగు బాలేమర్రు నేనువెళ్లి శ్రీ రామశాస్త్రిగారిని గూర్చి అయ్యా!...గనుక తెలపీయగోరితిని. అని కోరగా నా సుధీవరులిటులనుడివిరి...అవును వల్లమన్నూ, ఆసభజరుగుటకు మూలకారకులున్నూ, అప్పటి మా ఖండం...మున్నూ నగు...పంతులుగారి ప్రోత్సాహం వల్ల నేనా సభ కగ్రాసనాధిపతి పదవి కొప్పితిని... పండితుల్లు అగ్రాసనాధిపతులుగా నుండదగిన కవులు సోదరులుగారని నేను స్పష్టముగ జెప్పెదను. నేను వారిని గూర్చి చెప్పిన... పద్యములుగూడా శ్రీ ... గారి...వల్లనని యెరుగుదు.. అని అనుచుండగా, అంతకుముందునుంచి అక్కడ కూర్చున్న వారిలోని వారున్నూ ఆగ్రామాధికారులున్నూ ... న్యాయైకపక్షపాతులున్నూ, నగు బాలేమర్తి వెంకట.

సుబ్బయ్యగారిటు నుడివిరి. "శాస్త్రిగారూ! నాటిసభయందు సోదరులనుగూర్చి
...పద్యములు చెప్పుటకు మన సొగ్గకయూ చెప్పుచుండినచో బంధుమిత్రుల
మనసు నొప్పింపజేసినవాడ నవుదునని యెంచి ఎట్టకేలకు...అను నర్థముగల పద్య
ములను జదివితిని ... యీ పద్యములు సోదరులు విని ... తోనున్నా వంశీకుల
తోనున్నా పోల్చిరేకాని తమ్మునుగూర్చి పొగడలేదని ... యిదిగాక బ్రహ్మశ్రీ
తిరుపతివెంకటేశ్వరులకు సంబంధించు అవాచ్యపరిసంగములు సభలో ప్రారంభిం
చుటయె కాక వారి నేమో సాధించెద మనియెదరు,... అనాదినుంచి హెచ్చుకు
ఏనుగునున్నా, తగ్గుకు దోమనున్నా పోల్చుటకలదు గాని వీరిపట్ల దీనిని కూడా
వుపయోగపర్చుటకు తగదని నేను చెప్పెదను" యీ సంగతులు బాలేపుడు
గ్రామములో బాలేమర్తి లక్ష్మీనరసింహంగారి యింట్లో చర్చించబడినవనిన్ని
యథార్థములనిన్ని నేను చెప్పుచున్నాను"

కలపకోలను రామయ్య, వరపు రామకృష్ణయ్య, యీనాందారు, పెద
పరిమి, మకాం, కొండపటికల్లు, నందిగామపోస్టు, కృష్ణాజిల్లా.

## 20. November 1913.

వీరివలెనే బ్ర॥ శ్రీ॥ వేదము వెంకటరాయశాస్త్రులవారుగూడఁ దమయం
తరంగము నొక సంపన్నగృహస్థునకు నొసంగియున్నారు ఆయంశము నెలుపు
నుత్తరము మేమిట నుదాహరింప నసమర్థులము. లక్షోటా ప్రశ్నగాఁ జెప్పు
చున్నారము, వారి యంతరంగము వేఱు, ముద్రాటికిని వేఱు, వేఱు, వేఱు.
దీనినిటులుంచి శ్రీశాస్త్రులవారి మెప్పు నీక్రింద నుదాహరించుచున్నారము.

(1914 సం॥ జనవరి 3 వ తేదీ కృష్ణాపత్రికనుండి)

"...వేంకటరాయశాస్త్రులవారు చెప్పుటలో ... అన్ని పద్యములును
మిగుల బాగుగా నున్నవి. లోపములే కనుపించలేదు. (ఉభయభాషలయందును)
వీరికిగల సమర్థతను వెల్లడించుచున్నవి..."

పైయక్కరములలో మిగుల సంశయింపవలసినది, మాచేఁ గుండలీకృత
మగుభాగము, దానిఁగూర్చియే శ్రీ శాస్త్రులవారికి మున్నుదాహరించిన సంపన్న
గృహస్థుత్తరమును వ్రాసినది. ఇంతవఱకు నడచిన ప్రసక్తియెల్ల మేమెఱిఁగి
నదియే. ఇట్టిప్రసక్తి కిడిన ప్రత్యుత్తరమే చూడరాని కట్టుబాటులతో వచ్చినది.
అందలి సంగతులనే మే మనుమానప్రమాణములవల్ల గ్రహించినది. మాయను

మతిలోఁ బొరపాటున్నచో శ్రీశాస్త్రులవారు తెలుపఁదగుదురు. వారు సర్వథా పెద్దలు. నా యనుమానమును బలపఱుపఁదగు మఱికొన్ని బీజము లుదాహరింపఁబడుచున్నవి.

యేలూరు 20-1-1914.

"...మహారాజశ్రీ మంత్రిప్రగడ భుజంగరావుగారి లోపల వివాహము వాల్గవరోగాన మహారాజశ్రీ కొప్పరపు కవీశ్వరులను ...పార్వతీపరిణయము చెప్పుమనగా చెప్పినారుగాని యేమీ బాగాలేదు. గంటకు 75 పద్యము లొప్పున చెప్పినారు 'ఆశుకవి శిఖామణి' యని బిరుదులుకూడా యిచ్చినారు. తరువాత ... గారు వీరిని వెంటబెట్టుకొని... దగ్గరకువెళ్లి అడుగగా నిరసన భావము చూపుటవల్ల మోతేవారిని ... పడితే వారు ఒకసభ చేయించినారు ఆరోజునకూడా బాగాలేదు,... వీరికి వున్న బిరుదులన్ని స్వశాఖాభిమానులు యిచ్చినట్లు తోస్తుంది..."

Ellore,

5-2-1914. గుండు వెంకటకృష్ణమూర్తి

"తాము వ్రాయుచున్న గుంటూరుసీమ రెండవభాగము తయారు అయిన వెంటనే వి. పి. ద్వారా నాకొకపుస్తకము పంపించగోరుచున్నాడను కొప్పరపువారికిని మీకునుగల వివాదమందు విద్యావిషయము పరిశీలించుటకన్న శాఖాభిమానమధికముగా యుండుటచే వారు ఆ వేషములతో సంచారముచేయుచున్నారు. యీమధ్య యిచ్చట మోతేవారి ఆఫీసులో కొప్పరపువారు చెప్పిన ప్రహ్లాదచరిత్ర ఆశుకవిత్వమువల్ల వారి పాండిత్యపటుత్వము న్యాయబుద్ధి కలిగినవారికి తెల్లమైనది ... సభామధ్యమున కొండగుంటూరు నాగభూషణకవిగారు ప్రశ్నించగా అది తప్పించుకొనుటకు యెన్నో తప్పుదారులుత్రొక్కిరి తుదకు మాకు అంతే తెలుసునని వెల్లడిగా కవులు సూచించిరి ... కొందరు శాఖాభిమానులు... న్యాయవాదులమని వేషధరించి ... న్యాయబుద్ధివిడిచి ... అడ్డము వచ్చిరి......"

చిత్తగించవలెను

Ellore T. Ramanjulu Naidu

మఱియు చేతపూడి ప్రకాశము గారను నొక విద్యావయోవృద్ధులానాఁటి సభ కేగి వచ్చి ప్రసంగవశమునఁ జెప్పిన యక్షరము లాయూయీ యుత్తరములను

బూర్తిగా బలపడుచున్నవి. శ్రీరాజా భుజంగరావుగారును, శ్రీవాసుగోవింద రావుగారును, శాఖాభిమానులై సోదరులను సుకవులంజేయఁ బ్రయత్నించు చుండుట లనేక మాయీ సభకు సంబంధించినవి కలవు. అందు సంపూర్ణావధాన మొకపరియేని యేజన్మమునఁగూడ * జేయనివారికి 'అవధానిపంచానన' 'శతావధాని' అను బిరుదములను శ్రీవారు తమ యాహ్వానపత్రములందు లిఖించుట యొకటి, సర్వసామాన్యముగా నేర్పడిన యాశుఘోషాపరియుక్తమగు సభను శ్రీగోవిందరావుగారు పరీక్షార్థమై యేర్పడినదానిఁగాఁ బోల్పఁజూచుట వేఱొకటి, ఇది యిటులుండుఁగాక. వీరిరువురును వహించిన శాఖాభిమానమాత్రము శ్లాఘ్యము కాకపోదు. ఏమన? శాఖాభిమాన, కులాభిమాన గోత్రాభిమానాదులు ప్రతి మనుజునకు నుండఁదగు సద్గుణములు, అదియటులుండె, పరిష్కృత వైవాహిక కవిమండల సభకు సంబంధించిన యీక్రిందికంస్తులం దిలకింపుఁడు.

(1914 వ సం॥ జనవరి నెల 1 వ తేదీ, సుదర్శినిపత్రికనుండి)

## వైవాహికోదంతము

"...సుదర్శనీ పత్రికాధిపతియైన కస్తూరి శివశంకర కవి గారిని శ్రీరాజా గారు సభకు నాహ్వానము జేసినతటిని ఆయనచే శ్రీవారికి వ్రాయఁబడిన విజ్ఞాపన మీక్రింద నుదాహరించఁ బడుచున్నది....

చ. తిరుపతి వెంకటేశ కవిధీయుతులకు స్మృతి కొప్పరంపు సో
దరులకుఁ గల్గుచుండెనుకదా చిరకాలమునుండి పాండితీ
తరతమతాపరీక్ష కయి దండి వివాదము దానిఁ దీర్పఁగా
నోరు లేవ రింక నీవు వినకుండిన సర్కారు రాజచంద్రమా.

---

* శ్రీ శివాభ్యాన్నమః. ది 26-6-13

కం॥ గుంటూరుసీమఁ జదివితిఁ। గంటిన్ గోపరింపువారు గర్వోద్ధతులై
గెంటినవారితల విద్య। తుంటకులగు రెందు వారికర్మమె కాదే॥ తే॥ గీ॥ దూర
దేశంబునందున్న కారణమునఁ। బత్రికలెమాకు దిక్కయి పఱలెనందు। నవియు
సత్యేతరముగూడ నభిలిఖింపఁ। దత్త్వమిదియని తెలియఁగాఁదరమె మాకు॥
చ॥ అరయక పత్రికాధిపతులందఱు నజ్ఞులు పంపులేఖలన్। విరవిరఁ గూర్చి
వ్రాయుదురు విజ్ఞశిఖామణులైన నేలొకో। పరుపడి "దన్ని యీగానన బట్టుఁ
డు గట్టుఁడు గాట"నంచు సం। బరపడువానిపోల్కి నొగి వాస్తవమున్ గనఁ

చ. కడు రసవేత్తవీవు బహుకావ్య నిబంధనచాతురీధురీ
ణుఁడవు రమావిలాసుఁడవును న్మత యింతకు త్యాగభోగరా
యఁడవును నయ్యెఁ దిర్పతిమహాకవి యుగ్మము నేల పిల్వ? వి
ప్పుడె కద యర్హమైన తటి పొల్చెడు నిన్నిదినాల కెంతయున్.

వెండియుం బండితకవిమండలాఖండలు లగు నస్తుకపతి వెంకటేశ్వరు లను విడిచి మీరలు గాంచిన పండితకవివిభ యెట్లన్యథ యగు? మీరు కవుల య్యును భుజంగరాజులగుటచే మీకుఁ బక్షపాతము విరుద్ధమయ్యెడిని గదా! మీయట్టి చాలినవారు పూనకున్న నీకార్య మెంత కాలమిట్లు విచారణీయమై యుండవలెను........... ఇందెవరి కెవరు జెవరుమిన్నా గో తజ్ఞులకుఁ దెలియ వలయును..."

— —

పైపంక్తు లనేకసందర్భములను వ్యక్తీకరించుచున్నవి. నేము శ్రీవారి గేహమున జరుగు వివాహమున కాహ్వానింపఁబడినవారము కాము. మాకుఁగా వేఱుగ సభ నేర్పఱుపకున్నను శ్రీవా రందఱితోపాటు ను మ్మాహ్వానింపక పో లేదు. ఇంతకు మున్ను చాలదినములనుండి "విఘ్నేశ్వరుని పెండ్లికి" నాఁగి యున్న వేమవరాగ్రహారశతావధాన ప్రయుక్తసన్మానమునకుఁగా గుంటూరు వెళ్లవలసివచ్చినది. ఆ యీ సందర్భమును మా 'నక్షత్రకుని' విచారవాక్యముల వలన నింతకు మున్నే స్ఫుటముగాఁ దెలిసికొని యుండును. ఎట్లో దానిని ముగించుకొని శ్రీవారి సందర్శనమునకు రావలయు నన్న రావచ్చును గాని వచ్చినచో-

"అవధాని పంచానన' యన నేమి, 'శతావధాని' యన నేమి"

అని సోదరుల నడుగకున్నను శ్రీవారి నడుగ వలయు నని లోలోపలఁ గుతూహలము పోలేఁడు కలదు. ఈప్రశ్నము వైమనస్యమునకుఁ గారణ మగునే కాని తగిన సదుత్తరము రాఁదగినది కాదు. కావున నాప్రయత్నము సంక్షేపించు

---

జాల రక్కటా...॥ కం॥ ఐనన్ సోదరకవులొగి। మానగరమునందు నైన మా న్యతఁజాలం। గా నడువ్వదురఁట యట న। ద్దానిన్ ప్రహసిదను గోరెదను బ్రక టింపన్॥ తే॥ గీ॥ ఇం దసత్యంపు వ్రాఁత సుంతేనిలేదు। వాకియుంచుట లవమేని వగయులేదు। సత్యమును వెలిఁజేయు వాంఛన్ దవిలితి। సాక్షులున్నారు పెక్కుం డ్రు చతురమతులు॥ కం॥... ముస్త్యాల రామ ముఖ్యుండు ... చేసె వేడ్కా నప్తాహంబున్॥ క॥ అపుడు కొవరంపు పెద్దకవి... పద్యములన్... జదువఁగఁ।

కొంటిమి. ఆ యీ విషయము ప్రకృతమున కంతగా సంబంధించినదికాదు. ఈవివాదము శాఖాభిమానప్రయుక్తమైనదిగా నెంచఁదగదను నియోగిశాఖా మణు లనేకులు గలరు. ఈయంశము ధ్రువపఱుపఁదగు ననుభూతాంశములెన్నో కలవు. అందొకటిమాత్ర మిట నుదాహరింపఁబడుచున్నది.

చ. ఒకదినమందు గర్తపుర కొండొక దాపునఁ గట్టుచున్న పే
ట కడఁ గనంగనయ్యె నొకటన్ సుగుణుండు నియోగియొక్కఁడుం

---

...లేదీతనికి ననిరి తజ్జ్ఞులగు బుధుల్॥ శా॥ 'శబ్దజ్ఞానము లేదు సుంతయయినన్ సాహిత్యమున్ లేదితం। డబ్దంబుల్ ప్రభవాదులన్ జదువునట్లాత్మీయపద్యావళిన్। శబ్దం బాకసమంటఁగాఁ జదువు నిశ్శంకంబుగా వర్షహీ। నాబ్దధ్యానముఁ బోల్పవచ్చుఁ గవితావ్యాహార మిట్లొప్పసే'॥ క॥ అని తమలోఁ దమరను కొని। కని కొప్పపుటతని కనిరి 'కవివౌటకు నెం। దునుఁ జాలవీవు చదువుము। తెనుఁగున్ సంస్కృతముఁ బిదపఁ దీవ్రము కవితన్'... తే॥ గీ॥ మనుచరిత పద్యములు కొన్ని ... గొప్పపుంగవి గుత్సి ... యండఱపుడిహిహీ యని మందలింపఁ... సీ॥ ఒకరుఁ డష్టాక్షరి నొసఁగెదమన దాని యత్నంబుఁ జేయలేదని యను గవి। కావ్యపాఠంబు నొక్కఁడుగఁగా వానిఁ జదువలేదని చెప్పె సరసతముఁడు। ఒగిఁ బురాణార్థంబు నొకఁడు కోరఁగ నెప్డు చెప్పుట లేదని చెప్పె మేటి। ఒక రక్షరనిషేధ మొనరింతుమన్న నెక్కుడుభారమగునని యుడిగె ధీరుఁ। తే॥ గీ॥ డిట్లు ధారణ, పాండితి నెఱుఁగకయె వ। ధానమని పదుగురకుఁ బద్యముల జెప్పె। గొల్లజను "హిహిహీ" యని గొల్లుగోలఁ। జేసి రిదె వారి యవధాన మో సుధీంద్ర... ఉ॥ అంతటఁ గొప్పపుంగవి... వెంకనన్ దగడ... నీరసన నిప్పాడౌ... పాలుఁడాయనెన్॥ క॥ అనవద్యుఁ గవి భయ మెదఁగొని। చనియెన్... తే॥ గీ॥ ఆర్య! వీరలు మాపురమందుఁ జేసి। నట్టిపని యిదియే పొందినట్టి గౌర। వం బిదియె వేరొకటిలేదు వారలచటఁ। బ్రిమదమున నాడు నుడులు దబ్బఱలు వినుఁడు... ఉ॥ కావ్యసతత్త్వవిత్త్వమును గానని యిట్టి కవుల్ వచింతు మి। ధ్యావచనమ్ములన్ గలఁత నందక యందురుగాత మానవుల్। భావమునందుఁ బండితులఁ బల్కులు మెత్తురుగాత సత్యపుం। దోవఁ జరింత్రుగాతఁ జెఱత్రోవలఁ బోఁగక కొప్పపుంగవుల్॥

ముదిగొండ నాగవీరేశ్వరుఁడు, కశన్నుబజారు, శికిందరాబాదు.

తను మును మమ్మతండు విదితమ్ముగఁ జూచినవాఁడు గాఁడు, వి
న్కి కతనఁ బూర్తిగా నెఱిఁగి సేవలసక్తుఁ డితండు మాయెడన్.

ఉ. ఆపుహితుండు మాయెదుటి కాప్పృతిమైఁ జనుదెంచి మ్రొక్కి 'యో
స్వామి! భవద్యశంబు విని సారెకు దర్శన మాచరింప నెం
తే మది నూరుచుండు సుకృతోదయ మిద్వరఁగూడ మిమ్ముఁ దా
నీమెయి నీపురమ్మునకు నెట్టులొ తెచ్చెఁ గృపానుషంగియై.

ఉ. ఐన మతేమి మిమ్ము మనసారఁ గనుంగొని మాటలాడు పు
ణ్యానకు దూరగుండను గదా! మఱి నేను నియోగినౌట; న
య్యో! నయమింతలేక తమయోగ్యత, యస్యులశక్తి, పూర్తిగా
లోన నెఱింగియుండి చపలుల్ కలహం బిది వెట్టి రీనునన్.

క. "కఱికుక్క గంగిగోవుగ, విరచింపఁగ నెంచి" రంచు విని నెమ్మది "నీ
చంతము హుళిక్కి పుక్కిటిపురాణ, మ"నియెంచుకొందుఁ బూర్వం బెపుడున్

ఉ. ఇపు డెటువంటి పారిజాతములేని జగమ్మున నుండవచ్చు నం
చపరిమితమ్ముగాఁ గలిగె నాఁటినమ్మిక, లేనిమాట తా
నెపుడును బుట్ట దొక్కయెడ నెట్టులొ పుట్టిన నిల్వనేర దే
చపలుఁడో యట్టివాఁ డొకఁ డెసంగుటనే జనియించె వాసదుల్.

చ. అది యటు లుండనిండు మనమందలి కోరికి దీర్చుకోఁగ మీ
పదయుగదర్శనంబునకు పత్తునో, వెంటనె కక్షలోనిదు
ర్హ్రుదుఁ డెవఁడేనిఁ జూచి మఱి యేమనునో యని సంశయింతు, దు
ర్మదులకు నక్కటా! కలదె మంచియుఁ జెడ్డయు నడ్డమాకయున్.

చ. "అతఁడు నియోగిగానఁ దగఁ డాసనసత్కృతి" కంచు మీరు వ
ల్కితిరె? వృథాగ నెందులకు లేపిరి కక్ష నియోగి వైదిక ప్ర
తతికి? విద్దెయున్నయెడఁ బక్షము యుక్తము; విద్దె లేనిచో
వితగద పక్షపాత, మవివేకుల పద్ధతు లిట్టివే కదా!

చ అని తన నెమ్మదిం గలుగునట్టి యథార్థము నెల్లఁ జెప్పి తోఁ
చినగతి నొచ్చుకోఁ దొడఁగె; నీ్వయు లోనర్చెడిదానినైన స
జ్జనులు దురుద్యమంబును బరిశంస యొనర్పరు గాని వారణం
బునకు యతింపఁ గొంకుదురు మూర్ఖులకున్ జగమెల్ల జంకఁగా.

ఇట్టినిష్పక్షపాతులను గణింపక మాసోదరులు తప్పుడుస్పృష్టులు లోనగు కార్యములచేఁ దమకుఁ దోడ్పడ నుంకించు సామాన్యులను మిగుల గౌరవించుచు న్నారు ఆస్పృష్టిస్వరూపమింతకుమున్ను 1 వ పుటలో నుదాహరించినదియే, (వరెం నరసింహయ్యలేఖచూ) మఱియొకటి యిటుఁ జూపుచున్నారము.

(మక్కికిమక్కినకలు) 28-7-13

"...మీరు ప్రకటించిన గుంటూరుసీమ అను అబద్ధపు పుస్తకము పీఠికలో 41 పేజిలో మీపుస్తకమును ది 1-3-13 వ తేదిన నాకు వీ పీ గా పంపింపుమని కోరుచు నొకజాబు వ్రాసినట్లు ప్రచురించి యున్నారు అట్టిజాబును మీకు నేనెన్నడును వ్రాసియుండలేదు. ఆయుత్తరమును మీరే యాధారమున బ్రచురించితిరో వెంటనే తెల్పవలయును."

పోతరాజు వరదయ్య, సంతమాగులూరు పోష్టు.

— — —

ఈ యుత్తరముఁగూడ మొదట వ్రాసిన వరదయ్యగారే వ్రాసియుందు రని మామనస్సాక్షికి వచ్చుట లేదు, అందలిలిపికిని, ఇందలిలిపికిని, లేశమును బోలిక లేదు, అయినను నిందలి తత్త్వమును దెల్పుటకు నిజమైన వరదయ్య గారు ప్రార్థింపఁబడుచున్నారు. ఆ యీ మాయవేషములెల్ల నుందు శ్రీ సోద రులు ప్రకటింపఁబోవు 'నారాణశాస్త్రము' లోనగు నైతికీఅకారము స్తోత్ర ములయందుఁ జూడగలము, తత్ప్రతిక్రియ యగు 'నమస్కారముల' వాని తత్త్వమును దెల్పఁగలము, కావున నిటఁ జర్చింపవలసినది లేదు, సోదరు లిప్పు డొనర్చుచున్న పరిశ్రమమెల్ల * నెల్లెని ప్రకృతిచరిత్ర బోధకము లగునూగ్రంథ ములను మాయింపవలయునని తప్ప వేఱొకటిలేదఁట! ఇందులకు వీరు వారి వారిపేర వ్రాయు నుత్తరములు కడు శోచ్యస్థితిలో నుండుటయు, ఆకారణ మున వీరు వారివారిచే మందలింపఁబడుటయుఁ బ్రత్యక్షముగా మే మెఱుఁగు దుము, ప్రకృతము సోదరు లొనర్చుచున్న.—

'కష్టము కిష్టారాయునికే యెఱుక'

---

* గుంటూరు 17-2-14

...గడచిన సంవత్సరం ది 14-6-13 తేదీన వేమవరం అగ్రహారం సమీప గ్రామ కాపురస్తుడు ... అనువాగు మీపేర వ్రాసిన వుత్తరం వేమవరం శతా వధాన పీఠికలో నుదహరించియున్నారు. ఆవుత్తరమునకు వ్యతిరేకముగా

సర్వథా వారియుద్యమము ఫలించుఁగాక, ఇంతకుమున్ను తమకై యాత్మను పంచించి యవాచ్యములను బ్రచురించిన ప్రల్లదులకు వీరు చూపనెంచిన కృతజ్ఞతాస్వరూపము నీక్రింది సోదరుల యుత్తరమువలనఁ దెలిసికొనవచ్చును.

“శ్రీ పోతరాజు లక్ష్మీనరసింహ సత్కవికి, ప్రియమిత్రమా! మీకాహ్వానపత్రికలు వచ్చియేయుండునుగదా ... మీకు వినుకొండ, సాలస గ్రామములలో రెండుచోట్లను సన్మాన శూన్యమయ్యెను ... మీకు ప్రథమముగా శ్రీ విద్వత్ప్రభువర్యునిచే సన్మానము చేయింపవలెననియు, ... మీ పేరచ్చట వెల్లడిచేయవలెననియు, ... దలంచితిమి, ... కాన ... 15 వ తేదీ సాయంకాలమున కచ్చటికి తప్పక వచ్చితీరుడు మీకుఁ జెప్పవలసినసంగతులనేకములు గలవు, ... అది వివాహము, ... కావున, ... ధరించు వస్త్రములు. ఉష్ణీష చెప్పనక్కఱలేదుగదా, ... 1, 2 తావులకాగితములు, ఒక పీన్సిలు, ఉండవలయును, ... ఇట్టిసమయములో మీరు వెల్లడికి రానిచో నింకెప్పటికిని, ఏల్చూరు, ముప్పాళ్లలో సాహుకార్లు ఎప్పుడు సభచేయింతురా, అని ప్రతీక్షించుచుండవలసినదే కాని వేఱుకాదు, ... కాన రేపుసాయంకాలమునకు మిమ్ము రమ్మని కోరుచున్నాఁడ, ... అంతరంగిక మిత్రత్వకారణమున నిట్లు వ్రాసితిని, ... చి॥ మన్నికంటి (గురునాథుని) యొద్ద వివాహాహ్వాన పద్యరత్నావళియను మా పుస్తకమొకటికలదు, దానితో నత్యవసరము, కాన వానిని విచారించి ... వీండ్రచే బంపవలెను,...”

12-12-13 ఇట్లుభవన్మిత్రుడు,

కో॥ వెంకటసుబ్బరాయశర్మ.

... బాలదాసత్వమునకు (విశ్వనాథునిఁ) బుత్తెంచుము.

---

షుమారు నెల రోజులక్రిందట సోదరకవులు ... గారు కొప్పరం వెళ్ళగా వారికి విందుచేసి పద్యములచే భూషించి “ఆవుత్తరంలోని సంగతులు నాకు తెలియవు, యెవరు వ్రాసినారో” మొదలైన సంగతులతో వారి స్వదస్తూరిని నొక వుత్తరం సోదరులు వ్రాయించుకున్నారట ... మీకు వుత్తరం మొదట వ్రాసి తిరిగి యీలాగు వారికి వ్రాసియిచ్చుట చిత్రముగావున్నది, ...”

**W. V. Subbayya.**

ఇందుఁ గుండలీకరింపఁ బడిన గురునాథ విశ్వనాథులే గురువిశ్వనాథ కవులు, అనుపల్లిదులు, ఇల్లెందలనో సోదరులు కవుల నొనర్చుచున్నారు. దూరగులు మోసమున మునుఁగుచున్నను దగ్గఱవారు నొచ్చుకొని* నిజమును వెలిపుచ్చుచున్నారు. ఆ యీ 'గూడుపుఠాణి' లోని కొందఱయోగ్యతలను దెల్పు వ్యాసములనే యభినవసరస్వతి యుపేక్షించినట్లు వెనుక వ్రాసియుంటిమి. గ్రంథవిస్తర భీతిచే మేముగూడ వారివారి వాక్యములనెల్ల నిందుదాహరింప లేకపోతిమి. విషయమంతయు వ్రాయఁజాలకున్నను శైలీ ప్రదర్శనార్థమై కొన్ని యక్కరములను మాత్ర మిట నుదాహరించెదము.

(1)...సీ॥ గుడ్డిపుల్లమకడ నడ్డదిడ్డపుఁగూఁతలను గూయుటాఁయని యనెడివారు... తే॥ గీ॥ తనదు బండారమును మంగతాయియొద్దఁ, జూపఁగా వలెనో యంచుఁ జోద్యమనుచుఁ, బలువిధమ్ములఁ బలికిరి పాప మతని సరసులైనట్టిగురు సభాస్తారులెల్ల॥ తే॥ గీ॥ లౌకికజ్ఞానహీనులు లక్షణంపు, వాసననుగొంచె మెఱుఁగనివారలెల్ల, సుకవులకు శోభగూర్చెడు సుజనులగుట, వారు చిరజీవులై యుండ వలయుఁగాక.

---

*... తమను "హెచ్చరిక" అని వ్రాసినకవీశ్వరులు యేమి తెలియనివారు. వారిని గురించి క్రిందివారి విశేషంబులు వ్రాయుచున్నారము. గురుకవిగారి యొక్క బుద్ధిబలముఁ క్రిందిసంగతులవల్ల తెలియును. ఒకరు యేలూరిలో జమీన్‌దారుగారి కొమార్తె వివాహవిషయంబులో 'కొప్పరపు కవీశ్వరులకుయేమి బహుమానము యిచ్చినారు'. అని అడుగగా మెడల్సులు యిచ్చినారు ఒకొక్కటి 30 శవర్లుయుండునని చెప్పిరి. యెంత వెడల్పు, యెంత మందము, వుండునని ప్రశ్నించగా అర్ధణా వెడల్పు అర్ధణా మందము వుండునని చెప్పినారు వారి యొక్క బుద్ధిబలము దీనిలో తెలియును. విశ్వనాథము అను కవికి 10 సంవత్సరములు వచ్చినపిదప 'కృష్ణా' అన మనినయెడల 'కుతా్న' అనెడివాడు యిప్పుడు యితనికి 15 సంవత్సరములు వయస్సు యుండును. ఈ సంగతులను బట్టి వారి యొక్క సంగతి మీరే గ్రహించ కర్తలు. 'హెచ్చరిక' అని వ్రాసినపద్యములు కొప్పరపు కవీశ్వరులు వ్రాసి వీరలు పేరులు పెట్టినారు. విశ్వనాథము అనే అతను పోతరాజు లక్ష్మీనృసింహ కవిగారి సహోదరుడు........"

(చేవ్రోలు,) 10-1-14

సొలసగ్రామం, ఫిరంగిపురం పోస్టు, గుంటూరు డిస్ట్రిక్టు.

(2)...మ॥ వినవయ్యోన్ గడుహేయపద్యతతి తద్విఖ్యాత కారుణ్యచే
తను నాతండదివిన్నగాదిగను జింతగ్ జేయఁ గొచ్చెగ్ గవీ, తుని పర్యాదనుజేయ
హెచ్చుగఁ; గవీసుం డద్ది గాంచంగ తే, కనుగానంబొక యింతలేక కడుధైర్యం
బొప్పనుండెం బురన్॥ ... ఉ॥ పాపము...లకుఁ బాలగనయ్యెవు శర్మశాస్త్రి
యం, చాపలు గాకి కిట్టులనె యంటటు వంతట నైనఁగాని లా. నీపనులెల్ల మానఁ,
మని యింతనె యాతఁడు నిగ్గుకొందనే?, 'యీపని గొంగ వాని' కని యెంచెడి
వారునునైరి వీటిలో॥ ... సీ॥ ఓదార్పవచ్చిన యొకనిఁ జే 'రది నీకు మర్యాదగా'
దని మరలువారు ... "తగనిగర్వంబూనెఁ దగినలాభం బొందెఁ గను బుద్ధినిఁక"
వని చనెడివారు॥ గీ॥ పలువురును బలువిధములఁ బలికిపలికి । యేడ్చువానిని మఱి
మఱియేడిపించి । యెట్టమున్నగఁ జేసి రే నేమివాసితు, నెంతయైన స్వభావోక్తి కే
కొ అంత॥ ... సీ॥ "పప్పకూఁరలు గూసి ... దినువారెల్లఁ గవులనఁబడ" రటంచు
... తే॥ గీ॥ పురమువంచలి పెద్దలు పోలుపుమీఁద, నాడి సిద్ధికరించిరి యంతనుండి,
యింటిలోనుండి వెల్వడఁ డెంతకష్టి. మశ్శె నాతని కారాగ ! యహహ! కర్మ॥"

— — —

పాపము, సోదరు లీపాటికిని మంచితోవకు వచ్చువారేగాని, మనోగంజనీ, హితకారిణు లవ్వారి నేమో యుద్ధరించునుభ్రాంతి వెనుకకు లాగుచున్నది. అవి చేయుచున్న యధిక పరిసంగమునకు సుదర్శనీ పత్రికాధిపతికన్నఁ జక్కని హితబోధకులు దొరకరనుట నిక్కము కాని యిప్పుడిప్పుడాయనం గూడ నవి తిరస్కరించి దూషింప మొదలిడుచున్నవి. సోదరులో ! వానికన్నను మించి పరిసంగించుచున్నట్లు పూర్వాంగమునఁ బెక్కు సందర్భములు చూపఁ బడినవి. ఇందు వారి రిజిష్టరు త్తరము చదివిన వారికి వారివాచాటత పూర్తిగా గోచరించెడిని. వారి హృదయమునకుఁ గడు నికృష్టముగా నెక్కినమా 'గుంటూరిసీమ' పూర్వరంగము ప్రాజ్ఞుల కన్యథాగా దోఁచుటకుఁ గారణమేమో సుంత విచార్యము కాక పోదు. గానఁ దదోబకములు గొన్ని యుత్తరము లుదాహరింపఁ బడుచున్నవి.

## అభినందనములు

తమ సీమ పూర్తిగఁ జూచితిని. కడు రసవంతముగనున్నది. తత్రాపి 'యుక్కించి త్సంస్కారులు' అను కందమునకు సాటిమఱియొక పద్యములేదు, ..."

మ. అవురా! శితధరాధరేశ్వరగుహావ్యాప్తాతిగాంభీర్యగ
ర్వవినాశిత్వదుదారవక్త్ర విసరద్వాగ్జాహ్నవీపూరథా

శా. చట్టాలం దనియించుపూనికమెయి హెచ్చుల్ గ్రిమ్ములుం గొట్టి యే
లట్టాలుం బయిఁ బెట్టుకోక యెటొ కాలక్షేపముం జేయు నా
గుట్టుం గిట్టలతోడఁ జిమ్మునది మీ గుంటూరుసీమాహ్వయా
ఘట్టానీతవినీతవీథి నిజధారాచారచక్రంబునన్.

శా. గంటల్ గుంటకుఁ జేర్చి మున్నొకఁడు మీ గారాబు శిష్యుండు దా
నంటుం గాజు లొసంగ శాత్రవుల; కయ్యా! "యంత మాత్రంబుగా
నుంటేచా" లనుకొంటి మప్పు; డిపుడయ్యా! గాజులన్ రాల్చె మీ
గుంటూర్సీమ కృతిప్రతీతకవితా ఘోటీఖురాఘాతముల్.

శా. కల్లల్ కొల్లలుగూర్చి లోకము నెటో కన్గప్పి వాచాటపుం
జల్లుల్ గుప్పిన దొంగయుత్తరములన్ సంధించి రన్నన్న! మీ
ఫుల్లస్ఫారవచోరుచు ల్గని తమఃపుంజంబు లెల్లేనియుం
దెల్లంబాఱు నటం చెఱుంగ రెప మా దేబన్న లోసత్కవుల్.

శా. గేహేనర్దులు పత్రికాముఖల దురుక్తివ్యక్తి చాటించి నై
జాహంయత్వముతో మదంపడుట లాహా! కానఁగానయ్యె నీ
యూహాజాతపరిప్లవాయికత్థనవచఃప్రారంభసంరంభస
న్నాహంబు న్మొత్రపలంటఁ గూల్పవె భవన్నవ్యామృతవ్యాహృతుల్.

మ. గురుధిక్కారముఁ జేయునిర్వ్యగను ము న్గూటించు మీ శిష్యుఁడే
గురుగర్వాంధుల వీడుబెట్లు తగు? వీర్గూపెట్టునందాఁక నెం
దరయుం బెల్లముకొండ మింగఁగలధైర్యావాప్తుఁ డక్కొండకొ
ప్పరము న్వీడు నటన్నమాట కలదే! భావింపుఁడో సత్కవుల్.

శా. అన్నా! యెన్ని పథాలఁ బోయిరత్వదీయానూనకీర్తి ప్రకా
శౌన్నత్యంబు హరింప దస్యు, లపు డాయా——గ్లౌఁ గంపఁ గొ
ట్టి న్నిక్కంబుగ మీక చెల్లు నొరు లీటాటోటులం 'బట్టికొం'
డన్నం బట్టఁగ లేర; యందునన కాదా! వారి కాబీరముల్.

శా. జల్లిం బల్లిదు లెత్తువారలఁట! యా సత్కావ్యమెట్లుండునో!
చిల్లు ల్వెల్లనినామమే తెలిపెడుం జేఁ దిప్పినంగాద పా
టుల్లంతన్ బయికేగుదెంచు; నటు పై నస్త్రంబొ? యస్త్రంబొకో?
తెల్లంబే, చిరజీవియానటుల మీ ర్దీవింపుఁడో సత్కవుల్.

ఈ పద్యములు ...నాశరీరము చాలశోచ్యావస్థలో నుండుటచే నింతటితో నంతరింపవలసివచ్చునేమో యను శంకచే నిప్పుడు పంపుకొంటిని. నాయందు దయయుంచి వీనిని గ్రహించి నన్నాశీర్వదింపుఁడని కోరుచున్నాను.

2-9-13. రాళ్ళబండి వెంకటసుబ్బశాస్త్రి.

---

Guntur.

......నిన్నటిదినమున నామూలాగ్రముగా తమ సీమంజదివితిని. చదువునప్పుడు ప్రత్యక్షము మేన గగుర్పాటు కలిగించె. ఇది అతిశయోక్తికాదు. కొన్నికొన్ని భాగములయందు తాను యాథార్థ్యమును వెల్లడింప వ్రాసిన వ్రాతలు చదువుచో నాకు గన్నీరుగారెనో విశేషించి కొప్పరపు తప్పడుజాబు ఘట్టమున మీరు చేసిన కష్టము, మీరు వెళ్ళినపోకలు, తిక్కనను మఱపించినవి. భారతపు భక్తియంతయు మీకొక్కరికే యలవడినది. అపరతిక్కన యని మిమ్ముదలంచుచు మీహస్తమును గన్నుల నద్దికొంటిని. ఇంతకంటె నాసంతోషము వెల్లడింపలేను. ప్రతిపక్షులైనను నీగ్రంథమును శ్రద్ధగా శిరసావహించి తీరవలయునని నానమ్మకము.

B. Lakhmikantam.

...గుంటూరుసీమ చేరినది దానిని... అందుకొంటిని. దానిని చదివిననాటి నుండియు నాకు కలిగిన యానందమును మీకు వ్రాయజాలను. మీరువ్రాసిన వ్రాతకున్నూ మాగుంటూరులో అన్యాయముగా, అక్రమముగా జరిగిన అల్లరికి యేమి భేదములేదు. తమరు వ్రాసిన పుస్తకములవల్ల మాగుంటూరులో 'సత్యవాదుల' మనియూ, ...దొంగపేరులు పెట్టుకొని సంచరించుచున్న వారియొక్క డంబము అణచినది అని నేనురూఢిగా వ్రాయుచున్నాను. మీయెదుటిపక్షము వారియొక్క...కట్టివేసినది..."

11-4-13 గుంటూరు. మాటూరి బసవయ్య.

చ. తిరుపతి వేంకటేశ్వరులు తెంపరులై మనకొప్రపుం గవీ
శ్వరుల పృథాగ దూఱిరని వ్రాసెడువారికిఁ దారతమ్య పం
కరముగఁ బెక్కువారలకుఁ గాయలఁ బత్రికలందుఁ బ్రోలు ధీ
వరులకు 'రామరక్ష' యన వచ్చెను గుంటురుసీమ యెంతయుఁ.

ఉ. ఎక్కడి వేంకటేశ్వరుఁ డిఁ కెక్కడి తిర్పతి ! రామకృష్ణులే
దక్కఁగనీరు వారిఁ, దగఁదక్కఁగ నిచ్చినఁ గొప్పపుంగవుల్
నిక్క విదల్పఁగా గలరె, నిశ్చయమం చని వ్రాయుచున్న య
వ్వాక్కులు వ్యర్థముల్ సలుపువారల మిమ్ముల నెన్న శక్యమే.

సీ. "భువి మహాకవులతోఁ బోరిన ననుభవింపక తప్పునా ! యంచుఁ బల్కువారు
"తిరుపతి వేంకటేశ్వరు లనఁ దిరుపతి వేంకటేశ్వరు లం" చు వినుచువారు
ఆత్మకూరాది రాజాస్థానగత కథాభాగంబులను జ్ఞప్తిఁ బట్టువారు
ఎవరింప మునుపు వాయినిఁగట్టినట్టి పెద్దలచరిత్రలు మదిఁదలఁచువారు

తే. గీ. నిన్న గాక నె మొన్న నిందించినట్టి
రామకృష్ణులు దృష్టాంతరంబటంచు
సారెఁదలపోయఁ జేసె గుంటూరుసీమ
విబుధమండలమందు వ్యాపించువేళ.

మ. ఎలమిన్ గొప్పపుజల్లిసీమయును మీ రీవ్రాయు గుంటూరు సీ
మలఁ జేఁ బట్టి నిజంబుఁ దేల్చుకొని నమ్మన్ వచ్చు సత్యంబు ని
శ్చలచిత్తంబున నంచుఁ బూనితిమి యోసాహిత్యయుక్తుల్, నియో
గులు నన్ నైదికులన్న నొక్కటియె మాకున్ బెక్కు లింకేటికిన్.

సోదరకవులు { దూపాటి తిరుమల శేషాచార్యులు.
వేంకటరమణాచార్యులు 5-5-13.

... గిరత, గుంటూరు సీమలయొక్క భాగము లచ్చుముగిసినతోడనే నాకు బంపుట కొరకు నా పేరును రిజష్టరుజేసికొని...కృతజ్ఞతా బద్ధుని గావింపవేడుచున్నాను...నిన్నటిదినమున కొప్పరపు వెంకటసుబ్బా[illegible]విగారి గ్రామము దేరగా గుంటూరుసీమవలన వారిమస్వభావము నెరిగినవాడనగుటచే, అయ్యా! గుంటూరు సీమందిలకించితిరా? తమజల్లిసీమ యేమైనద? ని యడుగ, నేమేమో ప్రగల్భములంబలికి జల్లిసీమ నెలదినములలో వచ్చుననిరి...గుంటూరు సీమయొక్క పూర్వరంగమును తనివిదీరఁ గాంచితి. కొప్పరపువారి యసత్యపత్రికటనలును తమ సత్యనిర్ధారణలును మధురసుధాధారలొలుకు తమ కవితానైపుణ్యమును నాకే గాక సర్వాంధ్రులకమందానందము నొనరింపక మానదని ఘంటాపథముగఁ జెప్పక తప్పదు.

మాకరాజు నారాయణరాజు. గుంటూరు 17-4-13.

గవర్నమెంటు ట్రయినింగుస్కూలు

... గుంటూరుసీమ చదివితిని. అఖండమగు మీకవితయందలి కథావిషయ గమనము అత్యద్భుతముగ నున్నది. ఈకథా సంవిధానపరిపోషణ ఆంధ్రవాఙ్మయమునందు ఒకరిద్దఱు సనాతన కవులయందు తిక్కన, పినవీరభద్రుఁడు తక్కలాఁతి యెడలఁ గనుపట్టదు..."

రుక్మామాన్‌పట్ తిరువల్కేణి 2-7-13.

రాయప్రోలు సుబ్బారావు.

... గుంటూరుసీమ పూర్వరంగమను గ్రంథమును ... నందుకొంటిమి... సదరు గ్రంథము మాసంశయములను బోగొట్టి నిజమైన విషయములను దెలియఁజేసినందులకు మేమెంతయుఁ గృతజ్ఞులము. "నిజమునిలకడమీద దెలియు" నను లోకోక్తి కల్లగాదుకదా! వేయేల! సర్వవిధముల యీగ్రంథము సప్రమాణముగాను, పక్షపాతరహితముగను, చరిత్రాత్మకముగను, వ్రాయఁబడినదనుటకు సందేహము లేదు. దీనింగాంచియైనను గలహాశనులు మానముద్రను వహింతురుగాత.
Secunderabad Daccan. ఏ. యన్. రామకృష్ణులు. 30th March 1913

ఉ. చూచితినండి 'సీమ' పరిశుద్ధవచోనిచయాభిరామ వి
ద్యాచతురప్రమోదఘనధామ, యథార్థకథానకోక్తిము
ద్రాంకణకామ, గ్రామ్యకవితంత్రబహిష్కృతి దేవభూమ, యం
బాచరణాంబుజాతరసబంభర! శ్రీపతి వేంకటేశ్వరా!

శా. ప్రాచీపశ్చిమదిక్స్థితాంధ్రకుకవిప్రాణానిలాహీంద్రమై
వాచాదోషవిషాక్తరిక్తజనతావక్త్రపటాసారమై
భూచక్రప్రకృతిప్రమాణలతికానూత్నార్జ్జవసంతస్థమై
తోఁచెన్ జూండి చరిత్రయుగ్మము కవీంద్రశ్రేణిచూడామణీ!

క. గీరతమా! అత్యద్భుత, ధీరులపసఁ దేల్చె 'సీమ' తేల్చె సహోత్థ
శ్రీరాజులపస; ఆర్యులు, చారుప్రజ్ఞులు భవత్ప్రశాంతికి మెచ్చన్.

భాషాత్రయశాలి. 22-4-13 గుంటూరు అగ్రహారం

D Ramaswami Sastri

ఉ. దైవముఖమ్ముఁ జూచి సమతన్ వహియించి చరిత్రయుగ్మమున్
భావవిదుల్ సెబాసనఁగ వ్రాసితి రౌనను శైలిఁ దాము, మీ

చేవ యథార్థ గౌరవ విశిష్టము శిష్టజనైకవేద్య మో
దేవ ! భవత్ప్రతాప మతిదృప్యదరప్రతిబంధకం బహో!

గీ. సకలలోకమ్ములకు సత్యసత్త్వమిట్టి
దనుచుఁ దెల్పంగఁ దాము వ్రాసినచరిత్ర
'సీమ' నాకొందుప్రతి వీ. పి చేరఁజేయ
వెంకటకవీంద్ర మొక్కెద వేవిధముల.

మాగంటి వీరరాఘవశాస్త్రి. 24-8-13

...గుంటూరిసీమ యను వివాదాంశగ్రంథమును నామూలాగ్రముగా జదివితిని. సోదరకవులకును మీకును గలిగిన వివాదసందర్భములో మీ తప్పేమిలేనట్టు యీ గ్రంథమువల్ల యథార్థము బయల్పడినది...ఉత్తరరంగము గూడ ... బంపు గలందులకు ప్రార్థించుచున్నాను. ఖరీదు ఎంతయుననుసరే ముందు పంపుమని సెలవిచ్చిన బంపెదను.

చించినాడ వేంకటరత్నశాస్త్రి బెజవాడ 29-4-13

గీ. సిరులఁజెన్నొందు గుంటూరుసీమ ప్రథమ
రంగమును గాంచి తుష్టాంతరంగుఁడైతి
నెలయు నుత్తరరంగము వేమవరశ
తావధానము వీ. పి. గాదయను బంప,
గోరి వందములు సేతు కోర్కె మీఱ

చివుకుల పిచ్చయ్యశాస్త్రి.

స్కూల్సు సూపర్వైజరు, పొదిలె, నెల్లూరుజిల్లా, మకాం తర్లుపాడు 21-7-13

చ. కనుఁగొనలేక మీప్రతిభఁ గల్లరు లల్లిన ప్రల్లదంబులన్
గని విని యబ్బొ పండితుఁ డొకండు శతంబున కైన నున్నె ? యుం
డిన నలదిక్కటాహముల నిండి పయిన్ బయిఁ బొంగి నింగిఁ బా
కిన భవదీయకీర్తిలహరిన్ నిలుపంగ నెవార లోపెడిన్.

చ. అవదలు కూళ లేరొకో యహంయువులై తమనోటి యాసుపో
వ నుదువురిత్త పల్కులను వంచనకల్లనె? "యారకుక్కకూ
సినయెడ జంగమయ్య కిలఁ జేటగునే?" బుధులేరు విన్న నీ !
యనుచుఁ జకారగుళ్ళఁ సగరా నగరా మొగమెత్తి నిత్తురా.

ఉ. "అక్కనమాదనన్ చెలఁగునందల మెక్కఁ సరప్ప సాటికిన్
నిక్కుచుఁజెప్ప కట్టపయి నిస్త్రపతన్ వెస నిల్పమాడ్కిఁ" దా
రొక్కటరెంటఁ బామరులయొద్ద రహఃకుహనాపధానమున్
జక్కనొనర్చిరన్నఁ దమసాటికి వత్తురె? తక్కఁగైసరుల్.

చ. అనవసరంపుఁ జివ్వకు సహాయము వృత్తై విఫలోరుశాఖ దార్
పెనఁగొని మున్గడించు పెనుపేరుల నీటఁగలంచినట్టి రీ
వినయవివేకశాలు లిఁకఁబెగ్గల వీడి రహస్యలంబులన్
గొనఁగుటమాని యిష్టయిన 'గుంటురిసీమను' మెచ్చికగాదగున్.

క. సారతరహృద్య పద్యను, ధారసనిష్యంది గీరతముబలె నరయన్
మీ రచిత, సీమ, సరసంబై రాజిలె నఖిలనూరు లౌనని మెచ్చన్.

రాముడుగు సీతారామశాస్త్రి. 14-1-14

..."గుంటూరిసీమ" చేరినది ... మిక్కిలి శ్రమకోర్చి ఆయాపత్రికల యందలి విషయములను ముందెన్నడో గ్రంథము వ్రాయవలయునని సేకరించి గ్రంథము తయారుచేసినందువల్ల తమకు 'చాణక్య' లనుబిరుదు సార్థకమైన దానినిగా దలంచుచున్నాను. తామునిజములని వ్రాయించిన విషయములెల్లను నేను పత్రికలయందు చూచినవగుటచే యిందుమీరెంత మాత్రము అనృతము వ్రాసితిరని నేతలంపను.

వేమూరి సుబ్బరామశాస్త్రి. ఆళ్లమూడి 6-6-13

గీ. అంతియేకాక నారాయణశాస్త్రి యొకఁడు,
బతులు విడలి గుంటురిసీమ పటిమనెల్లఁ
జించిచెండాడి వెనుఁజూపఁ జేయునఁట ! యిఁ
కేమిపురికెక్కు గుంటూరి సీమపగ్గె.

గీ. కాన నారాయణశాస్త్రుఁడు గ్రమ్మరయాలు
మూడు సేయక మున్నె సమ్మోదమలర
నారయన్ గోరినాడఁ గుంటూరిసీమ
లోని యుత్తరరంగమ్ము లోకవినుత.

తెలికెపల్లి రామచంద్రయ్య. 25-2-14

॥ ...పూర్వరంగ మమలం దృష్ట్వాఽఖిలం మానవ
స్వాంతే మోదము పైతి సంత్యజతి శాఖాపక్ష పాతాదికం.

శ్లో॥ కాత్యాయన్యై సమస్తం ప్రకథిత మను జాత్యైక దేశ ప్రగల్భా
సూయాశాఖాభిమాన ప్రకటిత వశగా క్త దౌర్జన్య జన్యం..."

శ్లో॥ ... శాఖాం విజానాతి హి నీతి బాహ్యకః॥

శ్లో॥ రాజ్ఞాంగృహేషు ధనమాన్యగృహేషు కుర్వంత్యుద్వాహకాంశ్చ కిఁనై
ర్నసమాన్స్యరేవ తద్వత్కవిత్వరచనా సుచసంతిబహ్వ్యః పాండిత్యవైభవ
మిదంతువిచారణీయం॥ భమిడిపాటి అయ్యప్పశాస్త్రి. 4-4-1913

మండపల్లి, లింగాలపోష్టు, కృష్ణాజిల్లా.

మ. హరనాళీచరణాబ్జచింతనమరందాసక్తహృద్భృంగ! యు
త్తరరంగం బెపుడబ్బునో? యనుచు నత్యాసక్తుఁడై వేంకటే
శ్వరదైవజ్ఞుఁడు దానినే మదిసదా భావింపుచున్నాఁడు కా
న రయంబొప్పఁగఁ బంప వేఁడెదఁ గవీ న్ద్రా! ముద్రింపబైనచో ...

ములుకుట్ల కోటీశ్వరః. 9-7-13 యింకొల్లుగ్రామం

..."గుంటూరుసీమ" యనుగ్రంథములు ఆరుకాపీలు V. P. ద్వారా తగునంతతొందరలో నా అడ్రసుకుఁ బంపఁ బ్రార్థించెదను. ఉభయ భాషా కవిత్వ మహాకవులకు తాముప్రకృత చర్యనంతయు కలికాలముపై ద్రోసివేసి... వంతలో ... మాహాత్మ్యము... అధికమగుననియు, పెద్ద లనుకొనుటను కని విశదపఱచు కొంటిని

మన్యం సీతారామయ్య. 2-4-13

టీచర్. టవును హైస్కూల్ గుంటూరు.

...గుంటూరుసీమను చూచినాను అందు నిజానిజములు తప్పక తెలుచు న్నవి. యిట్టి సత్యమును దెలుపు యీ పాత్రము దేశమంతటను వ్యాపింపచేయు టకు భగవంతుని సదా ప్రార్థింపుచున్నాను.

బొడ్డుపల్లి శేషయ్య బోర్డుస్కూలు, మాష్టరు. మండపాక 27-8-13

---

స్థాలీపులాక న్యాయమునఁ జూపితిమే, కాని మావద్ద నున్న సామగ్రిలో నెన్నవపంతు గాని కైకొనలేదు, సరికదా వాటి నామములుగూడ నుదాహరింప లేదు, పాఠకకర్మము ప్రతివిషయమునకును గ్రంథవిస్తరభీతియే మమ్ము నెను చియించుచున్నది. పీఠికలో నక్కడక్కడ నుదాహరించిన ప్రతివిషయమును వేదోయుకటితక్క నిల్లే లవలేశముగాఁ గైకొనినదియే కాని యేదియును బూ

తిన్నగా కైకొనలేదు. ఈలోటు రాఁబోవు 'నమస్కార' గ్రంథపీఠిక తీర్చుఁగాక యున్న యింతతో విరమించుచు నిఁక నిందలి తప్పులంగూర్చి కొండొక చర్చించుచున్నారము. ఎచ్చటనేని యతిప్రాసములు, వ్యత్యస్తము లగుటంగూర్చి ప్రాజ్ఞులు గణింపరు. అది భ్రాంతిమూలకము, అనివార్యము, దానింగూర్చి యితరులకు గోచరించినంత గ్రంథకర్తకు గోచరింపదు. ఆవిషయము కనిపెట్టుటకుఁ బాండిత్యముతో నవసరములేదు. యతిస్వరూప, ప్రాసస్వరూపములను దెలిసికొనుటకు సరిగా 5 నిమేషములకన్న నెక్కుడు కాలము పట్టదు అట్టి స్వల్పవిషయమును గూర్చికూడ దిసంతులు గొట్టువారు నేఁడు బయలుదేఱుటచే నీకాలముయొక్క దుస్థితికిఁ జాల విచారపడవలసియున్నది. ప్రకృతము, హితకారిణీ మనోరంజనులు నూఁకుఁ దప్పులు చూపఁగలయునని యెంచి పైరీతి తప్పులనే యన్వేషించి యవాకుచవాకులను పలుకుచున్నవి. ప్రథమముద్రణమునందలి స్ఖాలిత్యముల నిటీవల సవరించితిమను మాటకూడఁ బాటింపక యీపత్రిక లూరక ప్రేలఁగ మొదలిడుట మఱియును విచారణీయము. స్వాత్మదౌర్బల్యప్రకటనమునకై తమంతఁ దామే పలువిధముల సాక్ష్యము నిచ్చుచున్న యీపత్రికలు చూపు తప్పు లెట్టివో తెలుపుటకుఁ బ్రకృతగ్రంథమునుండి కొన్ని యుదాహరించుచున్నారము.

"ప। ద్యామహేంద్రులు పశ్యశబ్దముపైని సారెకుఁ గొంటెలు

ఇందు విశ్రమము పొరఁబడినది దీనింబట్టి యజ్ఞతను సమర్థింపనెంచుచో తి॥ వెం॥ కవులకు, యతియననేమో తెలియదని కాని, అక్షరజ్ఞానము లేదనికాని, మొఱుఁగఁబెసియుండును. ఈమాట విశ్వసింపఁజేయుట కడుఁగష్టము. ఇట్టి ప్రయత్నమునకుఁ బాలుపడువారి నేమనవలయును? మఱియు,

డం। బలసి నియోగి వైదికులు సంనుచునుండుదురు.

(పూర్వరంగము 4 వ పుట 16 పంక్తిచూ)

ఇందుఁ బ్రాసము పొరఁబడినది, పైపద్యము రేఫప్రాసకము కావున, అలరు, ఒరయు, అందు, ఒందు, గా మార్చికొన్న సరిపోవచ్చును. యతివిషయమున 'పశ్యశబ్దము తప్పగాదని కొందఱు' అని సవరించుకోవలెను. ఇట్టి భ్రాంతిప్రయుక్తములగు స్వల్పలోపము లెందఱుచేతనో యెన్నిసారులో సంస్కరింపఁబడుచువచ్చినను భారతాదులయందుఁగూడ నిప్పటికిని క్వాచిత్కముగాఁ గానవచ్చుచున్నవన నస్మదాదుల లెక్కయేమి! భ్రాంతినశించినఁగాని యీలోపములు

వశింపవు. అది ప్రపంచముతో పాటుండఁదగినది, బ్రహ్మాదులుకూడ దానికి దాసులు. ఇది విషయాంతరము. ఇంకను వ్రాయవలసినవి చాలనంశములుగలవు. వ్రాసినవానివలనఁ దక్కినవి యూహించుకొందురుగాక. పూర్వరంగోత్తరరంగములలో సూత్రప్రాయముగా నాయీవివాదము సంబంధించిన యావద్గాథయు నిముడ్పఁబడినది. ఆది ఆసనచర్చయు, అంతము వేమనరావధాన ప్రయుక్తమగు సమ్మానమును నని యెఱుఁగవది, ఆసమ్మానసమయమునందలి పద్యములుమాత్ర ముదాహరించి విరమించుచున్నారము.

చ. తిరుపతివేంకటేశ్వరసుధీకరయుగ్మ మలంకృతంబు చే
సిరికద! కంకణంబులఁ బ్రసిద్ధులు నల్వురు చెన్నయామల
బ్బురమును సంతసంబు నెపఁ బొంపిరివోపఁగఁ జూచుచున్నయం
దఱినయనంబులం దపి కనంబడుచున్న వదేమి చిత్రమో.

తి॥ శా॥

ఉ. గోడకు వెల్ల వేయుటని గోడహితమ్మును గోరి కాదు మో
మోడి భవత్కుతూహలము నోమఁగ సింగపుమేల్మిబంగరుం
బోఁడిమికంకణమ్ము లివి పూనుచునుంటిమి యిందు కర్థుఁడౌ
వాఁ డెవఁడో, యెఱుంగఁగల ప్రాజ్ఞులు మృత్యులు నేఁడు మాఁడఁగన్.

వెం॥ శా॥

శ్రీమత్పరదేవతాయై నమః.

# గుంటూరిసీమ - ఉత్తర రంగము



శ్లో. ఉన్నతం పద మవాప్య యో లఘు, ర్హీలయైవ స పతే దితి ధ్రువం
శైలశేఖరగతో దృషత్కణ, శ్చారుమారుతధుతః పత త్యధః.

(రసగంగాధరము)

శ్లో. యద్యపి నదతి సరోషం, మృగపతి పురతోఽపి మత్తగోమాయుః
తదపి నకుప్యతి సింహో, విసదృశపురుషేషు కః కోపః.

(అలంకారశేఖరము)

శ్లో. సంత స్సచ్చరితోదయవ్యసనినః ప్రాదుర్భవద్యంత్రణా
స్సర్వత్రైవ జనాపవాదచకితా జీవంతి కృఛ్రం సదా
అవ్యుత్పన్నమతిః కృతేన నసతా నైవాసతా వ్యాకులః
కృత్యాకృత్యవివేకశూన్యహృదయో ధన్యో జనః ప్రాకృతః.

(కువలయానందము)

(సదుపదేశము)

చ. వలదు నియోగినై దికవిభాగము, కొంపలు ముగ్గు దాన, వ
త్తిలుఁడు యథానుపూర్విగ, విధేయులు విద్యకుఁ గండు; శాఖకున్
బల మిడ నెంచి స్కంధమును బాయఁగఁ ద్రోచు టదేటి తెల్వి ! పూ
ర్వుల హృదయం బెఱుంగుఁ డని బోధ యొనర్పఁ గదమ్మ, శాంకరీ !

చ. వలదు నియోగినై దికవిభాగము, వల్వ దసత్య గోష్ఠి, ము
గ్ధులను విదగ్ధులన్ సరిగఁ దూఁచెడి తక్కెడకై ప్రియత్నమా
వల, దపలాపముల్ గిలుక వల్వదు వల్వ దటంచు నంబ ! కే
వలదురితంబుగా నడుచు వ్రాఁతల కాళ్ళ కురికిన్ ఘటింపుమా !

చ. వలవని కోర్టులం బడినవా రెవరున్ దుడు సెగ్గ లేద, యిట్టా
కలియుగమందె గూడ సత్యమునె కాంచరు గాని యసత్యమున్నె. జే

ద్దలకుఁ బ్రవృత్తి లేదు, ఋజుధర్మము పట్టి చరింపుఁ డంచు మూ
ర్ఖుల మనికొల్పు పెద్దలకుఁ గొండొక బోధ యొనర్పు మంబరో !

గ్రంథప్రవృత్తి.

ఉ. సత్య, మసత్య మంచు మనుజన్ముల మంచికిఁ జెడ్డకున్ సదా
దౌత్యము సేయుచుండెడి పదార్థములందొకదాని కింకొకం
డత్యయమున్ ఘటించెడి యథార్థపదార్థము నిల్ప యోగ్యులున్,
వ్రాత్యులు వేఱొకండు నిలుపన్ బ్రయతించుచునుండ్రు శాంకరీ !

చ. నిలిపిన నిల్వఁజాలని దనిత్య మసత్యము, నిల్పకున్నను
న్నిలిచి యొసంగఁజాలినది నిత్యము సత్యము, సత్వరప్రభా
కలన కిదే నిమిత్త మది గావలెఁ గావున దానికై మహా
త్ములవచనంబు లూఁత గొని పుస్తక మియ్యది సేతు మంబికా !

ఉ. నోటుకుఁ గాలదోష మది నోటియెడన్ గొఱ గాదు, కాన నె
ప్పాటనొ యుక్తి సేయుడు నపర్ణత గల్గదు, తప్పత్రోవలం
దాఁటెడివారి రజ్జులు వృథా, ఋణమిచ్చి యపర్ణుఁడున్ ద్విప
త్కోటి నెదిర్చి పేర్చి కవికుంజరుఁడున్ వెలుఁగొందు నంబికా !

మ. మనవాఁ డెవ్వఁడు ? సత్యమం బలుకు సంపత్కామి, యన్యుం డెవం
డనృతం బాడెడి దేబె, యీనియతికిన్ న్యాయైకదృష్టుల్ శ్రుతుల్
దనియన్ మ్రొగ్గెద; రన్యులో, మొఱకులై "తాఁబట్టుకుందేటికిన్
జముఁ బాదత్రయమే" యటన్న నుడికిన్ దాసానుదాసాగ్రణుల్.

మ. ధనమున్ జూడరు, వేషభాషలకు బందల్ వోలె లో జంక, రె
వ్వని కేగౌరవ మంతెకాని యధికత్వం బొప్పఁగాఁ బోరు, స
జ్జనులన్ దక్కఁ దదన్యులన్ మనమునన్ జర్చింపఁగాఁబోరు, ధీ
ఘను లంచున్ జననీ ! ఋతం బడఁచు ప్రాజ్ఞశ్రేణికిన్ దెల్పుమీ !

పూర్వవిద్వన్నాగరికత.

శా. "మీవిద్దెల్ ధన మిచ్చి కొన్నయవి, మీమీ పోకలెల్లన్ ధనా
శావిద్ధంబులు, పూర్వనాగరికవిద్యాభ్యాసముల్ వేఱు, త
ద్భావస్ఫూర్తులు వేఱు, వారు మనకై దైన్యంబు గైకోరు మీ
త్రోవల్ వారికి సైప రాని" వని యుద్బోధింపుమీ శాంకరీ!

శా. పూర్వాచార్యుల విద్దె నేర్చు గుణలుబ్ధుల్ వారి మర్యాదలే
సర్వోత్కృష్టము గాఁ దలంతు రిపు డాచారమ్ము లేమున్న వీ
దుర్వారుల్ గనఁ బోరు, దూర్వ లెనయా దుర్వాసుతో నందు రో
శర్వాణీ! యిటువంటి యోగులను లక్ష్యమ్ముల సేయన్ వలెన్.

టాటోటురటనుఁడు

ఉ. కొట్టి సుపానహం బదియుఁ గొండొక కొంకు వహించు, నెవ్వనిం
దిట్టఁగ దానిఁ గుట్టు నల దీనుని నాల్కయు వెన్కఁదీయు, నా
పుట్టుగు బమ్మచారి యెటు బొంకిన నేమగు? నట్టి చీపురుం
గట్టలు గిల్కు వ్రాఁతలకు గౌరవ మెక్కుడి దమ్మ! శాంకరీ!

మ. ఘటచేటీకరనీచకాచకలనాక్రాంతంబు కర్ణద్వయం
బఁట! నానానృతపాతకాంచితవృథాహంకారపంకాంకితం
బఁట! చేతం; బటువంటివాఁ డొకఁడు పే రాసించి టాటోటులన్
రటియింపన్ గటువౌనుగా కవియు ధీరవ్రాతముల్ చూతురే.

ఉ॥ "ఆవులు దూడలుం గలుగ నార్వులు గుంజల కేల?" తా నెవం?
డీవిషయంబు నేమెఱుఁగు? నింతకుఁ దన్నెవఁ డీసడింపకే
పో విడుచున్? జరిత్రమన బొంకులు బూతులుఁగాడ నానొకో!
కావల మేడ! సత్యపుఁ బ్రకార మదేడ! వచింపు మంబికా!

ఉ. ఇట్టి వృథా ప్రజల్పకుల హీనపు వ్రాఁతలు కీర్తికామినిం
గట్టుదు నాపె "కాళ్ల కురి గ్గై" నటం చొకమూల నాఁగుచోఁ
బట్టపగంటఁ జుక్కలప్రభావము వెల్గకపోదు "తా డొగిన్
రొట్టెయుఁ గాకపో, దొకనరుం డలతానును గాకపోఁ" డిఁకన్.

ఉ. వానిది నోరు గాద, యల వానిది నాల్కయుఁ గాద, తోఁచిన
ట్లేనరుఁ డే నసత్యములనే నిగడించునో యట్టివాఁడు శ్రీ
జాని స్వనామమూనినను జండనమూనిన*రాసభంబె, దూ
రానఁ బరిత్యజింతు రల వ్రాయసకాని నడుల్ బుధాగ్రణుల్.

ఉ. ఉన్నది యున్నయట్టులుగ నోపిక మీఱ లిఖింతు మంబరో!
కన్నపుదొంగ వ్రాఁతల ప్రకారము నోటికి వచ్చినట్లుగాఁ
బన్నము, బన్న మాగిలికు వ్రాయసకాండ్రి కిరాన నుంచి వి
ద్వన్నుతమైన మార్గమునఁ బంపెడి భారము నీది యీదెసన్.

(త్రిశంకుస్వర్గము)

చ. అతనిని దూగి యుందు రెవఁ డల్ల వసిష్ఠగవీస్రవంతికై
మతిచెడి పోరి యోడి మతిమత్తముఁడై తప మాచరించి బ్ర
హ్మత యొకకొంత గాంచె నల యాతఁడె గాధిజుఁ; డాతఁ డిచ్చె స్వ
ర్గతి నొక రాజసూతికి, సురప్రభుఁ డొప్పమి కాగ్రహించుచున్.

ఉ. గడ్డము మీసముల్ పెరిఁగి గాధిజుఁ జేయవు వేని నేని యా
చెడ్డ మునీశ్వరుం డొకని శ్రీపతియన్నను జేర్పఁ బోయి తాఁ
బడ్డ పరిశ్రమంబు భగవంతుఁ డెఱుంగుఁ, గృతార్థుఁ డయ్యెనే?
అడ్డఁడె యింద్రుఁ! డాపయికథాంశ మెఱుంగనివారు లేరుగా.

(పౌండ్రకవాసుదేవీయము)

ఉ. ఉండ్రు జగమ్మునందు మును పుండినయట్టులె యుండువారు పె
క్కండ్రు, వృథాభిమానమునఁ గర్జ మెఱుంగక కొంద ఱిట్లొ చే
కొం డ్రపమానమున్ దమకుఁ గూడని బల్ బిరుదుల్ ధరించి; యీ
*పౌండ్రక వాసుదేవుల నెవండు గణించు వచింపు మంబరో!

(గౌతమీనది — సెలయేఱు)

ఉ. కొండలు వ్రీల బండ లొగిఁ గొట్టుక పోవుచుఁ జేల గౌతమీ
చండతరప్రవాహ మది శాశ్వతమై భువిఁ బర్వె నెన్నియో
కొండలనుండి వచ్చి యడఁగున్ సెలయే ళ్లట నూరుఁ బేరు లే
కుండఁగ "దివ్వటీసరస నుండెడి దీపములో" యనం బోరిన్.

ఉ. అంతన పుట్టు నంతటనె యాఱుఁ గదున్ గయ మొప్పఁ బాఱు నొ
క్కింత వెడల్పుఁ బొద్దు గల యే అదియే సెలయేఱు, దాని పై
సెంత? మహాప్రవాహముగ నెల్లపుడున్ బ్రవహించుచున్ బవి
త్రాంతరమై తనర్చెడి మహానది గౌతమిముందు, శాంకరీ!

(చ్యవనమహాముని)

ఉ. కొండలు బండలుం గలిసి గొప్పగ నెంచి స్వపక్షపాత మా
ఖండలుచేతి కత్తి కిడఁగా గరుడుం డిడెఁ బక్షపాతియై
యుండియు నీకమాత్రి; మది యున్ వ్యసనుం డిడఁ; డాత్మశక్తి యి
ట్లుండు నటంచుఁ దెల్పుటకు నో జగదంబ! తృణీకరించుచున్.

* హరివంశోత్తరభాగము-ఆశ్వాసము 6.

క. తనబలము నెదిరిబలమును, గననికతన వజ్రిమట్టి ఘనహేతియె కీ
ర్తిని గోలుపోయెఁ గొడవ, ల్గని మొన నటు లాచరింప నవి యేమగునో!

(కాళింగులు)

ఉ. అంగమునిండ భూతి నిడి, యల్పపువస్త్రము గట్టి, చెంబు చే
లం గొని శుద్ధసద్ద్విజులలాగు నటించుచు నెందుఁ బోవు కా
ళింగులపోల్కి నేఁ డకట! లేరు లనేరు లౌకికత నేరు చెం
దుం గనకే వధానిబిరుదుం దలఁదాల్తు రదేమి పాపమో!

ఉ. వేసము పొట్టకోస మెటు వేసిన వేతురుగాక. యీరసా
భాసులు నిక్కపుం ద్విజులఁ బట్టుక "మీరును విప్రులే? మిముఁ
భూసురు లంట తప్పు మముఁ బోరునఁ గెల్చినఁగాని మీకు మీ
భూసురనామ మొప్పు" దని మోర్వఁగుదు రేమిటి కంబ! శాంకరీ!

(లూత)

ఉ. అంబరమందు *సాలెపురు వాదరు వింతయు లేక ప్రేలుచుం
దం బొకయప్డు తోఁచు నది తథ్యమొ? కా, దటమున్నె యల్లియుం
చుం బహుతంతుజాల మది చూరున నంటుక యుండు, దాని దా
రంబు మొగంపుదారపుఁ బరంపరతోఁ గలుపుక డిగంబడుక.

ఉ. నేయును గాత లూత యది నేర్చిన నేఁతగఁ బొట్టకోసమా
న్యాయము; బట్టకోసము జనంబు కువిందుని గోరుఁగాని యా
మాయపుఁబుర్వు నేఁతకయి మానస మంచునె? యుంచుఁబో, యెటో
కాయమునందుఁ గప్పికొనఁగా నది వచ్చునో! మట్టి విచ్చునో!

---

*21 వ సెప్టెంబరు 1912 సం॥ కృష్ణాపత్రికనుండి

ఈఁగపులి

తే. కీటకములందు మిక్కిలి కీర్తిగంటి। నీఁగపులి యందు రఁదఁటు నెలమి నన్నుఁ। గాదె యంచును మది వృథా గర్వపడకు। సరసు లది విన్న నగుదురు సాలెపురుగ! కపటమున నేదొ యొక పన్ను గడనుబన్ని। యీఁగలను మోసపుచ్చుట నీఁగపులివి। కాని యెదుఱుగ నిలఁబడి కలనఁ గెలిచి। పేరుపొందిన దేదిరూపింప లూత!।ఎట్టులో యొకరీతి నీ కీబిరుదము। కలిగె నామాట లటులుంచు కలిగినంత। మాత్రమున నూర్ణనాభ మామదిని మిపులు, । తలనుదాఁటిన గర్వంబు

ఉ. అల్లిన దానిచే మరల నల్లును, గొ్రత్తవిధాన నల్లఁగాఁ
జెల్లదు సాలెపుర్వునకుఁ జేతయుఁ గా దది యెన్నిసారులే
నల్లిన యల్లికే మరల నల్లెడి; దానికి సంతసింతమా?
యల్లిక యెందుకేని గొఱయైనది గాదుగదా మహేశ్వరీ!

(సీరసాళుఘోషానిరసనము)

చ ఎఱిఁగియుఁ గ్రామ్యపుం గయితకేమును బొల్పడఁబోదు మేమె! కొ
ప్పర మొకవేళఁ బోరికి సభాస్థలికిన్ జనుదెంచెనేని; శాం
కరి! యది కామ కూడ దని కంకణమమ్మ! ప్రసక్తి దీరు ను
త్తరపు క్షణంబునన్ మరల దానిఁ ద్యజించెద మాజ్ఞ యిమ్మికన్.

చ. ఎలమిఁ దురుష్కునిం దగిలి యేగిన నాతికిఁ బ్రీతిఁ గొల్ప మొ
క్కలుఁడు తురుష్కతాప్తికయి కట్టెఁడిమార్గముఁ బట్టు భంగి వెం
గలులకుఁ బ్రీతిగొల్పఁ గల కాకపితం బురుడింప నెంచి క
శ్మలమగు గ్రామ్యధాటి కొడిసాచెడి తప్పును సైఁపు మమ్మరో!

ఉ. తప్పులఁ దోఁపనీకు, మెఱుఁదం గల శాస్త్రము గప్పిపుచ్చు, మే
చొప్పున నో దడాబిడిగఁ జొప్పశలాకలఁ బోలు పద్దెముల్
గుప్పఁగఁ జేయు, మెయ్యెడలఁ గొంకు ఘటింపకు, మెట్లొ నాఱులన్
జెప్పినదే మహాపదవి సేయుము, మూయుము గ్రామ్యవర్త్రిసుల్.

ఉ. కష్టముగా నెటో భవదఖండకృపామహిమమ్ము కల్మి నీ
మృష్టి కవిత్వమధ్యమున ముద్దులు మాటలు గట్టఁజాలు ని
ద్దుష్టపుఁ బద్యమున్న నది తొల్లిరచించిన దందు్రి, వారి సం
తుష్టికి నట్లు కాదనుచుఁ దోఁపఁగఁ జేయుట యెట్లు శాంకరీ!

---

గొల్పఁదగునె। నీపరాక్రమము నకును నీయశముకు। నీదుబిరుదంబునకు లోన నీవు మెచ్చ। వలయు నీజాతివార్ మెచ్చ వలయుఁగాక। యింక నెవ్వరు మెత్తురో యూఁగలపులి!, యెన్నియో గొప్పకీటము లున్నవి సుమి। వాని కేమియు గర్వంబు గానఁబడదు।, నెదక రప్పంత యల్లి కల్లుదువా లేదా। మేలు నీదు గర్వము పట్టఁజాలకుండెఁ।, జాలునింతటి నుంచైన సాలెపురుగ!।, బుద్ధి తెచ్చుకొని నయాన బుజము లెగర। వైచి కొనుటచాలించి గర్వంబు విడిచి। భద్రముగ నుండు మిదియు నీబ్రతుకు దెరువు.

పిప్పర సోదరకవులు

ఉ. గిరగిరఁ ద్రిప్పు మ్రోఁగెడిఁ బకీరుకరమ్మున నొక్కయంత్రి, మా
'కిరకిర' బాలురన్ దనుపఁ గీల్కొనుభంగిని మాన్యమైనచోఁ
బరపరలాడుచున్ గవితఁ బాడె దడాబిడిగా నటంచుఁ బా
మరులు నుతించుపూనికయు మాన్యతఁ గాంచుఁగదే మహేశ్వరీ!

మ. స్వరవర్జ్యత్వమెఱుంగకే పొరిఁబొరిన్ సంగీతముల్ వాడి యె
వ్వరు మెప్పింతురు! గాయకోత్తములు 'వహ్వా' నాఁగ; వట్లే పర
స్వరసందర్భము శ్రోత్రపేయతయు సౌశబ్ద్యంబు లే కెట్టులో
విరచింపన్ గవితల్ శ్రవోయుగళికిన్ విందుల్ ప్రసాదించునే!

చ. "పదనిస, సానిదానిపస, పస్పసరీసరి, గామగారిసా,
సదగద, నీరిసారి, దరిసా, గరిసా. నిరిసా, రిసా, రిసా,
గదగద, పాదపాద, సదగా, పదగా, నిదగా, దగా, దగా,"
యిది యొక గానమేని యెదియేనిఁ గవిత్వ మగున్ మహేశ్వరీ!

ఉ. "చేసిన దోసముల్ బయలుసేయఁగ నెంతువె! దుష్కవిత్వవి
న్యాసము పైటఁబెట్టుటకునై గమకించెదవేల" యంచు దే
వాసురయుద్ధముల్ గెలిచినట్టిఁడు పండితరాజుచేత నీ
వీసడిలంగఁజేసి మము నెందుకు దూర్చెద విందు శాంకరీ!

ఉ. ఎంచి పురాదులైన పదునెన్మిది వర్ణ్యములంగుఱించి వ
ర్ణించి కథానుగుణ్యముగ నించి రచించిరె యంచి రంచుఁ బ్ర
శ్నించినచోఁ సదుత్తరము చెప్పుటకున్ దగవైనయుక్తి దోఁ
పించి యనంతరమ్ము నడిపించుమి యీకృతి కో మహేశ్వరీ!

చ. కవివరులెల్ల మేలనఁగ గ్రంథములన్ రచియించి కప్రపుం
జవుల జగమ్ము మెచ్చెడి ప్రశంస ఘటించియు నేఁడు కొప్రపుం
గవులకతమ్మునన్ రసము గన్పడకుండెడి దిక్కుమాలు కా
కవితకు మమ్ముఁ బాలుపడఁగా నొనరించెద మాలదైవమా!

చ. గడియకు మూఁడువందలఁట! గంటకు డెబ్బదివందలంట! త
ప్పుడుకవనమ్ము చెప్పుటకుఁ బూనినవానిని బట్టఁజేసి యె
ప్పుడు సరసాళుసత్కవనమున్ బచరించు మదీయవక్త్రమున్
"బడబడ" మ్రోఁగు "తాపమరపా" నొనరించెదవమ్మ? యీశ్వరీ!

ఉ. వృత్తివిశేషముల్ చెడి వివేకము పాకముదప్పి సద్గుణా
యత్తతఁ దక్కి శయ్య యొకఁ డంతగ బొంతగ సంగ్రహించి యే
పొత్తును రోయకే పలుకు పోకడ నేరిపి మాదుకైత ను
న్మత్తతమైఁ జరించు కసుమాలగఁ జేసెదె మాలదైవమా!

చ. తొరతొర గ్రామనామములు తొంబదియో పదియో సహస్రమో
పరపర గ్రుక్కుత్రిప్పకయె వాగెడి విప్రవినోదివైఖరిన్
జరచర నోరు జార్చు టది సత్కవిధర్మము గాదటంచు నీ
వెఱిఁగియు దానికై మనము నేటికిఁ గొల్పెదవమ్మ శాంకరీ!

ఉ. అక్కట! నీరసాశువున నందముఁ జందము లేక యెట్టులో
గ్రుక్కలు మ్రింగుచున్ వెడఁగుగొల్లల సుద్దుల నెంతపాడినన్
దక్కునె 'కైత' యన్ పదవి దానికి? "గాడిద గంపెఁడూఁక దాఁ
బొక్కిన నేమి లాభమగు" బొంకక తెల్పఁగదమ్మ శాంకరీ!

ఉ. అబ్బెస మేల సేయవలె నంబరొ! తంబుర యొంటికంటి త
బ్బిబ్బు మృదంగ మిద్వయమె వేషముపట్టున లోటు గాని యా
బొబ్బిలిపాటగాంద్ర తలఁపుం గొలుపంగల పాదుకైతమున్
జిబ్బిలి గల్గి పండితులచే నతిగాంచెడి కోర్కెయున్నచోన్.

చ. కవితయుఁగాని సంతతియుఁగాని జనించిన యుత్తరక్షణం
బవిసి నశించెనేని ఫలమబ్బునె? గర్భభరమ్మొకక్క నా
యువు లవమేని లేనిసుతు లొక్క సహస్రము ఱెప్పపాటులో
శివ! శివ! పుట్ట నేమియగుఁ జెప్పఁగదమ్మ, మదంబ! శాంకరీ!

ఉ. 'అనుకరణత్వమందు రస మారయరా'దని యప్ప సెప్పె, నో
యీశకుటుంబినీ! జననమే లిఖియించిన బంతికిందనే
నాశముఁగూడ వ్రాయు టది నల్వకు సమ్మత మౌనుగాక, గ
ర్భాశయమే స్రవించుటకు నక్కట! దీనికి భేదముండునే?

ఉ. "మారుని గేరఁజాలు సుకుమారుఁడు, కన్నులు చేరెఁడేసి, బం
గారము మే" నటంచు మృతి గాంచిన బాలున కేద్భుభంగి వి
స్తారరసమ్ము గల్గుటయు సంభవ మందదుఁగాక, నిల్వఁగా
నేరని కాపురిపాటుకవి నేయపు లేటికి మాకు, శాంకరీ!

చ. పలుకుల కల్కి నేర్చిన సుభాషితముల్ జతఁజేసి కచ్ఛపిన్
బాలకఁగఁజేయ దానికి నుపశ్రుతిగా శ్రుతిపిందు నేయుచున్
గలకలలాడు కంకణవికస్వరనుస్వర మట్లొలుండు మా
పలుకు లొనర్చెదే యనుపవాడిగ బండిరపంబు లీశ్వరీ!

చ. కలుషితమైన నీర్ దురుసుగాఁ బ్రవహించుచునుండ్లె తప్పఁగ్రై
తలు దొరలున్ దడాబిడిగఁ; దజ్ఞుల కెట్లు రుచింపనౌ, శిర
ల్లలితకళావిలాసవినులమ్ములు సత్కమలంబులో, రస
జ్ఞులకు రుచించుననట్టివి యగున్ హిత మాకవిత్వ మేరికిన్.

‡ (తలపుఁ దెగని వార్తలు)

మ. కవితాతత్త్వరహస్యవేత్తృతకునై కష్టించుచుత్కృష్టు లి
ష్టవివేకుల్ కులగోత్రనిందనలు వేదాచారి పాదం బరీ
దవపహ్నుల్ సకలాన్నభోక్తలు సమస్త్రస్త్రీకుటుంబుల్ మహా
సువివేకుల్ విపరీత మీ తెలివి విజ్ఞుల్ గోయ కెట్లుందురో!

ఉ. దుర్మతముల్ కడుం బ్రబలి తొందర గొల్పెడుపట్ల ధర్మపున్
మర్మ మెఱుంగునార్యు లవి మాపినయట్లె కవిత్వతత్త్వవి
త్కర్మపు లాఁగఁగా వలెఁ గుకావ్యము; లావృశధర్మ కార్యమే
కర్మ మెఱుంగఁజాలని యకర్మపరుల్ నిరసింప నేమగున్?

---

‡ (మే 10 వ తేది 1913 వ సం॥ కృష్ణాపత్రికనుండి)

# చరణాయుధ ప్రశంస

ఒక భాషాభిమాని

ఈ పోట్లాటకు అంతంలేకుండా ఉన్నది. ఈ కవులు కోళ్ళనుగూడా మించిపోయినారు. తురుష్కయుద్ధమైనా ముగిసేటట్లున్నది కాని యీ కవుల కలహ మెప్పుడారంభమైనదో దానికి విసుగు విరామము లేకుండా ఉన్నది. అంత కంతకు కక్షలు ప్రబలుతున్నాయి. ఇరుపక్షములచుట్టు గ్రామసింహాలుచేరి గర్జనము మొదలు పెట్టినాయి. ఈ పోట్లాటల నాపించే ప్రభు వెవడు కనపడడు. వీటి విషయమై ఆంధ్రపత్రికలు జాబులు ప్రకటించకూడదని దొరతనము వారొక చట్టంచేస్తే బాగుండును కవులకే బుద్ధిలేనప్పుడు నావంటివా రేమి చేయగలరు?

ఉ. జన్నము లాఁగి పోయెనో! యశస్విల సత్రము లాఁగిపోయెనో!
అన్నము మాలమాదిగల దండలకుం బ్రియమై తనర్చెనో!
దున్నల కాలు భార్యలయి తోసము వందెనో! ప్రోక శిష్టసం
పన్నగృహస్థపుత్రికరపంకజ మంటెనో! వీరియార్యులన్.

ఉ. ఐవది కాదు, కాని దగునం, చది దేశము నుద్ధరించు నం
చేనరమాత్రులో గెలుకు నేపపు వ్రాఁతల కూఁతమై యశో
ధీనులఁ బూర్వపండితగతి స్మృతిఁ జొన్పెడి జ్ఞానులన్ మహా
ధీనిధులన్ వృథా దెగడు తెల్వులపిల్వల నెంచ నేటికిన్?

(మే 15 వ తేదీ 1913 వ సం॥ సుదర్శనీ పత్రికనుండి)

# కవులకలహములు

గతవారపు కృష్ణా పత్రికలో కవుల కలహములను గూర్చి విచిత్ర చిత్రావళిలో నొక చిత్రము ముద్రింపఁబడినది. అందు రెండుతలల కోళ్లు రెండు ముఖాముఖిగా నిలుపఁబడి యుద్ధము చేయుచున్నటులను ఇరు పక్కలను శునకములు అఱచుచున్నట్లును జిత్రింపఁ బడియున్నది. ఇది చూచుటకు మిగుల నచ్చెరువుగానే కనఁబట్టుచున్నది. గాని కొంచెము సూక్ష్మదృష్టితోఁ జూడఁగా మిక్కిలి జుగుప్సాకరముగఁ బర్యవసించుచున్నదని తెలుపుటకుఁ జింతిల్లుచున్నారము. ఈ జంటతలల కోళ్లరూపముతో నున్న కవులెవరో యెల్లరును జెప్పకయే తెలిసికొనఁగలరు... ఇంతకాలమునుండి వీరిట్లు వాదోపవాదములు చేసుకొనుచుండఁగా నింతవఱ కెవరి కేమి యనర్థము కలిగినదో చెప్పఁగలరా? వైదిక నియోగి కక్షలు పెరుగుచున్నవందురా? ఆ పాప మిందుమూలముననే పండలేదు. అది యిదివఱకే పండి బ్రద్దలయినది... ఈ తారతమ్యచర్చ ప్రతివిషయములోను గలుగుచుండును... "నిరంకుశాః కవయః" అనునట్లు వారిలో వారు చర్చచేసుకొనుచుండఁగా నడుమవారు వారిని గోళ్ళతోడను కుక్కలతోడను బోల్పఁజూచుట యనాలోచితము... కోళ్లు, కుక్కలు మొదలగు నీచోపమలచే వారిని బ్రజారంగమునఁ బడవేయుటకంటెఁ గొదమసింగములఁగానో మదగజములఁగానో ప్రదర్శించినచో సత్యమైన యర్హమయిన గౌరవమయిన ప్రదర్శనమయి యుండును... మఱియు వీరిట్లు నీచోపమలచేఁ జిత్రరూపమునఁ బ్రదర్శించుటయే కాక దాని వ్యాఖ్యానములో "ఈకవులకు బుద్ధిలేదు" ఇత్యాది పరమతృణీకారనీచ వాక్యములచేఁగూడ సంభావించిరి,

తే. గీ. జననమరణాల లీస్టు విస్తరమొసర్ప
నవతరించిన యయ్యలే యగుదురొక్కొ!
పండితులటన్న గవులన్న బ్రాజ్ఞులన్న
బత్రికలు వ్రాయువార్లె లప్పగిదిగాక.

తే. గీ. బుద్ధిలేదటే? కవులకు; బుద్ధిగల్గు
వారలెవరో! సెవ్వరో! కులాచారములకు
నున్న చుట్టఱికమెటిసంపన్ను లొక్కొ?
వీరలు నిగర్వులవ? గర్వలేరు? జనని!

ఉ. కవికలహప్రచారములు కట్టిడులన్ గదింపలేవు కో
ల్లవుదురు వారికిన్ సుకవు; లన్యులు కొందఱు తక్కలౌదు; రీ
యవినయమున్ సహింపనిగుణాఢ్యుల కీలిఖియించు ప్రాజ్ఞులే
మవుదురొ? నీ వెఱుంగని రహస్యములుం గలవే? మహేశ్వరీ!

---

(1913 వ సం॥ రం॥ జూన్ నెల 15 వ తేదీ సుదర్శినీపత్రికనుండి)

ఇప్పుడు వివాద పడుచున్న కవియుగ్మములను గూర్చి కృష్ణాపత్రికలోఁ గొల్లగను తక్కువగను పరమనీచోపమగాఁ జిత్రించఁగా వర్తమానకవులలో గౌరవనీయులయి యున్నవారి నింత నీచపరుచుట చాలజుగుప్సాకరముగ నున్నదని మేము వ్రాసినది పురస్కరించుకొని "కవులు కలహించవలెనఁట" యను వ్యాసమొకటి సువర్ణలేఖ, యొక చదువరి పేరటఁ బ్రకటించెను ... అంత కంటెను అధికులు చర్చించుకొనుచుండురేని వారి ప్రశంసయే యెత్తుకొనము. ఎందుచేత, వారి వివాదము తీర్చుటకు మనమెంత మన బ్రతుకెంత యనెడు స్వసామర్థ్య దౌర్బల్యమునుబట్టి మనతోవను మనము పోవుదుము. టర్కీ బాల్కను రాష్ట్రముల మహాప్రవివాదమును సంధిచేయ బ్రిటిషుప్రభుత్వము వంటివారికే యర్హత గలదుగాని, యలమంచిలి పొపయ్యయిటర్లు ఏమి చేయఁగలరు. ... ప్రస్తావనకవు లేతన్మాత్రులుగాని, కల మెట్లు చేతఁబట్టవలెనో తెలియని "చదువరి" ప్రభృత్యస్మాదృశు లందఱును వంక దొరకఁగదాయని యెద్దియేని యనిష్టకారణమున వారిని దోఁచినట్లెల్ల నీచపఱచుట కధికారము లేదు...చమత్కారముగా యుక్తిప్రయుక్తికముగా వాదములు చేయుచున్నారు సొంపుచెడినట్లు మధ్యస్థులకుఁ దోఁచుటలేదు ఇష్టములేనివారు వారి వాదములను బ్రకటించక

గీ. కోడిగుడ్డంత యన్నమ్ము గొసరె నొకఁడు
నిమ్మకాయంత గోరె సత్సమ్మతుండు
వేఱొకఁడు; దీనఁ గలసువివేక మజ్ఞు
లెఱుఁగ రది విజ్ఞులకుఁ గాక యెట్లు తెలియు?

మ. ఉపమాకల్పనఁ బట్టి కావ్యరసికుం డూహింపఁగా వచ్చు ని
క్కపుసౌభాగ్యము లెన్నియేని; యది యజ్ఞగ్రాహ్య మెట్లో? వృథా
కుపితుల్ తోఁచినయట్లు గిల్కుదురు సంకోచింప రల్లంత న
య్యపలాపంబు సదోషిగర్హితముగా నడ్డెంతు రజ్ఞత్వముల్.

ఉ. అజ్ఞులవ్రాఁతలే ప్రకటనార్హము లౌనఁట? త్యాజ్యముల్ మహా
విజ్ఞులవ్రాఁత లౌనఁట! వివేకులు కోళ్ళఁట, కుక్కలంట! ధ
ర్మజ్ఞత మేలుమే, లిదియు బ్రహ్మసమాజమతప్రపత్తి స
ర్వజ్ఞతయొక్కొ! యన్యమునివర్తుల కంబరో! యింత జ్ఞానమే.

---

పోవచ్చును...వీరికె నిజముగాఁ గవులు కలహించి పాడయి పోవుచున్నారని పరితాపమా, లేక వారిలో నెవ్వరియందేని యనిష్టకారణమున నేదేని వంకఁ బెట్టి యేవో వెలితి "రిమార్కు"లు చేసి పత్రికాముఖమున నయినఁ దమయనిష్టమును దీర్చుకొందమను దురుద్దేశమా?...తొలుత రామకృష్ణకవులు తమకీశ్వర వేదులన్నమాట వినగానే తిరుపతి వేంకటేశ్వరులు 'గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినందుకై' కంటగించుకొని కొంచెము ముద్ఘోషణము చేసిరి. ఇట్లే గుంటూరి శతావధానములోఁ గొప్పరపుకవి గారికిఁ దమ రంగస్థలములోఁ దమతో సముఁడన్న సిద్ధాంతముమీఁద సహాసనమీయఁగా నట్టి వలదనిరి. లోకసామాన్యమర్యాదకై మీరెట్టి యాసనమిచ్చినను మాయభ్యంతరములేదు గాని, ప్రత్యేకించి మాతో సముఁడన్న సిద్ధాంతముపై యాసనమిచ్చినమే మంగీకరించ మనిరి.

ఇందు దప్పేమియున్నది? సన్యసించి తపమాచరించుకొనువారికైనను నీవు కొలఁది వాఁడ వెందుమేని యాతఁ డూరకొఁడే! అట్టియెడ మానుషము విడనాడని లౌకికకవిమాత్రులు స్వగౌరవన్యూనతాపరాభవము నెట్లు సహింపఁగలరు.... కాఁబట్టి సర్వవిషయములను ఏవంకనో తమ యనిష్టమును దీర్చుకొందమను దురుద్దేశమే యీ పరితాపమునకుఁ గారణమని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును... ఈ హృదయకల్మషముల కొక్క ప్రబలదృష్టాంత మిచ్చుచున్నాము.

సీ. అమ్మ యెంతటిధన్యురాలో యీబిడరజస్వలయయ్యె నొగియదిప్పటికిఁ బెండ్లి
కితనియోగ్యత యెన్న నెవనిశక్యము పెండ్లియాడె నల్వదియేండ్లయాఁడుఁ బడుచు
నాపె సంస్కరణపరాయణత్వము మిన్నయౌఁ బుత్రపతి పెండ్లియాడె విధవ
అతఁ డిందఱికన్న నధికుఁ; డేమన యందమును దిద్దించె బాలుఁడైనను దగించి

తే గీ ఇట్లు ధర్మేతరములనే యెపుడు వినుతి
సల్పు పత్రికి లెక్కడ! సహజధర్మ
బద్ధ బుద్ధికిఁగాని కన్పడని సత్య
మనెడి పరమార్థ మెక్కడ! యఖిలజనని!

---

చిత్తగించుఁడు... నిన్నటి సువర్ణ లేఖలో... "ఓర్వలేక తగవులాడు కవులను జుట్టుజుట్టు ముడిపెట్టి ఇనుపగొలుసులు వేసి లాగుచున్నారిందో! శ్రీరామరామ" యనునొక సందర్భములేని యపలాపమును వ్రాయించినారు... 'కవులను' ప్రత్యేకించి నిర్దేశమేల చేయబడెను? కవులనే కాని, యోర్వలేనిగుణము గల యితరుల నెవ్వరిని శిక్షింపరా యేమి?... లెంబీటరు దొరగారు చెప్పినట్లు కామము దీర్చుకొనుటకు అకృత్య మెంత యుపయోగమో క్రోధము దీర్చుకొనుటకు నదియు నంతియ యుపయోగము. ఈ సుమపటసర్గము విధేయమే గనుక ఓర్వలేక తగవులాడు కవుల నొక్కరినే కాక యాగణములోని వారి నందఱినిగూడ నా లోకమునఁ జిత్రవధ చేయుట తప్పనిసరి యని తెలియఁజేయుచున్నాము. కలహించుఁగూడ దను వీరి సిద్ధాంతమే సర్వదా యాదరణీయమగు నేనియు, నట్టివారి నెల్ల నేకోళ్ళగనో యేనుకులగనో చిత్రించవలసియుండు నేనియు నిప్పటివఱకనేకవిషయములలోఁ గలహించుచు వచ్చిన కవులు, విమర్శకులు, పత్రికాధిపతులు, పండితులు, సంఘసంస్కారులు, పూర్వాచారపరాయణులు మున్నగు మహామహుల నందఱి నీవిషయమునఁ గోళ్ళు, కుక్కలు, పిల్లులు, పందులు, గాడిదెలుగాఁ గూడ వరుసగాఁ జిత్రించి వారికి బుద్ధిగఱపుచుండవలెననియుఁ దెలియఁ జేయుచున్నాము. ముందు విఘ్నేశ్వరపూజగాఁ దొలినాఁటి కలహాకవులయిన దండి కాళిదాసులను జెటిపొక కుక్కగను వారికిఁ దగవుదీర్చిన దేవినొక యాఁడుపందిగను జిత్రించి యటు మొదలు మొన్నటివఱకుఁ దగవులాడిన శిష్టు కృష్ణమూర్తి, పిండిప్రోలు లక్ష్మణకవి, వెంకటరత్నశర్మగారు, వీరేశలింగం పంతులుగారు, వేదము వెంకటరాయశాస్త్రిగారు, కాశీభట్ల బ్రహ్మయ్యగారు,

సీ. ఘనుని బట్టుక నీచజనుఁ [illegible]డి వ్రాసిన నది శిరమ్మునఁ దాల్చునట్టి ఘనులు
నీమనపుటిదెర నిక్కపు సమ్మగాఁ దెల్పువారి వ్రాఁతలు బట్టనైచు ఘనులు
సత్యమ్ము నెఱిఁగియు శాంపులపోల్కి నొప్పరకించు పరిపాటి సురుఁగు ఘనులు
ఏదియో యొంపోట్లాట నాఁడు నాఁ బత్రికఁ గబ్బు 'నేట' రటంచు నరయు ఘనులు

తే. గీ. పత్రికాధిపత్యంబుఁ బడసిరేని
కానిపలనము ముద్రించి పోసి జగతి
కెంత యని చెప్పఁగలము లోకైకజనని!
సత్యమదుగంటె నెగడు నసత్యమెందు

---

## సభాప్రారంభము

వ॥ అంబా! దీనికేమి, పత్రికవృత్తాంత మ్మావధరింపుము.

(సూర్యోదయము)

మ. పతితస్వర్ణదపాదభాస్వదగవీపారంపరీనున్నతై
మిరఖారుండు దివాకరుండు త్రిజగన్మిత్రుండు మందేహధి
క్కరణోద్యోగి వెలిఁగె వార్యులు "కృతఘ్నఘ్నాయ దేవాయ" యం
చెరఁగన్ దస్కరకోటి కాల్కలఁది నెందేఁ బందలై పాఱఁగన్.

చ. సరసిరుహప్రపాదములు సారెకు నుప్పరమందు నెందుఁ గొ
ప్పరపు శిరమ్ములందు నొగిఁ బ్రాఁకి ఘనాలయపంక్తి మీఁదుగా
ధరణికి డిగ్గి యెల్లెడలఁ దామయి యామెయి వారి శైత్యపున్
భర మఱఁజేయుచున్ నెగడెఁ బండితపామరరంజకమ్ములై.

(కొప్పరపువారు కాలుద్రవ్వుట)

చ. గుసగుసగ నుండె నుత్తరపుగోరణి యుత్తరుగత్తరంబలెన్
ద్వరపడి లిట్టి బందుగులవాపునఁ గూఱుట నృష్ట మయ్యె నె

---

వడ్డాది సుబ్బారాయఁడుగారు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మున్నగువారి
నందఱను వారివారి యర్హతకుఁ దగిన జంతువులతోఁ బోల్చి చిత్రించుచుండుగాక
అపూర్వోపనిషన్మతము వెలయింత్రుగాక.

క. 'పద్దెములు వ్రాసితిమి వి, ద్వద్వర గూర్పెట్టి మనము పలుచనగా వా
గ్గద షిటు గొట్టి'రని లో, గుర్దుకొనం దొడఁగి రంట? కొప్రపసాముల్.

క. 'మను రామకృష్ణులకుఁ జ, క్కని పద్దెమ్ములను వ్రాసి ఘనతనొసఁగి రి
య్యానవుప మనలం జూచిరి,'యని లోలో నగుచిరంట? యాత్రింపుఁగవుల్.

క. అనుకొంటివె మేము వీరిక, వనపద్యఘక్కి వచనమైనన్ వ్రాయం
జనద, యది గ్రామ్యమైతేం, బనుపడుపే యుక్తమనుచుఁ బవపడి జననీ.

క. కాని యల మొదట యోజన, మానసమునఁ దవులకున్కి మఱి యాధాటిన్
బూని లిఖియింప మైతిమి, దానికె యక్కవుల కెడఁడ తబ్బిబ్బయ్యెన్.

క. తగినంతగాఘగతి మే, మగుపఱచిన వీరికర్థ మగుటే ట్లటు వ్రా
యఁగ నర్థము తముఁగోరంగ, నగరాజకుమారి ! వీరి నగరా? విజ్ఞుల్.

సీ. అపి యనద్యాహమ్ము లన, "మాకునిత్యమియ్యావియె కుంర"కటన్న దెవరుజననీ?
ఒక్కరో? యిద్దరొక్కో? దేవుల నుపేలి 'కెద్దు'లంచనుకొన్న దెవరు జననీ?
"లంజం"బనిన నేదొ యవలికిఁ గని తెచ్చి యెలమి వడ్డించిన దెవరు జననీ?
సభ "నగాతో బ్రహ్మ"చదువ "సీతాత" లోనవ్రు పరిసంగము నేసి దెవరుజననీ?

గీ. వారిలో వారు గారొ కొప్రంపువారు
కాక యుంచిన గీత మొక్కటిన నృత్త
మయ్యె వీరికి? నీలాటి యభముశుభము
నెఱుఁగని యమాయకులు మీసలెత్తనేల.

క. ఇది యట్టు లుండె మాజా, బది వారికిఁ జేరె మరల నలవాగ్జాలన్
గుదురుచుకొను నీలోపలఁ, బొదలిన వేటొక విశేషమున్ విను మంబా.

(మ॥ రా॥ రా॥ ఏకా రామయ్యాపంతులుగారింట విందు)

ఉ. ఇంతకుమున్నె విందనుచు నెల్లబుధుల్ విన రామయార్యుఁ డే
నంతపమూనియో పిలిచెఁ జట్టన, నాఁడె నియోగివైదిక
స్వాంతము లెత్తుఁబొలెుఁ గొనసాగని యాసనచర్చకత్మ్ర, ధీ
మంతుఁ డితండు మున్ననినమాటకు దాఁటక వచ్చి చెచ్చెరన్.

ఉ. నేఁ డరుదెంతుమన్నసుడి నిక్కమొనర్పఁ డటంచుఁ బిల్చి మో
మోడిన తోఁపు గన్పడఁగ నొయ్యన నయ్యనఘుండు వోయెఁ "బోఁ
గూడదు కూడు" నంచు నొకకొందఱు దండడిఁ జర్చఁజేసి రా
పాడి గడింప 'కేగుటయె బా' గనె వెంకన నిర్విశంకుఁడై.

ఉ. విం దనుకూలమై జరిగె విందున లోప మొకింత లేద, యెం
దెందులకేని మంచి దని యెంచిరొ యేమొ, మఱొక్కపంక్తి మా
కుం,దమవారి కందఱకుఁ గొండొకపంక్తియుఁ గాఁగ నేరుపా
టుం దగఁ జేసి రయ్యది కడున్ సుఖ మిచ్చె ననేకభంగులన్.

ఉ. పట్టురుమాల్ బుజమ్ముపయి బాలరవిప్రభ లీనఁ బంక్తికిన్
రాట్టయి యగ్రపీఠమున రాజిలెఁ గోపరిపుసుబ్బరావు, బల్
దట్టులు మందపాటికులధన్యుఁడు లోనగువార లాతనిం
బట్టి క్రమమ్ముగా నతనిపంక్తి నెసంగి రభంగురస్థితిన్.

తే. గీ. జరిగె నారీతి విందు ప్రశస్తగరిమ
భోజనానంతరమ్మున నోజఁ గొంద
ఱేగుదెంచిరి వారు కోటీశశర్మ
శాస్త్రిముఖ్యులు పదపటిచర్య వినుము.

మ. చిఱుమామిళ్ళకులుండు యోగ్యుఁ డలలక్ష్మీపూర్వనారాయణుం
డురుకీర్తిస్థిరుండు వచ్చె నట సుద్యోగిత్వమైత్రిన్, ధురం
ధరులై తక్కినచుట్టలున్ మఱియును దక్కంగలా రొప్ప భా
స్వర మయ్యెన్ దగుపాటిగా సభ భవిష్యచ్చర్య సూచించుచున్

శా. ఏకారామయగారితమ్ము లఁట ! బీ,యే,బీ,యులై ప్లీడరి
దాఁకన్ వచ్చినమేటి యఁట ! మఱి యా ధన్యుండు తాంబూలముల్
పీఁకన్ గొన్ని ఫలమ్ములుం గొని సభన్ వీక్షించి తాఁ బంచె; నా
పోకల్ కొండొక వర్ణనీయము లనం బోలుం జుమీ శాంకరీ!

ఉ. ముందు భుజంగరాయనృపమూర్తికొ, కోపరిపుటయ్యకో, ఫలం
బందఁగఁజేసి యాపిదప నన్యులు బంధుల కిచ్చి మీఁద న
స్పందిరకీర్తి కంఘ్రిజనిభాస్వరుఁ డౌ నలమేటి కీయ నా
విం దతఁ డందకే కడు వివేకి మమున్ గరసంజ్ఞఁ జూపుడున్.

ఉ. రామయగారితమ్ముఁ డలరారెడియోగ్యతఁ బొల్చువాఁడు సు
శ్రీమహితుండు లక్ష్మినరసింహ సమాఖ్యుఁడు మా కొసంగెఁ ద
ద్ధీమహితత్వమేమి, మఱి తేఁకువయేమి మది న్నుతించుచున్
బ్రేమ ఫలమ్ము వెంకన పరిగ్రహణం బొనరించెఁ గ్రన్ననన్.

చ. తిరుపతి పుచ్ఛ్వకోక యొకతేఁకువ దాని ననాదరింపఁగాఁ
గరము మదిన్ దలంచి యటు కర్ణమునన్ గుశలత్వమూనె, సం
తరమునఁ దత్ప్రదాత యది తా గ్రహియించె నొకింత చర్చయున్
సరసముగా నెసంగె నది సభ్యు లెఱింగినదే మహేశ్వరీ!

ఉ. రామయగారికిన్ మఱియు రామయతమ్ముఁడుగారికిన్ గడున్
ధీమహితత్వమందునను దేఁకువయందును గల్గువారకున్
మామదిఁ జర్చ సల్పుచుఁ గ్రమమ్ముగ వచ్చినతోవ నింటి కే
మేమియొ చెప్పికొంచుఁ దగ నేగితి మానిసి వోయె నీగతిన్.

చ వెలవెలవోయెఁ జుక్కలు వివేకవిహీనులమోములట్లు ని
ర్మలసలిలాశయంబులు ప్రమాద మెఱుంగని వారి మానసం
బులబలెఁ దెల్వి మీఱె ఘనపుణ్యులు వైదికులు న్నియోగులున్
గలిసి యొసంగునర్ఘ్యములు గైకొనుచుండె దివాకరుం డొగిన్.

మ. అది వర్షర్తువుగాన మేఘపటలం బావంత దన్గప్పఁ గో
విదమాన్యుండు దివాకరుండు తనగోవిస్ఫూర్తిచే జ్ఞానిదు
ర్మదముంబోలె నపాకరించి సుటవత్ప్రఖ్యాతి యువ్వీశకున్
గదియన్ వెల్గఁదొడంగెఁ గావితతుల్ గ్రాసార్థ మట్ఱాడఁగన్.

క. తరువాతఁ దనదు సొమ్మగు, "గురుతరలీల" యనుపదముఁగొని పద్యంబున్
బురపుర లిఖించి మీనసు, స్మరియించుచుఁ గొప్పరంపుచతురుఁడు వెలుచన్.

ఉ. * పత్రిక సంపి యప్పుడును బద్యము వ్రాయక యుత్తరించు మా
పత్రికఁ జూచి "పేర్మనకుఁ బద్దెము వ్రాయమిఁ జూడ, 'నేటి కీ
యాత్రము మీరు మాకుఁ గవులే యని తోఁచును మీరు తిట్టినన్
శతృత మాకుఁ బుట్టు'దను చందముగా" మదిలోఁ దలంచుచున్.

---

* మహారాజశ్రీ తిరుపతివేంకటకవులకు......చ॥ గురుతరలీలఁ జెప్పె సభ గూర్పఁగ నుంటిమి గాని, భానువా। సరమున దక్క రాలెవరు...ఆశుకవిత్వశతావధానముల్ । విరచన సేయ రావలయు, నెంటనె, మేమవి యాచరించి ధీ। వరసభ మీప్రతిజ్ఞ దెలుపం గలమీసము దీయఁజేతుము..."

గుంటూరు, 22-8-11.

ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బారాయశర్మ, శతావధాని.

క. పదపడి*వచనమె వ్రాయుచుఁ, దుదిదనుకం బత్రికలకుఁ దొడఁగెన్ 'సుకవుల్
పదుగురుగల సభ'యన న, ప్పెదలో రాయివడి వ్రాఁత లెల్లన్ సురిఁగెన్

క. ♦తతిమితతిమి మునుమాకు, త్తరములు లిఖియించు నతని తత్తఱమూపై
విఱిగి సురిఁగి కరిగెనో? యు, త్తరమే వచ్చుటకు మిగులఁ దడవై పోయెన్.

---

గుంటూరు, 23—8—11.

* మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి. అయ్యా... మీసభ యుద్యమున కర్థ మేకారణమునకో మీకుఁ దెలియలేదనుకొనియెదను... తెలియదేని పెద్దలనడుగుఁడు... (4) ఈప్రతిజ్ఞ ప్రస్తుతవిషయము కాకపోయినను మీయంతట మీరు పురస్కరించుకొని వివాదకం దిగుటచే నయ్యది యింతటినుండి మీయెడలఁగూడ నిర్వహింపుట కంగీకరింపక తప్పినదికాదు... (9) మీరు మాకుఁ దెలిసిన యంశములలో నేకదేశప్రవిష్టులు మాత్రమే యయినను మీకోరికంబట్టి మీసభకు రా నుద్యోగింతుమే యనుకొనుఁడు రేపిఁక నొకరాంధ్రభాషైకదేశమగు గ్రామ్యభాషయందుఁగాని నిష్కృతిగణప్రాపసౌశబ్ద్యరసాభాసకవిమార్గములంగాని యన్యత్రఁగాని సమ్మతింపుఁడని కాలుద్రవ్వినచో మాగ్రహాచారమందుకు నొడఁబడవలసినదేనా! అందులకుఁ బ్రాజ్ఞులు సమ్మతింపవలసినదేనా! మాకుఁగల శక్తులలో నేకైకదేశమున నంతో యింతో కొంతో యెఱిఁగినవారెల్ల మమ్మెదిరింపఁ దగువారేనా! శాంతం పాపం... (12) ఈ వ్రాఁతవలనఁ దెలుఁగునేని మీరు వచోతిఁగుని యనుకొనకుఁడు..."

— —

గుంటూరు. 27-8-11.

♦మ॥ రా॥ రా॥ కొప్పరపు వెంకటసుబ్బరాయ శర్మగారికి, అయ్యా, (1) జరూరు " అని 25 వ తేదిని మేము వ్రాసిన యుత్తరమునకు 27 వ తేదీ 11 గంటలకు మీ రిచ్చిన జవాబు అందెను...౧. సభ ముందు మీరే చేయవలెను ముందుత్తరము వ్రాసి యసభానాయకవిద్వాంసులకై కాలుద్రవ్వినవారు మీరుకాని మేము కాము...౨ మా విషయమై మీరును "మీ విషయమై మేమును నవధానపు టేర్పాటులు చేసికోవలసినదే కాని యాయ్యవి సభ్యు లేర్పఱుపఁదగినవి కావు. ఉభయులచే నేర్పఱిచికొనఁబడిన సభ్యులు న్యాయాన్యాయములును రసారసములును దారతమ్యములును విచారింపఁదగినవారు మాత్రమే. ౩. ఈ విషయముల కంగీకరించుచు మీరు సభ సమకూర్పుఁడు, లేదా మేము సమకూర్చె

క. లలి “బాజాసందడి మం, గళ సూత్రము మఱచినట్టు”గా సభకై మున్
గిలికిన రవివాసర మా, పలికెన్ జని వచ్చె సోమవాసర మంతన్.

చ. సభయగునన్న యాదినము సందడిగా జను లేగుదేర రా
సభమయి పోయె నెక్స్యోడల సందుల గొందుల పంటపూటయిం
డ్ల భరముగా జనుల్ విడిసి “డాబులు డాబిరి యేలనేయరో
సభ” యని కొప్రిపుంగవుల సారెకుఁ గేరఁ దొడంగి రంబికా!

సీ. పుట్టదిట్టము లేదుపో? నిల్చి పెట్లు కొప్పరమందుచుఁ బలుమాఱు పలుకువారు
తన్నుఁ గట్టలబల్మి తనయున్నతిని నిల్పు నెంతదస్కనటంచు నెంచువారు
తన్నూనుబండలే తన్ను వంచనసేయు నవసరంబైనప్డ డనెడువారు
నేల విడిచి సాము లేలొకో? యొకచోట నంతలోనే యుండక నెడివారు

తే. గీ. వింధ్యగర్వం బగస్త్యునవంధ్యమహిమ
ముగ్గడించి యిసీ! యని యొఱలువారు
హంసకాకచరిత్ర మిడ్డందఱకును
స్మృతికిఁ దగిలె నటంచు వచించువారు.

---

దము...ా. జరూరని వ్రాసినను వెనుకటివలెనే ఆలస్యముచేయక రేపు సూర్యోదయమునకుఁ దప్పక జవాబు పంపవలెను.

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

—

ఉదయం 8 గంటలకు 28-8-11, గుంటూరు.

అయ్యా! ఈ దినమున సభ తప్పక జరుగునను మీ ప్రకటనను బురస్కరించుకొని యనేకు లనేక గ్రామములనుండి వచ్చి నిరీక్షించుచున్నారు. వారిని వృథాకుల నొనరించుట యుచితముకాదు కావున నవధాన సభావిషయ మేమయినదియుఁ బ్రకటించి వారి సందియము దీర్పుఁడు. మా యుత్తరమునకుఁ బ్రత్యుత్తరము రాకుండగనే మేము ప్రకటించుట యుక్తము కాదుగదా?

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

మ. ఒకటే శైలిగ నొక్కటే వడిగ నోహో! యంచుఁ గన్యాగ్రణీ
పరికరం బెంచఁగ సంచయేగె, నటు "రార"మ్మన్న కాకంబు ము
న్నొకతీ, రాపయి నొక్కతీరు, పయి నెన్నో తీరులై డస్సి, నా
టోకయానమ్ములు చూపి కాదె శరణం బొందెన్ మరాళప్రభున్.

క. అని పూర్వగాథ లెన్నుచు, మనమునఁ దమఁబడిన శ్రమకు మతిమతి పసువుం
గనుచుఁ దిరిగిపోనెంచుచుఁ, బునఃపునర్వ్యాజనలను బుద్ధి చేనుపుచున్.

ఆ. వె. కొండవీటిసామిదండ నుండెడిలేడి
కొంత యోనికూఁతు గుఱ్ఱమునకుఁ
దలుచు భయముచెంది దంపంబు లీడునో య
ద్దానితోడఁ జెనఁగు తలఁపు గొనునో!

తే. గీ. సింహాగమనంబు నేర్వంగఁ జిన్నిలేడి
కెన్నిజన్మము లెత్తిన యేని గలదె!
పాల్యపాలకభావసంబంధ ముదుటఁ
దలఁచు టది యెంతయేని యూఁ దప్పిదంబు.

క. తనపాదములు మనమ్మున, ననయము మనన మ్మొనర్చు నల్పునప్పటికిన్ దాఁ
గనికరము కరము గని దా, నిని మురువ్వఁగఁ జూడకున్న నేరము హరివో.

క. హరికిన్ హరిణమునకు సం, గర మది హాస్యాస్పదంబు గాదనువా రుం
డరు దానికేమి హరిణము, కరి నెదురు టె యందమెట్లు ఘటియించునటుల్.

ఉ. రంకువు శీఘ్రగామియని రాజులు పట్టపుటేన్గు వీడి గా
జ్యాంకము గాఁగఁ గైకొనిరె యక్కట! యేనుఁగుతోడఁ బోర నా
జింకకు శక్తియున్నదె? ప్రసిద్ధికినై "యెదిరింపు" మంచు నే
కొంకును లేనివారు పురికొల్పినమాత్రన యేమిలాభమో!

చ. అరుల కభేద్యమైన చతురంగబలమ్ములు గల్గు రేనితో
గొఱియలగొల్ల రేఁ డెదురుకోలు ఘటింపఁగ నెంచి "మీరలున్
గొఱియలతోనె రం"డనుచుఁ గోరిన "సీ" యని రోసి, దానికే
"సరి"యని సిద్ధపడ్డ వడజాబుపరాబుల దాబు లేటికో.

ఉ. ఇచ్చి వరమ్ము గైకొనరె యెల్లసురాఱులకు న్నిలింపు; లా
సచ్చరితుల్ మహామహు లసన్మదహారులతోఁ బట్టి వా

రిచ్చినమెచ్చు లాగికొను టేమి యపూర్వము! మెచ్చినంత నే
హెచ్చును దగ్గునున్ పలవదే? తలదాఁటినపోక లొప్పునే.

శా. దేవబ్రాహ్మణవృత్తులన్ విడిచి వర్తింప న్నియోగించి భూ
దేవుల్ వీడుదు రాలపోతు నది భూదేవాజ్ఞనుం దక్కి దు
ర్భావం బౌతటి నూరకుండరుగదా, పైవచ్చుచో నెవ్వరిం
గాపంజూతురె? కావలం బడఁపరే? కాల్ద్రివ్వఁగా నిత్తురే.

ఉ. చెక్కిలినొక్కుచున్ జనులు చేఁపఁగ ముద్దిడుకొంచుఁ బేర్మిమై
నక్కునఁ జేర్చుకొన్న సమయమ్మున బాలుఁడు పాలు గ్రోలుచున్
ముక్కు 'కటుక్కునన్' గొఱుక ముద్దదియెల్లను మూలఁబట్టి "నా
యక్క! ఇదేమి గోరిచెడుగా" యనదోసమె? దాన రోసమే.

చ. వితతతరప్రబంధముల విశ్వజనీనములన్ రచించి కీ
ర్తి జగమెల్ల ముంచుచుఁ జరించెడి తిక్కతిసంకలేశ్వరుల్
మతిచెడి కొప్పిప్రంగవుల మాయకవిత్వముతోడఁ బోరికిన్
గుతుకము పూనినారని జనుల్ విని నవ్వుదు రేమొగమ్మునన్.

ఉ. అల్లిక లేమి సాలెపురుగుల్లదె? 'హు' ప్పని యూఁదునంతలోఁ
బొల్లగునల్లికల్ సగ బుద్బుదముల్ గద! దీని కేసుదృ
క్కల్లజచిత్తమేలియు యథార్థముగా ముదమందునే? యెటో
యల్లిన దేల కాదనఁగ నం 'చదిమే' లను టొక్క మెచ్చొకో.

ఉ. మంగళివాని యుద్ధము క్రమమ్మున మున్నురచించినట్టివే
ముంగలి కీడ్చి పాత్రమును బొల్పుగ నప్పఁగఁ జెప్పశిష్యపో
ల్కిం గడు ధాటిగాఁ జదివి కేవల మెక్కడొ యొక్క టొక్క టో
జం గయితంబు చెప్పుట యశస్కరమే, సుకవీంద్ర సత్యమే?

ఉ. విప్రవినోదిసంచి నెటు వేఱొక వస్తువులుండు నట్లు తే
కొప్రపువారు సంచి నిడుకొందురు వర్ణన లన్ని చేసి, యా
శు ప్రకృతిన్ రచించిరని శుద్ధులమాయికు లంద్రు మర్మమున్
సుప్రథితుల్ గ్రహింతు రిది చూచిరి పట్టి రనేకు లెల్లడన్.

ఉ. గుట్టిది బైటఁబెట్టుటకుఁ గొందఱెఱిఁగియు సంశయింతు రీ
చెట్ట నడంపకున్న నెటు చేటు దొలంగు? మహాకవిత్వవి

ద్దట్ట సుధాసధామకవితానవతామరసాననావచః
పట్టణవైభవప్రథిత బంధురసౌధవిలాసలక్ష్మికిన్.

ఉ. జీవనమూడె మాకని వచింతురుగా కొకకొంద ఱట్టివా
రేవగనైన జీవనము నీవయిఁ జేతురుగాక, కైత యే
కావలెనే? మఱొక్కగతి గానఁగరాదె? యమాయికాత్ములన్
జీవికకై జగం బపహసించునటుల్ గికురింపఁ జెల్లునే.

చ. ఇటులొక కొంతమంది కడు నెల్లిదపుంగతి దోఁపనాడ న
ప్పటుమతు లాడుపల్కు లలపక్షమువారు సహింప "కేల యీ
కటువులు? కొప్పపుంగవు లంగసులు వారల శక్తి మాడుఁ, దు
త్కట మది, గోరతం బనెడికావ్యమునం దగుపట్టు" నావుడున్.

ఉ. అప్పరమేశ్వరీ దయకు నాకరులన్ గదలించి దానిచే
గొప్పను గోరి కర్తమునఁ గూలి యొకొ పయి రాఁగడంగి యీ
కప్పలరావముల్ కొఱయఁ గాఁ పని లోనఁ దపించి పొక్కి నీ
కొప్పరపుంగవీశులకు గోరతమే హితమెన్ని ?ంగులన్.

చ. అనుటయు వారిపక్షపు జనావళి వారలమోదు పూర్తిగా
మనమునఁ బట్టియుంట మఱుమాట వచింపక యూరకుండ వ
చ్చిన జనసంఘమందలి ప్రసిద్ధులు కొందఱు కొప్పరంపువా
రిని గని కొన్ని మాటలను రేఁగగనేగెడ మంచు ?ంచుచున్.

క. చనుచుండ వారిపక్షమ్మునవా రొకకొంద ఱాఁగి మెఱిగి నేమేమో
యన మొదలిడ 'మీరెవ్వరు? చనుఁడా, మేముఁసుగ నటుపఁ ?'నుచున్.

శా. కాలిం దప్పితి రూకుండెదరె? సంస్కారుల్ ?గ మ్మంను ?
వేలున్నా రటవారిఁ గోరికొనుఁ డావిద్వాంసు లేతెంచి మా
మీలోపమ్ముల నేర్పరించెదరు సామ్మెర్ మ్మెరి కెవ్వారికిన్
వీలో తెల్పెద రీనుడిన్ వినఁగ నువ్వి ళ్లూరెడిన్ లోకముల్.

క. తిరుపతి యెట్టిదియో? కొ, ప్పర మెట్టిదియో కవిత్వఘం మెట్టిదొ? సం
స్కారణం బెట్టిదియో? ధ, స్కారణం బెట్టిదియొ? తెల్పఁ గలరవ్వారల్.

చ. పరు వెటువంటిదో? చెఱుచు బాసయు నెట్టిదొ? దేశమేని సం
స్కారణము పూజ్య మయ్యు సరిగంగలనాడుట యెట్టిదో? సమ

స్ఫురణకు నాసనమ్ము నెడఁ బోరెడిధీరత లెట్టివొక్కొ? వి
స్తరము లొసంగు నెట్టిదియొ? సత్కవితావనితావినోదముల్.

ఉ. కోరిక యెట్టిదో? యచటఁ గొంకు పయింకమి యెట్టిదో? పరి
ష్కారము లెట్టివొక్కొ? మమకారము లెట్టివొ? యంతఁ బోక ధి
క్కారము లెట్టివో? పయివికారము లెట్టివొ? బారుబూరలం
కారము లెట్టివొక్కొ? యధికారమ దెట్టిదొ? కారమెట్టిదో.

ఉ. సారము లెట్టివో? పయి నసారము లెట్టివొ? కాలుద్రవ్వు ఝుం
కారము లెట్టివో? పయిఁ జకారము లెట్టివొ? యంతలో దధి
క్కారము లెట్టివో? మఱి నికారము లెట్టివొ? పిమ్మటం దిర
స్కారము లెట్టివో? పొరిఁ జొకారము లెట్టివొ? కాలు లెట్టివో?

ఉ. శీరము లెట్టివో? తిరుగు బేరము లెట్టివొ? పిమ్మటన్నమ
స్కారము లెట్టివో? పయి ప్రకారము లెట్టివొ? యాపయిన్ వష
ట్కారము లెట్టివో? పయి నకారము లెట్టివొ? మీదు మీదు నా
కారము లెట్టివొక్కొ? నుడికారము లెట్టివొ? వైరమెట్టిదో?

ఉ. హారము లెట్టివొక్కొ? వ్యవహారము లెట్టివియొక్కొ? యీచమ
త్కారము లెట్టివొక్కొ? బయికారము లెట్టివియొక్కొ? పై బహి
ష్కారము లెట్టివొక్కొ? యుపకారము లెట్టివియొక్కొ? యాయహం
కారము లెట్టివొక్కొ? యపకారము లెట్టివొ? నేర మెట్టిదో?

ఉ. పారము లెట్టివొక్కొ? పయివారలశూరత లెట్టివొక్కొ? స్వీ
కారము లెట్టివొక్కొ? గుణకారము లెట్టివొ? చుట్టునున్న ప్రా
కారము లెట్టివో? పయి లకారము లెట్టివొ? చాటు చాటు స
త్కారము లెట్టివో? తెలుపఁగాఁ గలవారలు పండితుల్ గదా.

చ. కవి యన నెట్టిఁడో? కవిత గా దగునట్టిది యెట్టిదో? వృథా
రచనము లెట్టివో? కవుల రూపము లెట్టివొ? సత్కవీశ్వరో
త్సవచరితమ్ము లెట్టివొ? బుధత్వ మదెట్టిదొ? యేరి కేరికిన్
శివ! శివ! సామ్య మెట్టిదియొ? చెప్పఁగలారు బుధోత్తముల్ గదా.

చ. ఎవరును నేరు నొక్కరొకఁ డెల్లరు మెచ్చఁగఁ గూరుచున్న వా
ప్పవునోకో! యేరికిం దగదొ? యక్కట! శక్తులు పట్టి చూచి "వి

ర్కు, లలవారలో, కవులు గాఁ దగువార" లటంచుఁ దెల్పఁగా
నెవరితరంబు? పండితకవీంద్రులు దక్క జగత్త్రయమ్మునన్.

ఉ. రా మనిరొక్క! పండితులు, రమ్మని కోరనెలేదొ? సద్యశః
కాములు మీరు వారిపయిఁ గాలటు ద్రివ్వి యుపేక్షసేయఁగా
నేమి! వృథాగ లోకమున కింత పరిశ్రమ మేల పెట్టినా?
రీమెయి నూరకుంట తగునే! యని కంకెద మంచుఁ బోవుచో.

ఉ. ఏమిది! యీ జనంబునకు నింతటి పక్షము వారియందుఁ ద
న్నామము వీరి కింతగ మనమ్మున కెక్కఁగ నేల! కొప్రవు
న్నామము కోపపాత్రముగ నాటగ నేల! స్వదేశవాసు లన్
ప్రేమముగూడఁ గన్పడ దరిప్రకరమ్మును మించి రీ ప్రజల్.

చ. అని మనమందు నెంచుకొని యప్పలి పక్షపువారు "మీరు వ
చ్చిన పని చూచిపోవుటకుఁ, జెప్పెడిమాటలు పెద్దమాట, లే
క్షను లయి మీకుఁ గట్టములు గప్పెద? రింతటి కంఠశోషకుం
బని గనుపట్ట" దంచు నుడువన్; "బని లేనిదె వచ్చినారమే.

మ. కవితావాద మటన్నఁ జూచుటకునై కష్టించి యీసత్సభా
సువిశేషంబుల నాలకించుటకు నచ్చోనుండి యిచ్చోటికిన్
జవసత్త్వమ్ములు వెచ్చఁబెట్టుకొని రాఁ జన్నే! వృథాహంకృతి
స్థపితుల్ నించిన పత్రికల్ గని యథార్థం బంచు నూహించుచున్.

మ. అదిగా కూరక వ్యాఘ్రసింగదుపులా గంతంత మిట్టెక్కి నె
మ్మదికి న్నెమ్మది దక్కి మీసములపై మాత్సర్యమున్ గ్రిక్కి సా
గవ యంచున్ దల గుర్రిక్కి పాలుకవులన్ గన్గోఁ జనన్ రాదె! యే
మిది! మీపూనిక యెందు డిందె!" నని పేర్మిన్ బల్కఁగాఁ గూడదే.

చ. అడిగెద మేము మీ; మ్మరుడుగుఁ దట్టులై మమ్మును మీ, రటన్న వె
స్పడమి యదెట్టిదో! కపటపద్ధతు లుద్ధతు లెట్టివొక్క! యీ
గడబిడ లేమి యయ్యెనొకో? కా లటు ద్రిప్పు టేదెడ కేగెనో!
మడమలు ద్రొక్కి మీసమును మట్టునడావదు లేడ డాఁగెనో.

ఉ. "మీసము" లంచు మీసములమీఁదికిఁ బోవుటె కాక వారియ
స్థానసమందుఁ జేరుటకు నాసన మూఁచుటె కాక యెన్నియో

దోసపు బాసలన్ గిలికి తుందుడు కందువె కాక పై రసా
భాసము చేసి పాఱు టిది భావ్యమె కొప్పరపుంగవీశ్వరుల్.

చ. సమరము చూచి ఖేచరులు సంబర మందుట యొందు విందు మ
య్యమరులువోలె సభ్యులు జయాపజయార్థులు గాక వారు ప్ర
శ్నము లిడ నెవ్వ “రగ్గుఁడు పసన్ గనుఁ డగ్గెద” యంచు వారు స
క్రమముగ వ్రాయ నందులకుఁ గాక పరాఙ్ముఖులైతి రేటికో.

ఉ. గ్రుద్దె నఁ టాంజనేయుఁ డొక గుద్దును రావణుఁ బట్టి మూర్ఛమై
నద్దివిజారి జాతి తెలి యంది “బళీ” యని మెచ్చెనంట! యా
యుద్దికి నంజనాసుతుఁడు సుంతయు సంతస మంద ‘కోర! నా
గ్రుద్దురుచిన్ పచించు టొనఁగూడెనుగా!’ యని వంచె సత్క్రియన్.

ఉ. “మీసము” లన్న “జు” ట్టనుచు మిన్నున వారన వచ్చుఁగాదె! యే
వాసియు లేనివారియెడఁ బంతము ప్రాజ్ఞుల కేల? మీ రసా
భాసపువ్రాఁతయే తెలుపుఁ బండితదూఱు లటంచు; సర్వథా
దోసము మీది, మీ రిక నొదుంగక చేసెడి దేమి కైసరుల్.

చ. “గురుతరలీల” పద్య మది కో! యని యార్చుచు నొండె మీరె పై
బరు విడుకొన్న వారలు సభం బొనరించుట కంచు, నేల యీ
పిఱికితనంబు సెప్పఁ డని బిట్టడుగన్ పల్కె” నంచుఁ బోయి రొ
ప్పరపు కవుల్ కనంబడక వచ్చిరి వాగ్మయుఁ జూడ నంబరో!

చ. అప్పు డొకచోట విందునకునై చనియుంటిమి మేము మా నివా
సపదము చూచి ‘వీరలును జాతిరొకో!’ యని యాడుకొంచు ‘న
ట్టిపనియు నుండునే!’ యనుచు, డీకొని కొట్లాడిసేనపోల్కి న
య్యపరిమితప్రజానిచయ మయ్యెడఁ గి చసుడించె నంతటన్.

శా. అందున్ గొందఱు బ్రాహ్మణుల్ మఱియు వైశ్యశ్రేష్ఠులుం గమ్మవా
రెందుం గన్పడి రిండఱున్ గవితకై యేతెంచుటం జేసి యం
దం దించించుక గోష్ఠి గల్గు టను మేయం బయ్యె నోయంబ! మే
మెంను మ్మగ్ననియుండ మింటఱును దాదృగ్భక్తిసంపన్నులన్.

ఉ. నాలవజాతియందలి జనంబులు తూర్పున నుండ్రు గాని యీ
నాలవజాతి వేఱు పయి నాగరికత్వముమాట కేమి వి

ద్యాలయములన్నఁ బ్రాణముల నర్పణ చేసెడిపాటిభక్తులుం
జాలఁ గలారు కమ్మకులజన్ములలో శతముల్ సహస్రమున్

ఉ. వారలు నన్యులుం గడు నవారిగ వీధికి రెండుప్రక్కలన్
బారులు గట్టి నిల్చి యిటు వచ్చుట, కొప్పరపువారిఁ జూడఁగాఁ
గోరికతోడ నేగి తమకున్ మఱి వారగుపట్టుమిన్ వృథా
గ్గై రహిఁ నిండ్లకున్ మరలు టాదిగ నొండొరు లాడుకొం చొగిన్.

శా. అయ్యా! తిర్పతివెంకటేశ్వరులు! మే మత్యాశమై వేడ్క వీ
కయ్యంపున్ సభఁ జూడ వచ్చితి మిటన్, గా ల్ద్రివ్వినా రెవ్వరా
యయ్యల్ మోసము జాటు వెట్టి రిఁక మా యాయాసముల్ వ్యర్థమే
యయ్యెన్, వచ్చినత్రోవనఁ బోవుదుమొ? లేదా, యుందుమో? తెల్పుఁడీ!

చ. ఎఱుఁగుము మేము 'కొప్పర' మదెట్టిదొ? వారిని జూడ రాము, మి
మ్మెఱుఁగము మీదుపాత్రముల నింపెసలారు "ఫొటోలు" దక్క నేఁ
డరసితి మన్య ధన్యము భవాదిక; యూరక నా మ్మటందురో?
దరిసెన మిచ్చి నందులకుఁ దగ్గఫలం బొసఁగం దలంతుగో?

చ. అనుము ననేకభంగుల జనావళి మాపయిఁ గల్గు ప్రేమమున్
గనుపడఁజేయఁగన్, బలుకఁగా నపుడేము పసింపు సౌఖ్య మొ
య్యన డిగి నాటకాలయమునం దొక పేటిసభన్ బొనర్చి నే
ర్చినగతి వారికిన్ గలుగఁ జేసితి మగ్గలమైన మోదమున్.

సీ. 'తిరుపతివేంకటేశ్వరులఁ జూచితి' మంచుఁ బలుమాఱు సంతసంపడెడివారు
ఉత్సాహముగా లేచి యొక్కపంపున నేలఁ బడి నమస్కారమ్ము లిడెడివారు
కొప్పరంపువార లీగొడవఁ దెచ్చుట మేలె యయ్యెఁబో! యని పేర్మి నాడువారు
కయ్యంపుసభఁ జూడఁగలభాగ్య మిఁక లేదు పంపుపోతీరటంచు వీడువారు

గీ. పాటు కేమి యొనర్తురు వారికున్న
సరకు నెఱుఁగమె యని చర్చసలుపువారు
వినచోఁ గాలు ద్రవ్వ నేల నెడివారు
అడుగు మవ్వారి నట లేగు మనెడువారు.

ఉ. అన్నిట వీరిదృష్టిని శతాంశము వారలు గారు దద్దడన్
దున్నకవిత్వమందు పలఁతుల్ మనవారలె యౌదు, రంచు; నే

మున్నది దానిలో ననుచు, నుండిన దేదియు యున్న దంచు, నా
తెన్నొకకష్టమే యను, సుదీర్ఘతరమ్ముగ వాదులాడుచున్.

ఉ. ఏమియు రానివార లెటు లేది యొనర్చిన మంచి దౌ, సుధీ
గ్రామణు లట్లొనర్చునెడ గ్రాంథికు లొప్పరు సాఁగఁ దీరు రిం
తే, మనవారు వోలె నలతిర్పతివేంకటపండితుల్ వచ
స్తోమము జార్చ లేరె యది దోసముగాఁ దలపోయ కుండుచో.

ఉ. జార్తురుగాక నో రెటులొ చయ్యన, నొయ్యన నట్లె పద్దెముల్
గూర్తురుగాక వీరు "చెవి గోసిన మేఁకల" పోల్కిఁ జాలసే
పార్తురె! డయ్యారే! యుభయు లంత బలాఢ్యులె? దేహదార్ఢ్యమం
దేర్తురు కొప్పరంపుఁ గవు లీకవియుగ్మము నొక్క వ్రేల్మిడిన్.

చ. అనునెడ దేహదార్ఢ్యమునకా యలవారలు గాలు ద్రివ్వి? రి
ప్పనియెడ నేను జాలనొకొ! పాండితియన్న భయమ్ము గాని వీ
రిని మఱి వారినిం గలిపిరేనియు నాబుజ మొక్కటే సుఁడీ
పనిఁగొని యాఁపు నం చొకఁడు బాహుబలాఢ్యుఁడు పల్కు నల్కమై.

క. అని వారి వారికిన్ దోఁ, చినగతిగాఁ "బిచ్చపాటి" చెప్పికొనుచు భో
జనపుం బసలకుఁ జని మఱు, దినమున నటనుండి బయలు దేఱిరి వారల్.

చ. సెలవును వ్రాసి స్కూలునకుఁ జెచ్చెర వెంకటశాస్త్రి మున్నె, యీ
కలహము దేలునంతకును గాల్గదలింప నటంచుఁ బంతముం
గలిగి వసించె నప్పురిని, గయ్యపుసంగతు లాలకించి శి
ష్యులు మఱికొంద ఱయ్యెడకుఁ జూడఁగ వచ్చి తనున్ భజింపఁగన్.

చ. సరసులు యోగ్యులౌ జనులు సంతతమున్ గవితాదరమ్ముమై
నెరఁగుచు విందులన్ దనిపి యెంతయు గౌరవ మాచరింపన
ప్పురి మది వాసమై యచటిపూజ్యులకున్ దలలోని నాల్కయై
తిరుపతి యప్పు డప్పు డరుదేరఁగ, వెంకన యుండె నయ్యెడన్.

శా. "ఆసీమాంత మొనర్చి గాని విడువం డావెంకటేశుం" డటం
చాసీమన్ జనులెల్లఁ జెప్పికొన నిత్యమ్మున్ గవిశ్రేణి కెం
తే సంతోసము గూర్చుచున్ విమతు లంధీభూతచేతస్కులై
యీసున్ జెంది కృశింప మూఁడునెల లందే యుండె నుద్దండతన్.

ఆ. వె. మొదటఁ గాలు వెట్టినది యల్ల * శిష్టా హ
నూమదార్యగేహసీమ, యచటి
నింబభూరుహంపునీడ సాక్షాత్కల్ప
పాదపంబునీడ గాఁ దనర్చె

ఉ. చాపలు నిండి బల్లలకుఁ జాలి రజఃకణకీలితంబు భూ
మీపద మాక్రమించి పయిమిక్కిలి వీధికిఁదాఁకి గేహపుం
దాపున నున్న యన్యసదనంబుల ప్రక్కల నిల్చి సారెకున్
శ్రీపతి వేంకటేశ్వరులు చేయుప్రసంగము విందు రెల్లరున్.

శా. అంబా ! నింబము నీనివాస మదియో? యభ్రంకషానూనశా
ఖం బచ్చో నెపుడీవు పొల్చుటది నిక్కంబే, భవత్సాక్షికం
బుం బూజ్యాశయసాక్షికంబు నగుచుం బొల్పారుగత్తత్స్వభా
లంబంబా కవితాప్రసార మది యేలా నొక్క వాక్రుచ్చుటల్.

మ. ఎటు నీభక్తులవాఙ్మధుద్రవము లందేపారె, శత్రుప్రజం
బటకున్ వచ్చి మనంబునందు నెటు "ఛీ" లౌవారి, లాకోపప్రపుం
గటువాక్యమ్ముల కెట్లు వారురక దుఃఖం బందువా, రెట్లుగా
గుటకల్ మ్రింగెడివారొ? నీమది యెటులుంగున్, జెప్పఁగా నేటికిన్.

ఉ. ఐనను శాఖ బాధ కయి యాపలికిం జని తప్పుచొప్పులన్
బూని యవాచ్యముల్ గిలికి పుచ్చియు నెమ్మన మాఁగ లేక మా
పై నెనరున్నయట్టులుగ వచ్చి రసం బది గ్రోలి పోవు వా
రేని యథార్థముం దెలియు నెల్లరు నీవును డాఁగురంతురే?

చ. ఎలమి వచించి తీరవలె నీకపటాత్మలసత్స్వభావ; మీ
యలఘుల కేమి శత్రువులమై మఱి మాపచనంబు లెట్లు వీ

---

(గుంటూరినుండి బయలుదేఱు సమయమునఁ జెప్పినది.)

*సీ. తిరుపతి వెంకటేశ్వరుని కొండకు నీకు భేదమే కనుపట్టలేదు తల్లి, శ్రీశై
లమల్లేశు శిఖరమ్మునకు నీకు భేదమే..., మధురమీనాక్షి వేశ్మస్థలికిని నీకు
భేదమే..., కాశికావిశ్వేశు గర్భగుడికి నీకు భేదమే... తల్లి, తే॥ గీ॥ ఎట్టి సుము
హూర్తమందుఁ దాఁగట్టెనొకొ, ఘనుఁడు శిష్టాహనూమదాఖ్యాక సుకవి,
అడుగు వెట్టిన దాది బ్రహ్మసభఁ జేసి, పంపుచుంటివి నిను వీడవలసె నేఁడు. (వెం॥ రా)

నులకు రసాయనంబు లగునో? యవి జీర్ణము లైనవెంట లే
ఖల కపవాదముల్ గిలుకఁగాఁ గరముల్ దిరుగాడు పెట్టులో!

క. ఖలజనులవర్తనములకుఁ, బలయని తోఁక యని చెప్పఁదగమే? యలపా
పులకేమి నింబకుజభూ, తలసభ లవి యెంతకేని దగు జగదంబా!

చ. అను లగువారి కిట్టు లెదయందలికుంపటివోలె నుండి యా
తిరుపతి వెంకటేశ్వరులు "తీర్పరులన్ బిలిపింపుఁడీ, సభన్
జరుపుఁడి మీసముల్ పెఱుకఁ జాలినచోఁ బెఱుకుం డ" టంచుఁ దీ
పరముగఁ జెప్పఁ గొప్పరపువారిబడాయి క్రమక్రమమమ్మెగన్.

ఉ. తగ్గి యిదెట్టులేనియును దప్పికొనన్వలె నంచు నంతటన్
బగ్గలు వ్రాయమాని తమపక్షము దుర్బలమౌట నెట్టులు
న్నగ్గదపించు లోనె నెఱిఁగి * నెయ్యమకుం గడు గూఢవృత్తినై
నగ్గతి డాఁచి స్నేహ మగు టర్హ మటంచు లిఖించుచు న్వెసన్.

చ. పయికిఁ బ్రగల్భవాక్యములె పల్కుచు నప్పురమందె తీరకన్
గయికొని కూరుచుండిరి ప్రకంపితమైన మనంబు చందమె

---

చెన్నపుర్; లైబ్రరీ, గురువారం

*...నిన్న కొప్పరపుంగవులు నాపేర 8 పేజీల ఉత్తరం వ్రాసినారు, వివాదప రత్రిమును వ్రాసినారు. తమదోషము లేశమును లేదనియు వెం॥ శా॥ అన్యాయముగా గర్హించిరనియు, మొదలుగా వ్రాసినారు. దాని వైఖరిచూడఁగా వివాదము నుండి తప్పించుకొనుట కిష్టపడుచున్నారని దోఁచుచున్నది. అట్టి ప్రయత్నము న్నహో తప్పక మీరును అంగీకరింప వేఁడెదను. ఈ వివాదసభలు కార్యకారులు కావు. నడుమ వారికి పండువు, పోరాడువారికిర్వురకు శ్రేయము కన్పడదు. ఈ సభలలో తీర్పుతీర్చువారెవరు? ఎట్లుసాగును? "లోకోభిన్నరుచిః" తత్రాఒపి స్వస్వపక్షాభిమానోబలవాన్ బాధతే. వారు 'ఛాలెంజి' పరిహరించినందుకు, శివరామశాస్త్రి వరల పరిహరించెను. ఇంతట నాఁగిన బాగుండునని నేను తలంతును నాప్రార్థన మిదియే. ... ఏవిధమునైనను తగవుమాపుకొనుట బాగు. నేను వారికేమని సమాధానము వ్రాయుటకును పాలుపోకయున్నాను, జవాబు వెంటనే వ్రాయించవలెను...."

వే॥ ప్రభాకరుఁడు.

---

ల్ల యెడల నెల్లరుం దెలిసి "లావతి" రంము వచించుచుండు న
పిౖయములు పూర్తిగా వినియు బీరము మానర వారు మాటలన్.

ఉ. అంతట వానిపక్షమున కావరు వౌ కులవృద్ధుఁ "డక్కటా!
యింతన తేలిపోవు నని యింపు మటంటిమి వరి మల్లవా
రింతటిపట్టు పట్టిరో కో? యిప్పుడు వీడక కొప్పరంపువా
రెం తలవారి ధాటి? కిపు డేమనుకొన్న మ తేమి లాభమౌ.

మ. పులిపై జడ్డను వేసి చెట్టుపయికిం బోవన్ వెసన్ దక్కఁగ
స్థలమందే యది పీట పట్టి యెటులో సాధించుఁ గాదే పగన్
దొలి నాలోచన చాల దయ్యె నపుడే వారియు మన్నార మి
స్థలింబోకది "యేకు వే" కనెడిసామ్యం బయ్యె నెట్లో కదే!

ఉ. పాపము! "వారిదాసులయు వారలలోన శతాంశమేనిఁ గా
మోపము వారి" కంచు నతియోగ్యుఁడు కొప్పరపుజ్యేష్ఠుఁ డప్పు తా
నోపిన యంతవట్టు మొగ మోడక చెప్పె; గర్వాభిమానవుం
దాపము నాఁడు మామిదికిఁ దప్పవచనమ్ముల నెక్కునీ పహా!

ఉ. ఎంతటి ధైర్యముల్ మఱియు నెంతటి కీర్తియు లేక యున్న ని
శ్చింతగ నాఁటి సద్సభ "ననేమిర వారల కాననంబు మా
కెంత ఘటింపఁ గాదు" వని చెప్పఁగ నేర్చెనె? నేఁడు సీమయు
న్నంతన భీతి పట్టదల గా? కలదా? యిటువంటిచేష్టలున్.

చ. ప్రముఖుల నెంతమంది పని పట్టితి మక్కట! వారినుండు మా
అమయిలి నింపు కెంతటిపరాభవ? మూరక కొప్పరంపువా
రి మొరప మిక్కుతమ్ము నఁ బోరిం బోరిఁ దగ్గఁగఁ జూచెనే యుపా
యమునన్ కీర్తిపైఁ బడునపాయముఁ బాయఁగఁ జేయఁగా వలెన్.

మ. * అని యోజించుచు నుండె నంత నొక నాఁ డాయూర్ప్రసంగంబు నె
ల్లను విన్పింప సభం బొనర్చి తగు హేలన్ విన్కి సేయంగ వ
చ్చినవా రెల్లరుఁ బత్రికల్ వినుచు మంచిన్ జెడ్డ యోజించుచుం
డునెడన్ గొందఱు వచ్చి రయ్యెడను నెట్లో యానవ స్వాఁగఁగన్.

---

* నిష్పక్షపాత హృదయులును యథార్థపరిజ్ఞానశీలురును గుంటూరు పురవాస్తవ్యులు నగు నార్య సోదరులారా! కొప్పరపువారు ప్రతిజ్ఞా పూర్వకముగా

ఉ. వచ్చిరిగాని యాసభ యవార్యముగా జరిగెన్, సమస్తముల్
విచ్చిననంటిపండుబలె విజ్ఞులదృష్టికి స్పష్టమయ్యె "ని
ప్పచ్చర మెందుకీగతి గబాగబ లాడిరొకో ?" యటంచు వె
న్నిచ్చినవారి దూఱి "ఠిహిహీ, యిహిహీ !" యని కొంద ఱయ్యెడన్.

ఉ. పనిగొని యుత్తరాల్ వినుచుపట్టిన నాసభ నాఁగుపూన్కి వ
చ్చిన యలశ్రీనివాసగుణిశేఖరువైఖరి "కొప్పరంపున

---

27 వ తేదీ ఆదివారమునాఁడు సభకు రావలయునని ముందుగా మాపైఁ గాలుదువ్వి పత్రికవ్రాసి, యందులోని యసందర్భములను దెల్పుచు మేముత్తరమీయఁగా వానికిఁ దగు సమాధానము వ్రాయక యేవో కొన్ని యుక్తులతోఁ గొన్ని యుత్తరములు వ్రాయుచు సభ ఆదివారము దప్పించి సోమవారమునకు మార్చిరి. తుద కాదివారమునాఁటి రాత్రి యనేక గ్రామములనుండి విచ్చేసిన మహాజనుల విఫలమనోరథులంజేయుట యుచితము కాదని మేమాదివారమునాఁడు వ్రాసిన యుత్తరములోఁ గొన్ని పండితసమ్మతములైన నిబంధనము లుదాహరించి "యీ ప్రకారము మీరు సభకూర్పుఁడు లేదా మేము గూర్చెదము అంగీకారానంగీకారములు రేపుదయమునకు దెల్పుఁడు లేదా మీరీయుద్యమము మానుకొన్నట్లే ప్రజలు దలంతురుగాక" అని స్పష్టీకరించినను దానికిజవాబు వ్రాయక సభానిర్ణయదినమునందుఁగూడ నుదయము 8 గం॥కు మరల 'రిమైండరు' పంపినను దానికిని నేమియుఁబలుకక చల్లఁగా నాదినమెల్ల దాఁటించి ఆమఱునాఁడు 29 వ తేదీని మాకవసరము లేకున్నను మేము మరల "మీయుద్యమము మానుకొన్నట్లే యని తలఁచి మేము కాకినాడ వెళ్ళుచున్నా" మని వ్రాసిన యుత్తరమునకును దగిన సమాధానమునేమియు వ్రాయకుండుటచే వారు సభను మానుకొన్నట్లు మఱుమాటికిని స్పష్టపడినది. పిదప సభమాటట్లుంచి మీ మా యుత్తరప్రత్యుత్తరములలోని సారాసారములును న్యాయాన్యాయములును ప్రాజ్ఞులమూలముగా దీర్చికొని పిమ్మట విద్యావాదమునఁ బ్రవర్తింతమనియు, ఇందుకు రేపుదయము 8 గం॥కు లోఁగా జవాబిండనియు 29 వ తేదీ రాత్రి 7 గంటలకు మా వ్రాసిన యుత్తరమునకు నేఁడు 10 గంటలకు ననవసరపు యుక్తులతో దానికిఁగూడ నంగీకారమును దెల్పక "యుత్తరప్రత్యుత్తరములు ముగించుకొన్నాము" అని వ్రాసిన యుత్తరమునుగూడఁ జూచి వారికి జవాబు వ్రాయుట యుచితతో

త్తవములయుత్తరమ్ము లవి ప్రాజ్ఞసభానుకూలదుర్వచః
ఖను లని యెల్లవారలకుఁ గ్రన్ననఁ జెప్పక చెప్పె నొప్పఁగన్.

ఉ. ఏమిటి కాఁగఁగా వలెనో? యెల్ల రెఱింగిన యుత్తరమ్ములన్
శ్రీమహితుల్ మహామహులు చేరిన సత్సభ విన్కి సేయుచో
నామహితుండు ప్రాజ్ఞుఁ డగునట్టిఁడు గావున వారితప్పదుం
బూమెలు కంపు గొట్టువని బుద్ధి గలంగినవాఁడు గానిచో.

---

ముగించుకొని ఆయాయంశములు లోకులకు శ్రుతపఱుపఁ దలఁచి ఈనాఁటి సాయంకాలము 6 ఘంటలకు శ్రీ ఫస్టుకంపెనీ నాటకశాలలో నుపన్యసించు చున్నారము గాన దామెల్ల విచ్చేయఁ బ్రార్థితులు.

గుంటూరు,
20-8-11.

ఇట్లు,
తిరుపతివేంకటేశ్వరులు, శతావధానులు.

పై నుదాహరించిన యాహ్వానపత్రిక ననుసరించి శ్రీ ఫస్టుకంపెనీ హాలులోనికి ననేకులు పౌరులును నితరులును నగు మహాజనులు నియమితకాలమునకు మున్నే వచ్చియుండిరి. పదపడి కాలేజి ఉపాధ్యాయులగు బ్ర॥ శ్రీ॥ మల్లాది వెంకటసోమయాజులవారి కోరిక ననుసరించి శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులు బి. ఏ. ఎల్. టి. (వీరును కాలేజీ యుపాధ్యాయులే) గా రగ్రాసనాధిపత్యమును వహించిరి. వీరు సంస్కృతాంధ్రములలో గ్రంథముల రచించిన పండితకవిసత్తములు. పిదప నాయాయీ యుత్తరములు తిరుపతివెంకటేశ్వరులు వినిపింపఁదొడంగిరి. మొదట వెంకటశాస్త్రిగారు శ్రీకొప్పరపువారి మొదటియుత్తరమును మాత్రము వినిపించి ఆనాఁడే 12 గంటలు మొదలు మూఁడు గంటలవఱకును గోర్టులోఁ గంసాలులనుగూర్చిన వ్యాజ్యములో సాక్ష్యమిచ్చియుండుటవలని యాయాసముచేఁగా బోలును పదపడి యుత్తరములను దిరుపతిశాస్త్రిగారిని వినిపింపుమనిరి. తిరుపతిశాస్త్రిగారు వినిపించుచుండఁగాఁ గొందఱు పెద్దమనుష్యులువచ్చి యంతతో ప్రకృతసభ ముగించుటకై వెంకటశాస్త్రిగారిని గోరిరి గాని తగినంత హేతువునుజూపి కోరనందున వెంకటశాస్త్రిగారందుల కంగీకరింపరైరి. పిదప గంభీరముగాఁ దిరుపతిశాస్త్రులుగా రాయాయీయుత్తరప్రత్యుత్తరముల నుపన్యసించుచుండఁగా వేంకటశాస్త్రులుగారు దాని నాఁప నుంకించువారితో సహేతుకముగా మెల్లఁగా నుపన్యసించుచుండిరి. పదపడి సభ

క. ఉత్తరముల తత్తఱములు, సత్తములకు సేవ్యమైన చందము గలవం
చుత్తముఁడు శ్రీనివాసుఁడె విత్తములకు సాక్షి యని వివేకు లెఱుఁగుదుర్.

క. *కుచమర్దనాదిపదముల, రచనం బచరించు కొప్పరపువారి వచో
నిచయము గల పత్రికలకు, నచటం గల సభ్యు లేవమందిరి వెలుచన్.

---

నాఁపుడని కోరినవారు తామేదో మధ్య చెప్పుటకు నవకాశమిండని కోరిరి. అందులకును దుట్టతుదకుఁగాని వీలులేదనియు నప్పుడేని యగ్రాసనాధిపతుల నడుగఁదగియుండుననియు వెం॥ శా॥ గారు బదులు చెప్పిరి. పదపడి యుత్తరములనెల్ల దిరుపతిశాస్త్రిగారు వినిపించినపిదప నెవరు సమర్థులో, యెవరు కారో యెవరియుత్తరములు దురుసుగానున్నవో యెవరివట్టివికావో, యెవరు కోరిన షరతులు పండితసమ్మతములో యెవరివికావో, యెవరి వెనుక తీఁతవలన సభ కాలేదో లోనగు నంశములు సభ్యులకేకాక సభ నాఁపవచ్చిన యుత్తమపురుషుల హృదయములకుఁగూడ స్పష్టపడినవి. ఆ యీయంశములనే శ్రీ అగ్రాసనాధిపతి గారు తుట్టతుద నుపన్యసించుచు "మీ సమూల పద్యము యొక్క యర్థమునుగూర్చి" తాముగూడ నిదివఱకుఁ బొరపాటుగానే యన్వయించుకొంటిమనియు నిప్పుడది స్పష్టముగాఁ దెలిసినదనియు నుభయభాషలు రానివారు దానిజోలికిఁ బోఁగూడదనియు సంస్కృతమురాని తెలుఁగు గణనీయము కాదనియు నుపన్యసించుచుండఁగా సభ నాఁగుపూనికతో విచ్చేసినవారు పరిష్కృతమా విషయము నాఁగవలసినదని కోరిరి. దానిమీఁద నగ్రాసనాధిపతిగారు "మీ కోరిక ననుసరించి యీ పద్యార్థము నిప్పుడు విస్తరింపక వదలితి" మని చెప్పి యావిషయము మాని తమ కీయుభయకవుల యందును భగవంతుఁడు న్యాయముగాఁ దోఁపించిన యభిప్రాయమును వెల్లడించిరి. అదివిని సభ్యులెల్ల నానందించిరి. పిదప శ్రీ వెంకటశాస్త్రులవారు కవిత యన నేమో, కవియన నెవరో, ఆశుకవిత యన నేమో, కవికి వలసిన సామగ్రి యేమో తేటతెల్లముగా నుపన్యసించిరి. పదపడి సభ నాఁగు పూనికతో విచ్చేసియున్నవారిలో నొక్కరగు మ॥ రా॥ రా॥ గోవిందరాజుల శ్రీనివాసరావు పంతులు బి. యే. బి. యల్. గారు సర్వసమ్మతమగు తమ మనోరథమును వెల్లడించిరి. వారి పూనికకు వెంకటశాస్త్రిగారు తమ సమ్మతిని దెల్పిరి.

*(8) ఇంతసైన మీ స్వకుచమర్దనలు మానుకొని"...

30-8-11 ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బారాయ శర్మ-శతావధాని.

క. ఆమెయె సాక్షాదర్శ్వ, త్థామన్ బురణించు తేజ దశదిశలలమం
గా మా శిష్యుం డల శివ, రామయ చమదెంచె సభ కరం బలరారన్.

ఉ. ♦వచ్చి సభాంతమందుఁ దన వచ్చిన హేతువు, తాను విన్నయా
యచ్చెరువున్, సభాధిపతి యాజ్ఞను బొంది సభాసదుల్ "బలే!
వచ్చిన శిష్యుఁ డీతఁడె" యనన్ విన నింపగు కంఠమాధురిన్
హెచ్చగు గానపుంబటిమ యేర్పడఁగాఁ జదివెన్ గ్రమమ్ముగన్.

క. పదపడి సభ్యులు సారెకు, నెద శివరామకవి వాణి కెంతయుఁ మెచ్చుల్
పొదలఁగఁ గరతాళంపు ని, నదములఁ జెలరేఁగఁ గ్రన్ననన్ సభముగిసెన్.

క. ఆమఱునాఁ డుదయమున శివ, రామయ కొప్పరపుఁ గవిని "రారమ్మ సభా
సీమ" కని యుత్తరంబు, ద్దామత లిఖియింతు" ననుచుఁ దద్దయు నెమ్మిన్.

ఉ. వెంకటశాస్త్రి పల్కు "నిది విన్న బుధుల్ మము నవ్వినట్లు ని
శ్శంకగ నిన్ను నవ్వుదురు శాస్త్రము నేర్చియు సాహితి న్నిరా
తంకతఁ బేర్చియున్ శతవధానివియై యసమాన కక్ష్యగా
జంకెలు వైచెదే? "సభకు రం" డని కొప్పరపువారిఁ బిల్చుచున్.

---

ఉదయము-9-గంటలు.

♦పదపడి యంతకొక యరగంటకుమున్నె రైలుదిగి సభాభవనమునకువచ్చి యున్నట్టియు తిరుపతి వెంకటేశ్వరుల శిష్యుఁ డైనట్టియు, చిరివాడ గ్రామ కాపురస్థులు శ్రీ వేలూరి శివరామశాస్త్రులవారికి క్రింది పద్యములఁ జదివిరి.

ఆ. వె. రాజశ్రీ భుజంగరావు, చెల్లపిరావుఁ గూర్చి యిటులువ్రాసె గుంటూరిపురి, జరుగుచున్న నైరచర్యయందునఁ దిర్పతికవి, వెంకటకవి తెరువు తప్పె॥1॥ చ॥ అనవిని యంత నామడలు నామపలుం బడిపోయినట్లు వ, చ్చిన పది మిథ్యయంచుఁ దెలిసెన్ గవితాసభ లేకపోయెఁగా, కనుపుగ ధారణాబలమునందున నాశుకవిత్వ మందునన్ దనిపిగఁ గొప్పరపుంగవుల దారులుతీరులు చూచి తీరనే॥2॥ తే॥ గీ॥. కాశినాథ బుధేంద్రుఁడు ఘనుఁడు శ్రీని, వాససూరియు నెందఱో వలఁతులైన, కవులుపీఁకనిమీసమ్ము కఱచిపట్టి పీఁకనున్నారె కొప్పరపుఁ బిదపకవులు 8 తే. గీ. కలదు నేత్రావధానంపుగరిమయొకఁడు కలదు గర్భావధానంపుగరిమయొకఁడు, కలదు హస్తావధానంపు గరిమయొకఁడు, వీని నెఱుఁగని సూరులెందేని గలరె 4 ..."

---

క. †అసమానకక్షయని మము, రస దూరెడివారి యుత్తరము లివిగో!- నీ
రస మీ కయ్యము మాకున్, బొసఁగెం దనయంతఁ బూర్వపుం గర్మమునన్.

చ. జ్వరితుఁడ వయ్యు సజ్జనులు సారెకు రమ్మని పిల్వ రానిచో
గరువముగాఁ దలంతు రని కస్తి గణింపక వచ్చినాఁడ ని
ప్పురపునియోగివైదికులపాత్రిసుమంతయు నే నెఱుంగ దు
ర్భర మసమానకక్ష యిటు రాఁ దగి యుండఁగ నెట్లెఱింగెదన్.

ఉ. ఐనను గాలుదవ్వుదొసఁ గాదన నుండుటఁజేసి యంత మా
పై నెపముండ, దీ విపుడు పత్రిక నంపెదవేనిఁ బోరికిం
దా నయిపిల్చినట్ల యయి "తక్కడ" సామెతగాఁ బనర్చు నీ!
మానఁగదయ్య యిట్టి యసమానపుఁగక్షకు దీక్ష యేటికిన్.

ఉ ఎప్పటికేని మాయెదుటనే పడఁగావలె వార, లప్పు డా
తప్పడుకైతపద్ధతులు తజ్ఞులకున్ విశదంబు కావలెన్

1. †... యిదివరలో వున్నదే అసమానకక్ష.అని అనుకుంటూ వున్న సంగతిలో పులిమీద పుట్రలాగున్న యిదిఒకటి వచ్చినది దీనిని గు॥ కొన్ని రోజులు వ్యర్థపుచ్చడమున్నూ శ్రమతీసుకోవడమున్నూ నాకు సుతరాం యిష్టంలేదు..."

ది 28-6-11 రా॥ వెంకటసూర్యరావు.

## Masulipatam.

2. బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతి శాస్త్రులవారిసన్నిధికి, మీరు కృష్ణా రావుగారి పేరున వ్రాసిన జాబు చేరినది. మాయుభయుల నమస్కారములను అంగీకరింపవేఁడుచున్నాను. యథార్థవాదియొక్క వ్యాసము యథార్థముగనున్నను లేకున్నను దాని సత్యాసత్యములు మేము గ్రహింపజాలము......మీరీ లేనిపోని కలహములలో జిక్కుకొని ఆరోగ్యమును బుద్ధిని చెడగొట్టుకొనుట మా యభిప్రాయము కాదు. వారిని గెల్చినను మీకీర్తి హెచ్చునా? ఇదివఱకే మీఖ్యాతి జగద్విఖ్యాతమైనపుడు మీకీపోరాటము లెందుకు? వారు కుర్చీమీద గూరుచుండిన మనకేమి? ఇంటి కప్పుమీద గూరుచుండిన మనకేమి? మీ బలాబలములు లోకము పూర్తిగ నెరిగియే యున్నది. ఈ పోరాటములను గుంటూరు చెరువులో దొక్కి వెంటనే బయలుదేరి రావలయునని మా ప్రార్థన..."

ఆ॥ నారాయణరావు.

బిప్పి ప్రసంగముల్ సలుపు పెద్దలతో డుత నీకు నేల? నేఁ
జెప్పినమాట చొప్పునకుఁ జేసెను చొప్పుచు మిన్నకుండుమీ.

చ. వెఱఁబడి కాకవుల్ తనదుపీపుపయిం జరణమ్ము లుంచి తా
చిన నది లెక్కగాఁ గొనక చివ్వకుఁ బూనక వైనతేయుఁడే
మనక శిరమ్ము వంచుకొని యల్లనఁ బోవఁడె? శక్తిమంతు లెం
దును నలఁతుల్ పొనర్చునఁతుంపుడుకుల్ గణియింప రంతగన్.

ఉ. ఇంతకు నీవు పత్రికల నెన్నిటి నంపిన నేమి లాభ? మా
వింతకవీశు లెన్నఁటికి విజ్ఞులు తీర్పరులున్న సర్పభా
భ్యంతరమందు నిన్నెదురువా రను కోకుము వారితండనాల్
గాంతు రెవారు వారికడ గంతులు వేయుచునుం డ్రిలుంగుమీ.

శా. "ఓ కన్నో మతివంక" లన్నఁ దెలియన్ యోజింపఁగాలేని స
ద్భికుల్ వారికిఁ దోడు, వారిదియుఁ దాద్యగ్విశేషంబె యీ
యేకాకారులు సత్సభాస్థలికిఁ దా రేమంచు నేతెంత్రు? నీ
వీ కార్యమ్మునకుం గడంగకుము మేమే యుంటి మన్నింటికిన్."

చ. అనుట యు నాతఁ డప్పటికి నన్యము చెప్పక మిన్నకుండె నె
మ్మనమున బాల్యచాపలము మానని చందము తోఁచుచుండె, నా
తని కొకకొంత తిర్పతి స్వతంత్రత నిచ్చె ననంతరంబు నెం
కనఁ గికురించి యిర్వురును గ్రిక్కన నేగిరి "పర్సు" పర్కకున్.

ఉ * పద్దెము లచ్చు వేసి యవి పంపి సభోమణి రెండుయామముల్
పొద్దును దాఁటునప్పటికిఁ బూర్తి యొనర్చన మేటి కార్యమున్
దద్దయు మెచ్చుకొంచు బసడగ్గఱకున్ జను దెంచి చెప్పి రిం
కెద్దియుఁ జేయ రామి సహియించెను వెంకన కొంతనొవ్వఁగన్.

---

మ॥ రా॥ రా॥ శ్రీ కొప్పరపు వెంకట సుబ్బరాయశాస్త్రిగారికి.

* చ॥ తిరుపతి వేంకటేశులకుఁ దెంపరిపై సర్వికైచ్చిం గవీశ్వరుఁడను వాఁడు నోటనుడువన్ గడు సిగ్గిలునాకు ధారకున్, బురికొలుపం దలంచితె 'పరాభవమ' యంచు వచింపకేటి యా, ల్లరియిది నింగ వేన్గుపలంబు భుజంపక పూరి మేయునే. మ॥ అనిమిత్తంబుగఁ గాలుద్రవ్వెన త్వదీయాహంత నాఁప్రుండలం, పువ నీకీరసనిర్గణాకుకవనంబున్ జెప్పి నిగ్గెల్వ నెం, చిన యస్మద్గురువర్యులన్

శా. * రామస్వామి యనంతరమ్ము కడుధీరత్వమ్ము చెన్నారఁ నే
మేమో పద్దెము లల్లి తెచ్చి యవి మ మ్మోక్షింపుఁ డన్నన్ క్షణం
బేమిం జెప్పక పిమ్మటం జదివి "మే! లీపద్దెముల్ వారిదౌ
సామర్థ్యమ్ముఁ గడుఁన్ యథార్థముగ నిచ్చల్ నచ్చి వాకు్రిచ్చెడిన్.

---

సుకవితాశ్రీధుర్యులన్ మానిపిం, చినిసున్ గెల్వఁగ వచ్చినా నిదె సభంజేయిం తువో వత్తువో. ఉ॥ గంటలు గట్టికొంటివట! "గంటకు వందలు వేలుపద్యముల్, గెంటుడు' నంచు నేఁడు పరికించెద గెంటుటయెట్టిదో? నినుఁ, గెంటెద నేవధాన మున గెల్చెద నీరసధారయందు నీ, ఘంటికలూడఁ గొట్టెదను గామకొనం గమా కింపుమి త్తటిన్. సీ॥ గురుపాదసేవఁ జేకూరిన వ్యాకృతిపాండిత్యగరిమ యటుం డనిచ్చి, ఉభయభాషాకావ్య విభవాభిరామమౌ పాండిత్యగరిమ యటుండనిచ్చి, ఘనతర్కబంధనిర్మాణధీచాతురీపాండిత్యగరిమయటుండనిచ్చి, సురుచిరలక్షణా భరితాశుకవికృత్యపాండిత్యగరిమ యటుండనిచ్చి॥ గీ॥ అపుడపుడు సంబటించుఁ గొం టాడఁదగిన, తావకాశుకవిత్వంపుఁ జేవఁగూడఁ, దాపకశతావధానవిధంబుఁగూడఁ జూడఁదలఁచితి వేంకటసుబ్బరాయ! చ॥ తిరుపతివేంకటేశ్వరసుధీవరశిష్యుఁడ నాదుపేరు వే, లురి శివరామశాస్త్రి యని లోకము వాకొను నాశ్యమైన వ్యా కరణముజీవనమ్ము నధికారము కావ్యపురాణనాటకా, కరములఁ; జేయఁజాలుదు నఖండము నాఁగ శతావధానమున్॥

గుంటూరు,
31-8-11.

ఇట్లు వినీతవశంవదుఁడు,
వేలూరి శివరామశాస్త్రి, శతావధాని,

— —

* మహారాజశ్రీ కొప్పరపు సుబ్బరాయశర్మగారికి— సీ॥ అణువదేశంబున నవధాన మొనరించు, టో కావ! యిదియు గుంటూరుసీమ, పల్నాటిసీమలోఁ బద్యంబులను జెప్పు, టో కావ! యిదియు గుంటూరుసీమ, ఆయూరనాయూర నాశుకవితసెప్పు-టో కావ! యిదియు గుంటూరుసీమ, గుడివాడసీమలోఁ గొన్ని యూళ్ళను జెప్పు - టో కావ! యిదియు గుంటూరుసీమ, గీ॥ యెట్లుపక్రించు కొందరో యిపుడు మీరు, నిందుకొల్వున మీకున్నదండిబిరుదు, లూరకేపోదు పూజ్యులఁ గాఁబులఁబడ, నాశుకవిసింహ కుండిన హంసలార॥ ఉ॥ బట్టులరీతిఁ బద్యములఁ బల్కుటెకాని శతావధాన మె, వ్వట్టుల నేదిచేసితిరి పండితులెల్లరు

ఉ. వారలకన్నఁ దెల్గునెడ వారక సంస్కృతమందుఁగూడ నీ
వారయఁ బెద్దపండితుఁడ వైనను వారలు బ్రాహ్మణుల్ మహా
శూరులు మేల్ నియోగులును "శూద్రుఁడ వీ" వని యాసడింతు రీ
వేరమునందుఁ గా లిడక వేగమ యేగుమ యంగలూరికిన్.

తే. గీ. వారి దర్పంబు ధారను వడిగఁ బోయి
సభ్యులఁగరంప నీకు నసాధ్య మెప్పు
డేని పనిపడ్డచో మేమె యేగఁగలయముఁ
విడువ నిది తప్పటంచు నొప్పింపఁగలము"

చ, అనుటయుఁ జిన్ననవ్వు నగి యాతఁడు "చిత్త" మటంచు నేగి యే
మని మది నెంచెనో ? తుదకు నాతని [illegible]ములమ్ములోనికిన్
అనుటయు కాక, కొప్పరపు సన్నిధికిం జనఁ; డీని వెల్ల మే
మనిపినవే యటంచును యథార్థ మెఱుంగని వారు దూఱఁగన్.

---

మెచ్చినారలో, గుట్టుగఁ బోవకీగతిని, గొంటెతనంబును జేసి పోతురే, "శాస్త్రి బుట్రకొప్పి పుంజుపయి, బీరముఁ జూపిన" లాగుఁ గాదె? గో॥ గీ॥ [illegible] తోట మీసాలఁదీసి, కొన్న నెవ్వరు నవ్వరు; నన్ను నవ్వ, కుంపరే కన్న [illegible] నియోగి దయ్య్య, మీ సములఁ గాచుకోలేక మిడుకుచుండ॥ క॥ గంటలఁగట్టినారె! ము, కృంటితురగములకు హాటకవితానంబీ, గంటలు మఱియేకార్యము, పాంచ[illegible] చబింపుందు కొప్పరపుం గవులారా॥ సీ॥ శతసంటకపనంబు సల్పుదు మన్న మీ శక్తియడంప నేఁ జాలనొక్కొ, అష్టావధానంబు నాచరింతుమన మీ శక్తియడంప నేఁ జాలనొక్కొ, ఆసుకవిత్వంబు నాచరింతుమన మీ శక్తియడంప నేఁ జాలనొక్కొ, సద్గ్రంథరచనంబు జరుపుదుమన్న మీ శక్తియడంప నేఁ జాలనొక్కొ, గీ॥ ఇంగిలీషునవత్తురో యెఱిఁగియడపఁ, గరము నేఁ జాలనొక్కొ మాగుడు ప్రభల, రండు వేగమీ బిరుదములు డెంపు పెట్టి, పొండు నిండుసభను గొప్పరపుఁ గవులారా॥ గీ॥ ఓడినారని తలపోయువాఁడ మీరు, నాకుఁ బ్రత్యుత్తరంబును నీక మాని, మొదరిపహియింతురేని నీముచ్చటెఱిఁగి, ముందుపనిఁ జూడుఁడీ కొప్పరపుఁగవులార, క॥ శివరామకవికిఁబోలెన్, జవాబునొసఁగకయె వృథగ జంపు నడిపినన్। [illegible]యముకలదుసుఁడీ, వ్యవధిం గయికొనక యిందు బ్రత్యుత్తరమున్॥

అంగలూరు
3-9-1913

ఇట్లు బుధజనవిధేయుఁడు,
త్రిపురనేని రామస్వామి.

ఉ. ఉన్నయథార్థ మియ్యది మహోత్తము లెప్పుడు రంచు మేము సం
పన్నగృహస్థుఁ డనుచు వ్రాసితి; మింకొక కుత్సితశిష్యుఁడున్
గ్రిస్సనఁ * గొన్ని పద్యములు గానుక కొప్పరపువారి కంపె నా
చిన్నతఁ డొక్క సాహసము చేసె వచింతుము తత్స్వరూపమున్.

---

బందరు.

శ్రీమద్గురవే నమః.

(ఇయ్యది కొప్పరపువారికి వ్రాసిన యుత్తరమునకు సరియైన నకలు.)

* చ॥ ఉరుకరుణాయుతుండు, సమయోచిత ధీమహితుండు, భక్తులం, దలంకిని గల్పకద్రుమవిధంబున నుండెడువాఁడు పట్టియూ, తిరుపతివేంకటేశ్వరుఁడు తిన్ననిచూపుల మిమ్ముఁ జూచి యే, ల్లరును ముదంబు నొందునటులన్ దయా, మీకజయమ్ము గూర్చుతన్॥ 2. చ॥ ఉరుతరకీర్తివిశేష మహిమోన్నతులార! గుణాఢ్యులార! కొ, ప్పరపుకవీంద్రులార! వినవచ్చెను మీదుప్రతిజ్ఞ; యెంతో సం, బరమువహించినాఁడను, రమాపతి మీకజయంబు నిచ్చు. నా, తిరుపతివేంకటేశుల నెదిర్చి గ్రహింపఁడు వారిమీసముల్॥ 3. ఉ॥ ధనముగడించి యుంటి రవధానములం బొనరించి మీరలిం, దనుక శతావధానులను నామముతో; నిఁక మీఁదె నట్లుకా, దనుచు శతావధానముల నక్కడనక్కడఁ జేసి పండితుల్, వినుతియొనర్ప మీసములఁ దీఁకుఁడు నూతననామధారులై॥ 4. గీ॥ తెలుఁగు తిర్పతివేంకటేశులకుఁ గూడ, వచ్చుఁగావున నోడింప భారమగును, గాని వారికి నేత్రావధానమందుఁ, బ్రజ్ఞలే దందుమీరు గెల్వంగలారు॥ 5. క॥ నేత్రావధానమది స; ర్వత్రజయంబిచ్చుమీకు, వదలక దానిన్, మాత్రమె పెట్టిన నప్పుడు, శత్రులనోడింప మీకసాధ్యంబగునే॥ 6. చ॥ వినుఁడు గుణాఢ్యులార! యొక చిన్నపమున్ వినుఁడయ్య "గ్రుడ్డుపి, ల్లను గని వెక్కిరించినటులన్" గనూ పట్టెను వీరియన్న" యనం, చు నట జనుల్ వచించిరది సుంతయు నామది నమ్మఁబోవనే, మనవనియోగినాటఁ దగవా? యదినమ్మి మిముం ద్యజించుటల్. 7. మ॥ "సభమీ రెచ్చటఁ జేయువార" లని ప్రశ్నన్ వేసిరవ్వారు, మీ సభయుల్ మాపురికేగుదెంచి యిట సభ్యుల్ మిమ్ముఁ గీర్తింపఁగా, సభ సేయంపుడు, తోఁచినంతవఱకున్ సాహాయ్యమున్ జేతు నా, కభిమానంబది మీయెడం గలదు రం డామోదముం బొందుచున్॥ 8. ఉ॥ "ఆరయ నీవు చేసెడిసహాయ

ఉ. బందరునుండి పద్దెములు వారికిఁ బోస్టునఁ బంపి మీఁద మా
కంపఁగఁ జేసె దానిపత్రి; యక్కట! యాఁగుట యెట్టు? లిట్టులే
కొందఱు * స్కూలుశిష్యు లొకకొన్నిటి నంపిరి, మే మెఱింగిన
ట్లందఱు గాక యున్న జను లందురు గొందఱు మాన్ప నేర్తుమే!

చ. "తిరుపతివేంకటేశులకుఁ దివ్యముగా సభ కేగుదెం డటం
చటిముటి వ్రాసి కొప్పరపుటాయన దా సభ కేగుదెంచెనే?

---

మదెట్టిది? పిల్లవాఁడ" నం, చూరక నెంచఁబోకుఁడు మహోదధివారి నిబంధనంబు చే, కూఱఁగ రాముఁడయ్యెడవిఁ గోతులసాయముగోరలేద? సు, శ్రీ రహిమించ మీరు దయచేసి జయంబు వహించుఁడో బుధుల్॥ 9. క॥ తప్పక దయచేయుఁడు మీ, రిప్పరికి జవాబు వీని కిడుఁడు సరగునన్। మెప్పు గనుఁ డయ్య వైళమ! కొప్పరపు కవీంద్రులార! గుణమణులారా!

'VIth Form C. Division,
Noble College.
Masulipatam.

ఇట్లు
సుకవిపాదరేణువు,
వడ్లమన్నాటి నరసింహశర్మ.

శ్రీ మత్పర దేవతాయై నమః.

11-9-11 బందరు.

* గురుసర్యా! చ॥ మనమున భక్తినిల్పెదను మాధవపాదసరోజయుగ్మ చింతనపరిలబ్ధదివ్యకవితావనితామహితప్రభావ సం। జనితలసద్యశః కుసుమజాలవినిర్మితహార ధారులై। తనరెడు వేంకటేశ్వరబుధాగ్రణి! మీవగుపాద కంజముల్. ఉ॥ ఇందులనుంచు పద్యముల నేనె రచించియు నచ్చువేయఁగా, సందియ మొందుగల్గి తమసన్నిధి కంపితి వానిఁజూచి నా, కుం దయవ్రాయ వేఁడెదను గొంకకయెట్టులు సేయుమందురో? యందులనుండుదోషములనన్నియు దిద్దుచు నంపవేఁడెదన్. మ॥ తమసందర్శనమెప్పుడబ్బునని చింతాక్రాంత చిత్తుండనై, కుముదంబుల్ శశిఁగోరుభంగిఁ దమ వాక్సూనామృతాస్వాపసం, భ్రమమేపారనె సంగువాఁడ నిట ధీరాగ్రేసరస్తుత్య ని, త్యము లేఖార్థము చూచువాఁడఁగృపతో సంపంగఁ బ్రార్థించెదన్.

చిత్తగించవలెను

ఇట్లు తమశిష్యుఁడు
కోకా రాజారావు, హైస్కూలు, బందరు.

పరపర వ్రాసి రమ్మనినఁ, బాలుఁడ" మం చలసూ్కలుఁగుజ్జ లెం
చిరి యని తోఁచుఁ జర్చఁ దగఁ జేసినయోగ్యులకెల్ల నిప్పనుల్.

క. ఎటు దోఁచిన సరియే మే, మిట లేశ మెఱుంగ మెఱిఁగి యే మెవ్వరి నాఁ
గుటకు యతించితిమో? వి, స్ఫుటముగ మునుమున్న దానిఁ జూపితిమికదా!

చ. చరితము గాన వ్రాయఁదగు సంగతి వ్రాసితి మంతె కాని యే
రెఱుఁగరు మేము కొప్పరమున కిట్టులు శిష్యుల రేఁపి పంపుసం
బరమున కొప్పువారమొ? స్వబాహుబలమ్మునఁ బోవువారమో?
యరులు నిజం బెఱింగియును నాడఁగఁ జొచ్చిరి వేఱుకీలిగన్.

చ. ఎఱిఁగినదేకదా, జగతి యెల్లఁ గుశిష్యుల రామకృష్ణులన్
మఱి యలయిర్వురందు నొకమానిసి కన్న బహుళుప్రియుండు కొ
ప్పరమున వారి కంపె నొకపత్రిక * "నేత్రపధానమందు వ
త్తురె" యని రామకృష్ణు లటుదూఁకఁగఁజేసి రనంగఁజెల్లునే.

---

మ॥ రా॥ రా॥ శ్రీ. కొప్పరపు సుబ్బారాయశర్మగారికి... మ॥ ధరణీ చక్రము గూలఁగా వలదె! సప్తాంభోధిభాస్వద్వనుం, ధరభారఁబు సహించి మించుసలమాతంగంబులున్ వీడి; కొప్పరపుం బండితమానులార! తమకున్ భాషాద్వయీ కావ్యసం, భరితుల్ తిరుపతి వేంకటేశ్వరులతో వాదంబు శ్రేయం బౌనె'' మ॥ కరిశార్దూలమృగేంద్రసత్తములు గంగాభంగకల్లోలలీ, ల విజృంభించి పెనంగుమండఁ గవిమార్గాలాదిసంపూజ్యలీ, రవధానంబు రచింపబూనితిరహో! హాస్యంబె యూర్ధ్యోక్తియున్ 'శివుఁడుండాండవమాడనాడనె పిశాచీభూతబేతాళముల్'... ఉ॥ చెప్పినమాట చెప్పకయె చెప్పఁగ నేర్తుఁగవిత్వధారగా, నొప్పి దమావిధంబున బుధోత్తములందఱు మెచ్చనీరమున్, దప్పిక ద్రావుభంగి వచనంబున గెల్వఁగరండు నన్నహో!, కొప్పరపుం గవీశ్వరులకుం దగదేమొకొ? నా ప్రతిజ్ఞయున్........."

---

* విద్యాచర్చాపత్రిక.

"అయ్యా! తమకును బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరమహాకవులకును, ఒక మాసమునుండి జరుగుచున్న కవితా కలహంబును పత్రికాముఖంబున వింటిని ...సర్వసాధారణమైన యాశుకవితకేమి? తమకు నేత్రావధానంబున నెన్ని బిరుదు లున్నవో... వానిని మీ కంటె నతిశయించి కాఁకరపర్తి విద్వత్సభలో

చ. పనిగొని రామకృష్ణులు "సెబాసు! బళీ!" యని కొప్పరంపువా
రొనరుచు తప్పులన్నిటిని నొప్పులుగాఁ దలపోయు పేరెఱుం
గని? దల వారిబంధువను కారణ మొక్కఁడె చూచి యిట్లనన్
జనునె? యశక్తిదుర్జ్ఞనత సర్వవిగర్హిత మెన్ని భంగులన్.

క. ఇది యిట్టులుండె మమ్మున్, బదిబది యాసీమ నున్న ప్రాజ్ఞులు పూజా
స్పదులుగ సధానాదులఁ, బొదలించుచునుండి రరులు పురపురఁ బొక్కన్.

శా. ఆపైఁ గొప్రపువారిపక్షమున వా రాలోచనల్ సేసి "రిం
కీపై నెయ్యది కార్య? మీపురమునందే వారికిన్ సాటెకున్
బ్రాపై గౌరవ మిట్టు లౌనె? యిది యొప్పాటన్ సహింపంగ నౌఁ
గోపం బూనుటయే యనుగ్రహముగాఁ గూర్చుండి రవ్వారిటన్.

సీ. చుట్టుపట్టులనుండి చూడ వచ్చెడివారిసంఖ్య పందలకన్నఁ జాలహెచ్చు
వచ్చి "మాయూరికి విచ్చేయుఁ" డనువారిసంఖ్య యేఁబదికన్నఁ జాలహెచ్చు
'రాఁజాల' మన్నఁ 'దీరదురాక' యను వారిసంఖ్య యిర్వదికన్నఁ జాలహెచ్చు
ఏమాట వినిచిన నింపుమై వినువారిసంఖ్యయో? వేలకుఁ జాలహెచ్చు

తే గీ. పద్ధతినియోగులం దెరో పట్టుదలకుఁ
నేగకున్నను నెల్లవా రేగి వారి
చుట్టునుం గూరుచుండ్రిది చూచు టెట్లు
త్రిమతములు వారిపక్షమై తిరిగిపోయె.

శా. ♦ ద్వైవాద్వైత మొకండు దక్క నఖిలద్వైతంబు నద్వైతమున్
శైవంబున్ మఱి వైష్ణవంబు నొకటై ఛత్రింబుగా వారలన్

---

ది 20 సెప్టెంబరు 1911 సం॥ రం తేదీని తత్తదంశంబుల నెఱవేర్చ యాడఁబెఱుకు చున్నాను గనుక నీ నోటీసు అందిన వెంటనే మీ ప్రజ్ఞా విశేషంబును గనుపఱుప వారోజునకుఁ గాఁకరపఱ్ఱు మీరు రాఁగోరెదను "లేనిచో మీతో విద్యాచర్చలకు రాఁజాలను" అని నాకొక జాబైనను వ్రాయఁగోరెదను...

ది 14-9-1911 సామవేదుల సూర్యనారాయణశావధాని

నేత్రావధాని, అండష్టావధాని, మకాం, కాఁకరపఱ్ఱు అగ్రహారం, తణుకు తాలూకా

* ద్వైవాద్వైతము.

☞ పరా:— అనఁగా, నిది యొక నవీనమతము, దీనికే పద్ధతినియోగ మని

బూవుంబంతులపోల్కిఁ జూచెదరు రేపు న్మాపు నవ్వారితోఁ
బ్రోవై యుండుఁ బురంబు వారివచనంబుల్ వేదముల్ వీరికిన్.

చ. ఇతరులమాట కేమి? మది నించుక గోపము కల్గియున్న నా
కుతుకముగూడ వారనినఁ గొండొకపువ్వులు వాఱు, వారివా
క్ప్రతతి వినం గుతూహల మపారము గల్గియుఁ బోను వారిపెం
కితనము నాకు నచ్చమియె కేవలమింతకు మూల మెమ్మెయిన్.

ఉ. 'పెంకెలు గారు సాధువులు పేర్మికి నిక్కలు గర్వదూరు' లం
చంకిలి లేక చెప్పికొనునట్టియనుం గల రల్లవారి; ని
శ్శంకగ వారు వారికటు చల్లఁగఁ దోఁచుటయు న్నిజంబె; యే
పంకమొ యస్మదాదులకు వారు రుచింపరు వేయునేటికిన్.

ఉ. పాండితి లేని యీమనము పాండితిపట్టున వారి గెల్వ లే;
మొండొక త్రోవఁ జూడవలె "హుమ్మను" వారిది మాపఁగావలెన్
గండతనం బడంచుటకుఁగాఁ గబురంపితిఁగాని బెల్లపుం
గొండకవీంద్రుఁ డేమిటికిఁ గొంకెనొ? "రా" నని యుత్తరం బిడెన్.

తే. గీ. తీరి కూర్చుండి పెట్టి రీవైర మనుచు
నతఁడు కొండొక నిరసించినట్లు వినికి
యితరులకు వట్లె తోఁచుఁగా కిదియునట్టి
దెట్టులగు? నాసనము నీయరేమి మనకు!

ఉ. పండితపామరుల్ గలిసి వారలకే హితులైరి; వారలన్
గండడఁగించు టెట్లు? మనకక్షు జయించుట యెట్లు? తోఁపదో
క్కండు నుపాయు"మంచుఁ దన గాదిలిపద్ధతివారితోడఁ గొ
ల్వుండి విచారణల్ సలుప నొండొకనేర్పరి పల్కె నీగతిన్.

---

యుం బేరు, ఇది సదుద్దేశముతోడనే శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితుల వారు పుట్టించిరి. వైదికు లసురులనియుఁ దాము దేవతలమనియు వారిసిద్ధాంతము,ఆ యీయంశము దైవాద్వైత పదమే తెల్పెడిని. సుప్రసిద్ధాద్వైతము వీరికి నసురాద్వైతము. విస్తరము వారి విశ్వపశ్య సుకవిజయము లోనగు గ్రంథముల వలన నెఱుఁగఁదగు. ప్రకృత కలహమునకుఁ గారకు లేతన్మతావలంబులలో స్వల్పసంఖ్యాకు లని చదువరు లరయుదురుగాక.

చ. అవమానం బది యెంత గావలయునో యాసర్వ మవ్వారికిం
జవిఁజూపెద మనకొప్పరంపుఁగవి; మీసాల్మాట సామాన్యమే?
యెప బెచ్చొ నలవారి నిట్లనఁ గలారే? యంతియే చాలు న
న్యవిచారం బిఁక నేల? నాకొకయుపాయం బిందుఁ గన్పట్టెడిన్.

మ. అవివేకంబొ వివేకమో జరిగె నేలా "సంధి మిచ్ఛంతి సా
ధవ" యన్ వాక్యముఁ బట్టి పోవుదము విద్వత్తాకవిత్వాభిజా
త్యవిశేషమ్ములఁ జేసి యిందులకు వారంగీకృతిం జూప రం
చు విచారింపకుఁ డట్లు కావుటకె యీచో పృచ్ఛ్యా మెబ్బంగులన్.

క. కొలుకంగ రానికొయ్యలు, తిరుపతివెంకటకవు లని తెల్లము సేయన్
బరికించితి నదుపాయము, గర మాలోచించి దీని గ్రహియింపుఁ డనన్.

తే. గీ. వృద్ధుఁడిట్లను "బాగు నీవలువ, దీనఁ
గలదు కష్ట మొకండదు; లోకమునఁ గొప్ప
రంపువార లసారులు గ్రామ్యకవులు
వార నేతాదృశు లటంచుఁ బేరుగలదు.

తే. గీ. అట్టిచో సంధియనుటకు నర్థమేమి
యగునో? పరికింపుఁ డద యనసమర్థతకును
నపరపర్యాయమగు" నన నతఁడు పల్కె
"నగును మీరన్న నుడియు నేనరసినాఁడ.

గీ. కాని యిపుడింతకన్నఁ జక్కని యుపాయ
మొండు గన రాదు సభసేయుకుండ వారి
నిప్పురమునుండి పంపుటకింక నొక్క
సాధనం బేది? యానతిసల్పుఁ"డనుచు.

తే. గీ. కొంత యోజించి యావృద్ధు కొసకు సమ్మ
తించి రాజీకిఁదగునట్టి మంచిమాట
తెల్ల వ్రాయించి వ్రాళ్లు చేయించుటకును
బెద్దలగువారియొద్ది కంపించుటయును

ఆ. వె. ఈసడించువార "ఛీహీహీ" యనెడివారు
పెదవి విఱుచువారు "మొదలలేని

శాంతి యిప్పుడేల చాల్చాలుఁ బొందు పోం”
డనెడువారు నైన మనసువిఱిగె.

క. చని కడచిన వృత్తాంతమ్మును వృద్ధునితోడఁ జెప్ప మొగ మించుకయై
వనటం బడి తెప్పిలి యేమిని దోఁచక యుండె నపరిమితయోజనతో.

తే. గీ. “నే నిడుదుఁ గంటిలో వ్రేలు, నీవు నాదు
నోట వ్రేలిడు” మన్నట్టు “లేటికిట్టి
సంధి” యని యెల్లరాడునాచంద మేను
మొదటఁ దెలిసియుఁ బంపితి మోసపోతి.

క. అని కొంతసేపు తన చేసినయపలౌకికపుఁ బనికిఁ జేతమ్మున నె
క్కొన సిగ్గుకల్మిఁ జింతిం, గొనుచు నుపాయాంతరములకుం గడఁగునెడన్.

చ. మఱియొకఁ డిట్టు పల్కె “మఱుమాట వచింపకుఁ డింతకన్న నొం
డరయఁగ రా దుపాయ మొకటైదుగులేనియుఁ జాలు వ్రాళ్ల కం
దఱు నొనరించినంత విలువై చెలువారెడునంత వాసిగా
దొరకవలెన్ సరాసరిగఁ దూఁగెడువారుగ నుండఁగావలెన్.

తే. గీ. శాఖ కొక్కొక్కరుండుగాఁ జర్చచేసి
యేరి వ్రాళ్లు చేయించితి మేనిఁ జాలు;
సంధి కన్నప్పుడేమని సమ్మతింప?
రరయరే “సంధిమిచ్ఛంతి” యన్న నోడువు?

సీ. ద్వైతులకెల్ల నాతనిచేతఁజేయింత మద్వైతులకు నెల్ల నతనిచేత
నతనిచేఁ జేయింత మలవిశిష్టాద్వైతశాఖకెల్ల నతండు చాలువాఁడు
ఇంక ద్వైతాద్వైత మిందుఁ జేసెడివార లెందఱేనియుఁ గల రెంచనేల
శుక్లయజుశ్శాఖ సుముఖులకెల్ల నయ్యానఘుచేఁ జేయింత మతఁడె చాలు

గీ. తప్పెవరిదేని యగుఁగాక తగుమనుష్యు
లిరువురకు సంధిగూర్చుచో నేమిదోసఁగు?
పైకి నటియింత మిట్లు చేవ్రాళ్ళు దొరకు
వఱకుఁ బిమ్మట మనయిచ్చ నుఱుకవచ్చు.

ఆ. వె. సంధి కొప్పిరేని “చాలలే” కందము
సమ్మతింపరేని “శాంతిదూరు”

లంప మనల; దీనియట్టి యుపాయమ్ము
మనకుఁ గానరాదు మఱియొకండు.

క. చెఱియొకటిగఁ బంపినఁ గొ, ప్పరమునకున్ లాఘవంబు పైఁబడ దెవరో
యెఱిఁగిన వారెట్లాడిన, నరయను దూరగులు యోగ్యులందురు మనలన్.

తే. గీ. ఒక్కఁ డొకరికి చెప్పట్లనోడువారు
కారు, తుల్యులు కయ్యమ్ము గలిగినప్పు
డేరి చేరు జయింతురో! యింతలోన
సంధి చేసిరి పైవారు శాంతి గోరి.

క. అనుప్రథ గల్గిన మనకున్, ఘనతయె, మనకవుల కింతకన్నను గొప్పం
గాని తేఁగలమె? మును పా, సనమేనియుఁ గోరు టీయశమ్మునకే కదా!

తే. గీ. ఆసనం బిడ నందుల కల్లనారి
మీసములు బీఁకుకు మటన్న బాస చాలు
నిపుడు మనపన్నగడ ఫలియించె నేని
"కోటలోఁ బాగ వేయుఁ బో! కొప్పరంబు."

క. అనునతని మాటచొప్పున, ఘనుఁ డా వృద్ధుండు సలుపఁగా నెంచియు నా న్ని
ర్లనుకూలింపమిఁ గొండొక, దనుకన్ మాకప్పకుఁ గాగితము రాసి యెచ్చెన్.

గీ. అంత బ్రాహ్మణకోటి యారి యగ్రజన్ము
లెల్ల మమ్ము నాహ్వానించి యెలమి నొక్క
సభను గావించి మేటియుత్సవ మొనర్చి
గౌరవించిరి వైరులు కళవళింప.

క. పిదపఁ బినపాడులో నొక, సదస్సుటులె జరిగె నంత చాతుర్యుఁడొకఁడు గో
విదమయ మగు కాలేజీ, సదస్సులో శతవధానచతురిమ నెఱపెన్.

---

# గుంటూరు కాలేజీ శతావధానము

చ. ఎఱుఁగడు పిల్లకాయ యెటులే నొనరించు శతావధానమున్
పరమలు మీర లెల్లరును సభ్యులు పేర్మి ననుగ్రహింపుఁ డా
దరమునఁ దప్పులన్ విడిచి తద్దయు నొప్పులు చూచి మెచ్చుఁడీ
తిరుపతివేంకటేశకవిధీరుల శిష్యుని వృద్ధికామునిన్. (వెం॥ శా॥)

 అవధానపద్యము లన్నియు వదలఁబడినవి.

.........................................................

శా. నీకుఀ శ్రీయును ధీయుఁగల్గుత మతిన్ని కంతసారస్య మ
స్తోకంబై యలరారుఁగావుత నినుం దూలింపఁగా లేక దు
ర్ధీకుల్ గాత్రిమ్యశతావధానులిఁక వ్యర్థీభావముం గందురు గా
కేకాకారయశంబు గైకొనఁగదోయీ! ఛాత్రచూడామణీ!

మ. కుతుకంబొప్ప సరస్వతిం గొలిచి నేఁ గొంతార్జనం జేసితి
న్మతిమన్ముఖ్యుని బ్రహ్మఁ గొల్చి మతికొంత న్నేర్చితిఀ విద్దని
ల్చితి నీకు న్మతిఁ గొంతమందికి యశశ్శ్రీ నిల్పితీవో జగ
న్నుతనామా! శివరామ! నీకు నొసఁగింతుఀ దీవనల్ హెచ్చుగఀ.

మ. ఎగిరిం దమ్మ నెఱుంగకే యెవరో మ మ్మెంతేని నిందించునా
యదను న్వచ్చితి వడ్డు చొచ్చితివి నిన్నవ్వారు లక్షింప రై
రిది లోకం బెటులో యెఱింగి సభ గన్యత్వంబు నీ కిచ్చి ర
య్యా! దెసల్ నిండె భవద్యశంబు శివరామా! ఛాత్రచూడామణీ!

సీ. నీతండ్రి వేదవిద్యాతత్పరుం డిట నున్నచో నెట్లు నిన్నెంచునొక్కొ!
నీతల్లి లోకవిఖ్యాతదివ్యచరిత్ర యిది గన్నఁ దా నెంత ముదముగనునో!
నీయన్న విద్యావినీతితత్పరుఁ డిట నిపుడున్న నెంతటి యెలమి గనునో!
నీతమ్ముఁ డవధాన నిపుణుఁ డీకృతి గన్న నెంతయామోదమ్ము నెనయునొక్కొ!

గీ. ఇది మహాత్మ్యంభవంబు నీయెల్ల బంధు
వులును బొందెడి మోదమ్ము గలిసి యొక్క
నన్నె పొందె; భరము ఘనంబు మోయు
నెట్లు శివరామ! చెప్పుమోయీ! కుమార!

మ. కలశాబ్ధిం బలుమంది కిచ్చితిని వీఁకం గొంద ఱిట్టట్టులో
యెలమిం గూర్చిరి వంగనామ మిడి యెట్లేఁ గొంద ఱానందముం
గొలుపం బూనిరి నీకతమ్మునన దగ్గుంగాక యాయోగ్యుఁ ద
గ్గులు; వేవే శివరామశాస్త్రి! మది పొంగుంగాక నాకుద్ధతిఀ.

శా. "సంతానం బది లేదు నా" కను మనశ్శల్యంబు నీవై దుషీ
కాంతుల్ ద్రోచెఁగదోయి! తండ్రి! నినువాకాంతుండుఁ దద్భార్యయున్

స్వాంతం బుంచి యనుగ్రహించి బహుధా సంతుష్టునిం జేయుచున్
మఱియు గ్రాహ్య సమస్తశ్లోకములను సహస్రసంఖ్యఁ గాక న్నిసున్.

ఉ. "అయుఁదిమేము లాయము" యని యంకురుగా కలిలోన, నల్వదే
వఱకె గతించె నప్పటికి వ్యాఘ్రముమన్ జర నోరువిప్పి మ
మ్మఁ గ్రయముమనుండె మాధరముసంగరయు నీతలఁ దాల్చి చేయు మే
న్నెఱచిన తోఁగ నోయి శివరామకవీ! బహుళావధానముల్.

క. 'య'స్సనుమఁ గొంపఱనఁగా, 'బ'స్సనుచుం గొందఱనఁగ బాలుఁడవయ్యున్
నిస్సీమయశముగొంటివి మ, హస్సాగర! వృద్ధినందుమా! శివరామా!

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శతావధాని.

మ. జగతీనాథులు పెక్కుమంది ముదితస్వాంతంబునం గాన్కలం
పఁగ సాంగంబు సలక్షణంబుగ శరద్వావింశతిం జేర్చి హె
చ్చఁగ మా రేలిన యీ వధానకవితాసామ్రాజ్యభారంబు వే
యఁగఁ బూనంగదవయ్య తండ్రి! శివరామయ్యా! చిరంజీవివై.

మ. రిపు లేతెంచిన రూపడంచుచు ధరిత్రీనాథు లర్పించు న
య్యుపదల్ గైకొనుచుం బ్రమత్తుఁడవు గా కుద్యన్మవేందుండవై
శుపకీతం బగు తోఁప్రఁబోక కవితావీరుండవై వర్ణనీ
యపరాక్రాంతి వహింపుమయ్య, శివరామయ్యా! చిరంజీవివై.

శా. బాల్యోద్రేకముమై నెదిర్చితివి కోపప్రింపుంగవిం గ్రంథసా
కల్యంబుం బొనరింతొ లేదొ యని నీకై కొంకు నస్మన్మన
శ్శల్యం బిప్పటి కూడఁ దీసితివి వత్సా! సత్సభాశోభివై
కల్యాణంబులఁ బొందుమయ్య! యిఁకవీఁకన్ శిష్యచూడామణీ!

మ. అవనీదేవులు నిస్సమానకవితావ్యాపారవారాశిసం
భవపీయూషరసాభిలిప్తలలితవ్యాహారనీహారులై
యవలోకింప శతావధానమున మాకానందముంగూర్చి గౌ
రవము న్నిల్పితివయ్య మా ఋణము తీఱన్ శిష్యచూడామణీ!

శా. స్వర్ణీలావతులెల్ల రద్భుతపదవ్యాపార మేపార మా
చర్ల బ్రహ్మసుధీగురూత్తముని వాచాపూర్తిఁ గీర్తింపఁగా

క. మాకును మాశిష్యులకు న, నేకులు ప్రాజ్ఞు లిటు లెల్లయెడఁ జేసెడి య
స్తోకపుగౌరవముల కల, లౌకికు లెంతేని జింతలన్ జివికి వెసన్.

గీ. యత్న మెంతేని యొనరించి యంత "విశద"
లాఖ్యఁదగు పల్లెలో సభ నమఘటించి
రా సభావిశేషంబుల నరసి తీర
వలయు నంతియె యంబ! నీ పరయ లేదె?

గీ. వాసి "కలవాటులేని యశావధానములు"
కొప్పరపుసామ లొనరింప నొప్పికొనరు
పాప! మేమి సేతురు వారిఁ బట్టికొనిన
గ్రహములనుబట్టి మిక్కిలి కష్టపడిరి.

క. "తాటికెగఁబ్రాకఁబూనిన, చోటన్ మఱియెంతదనుకఁ "జోచో" యనుచున్
మాటికి నెగఁ ద్రోయుదు" రను, మాట కుదాహరణముగ శ్రీమంబదియొప్పెన్.

గీ. కొప్పరం బవధానంబు కొలకుఁబూని,
‡ పశము గాక పడెడి భంగపాటులెల్ల
మాసయిని బొల్పుఁ దొడఁగిరి మంత్రిబలము
చాలఁగల కూటలౌకికాచారపరులు.

మ. అవధానం బెటు చెడ్డనేమి, "బళి, మే, లాహా, జగమ్మందు లే
రవధానుల్ మఱి యొక్క రిట్టి" రని యాహాకారముల్ వ్రాసి తా
నెవఁడో పత్రిక కంప దానిఁ గని "యిట్లే నిక్క" మంచున్ జగం
బవలోకించు మనమ్మునందు నిజ మేలా తేలు నప్పట్టునన్?

ఉ. ♦'బాగుగ నుండెఁ గొప్పరపువారి' దటంచు లిఖించునప్పుడున్
డాఁగిరె గిల్క రెండటో; హుటాహుటివ్రాఁతలు డాఁగనేల? యే

---

గీశ్లాఘంబును గోరి మాదరికి భక్తిన్ శిష్యు లేతేరఁగాఁ
దర్లంజేసితి పస్మదీయగురువిద్యావంశచూడామణీ!

దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధాని.

‡ ఈ భంగపాటులనుగూర్చి పూర్వరంగము 106, 107, 108, 109, 110 పుటలు చూ॥

♦(1811 సం॥ రం 13వ అక్టోబరు తేదీ, ఆంధ్రి కేసరి పత్రికనుండి.)

(గుంటూరి శతావధానము.)

...సభ అసమాన వైభవంబులో జరుపబడినది. 51 పృచ్ఛకులకు నిరాఘాట

వాఁగుడో పిల్లఁ బెట్టునెడ వ్రాయసకాఁడటు సేయుఁ గాక "మేల్!
బాగు! భళా! భళా" యనెడి పట్టున డాఁగుట కర్థ మేమగున్?

క. కల నిజమెల్ల నిటులె యీ, కలహమ్మునఁ దెలిసికొనినఁ గాక తెలియ; దే
పలుగో పేర్మార్చి యెదో, గిలికెడి నిజ మెట్లు తెలియుఁ గృతబుద్ధులకున్?

ఉ. ఇయ్యెడ భిన్నభిన్నతను వేటికి నెత్తిరొ! ప్రత్తిపాటి కా
మయ్యయు, రామకృష్ణులును, నందఱు దాఁచెడి కాళ్లకూరి నా

---

ముగా జరుపబడినది. అపభానపు బద్యములైనను ప్రబంధ పద్యములను మించి యున్నవి. యిదియంతయు జూచినతోడ ప్రతిపక్షులకు నోరెత్తుటకునయినను సందుదొరికినదికాదు. అంత సభానంతరమున ప్రతికక్షివారచే కూడ మెప్పు వడసిరని వ్రాయుటకు గడు సంతసిల్లుచున్నారము. యిదివర కీ గ్రామంబున జరిగిన సభలలో నేదియు నింత జయప్రదముగా జరిగి యుండలేదు.

ఇట్లు, యథార్థవాది.

---

(ఆన 1911 వ సం॥ అక్టోబరు 4 వ తేది ఆంధ్రపత్రిక నుండి.)

గుంటూరు సమాచారము.

గత నెల 18 వ తేదీని గుంటూరు తాలూకా "విశదల" గ్రామమున కొప్పరపు సోదరకవిశ్రేష్ఠుడగు బ్రహ్మశ్రీ వెంకటసుబ్బరాయ శర్మ కవిగారిచే శతాపధానము జరిపింపఁబడినది. నాటి సభకు బ్రహ్మశ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగా రగ్రాసనాధిపత్యము వహించిరి. నాటి శతావధానమునకు గుంటూరునుంచి యుద్యోగస్థులు, విద్యార్థులు, న్యాయవాదులు, పండితులు, కవులు సుమారు 150 మంది వచ్చియుండిరి. వారి కందరికి పిండివంటలతో సహా భోజన సదుపాయములు జేయబడినవి. వీరి ధారణాశక్తియును, సమయోచిత యుక్తి శక్తులును, కవితాపటుత్వమును, మేధాశక్తియును, శ్లాఘనీయములు. సభానంతరము కొందఱు పండితులు, కవులు తమ యుత్సాహములను దెలుపుచు గొన్ని పద్దెములను జదివిరి.

ఒక పృచ్ఛకుఁడు.

☞ ఇట్టి వ్రాఁతలు పెక్కులు, లోపల నిజ మెఱిఁగియుఁ గప్పిపుచ్చి శాఖాభిమానమును వెల్లడించు నీ వ్రాఁతలోఁగూడఁ జక్కఁగఁ బరికించువారికి "విశదల"లో నవధానముకన్న భోజనమే కొండొక మెఱుగను తత్త్వార్థము

రయ్యయుఁ జట్టిసింగయయు నట్టిరె నాఁదగు 'పోచి' పోత,లీ
యయ్యలు పూర్వజన్మమునయం దొకరేయనితోఁచు నంబికా!

క. అవధానం బారీతిగఁ, జవుటం బడువిత్తులట్ల సమయుఁడు శాఖా
యువతీమనోహరులు తమ, సువివేకము నెల్లఁ దెలుపఁజొచ్చిరి వెలుచన్.

ఉ. వెంకట రామకృష్ణులను వీరికిఁ దోడుగఁ దెచ్చి, తిర్పతిన్
వెంకన నోడఁబుత్తమిది వీలని కొండలు వారికోసమై
చంకలు గొట్టికొంచుఁ జని సారము గన్గొని "సీ" యటంచు ని
ట్టింకుల నింకినట్లు జనులెంచఁగ వింటిమిసుమ్మి శాంకరీ!

చ. "కునికిన బోసినక్కపయిఁ గొండొక తాటి ఫలమ్ముపడ్డ" య
య్యానువున రామకృష్ణు లిది యూరసియుండవలెన్: దెగించి యు
ప్పని పయిఁ బెట్టికొన్నఁ దనుపాండితి పైటికిరాదె? దూరపుం
జనులు సమీపగుల్ బలె స్వశక్తి మహత్త్వమెఱింగి నవ్వరే!

తే. గీ. "ఎడమచేయియుఁ బుజ్జచేయియు" నటన్న
సామెతయె వీరి కవధానచర్యపట్ల
తక్కుసామగ్రిలోన భేదంబుబోలెఁ,
దెసఁగుఁ గొప్రింబునకు రామకృష్ణులకును.

ఉ. వచ్చిన రాకయున్నఁ దమవాక్కులఁ దోడుగ నంపుకేనియున్
మెచ్చు ఘటించుఁగా! యనుచు మేటులు వేటులు "శృంగభంగముల్"
పచ్చికమోఁపులుంబలెనె పంపిరి పాపము! రామకృష్ణులే
మిచ్చఁ దలంచిరో? నిజమెటే బయలౌనని తారెఱుంగమిన్.

ఉ. వెంకట రామకృష్ణు లవివేకవిశాలపు 'శృంగభంగమున్'
జంకలనూని జన్మదివసమ్మునవే యనధీనతాప్తి ని
ట్టింకులు గొన 'శతఘ్నిఁ' బఠియించుచుఁ గొప్రపువారి బందుగుల్
పంకపుఁదోవ్రిపలంబడి స్వపద్ధతి వెళ్లఁగఁ జెట్టిరంతటన్.

---

దొరకకపోదు. అది యటులుండె, ఈ రసాభాసావధానము మాయవధానము కన్న వేయిరెట్లధికముగ నున్నదని వ్రాసిన యతని వ్రాఁతను పూర్వరంగము నందు జూడఁగోరెదము.

తే. గీ. బంధుగులటన్న దగ్గఱివారు కారు,
ఏకశాఖీయులనియె నీ నెఱుఁగుమంబ!
వారు లోలోనఁ గొప్పరింపువారి సత్త
నెఱుఁగ రనుకోకు మెఱిఁగియు నిట్టులైరి.

తే. గీ. ఒకరొ యిద్దరొ తక్క నియోగులందుఁ
గొప్పరపుధారయన నొప్పుకొననివారె
కాని యాసనచర్యాభిమానమూన
మానసాంతరులై మేను మఱచి చెడిరి.

సీ. "పండితబ్రువ"యంచు బంపతిట్టులుతిట్టి యెవ్వాఁడు తనహైన్య మెఱుకపఱచె
"సత్యవాది"యటన్న చాటుపేరున లేనిపోనివాదుల నేఁడు పూని వ్రాసె
అతనికెక్కుడుగ "యథార్థవా"ద్యభిధానమున నెవ్వఁడుఁ బెంచె ననృతములను
వంటబ్రాహ్మణునుత్సవమ్మున కెవ్వాఁడు తన యశ్వము నొసంగ ఘనతఁ జెఱిచి

తే. గీ. కానియె నీ నల్వురును మఱికొంతమంది
దక్క మాయందు ద్వేషంబుదగులుజనులు
లేరట నియోగులందు నివ్వారికతన
వృథగ నెందఱకో చెడ్డపేరువచ్చె.

మ. జననీ! కొప్రపువారిపక్ష మది నీచంబో, ఘనంబో కనుం
గొనుమీ! పంటనియోగి నశ్వము పయిన్ గూర్చుండఁగాఁ బెట్టి యూ
రున నేగించిరి వాద్యఘోషములతోఁ గ్రొంగ్రొత్తదీపాలతో
"ననయుల్ వీరికి బుద్ధిలే"దని పురంబాబాలమున్ గోలగాన్.

మ. శివరాముం డవధానమున్ సలిపి వాసిన్ జేర్చుడున్ వానిగౌ
రవ మొప్పన్ ఘనులట్లు చేసిరని యోర్వన్ లేక 'కొప్రంబు దా
నవధానమ్మిటు చేయఁజాల దెటు లట్లౌ నత్సకం' బంచుఁ గుం
దు వెలార్చన్ దమపాచకాధముని నెంచుం ద్రిప్పి రప్పట్టునన్.

తే. గీ. దీనిచేతనె సకలంబు తెలిపినట్టి
దయ్యెఁ బ్రాజ్ఞుల కిఁకనన్య మనవసరము;
ఐన నాయాయి సందర్భమంతొ యింతొ
తెల్పకున్న దూరగులకుఁ దెలియు టెట్లు?

చ. "వికటట" లో ప్రధాన మది పట్టిగఁ దోఁచినమీఁదఁ గూడ వీ
ద్వితీయము దక్కఁ గుంటురుపురిన్ సభఁ బెట్టి చెడంగఁ జూచి "దు
ర్గతులకు నుత్సవంబనినఁ దప్పగ నుండు" నటంచు నెంచి యీ
పశుకృతి కిచ్చఁ జేసి నగుఁబాటులపాలయిరంబ! లౌకికుల్..

మ. అభిమానంబున గర్తృపూర్తితనియోగ్యాగ్రేసరాధీన మం
చు భయం బించుకలేక చెప్పఁదగు నెచ్చో హార లద్దానికై
శుభదూరంబు నసత్యముల్ శుభదమంచున్నమ్మి భాషింతు రే
రభసప్రక్రియ కేని సిద్ధపడి యారంభింతురి దుర్వ్యాహృతుల్.

క. కుకవిశ్వముపై నెక్కిన, నిక్కపు సంతోసమందు నిపుణులు కవులం
దెక్కువ తక్కువ లెంచుదు, రొకొక్క! యిదివిన్న నవ్వరొకొక్క! విబుధుల్.

క. ఇది యిటులుండఁగ రాజ, గుదరంపఁగఁ బత్రిమది యొకొండు మును పె యా
సదమతులు వ్రాసియుంచిరి, కద! తచ్చరితమ్ము వినికి గావింతు మిఁకన్.

క. ఇరువదినాలుగు దినములు, పరిపరి యోజించి తుదకుఁ బత్రిక మా కి
చ్చిరి తెచ్చి ‡ గౌరవస్థులు, మతిమూగురు; దానిఁ గాంచిమది ముదమొదవన్.

ఉ. అంతకుమున్నె పత్రిమిటులాగతమా నని విన్నవాఁడె వా
క్కాంత యనుగ్రహమ్మున నొకానొక కల్పన దోఁపఁగా "యశః
కాంత వివాహముం" గుఱిచి కట్టియ యుంచిన పద్యపుస్తకం
బెంతయుఁ బేర్మి వారు విని హెచ్చిన మోదము గాంచి రయ్యెడన్.

———

‡ (1911 సం, అక్టోబరు 20, తేదీ కృష్ణాపత్రికనుండి.)

బ్రహ్మశ్రీ తిరుపతివెంకట కవీశ్వరుల సముఖమునకు. ఈదిగువ సంతకము చేసిన వారు నమస్కరించి వ్రాయువిజ్ఞాపన:—

ఈపురమున నీమధ్య శతావధానసభ జరిగినది మొదలు దమకును గొప్పరపు సోదర కవులకును వైషమ్యము లేర్పడి ఉత్తర ప్రత్యుత్తరములు నడచినవి. మాగ్రామములో తమ తమ మధ్య వైషమ్యము లేర్పడుట మాకు మిక్కిలి శోచనీయముగానున్నది. తమరును కొప్పరపు కవీశ్వరులను మాకు గౌరవార్హులే యగుట మాగ్రామమునుండి వారలను మిమ్ములను సత్కరించి పంపుట మాకు యుక్తమనియు గౌరవమనియు దోచుచున్నది. కావున మాయుద్దేశ్యమును మీరును అంగీకరించి మీరాసభమొద లింతవరకు నొండొరులఁగూర్చి పఠించి

యాశః కన్యకాపరిణయము.

సీ. తారతమ్య మెఱింగి తరలి వచ్చెడివారు కొప్పరం బం చెఱుంగుదురు మీరు
నప్పటల్ ప్రోగంగఁ దరలి వచ్చెడివారు కొప్పరంబం చెఱుంగుదురు మీరు
గరుణతాభరముమైఁ దరలి వచ్చెడివారు కొప్పరం బం చెఱుంగుదురు మీరు
తగుబాంధవులతోడఁ దరలివచ్చెడివారు కొప్పరం బం చెఱుంగుదురు మీరు

తే. గీ. తిరుపతియొ, కన్యకాదాత; తెరువు వలి
సచ్చిచో నింత యాతిథ్యమిచ్చి, రాక
యున్నచో నప్పుడే పెండ్లి సున్నయయ్యె
నొకరువారింప నేటికో యోగ్యులార!

సీ. కలదొక్కకూఁతురు కలిగెఁ బెండిలికాకమున్నొ వసుగుగాకమున్నొ సూకపు
నాంధ్రగీర్వాణభాషాంగనాతిలకమ్మ లిగను దక్కిన్నియ నెత్తి పంచి
రీడేజె; నెందఱో యీకన్నెఁ బెండ్లాడఁగా నెంచి యత్నించి కడకు ఓని
చే నీసడింపుల నూనిపోయిరి తల నరయంగఁ దఱియమ్యెఁ బఱియయంబు

తే. గీ. లేకయే పోయె ననుకొనుపాక మెఱిఁగి
కొప్పరపువారు తరలి రాఁగోరి; దఁత
సంతసించితి; మంతనే జాఱఁదొడఁగి;
రూరకుంటిమి; తప్పేమి యోగ్యులార!

సీ. 'తల నరసిననాఁటిఁ గలయూట కామశాస్త్రవిరోధ'మని మదిఁ దలఁచిరొక్కొ!
'ఉభయభాషలు నేర్చునపిదఁ బెండ్లాడఁ గాఁదగ'మంచు లోలోనఁ దలఁకిరొక్కొ!
'పెక్కుమాటలు నేర్చు పెంకెపిల్లను గొన్న మాటదక్క'దటంచు మానిరొక్కొ!
'ఎందఱో జంకిన యీమెమ్మెలాఁడిని గొన్నఁ బరువుదక్క'దటంచుఁ బఱచిరొక్కొ!

---

నవియు లిఖించినవియు మరల్చుకొనుచు నొకరికొకరు లిఖితరూపముగ తెల్పు కొని యెప్పటి స్నేహభావ మవలంబించిన మేము మిక్కిలి సంతసించెదము. మావిజ్ఞాపన నాదరించి మీవైషమ్యకారణములను మరచి మాకు సంతసము కూర్పుదురని నమ్ముచున్నాము.

గుంటూరు.
4-9-11

చిత్తగించవలెను,
ఇట్లు తమ విధేయులు.

యేకా రామయ్య, జి. రామనాథయ్య, వంకిపురం కృష్ణమాచార్యులు వ్యాపతి హనుమంతరావు, కొండ వెంకటప్పయ్య.

సీ. గోదావరీనదీకూలమ్మునకుఁ గొంపకాటి కూపమ్ముతో వైరమేల?
ఆమ్రాదితరుజాల మలరు తోఁటలకు గోఁగాకుభూములమీఁదఁగాకయేల?
ఎచటఁజూచిన నిక్షులే పొల్చుపొలములకేలయ్య జొన్నపొలాల చెలిమి?
తిరుపతి వేంకటేశ్వరున కింకొలమ్ము జాతరమీఁది విశ్వాసమేమి?

గీ॥ ఇంతకును గ్రామనిర్వహ దెవ్వరో యె
టుంగుమును మీఱ; తెనరిస్వరూపమెట్టి
దో యెఱుంగుద; ఱరక యేదోవిధమున
మమ్ము నెపపెట్టనేల? యోమాన్యులార!

— — —

చ. పదపడి కొన్ని పద్దెములు పత్రికలోఁ * బ్రకటించి సంశయా
స్పదులగు లోకులందనిపి ప్రాజ్ఞుల, సంధికిఁగొల్పు యోగ్యులన్
ముదమున మంచి యచ్చటనె మోదమెలర్పఁ గవిత్వగోష్ఠి పెం
పొదవఁగనుంటి మీ పయి కథోదయముల్ వినుమంబ! శర్మమై.

---

(* 1911 సం, అక్టోబరు 20, 28 తేదీ కృష్ణాపత్రికనుండి.)

పై సంతకము లొనర్చినవారికి నమస్కారపూర్వకముగా మాయొనర్చు కొను వినయపూర్వక పద్యమయ విజ్ఞాపనము:—

ఆర్యులారా! 4-9-11 తేదీగల తమ పత్రిక 28-9-11 వ తేదీ సాయంకాలము సుమారు 5-30గంటలవేళ మ॥ రా॥ రా॥ కొండ వెంకటప్పయ్యపంతులు గారు బి. ఏ; బి యల్; గొల్లపూడి రామనాథయ్యగారు బి. ఏ; బి. యల్; గోవిందరాజు శ్రీనివాసరావు పంతులుగారు బి. ఏ; బి. యల్; అను నీ పెద్ద మనుష్యులవలన మాకు నంది యపారానందము నొనర్చినది. దానిపైఁ గొన్ని పద్యములు భగవతి తోఁపింపఁగా నయ్యవి యన్నియును దమసన్నిధి కంపికొనవలఁచితిమి గాని గ్రంథవిస్తరభీతియును విలువగల తమకాలమునకు లేనిపోనిపని గల్పించినవారమగుదుమేమో యను సందియమును వెనుకంజవేయించుటచే నందలి దశాంశమును మాత్రముఁ బంపికొనుచున్నారము. వ్రాసి పంపినచోఁ దమకు మాత్రమే యుందలి మంచిచెడ్డలు బోధపడునుగాని యావదాంధ్రలోకమునకును బోధపడవని పత్రికాముఖమునఁ బ్రకటించికొంటిమి. ఇందుఁగలతప్పులనుమన్నింపవేఁడుకొనుచున్నారము.

(తిరుపతి వేంకటేశ్వరులు)

సీ. అనవసరమ్ముగా నాసనమ్మునుఁ గోరి యవధానవిఘ్నమ్ము నాచరించు
'మదియయుక్త' మటంచు నగ్రాసనాధిపుఁ డనిన పిమ్మటఁ గూడఁ బెనఁగఁబోము
పెనఁగియుఁ దుదకది గొనలేక సభవీడి యవలి కేగి యసూయ నందఁబోము
అందియు నాటకాభ్యంతరమ్మున నుండునప్పుడు పద్యమ్ము లంపఁబోము

గీ. ఎఱుఁగకే మీసములఁ బట్టి యెట్లొ వ్రేలఁ
బడము, తుందుడుకందము, పలికినట్టి
పలుకు మూఁడులోకమ్ముల నిలిపికొనఁగఁ
జాలుదుము పండితులయొద్ద సరసులార!

సీ. ఒకని పెండిలిలో మఱొక్కఁడా పల్లకీ నిఱుకనుంకించు టెంతేనిఁ దప్పు
ఎఱుఁగక యత్నించిరే యందమాపైనిఁ దెలిసియుఁ బెనఁగు టెంతేనిఁ దప్పు
అధ్యక్షుఁ "డిది కూడ"దంచుఁ జెప్పినమీఁద నేని యాగమి మఱెంతేనిఁ దప్పు
అక్షరతత్త్వంబు నరయ కాపై భీతి దీతి కాల్ద్రవ్వు టెంతేనిఁ దప్పు

తే. గీ. "మీసముల" పద్య తాత్పర్యవాసన యిసు
మంత తెలియక వ్రేలాడు టెంతయేని
దప్పు; "తప్పని" నేఁ జెప్పటొప్పుగాదు,
పండితులచేతఁ జెప్పింపవలయుఁ జుండు.

సీ తిరుపతి వేంకటేశ్వరులతక్కువయును గొప్పరంబున వారి గొప్పఁదనము
ఆంధ్ర గీర్వాణభాషోపరత్వము గ్రామ్యభాషావధూటీపరిభావగరిమ
సనియమాశుకవిత్వమునఁ గల్గు లోపం బనియమాశుకవననిర్ణిద్రమహిమ
అవ్యాజరచనాపహాస్యత్వమును బూర్వసంచితపఠనపరిశ్తతయును.

గీ. సభ యొనర్చినపైఁ గదా! సహృదయహృద
యావగతమగుఁ, గాల్ద్రవ్వు టలఁతి వారు
సేయఁదగు కార్యమా! యెంత చేవయేని
నుండియే తీరవలెఁ జొండి యోగ్యులార!

సీ. ఊరూర నూరేగు నుత్తరప్రత్యుత్తరముల కేలాగు నాశము ఘటిల్లు?
నొప్పుతప్పుగఁ, దప్పునొప్పుగా లిఖియించు "సత్యవాదుల" వ్రాఁతసమయు టెట్లు?
ఇహపరమ్ము లెఱుంగకే ప్రవర్తించు "యథార్థవాదుల" ధార్ష్ట్యమడఁగు టెట్లు?
తిరుపతికన్నఁ గొప్పర మెక్కుడనెడి యీపాటిబండలఁ గోల దాఁటు టెట్లు?

తే. గీ. ఊరనే స్నేహమునుగూర్పఁ గోరినారు
మీ రమాయకు, లివియన్ని యేరికతనఁ
గల్గెనో నుంత యోజింపఁగా భవద్ఘ
నత్వము నుతింతు మింక విజ్ఞానులార!

సీ. అక్కటా! కవులకు నపయశంబబ్బెఁగా! యనెడి మీ హృదయంబు నరసినాము
అది యాసనప్రసంగాధీనమనెడి మీ యాశయం బాసాంత మరసినాము
ఆపరిశంసను దెచ్చు సమలాత్ము లెవ్వరో యామూలముగ మున్నె యరసినాము
ఈసఖ్యమొనఁగూర్చి యింటుమూలమున వారనఘాత్ములగుపూనిక్కి నరసినాము

గీ. ఆపులించినఁ బ్రేవుల నరయఁగలరు
కవులు రవియెఱుఁగనిచోట్లు గాంచఁగలరు
కొప్పరపు సోదరులె యెఱుఁగుదురు సకల
మక్కటా! యాసనం బెంత చిక్కు దెచ్చె!

సీ. "ఒడలెఱుంగని సివమున్నదే" యెందేని మాశక్తి నెఱుఁగమే మాన్యులార!
ఈఁతకు మించు లోఁతెందేనిఁ గలదె? కానిండయ్య యొకసారి నిండుసభను
వైదికత్వమున కేవం జేటి కట్లొ మీసాలు దీయుంపుఁడీ సరసులార!
విద్వద్వినోదముల్ వినుటగ్రామమున కేయపయశమ్మునుగూర్ప వరయుఁడనఘు

తే. గీ. లార! సత్యవాదులును, యథార్థవాదు
లిప్పరమ్మునఁ బుట్టు టెంతేనిఁ దప్పు
గాని, విద్యలలో నేరు ఘనులొ, యెఱుఁగు
పూనికలు తప్పగానయ్య పూజ్యులార!

సీ. "కాశికృష్ణబుధుఁడు కరమందు లిఖియించి సన్నఁ జేసిన" దెంత సత్యమయ్య!
"అభిమానమున మమ్ము నర్చించిరే కాని శుద్ధమూర్ఖులె"యంట సూనృతంబె?
"రామకృష్ణులఁబట్టి రహిఁ దిట్టినా"రన్న వ్రాఁత యెంతటి సత్యవంతమయ్య!
"వలుబది మందికే సలిపి రివ్వా" రని పెక్కిరించుట యేటి ఫక్కియయ్య!

తే. గీ. తమ రెఱుంగని దింటు లేశమును లేదు
ఆసనమె తెచ్చిపెట్టె నీ యనృతములను
నిజము దెల్పి యశమ్ము చే నెగడరయ్య!
వలదు జంపింక గుంటూరు వాసులార!

సీ. "కృష్ణలో" వ్రాత నిద్దేని మీరొకసారి పరికింపుడీ హితవాదులార!
"దేశమాత" యొనర్చు దివ్యోపదేశమ్ము లరయుఁడీ యొకసారి యార్యులార!
"ఆంధ్రకేసరి" లోని యంశమ్ము లొకపరి చూడుఁడీ యిద్దేని శుద్ధులార!
తక్కు పత్రికల యథార్థంపు వ్రాఁత లింకేనిఁ జూడుఁడి మహాజ్ఞానులార!

గీ. సభను జరిగినయట్టి వాస్తవ మదెట్టి?
యెట్లు వ్రాయుచున్నారొ, యెఱిఁగి శాంతి
చేయుఁ; డీ వ్రాఁత పోర్లికిఁ జెడ్డ యశము
గూర్చు నిజ మెట్లొ పైకి రానేర్చునేని.

సీ. వేనవేల్ సత్యవిజ్ఞాను లుండియుఁ జెడ్డకీర్తిఁ గొనునె గుంటూరుపురము?
సభ నున్న మీవంటి సరసులకన్న నాకాశంపు సూర్యుఁడా కర్మసాక్షి?
పంచభూతముల మా పాండిత్య తత్త్వంబుఁ జెప్పఁగా నప్పగించెదరె పౌరు?
లెవ్వరో యొకరిద్దఱే హేతువై పురమ్మున కప్రతిష్ఠ రాఁబోలునయ్య?

గీ. 'రజకువాక్యమ్ములను వినరాదు' లౌట
యుచితమయ్య! మీవంటి యోగ్యులకు సకల
మెఱిఁగినందుకు ఫలమేమి? యిట్టిపట్టు
నం దుదాసీనులగు టెంత యర్హమయ్య?

సీ. "ఆసనం బొప్పలే" దని కోపగింతురా? యది గొరుకే పెద్ద యనుచితంబు
"అనుచితం బనుట కేయాధార"మందురా! కొ వ్రంపుకవిదాఁచికొను కెసుంకు
"అనుచితంబగుకోర్కె కెను లెట్లు కోరువా"రందురా! అది ప్రమాదాతిశయము
"మఱి ప్రాజ్ఞులకును బ్రమాదమా"యందురా! ♦ వారికే యంచు నిర్ధారణంబు

గీ. చేసి వ్రాసిరి వ్యాఖ్యాతృశేఖరులు, ప్ర
మాదములు విశ్వసింపమి మాకుఁ దప్పె?
అంతమాత్రిన గంతుల కనుమతింతె,
సోదరులు చెప్పుఁడయ్య! యో నూరులార!

సీ. ఉచితమో యనుచితంబో చేయుపండితుం డరయఁగావలె భవిష్యత్ప్రశంస
అని * భర్తృహరి చెప్పనైనఁ జూడక యేరి ప్రేరణమ్మున నొదుర్వారులగుచుఁ

---

♦ శ్లో॥ ప్రమాదోధీమతామ" పీత్యత్ర, అపిశబ్దఏవకారార్థక ఇత్యభియుక్తాః.
* శ్లో॥ ఉచితమనుచితంవా కుర్వతా కార్యజాలం, పరిణతిరవధార్యా యత్నతః
పండితేన. (భర్తృహరి చూ.)

గాల్ పృథ్వి యెన్ని యోగాలుల ప్రకటించి తలకుఁడగని ప్రయత్నములొనర్చి
". పండితసభ" యన్న పైఁ గొంత శాంతించి సంస్తబింక మొకింత క్రాంతయందుఁ

గీ. జూపి, ప్రాజ్ఞుల సమ్మతి పాపకార్య
మనుచు మము వెక్కిరించిన యట్టివారి
సఖ్య మది మాకు లేకున్నఁ జచ్చిపోము,
వృథగ నెపవెట్టకుండు సుప్రథితులార!

సీ. 'ఓంశాంతి' యనెదు మీ యోగ్యత జేనోళ్ళ శ్లాఘింపవలెఁ జూండుసరసులార!
ఈయూహ మీకప్పుడే పుట్టెనేని మీసభలమీఁదికి వారు చనరుసుండు
అంతకొక్కింతపైనైనఁ బుట్టిన వారు "పంచమగ్రహములు" వెర్రొకానరుసుండు
సకలమ్ము జరుగుపై శాంతిఁ జెప్పుటకన్న నన్యాయ ముండునయ్యా! మహాత్ము

తే. గీ. లార! విద్వత్తలోఁపన్న నన్యవిషయ
మందుఁ గొప్పింపువారి సంఖ్యంబు మాకు
సమ్మతము; దానిలోఁగూడ సమ్మతింపు
మేని భారతి మమ్మింక నీసడించు.

సీ. చోరపమై నెదిరించి సొఱకాయకోఁతలు కోసినారు కటార్లు దూసినారు
'అవధానమందు మిమ్మతిశయించెద' మంచు వ్రాసినారు సవాళ్లు చేసినారు
మీఁది మీఁదికివచ్చి మీసాలపైఁ జేయివేసినా ర్చేదుగుడుల్ గూసినారు
మసిపూసి యెట్టులో మాకేమకాయఁగాఁ జేసినా రమ్మె మ్మెడఁ బాసినారు

తే. గీ. పెనఁగి మా మీసమింతేనిఁ బీకకుండ
నెదిరియవధానమున మమ్ముఁ గదుమకుండ
నేటి సఖ్యంబు మాకు? మీ కేటిభరము?
సభను సమకూర్పుఁడయ్య! యశస్వులార!

సీ. బందరేమయ్యెనో? "ప్రెస్సు" లేమయ్యెనో, పుస్తకాలేమయిపోయెనొక్కొ?
అచ్చేమి యయ్యెనో, ఆస్తి యేమయ్యెనో, పర్తకం బేమి కావలసెనొక్కొ?
'మఠ్కా' లేమియయ్యెనో, బాలురేమయిరొకో, యుద్యోగమేమూలనుండెనొక్కొ?
ఇల్లేమి యయ్యెనో! యితరమేమయ్యెనో, మిత్రవర్గంబు లేమి యయిరొక్కొ?

తే. గీ. వచ్చినది రాక యయ్యె, నీపాటికేము
సెలవు గైకొనుచున్నాము, స్నేహభావ
ముంచి పంపింపుఁడయ్య! యేముండె!
'పడ్డ గింజలో బియ్యపుగింజ' చేస్తులార!

సీ. శ్రావణమాసానఁ జనుదెంచితిమి భాద్రపదమాశ్వయుజము నిప్పట్టణమునఁ
బూర్తిగాఁ గడచె నిప్పుడు కార్తికము వచ్చె నిప్పటికేని మాకింటి కేగు
నిచ్చ పుట్టుట లేద, యిదియెల్ల సీమవారియాదృతియు నుదారమైన
మీమైత్రియును గాదు *మీసాలమహిమయుఁ గొప్పరింపువారిమిక్కుటపుఁ బేర్మి

---

☞ మద్రాసులో బి. యే. (B. A. Honours) చదువుచున్న శ్రీవారణాసి శ్రీనివాసరావుగారు తత్కాలమం దంపిన 200 పద్యములనుండి కొన్ని

* మ. తలమీఁదన్ దలపోసి యీసుగొని గద్వాలాత్మకూర్పార్థివేం, ద్రులసంస్థానములందుఁ బండితులు నిన్నున్ దీయయత్నింప ను, జ్జ్వలవాగ్వాహిని గొట్టివేసితివి ప్రాంచత్పాండితీ వైఖరిన్, బళిరా! మీసమ! నీకునీవసరి త్రిప్పన్ గల్గురా నిన్నిఁకన్. సీ. ఏన్గుల నెక్కించి పృథ్వీపతులు గొల్వ నిక్కింపఁ జేసితి నీవకావె, వాదింపఁగా వచ్చువారి వాదంబుల నీఱుగావించితి నీవకావె, వర్ణాశనస్థితిఁ బడయగాదగు రాచనెమ్మి నుద్రేకింతు నీవకావె, మాన్యంబు లిప్పించు మార్గంబుచూపించి నేస్తంబుఁ జాటుదు నీవకావె, గీ. మీసమా! గాఢ గౌరవావాసమైతి, వెంతఁజేసితి మున్ ముందిఁ కెంతఁజేయఁ, జాలనెప్పుడుఁ గడుఁ బెంచఁజాలియుందు, త్రిప్పఁద్రిప్పంగ నినుఁజెప్పి చెప్పవలయు. క. కాసర కూసర నడి సం, తోసిల్లఁగ నాసు కయితతో సాగెడి నీ, వీసపుకైసరు లేసరి, మీసమ! నినుఁ దీయఁ గలుగు మేధాగతికిన్. సీ. అలబృహద్రథు శక్తి దరియనప్పుడ నీళ్లుమ్రింగిన వివ్వచ్చు మీసమెంత? దుర్యోధనుని గూల్పఁ దోడుగా గృష్ణుఁడు మిణ్కిన వలలాంకు మీసమెంత? వాలినివధియింప నంచనాప్రత్తిపై 'మెమ్మె'యనిన రాము మీసమెంత? ఇంద్రజిత్తునికీలు నెఱిఁగి తుంచుచు దూడనేసిన సౌమిత్రి మీసమెంత? గీ॥ నీవ మీసంబ వీవహి నీవ 'కుంఠి తంబు, నాఁగలపల్కు నెత్తటినెఱుంగ, నప్పుడ సమానవిక్రమంబే వహించి జయము గొంటివి జగతిమీసంపు ఱేఁడ. చ॥ అలఘుకవిత్వకీర్తిఁ గొననందఱకున్ వశమౌనె? మించునె, త్తుల గమకింప నందఱకుఁదోఁచునె? తోఁచిన జీలుగెత్తు గావలయదె? మేకుమాటమలుపించదె? పెంచదె గీరతంబు; నీ, వలుగకు సంస్కృతాంధ్రకవితైక మహత్త్వమ, చాలు మీసమా! మ॥ సుమనిర్యన్మకరందగంధకవితాశుద్ధాంతభృంగీరవో, పమభక్తప్రతిపత్తితో వెలయుచున్ బాండిత్యగంధానిలంబమలంబై తెమలంగ లోకజనసమ్మాన్యక్రియం బొల్తువో కమనీయప్రతిభావిలాసమ! నమస్కారం బిదే మీసమా! (18)...

తే. గీ. యనుజుఁడీ! లేకయున్న మేమొకటెవంత
కాలముండుటెప్పట్టునఁ గల్గుటెట్లు?
తక్కిన ప్రసంగములు మి ద్దైవకల్పు
తమ్ము, లాజ్ఞయొసంగుఁడీ ధన్యులార!

సీ. స్త్రీడర్లమా? కాము, బీ యేలమా? కాము, ధనికులమా? కాము ధన్యులార!
అర్థులమా? కాము, వ్యర్థులమా? కాము, ప్రభువులమా? కాము, పరికీర్తులార!
దీనులమా? కాము, మానులమా? కాము, మానులమా? కాము, మాన్యులార!
క్రుద్ధులమా? కాము, బద్ధులమా? కాము, వృద్ధులమా? కాము, వేత్తలార!

గీ. కవుల, మిప్పటి 'రూల్సు'కుఁ గట్టఁబడము,
ఘనులు * పండితరాయాదికవులు చూపు
త్రోవఁ బట్టిపోదుము, దేవుడైన
లక్ష్యపెట్టము † మాకు వల్లభులు లేరు.

సీ. తిరుపతివేంకటేశ్వరుల పేరులు మీకు జ్ఞప్తిలో నిల్పు నాసనపుఁజర్చ
అల్ల కొప్పరపు సోదరుల పేరులుమీకు జ్ఞప్తిలో నిల్పు నాసనపుఁజర్చ
విశ్వత్క వీంద్ర సంవిద్విలాసము మీకు జ్ఞప్తిలోనిల్పు నాసనపుఁ జర్చ
కవుల కవుల యకించనత్వము మీకు జ్ఞప్తిలోనిల్పు నాసనపుఁ జర్చ

తే. గీ. మేటి యాసన చర్చకు, మీకు,సత్య
వాదులకు, మాకును "యథార్థవాదుల" కును
మఱియును నామీసములకుఁ, గొప్పరపు సోద
రులకు దీర్ఘాయువిడి నల్వ ప్రోచుఁగాక!

సీ. కాళిదాసునిమార్గ గరిమంబు నెఱిఁగినవారంచు మిమ్మెంతు ధీరులార!
భవభూతి యను మహాకవిమార్గ మెఱిఁగినవారంచు నిమ్మెంతు ధీరులార!
పండితరాయలపండితన మెఱుంగువారంచు మిమ్మెంతు ధీరులార!
ఆంధ్రకవీంద్రనిరాఘాటత నెఱుంగువా రంచు మిమ్మెంతు ధీరులార!

తే గీ. పల్కనేపల్కఁ దెప్పట్లఁ బండితుండు
పల్కినా, నిల్పునేగాని భయము గొనఁడు

---

* శ్లో॥ మనస్వీ మ్రియతేకామం కార్పణ్యం నతుగచ్ఛతి।
అపి నిర్వాణ మాయాతి నానలో యాతి శీతతామ్.

‡ నిరంకుశాః కవయః

ఇదియె స్వాతంత్ర్య వీరుల కింపునింపు
పర్వము, మీరెఱుంగరే మహితులార!

సీ. మా కపకీర్తి సంపాదింపఁగా నెంచి దేశమాతకు దూఱు దెచ్చినారు
మా కప్రతిష్ఠ సంపాదింప నెంచి కృష్ణను నప్రతిష్ఠచే నడిపినారు
మాకు దుష్కీర్తి సంపాదింప నెంచి కేసరిని దుష్కీర్తి పాల్పఱచినారు
మాకు దుర్యశము సంపాదింప నెంచి యాంధ్రపుఁ బత్రికను నదిలార్చినారు

గీ. ఎందఱో 'యథార్థవాదు' లిం కెంచ లేని
సత్యవాదు లీప్సారమున జననమంది
నారు, శివరామశాస్త్రి యీనాఁటికి శివ
రాముఁ డయ్యె; మాకేల కోపగింపుఁ జెలిమి?

సీ. సఖ్యపఱచి మమ్ము సాగనంపుటకు మీ చేయు యత్నము గడు శ్రేష్ఠమయ్యె!
సాగనంపకమున్నె చనువార మేకాని చుట్టుపట్టుల నుండు సూరివరులు
సభలు చేయుటఁ జేసి చనకిందు నిల్చితి మంతియే కాని సభాంతరమున
కింకను సోదరు లేతెంతు రని కాదు; గాయత్రి సాక్షి నిక్క మ్మెఱుఁగుఁడు

తే. వారి సేమంబు గోరినవారు గాన
సంశయించుచు నున్నారు; సకల మెఱిఁగి
నట్టి మా కడ డాఁచ నేలయ్య! వారి
వదలి చిరకాలమయ్యె సహృదయులార.

సీ. వ్రాసి యుండంటిరే? వారితోఁ బోరాట మానికొంటి మటంచు మాన్యులార!
వ్రాఁత వ్రాసిన యంత నే తప్పిపోవునే! కాల్ద్రివ్వువారి బింకంపుఁ గంపు
కాల్ద్రివ్వ పెట్టినో గనుఁగొన్న పైఁ గాని నిదురఁ బట్టదు మాకు నిక్కమయ్య!
యీ యూరఁ గాకున్న నే యూర నైన మీ సమ్ముఁ బీఁకుట చూచి సఖ్య మంతఁ

గీ. జేసి [illegible], [illegible] మాఁద నీసు గొనకుఁ
డనఘులార! దెబ్బను దినినట్టి పులికి
నోరు పెటులబ్బు మీరెన్ని యోర్పు మంత్ర
ములను బఠియింతురేనియు నలఘులార!

సీ. పుట్టుపుట్టునఁ జిట్టుబుట్టు లచ్చొత్తించి పట్టణంబునఁ బంచిపెట్టునాఁడు
"కాంపిటీషను" నటం చెకాయెకీ నరుదెంచు పరిజల కోరిక భంగపఱచునాఁడు

అక్షరతత్త్వ మావం తెఱుంగక మీస లొగిఁ బట్టి యయ్యేల లూఁగునాఁడు
ఎఱుఁగని వ్రాఁత లేవేనియోఁగిలుక్కుచుఁ 'గుచమర్దనములు' పేర్కొనెడునాఁడు

గీ. మీర లేమైతిరొక్కొ! యుక్కుమాలి జేయి
కాలుమీఁద నాకులకు యత్నా లివేల?
"యద్భవతి తద్భవత్యేవ" యనెడిమాట
తెలిఁగి వర్తింపుఁడయ్యా! యింకేటి సంధ?

సీ. సత్యవాదియొకరొ 'జంట్లిమన్' పదనామమ్యుఁ డేయంట యానూరి నెఱుఁగుఁడయ్యా!
అతని జ్యేష్ఠభ్రాత యగు "యథార్థవాది" కూడ నట్టిఁడె యంట చూడరయ్యా!
ఈ యవతారమ్ము లెత్తువారల రసనాంచలమ్ములకు భర్మాంచితములు
భూషణమ్ములు దెచ్చి పొల్పుగా నర్పించి వాసిమై నూరేగఁ జేసి పిదప

గీ. సోదరులకును మాకును వాదుతీర్పఁ
బూనుఁడయ్య! తరతమత్వములను బట్టి
'మార్కుల' నొసంగుఁడయ్యా! మీ మతివిశేష
మెల్ల విద్వాంసులును మెచ్చ నెసఁగుఁడయ్యా!

సీ. "కుక్కతోఁకను బట్టి గోదావరీఁదువా" తిరుపతి వేంకటేశ్వరులుకారు
"వేడినీళ్లనె యిండ్లు వెలిఁగింపఁ బూనువా" తిరుపతి వేంకటేశ్వరులుకారు
"గానమ్ముచేఁ జింతకాయలు రాల్చువా" తిరుపతి వేంకటేశ్వరులుకారు
"కంజాప్త ధూళిచేఁ గప్ప నెంచెడివారు" తిరుపతి వేంకటేశ్వరులుకారు

గీ. పైకి గాఁకున్న నెవ్వరి పైకిఁగూడఁ
జనరు తిరుపతి వేంకటేశ్వరులు; వారి
భారతీతత్త్వమును జూచి వారివీరి
తారతమ్య మెఱుంగుట తగదె మీకు?

సీ. పిలువని పేరంటముల నొసర్పుడు; గౌరవార్హుల నవమానమంద నీరు;
ధూర్తుల సైఁపరు; ధూర్జటియైనను దగవుమాలినచోట దగవుపెట్టి
తీరుదు; రూరక యేఁకిని గదలింప; రెవరేనిఁ గడపిన "నితఁడు తగఁడు
మనతోడఁ బోర" నం చనుకోకయవ్వాని నెదిరించి తమకున్న కదనశక్తి

గీ. అంతయో యింతయో యర్హులైన పండి
తులు పొనర్చెడిసభలోన నిలిపికొనఁగఁ

బూనుదురు; పక్షపాతుల పూనికలను
వినరు; తా మెఱింగినయట్టివిషయమె యిది.

సీ. 'సత్యవాది' పదంబు చండాలమయ్యె నద్దానియాపదదీర్చఁదలఁపుఁడయ్య
ఆ దురాపదయె 'యథార్థవాది' పదంబు గనియెఁ దద్దుఃఖంబు కడపరయ్య
శాస్త్రీయమైనట్టి సరసాశు కవిత ధిక్కృతయయ్యె గెలుపోడు లెఱుఁగుఁడయ్య
పదియాఱుకళల యవ్వానితో రిక్కల నెనఁజేయుపూనికల్ గొనకుఁడయ్య

గీ. కీర్తికాములరై కవిత్వార్తిఁ బాపి
పక్షపాతులవాగ్రీతల వలనఁ గలుగు
దేశఘోషంబు నడిపి యుద్దీర్ణగరిమ
వఱలఁజెలువారుఁడయ్య! ధీవరులు మెచ్చ.

సీ. లేదు శాస్త్రజ్ఞత, లేదు కావ్యజ్ఞత, సంస్కృతజ్ఞానలేశమును లేద,
శబ్దమంజరిఁ గూడఁ జదువంగలేదయ్యె; నదియట్టులుంచుఁడింకాంధ్రమందు
లేదు వ్యాకరణంబు, లేదు పాండిత్యంబు, లేదు సారజ్ఞత, లేదు శిష్య
లకు భారతాదుల నొకపద్యమేని పాఠముఁ జెప్ప శక్తినిక్కముగ నేరి

గీ. కట్టియయ్యలు మమ్మాంధ్రమందు నెట్టి
మీసములుపీఁకుటకు నెట్లుమీసములు మ
హాత్మ లొప్పుదురో? తెలియంగవలయు
సభను సమకూర్చుఁడయ్య! యశస్సులార!

సీ. తాఁ జెప్పినట్టి పద్యమునకే నర్థమ్ము చక్కఁగాఁ జెప్పినఁ జాలుఁజుండు
తా నుచ్చరించు పదములకే నర్థంబు చక్కఁగాఁ జెప్పినఁ జాలుఁ జుండు*
కవనంబనఁగ నేమొ కవు లన్న సభలోనఁ జక్కఁగాఁజెప్పినఁ జాలుఁజుండు
పద్యమ్ములటులుంచి గద్యమేయనుకొండు చక్కఁగాఁ జెప్పినఁ జాలుఁజుండు

గీ. ఆంధ్రమంతయు నల్ల దచ్చాంధ్రమైనఁ
జక్కఁగ నుపన్యసించినఁ జాలుఁజుంను;
మేముపదలెద మూరకే మీసముల మ
టంచు మీసముఁ దలపెట్టు టర్హమగునె?

సీ. మచ్ఛిష్యుల నటుంచి తచ్ఛిష్యులకుఁ గూడ శుశ్రూష జేసి నేర్చుకొనఁదగిన
పాటిపాండితి లేనివారు మామీఁదికి వచ్చి కాఱులు వ్రాసి హెచ్చుతగ్గ

తెలుఁగక మీసాల నెత్తి పీఁకెద మన్న మాట కేమర్థంబు మాన్యులార!
శాఖాభిమానపిశాచంబు నైదుష్య మీనేర్చునయ్య యహీనులార!

గీ. తగినమందులు పక్షవాతమ్మునకు ల
భించుఁ బక్షపాతమునకు లభింపఁ బోవు;
"కొఱవిఁబెట్టి నెత్తినిగోఁకికొనియు" నిప్పు
డేటి రాజీలు మావారి కెఱుఁగఁజెప్పఁడి!

సీ. ఆంధ్రమ్మునందేని యష్టావధానంపు నామ మెత్తఁగ వీరి కేమిహక్కు?
శతవధాన మ్మనుశబ్దంబు నెత్తంగ వీరిదే యూరయ్య వేత్తలార?
నేత్రావధానమ్ము నిగమజ్ఞులదికదా! దానిపే ర్వీర లెత్తఁ దగునయ్య?
నిజమైన శక్తియుండినఁ "బండితులుగల్గు సభ" యన్నయంత నే జాఱుటేటి

గీ. కయ్య? వారుమమ్మెదిరించు టాశుకవిత
యంద యుక్త మామాత్రమేయైన మేము
విశ్వసింపకయున్నను విశ్వమెల్ల
సమ్మతించుట కొంతేని సంభవించు.

సీ. "ఆశుకవిత్వమ్ము నందేని మీ రేల విశ్వసింప" రటంచు వేయుప్రశ్న
కుత్తరమ్మాలింపుఁ, డూరకే యెట్లెట్లొ "బడబడ" వాఁగునప్పట్టునందు
నేరేనిఁ జాలుదు; రేమానవులొ దాని మెచ్చిన నామెచ్చు మెచ్చు గాదు;
పండితులగువారు "పకపక" నవ్వుదు రవ్వారు నవ్విన యాశుకవిత

గీ. అందు వేరొక్కనామంబు; నట్టిదాని
కెన్నఁడేకొను "నిహిహిహీ! యిహిహి, యిహిహి
యిహిహి" యని పండితులు నవ్వనిట్టి పూనిక
గొనరు విద్వత్కవులు గనుంగొనుఁడు మఱియు.

సీ. కట్టుఁబాటులు గల్గు గానంబె గానమో? కట్టువీడినదియే గానమొక్కొ?
కట్టుఁబాటులు గల్గుకాంతయే కాంతయో? కట్టుదప్పినదియే కాంతయొక్కొ?
కట్టుఁబాటులు గల్గు కాయమే కాయమో? కట్టువాసినదియే కాయమొక్కొ?
కట్టుఁబాటులు గల్గుకవనమే కవనమో? కట్టూడ్చికొన్నదే కవనమొక్కొ?

గీ. మీమనమెఱుంగదే? మేరమీఱి మంచి
చెడ్డ లరయక యెన్నియో చెట్టలఱచు

వారినేరంబు సైఁచుట పాడిగాదు
కూక లిడుఁడయ్య! సత్కీర్తిఁ గోరుఁడయ్య!

సీ. సంస్కృత గ్రంథవాసనయె లేకున్నచోఁ దెలుఁగుగాదది పెద్దతెగులు గాని
ఆంధ్రరహస్యవైయాత్యమే లేనిచోఁ దెలుఁగు గాదది యొక్కయెలుఁగు గాని
శబ్దశాస్త్రప్రవేశము సుంత లేనిచోఁ దెలుఁగు గాదది మేనినలుఁగు గాని
నాటకాలంకారనైపుణుల్ లేనిచోఁ దెలుఁగుగాదది చెడ్డపలుగు గాని

గీ. ఈరహస్యంబు నెఱుఁగనివారె మీరు?
తెల్గులోనేని వీర లెవర్చి యేమి
సేతు రనుకొంటిరో? సుంత చెప్పుఁడయ్య!
సంధిసంగతికేమి యోసరసులార!

సీ. ఏపండితుఁడువచ్చి యివ్వారితో మమ్ముఁ దులఁదూఁచి తనకీర్తి నిలిపికొనునొ?
ఏకవీంద్రుఁడువచ్చి యివ్వారితో మమ్ము సరిఁజేసి సద్యశశ్శాలి యగునొ?
ఏజమీందార్వచ్చి యివ్వారితో మమ్ము సెనఁజేసితా వన్నెకెక్కఁగలఁడొ?
ఏదైవతము వచ్చి యివ్వారితో మమ్ముఁ బుడుడించి దీప్తినిల్పుకొనఁగలఁడొ?

గీ. చూచియేతీరుసుము; మీఁదఁ జూడవచ్చు
సంధిసంగతు; లెట్లేని సభయొనర్పఁ
గడఁగుఁడయ్య! వేరొక గతి గాంచఁబోకుఁ,
డయ్య! వేత్తల రప్పింపుఁడయ్య! యొయ్య.

సీ. చెప్పింపుఁడయ్య! దేశికునొక్కరునిబిల్చి చదువుసందెలు మన శర్మకింకఁ
జేయింపుఁడయ్య! యీప్రాయమందుననె శుశ్రూష కావ్యజ్ఞు నిచ్చోట నిల్పి
మాన్పింపుఁడయ్య! "డమాడమాడమడమల్" "ప్రాజ్ఞులీపోకలొప్ప" రని చెప్పి
బోధింపుఁడయ్య "యీబుడబుడక్కలకాశుకవితా ప్రశస్తిదక్క" దనినొక్కి

గీ. మీకు యశమబ్బు, వారికి మేలుగల్గు,
మమ్మెదిర్చినపనికి లాభమ్ము వెంట
నే కనంబడు, మాకెంతయేని మోద
మబ్బు; సంధియు నామీఁద ననుఘటించు.

సీ. వైదికలౌకికవైషమ్య మెవ్వారు తెచ్చిపెట్టిరొ? సుంత తెలియుఁడయ్య!
ఆత్మగౌరవమునకై పాటుపడువారె దీనిఁబెట్టుదురు సందేహ మేల?

తగుగౌరవంబు విద్వత్తకుండును గాని యన్యమ్మునకు నుండ దనుట ధ్రువము
గానఁ "దదన్య లీకక్షకుఁ గాదను" టని యెవ్వరేనియు ననకమాన

గీ. అకట! విప్రులు దేవాంగులట్లు, పశ్వ
తోహారులయట్లు వెఱివెఱ్ఱితోఁ బ్రాఁబోవఁ
గావలెనె? దీని మానుపఁగడఁగుఁడయ్య!
సంధి గోరుమీ కియ్యది చనుఁగదయ్య!

సీ. ఆంధ్రభారతకర్తయైన తిక్కన సోమయాజిజన్మస్థానమైన కతన
శ్రీనాథకవిరాజశేఖరు నేలినకొండవీటికిఁ బ్రక్క నుండు కతనఁ
బ్రకృతంపుఁ గవుల సంభావించు గద్వాలరాజ్యంపుఁ ద్రోవలోఁ గ్రాలు కతన
వెనుక కాలమునందు వినుతింపఁదగు పెద్ద విద్వత్కవులు దీన వెలయు కతన

గీ. నిండుకవితాదరంబు మీకిచ్చె; మెచ్చ
వలదె గుంటూరిపురిని? విద్వత్కవీంద్ర
జనని, కేవలకవితాసత్కారిణి, దీని
మహిమ మెంతేని శ్లాఘ్యంబు మాన్యులార!

సీ. నిందింపనేమయ్యె? నిజమైనసత్కీర్తి గలిగించు "సత్యవాదులు" గలారు
గర్హింపనేమయ్యె? గణుతి సల్పించుయోగ్యు లగుయథార్థ వాదులు గలారు
కయ్యాలకేమి? సత్కవికదంబముల పేర్వెలయింపఁగల నియోగులు గలారు
అభిమానమునకేమి? యాత్మీయకతన శత్రులఁ గూడ మన్చు మాన్యులుగలారు

గీ. ఏరిచే మెచ్చు గొనదు గుంటూరిపురము?
సరసతకుఁ దావు, బలువెన్నె సిరులప్రోవు;
మీకు, మీప్రోలికిని మేగవీఱుసిరుల
నిచ్చు భగవంతుఁ; డింక మమ్మేగనిండు.

సీ. ప్రేమించితిమి మున్నె పెద్దతికము నిల్పుకొన్నచోఁ వారి కేకొలఁత రాదు
వారిసేమముఁ గోరువారె "యాదవ కులమునకు ముసలము" నాసనపుఁజర్చ
కల్పించి; రదిపూర్వకవిసమ్మతము గామి మాకు నంగీకృతి లేక పోయె;
దీని నామీఁద వైదికనియోగపుఁగక్షగాఁ బొల్పి రెవ్వరో ఘనులు వారి

గీ. నెఱుఁగుఁడయ్య! 'యనవసరమిట్టికక్ష
లింపుగాఁబో' వనుచు మందలింపుఁడయ్య!

ఏరువైదికులు? నియోగులెవ్వ? రొక్క-
విప్రులే గారటయ్య! యోవేత్తలార!

సీ. ఘనుఁడు పయోపా ద్ధఖండపాండిత్యభూషణుఁడు సీతారామశాస్త్రికన్న
నుభయభాషాకవితోపాయశాలి శిష్ట్లా హనూమత్కవి శాస్త్రికన్నఁ
గృతి యభినవ సరస్వతినేత పట్టాభిశబ్దపూర్వక రామశాస్త్రికన్న
మలుకుట్లకులుఁడు నిస్తులుఁ డాశుకవి గుణశాలి వెంకటకృష్ణశాస్త్రికన్న

గీ. మఱియునుంగల శాస్త్రవిప్రములకన్న
మొలచినవె కొమ్ము లితరుల మోములందు?
నవసరము లేని యాసనం బడుగనేల?
చర్చ పెంచఁగనేల? యశస్స్వలార!

సీ. వేదవేదాంగాదివేత్త చేపలి వెంకటప్ప శాస్త్రుల కెన యన్యుఁ డగునె?
రామడుగుకులుండు ధీమన్మణియు రామకృష్ణశాస్త్రులఁ బోల నెవని వశము?
కంఠపాఠము నాటకములెల్ల శ్రీనోరి హనుమచ్ఛర్ముని కెవ్వఁ డగును దీటు?
అతిశాంతమూర్తి సాహితిపట్టు శ్రీపార్వతీశశాస్త్రికి సాటి యెందుఁ గలఁడె?

గీ. మఱియు నెందఱులేరు ధీమంతులందు?
వీరిలో నేరు కొప్పింపువారు చెప్పుఁడ?
వారికే యాసనంబును గోరనేల?
చర్చ పెంచఁగనేల? యశస్స్వలార!

సీ. కవి హూణభాషావగాహి వంకిపురవంశజుఁడు శ్రీకృష్ణమాచార్యకన్న
బలిజెపల్లి కులసంభవుఁడు కవిత్వవిస్ఫూర్తి లక్ష్మీకాంత సుకవికన్న
సకలకళానైపుణికిఁ దావు మేటి మల్లాది వెంకట సోమయాజికన్న
నాఱువేల నియోగి యనఘు జూపూడివంశజ హనూమచ్ఛర్మశాస్త్రికన్న

తే. గీ. మఱియునుంగల సత్కవిమణులకన్న,
లౌకికాగ్య్రులకన్నను లాఁతివారి
కాసనము గోరనేలయ్య? యనుచితముగఁ
జర్చ పెంచఁగ నేలయ్య? సరసులార!

సీ. శాంతి భద్రాద్రిశాస్త్రులవారి శిష్యుఁడు తచ్ఛైలి గలకైత దనరు సుకృతి
"అవధాన మేఁ గూడ నాచరించితి" నని స్వయముగాఁ జెప్పికోఁజాలు ధట్టుఁ

డొక్కశైలి నేకాక ప్రకటితంబుగఁ బలుశైలులఁ గవనమ్ము సలుపుజాణ
ఎపుడు రచించినట్లే కనుపట్టకే పలుకృతుల్ ప్రకటింపఁగల యుపాయ

గీ. శాలి, బ్రాహ్మణప్రభువు, నాచారపరుఁడు,
ప్రథిత మంత్రిప్రగడ వంశభవుఁడు శ్రీ భు
జంగరాయలకేల యాసనము నడుగ?
కొరులు వీరికి మిన్నలే? యోగ్యులార!

మ. పటుజంఝానిలఘోరణీరణరణత్ప్రాగ్భారనున్నాటవీ
తటశాఖాపటలాంతరుద్ధతనితాంతస్ఫారఘోరాగ్నిరు
ఘ్ఘుటనాధూపితభస్మసాత్కృతకురుట్కాండంబుతో వహ్నికిన్
ఘుటియింపం దలపెట్టినారు కద! సఖ్యం బార్యచూడామణుల్!

మ. స్వకృతాగఃప్రకరప్రచారనిహతాపారప్రయోధప్రజా
నికరాత్మైకశరణ్యసర్వధరణీనిర్ణేతృతాభాగ్యభా
రకృతాహంకృతితో, సుయోధనునితో భ్రాజిష్ణునిన్ ధర్మపు
త్రకునిన్ గల్పఁదలంచినారె? యిది ధర్మ్యం బెట్టు లోహో! హితుల్.

సీ. "గర్వం" బనెడి మిష గల్పించి దుఃఖంబు దీర్పకో నుంకించు ధీరుఁ డొకఁడు
"పండిత లక్షణ" ప్రస్తావ మిషచేతఁ బడదిట్టునట్టి సర్వజ్ఞుఁ డొకఁడు
"వంటబావని కుత్సవం" బంచుఁ గల్పించి రసఁ బేరుగను యశోరాముఁ డొకఁడు
"రామేశ్వరీయ" మన్నామంపు పొత్తాన బూతు లేకరు వెట్టు పుణ్యుఁ డొకఁడు

తే. గీ. మఱియు నెందఱో శాఖాభిమానులిట్లు
బయలుదేఱిరి, యింకను బయలుదేఱఁ
గలరు, కిరీతి చేకూర్పఁ గలరు సంధి
కొప్పరపువారి కేటికిఁ జెప్పుఁడయ్య!

సీ. "ఈలకూరకుఁ బోయి యిల్లటం బున్నట్టు" లయ్యో మా వర్తనం బార్యులార!
అల పాశుపతమహాస్త్రాగ్నిహోత్రజ్వాల లాఁగిపోయెను దీన ననఘులార!
కాఁకరపర్తి "శృంగంపు భంగపు" వ్రాఁత లసఁచుపూనిక దీన పడుగుఁబట్టెఁ
జర్ల నారాయణశాస్త్రి "బార్హస్పత్య" మరయు వేడుక దీన నంతరించె

గీ. గిరతము సాఁకెకుం గోరు గిరతులకు
తూహాలమ్మన కించుక దొడరె విఘ్న

మిక్కుటమ్మన, నిఁక నింటి కేఁగ నాజ్ఞ
యొసఁగుఁడయ్య! గుంటూర్పురీ యోగ్యులార!

సీ. కొప్పరపువారు మాకుఁ గనిష్ఠు లవ్వారి కరయఁగా జ్యేష్ఠుల మగుదు మేము
కొప్పరపువారు మాకు సుశిష్యు లవ్వారి కరయఁగా నొజ్జల మగుదు మేము
తత్కవిత్వంబు "సడుమ మరాటా శైలి" "మదరాసు శైలి" లయ్యె మాదు కైత
మిత్రుల నవ్వారు మెప్పింతు మేము శత్రులఁగూడ మెప్పింపఁగల మొకింత

గీ. వయసుకా? పెద్దలము మేము, వారు పిన్న;
లింతియే భేద; మింపకు నింత కలహ
మెందులకు? స్నేహితుల మైతి, మింక మీరు
శంకపడకుఁడు సెలవు నొసఁగుఁడు మాకు.

———

క. ఉరుకీర్తి నరసరాట్పుర, వరవాసుఁడు వంగనామవంశ్యుఁడు సుగుణో
ద్ధురుఁడు నరసింగరావ, ప్పురమునకున్ మమ్మును స్వయముగఁ దాఁ బిలిచెన్.

తే. గీ. అతఁడు శాఖాభిమానుల కహితమైన
పనికిఁ బూనిన కతన నప్పట్టణంపు
శాఖలోని గుణాఢ్యులు సాగకుండఁ
జేయవలె నని యత్నంబు చేసి రంబ!

ఉ. * ఆపురి కేము రేపు చనునట్టికుతూహల మూనియుండ నే
పాపియొ కాని యయ్యనఘు పజ్జకుఁ బోయి "వృథాప్రయత్న మే
లా పొనరింతు? విప్పురికి నల్లకవుల్ చనుదేరు భీతి లో
దాపర మయ్యె వారి" కని తా నొగి బొంకి కలంచె నాతనిన్.

* (నర్సరావుపేట శతావధానపీఠికనుండి.)

నా ప్రియమైన ఆర్. హనుమయ్య గారికి— శ్రీ తిరుపతివెంకటేశ్వర కవీంద్రుల నిక్కడకు దయచేసి వారి కవితానైపుణ్యమును జూప నిక్కడకు రమ్మని యాహ్వానఁజేసియుండుట మీకు తెలిసినవిషయమే కదా; ... వారు రే పిక్కడకు వత్తురని నిరీక్షిస్తూయున్నాము. అవధానము రేపు 1 గంట లగాయితు ఆరంభమగునని నోటీసులలో ప్రచురించినాము. ఇక్కడ శతావధానమే లేదనియూ యిది యంతయూ నబద్ధమనియూ, పి. నరసింగరావు సదరుకవులను మోసగించ

చ. కలఁడు ప్రసిద్ధవంశ్యుఁ డరికాండము సైతము మెచ్చఁదగ్గ ధీ
బలమున కిక్కయౌ "పయిడిపాటి" నివాసి, యశస్వి, త్యాగి, వి
ద్యలకు నిధానమంబ! కవితావనితాహృదయంగముండు పే
ర్వెలసిన "రామరా" వనెడి బెల్లముకొండకులీనుఁ డున్నతిన్.

చ. అతనికి మాయెడన్ మఱియు నాయనయందున నాకు నిక్కమై
నతితరమైన పేర్మి యలరారెడి సప్పురిలో వధానమున్
గుతుకముమై నొనర్చి కనుఁగొంప మటంచుఁ దలంచుచుంటి మ
ట్టితఱిని బెట్టె నొక్కఁడు కడిందిగఁ గయ్యము పయ్యముంబలెన్.

చ. కలహము పెట్టుమానిసియు గన్పకు మాఱెడివాఁడు గాఁడు పై
నెలమిని వాని నూఁత గొని యెన్నియొ మ్రుగ్గులు పెట్టు చెట్టు నీ
డలమురిసంప్రజీవనపుఁడక్కరు లాతనిపాటి వారె? య
య్యలఘుఁడు రామరా వొకఁడె యాధ్యుఁడు సర్వవిధాల నంబికా!

క. అతఁ డింట నుండియే పం, డితులం బిలిపించి విద్య నేర్చెన్ శాస్త్ర
స్మృతిముఖ్యసంస్కృతకళా, గతి నసదృశుఁ డంతేకాదు కవితాన్వితుఁడున్.

తే. గీ. నరసరాట్పురి శతధానంబు మొదట
జరిగె నందు నొకానొకజనుఁడు రాము

---

దలచినట్లున్న ఎవరో వారితో చెప్పియున్నట్లు, వినుట మిక్కిలి విచారకరముగా నున్నది.... అవధానమిచ్చుట జరుగుట యిష్టములేనివారలు పన్నిన కుట్రమాటలై యుండునని మేము తలంచెదము ... రేపు వుదయం 9 గంటల రైలుమీద వారు యిక్కడికి దయచేయవలయును ఈ వుత్తరం తెచ్చినవారు ప్రత్యేకించి వారినిక్కడకు తీసికొనివచ్చేనిమిత్తం పంపబడిరి. రేపు వారు ఇచ్చటికి రాని యెడల మాకవమానకరముగా నుండును....తప్పక రాగోరెదము.

నరసారావుపేట
30-9-11

ఇట్లు విధేయులు
ఆర్. కృష్ణమూర్తి.
పి నరసింగరావు.

(ఇంగ్లీషు వుత్తరమునకు సరియైన తెనుఁగు.)

---

రావు నడిగి సమస్య వైరంబుకతనఁ
దెచ్చి మాకిచ్చె నదిమాకు నచ్చదయ్యె.

క. అందుఁగల "పశ్య" శబ్దము, సందేహాస్పదమెకాక సరసతరముగా
డెందమునకుఁ దగులదు త, త్సందర్భము కతన 'మస్తతకుఁ దా' ననుడున్.

గీ. పృచ్ఛకుఁడు మూర్ఖుగాన నద్దేమియనక
పైడిపా డేగి మఱునాఁడు వచ్చి వచ్చు
నప్పుడా కామరాట్కవి నటకుఁ దెచ్చెఁ
"దప్పెటులొ తెల్పుఁ" డనెడివాదమ్ము కొఱకు.

క. గతదినమే కౌముదిఁ జూ, చితి మే మద్దానికొఱకు శ్రీకరుఁ డలవీ
క్షితుఁడటఁ 'బశ్య'యని యుదా, హృతిఁజూపెఁ సూత్రమందిఁ కేమనవచ్చున్?

తే. గీ. పాప! మఱరాముగా వల్లబలవ యూని
వాదమున కేసుపెంచి యవ్వానరమున
సఱుపు నష్టావధానంపు సమయమందు
మరల నడుగంగఁజేసె నమ్మొఱకు చేతి.

ఉ. అంత కొకింత పూర్వమె ‡ సమస్యను బూర్తియొనర్చి మేము ని
శ్చింతగ నుండియుండ్ "మునుపు చెప్పితివౌఁగద! 'తప్పె'టంచు సి
ద్ధాంతము సేయఁగా పలయు నావడి యట్లొనరింపమేని దు
ర్దాంతులు వైరులెక్కతనఁ దాండవ మాడుదు" రంచు నెంచుమన్. 210

క. అది యెట్లు తప్పగునొ? త, త్సదుపాయము చూడకయె వెసన్ సాహసమున్
మది నూని మున్నుబలెఁ "దప్పది" యని పల్కితిమి మే మనాతంకముగన్.

ఆ. వె. "ఎట్లు తప్పసెప్పుఁడీ" యని యశివిన
యంబుమెఱయు మమ్ము నడిగె మొఱకు
'ఇపుడుగాదు పిదప నీపని తీరిచి
చెప్పువార' మనుడుఁ జెయ్వ్యు లుడిగె. 212

ఉ. కౌముదిఁ జూచియుండియు నఖండుఁడు రామకవీందుఁడిఁ దస్మదు
ద్దామత కోహటించి మది ధైర్యము చాలక మిన్నకుండె నం

---

‡ శ్లో॥ యః పశ్యతి జగత్సర్వం యోనపశ్యతి సర్వతః, తావుభౌ పరమా
త్మానంపశ్యానపశ్యౌపశ్యతః। (విస్తరమునకు 'పశ్యాంపుశ్యాం' చూ॰)

బా! ముగిసెఁ బవధానము క్రమమ్ముగ నంతట రాత్రి యయ్యె నా
యామహితుల్ గృహమ్ములకు నమ్మెయి నేగిరి సంతసమ్మునన్. 213

ఉ. ఏమును నింటికేగితిమి, యేగఁడు నంతకె * యుత్తరం బొకం
డేమనుజుండొ తెచ్చె; నట నెందును రామకవీంద్రుఁవ్రాలు లే;
దా మెయిఁ జూచి "రామకవి కంతగ ధైర్యము లేదు లే" దటం
చేము మదిన్ దలంచి † ప్రతి యించుక పంపితి మల్ల జాబునన్. 214

---

* బ్రహ్మశ్రీ తిరుపతి వెంకట శాస్త్రుల వారికి.

బ్ర॥.........రావు వ్రాయునది యేమనగా? నిన్నటి దినము శతావధానములో బ్రహ్మశ్రీ......య్య, అను నొక పృచ్ఛకుడు అడిగిన "పశ్యాపశ్యో నపశ్యతః" అను సమస్య తప్పని మీరు అనేక పర్యాయములు వక్కాణించి యున్నారు. ఈరోజున ఉదయము కూడా "తప్పు లేదని చెప్పిన పండితు డెవ" డని పండిత దూషణతో ఉల్లంఘన చేసియున్నారు. ఈరోజన అష్టావధాన సమయమున తిరిగి ఆ పృచ్ఛకుడే ఆ విషయమును అడుగగా సభానంతరమున మీరు చెప్పిన విషయమును సమర్థించుకొందుమని చెప్పియున్నారు. గనుక మీరు చెప్పిన ప్రకారం తప్పును చూపించుటకు సామర్థ్యము కలిగిన యడల పండిత సభ చేయించుటకు సిద్ధముగా నున్నాము. అందుల కీయకొననిచో వ్రాతపూర్వకముగా సమస్యలో తప్పు లేదని యొప్పుకొనుచు "సమస్య తప్పు అని చెప్పుటయే తప్పు" అని మీరు తెలియపరచవలయునని కోరుచున్నాము. పండితదూషణ నివృత్తికొరకై యేది విధియో ఆ ప్రకారము జరుపవలయునని కోరెదము. సాహసముగా సభలో పండితదూషణ చేసినందుకై ఇట్లు వ్రాయవలసివచ్చినది. వెంటనే జవాబీయ గోరెదము. కాలయాపన ఉభయత్ర కష్టము.

2-10-11,
Narasaraopeta.

Yours Sincerely,
(ఇంగ్లీషు చేవ్రాలు.)

---

† శ్రీమత్పరదేవతాయైనమః

మహారాజశ్రీ.........రావు గారికి—

అయ్యా,

తమ యుత్తర మందినది. అందు ప్రస్తుత విషయములు కొన్ని వ్రాసినారు. మేము పండిత దూషణము చేయలేదు. ఆ సమయమున మా యుచ్చరించినమా

క. మఱునాఁ *డుదయ మ్మొకటియు, మరల నిశీథమున నొకటి మఱి యట్లే గొం
టరు లెవ్వరో చేవ్రాలిడి, పురపురఁ బంపియు జవాబుఁ బొందరు మాచే.

---

టలు విద్యా విషయములు గాని పండిత దూషకములు కావు. అది యటులుండ నిండు. ఇది పండిత విషయము గాని తమ విషయము కాదు. కావున నా విషయమై తమకు జవాబు వ్రాయుట మాకనవసరము. ప్రతివాదులగు పండితులచే వ్రాయించినచో దానికి సమాధాన మీఁబడును.

3-10-1911 } దివాకర్ల తిరుపతిశాస్త్రి.
నరసారావుపేట }

---

* మహారాజశ్రీ తిరుపతి వెంకటేశ్వర్లు గార్లకు.

.........రావు వ్రాయునది యేమనగా ? మిమ్మును కోరిన యంశమును మాత్రము తప్పించుకొనుచు మీలో తిరుపతిశాస్త్రిగారిచే వ్రాయబడిన జవాబును చూచి చాలా సంతసించినాము. "మీరు ప్రచురము చేయురీతిని విశేషములు గల పండితులు కా" రనే ఉద్దేశముతో "మీరు తెలియపరచుకొన్న సంగతులను సమర్థించుకోగలరా" యని మిమ్మును పండిత సభకు రమ్మని కోరగా అట్టి సందర్భమున సభకు వచ్చుటకు పూనుకొనదగిన పండిత లక్షణమునకు విరుద్ధముగ "సభను నిర్మాణము చేయుటకు పూనుకొనినవారు పండితులైతే జవాబు నిత్తు" మని పండిత లక్షణము గలిగినట్లు కనుపడని యూహను పెట్టుకొని "వ్రాసినవారి విషయము కా" దని పండిత లక్షణమునకు వెలియగు జవాబు నిచ్చినారు. ఆ విషయమును తమ కే పరదేవత తెల్పినదో తెలియదు. సమయము మీరుతరి ఈ ప్రకారము తప్పించుకొనుచు ఛందోలక్షణ అనభిజ్ఞులగు స్కూలు పిల్లలు మొదలగువారికి మాత్రము శతావధానము చెప్పుచూ పరదూషణ చేయుచుండుట మాత్రము పండితలక్షణమా ? అట్టివారే పండితులని మీ యభిప్రాయమా ? వారితో ప్రసంగములు గలుగజేసుకొనుటయే పండిత లక్షణమా ? ఇట్టి సందర్భములలో మీరు పండితులనుట కెటుల దగుదురో తెలియకున్నది. "పండిత సభ చేయబూనుకొంటి" మని యొకరు వ్రాయగా యిట్లు తప్పించుకొనుటవలననే "మీరు పండితులు కా" రని మాత్రము స్పష్ట మగుచున్నది. మా పాండిత్య విషయమును మీ రిటుల నిరాకరించిన మాత్రమున మాకు గల్గు

తే. గీ. ♦ రామరావు పత్రికలోన వ్రాలు చేసి,
పంపుచో నుత్తరం బీయ వలయుననియు

---

లోప మేమియు లేదు అందువలన మీకు యేవిధమైన ఔన్నత్యమును కలుగ నేరదు. ఇంతటనైనను విజయ దశమినాడు మాచే వ్రాయబడిన ప్రకారము స్వవచనపోషణసమర్థత్వము గలిగిన పండితసభకు వచ్చెదరని తలచెదము.

నరసారావుపేట, 3-10-11 (తెలుగుతో చేవ్రాలు.)

---

నరసారాయునిపేట,
3-10-11.

♦ మహారాజశ్రీ తిరుపతి వెంకటేశ్వర్లు గార్లకు.

అయ్యలారా!

"పశ్యాపశ్యో౽నపశ్యతః" యను సమస్య విషయములో రెండు దినముల యందును "సమస్యలో తప్పు గలదు గాన పూర్తిజేయ వీలులే" దని మీరు దృఢముగాఁ జెప్పియున్నారు. పండితులు సాధువని చెప్పినారని తెలియపరచుకున్నను పండితుల నగౌరవ సూచకముగా నిందఁ సల్పినారు. సామర్థ్యముగలయెడల స్వవచనపోషకము చేయుఁడీ యని బ్రహ్మశ్రీ........రాయులవారు మీకు వ్రాసిన, సదుత్తరము లివ్వబూనరైతిరని తెలియవచ్చినది. పై సమస్య తప్పుగా నున్నదని మీరు పండిత లక్షణముగ సిద్ధాంత పఱచినయెడల నూటపదియాఱు రూపాయలు మీకు తప్పకుండ నిచ్చుటకును సాధువని సిద్ధాంత పఱచిన నట్టి మొత్తమే మీరు మాకు నిచ్చునట్లుగను మీరు పడంబడిక చేయునెడల నందులకు మేమంగీకరింతుము. పై ప్రకారము బూనెదగా, మీ తరఫున జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు వచ్చి మాట్లాడగా నీ సంగతులకే మీతో కలసి మాటాడి జవాబు నిత్తుమని చెప్పి కాలవిలంబము చేసినందున నీ కాగితము వ్రాయ వలసివచ్చినది వెంటనే జవాబు వ్రాయఁ గోరినాము.

ఇట్లు
......శర్మశాస్త్రి.
......శర్మశాస్త్రి.

పట్టి “శశ్ఛోటి” గాంద్రతో వాదమేల
యనియు భాషించి ప్రతి పంప మంబ! యేము.

చ॥ ఉదయము మాపత్రియాణ మపు “పూరుననేగఁగఁ జేతు” మంచు సొం
పొదవఁగ యత్నమున్ సలుపుచుండునెడన్ “రయి” లేగువేళ కి
య్యది తుటిమట్ట రేగపలె నక్కడ నిఁకొక చో నడస్న మా
కొపవు కతాన” నంచు నలయుత్సవ మాఁగితి మంబ! యే మెగిన్.

శా. “ఊరేగిం పొనరించి తెచ్చితిమి మి“మ్మోమహో” యన న్నేఁడు నిం
పారన్ బంపెద మక్లె” యంచు నరసింహారావు లోనైన యా
ధీరుల్ పల్కఁ దొడంగి రెట్లొ యలసద్ధీమంతులన్ మాన్చి కా
ర్యారంభంబునఁ జేసి యేగితిమి మే మానాఁడు గుంటూరికిన్.

చ. పతితుఁడు * “సత్యవాది” తరువాత నెటో లిఖియించె వాని కే
గతి పరమందుఁ గల్గెడినొ! కట్టిఁడి సర్వ హెటింగియున్న నూ
నృతము నడంచి యాత్మను జయించి వృథా పదరు ల్లిఖించు నా
చతురుని సాహసమ్మునకు సల్పవలె న్నతు లెన్నియేనియున్.

శా. అంబా! యిట్టి యసత్యవాదులకు నీ వాపంతయే నల్గ“కా
లంబింపం జన దీరసత్య”మని వాలాయం బెదేరీతి జ్ఞ
ప్తిం బుట్టింపుము, నీదు కోపమున కీ‘దేవయ్య’ లేపాటి? కో
పం బూనన్ బనిలేద, పిచ్చుకలపై బ్రహ్మాస్త్రముల్ నింతురే?

ఆ. వె. రైలు కదలు వేళ రయమున నొకఁడొక్క
‡ యుత్తరమ్ము తెచ్చి యొసఁగెదానఁ

---

* పరా:— ఈ ‘సత్యవాది’ తప్పడువ్రాఁతను గుంటూరిసీమ, పూర్వ రంగము 56 పుటలోఁ దుట్టతుదనుజదివి, దాని సత్యాసత్యములను గూర్చి మ॥ రా॥ రా॥ పంగనామాల నరసింహారావుపంతులుగారికిఁ గాని వేరొక సంపన్నగృహస్థునకుఁ గాని యోగ్యుఁడని మీకుఁ దోచిన యొకరికిఁగాని వ్రాసి తెలిసికొనఁ గోరెదము.

‡ ఓం పరదేవతాపతయే నమః.

బ్రహ్మశ్రీ తిరుపతివేంకటేశ్వరులగార్లకు.

బ్రహ్మశ్రీ .........రాయశర్మ వ్రాయునది.

అయ్యలారా! దైవందు జూబిలీ రీడింగురూం వారు నిర్మాణముచేసి

'బళ్ళ' గోలలేదు పడపడి గుంటూరి
కరిగి దాని కిడితి మంబ! * జాబు.

గీ. అంతతోఁ జల్లఁబాఱె నయ్యయ్యబులుపు
పిదప 'బాపట్ల' వారల పిలుపుకతన
నటకు నేగి యప్పురవాసు లలరి యొసఁగు
సత్కృతులుగొని గుంటూరు చని ముదమున.

---

పట్టుల శ్రీ పంగనామల నరసింగరావు పంతులుగారు తమ నాహ్వానము చేయుటచే తామిచ్చటికి విజయంచేయగా రీడింగురూం వారిలో నేనుకూడా మెంబరు నౌటచే రీడింగురూం సంబంధము నాకు బోధపడకుండి మీరు శతావధానము చేయబూనితిరి నా కాహ్వానము లేనందున నేను రా సందర్భము కలుగదయ్యె. అందుచే తమరు శతావధానులనుచు వచ్చినపుడు మీసామర్థ్యముచూచి సంతసింపకుండుట న్యాయము గాదని తోచి మీరు యధావిధిని శతావధానము పృచ్ఛకప్రశ్నానుసారముగా సంస్కృతాంధ్ర భాషాద్వయములో చేయగలశక్తి మీకు కలిగినచో ఈ ఆశ్వయుజ శు 15 స్థిరవారమునకు సరియగు 7-10-1911 తేదీన నేను శతావధానమును మీచే చేయించబూనితి గనుక యాప్రకారమున జరుగబూనుటకు మీ యభీష్టమును వెంటనే తెలుపగోరినాను. ఆప్రకారము మీరు జరిపినచో నూటపదియాఱురూపాయలు బహుమతి నిచ్చుటకు సిద్ధముగా నున్నాను.

పర్సరావుపేట
4-10-1911

(ఇంగ్లీషుచేవ్రాలు)

---

4-10-11 తేదీని 3 గంటలు.

* శ్రీమత్పరదేవతాయైనమః.

మహారాజశ్రీ...... రాయశర్మగారికి
గుంటూరు, కొత్తపేట
బ్ర॥ శ్రీ॥ శిష్ట్లా హనుమచ్ఛాస్త్రిగారిలేఖ.

ఆర్యా!

తమ 4-10-11 తేదీగల యుత్తరమందినది. ఇంతకుముందు ఇరువదియైదు సంవత్సరములనుండి సంప్రదాయసిద్ధముగాఁ బండిత సమ్మతముగా శతావధానాష్టావధానాదికములు సల్పుచున్న మమ్ము 'యథావిధిని శతావధానము పృచ్ఛకప్రశ్నానుసారముగ యథార్థముగా సంస్కృతాంధ్రభాషాద్వయములో చేయ

గలశక్తి మీకు గలిగినచో’ అని వ్రాయుటచే మమ్ముఁ బరీక్షించుతలంపుతో మీరీకార్యమునకుఁ బూనితిరని స్పష్టపడినది. కానిందు మీయభిమతార్థము తీర్థముకాని మీవంటి మహావిద్వాంసుల దగ్గఱ ‘యథావిధిని పృచ్ఛక ప్రశ్నాను సారముగా యథార్థముగా సంస్కృతాంధ్ర భాషాద్వయములో శతావధాన మొనర్చిన కష్టమునకుఁ దామేర్పఱచిన వెలమాత్రము బొత్తిగాఁ జాలదు. కావున మాకుఁ జెతియొక 1116 రు రూపికలేని యాఘమపత్రమీఁగల శక్తిగల్గియున్నచో నీసారి విస్పష్టముగాఁ దెలిపితిరేని మీయభిమతార్థము నెఱవేర్చుట కేవిధమైన యభ్యంతరమును నుండదు. సాధ్యమైనంతత్వరలోఁ బ్రత్యుత్తరమంపుదురుగాక.

దివాకర్ల తిరుపతిశాస్త్రి }
చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి } శతావధానులు.

☞ పరా:— చదువరులారా!

ఉదాహరించిన యుత్తరములలోని “(1) బ్రహ్మశ్రీ......శాస్త్రిలవారికి, (2) మహారాజశ్రీ...... వెంకటేశ్వర్లగార్లకు, ఇత్యాదిసందర్భములంబట్టియేమి బ్ర॥......రావు” అని స్వయముగా వ్రాసికొను నూతనాంశసందర్భముంబట్టి యేమి, మఱికొన్ని పల్లదములంబట్టియేమి, ‘బ్రహ్మశ్రీ’ వ్రాయుచు నమస్కార శూన్యముగా లేఖ వ్రాయు సందర్భముంబట్టియేమి, ‘హంసము’ లోనగు ప్రయోగ శుద్ధింబట్టియేమి, యొకటి రెండుత్తరములను వ్రాసినమానిసి తెల్వితేటలను దెలిసి కొనుఁడు ఇతనిపిమ్మట, నిరువురు శర్మశాస్త్రిలవార్లు గల యుత్తరములలోని రెండవమానిసి ధరించిన, ‘శర్మశాస్త్రి’ బిరుదము, ‘పండితునకుఁగాని మేముత్తర మీయ’ మనుటచేఁ గల్పించినది. అతనిని మొదటియుత్తరమున ‘బ్రహ్మశ్రీ అని మొదలిడి... అయ్యా, అను నొకపృచ్ఛకుఁడు’ అనియే యాకలహాప్రవర్తకుఁడగు “రావు” లిఖించెను. గాని సమయానుకూలముగా నీ ‘శర్మశాస్త్రి’ భూమిక వతఁడు వహింపవలసినవాఁడయ్యెను. ఎట్టిమూర్ఖునకేని యీగుట్టు సుగమమే యగుటచే గుట్టుమట్టులెఱుఁగనివారమయ్యు మేమిది గుఱుతింపగలిగితిమి, కావు ననే యీ ‘శర్మోప్టులకు’ మేము జవాబొసంగమైతిమి, అపిమ్మట నిది తోవ గాదని ‘అవధానార్థమాహ్వానించువారువలె నిఁక నొకయుత్తరమంపిరి, అందలి “పరదేవతాపతి” శబ్దమును, మా ‘పరదేవతా’ శబ్దమును, విచారించినచో మఱి కొంతవారితెల్వి బయలువెడలఁగలదు. అది యటులుండె, పాపము? ఏగ్రంథము

గీ. అచట మఱికొన్ని నాళ్లుండి యనఘులైన
వారలొనరించు విందుల వలనఁ దనిసి
సెలవు పూర్తి చెందుటయు నాసీమవిడిచి
యెవరి యిండ్లకు వారేగి రెసక మెసఁగ.

గీ. ఉండుతఱిఁ గొప్పగపువారి నోముఁదలఁచి
భంగపడిన బందుగులు * దర్బారటంచుఁ
బత్రిక నొకండు మొదలిడి పాడు నదులు
గిలుకఁ దొడఁగిరి తమ తెల్వి చులుకపడఁగ.

మత్తకోకిల. మంగళం జయమంగళం శుభమంగళం జగదీశ్వరీ!
మంగళం నినుఁ గొల్చుమాకును మమ్ముఁ దిట్టెడి వాండ్రకున్
దొంగవ్రాఁతలు వ్రాయువాండ్రకుతూహలమ్మనకున్ సదా
మంగళం జయమంగళం శుభమంగళం జగదంబికా!

మత్త. "పోచిరా" జోకరుండు బూతులబుంగ సారెను విప్పెడున్
"పెచిరా" జోకరుండు పేర్లుడుఁ బెట్టె బైటికిఁ బెట్టెడున్

---

నందుఁగాని 'పశ్య, శబ్దము సాధువుకాదని వ్రాయఁబడియుండ దను దృఢనిశ్చయము రామారావుగారి కుండుటచే వారి 'శశ్వోటులను, ప్రేరేపియుండరనునది మేము వ్రాయకుండఁగనే ప్రపంచము తెలిసికొనఁగలదు గాన విస్తరింపఁబనిలేదు. సమస్య పంపినవారుగాన రామరావుగారు స్వయముగా మమ్మడుగ వచ్చును. చెప్పఁగలిగినచోఁ దగుసమాధానమును, లేనిచో క్షమాపణమును మేము చెప్పను వచ్చునుగాని 'చల్లకువచ్చి ముంతదాఁచిన' సామెతగా శ్రీరామరావుగారు, ఎందులకును గొఱగానిమానిసులకు "శర్మశాస్త్రి" బిరుదములను దగిల్చియుఁ దగుల్చకయు, అవమానకరములగు నుత్తరములను వ్రాయించుటనుగూర్చి విజ్ఞులే విచారించుకొందురు గాక. మాయుద్దేశమును బట్టి వారట్లు ప్రవర్తింపఁదగువారు కాకున్నను నట్లుప్రవర్తించుట భావ్యపజయసూచకమనియు నందులకే దైవమట్లు ప్రేరేపియుండుననియుఁ బొడకట్టెడిని. ఇందునుగూర్చి, కొన్నిపుటలలో ముందు "బందరు" అను శీర్షికగలచోఁ జదువఁదగు.

* ఈదర్బారునుగూర్చి పూర్వరంగమునఁ గొండొకచూపఁబడెను, ఇది యిసుక పాఁతఱవంటిది. దీని ప్రలాపనలు చూచి తీరవలయును.

"చీచిరా" జోకరుండు చెన్నఁటిచీకుఁ గైతము గోఁకెదున్
కాచి కొప్పరపువారి సెట్టులో గట్టు నెక్కఁగఁ జేయఁగన్.

మత్త "త్రోసిరాజులు" కొంద తొక్కడఁ దూలనాడుచు నుండఁగా
"వేసి రాజులు" కొంద తొక్కడ నెక్కిరిం పలరింపఁగా
"తీసి రాజులు" కొంచతొక్కడఁ దిట్లు బిట్టుగఁ దిట్టఁగా
వాసికై చదరంగ మాపయి వైరులాడి రథీయులై.

మత్త "పోతురాజులు" విఱ్ఱ వీఁగుచుఁ, "బోకిరీ" నటు లాడఁగన్
"బూతురాజులు" మేఁదప్పుచు బూతు లేకరునెట్టఁగన్
"ఓతురాజులు" "మేఫ్రమే" వని హుంకరింపులు నింపఁగన్
గోతు * రక్కట ? కోఁత లెన్నియొ కొప్పరపుంగవు లాసయిన్.

మత్త. బండ లొక్కడఁ బఁపలొక్కడ బారు బూతులు నూఱఁగన్
మొండివ్రాఁతలవాఁడు సాఁకదు మ్రోఁత లేమియొ మ్రోఁగఁగన్
పిండిలేకయె రొట్టెఁగాల్చుచు బింకముల్ తెగఁబోకుచున్
దండుబల్కిని గొప్పరంబు కృశా ప్రగల్భము లాడెడిన్.

తరల. తెలివి తక్కువ యీసు రోసము తెల్లమోముసు వ్రాఁతయే
తెలుపు నంచు నెఱుంగ కూరక తెల్లవ్రాతిన దాఁవగాఁ

---

(* ఫిబ్రేవరి 10 వ తేది 1912 సం॥ దర్బారునుండి.)

4-9-1911 తేదీన, మాకును దిరుపతి వేంకటేశ్వరులకును వైషమ్యములు వలదని యుద్దేశించి తదనుగుణమయిన పత్రికనంపి అందు సంతకములుచేసిన ప్రజ్ఞానిధులకు వినయపూర్వకముగా నమస్కారములొనర్చి చేసిన విన్నపము......

సీ....గీ చేసిన ప్రతిజ్ఞఁ దప్పము చెప్పమితర, మాప్పుఁడీ సంశయం బొనఁగూర్పుఁడి సభఁ, బంపుఁడీవార్త దిశలకు నింపునింపుఁ, డో సరసులార! గుంటూర్నివాసులార!
గీ. పత్రికలఁ దెల్పికొనినట్టి ప్రతినలెల్ల, వీఁక నిగ్గించుకొందు మీలోకమంద యింతకే మూఁడులోకాల కేగ నేల?, వేగ సభఁ గూర్పుఁడో జగద్విదితులార!

ఇట్లు
కొప్పరపు సోదరకవులు, శతావధానులు

☞ ఈసారి కోఁతలు వీరు సంధిపత్రమందుకొనిన 5 మాసములకుఁ బిమ్మటివని యెఱుఁగుఁడు. సారమరయుఁడు, తి॥ వెం॥

చూచి యాయన ప్రేరణఁ దోఁచిపుచ్చ
రాక యాతనిబుల్పుదీర్పఁగఁదలంచి.

తే. గీ కాశికావృత్తిలోనున్న గ్రంథమల్ల
రామరావున కెఱుగంగ రానిదనుచు
నతఁడు వ్రాయించు వ్రాఁతల కతన నెఱిఁగి
దానిచే మా నుడిని నిల్పఁదలఁచి మఱియు.

క. * కలహామునకుఁ బూర్వమ్మొక, యలఘుఁడు తచ్ఛిష్యుఁడెలమినం పెనుదోష మ్ములగని యగు రామకవీ, ట్టిలకుని కావ్యమ్ము దాని దెఱచితి మంతన్.

---

శతావధానమను పేరుచే 40 మందికి సభఁ జేయునపుడొక పృచ్ఛకుఁడు "పశ్యా పశ్యానపశ్యతః" అను సమస్యనిచ్చి పూరింపుఁడనఁగా నాసమస్య తప్పని చెప్పి పృచ్ఛకుఁ "డిది పండితు లొప్పికొనినదియే తప్పగా" దని పల్కఁగా 'ఎవఁడా పండితుఁడు పండితుఁడైన నిట్టితప్పు సమస్య నేలనొప్పుకొను' నని పండితదూషణ చేసితిరికదా. అందుపైఁ గొందఱు పండితు లీ సమస్య తప్పు గాదని, మేము సమర్థింపఁగలమనియు, మీరు తప్పని సమర్థింపగలరేని సభకు రావలసినదనియు మీరు తప్పని ధ్రువపఱచినయెడల మేము నూటపదారు లిచ్చెదమనియు, ధ్రువ పఱచలేనియెడల మాకు మీరు నూటపదాలు లిచ్చిపోవలయు నని యుత్తరము వ్రాసి పంపఁగా బ్రత్యుత్తర మీయక నరసారావుపేటనుండి గుంటూరునకు వెళ్లితిరి. ఇంతవఱకుఁ దగిన ప్రత్యుత్తర మిచ్చినవారు కారు. కావున నిప్ప టికైన స్వవచనపోషణ సామర్థ్యమున్న యెడల పట్టి యుక్తులుపన్ని కాలము వ్యర్థపుచ్చక తప్పని నిశ్చయపరచుట కొప్పుకొని తెలియపరచిన తక్షణమే పం డిత సభఁ జేయించుటకును, ఆ సమస్య తప్పు కాదని సమర్థించుటకునుఁ గృత నిశ్చయుఁడనై యున్నాడను. (యింకను కతి శీఘ్రంబునఁ బ్రత్యుత్తరం బొసంగనిచో మీ రోడినట్లే తలంపబడుదురు)

బ్రహ్మశ్రీ జెల్లంకొండ రామారాయ కవీంద్రుల శిష్యుఁడగు
1-11-11. ములుకుట్ల లక్ష్మీనారాయణ శాస్త్రి.

☞ కుండలితమగు వాక్యము పేషకుని స్వహస్త లిఖితము, తక్కినది అచ్చు

* మహారాజశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి శతావధానిగారికి యిచ్చేది
రవాన్నా, బందరు, భైరవపత్రిస్సు. 27-6-11 బండారుపల్లి.
నమస్కారములు.

త్మ క్షేమం యీమధ్య తెలియలేదు. గీరతము యెప్పుడు బయలువెడలునది

మత్త. ప్రాజ్ఞుఁడయ్యును రామరాట్కవి భావియోగవశమ్మునన్
విజ్ఞు లెల్లరు నవ్వ కైతను వెళ్ళఁ బెట్టెను దానిలో
నజ్ఞు లత్తఱిఁ జేయునల్లరి కాతఁ పొంతము గావుటన్
దజ్ఞుఁ డంచు నెఱింగి యుండియుఁ దప్పు లేరితి మంచికా!

మత్త. * తప్పు లయ్యవి బ్రహ్మకేనియు దాఁటరానివి యాటచేఁ
'బప్పులోనడు' గన్న సామెతఁ బట్టిపోఁదలఁపులా
చొప్పు చొప్పడెఁ దక్కువాఁకలు శుద్ధశుంఠలు సారెకున్
బిప్పికైరము పేరి జెడ్డలు వేయఁజొచ్చిరి మాపయిన్.

మత్త. 'రామరా యెటులేని కైకిఁక రాఁగలేఁ' డని కోపప్రిప్తం
గోముకై సరులంతటన్ దమ గుంపు గూడిరి మెల్లఁగన్
సాము సేయఁ దొడంగి రెందు నసత్యమే యొకవిద్దెగన్
వాముష్టిఁ బట్టి సారెకు సంగ్యము మ్మొనరించుచున్.

---

తెలియలేను. ప్రస్తుతం వారుగుప్తగారు జల్లకొండ రామారావుచేసిన కృష్ణలీలాతరంగిణిని మీవద్దకంపినారు. దానిని తాము చిత్తగించి గుణదోషములను వెల్లడింతురుగాక. నాకిరము కొంచము నెమ్మదిగానున్నది. యింకా పదిరోజులకు వారుచేసిన రుక్మిణీపరిణయ చెంపూప్రబంధమును పంపఁగలను. శ్రద్ధగా పరిశీలింతురుగాక. (మక్కికిమక్కి నకలు)

జూపూడి హనుమచ్ఛాస్త్రి

(* శ్రీరామారావుగారి కృష్ణలీలాతరంగిణి నుండి)

(1) శ్లో॥...స నందతనయః కరపంకజేన పస్పర్శ శి + మ్...,
(2) శ్లో॥ మయి మాత్రజాయ సదనా ద్బహిర్గతే"
(3) శ్లో॥ నవనీతచోర తవ శి + మాహరామి...మను శి + ముంబనమిదం..."
(4) శ్లో॥ సుభగే త్వదీయ మయి శోభనంభ + ం మమ దన్యయ..."
(5) శ్లో॥ అధిరుహ్యచైవశయనంశయానమ, త్తనయాత్రుత్కానిహితపాన్ని జంపదం
(6) శ్లో॥ మమబాలికాభ + బిలేతవాత్మజోనిధధేకరాంబురుహామద్యమాంగులిం
(7) శ్లో॥...ఆత్మమాతృవివృతాననాన్తరే సమమూత్రియత్"
(8) శ్లో॥...ఇతి బాలికాంగ మఖిలం విశాలాత్మనః పరిలిప్తవాన్...

☞ దిఙ్మాత్రమ్ముదాహరించితిమి. ఇట్టి వెన్నో కల వని యెఱుఁగు

మత్త. రామరాయని కైతలోని దురర్థపుఙ్ విరసప్రయో
గామయ మ్మది త్రిప్పరానిది యాట మిన్నకయుండి వి
ద్యామహేంద్రులు 'పశ్య' శబ్దముపైని సారెకుఁ గొంద ఱే
మేమొ వ్రాసిరిగాని నీదయ నేమె కొంటిమి గెల్పులన్.

---

నది. ఇందునుగూర్చిన విచారణమునకు 'శలభాలభనము' చూడఁదగు. 'ప్రమాదో ధీమతామపీత్యత్ర అపిశబ్ద ఏవకారార్థకః, అతోనరామరాయ స్యైతావతా కించిదపి న్యూనతా నతు సర్వథా సమర్థ ఇతి శివమ్,

## గెల్పులు.

☞ పరా:— 'పశ్య' అను శబ్దము తప్పనియు, ఉపసర్గపూర్వక 'పశ్య' శబ్దము సాధువనియు, కాశికావృత్తిమతము, రెండును సాధువు లని కౌముదీమతము, మొదటిది ప్రాచీనమతము, రెండవది నవీనమతము, మొదటిదే మంచిదని మేము, రెండవదియే మంచిదని మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రిలవారు లోనగు కొందఱు పండితులు, ఇందునుగూర్చి పత్రికావాద మొక సంవత్సరమున్నరవఱకు జరిగినది, కాని యాక్షణమువఱకు మావాదమే నిల్చియున్నది. ఇందుఁ గౌముదీమతానుసారముగా వాదించినవారు (1) మంత్రివాది సూర్యనారాయణశాస్త్రిలవారు, (2) తాతా సుబ్బరాయ శాస్త్రిలవారు, (3) పురుఘిళ్ల రామశాస్త్రిలవారు, ఇందు, తుట్టతుదవారు బెల్లంకొండ రామారావుగారి గురువులు, వీరు కడు శీఘ్రముగా నోడిపోయిరని చెప్పవలసివచ్చినందులకుఁ జింతిల్లుచున్నారము. మొదటివారు తమ శిష్యుపేరితోఁ బత్రికలు ప్రకటించినవారు. వీరు శ్రీరాయఁడు శాస్త్రిలవారిశిష్యులగు జయంతి భగీరథశాస్త్రిలవారిచే నోడఁగొట్టఁబడిరి. ఆ యీ విద్వన్మణులు వివాదమునకు దిగుటకుఁ గారణము మొట్టమొదట మేము ప్రకటించిన 'పశ్యాంపశ్యాం' అను చిన్నిపత్రము, వీరిలో వీ రిట్లు ఖండనముండనము లొనర్చుకొనుచుండఁగా మున్నుదాహరించిన మహామహోపాధ్యాయులవారు తటస్థులుగా నొక తీర్పును దీర్చి ప్రకటించిరి. దానిపై జయంతి భగీరథశాస్త్రిలవారు వ్రాయవలసిన విధి యున్నను సర్వాపవాదక మగు గురుశిష్యన్యాయము దానికి బాధక మయినది. అంతలో శ్రీరామారావుగారు తమ వాదము గెలిచినదను సంతోషముతోనిట్లొకరి చేతఁ బ్రకటింపించిరి.

(నవంబరు 1 వ తేదీ 1912 సం॥ దర్బారునుండి)

# పశ్యాపశ్యానపశ్యతః

1 పాఘ్రేతి సూత్రములో పైసూత్రమునుంచి ఉపసర్గపదమును కాశికాకారుడు అనువృత్తిచేసినాడు గాన పశ్యశబ్ద మసాధువు, కౌముదీకారుఁడు అనువృత్తి చేయక పోయినందున పశ్యశబ్దము సాధువు అని కొందరందురు గాని అది సరికాదు. కౌముదీకారునికంటె కాశికాకారుడు ప్రాచీనుఁడు గాన ప్రాచీన మతమే సాధువు అని 'పశ్యాం పుశ్యాం' గ్రంథకారుడు వ్రాసినారు. 2. దీనిని ఖండించి మంత్రవాది సూర్యనారాయణశాస్త్రిగారి శిష్యులు నల్లానిచక్రవర్తి వెంకటాచార్యులవారు జ్ఞానాదిగుణములచే నధికుడు గాన కౌముదీకారుడు చేసిన అననువృత్తియే బాగున్నది అందువల్ల వైదికప్రయోగములు మహాకవి ప్రయోగములు కుదురు చున్నవని వ్రాసినారు. 3. ఇందుమీద మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారి శిష్యులయిన జయంతి భగీరథశాస్త్రిగారు జ్ఞానాదిగుణములచే కాశికాకారుడు తక్కువవాఁడుకాఁడు. ప్రాచీనుఁడు గాన నీతని మతమే గ్రాహ్యమని వ్రాసినారు. 4. దీనిని ఖండించి వెంకటాచార్యులుగారు కాశికాకారుడు ఉపసర్గపదమును కొందరనువృత్తిచేయురని వ్రాసినందున కౌముదీకార మతము కాశికాకారు మతముకంటె ప్రాచీనమయినది. కాన అదే గ్రాహ్యమని వ్రాసినారు. 5. విజయనగర మహారాజ సంస్కృత కలాశాలా ప్రధానోపాధ్యాయులును మహామహోపాధ్యాయులు నగు తాతా సుబ్బారాయశాస్త్రిగారు ఉపసర్గపదమును అనువృత్తిచేసిన అన్నంభట్టాదులే పశ్యశబ్దసాధుత్వము నంగీకరించిరి. కాతన్త్రవృత్తికర్తయగు దుర్గసింహుడు కూడ పశ్యశబ్దము సాధువని వ్రాసినాఁడు సారస్వత వ్యాకరణమునందుకూడ అనువృత్తి లేదు. గాన పశ్యశబ్దము సాధువేనని వ్రాసినారు. 6 వాక్యార్థ చన్ద్రికా వ్యాకరణ గ్రన్థకర్తలగు బ్రహ్మశ్రీ భాగవతుల హరిశాస్త్రిగారి శిష్యులగు పురిఘెళ్ళ రామశాస్త్రిగారు సూత్రభాష్యకైయటములయందు పశ్యశబ్దము ప్రయోగింపఁబడియున్నది గాన కాశికాకారమతము తద్విరుద్ధమైనదని వ్రాసినారు. 7. ఇవియన్నియు అచ్చుపడేయున్నవి. ఇక 'పశ్యాం పుశ్యాం' గ్రంథకారులకు తత్పక్షపాతుల స్వపక్షపాతమే గతిగా కనబడుచున్నది.

బెజవాడ. హితవాది

పై ప్రకటనము శ్రీరామారావుగారు వ్యాకరణవిషయమునఁ బరప్రత్యయనేయబుద్ధులని చెప్పక చెప్పఁగలదు. అది యటులుండె. ఈహితవాది నామధారి కడువృద్ధుఁ, శాఖాభిమానమును బురస్కరించికొని మమ్ముఁ బరోక్షమున దుర్భాష లాడుటలోఁ దప్ప నన్యత్ర యితఁడు మంచి పెద్దలనెఱఁగినవాఁడు కాఁడు. ఈతని పేరఁ బ్రకటింపఁ బడిన పై పత్రికయొక్క మాతృక మావద్దకువచ్చియున్నది. బ్రాకెట్టులోనున్న 19 అక్షరములును హంసపాదమునుంచి రామారావుగారు వ్రాసినవి కాని రామారావుగారు కాలాంతరమునఁ దమపేరితో వాదమునకు రాకయున్నను "నిందు జోక్యమే లేకయున్నా" రను వారి వాదము సత్యదూరము, ఈయంశమునే యీక్రింది పంక్తులు బలపఱుపఁ గలవు.

(అభినవసరస్వతినుండి.)

"...పైగ్రంథములు చూడనికతన రామారావుగారు "పశ్య" అనునది సర్వామతములను సాధువేయనువిశ్వాసముతో నరసారావు పురవాసులు వ్రాయు నుత్తరములకు సమ్మతించిరి. పదపడి యథార్థమెఱిఁగి ఖిన్నులుండిరి. అది వారియోగ్యతను వేనోళ్ల జాటుచున్నది. అనవసరముగా దూషించి మనబోఁటులోనర్చు ప్రకటనలవలనఁ దేలఁదగునంశమును నేను వేఱే వ్రాయనక్కఱలేదు. చేతనైనచోఁ బత్రికాముఖముననో సభాముఖముననో సమస్యనుగూర్చి పండితసమక్షమునఁ బెనఁగుటయుక్తము, లేదా యింతటనేని ఖిన్నులుండుటయుక్తము. యథార్థము నొప్పికొన్నచో మనకప్రతిష్ఠలేదు. జన్మశతమునకేని రామారావుగారు సమస్యను నేను బంపలేదనికాని, నరసరావుపేటసభకు వచ్చి వెళ్లిపోయి పదంపడి యుత్తరములు వ్రాయింపలేదని కాని యందురని నేననుకొనను. సమస్య తప్పని నిరూపింపఁగలిగినచో నూటపదియాఱులు తామిత్తుమనియుఁ లేనిచోఁ దమకివ్వవలెననియు రామారావుగారు తిరుపతివేంకటేశ్వరులకు నాచేతనే చెప్పి పంపిరి. పైనబద్ధ మాడుదునందురా?

సీ. రసికులు సుజనులై రాణించు పులిపాకపూర్ణయ్యగారె నా మొదటిసాక్షి
పణవిత్తమీ నిష్టపడిన యూపెనగుంట్ల హనుమంతరావుగారవలిసాక్షి
విప్పర్లపల్ల్యాఖ్యవిపులాగ్రహారస్థపండితద్వంద్వమా పైనిసాక్షి
వేమవరస్థుఁడౌ వెంకటకృష్ణాఖ్యమేదినీదేవుఁ డామీఁదిసాక్షి

తే. గీ. ఇంక నెందఱో యున్నవా రిందఱేల
రామరాయాఖ్యపండిత రాజొకండె

"చెప్పి ప్రత్తెంచ లేదిట్టు లప్పు" డనుచు
బలికినన్ నాకుఁ జాలునో ప్రౌఢులారా!

రామారావుగారు స్వయముగా వాదమునకు దిగకుండుటకుఁ గారణము వారి శ్రీకృష్ణలీలాతరంగిణిలోని హేయప్రసంగము గాని వేఱుకాదు. అదియటు లుండె, పిమ్మట మేము '<u>పశ్యశబ్దవిచారము</u>' అను వ్యాసమును వ్రాసి మహామహోపాధ్యాయులవారి వాదమును ఖండించుచు, "గ్రామం గచ్ఛన్ తృణం స్పృశతి" గా రామరావుగారి గురువుగారి వాదమునుగూడ ఖండించితిమి. అంతతో నాయీ పండితులు విరమించిరి. పిదప రామారావుగారే స్వయముగా వాదమునకు దిగవలసినవారైరి కాని స్వనామగోపనము మున్ను చెప్పిన హేతువున వారి కావశ్యక మయ్యెను. అట్లు గూఢరీతి నవలంబించివారు, (1) పశ్యశబ్దమీమాంస (2) పంచాననపలాయనము (3) గుంజాగర్వభంజనము, అను మూడువ్యాసములు మిగులఁ బచ్చిగా వ్రాసి ప్రకటించిరి. ఇందు మొదటి రెండును 'పశ్య'కు సంబంధించినవి. మూడవది తమ లీలాతరంగిణిని, సమర్థించుకొనుట కేర్పడినది. ఈ మూడును మాచే రెండు వ్యాసములతో ఖండింపఁబడినవి. అందు మొదటిది 'పిష్టపేషణము' రెండవది 'శలభాలభనము.' అంతతో నా 'పశ్య' వాదము సమాప్తమైనది. ఆ యీ వాదమునుగూర్చిన విశేషాంశములు తెలియఁగోరువారు ప్రత్యేకముందులకుఁగా నేర్పడిన 'పశ్యాంపుశ్యాం' లోనగు గ్రంథములు చదువఁగోరెదము. అవి యెల్ల నిందు నుదాహరింపవలసియున్నను, గ్రంథవిస్తరభీతిచే నందులకుఁ బూనమైతిమి. విద్వద్వాదము గాన నది యంతతో ముగిసినది గాని యవిద్వద్వాద మింకను జాలుమాలములు లేక "హితకారిణీ, మనోరంజనీ, పత్రికలలో డిద్ధబిద్ధడబిద్ధాదులవలనఁ బ్రకటింపఁ బడుచునేయున్నది. అందునుగూర్చి పీఠికలో సంగ్రహముగాఁ జర్చింపఁబడును. శ్లో॥ మూర్ఖాణాం పండితా ద్వేష్యాః" (భారతము శాంతిపర్వము...)

---

తరల. తనదు వాదము న్యాయ్యమైనను దైవవంచన కల్మి నెం
దునకు మాఱక పారె దుమ్మును దూళిగాఁ గనుపట్టు చొ
ప్పునకు నక్కవి చింత నొందుచుఁ బోవుత్రోవ యొకండునున్
గనక విజ్ఞుఁడు గాన నేవియొ గ్రంథముల్ గనునంతటన్.

తరల. తిరుపతిన్ మఱి వేంకటేశుని దిట్టి యత్తఱి సెప్పఁగన్
* "పరశురాము" లటంచుఁ బద్దెము వ్రాసె నొక్కఁడు యుక్తమై
పరశురాముఁడు రాచపుర్వులఁ బట్టి నేలకు వ్రాయుట
త్తఱి మఱెందుకు సంభవించెనొ? తత్త్వమంబ! యెఱుంగవే?

మత్త. గోవు కోసము హైహయుం డొకకొంత దోసము చేసె నా
గోవిశేషపరీతుఁ బట్టుక గూలనేసెను రాముఁడున్
గోవు నా మఱి వాక్కునాఁగ! కోపిమల్ పఠించినన్
దేవి! యిర్వ్యాప దానికై కడ తేర్చె సెప్పరు రాజులన్?

మత్త. మేమె రాజులమంచుఁ గొండలు మిన్ను ముట్టుచు వత్తురో?
నేమ మేగతిఁ గాంచనేర్తురు? చెప్పు మట్లగు పట్టునన్
రాముఁ డుద్భవ మందునంతకు రాజు లేమయినో కదే!
జామదగ్న్యకుఠారధారకు; జాల్మఁ డేమి యెఱింగెనే?

మత్త. రాముఁడే యల రామరాయని రాజు శిక్ష వచింతునో?
మేము నొప్పెద మాతఁ డేగలి మించి నిల్వఁగ నేర్చెడిన్?
ఏమియందువొ? పచ్చి బూతుల నేర చూపితి మంబనో!
రామరావు కవిత్వమందుఁ బరాభవం బది గూర్చెడిన్.

మత్త. కాన నాతఁడు రామరావగుఁ గాక నామసదృక్షమా
దానిఁ బూని యెదుర్చ నేరఁడు దైవనం చితుఁ డొటచే
నీనఁగావలె భూమి యీపయి నింక నొండొక రామునిన్
తేనిచో మనరాజు లూరక లేసులై చెడఁగావలెన్.

తరల. తిరుపతిన్ మఱి వేంకటేశుని దిట్టు నింకొకరుండు గ్ర
చ్ఛఅను 'రావణకుంభకర్ణు' లటంచు దుఃఖము దీఱఁగన్,
అరసి చూచిన నిదియు వెన్కటియట్లె రామునకొక్కతన్
సురఁగె; రాముఁడు పుట్టుఁగావుత శూరుఁ డింకొకరుం డొగిన్.

---

(అక్టోబరు 16 తేది, 1912 సం॥ దర్బారునుండి.)

ఉ. తామసవృత్తి పీడి యుచితస్థితి నిక్కము నాలకింపుఁడీ
భూమిపు లందఱున్ దునిమి పుత్త్రెల నాకపు మెట్లుఁ జేసి యు
ద్దాముఁడునైన భార్గవుఁడు తప్పిసుమంతయులేనియట్టి శ్రీ
రాములఁ దూలనాడియె పరాభవ మొందుట మీ రెఱుంగరే?

[illegible] ఆయీ దర్బారు పత్రికలోని ప్రతిపక్షిపక్షీయుల ప్రలాపముల కెల్ల మేమిచ్చిన ప్రత్యుత్తర మీక్రింద నుదాహరించుచున్నాము.

(అభినవసరస్వతినుండి)

"పండితాయతే"

శ్లో. ధృత్వా సర్వా ణ్యరణ్యా న్యతివిషమలతా గాఢదుర్గాణి భూయో
యాయాన్తం పక్కణాన్తం భషకతతి రయం బుక్కనైర్ధిక్కరోతి
లజ్జన్తే హన్త మేనాం మదకరటిఘటా భేద సంఘట్టనాఢ్య
క్రీడాధారేయధారా మమ ఖరనఖరాః కింకరోమి క్వయామి.

(పండితరాజశతకం.)

శాఖాభిమాని భ్రాతలారా!

తగిన ప్రత్యుత్తరమును లిఖింపనేరని "పండితాయతే" గారి ప్రేరణముచే డిద్ధబిద్ధాదుల పేళ్లతోఁ దిట్టితిట్టి యానందించు మీ యోగ్యత పండితరాయలు తప్ప నితరులు వర్ణింపఁజాలరు. "కృష్ణలీలాతరంగిణి" లోని బూతులు గోపురాదులమీఁది బూతులతోపాటు కొట్టువారు క్షమింతురని సంతసించెడి మీ సంతోషము కడు వర్ణనీయము. బోలెడు లక్షణ గ్రంథము లుండఁగా దాని కీగతి పట్టినందులకు విచారించుట మీచే యొప్పుకొనుటచే దాని యోగ్యత వెల్లడియైనది. కాశికను ఖండింప నేరక యేవో తిట్టిమొట్టిమాటలు వ్రాయుటవలన నేమి, ప్రాజ్ఞుల నోటరాని యవాచ్యవచనములతో మమ్ము నిందించుటవలన నేమి మీ "పండితాయతే" గారి లోఁతు విస్పష్ట మగుచున్నది. సరియైన యుక్తిగను స్ఫురించినచోఁ డిట్లతోఁ బని యుండదుకదా! కాశిక ప్రకృతము పఠన పాఠములలో లేదనుట పట్టి పిచ్చిమాట. విశేషములు తెలియఁ గోరువారు చూచుచునే యుందురు. సామాన్యులు కొందఱు లఘుకౌముదితోడనే తృప్తినంది సిద్ధాన్తకౌముదినే ముట్టరు. అంతతో దీనికిఁగాని దానికిఁగాని గౌరవము చెడదు. కాశిక నక్కడక్కడ దీక్షితులుగారు ఖండించిరని వ్రాసి దాని నప్రమాణ మనుట యుక్తముకాదు. ఎక్కడ నిప్పుడు దానిని మనము ప్రమాణముగాఁ బట్టుచున్నారమో అక్కడ దీక్షితులుగారు ఖండించినది యుక్తమా కాదా, అను సంశయము తేలవలసియున్నది. అందులకు మీవారు పూనవలసియున్నది. కాశిక ననుసరించియే 'పదవాక్య ప్రమాణ పారీణు' లెల్ల వ్యాఖ్యా

నములను వ్రాసియున్నారు. అప్పటికి భాష్యమున్నను దీనిని వారంతగా గౌరవించుటచే నిది భాష్యతుల్య మని మేము వ్రాసితిమి. నైషధములో 'ధయాన్' అను ప్రయోగమును "యథాకథంచిత్స్పృశ్య" మయిన దానినిగా వ్రాసిన మల్లినాథసూరిగారేమి సోపసర్గములుగా "పాఘ్రాధ్మా" సూత్రమున కుదాహరణములు చూపిన మహావైయాకరణశిరోమణి భట్టియేమి మఱికొందఱు ప్రాచీనులేమి మా వాదమును బూర్తిగా బలపఱచుచున్నారు. కాశికను గాని మమ్మునుగాని వారినిగాని తిట్టినచో దిట్టినవారి నోటికంపు బయలుపడు నేకాని వాదము నెగ్గదు. సమస్యాపూర్తింగూర్చి చొప్పదంటు శంకలను బ్రకటించితిరిగదా; అందు డిత్థబిత్థాదులచే వ్రాలు చేయించితిరేమి? నానావిధముల మమ్ముఁ దిట్టియు వేఱొకరిని బొగడియు నెవరికి బ్రహ్మపట్టము గట్ట నుంకించుచున్నారో వారి వ్రాలే యందుఁ దగిలింపుఁడు, పస తెలియఁగలదు. ఏక కాలమునందు సర్వజగద్దర్శనయోగ్యత లేకపోవచ్చును గాని పర్యాయముగా నేల యుండఁగూడదు. మఱియు 'యః' అన్నచో 'జడపదార్థః' అని రాఁగూడదని యే పండితుఁడును బలుకఁడు. 'పండితాయతే'లు పల్కుట వింతకాదు. "సర్వనామ్నాం బుద్ధిస్థత్వోపలక్షిత ధర్మావచ్ఛిన్నే శక్తిః" ఇది నిష్కృష్ట సిద్ధాంతము. గత్యంతర మేదియును లేక వృథాగ బూతులు తిట్టు మీకీ మాత్ర మేని వ్రాయుట యనవసరమే. అంతేవాసులలోఁగూడ మీకుఁ దుల్యముగాఁ దిట్టువారు మాకుఁ జేకూఱమి నింతటితో నిప్పటికి విరమించితిమి. "మూర్ఖం ఛందానురోధేన"

ఇట్లు,

తిరుపతి వేంకటేశ్వరులు.

మత్త. అంతదన్కను మాప్రతాపమహత్త్వమే యలరారుతన్
జింత నొందుచుఁ దిట్టిపోయుచుఁ జేతిగాజుల మ్రోఁతతో
గొంతు బొంగురుపోవ రోఁజుచు గోఁకికొంచు శిరమ్ములన్
మంతనమ్మునఁ గుట్రజేయుచు మూర్తుఁడుండుత మంబికా!

మత్త. "చాల దీ యవతార మింకను జాల లోపము లుంటచేఁ
జాలువాఁ డుదయింపఁగావలెఁ జాల నందులకై తపం
బోలిఁజేయుఁడు మీరలెల్లరు నూరకే యిటు వ్రాఁగుటల్
శీలవంతులు మెచ్చ" రంచును జెప్పుమంబరో! వారికిన్.

తరల. పరశురాముఁడు రాజవంశముపై సనాఁ గోపరించె నీ
పరశురాము లటుల్ పొనర్పమి ప్రాజ్ఞులెల్ల నెఱుంగరే!
ఊరక తిట్టుట కట్టువ్రాయుట సుంట నింతవచింపఁగాఁ
దఱి ఘటిల్లెను యుక్తి చెప్పుమి తప్పు సత్కవి కంబికా!

చ. కపితము గట్టు చుట్టములు 'గాడిద లెద్దులు, మొద్దు,' లంచు న
చ్చపుఁదమ తెల్వి యంతయును శాశ్వతమై గపిచంద్రమోనభః
కుసుమపువు లుఁడౌనంతపఱుకున్ గొలుఁగక గిలుకింగఁ జొచ్చి రీ
కుపితులు గోఁకు పద్దెములకున్ దర యంగను గాఁ మంచికా!

తే. గీ. అన్ని తిట్లకు నాఁటి సహాసనమున
ప్రేమ మోమోడమనుటయే హేతు వంబ!
వారి మోముఁ జూచినయంత వాటలోఁతు
స్వాంతమున నిశ్చ కతన నాసనము నీకు.

చ. ఇతరు లెఱుంగు కైట్టు లెవఁ డేపని సేయునో దానిగుట్టు తా
నతఁడె యెఱుంగుఁగాక! ఘనగాంఘ్రిల పద్ధతి నేఁ డెఱుంగు, నా
జ్ఞితుఁడు మఱొక్కవో నయినఁ జేసెడిదేమి మఱొక్కపట్ల? నే
చతురుఁడు వీరి మెచ్చినను సత్సభ * స్వాంతము డాఁచివేసుమీ!

---

పోష్టుముద్ర } 4 సెప్టెంబరు 1911 ఎగ్మూరు. { లైబ్రరీ సోమవారం

* ... ఈ వివాదమునుగూర్చి కొంత వ్రాత చూచిననాటిరాత్రి, 27 తేది ...మీ కాగితములు వచ్చినవి కుస్తీలోనున్న నాకు ఒడలు పులకలెత్తెను. మహోత్సాహానందములు కల్గెను. నేనుకూడ ఇప్పుడు గుంటూరు రావలెననుకొనుచుంటిని బాగుండును ...నాకరీవీలులేదు...కొప్పరపుంగవులు ఇక్కడవధానములు చేయుటలో అష్టావధానము పేరేగాని, లక్షణమింతేనియు లేదు, సమస్యలు ముందు చెప్పించుకొనుట...వ్యస్తాక్షరిలేదు... ఒకవేళ వివాదసభలు జరుగునేని...అష్టావధానము ప్రధానముగా ముందు పరీక్షింపవలసినది. అందు వ్యస్తాక్షరిముఖ్యతమము. వారి ఆశుధార గొప్పదేకాని...వేలకొలది పర్యాయములు తిరుగుచున్న మామూలు చక్రమే గాని క్రొత్తరీతిని దిరుగదు. ఈ యూరనిచ్చిన కథ వారు చెప్పనేలేదు ఇతరం వారిబాటను కొట్టిపోసిరి. వారి బాట తప్పించి (సంభవించెనేని) ఆశుక

ఉ. వచ్చెడి పండితుం డెవఁడు ? వచ్చినవచ్చుత వచ్చి సత్సభన్
మెచ్చెడి పండితుం డెవఁడు ? మే మఖిలంబు నెఱింగినార మీ
పిచ్చికవిత్వ మూఁతగొని పీఁకెదరంట దడాల్న మీస! మీ
సచ్చరితుల్, ప్రధానుడులు సైఁచెదరంట ! స్వపక్షు లంబికా!

చ. ఎఱుఁగని యప్డు "వీరు కవులే" యని యొప్పినతప్పు సైఁపు మి
ట్లెఱిఁగితి మాస్యముం దెఱచు టే తప పంతయు స్పష్టమయ్యె, నీ
శ్వాగుఁ డొకసాక్షి వీర్న్డువు పద్దెములం దప్పు డెన్ని వీరు గూ
ర్తురొ, మును పల్లి యెన్నియట మార్తురొ యంబిక! నీవెఱుంగవే.

ఉ. పత్రికవారి ఘోషయును బామరతన్ మొగమోడి మెచ్చు మా
మిత్రుల ఘోషయున్, దెలిసి మేలు ఘటింపఁగ నెంచి మెచ్చు మా
ధాతృనిఘోషయున్ గని ప్రశంస యొనర్చుచు నాఁడు యోగ్యతా
పత్రిక నంపు తప్పిదము పండితమండలి సైఁపఁగాఁ దగున్.

ఆ. వె. శక్తిలేక పూను 'సర్టిఫికట్టు' లా
యువు లపమ్మ లేకయును దమంతఁ
బెండ్లివేళ నిచ్చు పెద్దలదీవనల్
పొందినార మనుచుఁ బొంగిపడుట!

క. అవసర మైన కతమ్మున, వివరించితి మంబ ! ఘోషవిత మెల్లను నీ
సవిధమున నెఱిఁగి యనృతము, దవిలించితి మేని నీవ దండింపఁదగున్.

శా. ఖడింపంగలశక్తి యున్నయెడఁ గాకవ్యగ్రిణీవ్యగ్రితా
ఖండాహంకృతివారకం బయిన యీ కబ్బంబు నేరేనియున్

---

విత చెప్పింపపలెను మాలో శివరామశాస్త్రి కృతార్థతముఁడు. నాయానంద
మతనికిఁ దెల్పుఁడు మీరా వారితోఁ దులగా వాదింప నేనిచ్ఛగింపను. గెల్చిన
వచ్చెడు ప్రతిష్ఠయెంత ? ఇఁక నీవాదములేల ? మీరు వదలుటయే నాకోరిక.
శివరామశాస్త్రియు వలదు. వారెట్టి పాండితికలవారని;... నాటి వివాద స్వరూ
పము, బీజము, ఎట్టివి ? ఆయూర నిరువాగులను బ్రధాను లెవరు? యావదంశము
మీకు వ్యవధిలేకున్నను మనకుఁ బరమమిత్రులగు బ్రహ్మశ్రీ ... గారిచేనయిన
వ్రాయింపుడు...ఇంకను అచ్చులోనున్న రికార్డు ప్రూఫులయినను వెంటనే పంపు
దురుగాక. వే. ప్ర.

ఖండింతుగ్గద సోదరుల్ పృథగ వాక్యంబులతి వేఁగొట్టుకో
"నెంతుంగండి" గ నేమొ దూఱుదురు నాకే మంతిలోఁ బోయెడిన్?

గీ. వారుమాటిన కొలఁది నవారిగాఁగ
నాయశము లోకమునఁ బర్వు; నాకుఁ గీర్తి
కన్న నన్యలాభమ్ముల నెన్న పూనిక
లేదు; పరికృత శేషమ్మ నాలింపు జనని!

ఉ. అంతట నయ్యె వేమనవరమందవధానము నైరు నెంతయున్
జింతలచేఁ గ్రుశించి పరిశీలన చాలక సారెఁ దప్పుడుం
బుంతల వెంబడిం బడి పరిభూతనయుల్ కడు గోయ సాయమా
నాంతరులై మఱేదియు నుపాయము గానక కుందు వొందఁగన్.

సీ. తలుపోరగామూసి పలువెల్లమోముతో నొక్క 'శశ్శోటి' మాదిక్కు చూచు
తన యింటి యెదుటి కందలము రాఁ జేగవే యొక్క 'శశ్శోటి' తల్పాంచి వైచు
'పశ్యవాదంబు' 'స్వాస్థ్యము'ల్లో 'యయ్యె' నంచొక్క 'శశ్శోటి' నీడ్చుఁగనులఁ
'గాశిక' నటుపాముగఁ జెఁగా 'హు'మ్మంచునొక్క 'శశ్శోటి' పండ్లు కొఱుకు

గీ. కాశికనుజూచి "నూటార్లు" గ్రిక్క మనుచుఁ
గోర్టు కీడ్తునో యేమొ నాకొంపదీసి
యంచు నొక్క 'శశ్శోటి'లో నటమటించు
నరసగాటప్పరితోడ వేమ మరుగుతేటిని.

ఉ. "పాటిరి కృష్ణమాఁటి" యని వాగ్వ్యయము న్మరసు నాఁడుఁ జేయునా
కారణ మంతరంగము నగల్పఁగ వేమనరమ్మ వేమె నెటుల్
చేర భయమ్ముఁ గొందు మటు చేకుఱఁ జెన్నఁడుసేఁత చెన్న నా
కూరిచి వ్యగ్రులై చెడిరి కొప్పరపుంగవిపక్షు లత్తఱిన్.

చ. సకలము నీమనం బెఱుఁగు సర్వపిమల్ పలుమం దెఱుంగుదు
ర్నికరము దేల్చి పూర్వమె మునిహితమ్ముగ నుత్తరింపుచున్
బరికటితము బొనర్చిన పరిబంధన మెఱుంగుదు గాన దాఁక దరి
వ్యాకయుటఁ జూచికొం డనుమఁ బ్రాజ్ఞులకున్ పచియింతు మంబికా!

గీ. అంబ! యంతకు మును చేసినట్టి చెట్ట
సేఁత లోకతల వేమనరాతతాగరి

హోరసత్సభాప్రత్యూహములవరింపఁ
బడ్డపాటు లింకొకతల పాపశమని!

ఉ. తప్పడు తోఁత్రవలన్నియును దజ్జులు దగ్ధము సేయ నంతతోఁ
గొప్పర మూరకుండక ప్రకోపము చెంది * "రిజస్ట్రరుత్తరం"
బప్పడు పంపెఁ 'గే' సాకటి యావలఁ దెత్తు నటంచు; సత్యముల్
దప్పి చరించువారలకు ధర్మముతోఁ బని యేమి శాంకరీ!

---

| | |
|---|---|
| * ఆశుకవి చక్రవర్తి, శతావధాని, కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ, కొప్పరము సంతమాగులూరుపోస్టు. గుంటూరుజిల్లా యొద్దినుండి | (రిజిస్ట్రరుత్తరపు నకలు) బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటకవులకు కాకినాడ, & బందరు. |

అయ్యా, మీరు ప్రకటించిన 'గుంటూరసీమ, పూర్వరంగము', అను పాత్రమును జూచితిని. అయ్యది 'సీ॥ మాయమాటలకు నమ్మకమైన వ్యాఖ్యాతతులలేని పచ్చిబూతులకు బంగ, అను మీ శ్రీపదానందము నందలి ముదుసలి బోగముదాని పద్దెమున కుదాహరణముగ నున్నదని చెప్పవలసివచ్చినందులకు జాలిపడుచున్నాఁడను. 'సత్యంవద, ధర్మంచర' అను వేదవాక్యములకు విరుద్ధముగా నసంబద్ధములైన యనృతవాక్యములతో మమ్మును, మమ్ములనుబట్టి మాని యోగిశాఖను, ఈవిధముగ నిచ్చవచ్చిన ట్లెల్ల నిందించుటకై మీకాలమును, మీపాండిత్యమును వినియోగించి, ఇట్టి నికృష్టోద్యోగమునకు మీమిత్రులఁగూడ నియోగించి వారిచేఁగూడ, అసత్యప్రకటనములం జేయించి, యకారణముగ మాహృదయమున కాయాసముం గలిగించితిరి.

2. ఏడనో యున్నవా రున్నట్లుండక మదీయాశుకవిత్వావధానములను బద్యములతోఁ బ్రశంసించుచు ముందుగ మాకు లేఖవ్రాసి మాస్నేహమును సంపాదించుకొని పిదప మాప్రతిభయు, మాకీర్తియు, మారాబడియుఁ జూచి సహింపలేక వృథాభిమానులగు మీశాఖవారి దుర్బోధములకుఁగూడ లోనై యనవసరముగ నావనచర్చ యొకటి గల్పించి యస్మత్కృతోపకృతి నేని స్మరింపక, కవిత్వమునకుఁ గాలుదువ్వి మేము ప్రతిజ్ఞాపద్యములను వ్రాయవలసిన యవసరము గల్పించి చివరకు సభకు రాక సాకులు పన్ని తప్పించుకొని బందరు కాకినాడలకు వేంచేసితిరి.

❧. ఇట్టి వృథాప్రజల్పకులు నిట్టిపదావదసార్వభౌములై
నట్టి రపత్రిపాధికరణాన్యహృదంతరులైన కాపురుం

---

3. అప్పటినుండియు విరామము లేని మాయవ్రాఁతలకుఁ బూనుకొని మాఱుపేరులతో మాయాలేఖలం గొన్నిటిని బ్రకటించి స్వజనముచేఁగూడ నట్టివే కొన్నిటిని బ్రకటింపించి యంతతోఁగూడఁ దృప్తిలేక "హితోపదేశము" అను పేరునఁ గొన్ని యనుచితములు వ్రాసి ప్రచురించితిరి. అప్పుడే మేము మీ మీఁద గొంతచర్య జరిగింపవలసియున్నను, ఎన్నటికేని మీతప్పులను మీరు తెలిసికొని పశ్చాత్తాపమును బొంది క్షమార్పణమును బ్రకటింతు రను సదుద్దేశముతో గొంత హితమును గఱపనెంచి 'జ్ఞానోపదేశము' అను పేరునఁ గొన్ని పద్యములు వ్రాసితిమి కాని మా 'జ్ఞానోపదేశము' మీకడఁ జెవిటివానిముందు శంఖ మూదినట్లయిపోయినది.

4. తరువాత మీరు ప్రకృతవ్యవహారమునకుఁ గారణభూతమైనట్టియు నసత్యముల ప్రోవైనట్టియు, "గుంటూరిసీమ, పూర్వరంగము"ను, వ్రాసి ప్రకటించితిరి. అందు మొదటినుండి చివరవఱకును మీరు వ్రాసిన యసత్యాంశములను వ్రాయించుకొన్న యసత్యపులేఖలను, నారాయణాస్త్రమూలకముగా ఖండించి లోకమున సత్యమును స్థాపించుటకై మేము ధర్మదేవతచేఁ బ్రోత్సాహపఱుపఁబడుటచే మిక్కిలి దారుణమైన యీక్రిందివిషయమును గూర్చి మాత్ర మిప్పుడు తెలియజేయుచుంటిమి.

5. మాకప్రతిష్ఠను గలిగింపవలెనను దురుద్దేశముతో "గుంటూరిసీమ, పూర్వరంగము 67 వ పుటలో" కొప్పరపువారి తప్పువ్రాతలు" అను శీర్షిక క్రింద నొక కల్పిత (ఫోర్జరీ) లేఖను బ్రకటించి, అట్టిదానిని మేమెవ్వరికో వ్రాసినట్లును, దానిప్రతి మీకు లభింపఁగా, దానింబట్టి దీనిఁ బ్రకటించినట్లును, నొక యసందర్భపుఁగథఁ గల్పించి యుదాహరించితిరి. ఈ మీ మాయవ్రాఁత మాకప్రతిష్ఠను గలిగించునది మాత్రమే కాక, మాగౌరవమునకుఁగూడ భంగము గలిగించునదిగా నున్నది. అందులకై తగుచర్య జరిగించుట మాకుఁ గర్తవ్యము. కావున మీకీ లేఖయందినది మొదలు 24 గంటలలోపల నాలేఖను మేమెవరికి వ్రాసినట్లు తెలుపనెంచితిరో, ప్రతియెవ్వరివలన లభించినట్లు తెలుపనూహించితిరో, వారి పేరుల నెఱింగించుచు, అట్టి మాయలేఖను మీ రేయధికారముమీఁదఁ బ్రకటిం-

దిట్టల మాకు వాదులుగఁ దెచ్చిన తావక తారతమ్యాసం
ఘట్టన మేము మెత్తుము జగాన వచింపఁగదమ్మ శాంకరీ!

---

చితిరో లిఖితపూర్వకముగా మాకుఁ దెలియఁజేయఁగోరుచున్నాఁడను. "అంత కింతైనది, ఇంకెంతయగునో" అను సామెతకుఁ దార్కాణముగా మీ వ్యవహారము పరిణమించుటంజేసి ముందుముందేమి సృష్టింతురో యను భయముకూడ మమ్ముఁ జాలఁగా బాధించుచున్నందున నిట్టి చర్యలోనికి దిగవలసివచ్చినందులకై విచారించుచున్నాఁడను.

పరా:— ఈవిషయము మీరిదివఱకుఁ దేల్చుకొనినదియే యగుట, మరల నాలోచింపవలసిన యవసరముండదు. లేనిపోని యుక్తులతోఁ గాలము గడపక సముత్తరము త్వరగ నొసంగుఁడు.

వ్రాసినది, ఆశుకవి చక్రవర్తి, శతావధాని కొప్పరపు వెంకటరమణకవి, తుదుపులు 4, నాలుగు, పంక్తులు 55 ఏఁబదియైదు (మక్కికిమక్కి నకలు).

ఇట్లు
కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ
శతావధాని.

☞ చదువరులారా:—

పై రిజస్టరుత్తర మెందుకుఁ బుట్టినది? ఎందుకేమిటి? సోదరులు చేయనిపని చేసినట్లు మీరు ప్రకటించినందుకుఁ బుట్టినదందురా? అటులేని వారి స్వహస్త లిఖితములను నీక్రింది యక్కరములను గిలకింపుఁడు.

శ్రీరాములు.

4-4-13. కొప్పరము సంతమాగులూరు పోస్టు.

అస్మద్గురుమూర్తులైన బ్రహ్మశ్రీ రామడుగు రామకృష్ణశాస్త్రివారి పాదపద్మముల సన్నిధికి.

భవత్ప్రియశిష్యుఁడు. నమస్కారపూర్వకముగా వ్రాయు విజ్ఞప్తి.

"...వృథాహంకార లాంఛనంబగు వేంకటశాస్త్రిగారి మీసమును దీయింతుమని ప్రతిజ్ఞ సేయునప్పుడును, "సింహమున్నదని తెలిసియుఁ గొప్పరపుఁ గవులు కాకినాడకు వచ్చెదరా!" అనిన తిరుపతిశాస్త్రిగారు నివసించిన కాకినాడకుఁ జనునప్పుడును, కాకినాడలోఁ బలుసభ లొనర్చి, సామర్థ్యమున్న యెడల మాకు శత్రుఁడగువాఁడు వచ్చి మమ్మెదిరించి జయింపవలసినదని ప్రతిజ్ఞా

ఉ. దానికిఁ దగ్గ * యుత్తరము తథ్యవచోభరితం బొకండు మే
మా సరులన్ గుఱించి వెస నంపితి మయ్యది గాంచియున్ వృథా

---

పద్యములం జెప్పినప్పుడును, ఎంతకఠినముగాఁ గాలుద్రవ్విసను నెదుటికివచ్చి శతృవులు మార్కొనమిచేఁ గాకినాడలో సుకవిపండితశిఖామణులు సంతసించి స్తుతింప జయస్తంభము నాటి వచ్చినప్పుడును,......" చిత్తగింపుడు.

ఇట్లు భవత్ప్రియశిష్యుఁడు,

కొప్పరపు వేంకటసుబ్బరాయశర్మ, శతావధాని.

☞ దీనివలనఁ గాకినాఁడలో — తి॥ వెం॥ కవులఁ బరాభవించినట్లు సోదరులు ప్రకటించుకొనుచున్నట్లు విస్పష్టమే యగునేని దానినే విపులముగా దెల్పి వీర వేరొక లేఖయొక్క నకలును బ్రచురించిన మాకు సోదరులు రిజస్టరుత్తరము వ్రాయుట కర్థమేమో? విచారింపుఁడు, "ధర్మదేవత చేతఁగంటు! వీరఁట ప్రోత్సాహపఱుపఁబడిరఁట!" "నాత్మశ్లాఘం కీర్తయేత్" "బుద్ధిః కర్మానుసారిణీ" శాంతం పాపం, ప్రతిహతమమంగళం, అస్తుస్వస్తి. సర్వేజనా స్సుఖినో భవన్తు"

(మా రిజస్టరుజవాబుయొక్క నకలు.)

* శ్రీమత్పరదేవతాయైనమః

మహారాజశ్రీ కొప్పరపు వెంకట సుబ్బరాయ వెంకటరమణకవులకు.

అయ్యా!

29-7-13 సం॥ తేదీతో నొకటియు, తేదీలేకుండ వేఱొకటియు మీరు మా పేర వ్రాసిన రిజస్టరుత్తరములకు జవాబు వ్రాయునది యేమన.

(1) మీరిజస్టరుత్తరములోని సంగతులు యథార్థములైనవియు, నమ్మఁదగినవియుఁ గావు.

(2) మేము ప్రకటించిన 'గుంటూరిసీమ, పూర్వరంగము' లోని సంగతులు సర్వమును సత్యములైనవియే గాని యసత్యము లెవ్వియును లేవు.

(3) మా 'గుంటూరిసీమ' పూర్వరంగము, అను చరిత్ర గ్రంథములోని సంగతులు మీకప్రతిష్ఠ కలిగింపవలెనను దురుద్దేశముతోఁ బ్రకటింపఁ బడినవికావు. అవి లోకమునకు సత్యము వెల్లడిచేయు సదుద్దేశముతోనే ప్రకటింపఁబడినవి.

గానలవారు * తప్పనుడికల్పన తెల్లడఁ జేయఁ [illegible]
దేని యమార్గగాములకు దేవునివల్ల భయమ్ము గల్గునే!

---

(4) తక్కిన మీ రిజస్టరుత్తరములోని సంగతులు ప్రస్తుతము జవాబీఁదగినంత యవసరము కలవిగాఁదోఁపవు. 'మాగుంటూరిసీమ' పూర్వరంగము 87 వ పుట మొదలుకొని "కొప్పరపువారి తప్పువ్రాఁతలు" అను శీర్షిక క్రిందఁ బ్రచురించిన లేఖ "ఫోర్జరీ" కాదు. మీరొక గృహస్థునకు వ్రాసిన లేఖయొక్క నకలును బట్టియే "మక్కికి మక్కి" గాఁ బ్రకటింపఁబడినది.

(5) "మాకీర్తికి భంగమ్మును, మా గౌరవమునకు హానియు, మా రాబడికి లోపమ్మును, మా ప్రతిష్ఠకు న్యూనతయుఁ గలుగఁజేయవలెనను దురుద్దేశముతో నసత్యములును జుగుప్సాకరములును నగు సంగతులు గద్యపద్యోభయ రూపంబులుగాఁ బెద్దమనుష్యుల యెదుట వినిపించినందులకును సంపన్న గృహస్థుల పేర నట్టివంటి సంగతులనే పదిమందికిని వినిపింపుఁడ"నికూడ వ్రాయుచు మీరు వ్రాయు వ్రాఁతలకును మీమీఁదఁ గ్రిమినలైన చర్య జరుపుటకు ముందాలోచించియు దానిని జరిత్ర గ్రంథమగు 'మాగుంటూరిసీమ' లోఁ బ్రకటించి యా సత్యమును లోకులకుఁ దెల్లముగా వినిపించిన పిదపనే చర్య జరుపవలెనని యెంచి ముందుపని ముగించి ప్రస్తుతము మేమా ప్రయత్నములోనే యుండఁగా, మీ రిజస్టరుత్తరము వచ్చినందున దానికి జవాబుగా నీయుత్తరము వ్రాయుచు సదరువిషయమై క్రమమైన చర్య జరుపఁబోవుచున్నామని కూడ నిందుమూలముగానే తెలియఁజేయుచున్నారము.

చిత్తగించవలెను.

(సమ్మతిని) (1) దివాకర్ల తిరుపతిశాస్త్రి, (2) చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రి, } శతావధానులు } బందరు, భైరవపల్లిస్సు.
15-9-13.

---

* ది 27-10-13 సం॥ ......

అయ్యా!

సోదరకవులు కొద్దికాలము క్రిందట మీకు వక రిజస్టరునోటీసును 24 గంటలలో జవాబు యివ్వవలసినదిగాను అట్లా యివ్వనియెడల మీమీద డామేజి తేవడమగునని సదరు నోటీసులో వుదహరించినట్టున్ను అందులకు మీరు సోదర కవులను క్షమాపణ కోరినట్టున్ను మాచుట్టుప్రక్కల గ్రామాదులలో విశేష

మంగళశ్లోకః

శ్లో॥ కళ్యాణం రసనే నమ స్సుకవితే భద్రం పదేభ్యో నమ
స్కారః కావ్యనికేతనాయ మనసే స్వస్త్యానివో వందనం
అస్తు స్వస్తి శతావధానవిధయే విద్వజ్జనాయాంజలి
ర్వ్యక్తాయుక్త వివేకినే సుకవితాసారస్య సంగ్రాహిణే. తి॥ శా॥

---

వాడుక గలుగజేసినారు. అయినప్పటికి యిదివరలో నేను మిమ్ములను యెరిగి వుండి మీసామర్థ్యతను గుర్తెరిగి యుండుటచే అంసుల నిజానిజములు ప్రత్యేకం మీచేత వినగోరి వ్రాసినాను తక్షణం జవాబు వ్రాయించకోర్తాను

దివ్యచిత్తమునకు తేవలెను
విధేయుడు,
పమిడిమర్తి లక్ష్మీకాంతం వ్రాలు.

గద్య

ఇది శ్రీ కింకవీందర్ఘటాపంచానన, విద్వత్కవి, బాలకలానిధి, బాలసరస్వతీ
శతావధాని, తిరుపతి వేంకటేశ్వరసంకలితంబును
అనృతపర్వతదంభోళిసమ్మితంబును నగు
గుంటూరిసీమ, ఉత్తరరంగము
సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 16 | 23 | నంత | సంత |
| 30 | 17 | గర్వాం | గఠ్వాం |
| 55 | 11 | పంచి | పెంచి |
| 85 | 13 | బెల్ల | బెల్లం |

గుం. ఈ.